# ఐవాన్‌హో

జగద్విఖ్యాత ఆంగ్ల నవలాకారుడు
సర్ వాల్టర్ స్కాట్ రచన



అనువాదం:

కమలాకర వేంకటరావు

# ★ ప్రవేశిక ★

ఆంగ్ల వాఙ్మయ చరిత్రలో, నవలారచనకు తొలిదొల్తగా అంకురార్పణ చేసినవాడు సర్ వాల్టర్ స్కాట్ అని చెప్పవచ్చు. ఇతని జననం 1771. మరణం 1832. ప్రారంభదశలో చక్కని పద్యకావ్యాలు రచించి కీర్తి గడించి, పిమ్మట నవలా రచన కుపక్రమించాడు. 'వేవర్లీ' అనే పెట్టి మొదటి నవలను ముందు పేరులేకుండ ప్రకటించాడు. పెక్కు సంవత్సరాల వరకూ, ఈ నవలా రచయిత యెవ్వరా అని, ఆంగ్ల పత్రికాలోకం ఉత్కంఠత చెందుతూ ఉండేది. ఎవరో ఒక గొప్ప రచయిత వాఙ్మయప్రపంచంలోకి క్రొత్తగా అవతరించాడని చెప్పుకొనసాగారు.

ఈ తొలివిజయంతో ఉత్సాహితుడై, స్కాట్ తరువాత పెక్కు నవలలను తన పేరుతోనే ప్రకటించాడు. ఇరవై నాలుగు సంపుటాలుగా వెలువడ్డ ఈ నవలలు, 'వేవర్లీ సీరీస్' అనే పేరుతో ప్రసిద్ధిచెందాయి. అన్నీ జనాదరణ పొందినవే గాని, వాటిలోకెల్ల ముఖ్యంగా చెప్పుకోదగినది ఈ 'ఐవాన్‌హో'. క్రీస్తుశకం 12 వ శతాబ్ది చివరిభాగంలో ఆంగ్లదేశమునకు ప్రభువై 'సింహపరాక్రము' డని ప్రఖ్యాతిగాంచిన ఒకటవ రిచర్డు (Richard the Lion-Heart) కాలంలో జరిగినట్లు వర్ణితమైన వీరగాథ యిది. దీనిని చక్కగా అవగాహన చేసుకొని ఆనందించాలంటే, ఆనాటి ఆంగ్లదేశ చరిత్రనూ, అప్పటి ప్రజల సమస్యలనూ, వారి ఆచార వ్యవహారాలలోనూ ఇంచుక పరిచయం చేసుకోడం అవసరం.

ఆంగ్లదేశమంటే, ఐరోపాఖండానికి వాయవ్య దిశయందున్న ఒక చిన్న లంక యని పాఠకులకు తెలిసినదే. సన్నని సముద్రశాఖలు దీనిని ఐరోపా ఖండంనుండి విడదీస్తున్నాయి. బ్రిటను అనీ, ఇంగ్లండు అనీ, ఈ లంకకు రెండు పేర్లు. 'బ్రిటను' అనే పేరు 'బ్రిటనులు' అనే జాతివారినిబట్టి వచ్చింది. వీరా లంకలో ఆదినుంచీ ఉన్నవారు. క్రీ. శ. 5 వ శతాబ్దిలో, ఐరోపాఖండంలోని డెన్మార్కు, జర్మనీ ప్రాంతాలనుంచి జూట్సు, ఆంగిల్సు, సాక్సన్సు అనే జాతులవారు ఈ లంకకు వలసవచ్చి, బ్రిటనులను పశ్చిమ ప్రాంతానికి తరిమి, తూర్పు దక్షిణ భాగాలను తాము ఆక్రమించుకున్నారు. ఈ మువ్వురిలో, 'జూట్సు' కు అంత ప్రాధాన్యంలేదు. 'ఆంగిల్సు', 'సాక్సన్సు' వీరే ముఖ్యులు. వీరినిబట్టే మొత్తం మువ్వురికీ తరువాత ఆంగ్లోసాక్సనులనీ, సాక్సనులనీ వ్యవహారం వచ్చింది. 'ఆంగిల్సు' శబ్దంలోంచే 'ఆంగ్ల' శబ్దం పుట్టి, అదే 'ఇంగ్లీషు' గా

మారగా, వీరినే తరువాత 'ఇంగ్లీషు' వారని కూడ అన్నారు. 'ఇంగ్లీషు' వారిని బట్టే బ్రిటనుకు 'ఇంగ్లాండు' అనే శాశ్వతపేరనామం కలిగింది. వీరు మాట్లాడే భాషనే సాగ్జన్, ఆంగ్లోసాగ్జన్, ఇంగ్లీషు, అనే పేరులతో పిలిచారు.

ఆంగ్లోసాగ్జనులు బ్రిటనుకు వలస రాకపూర్వం అచట నివసిస్తూ ఉండిన బ్రిటనులు ఒక నాల్గువందల యేండ్లకాలం రోమను చక్రవర్తుల పరిపాలనలో ఉన్నారు. 4వ శతాబ్దియందు కాన్‌స్టన్‌టైన్ చక్రవర్తి హయాములో క్రైస్తవమతం రోమను సామ్రాజ్యానికంతకీ అధికారిక మతంగా ప్రకటించబడినప్పుడు, బ్రిటనులు కూడా క్రైస్తవమతం స్వీకరించారు. కాని, ఆ తర్వాత ఎంతోకాలం రోమనులు బ్రిటనుపై ఆధిపత్యం వహించలేదు. కొన్ని సామ్రాజ్యపు చిక్కులవల్ల, 5వ శతాబ్ది ప్రారంభంలో తమంతటతామే బ్రిటను వదలివెళ్ళిపోయారు. తర్వాత ఆ శతాబ్దిలోనే ఆంగ్లోసాగ్జనులు బ్రిటనుకు వలసవచ్చి, బ్రిటనులను పశ్చిమానికి తరిమి, తూర్పు దక్షిణ భాగాలను తామూ ఆక్రమించడం జరిగింది.

బ్రిటనుకు వలస వచ్చేనాటికి ఆంగ్లోసాగ్జనులు క్రైస్తవులుకారు. క్రైస్తవమతం వారియందు 7వ శతాబ్దిలో వ్యాపించింది. అంతవరకూ వాళ్ళేవో ఇతర దేవతలను ఆరాధిస్తూ ఉండేవారు. జాతి అంతా ఒకేరాజు పరిపాలనక్రింద ఉండేదికాదు. ఒక్కొక్క నాయకుని ఆశ్రయించి, జాతిలో పెక్కు తెగలుండేవి. ప్రతి తెగకూ కొన్ని కట్టుబాటులుండేవి. వీరు వలస వచ్చేనాటికి బ్రిటను విశేషంగా అరణ్యమయం. రోమను చక్రవర్తుల పరిపాలన కాలంలో దక్షిణప్రాంతంలో మాత్రం కొన్ని పట్టణాలు నిర్మించబడ్డాయి. చక్కని రోడ్లు వేయబడ్డాయి. రోమన్ల నిష్క్రమణానంతరం ఆ అభివృద్ధి అంతటితో నిలిచిపోయింది. ఆంగ్లోసాగ్జనులు బ్రిటను ఆక్రమించిన సందర్భంలో అరణ్యాలను మధ్యమధ్య ఛేదించి అచట నివాసాలేర్పరచుకొన్నారు. ఒక్కొక్క తెగవాళ్ళు ఒక్కొక్క పెత్తనదారు నాశ్రయించి ఒక్కొక్కగుంపు ఒక్కొక్క చిన్నగ్రామం వంటిదాన్ని నిర్మించుకొంది. శత్రుభయం అమితంగా ఉండే రోజులు గనుక, ఎవరి రక్షణ విషయం వారే జాగ్రత్తపడేవారు. ఇండ్లు దగ్గర దగ్గరగా కట్టుకొని, చుట్టూ ఎత్తుగా మట్టితో కట్టవేసుకొని కంచె వేసేవారు — కట్టచుట్టూ లోతైన అగడ్త ఉండేది. అంటే, ప్రతి గ్రామాన్నీ దాదాపు ఒక చిన్న కోటగా తయారుచేసుకొనేవాళ్ళన్నమాట. [illegible] అవతల పొలాలుండేవి. గ్రామస్థులు వీటిని [illegible] సాగుచేసుకునేవారు. పొలాల అవతల పచ్చిక బీళ్ళుండేవి. గ్రామస్థులు తమ పశువుల నిక్కడ యథేచ్ఛగా మేపుకొనేవారు. ఇది ఒకవిధంగా గ్రామానికి సరిహద్దు. వీని అవతల అటవీ ప్రదేశం. గ్రామస్థులీ సరిహద్దును అతిజాగ్రత్తతో కాపాడుకునేవారు. [illegible]

పరాయివారెవ్వరైనా కానవచ్చినట్టైతే, శంఖధ్వని చేసి గ్రామస్థులకు తెలియ జేయాలి. అలా తెలియజేయకపోతే ప్రవేశించినవారిని శత్రువుగా భావించి చంపివేయవచ్చు.

గ్రామంలో స్వతంత్రులైన గృహస్థులూ ఉండేవారు. అస్వతంత్రులైన బానిసలూ ఉండేవారు. యుద్ధంలో పట్టుబడిన వారినిగాని, లేక ఏదైనా నేరం చేసి స్వతంత్రతను కోల్పోయినవారిని గాని, ఇలా బానిసలుగా ఉంచుతూ ఉండే వారు. గ్రామ వ్యవహారాలను గ్రామపెద్ద ఊరిలోని స్వతంత్రులతో సంప్ర దించి నిర్వహిస్తూ ఉండేవాడు. ఇదే గ్రామసభ. ఇలాంటి కొన్ని గ్రామా లకు కలిపి మరొక సభ ఉండేది. ఇచ్చట ముఖ్యంగా గ్రామాలమధ్య తగాయి దాలు తీర్చబడుతూ ఉండేవి. వ్యక్తులు చేసిన నేరాలను గూడ విచారించి శిక్షలు విధిస్తూ ఉండేవారు. ఈ సభ నెలకొక్కసారి సమావేశమయ్యేది. దీని పైన, తెగకంతకూ సంబంధించిన సభ రెండేండ్లకొకసారి జరుగుతూ ఉండేది. దీనికి వివిధ గ్రామాలనుండి స్వతంత్రులెల్లరూ హాజరయ్యేవారు. పరాయి తెగ లతో సంధివిగ్రహాలుగాని, క్రిందిసభలనుంచి వచ్చిన అప్పీళ్లుగాని యిచ్చట పరిష్కారమౌతూ ఉండేవి.

బ్రిటనుకు వలసవచ్చిన తర్వాత ఇంచుమించు రెండు వందల యేండ్లకు గాని ఆంగ్లో సాక్సన్ జాతి అంతా ఒకే రాజు పరిపాలన క్రిందికి రాలేదు. అంత వరకూ బ్రిటను ఏడు ఆంగ్లోసాక్సన్ మండలాలక్రింద విభక్తమై, ఆ యా మండ లాధిపతులచే పాలించబడుతూ ఉండేది. ఈ మండలాధిపతుల మధ్య నిరంత రం యుద్ధాలు జరుగుతూ ఉండేవి. క్రైస్తవమతం ఆంగ్లోసాక్సన్లలో ఈ మధ్య కాలంలోనే వ్యాప్తిచెందింది. రోం నగరంలోని క్రైస్తవ జగద్గురుపీఠాధిపతి యైన పోప్ ఆ కాలంలో క్రైస్తవమత వ్యాప్తికై దేశదేశాలకూ క్రైస్తవ సన్యాసులను పంపిస్తూ ఉండేవాడు. ఆ రీతిగా ఆంగ్లోసాక్సన్లలో క్రైస్తవ మతం వ్యాపింపజెయ్యడానికై మొట్టమొదటగా బ్రిటనులో దిగిన వాడు అగస్టిన్ అనే సన్యాసి. ఏడు ఆంగ్లోసాక్సన్ మండలాలూ క్రైస్తవమతం స్వీకరిం చడానికి సుమారొక శతాబ్దికాలం పట్టితే, ఈ ఏడు మండలాలూ ఒక్క రాజు క్రింద ఏకం కావడానికి మరొక శతాబ్దిపైగా పట్టింది. అనగా, క్రీ. శ. 8 వ శతాబ్దినాటికిగాని ఇంగ్లాండులోని ఆంగ్లోసాక్సన్ మండలాలన్నీ ఒక్క రాజు ఏలుబడిక్రింద ఏకం కాలేదు. అలా ఏకమైన పిమ్మట ఇంగ్లాండు నేలిన ఆంగ్లోసాక్సన్ రాజులలో, 'ఆల్‌ఫ్రెడ్ ది గ్రేట్', 'ఎడ్వర్డ్ ది కన్ఫెసర్' అనే వారు సుప్రసిద్ధులు.

ఇంగ్లాండు ఈ ఘట్టంలో పెక్కు షైర్లుగా, జిల్లాలుగా విభజించబడింది. ఇదివరకటి గ్రామసభలు మొదలైనవాటికి తోడు, ఈ జిల్లాసభలు క్రొత్తగా

అమలులోకి వచ్చాయి. జిల్లాలోని స్వతంత్రు లెల్లరూ ఈ సభలకు హాజరయ్యేవారు. చర్చి తరఫున ఆ జిల్లా బిషప్పూ, రాజు తరఫున షెరీఫ్ అనే ఉద్యోగీ హాజరయ్యేవారు. ఇచట నేరాల విచారణ జరుగుతూ ఉండేది. హత్యవంటి నేరాలకు జరిమానాలు విధించడం ఆ రోజుల్లో పరిపాటిగా ఉండేది. రాజును చంపిన నేరానికి 7,200 షిల్లింగులు జరిమానా. 'ఎల్డర్మన్' అని పిలువబడే పెద్ద భూస్వామి హత్యకు 2400 షిల్లింగులు. 'థేన్' అనబడే చిన్న భూస్వాములలో రాజపరివారానికి చెందినవాని హత్యకు 1,200 షిల్లింగులు, ఇతరులకు 600 షిల్లింగులు. ఇక సామాన్య ప్రజలలోకి వస్తే, గ్రామంలోని స్వతంత్రవ్యక్తి హత్యకు 200 షిల్లింగులు జరిమానా. బానిసకు సంఘంలో ఎట్టి ప్రతిపత్తీ లేదుగనుక, బాని హత్యకు ఎట్టి జరిమానా లేదు. కాని, హంతకుడు యజమానికి వేరొక బానిసను తెచ్చి యివ్వాలి. అయితే, రాజద్రోహం, ఇండ్లు తగులబెట్టడం, ఇండ్లు దోచడం, పెద్దలైన నేరాలకు మాత్రం మరణశిక్ష విధించబడుతూ ఉండేది. ఇలా ఇటు మరణశిక్ష విధించడానికి వీలులేక, అటు జరిమానా మాత్రం వేసి ఊరుకోడానికి వీలులేని నేరాలు చేసినవారిని సంఘంనుండి వెళ్లగొట్టివేసేవారు. ఈ సంఘ బాహ్యులకు సంఘం ఎట్టి రక్షణా ఇవ్వదు. ఎవరైనా వీరిని చంపితే అది నేరం క్రిందకు రాదు. అడవిలో తోడేళ్లు వంటి మృగాల క్రింద వీరిని పరిగణించేవారు. తోడేళ్లను వేటాడి చంపినట్లే వీళ్లనూ చంపవచ్చు. అందుచే ఇట్టి బహిష్కృతులు అడవులలో దాక్కొని జీవిస్తూ ఉండేవారు.

ఇంగ్లాండంతా ఒక్క రాజు పరిపాలన క్రిందికి వచ్చిన తర్వాత, ఈ జిల్లా సభలుగాక, మొత్తం దేశానికంతకీ మరొక సభ అవసరమయింది. దీనికి క్రింది సభలవలె స్వతంత్రులెల్లరూ హాజరుకావడం సాధ్యపడదు గనుక, ప్రతినిధులను పంపే ఆచారం అమలులోకి వచ్చింది. సామాన్యంగా సంవత్సరానికి రెండుసార్లు ఇది సమావేశమౌతూ ఉండేది. దీనిని 'విటన్' లేక 'విజ్ఞులసభ' అని పిలిచేవారు. సంధి విగ్రహాలు ఆలోచించడం, ఇతర శాసనాలు చెయ్యడంతోపాటు, రాజును ఎన్నుకునే హక్కును కూడా ఈ విటన్ చలాయిస్తూ ఉండేది. రాజు చనిపోయినప్పుడు, కొడుకు అవివేకీ అసమర్థుడూ అయితే, సమర్థుడైన వాని నింకొకరిని రాజుగా ఎన్నుకుంటూ ఉండేది.

ఇట్టి ఆచార వ్యవహారాలుగల ఆంగ్లోసాక్సనులమీదికి, 11 వ శతాబ్ది మధ్యభాగంలో మరొక జాతి దండెత్తి రావడం జరిగింది. వీరు ఫ్రాంసు ఉత్తర భాగాన నార్మండీ అనే మండలంలో నివసించే నార్మనులు. ఆదిలో వీరు, ఏ ఐరోపా ప్రాంతంనుండి ఆంగ్లోసాక్సన్లు బ్రిటనుకు వలసవెళ్ళారో ఆ ప్రాంతం నుండే ఫ్రాంసుకు వలసవచ్చినవారే. ఫ్రాంసుదేశపు రాజు వీరికి తన అధిరాజ్యం

క్రింద ఒక మండలాన్ని ఇవ్వగా అదే నార్మండీ అయింది. కనుక వీరొక విధంగా ఆంగ్లోసాక్సనుజాతికి సన్నిహితులే కాని కేవలం ఫ్రెంచి జాతీయులు కారు. కాని, నార్మండీ నివాసంవల్ల ఫ్రెంచి నాగరికతా ప్రభావం వీరిపై ప్రసరించింది. ఫ్రెంచిభాష వలవరచుకున్నారు. ఈ నార్మండీ మండలాధిపతి విలియం 1066 లో ఇంగ్లాండుపై దండెత్తి, హేస్టింగ్సు అనే చోట జరిగిన యుద్ధంలో, హారాల్డు అనే ఆంగ్లోసాక్సన్ రాజును చంపి ఇంగ్లాండు నాక్రమించుకున్నాడు. బలవంతుడైన విలియంను ఆంగ్లోసాక్సన్లు రాజుగా అంగీకరించక తప్పిందికాదు.

ఆంగ్లదేశ చరిత్రలో ఈ హేస్టింగ్సు యుద్ధం ఒక ముఖ్యఘట్టం. దీని ఫలితంగా ఆ దేశానికి నార్మన్లు పాలకులూ, ఆంగ్లోసాక్సనులు పాలితులూ అయ్యారు. నార్మన్లను పారద్రోలాలనే ఆంగ్లోసాక్సన్ల ప్రయత్నాలు సాగిరాలేదు. విలియం చాల నిర్దాక్షిణ్యంగా తిరుగుబాటుదారుల నందరినీ అణచివేసి తన ఆధిపత్యం సుస్థిరం చేసుకున్నాడు. తనకు ఎదురు తిరిగిన ఆంగ్లోసాక్సన్ల ఎస్టేటులను స్వాధీనంచేసుకొని, తన అనుయాయులైన నార్మన్ ప్రముఖులకు పంచిపెట్టాడు. దేశంలోని భూమిఅంతా రాజాదేనని ప్రకటించబడింది. ఎస్టేటులకు వెలుపల ఉండిన బీళ్ళూ అడవులూ మొదలైనవాటిని యథేచ్ఛగా వాడుకోడానికి సామాన్యప్రజ కిదివరలో వాక్కుండేది. రాజు అనుమతి లేనిదే ఇప్పుడెవ్వరూ వాటిలో అడుగు పెట్టకూడదు. పశువులను మేపుకో కూడదు. ఈ నిబంధనవలన, అంతకుముందు స్వేచ్ఛగా బ్రతికే పెక్కుమంది ప్రజలకు జీవనాధారంపోయి, ఏ ఎస్టేటుదారు వద్దనో దాసత్వం చేసుకొని బ్రతుకవలసిన దుస్థితి యేర్పడింది.

ఆనాడు విలియం ప్రవేశపెట్టిన ఎస్టేట్ల విధానాన్నే 'ఫ్యూడలిజం' అంటారు. తనకు సామంతుడైన ప్రతి ఎస్టేటుదారుకూ రాజు ఒక సనదు జారీ చేస్తాడు. దాని ప్రకారం అతడు, ఆ ఎస్టేటు ననుభవిస్తున్నందుకుగాను, రాజు కోరినప్పుడెల్ల, ఒక నిర్ణీత సంఖ్యగల సైన్యంతో రాజుకు యుద్ధంలో తోడ్పడ డానికి సిద్ధమై ఉండాలి. అంతేకాక, కొన్ని ప్రత్యేక సందర్భాల్లో నజరానాలు చెల్లించాలి. దాదాపు ఇలాంటి షరతులలోనే ఆ సామంతుడు, తన ఎస్టేటులోని భాగాలను తన క్రింది అనుయాయులకు పంచవచ్చు. 'నేను నీ వాడను' అని, రాజుముందు ఆ సామంతుడు ప్రమాణం చేసినట్లుగానే, ఆ సామంతుని ముందు ఈ చిన్న ఎస్టేటుదార్లు ప్రమాణాలు చేస్తారు. అయితే, విలియం ఇక్కడొక కట్టుదిట్టం చేశాడు. సామంతులక్రింది చిన్న ఎస్టేటుదార్లు కూడా అవసరమైతే ఆ సామంతుల నెదిర్చియైనా తనకు భక్తులుగ మెలగాలని విధించాడు. తన సామంతులు అతి బలవంతులై తనకు ముప్పు తెచ్చిపెట్టకుండా, విలియం ఇంకొక పద్ధతిని కూడా అనుసరించాడు. సామంతులకు ఎస్టేటును

ఒకే ఖండంగా ఇవ్వకుండా దేశం నాలుగుమూలలా చిన్న చిన్న ఖండాలుగ ఉండేటట్లు చీల్చియిచ్చాడు.

ఇదంతా రాజు అధికారాన్ని సుస్థిరం చేయడానికి తోడ్పడినమాట నిజమే కాని, ఈ సామంతులు ప్రజలపై చలాయించే నిరంకుశత్వాన్ని మాత్రం అరికట్టలేదు. నార్మన్ సామంతుల ఔద్ధత్యం చాల విపరీతంగా ఉండేది. నార్మన్లు ఆంగ్లో-సాక్సన్లను నీచంగా చూస్తూ ఉండేవారు. ఆంగ్లో-సాక్సన్లు నార్మన్లను ద్వేషిస్తూ ఉండేవారు. నార్మన్లు మాట్లాడేది నార్మను-ఫ్రెంచిభాష. ఆంగ్లో సాక్సన్లది ఇంగ్లీషు. క్రమేణా కొన్ని వందల సంవత్సరాలకుగాని ఈ ఉభయజాతులూ ఇచ్చిపుచ్చుకోడాలద్వారా ఏకమైపోలేదు. ఉభయులకూ తుదకు నార్మను-ఫ్రెంచి సంస్కారం పొందిన ఇంగ్లీషే మాతృభాష అయింది. ఈ కలయిక కలుగకపూర్వం పరస్పర విద్వేషాలింకా పెచ్చుపెరిగి యున్న సంధియుగంలో జరిగినట్లు వర్ణితమైన దీ 'ఐవాన్‌హో' కథ.

రాజు బలవంతుడుగా ఉన్నప్పుడు, నార్మన్ సామంతులు కొంచెం అణిగిమణిగి పడియుండేవారు. దుర్బలుడైన రాజు పాలించునప్పుడు, విశృంఖలంగా తమ యిచ్చవచ్చినట్లు ప్రవర్తిస్తూ ఉండేవారు. మొదటి రిచర్డు పరిపాలన కాలంలో అలాంటి అవకాశమే వారికి లభించింది. రిచర్డు దుర్బలుడు కాకపోయినా, సామాన్యంగా ఇంటిపట్టున ఉండేవాడు కాదు. కీర్తికాముడైన యోధాగ్రేసరుడు కావడంచేత, ఎంతసేపూ అతనికి ఒకటే కోరిక ఉండేది,— పాలస్తీనా మతయుద్ధాల్లో పాల్గొని తన శౌర్యసాహసాలు ప్రదర్శించాలని. ఏసుక్రీస్తు జన్మస్థానమైన పాలస్తీనా క్రైస్తవ లోకానికి పుణ్యక్షేత్రం. కాని, 11 వ శతాబ్దిలో ఆదేశం తురుష్కుల యధీనమైనప్పటినుంచీ, దేశదేశాల క్రైస్తవులు అచటికి యాత్ర చెయ్యడానికి తీవ్రమైన అవరోధం కలిగింది. తురుష్కులు యాత్రికులను దోపిడీచేసి చంపుతూ ఉండేవారు. క్రైస్తవ జగద్గురువు పోప్ అందుచే తురుష్కులపై యుద్ధం ప్రకటించాడు. ఐరోపాలోని వివిధదేశాలవారు ఈ యుద్ధంలో పాల్గొనడానికి సైన్యాలతో వెళ్లేవారు. 11-13 శతాబ్దులమధ్య ఈ మతయుద్ధాలు అనేకం జరిగాయి. 1095-99 మధ్య జరిగిన మొదటి మతయుద్ధం విజయవంతంగానే ముగిసింది. క్రైస్తవులు జెరూసలేం నగరంతోసహా కొన్ని ముఖ్యప్రదేశాలను తిరిగి ఆక్రమించుకొన్నారు. కాని, 1147 లో క్రైస్తవులు కొన్ని ప్రదేశాలను కోల్పోవడం జరిగింది. అందుపై రెండవ మతయుద్ధం ఫ్రెంచి అధినేత ఏడవ లూయీ ఆధ్వర్యాన జరిగిందిగాని అది ఏమాత్రమూ విజయవంతం గాలేదు. 1187 లో సాలాదీన్ అనే తురుష్కసుల్తాను జెరూసలేంను స్వాధీనపరచుకొన్నాడు. అంతట మూడవ మతయుద్ధం ప్రకటించబడింది. ఇదే అన్ని మతయుద్ధాల్లోకీ కీర్తిగాంచినది. సింహపరాక్రముడు ఒకటవ రిచర్డు పాల్గొన్నది దీనిలోనే. పాలస్తీనాలో రిచర్డు చేసిన

సాహసకృత్యాలు ఐరోపా అంతటా మారుమ్రోగిన వీర గాథలైనాయి. కాని, క్రైస్తవవర్గాలలోని అనైక్యంవల్ల పూర్ణవిజయం సిద్ధించలేదు. పుణ్యక్షేత్రాలు దర్శించుకోడానికి యాత్రికులకు సౌకర్యాలు కల్పించేలాగున సుల్తాన్ సాలాదీన్‌తో సంధిచేసుకోడం మాత్రం జరిగింది. తరువాత 13 వ శతాబ్దిలో అయిదు పర్యాయములు మతయుద్ధాలు ప్రకటించడం జరిగింది గాని, అవి అన్నీ కూడా విఫలప్రయత్నాలే అయినాయి.

పాలస్తీనా యుద్ధానంతరం రిచర్డు వెంటనే ఇంగ్లాండుకు తిరిగి రావడం పడలేదు. తనకు అహితుడూ, క్రూరుడూ, దుష్టుడూ అయిన ఆస్ట్రియారాజు చేతిలో ఖయిదీగా పట్టుపడ్డాడు. చాలా కాలం వరకూ అతని గతి యేమైనదీ లోకానికి సరిగా తెలియలేదు. అతన్ని తిరిగి కళ్లజూడగల్గుతామనే ధైర్యం ఇంగ్లీషు ప్రజకు సన్నగిలింది. ఇట్టి పరిస్థితిలో, రిచర్డు తమ్ముడు జాన్, తాను రాజు కావాలనే దురాశతో, రిచర్డుకు శత్రువైన ఫ్రెంచురాజు ఫిలిప్‌తో కుట్రచేసి, అతని ద్వారా, ఆస్ట్రియారాజు చేతిలోంచి రిచర్డు బయటపడకుండా ఉండేటట్లు పన్నాగాలూ పన్నుతూ, దేశంలోపల తనకు అనుకూలంగా పార్టీ కట్టుకోడం మొదలు పెట్టాడు. రిచర్డు అనంతరం రాజ్యానికి వారసు న్యాయతః జాన్ కాదు. జానుకు మరొక అన్నగారి కొడుకైన ఆర్థరుకు రావాలి రాజ్యం. కాని, దురాశాపరునికి న్యాయమేమిటి?

ఈ వారసత్వపు తగాయిదాలు అవకాశంగా తీసుకొని, నార్మన్ సామంతులు దేశంలో తమ అధికార ప్రాబల్యాలను పెంపొందించుకోడానికి విజృంభించారు. సైన్యాలను పెంచి తమ కోటలను బలపరచుకోడం మొదలు పెట్టారు. చుట్టుపక్కల తమ అధికారానికి లోబడక, రాజ్యాంగ చట్టం ప్రకారం స్వతంత్రంగా జీవించే క్రింది తరగతులవారిని నానాహింసలూ పెట్టి బాధింపజొచ్చారు. ఈ దుశ్చేష్టలలో తమకు సాయంచేసే ఉపజీవుల పోషణకూ, తమ డాబు దర్పాలకూ అపారంగా ధనం కావలసివచ్చింది. విపరీతమైన వడ్డీలకు యూదీయులవద్ద అప్పులు తెచ్చేవారు. ఇవి రాచకురుపుల్లాగా పెరిగి యొక్కట్లను తిని వెయ్యడానికి సిద్ధమయ్యేవి. ఈ సంకట పరిస్థితిలోంచి బయటపడడానికి సామంతులకు ఒకటే మార్గముండేది—ఏదో ఒకవిధంగా ఈ యూదీయ షావుకార్లను చేజిక్కించుకొని, విపరీతమైన దౌర్జన్య ప్రయోగాల ద్వారా వీరి నుంచి తిరిగి వీలైనంతగా ధనం గుంజడం!

నార్మన్ సామంతులు పెట్టే బాధల పర్యవసానంగా, స్వతంత్రజీవనోపాధులు కోల్పోయిన ప్రజలు కొందరు బందిపోటు వృత్తిలోనికి దిగి, సంఘానికి వెలియై, అడవులలో తలదాచుకుంటూ, ముఠాలు గట్టుకొని, రాజశాసనా

లను ధిక్కరిస్తూ, ఈ కల్లోల పరిస్థితులను మరింత కల్లోలపరుస్తూ ఉండేవారు. అయితే, వీరిలో కొందరికి, దుష్టులను మాత్రం బాధిస్తూ, సాధుజనులను బాధించక వదలిపెట్టే ఉదారసాహస గుణాలుండేవి. ఒకటవ రిచర్డు కాలంలో రాబిన్‌హుడ్ అనే బందిపోటు ముఠానాయకుడు ఇలాంటివాడేనని చెపుతారు. ఇతడు చేసిన ఉదార సాహసకృత్యాలను గూర్చి ఆంగ్లసాహిత్యంలో చక్కని కథలనేకం ఉన్నాయి.

ఈ సందర్భంలో ఇంకొక ముఖ్య విషయాన్ని గూర్చి చెప్పవలసిఉంది. పాలస్తీనా మతయుద్ధాలు ప్రారంభించిన కొత్తలో, యాత్రికుల రక్షణార్థం, 'టెంప్లార్సు' అనీ, 'హాస్పిటలర్సు' అనీ, రెండు మిలిటరీ వ్యవస్థలు నెలకొల్పబడ్డాయి. వీటిని మతిసంస్థలకుండే కట్టుబాట్లతో నిర్మాణం చేశారు. పాలస్తీనాలోని సోలమన్స్ టెంపుల్ అనే భవనాన్ని ప్రధానకేంద్రంగా చేసినందువల్ల టెంప్లార్సుకు ఆ పేరు వచ్చింది. ఈ వ్యవస్థలోని యోధులను టెంప్లార్సు యోధులని పిలిచేవారు. గ్రాండుమాస్టర్ అనే ఆతను వీరిపై సర్వాధికారి. ఈ సంస్థ అచిరకాలంలోనే మిక్కిలి ప్రబలమై, ఆస్తిపాస్తులను విశేషంగా సంపాదించింది. ఆ కాలంలో ఈ టెంప్లార్సు ప్రదర్శించిన శౌర్యసాహసా లనేకం. కాని, కాలక్రమేణా ఈ సంస్థలోకి అవినీతి చొరబారింది. మత నియమాలు విడనాడి టెంప్లార్సు యోధులు ఇంద్రియ భోగ పరాయణులై, విచ్చలవిడి సంచరింపసాగారు. వెనుకటి మతయుద్ధంలో క్రైస్తవులు చేజిక్కిన జెరూసలేం మొదలైన ప్రదేశాలను దరిమిలా వారు కోల్పోవడానికి యీ టెంప్లార్సు యోధుల అజాగ్రత్త కూడా ఒక కారణమని చెప్పాలి. రెండవ వ్యవస్థయైన హాస్పిటల్లర్సుకు ఆ పేరు, పాలస్తీనాలో ఒక హాస్పిటలును, హాస్టలును నిర్వహించే బాధ్యత అప్పగించినందువల్ల వచ్చింది. వీరినే సెంటుజాన్ యోధులని కూడ అనేవారు. టెంప్లార్సు వ్యవస్థ దరిమిలా 1312 లో రద్దు చేయబడింది. హాస్పిటలర్సు వ్యవస్థ అలా రద్దుచేయబడక 1291 లో సైప్రస్ దీవికీ, 1530 లో మాల్టా దీవికీ ప్రధాన కేంద్రాన్ని మార్చుకొని, 1778 వరకూ కొనసాగింది. ఒకటవ రిచర్డు కాలంలో ఈ రెండు వ్యవస్థలూ చాల ఉన్నతిలో ఉన్నాయి. ఇట్టి పరిస్థితుల మధ్య ప్రారంభమౌతున్న దీ 'ఐవాన్‌హో కథ'—

# అధ్యాయం ౧

సూర్యాస్తమయం కాబోతోంది. అది ఇంగ్లాండు నడిబొడ్డులోని ఒక అటవీ ప్రదేశం. వందలకొలది ఓకు వృక్షాలు, కురచమట్టంగా బలిసిన ప్రకాండాలతో, మెలికలు తిరిగిన శాఖాప్రచయంతో, అంతటా అచ్చటచ్చట విస్తరించుకొని ఉన్నాయి. బహుశా ఆ పురాణవృక్షాలు, సుమారు వేయేండ్ల క్రింద రోమను సేనావాహినులీ దారినే హుటాహుటిగా రాకపోకలు సలిపిన సందర్భాలకు గూడ సాక్షులై ఉండవచ్చు. కొన్నిచోట్ల అవి ఇతర వృక్షజాతులతో చాల ఒత్తుగా కలిసిపోయి, పడమటిపొద్దు లేతకిరణాలు చొరబారడానికేమాత్రమూ సందివ్వడంలేదు. తక్కినచోట్ల అవి ఒకదానికొకటి దూరదూరంగా ఉండడంచేత, మధ్యను సుదీర్ఘములైన చక్కని బాటలేర్పడి, ఎచ్చటికో ఇతోధిక సుందరములైన ఏకాంతసీమలకు గొనిపోయేటట్లుగా ఉన్నాయి. ఆ దృశ్యం చూడనరిగిన కన్ను మైమరచిపోయేమాట నిశ్చయం. సంధ్యారుణకిరణాలిచట ఎడనెడ యథేచ్ఛగా చొరబారి, తరుశాఖా ప్రకాండములపైనేమి, తృణ ప్రదేశ భాగములపైనేమి, ఒక వింత వెలుగును ప్రసరింపచేస్తున్నాయి.

ఇట్టి అటవీ ప్రదేశంమధ్య ఒక పెద్ద బయలుంది. క్రైస్తవ మతవ్యాప్తికి పూర్వం, బ్రిటనులో డ్రూయిడ్ మతం ఉన్నప్పుడు, అప్పటి పురోహితులీ ప్రదేశాన్ని తమ దేవతల కొలుపులకు వినియోగిస్తూ ఉండేవారని తోస్తుంది. ఏలనంటే, అచటగల ఒక చిన్న కొండగుట్టపై, వలయాకారంగా, మోటుగా చెక్కబడిన కొన్ని పెద్దపెద్ద శిలాఖండాలిప్పటికీ నిలిచి ఉన్నాయి. కొన్ని పెళ్ళగిలి ప్రక్కన పడిఉన్నాయి. కొన్ని గుట్టక్రిందికి దొర్లించబడి ఉన్నాయి. బహుశా ఇది ఏ క్రైస్తవ మతావేశపరుని పనో అయివుండవచ్చును. కొండగుట్టచుట్టూ ఒక చిన్న సెలయేరు నిశ్శబ్దంగా ప్రవహిస్తూ, ఆ శిలాఖండము నొకదానిని ఒరుసుకొని రావడంతో సన్నగా ముర్మురధ్వని చేస్తోంది.

ఈ ప్రకృతిచిత్రాన్ని పూర్తిచేస్తున్నాయి రెండు మానవరూపాలు. వేషం, ఆకారం ఇద్దరికీకూడా మోటుగా, ఆటవికంగా ఉన్నాయి. వీరిలో పెద్దవాని వైఖరి మరీ మోటుగా ఉంది. ఒంటి నంటిపెట్టుకొని మోకాళ్ళ వరకూ దిగిన తోలు జుబ్బా ఒకటి తొడిగాడు. ఆ తోలుపై వెంట్రుకలూడకుండా ఉండేటట్లే మొదట్లో పదునుచేయబడినప్పటికీ, ఇప్పుడదా బొచ్చంతా దాదాపు రాలిపోయినందున, అది ఏ జంతువుతోలో చెప్పడానికి వీలులేకుండా ఉంది. జుబ్బాకు చేతులున్నాయి. కాలరువద్ద తలదూర్చడానికి సరిపైనంత వివరం

మాత్రముంది. దీనిని బట్టి అది ఇప్పటి వస్త్రవలె తలా, చేతులూ దూర్చి తొడిగేమాదిరిదని ఊహించవచ్చు.

కాలికి ఏదుపంది చర్మపు అడుచెప్పులున్నాయి. చీలమండలనుండి పిక్కల పైభాగంవరకూ ఒక పొడుగాటి తోలుపీలిక చుట్టబడియుంది. మోకాటిచిప్పలు మాత్రం ఆచ్ఛాదన లేకుండా కనిపిస్తున్నాయి. నడుము వద్ద ఒక తోలుపటకా బిగించియుంది. దాని కొకవైపున ఒక సంచీ వ్రేలాడుతోంది. ఇంకొకవైపున, ఊదడానికి పనికివచ్చే ఒక పొట్టేలుకొమ్ము. ఆ పటకాకే జింకకొమ్ము పిడిగలిగి, రెండు వైపులా పదనుగల ఒక చిన్న కత్తికూడా తగిలించబడి ఉంది. తలకు వేరే ఆచ్ఛాదన యేమీ లేదు,—జడలుగట్టి దుబ్బుగా రౌడిగిన ఆ చింపిరిజుట్టు తప్ప. నిత్యమూ ఎండల్లో తిరుగాడడంచేత గాబోలు, ఒక విధమైన కందురంగుతిరిగి ఉందా జుట్టు. ముఖంమీద మొలిచిన గడ్డం మాత్రం అదో తమాషా పండురంగులో ఉంది.

ఇక అతని వేషంలో, చెప్పవలసినదీ, చెప్పకుండా ఉండడానికి వీలు లేనిదీ, ఒక్కటే మిగిలిపోయింది,—కుక్కకుంటే పట్టీ మోస్తరుగా మెడకు ఒక ఇత్తడి కడియం. తీయడానికి వీలు లేకుండా గుండ్రంగా అతనికంఠానికది తాపడం చేయబడియుంది. తీయాలంటే కానంతో నరికి తీయవలసినదే. ఈ విచిత్రమైన కడియంమీద సాక్సన్ భాషలో ఈ క్రింది అక్షరాలు చెక్కబడి [redacted]—'రోధరువుడ్డు సెడ్రిక్కు అజన్మదాసుడు, బోవుల్ఫ్ కుమారుడు గర్త్.'

గర్త వృత్తి పందులను కాయడం. ఇతని ప్రక్కనే, అచట పడియున్న ఒక శిలాఖండంపై కూర్చున్న రెండవయాతడు ఇతనికంటె ఒక పదేండ్లు చిన్నవాడై యుండవచ్చు. ఇతని దుస్తులు కూడా దాదాపు అదేమాదిరిగా ఉన్నా, వాటికంటె కొంచెం నాణ్యంగానూ, వింతగానూ ఉన్నాయి. అతని జుబ్బా మిలమిల మెరిసే వంకాయరంగులో ఉంది. దానిపై పెక్కురంగులతో ఏవేవో వికృతమైన నగిషీ అద్దకాలు చేయబడియున్నాయి. ఈ జుబ్బాకుతోడు, తొడలకు సగందాకా వచ్చిన మరొక వింతదుస్తునతడు మీద వేసుకున్నాడు. అది ఎర్రరంగులో ఉంది. అంచులు పసుపురంగులో ఉన్నాయి. పొడుగాట్టే లేకపోయినా అంబుమాత్రం విపరీతంగా ఉంది. ఒక భుజంనుంచి ఇంకొక భుజానికి అతడు దానిని తేలికగా మార్చుకోవచ్చు. కావాలంటే తన మేని చుట్టూ ఇష్టంవచ్చినంతగా చుట్టబెట్టుకోవచ్చు. బాహువులకు వెండి కడియాలున్నాయి. మెడకుగూడ వెండికడియమే ఉంది. దానిపై ఈ క్రింది అక్షరాలు చెక్కబడ్డాయి: 'రోధరువుడ్డు సెడ్రిక్ దాసుడు, విట్ లెస్ కుమారుడు వాంబా.'

ఇతని పాదాలకు కూడా గర్తకున్న చెప్పులవంటివే ఉన్నాయి గాని, పిక్కలకు మాత్రం గుడ్డబాండీలు ఉన్నాయి. రెండూ ఒకే రంగువి కావు. ఒకటి ఎరుపు, ఇంకొకటి పసుపు, నెత్తిమీద పొడుగాటి టోపీ ఉంది. దానికి చుట్టూ చిరుగంటలున్నాయి. అతడు తల తిప్పినప్పుడెల్లా అవి మోగుతూ ఉంటాయి. ఒక్క నిమిషంసేపైనా కదలకుండా కూర్చుండే మనిషి కాడుకనుక, ఆ మోత తెంపులేకుండా అలా వినవస్తూనే ఉంటుంది. ఈ వేషధోరణి గాని, ఇతని ముఖంలోని- సగం వెర్రీ సగం గడుసూ-వాలకం గాని చూస్తే, ఇతడు ధనికుల ఇండ్లలో వినోదకాలక్షేపం కోసం నియోగించబడుతూ ఉండే విదూషకుల తెగకు చెందిన వాడని స్పష్టమౌతోంది. మొలకు ఇతనికి కూడా ఒక పటకా, దానికొక సంచీ ఉన్నాయి గాని, గర్తకున్న మాదిరి కత్తీ, కొమ్మూ లేవు. వాటికి బదులుగా, వీధినాటకాల్లో వాడేమాదిరి కొయ్యకత్తి ఒకటుంది.

దుస్తులలో వలెనే ముఖ కవళికల్లో కూడా ఇద్దరికీ తేడా ఉంది. గర్త ముఖంలో విచారం కనిపిస్తుంది. చూపు ఎప్పుడూ నేలమీదకు వాలినట్లుంటాయి. అందేదో నిస్పృహా, ఒక విధమైన విరసత్వం గోచరిస్తూ ఉంటుంది. అయితే, అప్పుడప్పుడతని రక్తనేత్రాల్లో ఒక అగ్ని స్ఫులింగం తళుక్కుమంటూ ఉంటుంది. మందకొడితనంతో కూడిన ఆ విషాదచ్ఛాయల మాటున, అస్వతంత్రతా భారం గుర్తెరిగి ప్రతిఘటన చేయగోరే తిరుగుబాటు ప్రవృత్తి కూడా అతని లోపల దాగి యున్నదని దానివలన స్పష్టం. వాంబా చూపుల్లో అలాంటిదేమీ లేదు. విదూషకజాతికి సహజమైన ఒక విధమైన వెంగిలితనపు చాపల్యం వానిలో ద్యోతకమవుతూ ఉంటుంది. తన పరిస్థితీ, తన వేషం తనకు చాలా సంతృప్తిదాయకంగా ఉన్నట్లతని వైఖరుంది. వారు ఉభయులూ మాట్లాడుకొంటున్నది ఆంగ్లోసాక్సను భాష—

'ఏటి దుంపతెగ, పాడు పందులు! కదిలిరావేంకి?' అని విసుక్కున్నాడు గర్త. చెల్లాచెదరై ఉన్న ఆ మందను పోగుచెయ్యడానికి అతడు కొంత కఠోరంగా కొమ్ము ఊదినా, అవి 'విన్నాంలే' అన్నట్లుగా, సమానమాధుర్యం ఉట్టిపడే ఘుర్ఘుర ధ్వనులతో జవాబిచ్చాయే కాని, తామారగించే దుంపలవిందు విడనాడడానికి గాని, తాము సుఖంగా శయనించియున్న బురద పరుపులు వదలి రావడానికి గాని, ఏమాత్రం అంగీకరించలేదు. గర్తకు అసహనం ఎక్కువై, 'ఫాంగ్స్! ఎక్కడున్నావింకా! త్వరగా మళ్ళించరా వాటిని!' అని తన కుక్కనుద్దేశించి అరిచాడు. యజమాని ఆజ్ఞను బలపరచడానికా అన్నట్లు, ఫాంగ్సు కుంటుకుంటూ అటూయిటూ పరుగెత్తింది. యజమాని ఆదేశం దానికి సరిగా తెలియలేదో, తెలిసినా దానికి అన్యథా చెయ్యాలనుకుందో, ఇది అటూ ఇటూ పరుగెత్తడంతో, ఉన్న గోడు ఇంకా చెడి, అవి మరింతగా చెల్లాచెదరైపోయాయి. 'దీని కోరలు పీకా! చూడది యేమి

చేస్తోందో! ఇంతకీ దీన్నంటే ఏముంది? వేటలకు పనికిరాకుండా మన కుక్కల ముంగాళ్ళ పంజాలు తెగగోస్తున్న ఆ ఫారెస్టురేంజరు వగాలి! వాడు నాశనం కాను! వాంబా, నీవింకా ఇలా కూర్చుంటే లాభంలేదు—ఆగుట్ట అవతలివైపు నుంచి వచ్చి వాటిని మళ్ళవెయ్, దబ్బున!' అని హెచ్చరించాడు.

వాంబా కూర్చున్నచోటునుంచి కదలకుండానే ఇలా జవాబిచ్చాడు: 'నన్నా? లెమ్మంటావా? ఉంహు, నా కాళ్ళతో సంప్రతించనీ! ఆఁ! అవి యేమంటు న్నాయంటే, ఈ ఖుషీ కుస్తులతో సేబాబురద నేలల్లో దిగబడటం నా రాచ విగ్రహానికీ, నా రాచవేషానికీ అపచారం చెయ్యడమట! ఇక నేను యెలా వెళ్ళను? కనుక నామాట విని,—ఫాంగ్సును కూడా వెనక్కు పిలిచేసెయ్! ఈ పందులమందను యిక్కడే వదిలేసిపోతే నీకు వచ్చే బాధేమీ లేదు. ఈ రాత్రి అవి ఏ సైనికులకో, ఏ దొంగలకో, ఏ ప్రయాణీకులకో చిక్కితే చిక్క వచ్చుగాక! తెల్లవారేసరికల్లా అవి నార్మన్లక్రింద మారడమేగా జరిగేది! అది నీకిష్టమేగా!'

'పందులు నార్మన్లుగా మారడమా! అది నాకు ఇష్టమా! వాంబా, నీ అభిప్రాయమేమిటో నాకు తెలియలేదు. నాది కొంచెం మందబుద్ధి. చిక్కు సమస్యలు విడదీయగల శక్తి కూడా ఇప్పుడు నా మనస్సుకు లేదు. ఏదీ కొంచెం విడదీసి చెప్పు' అన్నాడు గర్త్.

'విడదీసి చెప్పడానికేముంది? గురగురమని రొదచేస్తూ నాలుగు కాళ్ళ మీద పరుగెత్తే ఈ జంతువుల్ని నీవు పిల్చేది ఏ పేరుతో?' అని అడిగాడు వాంబా.

'ఓరి దేవయ్యో, 'స్వైన్' అంటాం కదా, 'స్వైన్'! ప్రతి దేవయ్యకూ తెలుసునే ఈ సంగతి?'

'ఆఁ, అలా రా, 'స్వైన్' అనేది చక్కని ఆంగ్లో-సాక్సన్ మాటకదా. మరి యీ జంతువును కోల్చి, చర్మమూడ్చి, రాజద్రోహిలాగా తలక్రిందుగా వ్రేలాడగట్టినప్పుడు పిలిచేదేమని?'

'పోర్కు' అని సమాధానమిచ్చాడు గర్త్.

'ఆఁ! ప్రతి దేవయ్యకూ ఆ సంగతికూడా తెలియడం సంతోషదాయకమే! కాని, 'పోర్కు' అనేది నార్మన్-ఫ్రెంచిమాట, కనుక ఏమయినట్టు? ఈ జంతువు బ్రతికియుండి సాక్సన్ బానిస కాపుదలలో ఉన్నంతకాలం సాక్సన్ పేరుతోనే దీనికి చలామణీ. కాని, కోటలో దొరల విందుకు

సిద్ధంచేయబడినప్పుడు మాత్రం 'పోర్క్' అనే నార్మన్ పేరుతో పిలవ బడుతోంది. ఏమంటావ్, నిజమా కాదా?' అని అడిగాడు వాంబా.

'నీ తోస్యపు బుర్రకిది ఏవిధంగా తట్టినప్పటికీ, ఈ మాటలో ఎంతైనా నిజముంది' అన్నాడు గర్త్.

వాంబా అదే గొంతుకతో ఇంకా ఇలా అన్నాడు: 'కావలిస్తే ఇంకా చెబుతా విను. నీవంటి బానిసల పోషణలో ఉన్నంతకాలం ఎద్దు పేరు 'ఆక్స్', తన్ను ఆప్యాయంతో ఆరగించబోయే నోళ్ళ దగ్గిరికి తయారై వెళ్ళినప్పుడు 'బీఫ్'. అలాగే 'కాఫ్' (దూడ) 'వీల్' అవుతోంది. 'షీప్' (గొర్రె) 'మటన్' అవుతోంది. 'డీర్' (లేడి) 'వెనిజన్' అవుతోంది. 'ఫౌల్' (కోడి) 'పుల్లెట్' అవుతోంది. పెంపకంలో ఉన్నప్పుడు ప్రతిదీ 'సాగ్జన్'. ఆరగింపుకు వచ్చి నప్పుడు 'నార్మన్!'

గర్త్ విచారమగ్నుడై ఇలా అన్నాడు: 'మనసుకు చాలా చింతకలిగించే నిజాలు పలికావు వాంబా! నిజమే, పీల్చడానికి ఈ గాలి తప్ప మనకు మిగి లిందేముంది? అదైనా మనచేత వెట్టిచాకిరీ చేయించడంకోసం తప్పనిసరిగా మిగిల్చిందే! బాగా కండకలిగి పోషించిన ప్రతిదీ వాళ్ళ కంచాల్లోకే కావాలి. మంచి అందచందాలతో హొయలు గులికే ప్రతిదీ వాళ్ళ ప్రక్కల్లోకే కావాలి. మేటియైన పోటుమగటిమి గల ప్రతివాడూ వాళ్ళకోసం పరదేశా లలో తన యెముకలు పొర్లాడేటట్లు చెయ్యాలి. ఇచట అనదలుగా బ్రతుకు తున్న సాగ్జనులను కాపాడగల చేవా, కోరికా ఉన్నవారెవ్వరూ మిగలడంలేదు. మన సెడ్రిక్ దొరను దైవం నాలుగు కాలాలపాటు చల్లగా చూడాలి,—ఆయన ఒక్కడు మాత్రం మొగాడనుపించుకొని కొంత వెలితి పూడ్చగలుగుతున్నాడు. కాని, రెజినాల్డు ఫ్రాంటు-డి-బఫ్ ఈ వైపులకు రేపు తానే బయలుదేరి వస్తున్నాడు కాబోలు! సెడ్రిక్ ఎలాంటి చిక్కుల్లో ఉన్నా, అతని వల్ల ఫ్రాంట్-డి-బాఫ్ కేమీ లాభించదు. ఆఁ, భేష్!—'గర్త్ ఈ సమయంలో తన కంఠం హెచ్చు చేశాడు— 'అలాగే! అలాగే తోలుకురా వాటిని, ఫాంగ్స్! మొత్తానికి అన్నిటినీ మళ్ళేశావ్! అలా వుండాలి!'

వాంబా వెంటనే ఇలా అందుకున్నాడు— 'ఇదుగో గర్త్, నీవు నన్ను పట్టి వెంగిలి క్రింద జమకట్టేవాడవని నాకు తెలుసు. లేకపోతే, నా నోట్లో నీ వీలా తల దూర్చడాని కింత సాహసించి ఉండవ్. ఒక బానిసపాటివాడ వైన నీవు, నార్మనులకు వ్యతిరేకంగా, విద్రోహకరంగా మాట్లాడావని ఒక్క మాట, రెజినాల్డు ఫ్రాంట్-డి-బాఫ్‌కు గాని, ఫిలిప్ డీ మాల్వాయిసిన్‌కు గాని, నేను చెవిని వేశానంటే చాలు,—యిలాంటి పెద్దల నిట్లా తూలనాడే

వారందరికీ హడలుపుట్టేటట్లు, రేపు ఈ చెట్లల్లో దేనిక్నో ఒకదానికి నీవు వ్రేలాడుతూ ఉండేమాట నిశ్చయం!'

'ఏడిశావులే!' అన్నాడు గర్త్. 'నన్నిలా మాట్లాడేటట్లు చేసింది నీవు! నాకు ద్రోహంచెయ్యవ్, నాకు తెలుసు.'

'నీకు ద్రోహం చెయ్యడమా! అబ్బే అది తెలివిగలవాడు చేసేపని. నావంటి వెంగలికి అలాంటివి చేసి బాగుపడడం తెలియదు. సరేగాని,—అదిగో! ఎవరో ఇలా వస్తున్నట్లున్నదేమిటి?' అన్నాడు వాంబా. పెక్కు గుర్రాల డెక్కల చప్పుళ్ళు దూరంనుంచి వినవస్తున్నాయి.

'ఎవరైతే మనకేమిటే'—అని సమాధానమిచ్చాడు గర్తు. పందులమంద అంతా ఇప్పుడతని ముందరికి చేరింది. ఫాంగ్స్ తోడ్పాటుతో అతడు వాటిని మొదట్లో వర్ణించిన వృక్షపంక్తులమధ్య గల దారివెంట తోలుకుంటూ బయలుదేరాడు.

'అలాకాదు, నేనాగుర్రాలపై వచ్చేవారెవరో చూచితీరాలి.' అన్నాడు వాంబా. బహుశా ఏకిన్నరలోకంనుంచో వాళ్ళు మనకేదైనా కబురు తెస్తున్నారేమో !'

'ఓరి నీ నోటికి గాళ్ళు కాను! ఇంకా నవ్వులాటలేనా? అదిగో చూచావా, దూరంనుంచి ఉరుములు మెరుపులతో తుఫానుగాలి ఎలా ముసురుకుంటూ వస్తోందో! అబ్బ! ఇదిగో, రాయిలాంటి చినుకులు మీదపడుతున్నాయో చూడు. నేను పుట్టి బుద్ధి ఎరిగినతర్వాత, యింత పెద్ద చినుకు ఎప్పుడూ చూళ్ళేదు. ఆదిగో, ఆ వోకుచెట్లు అప్పుడే ఎలా రోదనం సాగించాయో చూడు. కావాలనుకుంటే వివేకిగా కూడా మెలగడం నీకు చేతొచ్చు—నా మాట విని, పద, తుఫాను ముమ్మరం కాకముందే యింటికి చేరుకుందాం. ఇవాళ రాత్రి చాలా భయంకరంగా ఉండేటట్లుంది.'

ఈ హెచ్చరిక వాంబాకు బాగా నాటినట్లే కనిపించింది. గర్తుతో పాటు తానూ నడవసాగాడు. గర్తు తన దుడ్డుకర్ర చేతబుచ్చుకొని, తొందర తొందరగా, ఫాంగ్స్ సాహాయ్యంతో, క్రమశిక్షణ ఎరుగని ఆ పందుల మందను తోలుకుంటూ ముందుకు సాగిపోజొచ్చాడు.

# అధ్యాయం ౩

గుర్రప్పురౌతుల పదధ్వని సమీపిస్తున్న కొద్దీ, వారెవ్వరో తెలుసుకోవాలన్న కుతూహలం మిక్కుటమై, వాంబా చీటికీ మాటికీ ఏదో ఒక సాకుతో వెనుక బడటం మొదలు పెట్టాడు. గర్త్ ఒకప్రక్క మధ్యమధ్య చివాట్లు పెడుతూ పదపదమని హెచ్చరిస్తున్నా, దారిప్రక్క పొదల్లో ఏవో పండ్లగుత్తులు కోసే నెపంతో కొంతసేపూ, తమ కెదురైన ఏ పల్లెటూరిభామవైపో నిలిచి నిలిచి ఓరచూపులు చూస్తూ కొంతసేపూ, ఇలా అతను తడవుచేస్తూ ఉన్నంతలోనే, ఆ అశ్వికసమూదాయం వచ్చి వీరిని కలుసుకుంది.

వారు మొత్తం పదిమంది. ముందు ప్రయాణిస్తున్న యిద్దరూ ముఖ్యులు గానూ, తక్కినవారు వారి అనుచరులు గానూ కనుపించారు. ఆ యిద్దరిలో ఒకడు, ఏదో పెద్ద మఠాధికారి అయివుండాలి. సిస్టర్షియన్ తెగకు చెందిన క్రైస్తవ సన్యాసుల దుస్తులు ధరించాడు. కాని, సంప్రదాయానికి విరుద్ధమైన నాజూకుతనం వాటిల్లో ఉట్టిపడుతోంది, మనిషి కొంచెం స్థూలకాయుడైనా అందంగానే వున్నాడు. తలపైన ఆచ్ఛాదనతో, మేనిచుట్టూ నిండుగా జీరాడుతున్న ఆ అంగీ మడతల్లో ఒక విధమైన విలాసం ఉందని చెప్పక తప్పదు. అతని అలవాట్లు మాత్రం ఐహికభోగాలను నిరసించేవిగా కనిపిస్తూ ఉన్నా, అతని వదనంలో వైరాగ్య లక్షణాలేవీ కూడా కనిపించడంలేదు. ఆకార రేఖలన్నీ మంచివే. కాని, కండ్లలో తళుక్కుమనే ఆ చిలిపితనాన్నిబట్టి చూస్తే, అతను, జాగ్రత్త విడనాడకుండా ఇంద్రియభోగాలను అనుభవించే రకమని ఇట్టే తెలిసిపోతుంది. ఉల్లాసంగా పదిమందితో కలిసిమెలిసి కాలక్షేపం చేసే లక్షణంగల ముఖమే యైనా, ఎప్పుడు కావలిస్తే అప్పుడు ఒకవిధమైన గంభీరముద్ర తాల్చగల నేర్పు అతని పదవే అతనికి అలవరించింది. మతసంప్రదాయానికి విరుద్ధంగా, లోపలి చొక్కాకు సొగసు ఉట్టిపడే మంచి ఖరీదైన ఉన్ని చేతులున్నాయి. పైన తొడిగిన అంగీకి, మెడను, మిలమిలమెరసే ఒక బంగారపుగుండీ ఉంది. ఒక్కమాటలో చెప్పాలంటే, ఆ సన్యాసి దుస్తులనే ఒకవిధమైన షోకిలా దుస్తులుగా అతను మార్చివేసుకున్నాడని చెప్పవచ్చు.

అతడెక్కిన దొక కంచరగాడిద. మంచి నగిషీపని చేసిన జీను. వెండి మువ్వలుగల కళ్ళెం. అతడా జీనుపై కూర్చుంటే, చేతకాని యితర సన్యా

ములు కూర్చున్నట్లు వెక్కిరించినట్లుగా లేదు. సుశిక్షితుడైన అశ్వికునికుండే లక్షణం అతనిలో ప్రకటమౌతోంది. ఆ కంచరగాడిద ఎంత ఆడంబరంగా అలంకరించబడినా, ఎంత పొందికగా పరుగెత్తించబడుతున్నా, అతని దర్పానికి తగినదిగా తోచలేదు గాని, కేవలం ఇలాంటి కొద్ది ప్రయాణాలకు మాత్రమే అతడు దానిని ఉపయోగించేటట్లు కనుపించింది. ఇతర సందర్భాల్లో అతడు స్వారీ చెయ్యడాని కుపయోగించే చక్కని స్పానిష్ గుర్రాన్ని అతని పరివారంలో ఒకడు వెంట తీసుకొనివస్తున్నాడు. నాజూకు పనితనంగల జీనుమీద ఒక బురఖా ఆ అశ్వరాజం మీద కప్పబడి ఉంది. నీలి రంగు మొనదేలైన సాకతో చుట్టుబంధమైన చిహ్నాలతో, చక్కని అల్లికపని చేసిన ఆ గుడ్డమీద కట్టబడి ఉన్నాయి. మరొక అనుయాయి వెంట తీసుకొనివచ్చే కంచరగాడిదపై, ఆ యజమాని ధరించే తాలూకు సామానుంది. వీరి వెనుక, మరి యిద్దరు సన్యాసులు కంచరగాడిదలెక్కి తమలో తామేదో ముచ్చటాడుకుంటూ, నవ్వుకుంటూ వస్తున్నారు.

ఆ సన్యాసిగాన మఠాధికారి ప్రక్కగా ప్రయాణిస్తున్న యాత్రికుడు, సన్నగా, పొడుగ్గా, కండలుతీరిన శరీరంతో బలిష్టంగా ఉన్నాడు. వయస్సు నలుబదేండ్లు దాటి ఉండవచ్చు. సంతతాభ్యాసవశంచేత, అతని శరీరంలో, కండలూ, ఎముకలూ, నరాలూ తప్ప ఇంకేమీ మిగిలినట్లు లేదు. ఎన్నో ధక్కామొక్కీలు తిని, ఇంకా ఎన్నిటినో ఎదుర్కోవడానికి సిద్ధంగా ఉన్నట్లున్నదా విగ్రహం. తలపై ఎఱ్ఱని టుప్పటోపి ఉంది. అపరిచితులైనవారికి, భీతి కాకపో[illegible]క విధమైన వెరపు కలిగించే ముఖవర్చస్సు అతనిది. ఉష్ణమండలపు ఎండలకు నిరంతరం కాగిపోవడంవలన కాబోలు, ఆ ముఖాకారరేఖలు కొంచెం నలుపు తిరిగాయి. తీవ్రమైన ఉద్రేకపు తుపాను ఒకప్పుడు చెలరేగి అణగారిపోయినట్లు ఆ ముఖవిన్యాసంలో ద్యోతకమవుతున్నా, చిక్కనైన నల్లని మీసకట్టుతో గూడిన ఆ పెదవి, ఇప్పటికీ, ఏ కించిత్తు ఉద్రేకం వచ్చినా వణికిపోవడం చూస్తే, మరల నింకొక తుపాను ఏక్షణంలోనైనా అమాంతం విరుచుకొని పడడానికి అభ్యంతరం లేదనిపిస్తుంది. ఛురికనుబోలిన ఆ నల్లని కండ్లు, చూపుచూపునా ఒక పెద్ద చరిత్రను,—యెన్నెన్నో ప్రమాదాల నెదుర్కొని, యెన్నెన్నో కష్టపరంపరల నతిక్రమించిన విపులగాథను చాటుతున్నట్లుగా ఉన్నాయి. ఎట్టి ప్రతిఘటన యెదురైనా, తన సంకల్పబలంచేత, తన ప్రతాపస్ఫూర్తిచేత, తూలించివేయటం అతనికొక వినోదమన్నట్లుగా అవి మెరుస్తున్నాయి. నుదుటిపై ఒక పెద్ద మచ్చ, అతని వదనరేఖాకాఠిన్యానికి మరింత కాఠిన్యం ఆపాదిస్తోంది. ఆ నుదుటిదెబ్బ తగిలినప్పుడే ఒక కంటికి గూడా చిన్న దెబ్బ తగిలినందువల్ల, దృష్టికి లోపమేమీ కాలేదు గాని, ఆ కంటిచూపుకు ఒకవిధమైన కుటిలత్వం యేర్పడింది.

అర్థించినదే తడవుగా ప్రసాదించే నైజం కావడంచేతనూ, ఆ చుట్టుపట్ల సార్థగా సామంత కుటుంబాలవారికి ఇతడంటే ఒకవిధమైన అభిమానం ఏర్పడింది. ముఖ్యంగా స్త్రీ జనాన్ని ఉల్లాసపరిచే చేష్టలు తెలిసినవాడు కావడంచేత, వారి కితడంటే మరీ అభిమానం. క్రీడావినోదాల్లో పాల్గొంటూ, ఉత్తమజాతి డేగలనూ, జాగిలాలనూ పెంచుతూ, యువకబృందాన్ని ఆకర్షిస్తూ ఉంటాడు. వయస్సుమళ్ళినవారితో ఇంకొకరకంగా ప్రవర్తిస్తూ వారి మన్నన అందుకుంటూ ఉంటాడు. తనకు తెలిసింది తక్కువైనా, చాల తెలిసినట్లు ఆ తెలియని వారిముందు తన విద్యాప్రదర్శనం చెయ్యడంలో దిట్ట. పై తరగతులవారి ప్రవర్తనను నిత్యమూ నిశితంగా విమర్శించే స్వభావంగల సామాన్యజనం కూడా, అతని తప్పులను అంతగా పాటించరు. దీనికి కారణం అతని దాతృత్వం. దాతృత్వం పాపపరిహారకమని శాస్త్రాల్లో ఒక అర్థంలో చెప్పబడితే, ఇతనిపట్ల అది ఇంకొక అర్థంలో సార్థకమయింది. మఠానికివచ్చే ఆదాయం తన సొంతభోగాలకు విరివిగా ఖర్చు పెట్టుకోడంతోపాటు, చుట్టుపట్ల కష్టదశలో ఉన్నవారికోరకు కూడ తరుచుగా వ్యయపరుస్తూఉంటాడు. అందుచే, ప్రయర్ ఐమర్ వేటలూ విందులూ మరగి మఠం బయట సంచారం చేస్తుండనివ్వండి, లేక, రాత్రింతా ఏసంకేతస్థలంలోనో గడపి తెలతెలవారుతూండగా మఠానికి చేరుకుంటూ ఉండనివ్వండి, సామాన్యజనం బుజాలెగరవేసి నవ్వుకుంటారు తప్ప, అంతకంటె ఏమీ పట్టించుకోరు.

వాంబా గర్తు లిద్దరూ ఈ ప్రయర్ ఐమర్‌కు అభివాదం చెయ్యగా, అతడు వారిని తనహోదాకు తగినట్లుగా దీవిస్తూ, 'ఈరాత్రి మేము నిలవడానికి దగ్గర [redacted] వైనా మంచిహోవున్నదా' అని అడిగాడు. ప్రక్కన సగం సన్యాసి వేషంలో ఉన్న యోధుని విచిత్రరూపాన్ని వింతగా తదేకదృష్టితో చూస్తున్న కారణంచేత, ఈ ప్రశ్న వారికి వినిపించలేదు. ప్రయర్ తన గొంతు హెచ్చుచేసి మళ్లీ అడిగాడు—'ఈ ప్రాంతంలో, చర్చిమాతకు దానపరమాణువులైన సజ్జనులకు వారిపరివారంతోసహా భక్తితో ఈ రాత్రికి ఆతిథ్యమిచ్చి వసతిమాపగల సత్పురుషు లెవరైనా వున్నారా' అని.

'ఆహా! చర్చిమాత దానపరమాణువులు! ఈ పరమాణువులే ఇలాఉంటే, ఇక ఆమె ముఖ్యదాసగణం ఎలా ఉంటుందోకదా!' అని వాంబా, బిగ్గరగానే తనలోతాననుకొని, ప్రియర్ అడిగిన ప్రశ్నకు ఇలా జవాబిచ్చాడు:

'స్వాములకు సుఖప్రదమైన భోజన భాజనాదులు కావాలనుకుంటే, రెండు మూడు క్రోసుల దూరంలో బ్రింక్స్‌వర్తుమఠం ఉంది, అక్కడకు పోవచ్చు. అలాకాక, చేసినపాపాలకు పశ్చాత్తాపపడుతూ ఈ రాత్రి గడపాలనుకుంటే, అదిగో ఆపచ్చికబీడు దాటి కొంచెం ముందుకుపోతే అక్కడ ఒకచిన్న ఆశ్రమంలో ఒక సాధువున్నాడు. స్వాములకు తలదాచుకు నేందుకు చోటిస్తాడు. భక్తితో దైవప్రార్థనచేసి, ఆ సత్ఫలితం తమకుకూడా పంచిపెడతాడు.'

ప్రియర్ ఈ రెండు మాటలనూ అసంగీకారమే తెల్పుతూ తల పంకించాడు. 'అబ్బాయీ, మా సంప్రదాయం నీకు తెలియదల్లేఉంది. మా చర్చి మాటంటే మాలో కొందరికే ఆతిథ్యం ఇచ్చిపుచ్చుకోవటానికే ఆధారంలేదు. మావంటి భగవత్కింకరులను సేవించడంద్వారా భగవంతుని సేవించే అవకాశం సామాన్య గృహస్థులకు కల్పించడంకోసం వారి ఆతిథ్యం స్వీకరిస్తూ ఉంటాం. ఈమాత్రం తెలియకపోతే, నీ టోపీ గజ్జెలమోతలో నీ మెదడు సరిగా పనిచెయ్యడం లేదనాలి.'

'నిజమే స్వామీ, తను కంచరగాడిదవలెనే గజ్జెలు ధరించిన నేనూ ఒక గాడిదనే! కాని, దాతృత్వం మొట్టమొదట స్వగృహంలో ప్రారంభం కావాలనిగదా తమవంటి పెద్దలు సెలవిస్తారు? చర్చిమాత సంబంధం విషయంలో కూడా అదే ఎందుకు వర్తించకూడదూ అని నా మనవి' అన్నాడు వాంబా.

'ఏమిటీ దుర్వినయం! ఇక చాలు కట్టిపెట్టు!' అని ఉగ్రుడై ఒక్క ఉరుము ఉరిమాడు ప్రక్కనున్న యోధుడు. 'నీకు తెలిస్తే అతని ఇంటికి ఎలా వెళ్ళాలో మాకు దారిచెప్పు. ఏమిటా స్వతంత్రభూస్వామి పేరు, ప్రియర్ ఐమర్?'

'సెడ్రిక్. అందరు అతన్ని 'సెడ్రిక్ ది సాగ్జన్' అంటారు. ఓరే అబ్బాయీ, అతని యిల్లింకా ఎంతదూరం? మార్గం తెలుసునా? తెలిస్తే చెప్పు' అని అడిగాడు ప్రయర్.

ఇంతసేపూ మౌనంగా ఉన్న గర్త్, ఇప్పుడందుకొని, 'ఆ దారి తెలుసుకోడం చాలాకష్టం. అయినా, సెడ్రిక్ కుటుంబంలో అంతా పెందలకడనే పడుకుంటారు' అన్నాడు.

'చప్, అదంతా నీ కనవసరం, మావంటి అతిథులొస్తే, పడుకున్నా లేచి మా అవసరాలన్నీ చూడాలి. ఆతిథ్యం యాచించేవాళ్ళంకాదు మేము, శాసించి పుచ్చుకుంటాం' అన్నాడు యోధుడు.

'అయితే, అలా శాసించి ఆతిథ్యం గ్రహించే మీకు నా యజమాని ఇంటికి దారి చూపించవచ్చునో లేదో నాకు తెలియదు' అన్నాడు గర్త్.

'తొత్తుకొడుకా! నాతో వాదిస్తావ్!' అని ఆ యోధుడు తన గుర్రాన్ని ముందుకు ఉరికించి కమ్చీ పైకెత్తాడు. గర్త్ కొరకొరా చూచి తన కత్తిపిడిమీద చేయివేశాడు. ఇంతలో ప్రియర్ ఐమర్ తన కంచరగాడిదని వారిద్దరి మధ్యకూ తోలి, 'క్షమించు సోదరా, ఇది తురుష్కులపై నీ ప్రతాపం ప్రకటించిన పాలస్తీనా అనుకున్నావేమిటి?' అని వారిస్తూ, వాంబావైపు తిరిగి, ఒక వెండి నాణెంకూడ చేతబెట్టుతూ, 'అబ్బాయీ నీవు మంచివాడవు, చెప్పు వెంటనే. సెడ్రిక్ ఇంటికి ఎలా వెళ్ళాలో నీకు తెలియకుండా ఉండదు. మావంటి

పవిత్రాత్ములు కాని బాటసారులకైనా ఇలాంటి సందర్భంలో త్రోవ చూపడం నీ విధి' అని హెచ్చరించాడు.

'ప్రియర్, నిజంగా చెబుతున్నాను. ఆ తురుష్కుని తలకాయ చూస్తుంటే నాకు విపరీతమైన భయం వేస్తోంది. ఇంటికి త్రోవ మరిచి పోయాను. ఈ రాత్రికి క్షేమంగా చేరుకుంటానో లేదో!' అన్నాడు వాంబా.

'ఛస్, అలా కాదు. నీవు చెప్పాలనుకుంటే చెప్పగలవు. ఈయ నెవరో తెలుసుకో! పాలస్తీనాలో మన క్రీస్తు భగవానుని పవిత్ర సమాధిని తురుష్కుల దురాక్రమణనుండి తప్పించడానికై ఘోర యుద్ధాలు చేసిన వీరాధి వీరుడు. టెంప్లార్ మతవ్యవస్థకు చెందిన శూరాగ్రణి. నీ విదివరకే విని యుండవచ్చు. క్షాత్రధర్మం, సన్యాసధర్మం, ఈ రెండూ ఈయనలో పెనవేసు కొన్నాయి'— అన్నాడు ప్రియర్.

'సన్యాసధర్మం కూడా ఈయనలో ఉంటే, రోడ్డుమీద తారసిల్లిన అపరిచితుల యెడ తాను ఇంత పూర్తిగా బేసబబుగా ప్రవర్తించకూడదు' అన్నాడు వాంబా.

'నీ అవినయపు హాస్యం మన్నిస్తాను. కాని, ఒక షరతు. సెడ్రిక్ ఇంటికి దారి చూపించు' అన్నాడు ప్రియర్.

[redacted] చిత్రం, అయితే వినండి. ఈ దారి వెంట ఏమీ వదలకుండా తిన్నగా పోతే, ఒకచోట, భూమిపైకి ఒక మూరెడు కన్పించేటట్లుగా ఒక సిలువ దిగేసివుంటుంది. అక్కడ మార్గం నాలుగుగా చీలి కనిపిస్తుంది. తాము సిలువకు ఎడమవైపున వున్న దారినే సరాసరి వెళ్ళండి. తుపాను వచ్చి పైబడకముందే గమ్యస్థానం చేరుకుంటారు.'

ప్రయర్ అతనికి కృతజ్ఞత తెలిపి ముందుకు సాగాడు. తక్కినవారు కూడా తమతమ గుర్రాలను ముందుకు ఉరికించారు. వాటి గిట్టలచప్పుడు దూరాన నిశ్శబ్దంలో లీనమైపోయేవరకూ వేచియుండి, గర్త్ తనమిత్రునితో ఇలా అన్నాడు: 'వాంబా, నిజంగా నీ సలహానే ఈ స్వాములవార్లు పాటించి ప్రయాణిస్తే, రోథరువుడ్డు ఈ రాత్రికి చేరుకోరు.'

'అదృష్టవంతులైతే షెఫీల్డు చేరుకోవచ్చు. అదే వాళ్ళకు తగినచోటు. లేడి పడుతున్న చోటును చూస్తూ చూస్తూ కుక్కలకు చూపిస్తానేమిటి లేకపోతే?'

'మంచిపని చేశావు వాంబా, చాలా మంచిపని చేశావు. రొవీనా సుందరి ఈ ప్రయర్ కంటపడడం మంచిదికాదు. సెడ్రిక్ ఈ మిలిటరీ సన్యాసితో తగవు లాడడం అంతకన్నా మంచిదికాదు. కాని, ఉభయులూ కలిస్తే

మాత్రం, తగవు వచ్చితీరేమాట నిశ్చయం. సరే, మన కెందుకు, మనమేం మాట్లాడొద్దు. మన పనల్లా వినడం, చూడ్డం — అంతే!' అన్నాడు గర్త్.

వీరి నిచట వదలి, ఆ సుక్రవు రౌతులను మనం అనుసరిద్దాము. గర్త్ వాంబాలను విడచి చాలా దూరం పోయిన తర్వాత, ప్రయర్ ఐమర్ కో టెంప్లార్ ఇలా అన్నాడు: 'ఈ సాక్సనుల కెంత పొగరు గా వుందీ! బాగా బుద్ధిచెప్పే వాణ్ణే, ఎందుకు నన్ను అడ్డగించారు?'

'ఎందుకంటే, ఈ ఇద్దరిలో ఒకడు వట్టి హాస్యగాడు. హాస్యగాడి మాటలు లెక్క చేయవలసిన దేముంది. ఇక రెండోవాడో, మన నార్మనులను బహిరంగంగా ద్వేషిస్తున్న సాక్సన్ జాతికి చెందినవాడు. సాక్సన్ జాతివారు చాల తీవ్రప్రకృతి. తమ్ము ఓడించిన నార్మన్ల మీద కసి తీర్చుకోవాలని ఈ జాతివారు కొందరు ఎంత ఉవ్విళ్ళూరుతూ వుంటారో చాలసార్లు నీకు చెప్పానిదివరకు.'

'అయితేనేంకి ఒక్క దెబ్బతో చితకబాదిచి దారికి తెచ్చివుండేవాణ్ణి. ఇలాంటి వాళ్ళను చాలామందిని చూశా నిదివరకు. తురుష్కులంత తీవ్ర ప్రకృతులా వీళ్ళకి అయినా, వీరి నివాసంలో మీరు జాగ్రత్తగా వుండాలి. మీ రేమాత్రం సందిచ్చినా మీమీద విషప్రయోగమో, ఖడ్గప్రయోగమో చేయవచ్చు.'

'నిజమే. కాని, పాలస్తీనా పరిసితులు వేరు, ఇంగ్లాండు పరిస్థితులు వేరు. అదీగాక, వీడిమీద నీవు చేయి చేసుకొంటే ఏమయ్యేదిళ్ళి సెడ్రిక్ ఇంటికి దారి మనం వాడివల్ల రాబట్టలేకపోవడం అలా వుంచినా, మన మొగాలో అక్కడున్న చేసుకున్నప్పటికీ, అక్కడ నివాసం సెడ్రిక్ మా వంచకుమూలంగా కలహ మయ్యేమాట నిశ్చయం. నీ కిదివరకే చెప్పాను, — ధనికుడైన యీ స్వతంత్ర భూస్వామి సెడ్రిక్, చాల అభిమాని, తీవ్రప్రకృతి కలవాడు. కోపం ముక్కుమీద వుంటుంది. నార్మన్ సామంతులంటే లెక్కచెయ్యడు. తన పొరుగున వున్న మధ్యంతులను రెజినాల్డు ఫ్రాంటిబాఫ్, ఫిలిప్ మాల్వాయిసిన్ లను సైతం ధిక్కరిస్తాడు. సాక్సన్ల అధికారం స్వత్వాల కోసం కత్తితో పెనగులాడే మనిషి. పైగా తాను హెరివార్డు వంశంవాడినని గర్వంగా చెప్పుకుంటాడు. అందుకనే అతనికీ ప్రాంతంలో 'సెడ్రిక్ ది సాక్సన్' అనే పేరు వచ్చింది.'

'ప్రయర్ ఐమర్, అయితే ఒక్కమాట. సౌందర్య పరిశోధనలో మీరు చాలా ఆరితేరినవారు. ప్రేమతత్వనిర్ణయంలో మీది అందెవేసినచేయి. ఈ రొవీనా ఏపాటి సౌందర్యరాశో చూడాలి. వట్టి తిరుగుబాటుదారుగా మీరు చిత్రించిన ఆమె తండ్రి అనుగ్రహం నేను సంపాదించుకోడానికి, అహంకారం చంపుకొని

ఎంతో సహనం వహించవలసివచ్చేటట్లుంది. రెవోనా నేననుకొన్నంత సౌందర్యవతి కాకపోతే, ఈ శ్రమపడటం నావల్లకాదు, ఇప్పుడే చెపుతున్నాను.'

'రెవోనా సుందరికి సెడ్రిక్ తండ్రి కాడు. దూరపుబంధువు. ఆమె అతనికంటె గొప్పయింటిపిల్ల. సెడ్రిక్ ఆమెకు గార్డియనుగా వ్యవహరిస్తున్నాడు. రెవోనాను తనసొంతబిడ్డే అయినట్టు చూసుకొంటున్నాడు ఇక ఆమె సౌందర్యం సంగతా? నీవే చూస్తావుకదా? నిర్మల కాంతిస్నులు తొణికిసలాడించుకునే ఆ శరీర లావణ్యం, ఆ లేతనీలపు కన్నుదోయి లోతులలోంచి వెల్లువిరిసే రాచఠీవితో కూడిన అమృదుమధుర భావస్నిగ్ధత—వాటినొక్కసారి నీవు చూస్తే చాలు,—నీ స్మృతిపథంలోంచి ఆ పాలస్తీనా పసిలకుంతల అందమూ యొగిరి చక్కాపో వలసిందే! తేరియొడల నన్ని పేసుతో పిలువవద్దు.'

'పరీక్షలో ఆమె సౌందర్యం తేలిపోయేటట్లయితే, జ్ఞాపకం ఉందికదూ మనం వేసుకున్న పందెం?' అన్నాడు టెంప్లార్ బ్రియన్.

'ఓ! జ్ఞాపకం లేకేం? నేనోడిపోతే నీకు నా సువర్ణ కంఠాభరణం. నీవు ఓడిపోతే పది పీపాల కియాజ సారాయం నాకు. పందెం కొట్టేశాననే, సందేహంలేదు: మా మఠంలోని నేలమాళిగల్లో ఆ పీపాలిక భద్రపరచబడ్డట్లే లెక్క!'

'గెలుపోటముల నిర్ణయాధికారం నాదేననికూడా అనుకున్నాం. ఇంతటి [redacted]వతిని పాలస్తీనాలో నే నెచ్చటా చూచియుండలేదనేది నా ఉంతట నేనే ఒప్పుకోవాలి, తెలుసునుగదూ? మీ కంఠాభరణం మీకు దక్కేమాట ఇక అబద్ధంలెండి. రేపు ఆష్బీ పోటీల్లో అది నా కంఠసీమను అలంకరించి తీరుతుంది.'

'గెలిస్తే అలాగే తీసుకోవచ్చు గాని, నీవు మటుకు న్యాయంగా వ్యవహరించాలిసుమా! వీరుడవూ, తోటి చర్చి సంప్రదాయానికి చెందిన వాడవూ గనుక, నీ మాటమీద పూర్ణవిశ్వాసం ఉంచుతున్నాను. కానీ, జాగ్రత్త సుమా! అక్కడ నీ నాలుకను కొంచెం అదుపులో ఉంచుకోవాలి. సెడ్రిక్ తనకు ఏమాత్రం గౌరవభంగం కలిగిందని తోచినా, నీ యోధత్వాన్నీ, నా హోదానూకూడ లెక్కచెయ్యక మనల్ని ఇంటినుండి తరిమేస్తాడు. రెవోనా వంక చూచేవిషయంలోకూడా నీవు చాల జాగ్రత్తగా ఉండాలి. అతనికి ఏమాత్రం అనుమానం తగిలినా మన పని నుస్నా అవుతుంది. ఈ సౌందర్యవతిని అనురక్తుడై కన్నెత్తి చూచాడనే, తన కన్న కుమారుని సైతం ఇంటినుండి తరిమివేశాడని చెప్పుకుంటారు. వర్జిన్ మేరీమీద ఎట్టి పవిత్రభావం మనం చూపిస్తామో, దానికి భిన్నమైన భావాలతో ఆమె నెవ్వరూ తేరిచూడరాదని అతని అభిప్రాయం.'

'సరేలెండి మీరింక చెప్పనక్కరలేదు. ఈఒక్కరాత్రీ ఎలాగో బిగబట్టుకొని, కేవలం ఆడపిల్లలాగ ప్రవర్తించడానికి ప్రయత్నిస్తా' అన్నాడు టెంప్లార్. 'కాని, మీరేదో అన్నారే, మనల్ని ఆతడు బలవంతంగా తరిమేస్తాడని! అటువంటి అవమానం మనకు చెయ్యడం ఆతనికెన్నటికీ సాధ్యపడదని తెలుసుకోండి!'

'అంతదాకా మనమసలు రానివ్వకూడదు' అన్నాడు ప్రయర్. 'ఇదిగో, ఆ హాస్యగాడు చెప్పిన సిలువ,—ఇక్కడ పాతి వుంది. మనమిప్పుడు ఏరోడ్డు పట్టాలో చీకటివల్ల తెలియడం లేదు. అన్నట్టు, వాడు మనల్ని ఎడమ వైపుగా పొమ్మన్నాడు కదూ?'

'కాదు, కుడివైపుగానని నాకు గట్టిగా జ్ఞాపకం' అన్నాడు టెంప్లార్ బ్రయన్.

'కాదు, ఎడమ. తన కొయ్యకత్తితో ఎత్తిచూపించాడు కూడాను. నాకు బాగా గుర్తు.'

'నిజమే, కాని ఆ కత్తిని వాడు యెడమచేత్తో పట్టుకొని ఇలా అడ్డంగా చూపించాడు.'

ఇరువురూ 'నేనన్నదే సరియంటే నేనన్నదేసరి యని' పట్టుదలగా కొంతసేపు తకరారుపడి, తమఅనుచరులను సాక్ష్యమడిగారు. కాని, వారు తాము కొంచెం దూరంగా వున్నందువల్ల వాంబా మాటలు సరిగా వినలేదన్నారు. చివరకు బ్రియన్, 'ఇదిగో ఇక్కడ ఈ సిలువ ప్రక్కగా ఎవరో పడుకొన్నట్లున్నారే— నిద్రపోతున్నాడా, చచ్చాడా? హ్యూగో, నీ ఈటె మడమతో కదుపు వాణ్ణి' అన్నాడు.

వాడు ఆపని చెయ్యడంతోటే, ఆ వ్యక్తి లేచి, చక్కని ఫ్రెంచిభాషలో ఇలా అన్నాడు: 'అయ్యా మీరెవరో, నాకు ఇలా ధ్యానభంగం చెయ్యడం మర్యాదగా లేదు.'

'మరేం లేదు, 'సెడ్రిక్ ది సాగ్జన్' వుండే రోధరువుడ్డుకు నీవు దారి చెప్పగలవేమోనని లేపాం' అన్నాడు ప్రియర్.

'నేనూ అక్కడికే పోవాలి. మీరు నాకొక గుర్రమిస్తే దారి చూపుతాను. చాల తికమకగా వుంటుంది దారి. అయినా, నాకు బాగా తెలుసు.'

'అయితే ఇకనేం, నీకు మంచి బహుమానంకూడా ఇస్తాం, మమ్మల్ని రోధరువుడ్డుకు చేర్చావంటే,' అన్నాడు ప్రియర్. తన అనుయాయిని ఖాళీగా వెంటవస్తున్న తన గుర్రమెక్కమని, అనుయాయి యెక్కిన గుర్రాన్ని ఆ నూతన వ్యక్తి కిప్పించాడు.

కాంబా పొమ్మన్న దిక్కుకు కేవలం భిన్నమైన దిక్కుగా అతడు వీరిని తీసుకొని పోసాగాడు. ఒక చిట్టడవిలో పడి, కొన్ని కోళ్లు దాటుకుంటూ పోవలసిన ఆ దారి అతనికి సుపరిచితమైనదిగా కనుపించింది. తుదకొక విశాలమైన బయలు ప్రదేశానికి వీరి నందరినీ చేర్చి, ఎదురుగా కనిపించే ఒక పెద్ద రాతికట్టడం వంక చూపిస్తూ, 'అదిగో అదే 'సెడ్రిక్ ది సాక్సన్' ఉంటే రోధరువుడ్డు' అన్నాడా మార్గదర్శి.

ఇంత సేపూ పలురకాల భయసంశయాలతో గుంజాటన పడుతున్న ప్రయర్ ఈ మాట వినేసరికి తేరుకుని, అతని ఊరు పేరులు తెలుసుకోవాలనే కుతూహలం అప్పుడు కనబరిచాడు.

'నేనొక యాత్రికుడను, పాలస్తీనానుండి ఇదే రావడం' అన్నాడతడు.

'క్రీస్తు భగవానుని పవిత్ర సమాధికొరకు పోరాడకుండా అప్పుడే వచ్చేశావేం?' అన్నాడు టెంప్లార్.

'పూజ్యులైన యోధాగ్రేసరులు మంచి ప్రశ్న వేశారు. కాని, ఆ పవిత్ర నగర విమోచనం సాధించేవరకూ విశ్రమించబోమని ప్రమాణాలు చేసిన మహా వీరులే, తాము నిలువవలసినచోటు విడి ఇంత దూరదేశాల్లో తిరుగాడుతూ వుంటే, ఇక నాబోటి అల్పుడా వారు వదలివేసిన కార్యాన్ని సాధించగలిగేది?' అన్నాడు యాత్రికుడు. టెంప్లార్ అతనికి సుపరిచితుడైనట్లు అతని ధోరణి కనిపించింది.

టెంప్లార్ కోపంగా ఏదో జవాబివ్వబోయాడు గాని, ప్రయర్ అడ్డుపడి, యాత్రికునికి ఈ జిలుగుదారులన్నీ ఇంత కొట్టిన పిండిగా తెలిసినందుకు ఆశ్చర్యం వెలిబుచ్చాడు. 'నేను పుట్టినది ఈ ప్రాంతాలలోనే, అందుచేత నాకివన్నీ తెలుసు' అన్నాడు యాత్రికుడు.

వారిప్పుడు సెడ్రిక్ భవనం దగ్గరకు వచ్చారు. పొట్టిగా, అడ్డదిడ్డంగా నిర్మించబడిన భవనమది. లోపల పెద్ద పెద్ద మెల్లాలతో, చాల విస్తారమైన ప్రదేశాన్నది ఆక్రమించివుంది. చుట్టూ ఒక పెద్ద అగడ్త. చేరువలో ప్రవహించే ఒక వాగునుంచి దానిలోకి నీరు పట్టారు. మొనలుగా చెక్కిన కొయ్యగుంజలు దట్టంగా అగడ్త కిరువైపులా పాతివున్నాయి. అగడ్త దాటి లోపలికి రావాలంటే, పడమటివైపునఉన్న వంతెనమీదనుంచి రావాలి. దానిని కావలసినప్పుడు వేసి అక్కరలేనప్పుడు తీస్తూవుంటారు. మన ప్రయాణికులిప్పుడు లోనికి వెళ్ళాలంటే, లోపలివారు ఆ వంతెనను తెచ్చి వెయ్యాలి.

టెంప్లార్ బిగ్గరగా శృంగధ్వని చేశాడు. సరిగా ఈ సమయానికే, దిక్కులు పిక్కటిల్లే ఉరుములతోనూ, మెరుపులతోనూ, బ్రహ్మాండంగా వర్షం కురియడంకూడా ప్రారంభమైంది.

# అధ్యాయం 3

'సెడ్రిక్ ది సాక్సన్' సాయంకాలభోజనం చేయబోయే సమయమది. విపరీతమైన పొడవూ వెడల్పూ గల్గిన పెద్ద చావడి. కాని, అది ఆ పొడవు వెడల్పులకు తగినంత యెత్తు లేదు. పైన పూరికప్పు. చావడికి ఈ చివరా ఆ చివరా చలిమంటలు మండుతున్నాయి. పొగచిమ్నీలు సరియైనవి కాకపోవడం చేత, కొంత పొగ చావడిలోకి కూడ వ్యాపిస్తోంది. దూలాలకూ కడ్డీలకూ పట్టిన కరిధూపపురంగు ఈ ఎడతెగని పొగ ఫలితమే అయియుండాలి. గోడలకు కత్తులూ కటార్లూ డాళ్ళూ మొదలైన ఆయుధపరికరాలు తగిలించబడివున్నాయి. చావడి పొడవులో నాలుగోవంతు మేరకు, నేలకు ఒక అడుగెత్తున వేదిక మాదిరిగ ఎత్తు చేయబడివుంది. దానిపై అడ్డంగా ఒక పెద్ద బల్ల. ఎర్రని గుడ్డ ఒకటి దానిపై పరిచారు. గృహయజమాని సకుటుంబంగా, ముఖ్యమైన అతిథులతో సహా ఇచట భోజనం చేస్తారు. ఈ బల్లకు మధ్యనుంచి, 'T' ఆకారంలో దీనికంటె తక్కువ యెత్తులో మరొక బల్ల వుంది. ఇది నౌకర్లూ చాకర్లూ కూర్చుండి భోజనం చేసేది. పెద్దబల్ల ప్రక్కన విశాలమైన కొయ్యకుర్చీలు వున్నాయి. ఈ బల్లకూ కుర్చీలకూ పైగా ఒక చాందినీ కట్టబడి వుంది. వేదికను ఆనుకొనియున్న గోడలకు పలురకాల అల్లికపనులతో తెరగుడ్డలు వ్రేలాడుతున్నాయి. వేదికపై తివాసీ పరచబడి వుంది. దిగువన నౌకర్లు భోజనంచేసే పొడుగుబల్లవున్న ప్రదేశంలో ఇలాంటి అలంకారాలేమీ లేవు. బల్లప్రక్క కుర్చీలకు బదులుగా బెంచీలున్నాయి. బల్లపై వస్త్రాచ్ఛాదన యేమీ లేదు.

వేదికపై పెద్దబల్లప్రక్కన వేసిన కుర్చీలలో, నడుమను రెండు కుర్చీలు తక్కిన వాటికంటె ఉన్నతంగా వున్నాయి. వాటిముందర, కాళ్ళు పెట్టుకొనేందుకు, వింతనగిషీలో దంతపు పనిచేసిన కుర్చీపీటలున్నాయి. సెడ్రిక్ ఆ కుర్చీలలో ఒకదానిపై ఆసీనుడై వున్నాడు. భోజనం ఆలస్యమైందనే చికాకు అతని వదనంలో కనిపిస్తోంది. బోళా మనిషైనా, తొందరగా కోపం వచ్చే స్వభావమని అతనిని చూచి ఇట్టే చెప్పివెయ్యవచ్చు. మనిషి అంత పొడుగూ కాదు, పొట్టీ కాదు. విరివియైన వక్షస్థలం. బలిష్ఠములైన బాహువులు. వెడదయైన ముఖం. విశాలమైన నీలనేత్రాలు. మంచి పలువరుస. ఒక విధమైన గర్వరేఖ అతని నయనాల్లోంచి తొంగిచూస్తూ వుంటుంది. ఏ క్షణంలో మండిపడతాడో అన్నట్లుంటుంది అతని వైఖరి. నడినెత్తిన పాపట తీసి ఇరువంకలకూ దిగదువ్విన జుట్టు భుజాలమీదికి వ్రేలాడుతోంది. వయస్సు అరవైకి దగ్గరలో వున్నా అతని తల ఇంతలో నెరిసేటట్లు లేదు.

అతడొక ఆకుపచ్చ అంగరఖా ధరించివున్నాడు. మెడవద్దనూ మోచేతులవద్దనూ దానికి ఉన్నితో గూడిన చర్మం కుట్టబడివుంది. అంగరఖా లోపల శరీరాన్ని అంటిపెట్టుకొని సింధూర వర్ణంలో ఒక జుబ్బా, అలాంటిదే మోకాలు దిగని ఒక మట్టలాగూ ఉన్నాయి. కాళ్లకు జరీగుబ్బల ఆకుచెప్పులు. జబ్బలకు బంగారపు దండకడియాలు. కంఠాన గూడా ఒక స్వర్ణహారం. నడుమున బిగించిన పటకాలో, ఇరువైపులా వాడి గలిగి మొన దేలివున్న ఒక చిన్న చురకత్తి వేళ్లాడుతోంది. అతని కుర్చీకి వెనుక, బుటేదారీ పని చేసిన ఒక టోపీ, ఉన్నితో అంచులు కుట్టిన ఒక అంగీ వేళ్లాడుతున్నాయి. వీటి నతడు బయటికి పోయినప్పుడు ధరిస్తూ ఉంటాడు. ఒక పొడుగాటి బల్లెం కూడా కుర్చీ వెనుక ఆనించబడి వుంది. బయట తిరిగేటప్పుడు అతని కిది చేతిలో ఒక కర్రగానూ, అవసరమైతే ఒక ఆయుధంగానూ గూడ ఉపయోగపడుతూ ఉంటుంది.

యజమానినోట ఏమి యాజ్ఞ వెలువడుతుందోనని సావధానులై ఉన్నారు అచట ఉన్న పరిచారకు లందరూ. కొందరతని కుర్చీకి వెనుకగా వేదికపై నిలబడి ఉన్నారు. తక్కినవారు దూరంగా, చావడికి దిగువభాగంలో నిలబడ్డారు. వారితోపాటు పలుజాతుల వేటకుక్కలు కూడా అక్కడ ఉన్నాయి. తిండి ఎప్పుడు తిందామా అని అవికూడా చాల ఆత్రంగా కనిపెట్టుకొని ఉన్నాయి. కాని, యజమాని చికాకునవి గ్రహించినట్లున్నాయి. ఏ ఒక్కటీగూడ కిక్కురుమనడం లేదు. ఆ సమయంలో తాము ఏమాత్రం హద్దుమీరినా, యజమాని బల్లమీదవున్న బడితె తమమీద విరుచుకొని పడుతుందని వాటికి తెలుసు. సెడ్రిక్ వద్ద మరీ మచ్చికైన ఒక పెద్ద జాగిలం మాత్రం అతని కుర్చీకి ప్రక్కగా కూర్చుండి, అప్పుడప్పుడతనిని చూస్తూ తన ఉనికి నాతనికి తెలియజెప్పుకొన జూస్తోంది. కాని అతడు దానినిగూడా కసిరి కూర్చోపెట్టాడు.

అతని చికాకుకు కారణాలు చాలా ఉన్నాయి. రొవీనా ఆ సాయంకాలం అచటికి దగ్గరలో లేని ఒక చర్చికి ప్రార్థనకు వెళ్ళి, వానకు తడిసి ఇంతకుముందే ఇంటికి చేరుకుంది. పందులను కాయబోయిన గర్త్ ఇంకా తిరిగి రాలేదు. ఏమి చిక్కు వచ్చిందో! చుట్టుప్రక్కల అడవిలో దొంగల మూకలు జాస్తిగా ఉన్నాయి. ఇరుగు పొరుగున ఉన్న నార్మన్ సామంతులనుగూడా నమ్మడానికి వీలులేదు. సాగ్జన్ల ఆస్తిపాస్తులపై దురాక్రమణ చేయడమంటే ఏమాత్రమూ వెనుకాడని మనుష్యు. సాగ్జన్ భూస్వాములకు ఆ రోజుల్లో పందుల మందలే ముఖ్యమైన ఆస్తి. ఇది ఇలా ఉండగా, భోజనసమయంలో హాస్యప్రసంగాలచే తనకు వినోదం కల్పిస్తూ ఉండే వాంబా ఇంకా రాలేదనే చిరాకొకటి. వీటన్నిటికీ తోడు, ఎప్పుడో మధ్యాహ్నమనగా భోజనం చేశాడు కాను. ఆకలి మండిపోతోంది. సాయంకాలం భోజనానికి వేళ అతిక్రమించి పోయింది.

అందుచే ఏమేమో చిరాకుపడుతున్నాడు. కొంత [illegible] గొణుక్కుంటున్నాడు. కొంత బయటికి వెడలగ్రక్కుతున్నాడు. పరిచారకుడొకడు అతనిని కొంత శాంతపరచడం కోసం మధ్యమధ్య వెండిగిన్నెతో ద్రాక్షాసవం అందిస్తున్నాడు. 'రెవోనా ఇంకా రాదేం? ఎందుకింత జాగు చేస్తోంది'— అని ప్రశ్నించాడు సెడ్రిక్.

ప్రక్కనున్న ఒక పరిచారిక ఇలా జవాబు చెప్పింది—'అమ్మాయిగారు శిరోభూషణాలంకారాలు మార్చుకుంటున్నారు. మార్చుకోకుండా వచ్చి భోజనం దగ్గర కూర్చోరాదుకదాండి మరి! ఇదిగో ఇప్పుడే వస్తారు. అమ్మాయిగారంత తొందరగా దుస్తులు మార్చుకోడం మరెవ్వరికీ చేతగాదు.'

సెడ్రిక్ ఏమీ జవాబు చెప్పలేక. 'సరే కాని' మన్నట్లు నిట్టూర్చి,— 'భక్తి ఉండడం మంచిదే కాని, ఈసారి ఆమె చర్చికి వెళ్ళేటప్పుడు, ఆకాశం నిర్మలంగా వున్న సమయం చూచుకొని వెళ్ళితే బాగుంటుంది'—అంటూ, పరిచారకుని వైపు తిరిగి, తన చికాకును ఇంతకంటె స్వేచ్ఛగా వెల్లడించుకోడానికి వీలైన విషయం దొరికిందన్న సంతృప్తి చెందినవాడిలాగా, 'ఈ గర్త్ జాడ ఇంకా తెలియలేదేమిటి? మందకు ఏదో ప్రమాదం వచ్చినట్టే ఉంది. వాడు మాత్రం చాలా విశ్వాసపాత్రుడు. వాణ్ణి ఆ పని మానిపించి నావద్ద కావలివాడుగ ఉంచుకుందామనుకుంటున్నాను కూడా' అన్నాడు.

పరిచారకుడు ఆస్వాల్డు వినమ్రుడై ఇలా అన్నాడు: 'ఇప్పుడైనా ఏమంత ఆలస్యం కాలేదు దొరా! కర్ఫ్యూగంటకొట్టి ఒక గంటైనా అయివుండదు.'

కర్ఫ్యూగంటమాట జ్ఞప్తికి తెచ్చేసరికి సెడ్రిక్ మరీ వ్యాకులుడయ్యాడు. నార్మన్ విజేతల పెత్తనదారీ రోజుల్లో, సాయంకాలం సందెపడినతర్వాత కర్ఫ్యూ గంటకొట్టేసరికల్లా ఎల్లరూ దీపాలార్పేయాలి. 'కర్ఫ్యూ! ఏ అంజకాడుకు ప్రవేశపెట్టాడో ఈ కర్ఫ్యూ! వాడూ వాడి కర్ఫ్యూగూడ నాశనంకానూ! ఆర్పెయ్యాలిట దీపాలు! ఎందుకు? చీకటిలో దొంగలమూకలు విచ్చలవిడిగా సంచరించడానికి! రెజినాల్డు ఫ్రాంటిబాఫ్, ఫిలి[illegible]విన్,—ఒకరేమిటి— ఈ నార్మన్ దుండగులందరూ ఈ కర్ఫ్యూ[illegible] ప్రయోజనాలు సాధించుకొంటున్నారు. ఏ బందిపోటు[illegible] ఆకలి తీర్చడానికో [illegible] మందను కాజేసియుంటారు. విశ్వాసపాత్రుడైన నా బానిసను చంపి [illegible]ంటారు. వాంబా యెక్కడ, వాంబా! గర్త్[illegible] వెళ్ళాడని చెప్పినట్లు [illegible]దూ ఎవరో?'

ఆస్వాల్డు [illegible] జవాబిచ్చాడు.

'ఇంకేముందీ, వాణ్ణి [illegible] ఎత్తు[illegible] సేవించవలసిన దుస్థితి [illegible] పట్టు[illegible],

నేనూ ఊరుకునేది ? పగ సాధించి తీరుతాను' అంటూ సెడ్రిక్ ఉద్రిక్తుడై తన బల్లెంచేత బుచ్చుకొని, 'ఇప్పుడే వెడతాను. మహాసభ ముందు నా ఫిర్యాదు దాఖలుచేస్తాను. నాకూ మిత్రులున్నారు, అనుయాయులున్నారు. ఆ నార్మన్ దుండగుని ఎక్కటికయ్యానికి పిలుస్తాను. ఇనపకవచం, ఇనపడాలుతోనే వాడు నామీదికి రావచ్చుగాక. ఇలాంటి రక్షణలుంటేనే కాని ఆ పిరికిపందలు పోట్లాడలేరు. కాని, ఈ బల్లెంతో నేను పొడిచిన పోటు ఇలాటి డాళ్లను మూడింటిని దూసుకొని పోగలదన్న సంగతి వారెరుగరు. నేను ముసలివాణ్ణి అయిపోయానని వాళ్ళ ఉద్దేశం. మంచిదే, అలాగే అనుకోనీ ! ఒంటరివాణ్ణయినప్పటికీ నా శరీరంలో హెరివార్డు రక్తం ఇంకా ప్రవహిస్తున్నదనే సంగతి చూపిస్తాను.'

'ఒంటరివాణ్ణి' అని అనుకునేసరికి సెడ్రిక్‌కు, తన కుమారుడు జ్ఞాపకం వచ్చాడు. కంఠం రుద్ధమై, మంద్రస్వరంలో ఇలా ఆక్రోశించాడు: 'అయ్యో విల్ఫ్రెడ్ ! యెంత పని చేశావు? ఆ తగని ఉద్రేకానికి నీవు వశుడవై పోకుండా వుంటే, ఈ వృద్ధాప్యంలో నీ తండ్రి ఇలా ఒంటరివాడై పోవలసివచ్చేది కాదు గదా ! పెనుగాలి తాకుతున్న చుట్టూ రక్షణ యేమీ లేక ఒంటరిపాటున ఎదుర్గొనలేకవచ్చిన ముసలి ఓక్ చెట్టులా ఉన్నానిప్పుడు నేను.' ఉద్రేకం విచారంగా మారి, అతడు చేతనున్న బల్లెం యథాస్థానంలో వుంచుతూ కుర్చీలో కూలబడి నేలచూపు చూస్తూ అలా వుండిపోయాడు.

బయటినుండి వినవచ్చిన శృంగధ్వని సరిగ్గా ఈ సమయంలో అతనిని హఠాత్తుగా మేల్కొలిపింది. అది వినడంతోటే, చావడిలో వున్న కుక్కలన్నీ ఒక్కసారిగా 'భౌ, భౌ' మంటూ లేచాయి. వాటి నోరు మూయించడానికి సెడ్రిక్ బల్లపైనున్న బడితె కొంతపని తగలవలసివచ్చింది. నౌకర్లు కూడా కొంత శ్రమపడ్డారీ పనిలో. 'వెళ్లండి. ఎవరో కొమ్ము ఊదుతున్నారు. అది ఏమి వార్తో వినండి. నా భూములను ఏ బందిపోటుదొంగలో దోచుకొనియుంటారు. త్వరగా వెళ్ళి కనుక్కురండి' అని కేకపెట్టాడు సెడ్రిక్. మూడు నిముషాల్లో ఒకడు తిరిగి పరుగెత్తుకొనివచ్చి చెప్పాడు—'జోర్వాలక్సు మఠాధిపతి ప్రయర్ ఐమర్, టెంప్లార్ యోధవర్గానికి చెందిన బ్రయన్ డిబోయ్ గిల్బర్ట్—ఉభయులూ కొద్ది పరివారంతో ఆష్బీ పోటీ పందేలకు పోతూ, దారిలో యీ రాత్రి ఇక్కడ ఆతిథ్యం స్వీకరించి విశ్రాంతి తీసికొనగోరుతున్నారని.'

'ఎవరూ ? ప్రయర్ ఐమరూ, బ్రయన్ డిబోయ్ గిల్బర్టూనా ? ఇద్దరూ నార్మన్లే ! కానీండి ! ఎవరైనప్పటికీ ఆతిథ్యం ఇచ్చి తీరవలసిందే. ఆ విషయంలో మన రోథర్‌వుడ్డుకు మచ్చరానివ్వకుండగా. ఇక్కడ వారసలు ఆగకుండా ముందుకు సాగిపోయివుంటే నేను మరీ సంతోషించేవాణ్ణి గాని, ఇంతకూ ఆగదలచారు గనుక, మనం ఈ రాత్రి వారికి ఆతిథ్యమివ్వకపోవడం మన అంతస్థు

తగనిపని. అతిథులుగా వచ్చినప్పుడు సార్కన్లయినా తన అహంకారం అణచిపెట్టుకొని మెలగక తప్పదు' అంటూ, తన వెనుక వేత్రహస్తుడై నిలిచి యున్న ముఖ్య పరిచారకునివంక చూచి, 'హుండిబర్, నీవుపో. మరి ఆరుగురు నౌకర్లను నీవెంట తీసుకొని వెళ్ళు. ఆ వచ్చిన వారిని అతిథిశాలలో ప్రవేశపెట్టు. వాళ్ళ గుర్రాలకూ కంచర గాడిదలకూ మేత వగైరాలు వేయించు. వాళ్ళకు నీళ్ళే కావాలో నిప్పే కావాలో చూడు. ఏ లోపమూ రానివ్వకు. క్రొత్త వంటకాలేమైనా త్వరగా చేయగలిగినవి వుంటే చేయండని వంటవాళ్ళకు పురమాయించు. అతిథులు సిద్ధమై వచ్చేవేళకు అంతా తయారుగా వుండాలి. వెళ్లు. కాని, ఆ అతిథులతో ఒకమాట చెప్పు— సెడ్రిక్ వారికి స్వాగతం చెప్పడానికి సిద్ధంగానే వున్నాడుగాని అతనికొక నియమం వున్నదని చెప్పు. సాగ్జన్ రాజవంశానికి చెందని ఏ అతిథులను తన చావిడిలో కలుసుకోవలసివున్నా, సెడ్రిక్ తన వేదికదిగి ఒక మూడడుగులు మాత్రమే ముందుకు వస్తాడు. ఆపైన ఒక్క అడుగైనా ముందుకు వెయ్యడం అతని నియమానికి విరుద్ధమని చెప్పు. పో! వాళ్లకు కావలసిన సదుపాయాలన్నీ చూడు. పేదతనమూ పీనాసితనమూ బైటపెట్టుకొన్న పిసినిగొట్టు సాగ్జన్ విడనేమాట ఆ దురహంకారులనుకునేటట్లు చెయ్యకు.'

హుండిబర్ట్ అలాగే కొంతమంది పరిచారకులను వెంటదీసికొని వెళ్ళినతరువాత, సెడ్రిక్ ఆస్వాల్డువంక చూస్తూ అన్నాడు: 'ప్రయర్ ఐమరంటే,— ఇప్పుడు మిడిల్‌హాం ప్రభువుగా చలామణి అవుతున్న గైల్సు డీ మాలివరర్‌కు సోదరుడవుతాడు కాదూ?'

అవునన్నట్లు ఆస్వాల్డు తల ఊపాడు. 'సాగ్జన్ యొస్టేటును కాజేసిన ధూర్తు డీ గైల్సు. వాడే ఒక్కడే వేలెత్తి చూపవలసిన పనిలేదులే! ప్రతి నార్మను ప్రభువూ చేసిన పనే ఇది. ఈ ప్రయర్ ఐమర్‌కు మద్యపానం మీదా మృగయావినోదంమీదా ఉన్నంత మక్కువ మతవిధులమీద లేదని వింటాను. మంచిది,—కానీ, మనం ఆతిథ్యమివ్వడానికి అభ్యంతరమేమీ లేదు. అయితే, ఆ టెంప్లార్ పేరు ఏమని చెప్పావు?'

'బ్రియన్ డీ బోయ్ గిల్బర్ట్'

'బోయ్‌గిల్బర్టు బాగా గణుతికెక్కిన పేరే. మంచీ చెప్పుకుంటారు, చెడ్డా చెప్పుకుంటారతన్ని గూర్చి. టెంప్లార్ వ్యవస్థలోగల యోధులందరిలోకీ వీరాధివీరుడట. కాని, సామాన్యంగా వారందరిలో ఉండే దుర్గుణాలే ఇతనిలోనూ వున్నాయట— గర్వం, దురహంకారం, క్రూరత్వం, కామలోలుపత్వం! లోకంలో ఎవ్వరినీ లెక్కచెయ్యడట! దైవభక్తి అసలే శూన్యమట! పాలస్తీనానుండి వచ్చిన యోధులు కొందరు చెప్పినసంగతులివి. కానీలే, ఒక్కరాత్రికేగా! కానీ కానా

మాగిన ద్రాక్షరసం పీపా ఊడదీయించు. మంచిమంచి షర్బత్తులూ, సారాలూ పెద్ద పెద్ద కొమ్ముగిన్నెల్లో నింపించు. టెంప్లార్లకూ ప్రయర్లకూ మంచిమంచి ఆసవారిష్టమంటే విపరీతమైన ఇష్టమంటారు. ఎల్గిత్తా, నీవుపోయి, రెవీనాతో చెప్పు—తనకు ప్రత్యేకంగా రావాలని కోరిక వుంటేతప్ప, ఈ రాత్రి మా అందరితో కలసి భోజనం చేయడానికి ఆమె ఇక్కడికి రానక్కరలేదు.'

ఎల్గిత్తా వెంటనే ఇలా అన్నది: 'అమ్మాయిగారికి తప్పకుండా రావాలని వుంటుంది దొరా. పాలస్తీనానుండి తాజా వార్తలు వినడానికి ఆమె యెప్పుడూ చెవికోసుకొంటారు.'

సెడ్రిక్ నిరసనపూర్వకంగా ఆమెవంక చూశాడు. కాని, రెవీనామీద గాని ఆమెకు సంబంధించిన వారిమీద గాని అతను కోపం ప్రకటించడం యెన్నడూ వుండదు. అందుచేత, అతను ఎల్గిత్తాతో ఈమాత్రం అనగలిగాడు: 'మాట్లాడకుండా నేను చెప్పినదేమిటో చెయ్యి పిల్లా, తెలిసీ తెలియని మాటలెందుకు నీకు? నేనన్నది మీ అమ్మాయిగారితో చెప్పు. ఆమె ఇష్టంవచ్చినట్టు చేస్తుంది.' ఎల్గిత్తా మెదలకుండా వెళ్ళిపోయింది.

'పాలస్తీనా వార్తలు! యెన్ని చెవులు ఆత్రపడుతున్నాయీ ఈ వార్తలు వినడానికి! ఆ ధర్మయుద్ధంలో పోరాడిన సైనికులమనీ, ఆ పుణ్యక్షేత్రానికిపోయి వచ్చిన యాత్రికులమనీ, ఎవరు ఏ కల్లబొల్లి కబుర్లు చెప్పినా, వినడానికి వేడుకపడుతున్నారు జనం. మన ఆతిథ్యం పొందడంకోసం మాయమాటలు చెప్పే యీ కపట యాత్రికులను గుచ్చి గుచ్చి అడుగుతూ, వారల్లే కట్టుకథలు వినడానికి నేనుకూడా కుతూహలపడి యుండేవాడినే. కాని, నన్ను ధిక్కరించిపోయిన కొడుకు ఇక నా కొడుకు కాదు. మతంపేరున అనేక క్రూరకృత్యాలకు ఒడిగట్టి, యథేచ్ఛావిహారం సల్పి, అదే ఈశ్వరేచ్ఛను నెరవేర్చడంగా చెప్పుకుంటూ తిరిగే లక్షోపలక్షల జనంలో ఏ అనామకునికోసమైనా నేను ఆదుర్దా చెందుతున్నానా? వాళ్ళతోపాటే వీడూనూ!'

కనుబొమలు ముడిపెట్టి, ఇంచుక సేపు నేలపై దృష్టి నిగుడించాడు సెడ్రిక్. మెల్లిగా తలపైకెత్తి చూచేసరికి, ఎదుటనున్న ద్వారబంధం తలుపులు బార్లా తెరువబడ్డాయి. వేత్రహస్తుడు ముందు నడువగా, మరి నలుగురు పరిచారకులు కాగడాలు పట్టి దారి చూపగా, అతిథిబృందం లోనికి ప్రవేశించింది.

# అధ్యాయం ౪

ప్రయాణపు దుస్తులు మార్చుకోడానికి లభించిన అవకాశం జారవిడువక, ప్రియర్ ఐమర్ ఇదివరకటికంటె విలువైన దుస్తులతో తయారయ్యాడు. వింత వింత అల్లికపనులు చేసిన అంగీ తొడిగాడు. తన మతసంబంధమైన హోదాను సూచించే బంగారపు ముద్దుటుంగరానికి తోడు, మతవిధులకు విరుద్ధంగా, తక్కిన వేళ్లకు కూడ, ధగధగలాడే రత్నాంగుళీయకాలు ధరించాడు. కాళ్ళకు ప్రశస్తమైన స్పానిష్ లెదరు చెప్పులు. మతవిధులకు విరుద్ధం కాకుండేటట్లు, వీలైనంత కురుచగా కత్తిరించబడిన గడ్డం, నున్నని తలపైన జరీ బుటేదారీ పనిచేసిన ఎర్రని పట్టుటోపీ.

టెంప్లార్ బ్రయన్ వేషం కూడా మారింది. దుస్తులపై వింత అల్లికపను అంతగా లేవుగాని, అవి కూడ అంత విలువైనవే. అంతకంటె కొట్టొచ్చినట్లుగా ఉన్నాయి కూడ. లోపల తొడిగిన లోహపుటుంగరాల చొక్కాకు బదులుగా, ఎరుపు, నీలం కలిసిన పట్టుచొక్కా వేసి, పైన సొగసైన మడుతలతో క్రిందికి జీరాడే స్వచ్ఛమైన తెల్లని అంగీ ధరించాడు. అంగీకి భుజంమీద నల్లని ముఖమల్‌తో క్రాసుగుర్తు వేయబడివుంది. వెనుకటి కుచ్చుటోపీ ఇప్పుడు లేదు, జీడినలుపు ఉంగరాలజుట్టు బుజాలమీదికి ఒత్తుగా వ్రేలాడుతోంది. ముఖంకూడ నల్లన. నిరంకుశత్వానికి అలవాటుపడిన ఒకవిధమైన అహంకారం అతని నడకలోనూ, వైఖరిలోనూ ఉట్టిపడుతోంది. అదే లేకపోతే, నిజంగా అతనిలో చక్కని ఠీవి ఉన్నదనే చెప్పాలి.

ఈ ప్రముఖులిద్దరినీ అనుసరించి వారి వారి అనుచరులు లోనికి వచ్చారు. అందరికంటె వెనుకగా, అల్లంతదూరాన, వీరికి త్రోవచూపిన యాత్రికుడు వచ్చాడు. ఆ రోజుల్లో యాత్రికులు సామాన్యంగా ధరించే దుస్తులే ధరించి ఉన్నాడు. ఉన్నితో నేయబడిన నల్లని ముతక అంగీ నిలువుగా వ్రేలాడుతోంది. కాళ్ళకు, వారులు వేసి బిగించిన మోటురకం అరు చెప్పులు. తలపైన, ముఖం మీదికి నీడలు ప్రసరించే వెడల్పైన హాటు. ఒకరకం గవ్వలు ఆ హాటుకు చుట్టూ అంచున కుట్టి ఉన్నాయి. చేతిలో ఇనపపొన్ను వేసిన పొడుగాటి కర్ర ఉంది. పాలస్తీనా యాత్రికుడని తెలిసేటట్లు, కర్రకు ఖర్జూరమండ ఒకటి కట్టబడి ఉంది. మిక్కిలి వినయంతో అతడు అందరికంటె వెనుకగా లోనికి ప్రవేశించి, నౌకర్లు భోజనంచేసే బల్లవద్ద గృహయజమానియొక్క

నౌకర్లకూ, కొత్తగా వచ్చిన అతిథుల అనుచరులకూ సరిపడగా తనకు చోటు మిగిలేటట్లుగ లేదని గ్రహించి, దూరంగా చలిమంటకు చేరువను వేసియున్న బెంచి కడకుపోయి, అచట తన ఉడుపుల అరబెట్టుకునే పనిలో నిమగ్నమై ఉన్నట్లు కనిపించాడు.

అతిథులకు స్వాగతం చెప్పడానికై సెడ్రిక్ ఒక విశేషమైన రీతితో లేచి, వేదిక దిగుతూ వారి వైపునకు మూడడుగులు మాత్రం వేసి నిలబడ్డాడు. 'రెవరెండు ప్రియర్ నన్ను మన్నించాలి. ఈ నా పితృగృహంలో మీవంటి అతిథిశ్రేష్ఠులకు స్వాగతం చెప్పవలెనని వచ్చేటప్పుడైనా, ఇంతకంటె ముందుకు రాకూడదనే నియమానికి నేనిప్పుడు బద్ధుడనై ఉన్నాను. బయటికి అమర్యాదగా కనుపించే ఈ నా ప్రవర్తనకు కారణం మా నౌకరు మీకు వివరించే ఉన్నాడు. ఇంకొక సంగతికూడ మీకు విన్నవిస్తున్నాను. నేను మా సాక్సన్ భాషలో తప్ప మాట్లాడను. చేతనైతే మీరు కూడా సాక్సన్‌లోనే జవాబివ్వండి. లేదా, మీరు నార్మన్ మాట్లాడినప్పటికీ మీ భాష నేను అర్థంచేసుకోగలను.'

సెడ్రిక్ ఈ విధంగా మాట్లాడేసరికి, ప్రియర్ వెంటనే ఇలా అందుకున్నాడు: 'ఈ విషయంలో మీరేం సంకోచింప వలసిన పనిలేదు. నియమాలు అవశ్యం పాటించదగినవి. వాటిని ఉల్లంఘించరాదు. అవి భగవంతుడితో మనకు అనుబంధం సంపాదించే ధర్మశాస్త్రాలు. కనుకనే, నేనదివరలో చెప్పినట్లు, మన చర్చిమాత్రం ప్రత్యేకంగా వలదని నిషేధించిన సందర్భాల్లో తప్ప, ప్రతి నియమాన్ని విధిగా పాటించి తీరవలసినదే. ఇక భాష సంగతి అంటారా? పూజ్యురాలైన మా అమ్మమ్మ మాట్లాడిన భాష సాక్సనే! ఆ భాషలో మాట్లాడడం నాకూ పరమసంతోషం.'

గృహయజమానికి మనస్సమాధానం కలిగించే ఉద్దేశ్యంతో ప్రియర్ ఇలా ఉపన్యసించి ముగించినంతలోనే, టెంప్లార్ బ్రియన్ కట్టెవిరుపుగా ఇలా అన్నాడు: 'నా మట్టుకు నేనెప్పుడూ రిచర్డు రాజూ, ఆయన సామంతులూ మాట్లాడే నార్మన్-ఫ్రెంచి తప్ప ఇంకేదీ మాట్లాడను. అయితే, దేశీయులు మాట్లాడే సాక్సన్ ఇంగ్లీషును అర్థం చేసుకోగలనులెండి.'

ఈ ప్రస్తావన సాక్సన్ జాతికీ నార్మన్ జాతికీగల స్పర్థను పుండరించినట్లయి, టెంప్లార్ వంక సెడ్రిక్ చురచుర చూచాడు. కాని, ఇంతలో, అతిథుల యెడ తాను చూపవలసిన గృహస్థధర్మం జ్ఞప్తికివచ్చి, ఉద్రేక మణచుకొని, చేసన్నతో వారిని తోడ్కొని పోయి, వేదికపై తన ప్రక్కన తన కుర్చీకంటె కొంచెం క్రిందుగా ఉన్న కుర్చీలలో కూర్చుండ జేసి, ఇక భోజనం తీసుకొని రావలసిందని పరిచారకుల కాజ్ఞ యిచ్చాడు.

పరిచారకులు ఈ పనిమీద వున్న సమయంలో, చావడిలోకి అప్పుడే ప్రవేశించిన గర్త్, వాంబాలు సెడ్రిక్ కంటబడ్డారు. వెంటనే అతడు— 'ఏదీ, ఆ దొంగవెధవల్ని నాదగ్గరకిట్లా రమ్మను' అని అరిచాడు. ఇద్దరూ వేదిక దగ్గరకు వచ్చారు. 'దొంగవెధవల్లారా, ఇంతసేపటిదాకా ఏం చేస్తున్నార్రా మీరు? ఏరా గర్త్, మందను తిన్నగా ఇంటికి తీసుకొచ్చావా, లేక, ఏ దొంగలకైనా అప్పగించావా?'

'లేదు దొరా, మంద భద్రంగానే ఉంది' అన్నాడు గర్త్.

'అయితే ఇంత తడవు చెయ్యాల్సిన రోగమేం వచ్చింది? రెండు గంటల సేపు నేనేవో ఆపదలు శంకిస్తూ, నా ఇరుగుపొరుగుమీద వారు చెయ్యని నేరాలకు పగతీర్చుకోడమెట్లాగా అని మథనపడుతూ గడపాల్సివలసి రావడమా? ఇదిగో చెపుతున్నాను, మళ్ళీ ఈ మాదిరిగా చేస్తే ఈసారి మీకు బందకొయ్యలు తప్పవు. జాగ్రత్త!'

యజమాని కోపస్వభావం ఎరిగిన గర్త్, మారు మాట్లాడలేదు. కాని, హాస్యగాడైన వాంబా, వృత్తిధర్మరీత్యా తనకున్న విశేషాధికారాన్ని బట్టి, తమ యిద్దరి తరఫునా ఇలా సమాధాన మిచ్చాడు: 'క్షమించాలి బాబాయిగారు, తమరీవేళ బొత్తిగా న్యాయమూ, సబబూ, రెండూ కూడా విసర్జించినట్లున్నారు.'

'ఎట్లాగెట్లా? నీ హాస్యం హద్దుమీరుతోంది సుమా, నీకేమైనా శాస్తి జరగాలా ఏమిటి?' అన్నాడు సెడ్రిక్.

వాంబా ఇలా అడిగాడు—'తమరు ముందు ఒక సంగతి సెలవియ్యాలి—తప్పుచేసిన దొకరైతే వేరొకరిని దండించడం న్యాయమేనా? సబబేనా? చెప్పండి.'

'ఎంతమాత్రమూ కాదు. అది నిశ్చయమే. అయితే ఇప్పుడేమైనట్లురా ఫూల్!' అన్నాడు సెడ్రిక్.

'అయితే బాబాయిగారూ, కుక్కవలన జరిగిన తప్పుకు గర్తును శిక్షించడం ఏమి న్యాయం? మందను ఎంతసేపటికీ ఫాంగ్సు మళ్ళవేసుకు రాలేకపోయె! మళ్లేసిన తర్వాత తోవలో ఒక్క క్షణం కూడా మేము జాగుచేయలేదని ఒట్టువేసి చెప్పగలను.'

'అయితే ఫాంగ్సును ఉరితీసిపారెయ్యండి' అంటూ సెడ్రిక్, గర్త్ వంక తిరిగి, 'తప్పు ఫాంగ్సుదైతే, ఇక నీవు ఇంకో కుక్కను పెట్టుకోవాలి' అని హెచ్చరించాడు.

'బాబాయిగారికి మరొక్క మనవి' అని అడ్డం వచ్చాడు వాంబా. 'తప్పు ఫాంగ్సుది మాత్రం ఎలా అవుతుంది? అది కుంటిది మందను మళ్ళించలేకపోవడం దాని తప్పా? దాని ముంగాళ్ల పంజాలు తెగగోసినవాళ్లది తప్పు. అది వాళ్లు ఫాంగ్సుతో సంప్రతించి దాని ఇష్టంమీద చేసిన పని కాదు.'

'అయితే ఎవరు నా బానిసకు చెందిన కుక్కను ఇలా కుంటిదాన్నిగా చేయ సాహసించినది?' అన్నాడు సెడ్రిక్ ఉగ్రుడై.

'ఎవరో కాదు, ఫిలిప్ డీ మాల్వాయిసిన్ అనుచరుడు హ్యూబర్టు. తన యజమానికి గల హక్కుకు భంగకరంగా ఫాంగ్సు జింకను తరిమినదట, అందుకని అడవిలో తిరుగాడుతూండగా పట్టుకొని ముంగాళ్ళ పంజాలు కోసివేశాడు.'

'ఎంత దుస్సాహసం! ఫారెస్టు ఛార్టరు ప్రకారం ఈ అడవిలో మాకు స్వేచ్ఛ ఉన్నదనే సంగతి వీళ్ళ నసాళం ఎక్కేటట్లు చేస్తాను. సరే, మీరు వెళ్ళి కూర్చోండి. ఇదిగో గర్త్, నీవు ఇంకో కుక్కను తీసుకుపో. ఈసారి వాడు దానిమీద చెయ్యివేస్తే నా తడాఖా ఏమిటో తెలుస్తుంది. వాడి కుడిచేతి వేళ్ళు చెండిపారెయ్యకపోతే నా పేరు సెడ్రిక్ కాదు. అతిథులు నన్ను మన్నించాలి. ఇక్కడ చుట్టూ మాకున్న హంసాయీలు ఎలాంటివాళ్ళనుకున్నారు? మీ పాలస్తీనా తురుష్కుల కేమాత్రం తీసిపోరు టెంప్లార్ బ్రియన్! సరే, ఆలస్యమౌతోందిక, భోజనం కానివ్వండి. ప్రయాణంవల్ల చాలా బడలి ఉంటారు.'

బల్లమీద ప్లేట్లపై, పలురకాల మాంసాలు, రొట్టెలూ, మురబ్బాలూ అమర్చబడి ఉన్నాయి. ముఖ్యులైనవారికి ప్రతి ఒక్కరికీ ప్రక్కన ఒక వెండి గిన్నె ఉంది. తక్కినవారి ప్రక్కన కొమ్ము గిన్నె లుంచారు. భోజనానికి ఇక ఉపక్రమించబోతారనగా, ప్రధాన పరిచారకుడు హఠాత్తుగా తన అధికారదండం పైకెత్తి, ఉచ్చైస్స్వరంతో కేకపెట్టాడు. 'ఆగండి. రొవెనా దొరసానిగారు విజయం చేస్తున్నారు.'

వెనుకవైపున ఒక తలుపు తెరవబడి, నలుగురు పరిచారికలతో రొవెనా సుందరి లోనికి ప్రవేశించింది. సెడ్రిక్ ఆమె రాకకు ఇంచుక లోలోపల కలవరపడినా, వెంటనే లేచి, ఆమెకెదురేగి, సముచిత గౌరవంతో తన కుడిచేతి ప్రక్కనున్న ఉన్నతాసనం సమీపానికి తోడ్కొని తెచ్చాడు. అందరూ గౌరవసూచకంగా లేచి నిలబడ్డారు. ఆమె వారికి సవినయంగా అభివాదం చేసి, విలాసగమనంతో, బల్లవద్ద తాను కూర్చోవలసినచోటికి చేరింది. ఇంతలోనే టెంప్లార్, ప్రియర్ చెవిలో మెల్లగా ఊదాడు: 'మీ సువర్ణ కంఠాభరణం నాకు దక్కే యోగ్యతలేదు. మీరు కొట్టేశారు చియాన్ సారాపీపాలు.'

'మరేమిటనుకున్నావ్, నేను ముందే చెప్పానుగదా! కాని, కొంచెం తమాయించుకో నీ ఆనంద పారవశ్యం. సెడ్రిక్ కంటబడేను!'

టెంప్లార్ బ్రియన్ ఈ హెచ్చరిక లెక్కచెయ్యలేదు. మొదటినుంచీ తనకు ఎలా అనిపిస్తే అలా వ్యవహరించడమే అతని కలవాటు. అందుచే, ఆ సాక్సన్ సుందరివంక తదేక దృష్టితో చూడడం మొదలుపెట్టాడు. పాలస్తీనాలో తానిదివరకు చూచిన తురుష్క సుందరులకంటె కేవలం విలక్షణంగా ఆమె అతని కంటికి కనుపించింది.

రొవెనా మంచి పొడగరి. అయితే, ఆ పొడగరితనం, కొట్టవచ్చినట్లు కనుపించే పొడగరితనం కాదు. సమవిభక్తమైన అంగప్రత్యంగసౌష్ఠవ మామెది. స్వచ్ఛమైన తెల్లని శరీరచ్ఛాయ. అయితే, తెల్లని మైచాయగల రమణులు కొందరు కంటికి పేలవంగా కనిపించడం కద్దు. రొవెనా సౌందర్యంలో ఆ దోషం లేదు. ఆభిజాత్యం సూచించే ఆ ముఖకవళికల్లో ఒకవిధమైన మోహనత్వముంది. ఫాలతలానికి సొగసులు దిద్దుతూ కమానాకారంగా వంపులు తిరిగిన కనుబొమలు. ఆ కనుబొమల క్రింద, నిర్మల నీలమణిద్యుతులను వెలార్చుతూనే కన్నుగవ, ఆ కంటిపాపలు ఎదిరిని శాసించనూగలవు, బ్రతిమాలుకోనూగలవు; జ్వలింపజేయనూగలవు, కరిగించివేయనూగలవు. నిగనిగలాడే గోధుమవన్నె తలకట్టు, సహజంగానే ఉంగరాలు తిరిగేదై, కళాకౌశలం పెంపున మరింత సొగసుగా తీర్చి దిద్దబడి వుంది. కురులయందంతటా రత్నాలు పొదగబడి ధగధగ మెరుస్తున్నాయి. మెడను ఒక చిన్న పతకంతో బంగారు గొలుసు వ్రేలాడుతోంది. చేతులకు కూడా బంగారు కంకణాలు. లోపల ఆకాశమబ్బు గౌను తొడిగి, దానిపైన, వదులుగా కాలివరకూ జీరాడే కెంపువన్నె ఉన్నిపాకటి ధరించింది. దానికి పైన, మేలిముసుగుగా ఉపయోగపడగల సన్నని జరీగీరల పట్టు ఉత్తరీయం.

నిప్పుకణికలలాగ మెరిసేకండ్లతో టెంప్లార్ తనవంక తదేకదీక్షతో తమకంగా చూస్తున్న సంగతి గమనించగానే, రొవెనా తన అసమ్మతి సూచిస్తూ ఠీవితో తన మేలిముసుగును ముఖంమీదికి లాక్కుంది.

సెడ్రిక్ ఇది చూచాడు. కారణం గూడ గ్రహించాడు. 'సర్ బ్రయన్, మా సాక్సన్ కన్నెలు ఎండకన్నెరుగనివారు. మీవంటి యోధుల తదేకదృష్టి పాతానికి తట్టుకోగలిగినవారు కాదు'—అని గట్టిగా మందలించాడు.

'నేను తప్పుచేసినట్లయితే, మిమ్మ క్షమాపణ వేడుకొంటున్నాను.— అనగా లేడీ రొవెనాను క్షమాపణ వేడుకొంటున్నాను. ఇది నా వినయానికి అవధి' అన్నాడు సర్ బ్రియన్.

'నా మిత్రుని సాహసానికి దండన విధించడంలో లేడీ రొవీనా మా కందరికీ కూడా దండన విధించింది. కాని, రేపు అస్త్ర పోటీల సందర్భంలో, అచటికి చేరే జనప్రవాహం యెడల కూడా ఆమె ఇంతటి కాఠిన్యమే వహించకుండు గాక యని కోరుతున్నాను'—అన్నాడు ప్రియర్ ఐమర్.

'మేమక్కడకి వెళ్ళేదీ లేందీ ఇంకా నిశ్చయం కాలేదు- ఆడంబరం నాకు గిట్టదు. ఇంగ్లాండు స్వతంత్రంగా వున్న కాలంలో మా పూర్వీకులు ఇలాంటి వేమీ యెరగరు' అన్నాడు సెడ్రిక్.

'మేము వెళ్ళేది అక్కడికే గనుక, మాతో పాటు మీరు కూడా బయలు దేరితే యెంతైనా బాగుంటుంది. త్రోవలో ఎట్టి ప్రమాదాన్నీ శంకించ నవసరంలేదు—సర్ బ్రయాన్ వంటి యోధాగ్రేసరుడు మన వెంట వస్తూవుంటే, మనకేం భయం?' అన్నాడు ప్రియర్.

'అలాంటి భయం నాకేమీ లేదండి. ఈ దేశంలో నేనెప్పుడు ఎక్కడ తిరిగినా, నా ఖడ్గమూ, నా విశ్వాసపాత్రులైన అనుచరులే తోడుగా తిరిగాను, ఇతరుల సాహాయ్యం యెన్నడూ అపేక్షించలేదు. ఇప్పుడైనా, అస్త్ర పోటీలకు వెళ్ళదలుచుకొంటే, మా జాతీయుడైన కోనింగ్స్‌బర్గు అధిపతి ఎథెల్‌స్టేను తో వస్తాను. మీ సౌజన్యానికి మాత్రం నా ధన్యవాదాలు. ఇదిగో, ఈ ద్రాక్షాసవం చూచారా? ఇది మీకు బాగా రుచిస్తుందని నా నమ్మకం. మీకు శుభం ఆశిస్తూ ఈ ద్రాక్షాసవం ఇదిగో సేవిస్తున్నాను. మీరిది సేవించడం మీ మత నియమాలకు విరుద్ధమైతే, అదిగో ఆ పాలతో తయారుచేసిన మధువునే సేవించవచ్చు. నాకు మరియాద చెయ్యడంకోసమని మొహమాటపడి బాధపడకండి'

సెడ్రిక్ పలికిన యీ పలుకులకు ప్రయర్ పకపక నవ్వుతూ, 'లేదు, లేదు. మాకేం బాధలేదు. మఠంలో వున్నప్పుడు మాత్రమే పాలతో తయారుచేసిన మధువు తప్ప ఇతరం సేవించరాదనే నియమాన్ని మేము పాటిస్తూవుంటాము. లోకంలో వ్యవహరించేటప్పుడు లోకవ్యవహారానుగుణంగానే పోతూవుంటాము. కనుక, ఈ ద్రాక్షాసవమే నేను అవశ్యం సేవించతగింది,—ఇదిగో సేవిస్తున్నాను. సెడ్రిక్ ది సాగ్జన్‌కు శుభమగుగాక!'

'రొవీనా సుందరికి శుభమగుగాక! ఆమె పేరట ఈ ద్రాక్షాసవం నేను సేవిస్తున్నాను' అంటూ టెంప్లార్ బ్రయన్ తన మధుపాత్రను నింపుకొని త్రాగుతూ ఇలా ఉటంకించాడు: 'పూర్వం ఒక రొవీనా సుందరి ఉండేదని ఇతిహాసం చెపుతోంది. ఆమె యెలా ఉండేదో మనకు తెలియదు. ఆమెకోసమై వార్టిజర్న్ అనే ఆతడు తన గౌరవాన్నీ, తన రాజ్యాన్నీ గూడ భగ్నం చేసుకున్నాడని చెపుతారు. ఆ రొవీనాకు యీ రొవీనాకున్న అందచందాల్లో సగం ఉన్నప్పటికీ, వార్టిజర్న్ పడ్డ భావోద్వేగం నేను మన్నిస్తాను.'

రొవెనా తన మేలిముసుగు తీయకుండానే గరువతనం ఉట్టిపడేటట్టు ఇలా అంది: 'సర్ బ్రియన్, నాపై మీరు అంతచేటు మర్యాద చూపనక్కర్లేదు. పాలస్తీనానుంచి వచ్చారు కనుకనే రాజావార్త లేమైనా వుంటే చెప్పండి. మీ ఫ్రెంచి సంప్రదాయం ప్రకారం మీరు చేసే పొగడ్తలకంటె, ఆ వార్తలు మా ఇంగ్లీషుచెవులకు యెక్కువ వినసొంపుగా వుంటాయి.'

సర్ బ్రయర్ ముక్తసరిగా మాత్రమే జవాబుచెప్పాడు: 'అంత ముఖ్యమైన వార్తలేమీ లేవు సుందరీ, సుల్తాన్ సాలాదీన్‌తో సంధి జరిగినట్లు మాత్రం ఖాయంగా తెలుస్తోంది. అంతే.'

ఈ సమయంలో వాంబా కల్పించుకొని ఒకమాట విసిరాడు. సెడ్రిక్‌కు వెనుకగా ఒక గాడిదచెవుల కుర్చీ వుంది. హాస్యగాడైన వాంబాకోసం ప్రత్యేకించబడిన కుర్చీ అది. భోజన సమయంలో సెడ్రిక్ తనకు అక్కరలేని భోజన పదార్థాలను తన వెనుకనున్న వాంబాకు అందజేస్తూవుంటాడు. వాంబా వాటిని అందుకొని, తాను తినేవి తింటూ, తన చుట్టూవున్న కుక్కలకు వేస్తూవుంటాడు. ఇది అక్కడ ఆచారం. వాంబా ఆ కుర్చీలో వికటంగా ముఖం పెట్టి, కన్నులరమోడ్చి, తనకేమీ పట్టనివాడిలాగ కూర్చున్నాడు. కాని, సమస్తమూ సావధానంగా కనిపెడుతూ, తన వృత్తిధర్మానుసారం హాస్యమాడి అందరికీ వినోదం కల్పించే అవకాశం ఎప్పుడు దొరుకుతుందా అని ఎదురుచూస్తూనే వున్నాడు.

'ఈ తురుష్కులతోటి సంధులు నన్ను ముసలివాణ్ణి చేసివేస్తున్నాయి' అని అతడు ఒకముక్క విసిరాడు.

'ఎట్లాగో నీ భావం తెలియజెప్పు' అన్నాడు సెడ్రిక్. వాంబా నోటివెంట యెటువంటి హాస్యపుమాట వెలువడుతుందో వినాలనే కుతూహలం అతని వదనంలో ద్యోతకమయింది.

వాంబా ఇలా సమాధానం చెప్పాడు: 'ఇప్పటికి నా హయాములో మూడు సంధులు జరిగినట్లు విన్నాను. ఒక్కొక్క సంధి యాభైయేళ్ళవరకూ నిలుస్తుందన్నారు. ఆ లెక్కన, నాకిప్పుడు కనీసం నూటయాభై యేళ్ళయినా ఉండి తీరాలి!'

అడవిలో తమకు తప్పుదారి చూపించిన మిత్రుడితడే యని సర్ బ్రయన్ గుర్తించాడు. 'యెన్ని యేళ్ళయినా ఉండనీ, ముసలితనంవల్ల చావుమాత్రం నీకు రాదని నేను గట్టిగా హామీ ఇవ్వగలను. ప్రయర్‌కూ నాకూ ఇందాక తప్పుడుత్రోవ చూపించినట్టుగానే ఇకముందు కూడ బాటసారులకు తప్పుడుత్రోవ చూపిస్తే, బలవన్మరణ ప్రాప్తి కలుగవలసిందే తప్ప, ఇంకేవిధమైన మరణమూ నీకు రాదు, నాదీ పూచీ' అన్నాడతడు.

'ఆఁ, ఏమిటీ, బాటసారులకు తప్పుడు త్రోవ చూపించడమా! కొరడాతో కొట్టించాలి నిన్ను! నీలక్షణం చూడగా, నీ వెంత హాస్యగాడివో, అంత దొంగ వెధవ్వికూడా అని తోస్తోంది' అన్నాడు సెడ్రిక్.

'బాబాయిగారు నా మనవి చిత్తగించాలి. పొరపాటున ఏది కుడిచెయ్యో ఏది యెడంచెయ్యో మరచిపోయి ఆ తప్పు చేశాను. నా మాట అలావుంచండి. నావంటి ఫూలును దారి అడిగినవాని తప్పు యెంతటిదంటారు?'

ప్రసంగానికి యిక్కడ అంతరాయం కలిగింది. గేటుకాపలాదారొకడు చావడిలోనికి వచ్చి, యెవరో అపరిచితుడు అతిథ్యమర్థిస్తున్నాడని చెప్పాడు.

'లోపలికి రమ్మను. అతడెవరైనా కానీ. ప్రకృతి చాల భయంకరంగా గర్జిస్తోంది. ఇట్టి కాళరాత్రియందు వన్యమృగాలుసైతం మృత్యుభీతిచే తల్లడిల్లి, తమకు ఘోరశత్రువైన మానవుని ఆశ్రయం కోరితే ఆశ్చర్యపడవలసిన పనిలేదు. ఆ అతిథికి అన్ని సదుపాయాలూ చేసి తీరవలసిందే! అస్వాల్డ్, నీవు వెళ్లి ఆ పని చూడు,' అన్నాడు సెడ్రిక్.

యజమాని ఆజ్ఞాపాలన చెయ్యడానికై అస్వాల్డు బయటికి నిర్గమించాడు.

# అధ్యాయం ౫

ఆస్వాల్డు తిరిగివచ్చి, తన యజమానితో నెమ్మదిగా ఇట్లని విన్నవించాడు: 'దొరా, అతడొక యూదీయుడు. యార్కు నగరవాసిట. పేరు ఇసాక్ అని చెప్పాడు. లోనికి తీసుకురావచ్చునా?'

'నీవు కాదు, గర్తును వెళ్ళి తీసుకురమ్మను. యూదీయుని లోనికి ప్రవేశపెట్టదగినవాడు పందుల కాపరియే!' అన్నాడు వాంబా, తన మామూలు వాగుడు ధోరణిలో.

'యూదీయుడా! ఈ సమాజంలోకి తీసుకురావడమా!' అని ప్రయర్ కంగారుపడ్డాడు, తన ముఖానికి రక్షణగా క్రాసుగుర్తును చేతితో వేసుకుంటూ.

'క్రీస్తు భగవానుని పవిత్ర సమాధి రక్షణకోసం పోరాడిన యీ ధర్మదీక్షా దక్షుని సమీపానికి ఆ కుక్కను రానివ్వడం!' అని బుసకొట్టాడు టెంప్లార్ బ్రియన్.

'టెంప్లార్లకు యూదీయుల ఆస్తిపాస్తులమీద ఉన్నంత ప్రీతి వారి వ్యక్తుల మీద లేనట్లుంది' అన్నాడు వాంబా.

'అతిథులు మన్నించాలి' అన్నాడు సెడ్రిక్. 'నా గృహస్థధర్మం నేను నెరవేర్చక తప్పదు. క్రీస్తుప్రభువునంటు విశ్వాసముంచని యీ యూదీయ జాతిని భగవంతుడు ఇన్ని వందల సంవత్సరాలుగా సహించి బ్రతకనిస్తున్నప్పుడు, ఒక్క యూదీయుని సాన్నిధ్యం కొన్ని గంటలసేపు సహించి ఉండలేమా! వానితో నెవ్వరూ ప్రసంగించవద్దు. కలిసి భోజనం చేయవద్దు. వానికి వేరుగా ఏర్పాటుచేస్తాం. అదిగో ఆ తలపాగాలవారు అరబ్బీలు కాబోలు, వారతనికి తమ ప్రక్క చోటిస్తే నాకభ్యంతరంలేదు.'

ఈ చివరివాక్యం అంటూ సెడ్రిక్ ఒక నవ్వు నవ్వాడు. టెంప్లార్ బ్రియన్ వెంటనే అందుకొని, 'నా అరబ్బీ బానిసలు అచ్చమైన మహమ్మదీయులు. యూదీయుని సంపర్కం క్రైస్తవులేవగించుకున్నంతగానే వాళ్ళూ ఏవగించుకుంటారు' అన్నాడు.

'ఒకప్పుడు భగవంతునిచే సాక్షాత్తుగా ఎన్నుకోబడ్డ యూదీయులకంటే, మహమ్మదీయులు ఏ విధంగా యోగ్యులవుతారు చెప్మా!' అని వికటంగా ఆశ్చర్యం వెలిబుచ్చాడు వాంబా.

‘అరే ఫూల్! ఆ యూదీయుడూ, నీవూ మీ యిద్దరూ కలిసి భోజనం చేద్దురుగాని. ఈ అవివేకికీ ఆ వంచకుడికీ అప్పుడు బాగా సరిపోతుంది’ అన్నాడు సెడ్రిక్.

‘వంచకుని బారి పడకుండా కాపాడుకోడం అవివేకికి చేతగాదనుకున్నావా? ఇదిగో ఈ మాంసఖండం మా యిద్దరిమధ్యా కోటబురుజుగా నిలుపుతాను’ అన్నాడు వాంబా.

‘ఇక కట్టిపెట్టు. అదిగో అతడు వస్తున్నాడు.’

సెడ్రిక్ ఈమాట అంటూవుండగా, ఆ నూతన వ్యక్తి, అపరిమితమైన భయసంశయాలతో, వంగి వంగి సలాములు చేసుకుంటూ ముందుకువచ్చాడు. ముదుసలి. పొడగరియే కాని, వంగి వంగి నడవడం అలవాటైపోయిన కారణాన, ఆ పొడగరితనం కనిపించడంలేదు. వంపు తిరిగిన ముక్కు. చురుకుగా చూచే నల్లని కండ్లు. ముడుతలుపడ్డ ఎత్తయిన ఫాలతలం. పొడుగ్గా పెరిగిన తెల్లనిగడ్డం. ఈ వారంగు లోపలి ఉడుపుపైన, ముడుతలు ముడుతలుగా జీరాడే పసుపూ యెరుపూ నీలం కలసిన అంగీ ధరించాడు. కాళ్లకు బొచ్చుతో కూడిన లెదరుబూట్సు ఉన్నాయి. మొలను ఒక చిన్న చాకూ, వ్రాత పరికరాలుగల ఒక సంచీ ఉన్నాయి. వింతయైన నలుచదరపు పసుపురంగుటోపీ గుమ్మంవద్దనే వినయంగా నెత్తిమీదనుంచితీసి చేత బుచ్చుకున్నాడు.

యూదీయుని సలాములకు సెడ్రిక్ ముభావంగా ఇంచుక తలఆడించి, పరిచారకులు కూర్చున్న బల్లవైపుగా చెయి చూపించాడు. కాని, అచట ఎవ్వరూ అతనికి చోటు చేయలేదు. బెదరు చూపులతో, చోటుకోసం వెదకుతూ, అతడు ఒక్కొక్కరి దగ్గరకే వస్తూంటే, సెడ్రిక్ నౌకర్లు చూచీ చూడనట్లు తమ తిండి గొడవలో తాము నిమగ్నులయ్యారు. మఠాధిపతి పరిచారకులు మతబాహ్యాని చూడవలసివచ్చిందన్న కంపరం తమ చూపుల్లో వ్యక్తంకాగా, చేతులతో శరీరం మీద క్రాసు గుర్తులు వేసికొని రక్షలు పెట్టుకున్నారు. బొంస్గార్ అనుచరులైన తురుష్కులు గడ్డలూ మీసాలూ దువ్వ నిరసనగా అతని వంక చూస్తూ, దగ్గరకువచ్చి మమ్ము మైల పరిచావంటే ఖబర్దార్, ఏంచేస్తామో చూడు, అన్నట్లు తమ బాకుపిడులపై చేతులువేశారు.

తన గృహస్థ ధర్మం నెరవేర్చాలనే కోరికతో ఆయూదీయుని లోపలకు రప్పించిన సెడ్రిక్, అతనికి భోజనపుబల్లవద్ద తన పరిచారకులు చోటు చూపేటట్లుకూడా చేసియుండేవాడే. కాని, సరిగ్గా ఈ సమయంలో, ప్రయర్ అతని పెంపుడుకుక్కల ప్రసక్తియెత్తి, అతన్ని ప్రసంగంలోకి దింపాడు. ఆ ప్రసంగంలో పడితే, ఇక ఎలాంటి అంతరాయం సెడ్రిక్ సహించడు. ఆ యూదీయునికి చోటు దొరికిందో లేదో ఆ సమయంలో అతని కేలా పట్టు

తుంది? ఇలా ఎవ్వరూ దగ్గరకు చేరనివ్వనిస్థితియందు ఇస్సాక్ దిక్కులు చూస్తున్న సమయంలో, చిమ్నీవద్ద బల్లపై కూర్చున్న యాత్రికుడు, అతనిపై జాలిదలచి, లేచి తనచోటు చూపిస్తూ, 'ఇదిగో ముసలీ, ఇక్కడ నీవు కూర్చోవచ్చు. నా బట్టలు ఆరాయి. భోజనంకూడా అయిపోయింది. నీవు కూర్చుని భోజనం చెయ్యి', అంటూ, చలిమంటలో చిదుకు ఎగదోసి, నౌకర్ల బల్లమీది కొన్ని ఆహార పదార్థాలు తెచ్చి అతని ముందు పెట్టి, కృతజ్ఞత తెల్పుకునే అవకాశం కూడ అతనికి ఇవ్వకుండానే, అతనితో ఇంకా సన్నిహితత్వం కల్పించుకోడం ఇష్టంలేకనో, లేక పెద్ద బల్లకు కొంచెం దగ్గరగా ఉండవలచియో, హాలకి అవలివైపుకు సర్దుకున్నాడు.

చలిమంటవద్ద మేనువంచి, గజగజ వణికే చేతులను ముందుకు సాచి చలికాగుతూ ఉండిన ఆ ముసలియూదీయుని రూపు, సాక్షాత్తూ, మూర్తీభవించిన శిశిరఋతువులాగ కనుపించింది. చలి కాస్త తగ్గిపోగానే, ఇక అతడూ, తన ముందర పొగలుగ్రక్కుతూ ఉన్న భోజనంమీదపడ్డాడు. తినడంలో ఆ తొందరపాటూ, ఆ ఆత్రాయతా చూస్తే, అతడు భోజనంచేసి చాలాకాలమై యుండాలనిపించింది.

పెద్ద బల్లవద్ద ప్రసంగం ఈ సమయంలో, వేటకుక్కలమీదనుంచి భాష మీదికి మళ్ళింది. వేటకు సంబంధించిన పదజాలం కావాలంటే నార్మన్ భాషనే ఆశ్రయించాలి, సాక్సన్ భాషలో ఏముందన్నాడు ప్రయర్ ఐమర్. పదజాలం లేకపోయినంత మాత్రాన మా మృగయావినోదానికి వచ్చిన లోటేమీ లేదన్నాడు సెడ్రిక్. ఒక్క మృగయావినోదానికే కాదు, ప్రేమ కలాపానికీ యుద్ధాటోపానికీ కావలసిన పదజాలం కూడ నార్మన్ - ఫ్రెంచిలోనే ఉందన్నాడు టెంప్లార్ బ్రయన్. మా సాక్సన్ భాష అందుకు పనికిరాకపోలేదంటూ, సెడ్రిక్ ముప్పదేండ్లక్రితం జరిగిన ఒక యుద్ధగాథను వర్ణించాడు. వర్ణిస్తున్నకొద్దీ అతనికి ఉత్సాహం ఇనుమడించింది. పదేపదే మద్యం సేవిస్తూ ఆ నిషాలో మరింత ఉత్సాహితుడై ఉపన్యసింపసాగాడు. 'అహా! అది యెటువంటి దినం! నేనప్పుడు మంచి పడుచుదనంలో వున్నాను. ఎన్ని డాళ్లు పగిలిపోయాయో లెక్కలేదు. ఎన్ని జెండాలు నేలకొరిగాయో చెప్పలేను. నెత్తురు వరదలై పారింది. పారిపోవడంకంటె చావడం మేలనుకున్న రోజది— ఒక సాక్సన్ కవి, అది కత్తులపండగని వర్ణించాడు. గ్రద్దలకు విందు జరిగిందన్నాడు. ఆ సమరార్భటిలోని ఆనందం పెండ్లి కోలాహలంలో ఎక్కడిదన్నాడు. ఆ కవులంతా యిప్పుడు గతించారు. మా జాతి విజయాలు మరుగునబడిపోతున్నాయి. మా భాష, మా పేరుకూడా నశించిపోతోంది. ఇదంతా చూచి దుఃఖించడానికి నేనొక్కణ్ణి మిగిలివున్నాను' అంటూ, మధుపాత్రలో మరల మధువు నింపించి, 'సర్ బ్రయన్, మనమిప్పుడు పాలస్తీనా మతయుద్ధంలో పాల్గొన్న యోధులందు శ్రేష్ఠతములగువారి పేరున ఈ మద్యం సేవింతముగాక.

వారేనాటికీ చెందినవారైనా, ఏ భాష మాట్లాడేవారైనా నా కభ్యంతరంలేదు. ఏమంటారు?' అన్నారు.

పాలస్తీనాలో పోరాడిన ఉత్తమోత్తమ వీరులు ఎవ్వరనే మీమాంస అంతటితో బయలుదేరింది. 'మా టెంప్లార్ వ్యవస్థను గూర్చి నా అంతట నేను గొప్ప చెప్పుకోడం యుక్తంగా ఉండదుగాని, అయినప్పటికీ చెప్పక తప్పదు— టెంప్లార్సే ఈ విషయంలో అగ్రతాంబూలం అందుకోవలసినవారు' అన్నాడు సర్ బ్రయన్. సెంటుజాన్ వ్యవస్థకు చెందిన యోధులమాట యేమిటన్నాడు ప్రయర్ ఐమర్. ఆ వ్యవస్థలో తన సోదరుడొకడున్నాడట.

'సెంటుజాన్ యోధులు చాల కీర్తిప్రతిష్ఠలు కలిగినవారే. కాని...' అంటూ టెంప్లార్ బ్రయన్ ఏదో చెప్పబోయాడు. ఇంతలో వాంబా అందుకొని, 'రిచర్డురాజు గనుక నా సలహా తీసుకొన్నట్లయితే, 'పాలస్తీనాకు మీరు పోవద్దు మహారాజా, మీ యింగ్లీషు ప్రజలమధ్య మీరు హాయిగా ఉండిపొం' డని సలహా ఇచ్చివుండేవాణ్ణి. జెరూసలేం నగరాన్ని ఏ యోధులు చేజేతులా జారవిడిచారో వారికే వదిలిపెట్టవలసింది దాన్ని తిరిగి స్వాధీన పరచుకోవలసిన బాధ్యతకూడ!' అన్నాడు.

ఈ ప్రసంగాన్నంతనీ చాల శ్రద్ధగా ఆలకిస్తున్న రొవెనా యిలా ప్రశ్నించింది: 'టెంప్లార్ యోధులతోగాని, సెంటుజాన్ యోధులతోగాని సరిపోల్చదగ్గ వీరులు యింగ్లీషు సైన్యంలో యెవ్వరూ లేరా!'

'ఇంగ్లాండునుంచి రిచర్డురాజు చాల మంచి మంచి యోధులనే పాలస్తీనాకు తీసుకొనిపోయాడు సుందరీ! కాని, ముందు టెంప్లార్ యోధవర్గాన్ని చెప్పిన తర్వాతే వారిని చెప్పవలసినదే' అన్నాడు సర్ బ్రయన్.

'అబద్ధం!' అనే కేక హఠాత్తుగా ప్రక్కనుంచి వినిపించింది. అందరూ ఆ కేక వినవచ్చిన వైపు చూచారు. యాత్రికుడు గంభీర స్వరంతో యిలా అంటున్నాడు: 'నేను నిశ్చయంగా చెప్పగలను, యింగ్లీషు యోధుల శౌర్యసాహసాలు పాలస్తీనాలో పోరాడిన మరే యోధవర్గపు శౌర్యసాహసాలకూ తీసిపోలేదు. ఒకసారి, ఒక నగరాన్ని జయించిన సందర్భంలో, మహారాజు రిచర్డు వినోదార్థం ఒక కయ్యపు పోటీ జరిపించి, తానా పోటీయందు మరి అయిదుగురు యోధులతో అమోఘమైన పరాక్రమం ప్రదర్శించాడు. ప్రతి ఇంగ్లీషుయోధుడూ ఆ రోజున ముగ్గురేసి ప్రతి యోధులను నేలపై కూలద్రోశాడు. అలా నేలగూలిన ప్రతియోధులలో టెంప్లార్ యోధవర్గానికి చెందినవారొక ఏడుగురున్నారు. సర్ బ్రయన్‌కు ఈ సంగతంతా కరతలామలకమే!'

ఈ మాటలకు టెంప్లార్ బ్రయన్ ముఖంలో తాండవించిన క్రోధోద్వేగం వర్ణనాతీతం. నల్లని ముఖం మరింత నల్లబడింది. శరీరం కంపించింది. అప్ర

యత్నంగా చేయి కత్తిపిడిమీదికి పోయింది. కాని, యిక్కడ అలాంటి తీవ్రత చూపరాదని గ్రహించడంవల్ల కాబోలు, తిరిగి వెనక్కు లాక్కున్నాడు. సెడ్రిక్ యిదేమీ చూడలేదు. ముక్కుసూటిగా, ఏదో ఒకే ధ్యేయంలో కొట్టుకొనిపోవడం అతని కలవాటు. తన దేశీయుల శౌర్యపరాక్రమాలను గూర్చి విన్న సంతోషంలో, టెంప్లార్‌లో రేకెత్తిన సంక్షోభం గమనించకుండానే, యాత్రికుని ఉద్దేశించి యిలా అన్నాడు: 'నీవెవరవో కాని, యివాళ మాకు చాలా మంచిమాట వినిపించావు. యింగ్లాండుదేశపు కీర్తిని ఆరోజున అంత జగజ్జేగీయమానంగా చాటిన ఆ యోధవరుల పేర్లు నీవేమైనా చెప్పగలవా? యిదిగో నీకీ సువర్ణకంకణం బహుమానం.'

'సంతోషంగా చెప్తాను. దానికి నాకేం పారితోషిక మక్కరలేదు. కొంతకాలందాకా బంగారం ముట్టుకోకూడదనే నియమంకూడా వుంది నాకు' అన్నాడు యాత్రికుడు.

'నీకక్కరలేకపోతే నీ బదులు నేను తొడుక్కుంటాలే, నా కిచ్చెయ్ ఆ కంకణం' అన్నాడు వాంబా.

యాత్రికుడు ఇలా చెప్పసాగాడు: 'ఆనాటి పోరాటంలో అందరికంటె మొట్టమొదటగా పేర్కొనదగినవాడు ఇంగ్లాండుదేశపురాజు, సింహపరాక్రముడు రిచర్డు.'

'జన్మతః నార్మన్‌జాతీయుడైనా, అతణ్ణి నేనభినందిస్తున్నాను' అన్నాడు సెడ్రిక్.

'అతని తర్వాత యెన్నదగినవాడు లీసెస్టరు ప్రభువు. అతని తర్వాత, సర్ థామస్ మల్టన్' అన్నాడు యాత్రికుడు.

'అతడు మా సాక్సన్ జాతీయుడే' అని ఉత్సాహం ప్రకటించాడు సెడ్రిక్.

'సర్ ఫౌక్ డాయిలీ నాల్గవవాడు.'

'అతడా! అతని తండ్రివంకవారు కాకపోయినా తల్లివంకవారు సాక్సనులే! అయిదోవారెవరు?' అని ప్రశ్నించాడు సెడ్రిక్.

'సర్ యెడ్విన్ టర్నహాం!'

'ఓ, యింకేం! అతడు అచ్చమైన సాక్సనే' అని కేకపెట్టాడు సెడ్రిక్. 'మరి, ఆరవయోధుని పేరు?'

యాత్రికుడు యించుకసేపు స్మృతి నభినయించి—'ఆరవవాడెవడో యువకుడు. అంత పేరుప్రఖ్యాతులు కలవాడు కాడు. ఆ యోధవర్గంలోకి అతన్ని బహుశః సంఖ్యాపూర్తికోసం చేర్చుకొనివుండాలి. అతనిపేరేమీ నాకు గుర్తురావడంలేదు' అన్నాడు యాత్రికుడు.

సర్ బ్రియన్ తిరస్కారపూర్వకంగా యాత్రికుని అధిక్షేపిస్తూ యిలా సవాలు చేశాడు: 'యింత జ్ఞాపకం పెట్టుకొన్నవాడవు అది కాస్తా మరిచిపోయావంటే నమ్మేదెవరు! నీవు చెప్పకపోతే నేనే చెప్పేస్తాను. అతని పేరు ఐవాన్‌హో. ఆతని యీ పొగరుబోతుమాటల్లనే, దురదృష్టవశాత్తూ, నా గుర్రంకాలు తడబడటంవల్ల, నేను ఆ రోజున క్రిందపడడం సంభవించినమాట నిజం. కాని, యిప్పుడు గనుక అతడు యింగ్లాండులో వుండి, రేపు అశ్వ పోటీలో నాతో సవాలు చేసినట్లయితే, ఈ ఉన్న కాలంలోనే, వానికే వసతు లెక్కువ యిచ్చి, కాని పస ఏపాటిదో తేల్చకపోతే నాపేరు బ్రయన్ కాదు.'

'ఐవాన్‌హో ఈ దేశానికి తిరిగి వచ్చియుంటే తమ సవాలు తప్పక అందుకుంటాడు. కాని, ప్రస్తుతానికి మటుకు తమరు, జరగబోదని తమకు తెలిసిన ఆ కయ్యపు పర్యవసానాన్ని గూర్చి ఏవో ప్రగల్భాలు పలికి యిచట శాంతిభంగం చెయ్యకుండా ఉంటే బాగుంటుంది. ఐవాన్‌హో తిరిగివచ్చియుంటే మాత్రం, తమర్ని తప్పక యెదుర్కొంటాడు, ఇది పూచీ' అన్నాడు యాత్రికుడు.

'బలే పూచీదారుడవే! అయితే నీ మాట నమ్మకమేమిటి? ఏదైనా పందెం ఒడ్డు, ఏముంది నీ దగ్గర?' అని ప్రశ్నించాడు టెంప్లార్.

'ఇదిగో, కార్మెల్ పర్వత ప్రాంతపు క్రైస్తవ మఠంనుండి కొని తెచ్చాను —అసలు సిలువలోనిదే ఒక చిన్న ముక్క యిది. దీన్ని నేను పందెంగా ఒడ్డుతున్నాను'- అంటూ ఒక బంగారుభరిణె చొక్కాలోంచి బయటికి తీశాడు.

అది చూడగానే ప్రయర్ ఐమర్, శరీరంమీద చేతితో క్రాసురేఖలు వేసుకొని ప్రార్థనచేశాడు. తక్కినవారు కూడ భక్తితో అందు పాల్గొన్నారు— యూదీయుడు, అరబ్బీ బానిసలు, టెంప్లార్ బ్రయన్—వీరు తప్ప. బ్రయన్ తన కంఠసీమనుండి ఒక బంగారుగొలుసు తీసి బల్లమీదికి విసురుతూ, 'ఇదిగో, ఈ వస్తువులు రెండూ ప్రయర్ ఐమర్ తనవద్ద భద్రపరచాలని కోరుతున్నాను. పందెం ఏమనో తెలుసుగదూ! ఐవాన్‌హో బ్రిటనులో గనుక ఉన్నట్లయితే, నా సవాలు అందుకొని నాతో ఢీకొనాలి. లేనియెడల, యూరప్‌లోని ప్రతి టెంప్లార్లదర్బారుగోడలమీదా అతడు పట్టి పిరికిపందయని వ్రాయిస్తాను' అన్నాడు బ్రియన్.

హాలంతా కొంతసేపు నిశ్శబ్దంగా ఉండిపోయింది. అంతట రొవీనా, తియ్యని యెలుగుతో ఇలా వాక్రుచ్చింది: 'ఐవాన్‌హో యోధు డిచట లేడు. ఆతని తరఫున ఇచట మరియెవ్వరూ మాట్లాడేవారు లేకపోతే, నేను మాట్లాడుతున్నాను. సర్ బ్రయన్ సవాలును ఐవాన్‌హో తప్పక అందుకోగలడని నా విశ్వాసం. ఈ పూజ్య యాత్రికుడు పందెంపెట్టిన అమూల్య వస్తువునకు తోడుగా అవసరమైతే ఇందుకు నా పేరుప్రతిష్ఠలు కూడా పణంగా ఒడ్డుతున్నాను'.

సెడ్రిక్ ఈ వాగ్వాదమంతటా ఇంతవరకూ నోరు విప్పలేదు. అతని మనస్సులో ఎంతో భావసంఘర్షణ జరుగుతోంది. అభిమానం, సంతృప్తి, నిరసన, కలవరపాటు, —ఇవన్నీ ఒకదాని నొకటి తరుముతూ అతని విశాల ఫాలభాగాన మబ్బులలాగా పరుగెత్తుతున్నట్లు తోచింది. అరణ్యవాసుని పేరు ఉచ్చరించ బడగానే అతని పరిచారకులంతా ఒక్కపెట్టున చకితులైనట్లు కనుపించారు. కాని, యజమాని ముఖంవంక చూస్తూ లోలోపలనే తమ ఉద్రేకం అణచు తున్నారు. ఈ పరిస్థితిలో రొవెనా ప్రసంగించేసరికి, ఆ కంఠధ్వనికి సెడ్రిక్ ఉలిక్కిపడ్డాడు.

'వలదు రొవెనా, నీవు పణమొడ్డటం అనవసరం. అవసరమైతే ఐవాన్ హో పేరుప్రతిష్ఠలకోసం నా పేరుప్రతిష్ఠలనే పణంగా ఒడ్డుతాను. నిజానికి ఆదేమీ అవసరంలేదు. నార్మన్ నూతన వింత ఆచారాల ప్రకారం చూచినా, ఈ యాత్రికుడొడ్డిన పణం చాలు. అవును కాదా ప్రయర్ ఐమర్?'

'అవును. ఈ రెండు వస్తువులూ చాలు. వీటిని నేను మా మఠ కోశాగారంలో భద్రంచేస్తాను—ఈ సమాహ్వానం సంగతి తేలేవరకూ' అన్నాడు ప్రయర్.

అంటూ, మరల మరల క్రొత్తగా రక్షలు పెట్టుకొని, ఏవేవో ప్రార్థనలుచేసి, యాత్రికుని ఆ దంతపుబరిణెను తన ప్రక్కనున్న మరొక సన్యాసికి భద్రపరచమనిచ్చి, టెంప్లారిచ్చిన బంగారు గొలుసును మాత్రం, అలాంటి భక్తిశ్రద్ధలతో కాకపోయినా, ఒక విధమైన ఉల్లాసంతో, అత్తరు వాసనలు వెదజల్లే తన చేతిసంచీయందు జాగ్రత్త చేశాడు. తరువాత ఇలా అన్నాడు: 'సర్ సెడ్రిక్, ఇక మేము లేడీ రొవెనా పేరున మరొక గిన్నెడు ద్రాక్షాసవం సేవించి, ఆపైన విశ్రాంతి తీసుకొంటాం, సెలవివ్వండి—మీ ద్రాక్షాసవంమహావల్ల నా చెవుల్లో ఇప్పుడు సాయంకాల ప్రార్థన గీతాలు వినిపిస్తున్నాయి.'

సెడ్రిక్ చిరునవ్వుతో 'ఏమిటిది సర్ ప్రయర్, మీకున్న పేరు చూడబోతే, చేపట్టిన మధుపాత్రను మళ్ళీ ప్రాతఃకాల ప్రార్థన గీతాలు వినిపించేదాకా విడవని విలాసపురుషులని చెప్పుకుంటారు. మీకు సరిగా ఆతిథ్యం ఇవ్వగలనో లేదో యని నేను చాలా జడిసాను. తీరా చూస్తే, మా కాలంలో, పన్నెండేండ్ల సాగ్జన్ కుర్రవాడు కూడా మీరిప్పుడు వదలిపెడుతున్నంత తొందరగా మధుపాత్రను వదలిపెట్టడు' అని కవ్వించాడు.

కాని, మధుసేవనం త్వరగా చాలించి విశ్రాంతి తీసికోవాలని ప్రయర్ తొందరపడడానికి కారణమున్నది. వృత్తిచేతనే గాక, స్వభావతః అతనికి జగడాలంటే గిట్టవు. అది యెదుటివానిమీది ప్రేమవల్లనో, లేక తనమీది ప్రేమవల్లనో, లేక రెండిటి కలగలుపువల్లనో, ఏది యథార్థమని చెప్పడానికి వీల్లేదు. ప్రస్తుత సందర్భంలో, తన మిత్రుడు బ్రయన్ తొందరపాటువల్ల ఏ క్షణములో ఏమి ముంచుకువస్తుందో, సెడ్రిక్కు ఏ వేళ అగ్గిభరాటా అయిపోతాడో అని

అతని భయం. అందుచేత, మధుసేవనంలో సాక్సన్లతో ఎవ్వరు పోటీకి రాగలరంటూ నెమ్మదిగా ఎత్తిపొడిచి, తానున్న పవిత్ర వృత్తిధర్మాన్ని గూర్చి అస్పష్టంగా ఏమేమో పలికి, తానిక తొందరగా పోయి విశ్రాంతి తీసికోవాలనే కోరికనే తిరిగి వ్యక్తంచేశాడు.

'ఆ ప్రకారమే, చివరిసారిగా మధుపాత్రలు నింపబడ్డాయి. అతిథులు పాత్రలను ఖాళీచేసి, గృహయజమానికీ, లేడీ రొవీనాకూ అభివాదము అర్పించి లేచారు. ఇటువచ్చేవారూ, అటు పోయేవారూ, చావడి అంతా సందడిగా వుంది. సెడ్రిక్ రొవీనాలు తమ తమ పరిజనంతో వేర్వేరు గుమ్మములగుండా లోనికి వెళ్ళిపోయారు. యూదీయుని ప్రక్కగా పోతూ టెంప్లార్ బ్రయన్ ఇలా పలకరించాడు: 'ఏరా నీచుడా, ఆష్బీ పోటీలకేనా నీవు కూడా బయలుదేరింది?'

'చిత్తం, అక్కడికే బయలుదేరాను' అన్నాడు యిసాక్, అతి వినయంగా వంగి సలాంచేస్తూ.

'ఎందుకు? విపరీతపు వడ్డీలతో మా నార్మన్ జమీందార్ల ఎముకలు కొరకడానికీ, మా విలాసవస్తువులతో ఆడవాళ్ళనూ పిల్లలనూ మోసపుచ్చడానికేగా! ఏముంది ఆ సంచిలో? ఎన్ని బంగారు నాణేలు ఉన్నాయేమిటి?' అని అడిగాడు బ్రయన్.

'అయ్యో! బంగారు నాణేలనాకా పోతున్నారు, ఒక్క వెండి నాణెంకూడ లేదు—ఉంటే ఒట్టు! మా యూదీయ నిధికి చెల్లించుకోవలసిన జరిమానాకు కూడా చేతిలో చిల్లిగవ్వలేదు. ఆష్బీలో మా సంఘీయులెవరైనా సాయంచేస్తారేమో నని పోతున్నా. బటాచోరుని నా దగ్గరేముంది? నా తొడుక్కొన్న అంగీకూడా ఎరువు తెచ్చుకున్నదే!' అంటూ బీద అరపులు అరిచాడు ఇసాక్.

'నీ సంగతి నాకు తెలుసులేరా ఝూటాకోర్!' అంటూ సర్ బ్రయన్ అతన్ని దాటి ముందుకు పోయి, చుట్టుప్రక్కలవారికి తెలియని భాషలో తన అరబ్బీ దాసులతో ఏదో గుసగుసలాడాడు. విపరీతమైన భయంతో కుదించుకుపోయి నిలబడ్డ ఇసాక్ తిరిగి తలయెత్తి చూచినది, బ్రయన్ సపరివారంగా ఆహాలులోంచి నిష్క్రమించాడన్న ధైర్యం కలిగిన తర్వాతనే! కన్నెదుట బ్రహ్మాండమైన పిడుగుపడి, దాని భయంకరనినాదం చెవులలో యింకా గింగురుమంటూంటే బిత్తరపోయి చూస్తున్నవాడిలాగా, అతడు చుట్టూ కలయజూశాడు.

సెడ్రిక్ పరిచారకులలో ముఖ్యులిద్దరు, 'మరి యిద్దరు పరిచారకులు కాగడాలు పట్టుకొని దారిచూపగా, అతిథులలో ముఖ్యులైన ప్రయర్నూ, టెంప్లార్నూ వేర్వేరుగా వారి వారి కొరకు నిర్దేశించబడిన పడకగదులకు తీసుకొని పోయారు. అలాగే తక్కిన అతిథులకు కూడ తక్కిన పరిచారకులచే వేర్వేరుగా తగు విశ్రాంతి స్థలాలు చూపించబడ్డాయి.

# అధ్యాయం ౬

సెడ్రిక్ పరిచారకుల్లో దివిటీలు పట్టే ఒక మషాల్చీ, యాత్రికునికి పడుకునే తావు చూపించే నిమిత్తం ఆ పురాతన భవనపు జిలుగుదారుల వెంట తీసుకొనిపోతూవుండగా, వెనుకనుండి ఆస్వాల్డు వచ్చి కలుసుకొని, 'వంటసాలలో మా పరిచారక బృందమంతా నీ వలన పాలస్తీనా వార్తలను—ముఖ్యంగా ఐవాన్‌హోను గూర్చిన విశేషాలను—తెలుసుకొనగోరుతూ ఉన్నది, మంచి మధుపానీయం సిద్ధంచేసివుంచాము, కొంచెంసేపు కాలక్షేపం చేద్దాం ర'మ్మని యాత్రికుని కోరాడు. కాని యాత్రికుడు తనకేదో మతసంబంధమైన నియమమున్నదని చెప్పి అందుకు అంగీకరించలేదు. ఆస్వాల్డుకు అంతట కోపం వచ్చి, 'కాసేపు తోటి క్రైస్తవులతో కలిసి హాయిగా కాలక్షేపం చేయనొల్లని యీతనికి అదిగో ఆ యూదీయుని కేటాయించబడ్డ కొట్టంప్రక్కనే బస చూపించవలసిం'దని మషాల్చీకి హెచ్చరిక చేసి చక్కాపోయాడు.

మషాల్చీతో యాత్రికుడు మరికొంత దూరం సాగిపోయేసరికి, అచట లేడీ రొవెనా పరిచారిక యొకతె వీరిని నిలువరించి, ఒకవిధమైన అధికారం తన కంఠస్వరంలో ఉట్టిపడుతూ ఉండగా, తన యజమానురాలు యాత్రికునితో మాట్లాడగోరుతున్నదని చెప్పి, మషాల్చీ చేతనున్న దివిటీ తాను చేతబుచ్చుకొని, మేము తిరిగివచ్చేవరకూ ఇచటనే ఉండమని వానికి చెప్పి, తన వెంట రావలసిందిగా యాత్రికునికి సంజ్ఞ చేసింది. మొదటి ఆహ్వానం త్రోసిపుచ్చినట్లుగా దీనిని త్రోసిపుచ్చడం మరియాద కాదనుకున్నాడో యేమో, మారుమాటాడకుండ అతడామె ననుసరించాడు. ఆ పిలుపునకు అతడించుక ఆశ్చర్యచకితుడైనట్లు అతని ముఖరేఖలను బట్టి ఊహించవచ్చు.

పరిచారిక ఒక మెట్లవరుసమీదుగా అతనిని రొవెనా అభ్యంతర మందిరంలోనికి గొనిపోయింది. జలతారు పనిచేసిన పట్టుతెరలు ఆగదిలో గోడలకు వ్రేలాడుతున్నాయి. పాన్పునకు గూడా అలాంటిదే ఉపావరణంగా అద్దిన పట్టుతెర లున్నాయి. కూర్చుండే గద్దెలలో ఒకటి, మిగతవాటికంటె ఎత్తుగా ఉండి, దాని ముందర, కాళ్ళు పెట్టుకొనేందుకు వీలుగా, ఒక దంతపు పని చేసిన కుర్చీపీట ఉంది. నాలుగు క్రొవ్వొత్తి దీపపు స్తంభాలలో క్రొవ్వొత్తులు వెలుగుతున్నాయి. బీటలు వారిన ఆ పాత కాలపు గోడల పగుళ్ళలోంచి లోనికి పోసుకొంటున్న గాలికి, అచటి తెరగుడ్డలతో పాటు దీపకళికలుగూడా అటుఇటు కదలాడుతున్నాయి.

యాత్రికుడు లోనికి ప్రవేశించుసరికి, రొవీనా ఆ యెత్తుగద్దెపై కూర్చుండి, తన తలకట్టును శయనింపబోవుటకు ముందు సవరించుకోవలసిన రీతిగా సవరించుకుంటోంది. ఆ కూర్చోడంలో ఒక రాచఠీవి ఒప్పుతోంది. యాత్రికుడు వంగి అభివాదం చేశాడు. ఆమె ఆదరపురస్సరంగా అతనికి స్వాగతం పలికి, ప్రసంగం ఎలా ప్రారంభించాలో తోచక తికమకపడుతున్నట్లు ఇంచుక సేపాగి, ఇలా మొదలుపెట్టింది: 'యాత్రికుడా, నీవు చాలా పూజ్యుడవు. పరోక్షాన ఉన్నవారి పరువు కాపాడడంకోసం వెనుకంజ వెయ్యక నిలబడిన నీ వంటివారు కాకపోతే మరెవ్వరు పూజ్యులు? నీ విందాక భోజనసమయంలో, ఒక యోధవరునిగూర్చి,—అంటే—అంటే—ఐవాన్‌హోనుగూర్చి,—ప్రస్తావించియున్నావు. ఆ పేరు ఉచ్చారణ ఈ ఇంట్లో అందరికీ నిజంగా ఎంతో ప్రీతి నింపియుండవలసింది. కాని, దురదృష్టవశాత్తూ, లోని ఔత్సుక్యం లోననే అణచుకోవలసిన పరిస్థితిలో ఉన్నారందరూ. నేనొక్కతెను మాత్రమే అతన్నిగూర్చి నిన్ను ఈ ప్రశ్నలు వేయడానికి ధైర్యం చెయ్యగలుగుతున్నాను. అతన్ని నీవు చిట్టచివరిసారి ఎప్పుడు చూచావు? ఇంగ్లీషుసైన్యం వెడలిపోయిన పిమ్మట అతను పాలస్తీనాలోనే అనారోగ్యకారణాన ఉండిపోయి, కొందరు ఫ్రెంచి కక్షిదారులమూలాన చాల కష్టాలపాలైనాడనీ, ఆ కక్షిదారులలో టెంప్లార్లు ప్రధానులనీ విన్నాను, నిజమేనా?'

యాత్రికుడు క్షుభిత స్వరంతో ఇలా జవాబిచ్చాడు: 'ఐవాన్‌హోనుగూర్చి నాకు అంతగా తెలియదు సుందరీ. అతని స్థితిగతులనుగూర్చి తెలుసుకోవాలని మీరింతగా ఉత్సుకత వహించడం చూస్తున్న పిమ్మట, అయ్యో తెలుసుకొని యుండకపోతినే అనిపిస్తున్నది. అయితే, పాలస్తీనాలో శత్రువులు పెట్టిన చిక్కులన్నీ తప్పించుకొని అతను ఇంగ్లాండుకు తిరిగివచ్చే ప్రయత్నంలో ఉన్నాడనే నా విశ్వాసం. వచ్చిన పిమ్మట అతనికిక్కడ ఎలాంటి సౌఖ్యం ఉండగలదో నాకంటె మీకే ఎక్కువగా తెలియాలి!'

రొవీనా ఒక నిట్టూర్పు విడిచి, ఐవాన్‌హో ఎప్పటికి ఇంగ్లాండు చేరుకొనగలడో నీకు తెలుసునా అని ప్రశ్నించింది. యాత్రికుడు తెలియదన్నాడు. మార్గంలో ఉపద్రవాలేమీ ఉండవుగదా అని ఆశంకించింది. వెన్నిసుద్వారా జెనోవా వచ్చి, అటనుండి ఫ్రాన్సుగుండా ఇంగ్లాండు చేరుకుంటే ప్రమాదాలుండవనీ, ఐవాన్‌హోకు ఫ్రెంచిభాషా, ఫ్రెంచి ఆచారవ్యవహారాలూ బాగా తెలుసును గనుక ఆ ప్రాంతాల్లో చక్కగానే నెగ్గుకు రాగలడనీ యాత్రికుడన్నాడు. రొవీనా చింతాభగ్నమనస్కురాలై ఇలా అంది: 'దేవుని దయవల్ల, రేపటి ఆష్బీ కయ్యపుపోటీల్లో అతను పాల్గొనగలిగితే ఎంత బాగుండును! ఇంగ్లాండు దేశపు వీరకిశోరులంతా తమ శౌర్య సాహసాలు ప్రదర్శించే మంచి సమయమది. కొనింగ్స్‌బర్గు అధినేత ఎథెల్‌స్టేను గనుక రేపు ఈ పోటీల్లో

బహుమానం కొట్టుకుపోతే, దాని పర్యవసానంగా ఐవాన్‌హో తాను ఇంగ్లాండు చేరుకున్న మొదట చాల చెడువార్త వినవలసి వచ్చేమాట నిజం. నీవు చివరిసారిగా చూచినప్పుడు అతని ఆరోగ్యస్థితి ఎలా ఉంది? జబ్బు పడినందువల్ల బాగా కృశించిపోయాడా?'

'రిచర్డుమహారాజు పరివారంలో ఒకడుగా సైప్రసునుండి దిగినప్పటికంటె కొంచెం నల్లబడి, కొద్దిగా చిక్కాడు. ఏవో విషాదమేఘాలు అతని ఫాలతలాన ముసురుకొని ఉన్నట్లు తోచాయి. అంతకంటె ఎక్కువ సంగతులు మీకు చెప్పడానికి, అతనితో ముఖాముఖి పరిచయం నాకెప్పుడూ కలగలేదు.'—అన్నాడు యాత్రికుడు.

'ఇంగ్లాండుకు తిరిగివచ్చినా ఆ మేఘాలు విచ్చిపోయే శుభయోగం ఉంటేటట్లు కనిపించదు. మంచిది—నాచిన్ననాటి నేస్తగానిని గూర్చిన యీసమాచారం చెప్పినందుకు నీకు నా కృతజ్ఞత. ఎల్గితా, ఈతని విశ్రాంతికి భంగం కల్గించరాదు. ఒక గిన్నెడు మధువు ఈ పూజ్యునికి తెచ్చి యివ్వు,' అన్నది రోవెనా.

ఆచారం ప్రకారం రోవెనా ఆ మధుపాత్రను తన పెదవులవద్ద రవంతసేపు ఉంచుకొని పిమ్మట యాత్రికున కందించింది. అతడు వినమితుడై అభివాదంచేసి ఆ మధువును కొద్దిగా చప్పరించాడు. రోవెనా ఒక బంగారు నాణెం అతని కందిస్తూ, 'ఇదిగో, పుణ్యక్షేత్రాలు దర్శించి చాల శ్రమలు పడ్డవాడవు, ఈ కానుక స్వీకరించు'—అంది. అతడది మరల వినయ వినమితాంగుడై స్వీకరించి, పరిచారిక వెంట బయలుదేరాడు.

పరిచారిక అతనిని తోడ్కొని చని, తమ రాకకై యెదురుచూస్తున్న మసాల్చీకి అప్పగించింది. వాడామెవద్దనుండి తిరిగి దివిటీ అందిపుచ్చుకొని, తొందర తొందరగా అతనిని నడిపించుకొని, ఆ భవనపు వెలుపలి భాగమున నెక్కడో చిన్న చిన్న కొట్టములున్న చోటికి తీసుకొనిపోయి అతని విశ్రాంతి కొరకు కొట్టం చూపించాడు.

'ఆ యూదీయుడు నిద్రించే దెక్కడ?' అని ప్రశ్నించాడు యాత్రికుడు మసాల్చీని.

'ఇదిగో, ఈ ప్రక్కకొట్టంలోనే ఆ కుక్క నిద్రించేది' అన్నాడా పరిచారకుడు. 'మరి, పందులకాపరి గర్త్ నిద్రించేదెక్కడ?' అన్నాడు యాత్రికుడు. 'ఇదిగో ఈ పక్కన. నీ యూదుని ప్రక్కన యూదీయుడు, క్షుద్రుని ప్రక్కన పందులకాపరి. మా ఆస్థాన ఆహ్వాన మంగీకరిస్తే నీ కింతకంటె మంచిచోటు దొరికియుండేదికదా!' అన్నాడు మసాల్చీ.

'ఇప్పుడైనా ఫరవాలేదులే! యూదీయుని సంపర్కం నీకు చెక్క బల్లకూర్పులోంచికూడా దూరి నన్ను మైలపడెయ్యకు' అంటూ యాత్రికుడు, తన కిచ్చిన కొట్టంలో ప్రవేశించి, మహాల్ఫ్ చేతిలోని దివిటీ తానందుకొని, కృతజ్ఞతాభివందనాలు చెప్పి, ఇక వెళ్ళిరమ్మన్నాడు. అతడు వెళ్లడంతోటే తలుపు గడియవేసి, దివిటీని ఒక కొయ్య స్టాండుకు తగిలించి, నలుదిక్కులా కలయజూచాడు. ఒక కొయ్య స్టూలు, గడ్డిపరుపు వేసిన ఒకబల్ల, దానిపైన దుప్పట్లుగా రెండుమూడు గొర్రెతోళ్ళు—యివీ అక్కడి సామగ్రి. యాత్రికుడు దివిటీ ఆర్పేసి, దుస్తులేమీ మార్చకుండానే ఆ గడ్డిపరుపుపై విశ్రమించాడు. నిద్రపోయాడని చెప్పలేముగాని, నిద్రిస్తున్నవాని మాదిరిగా కదలకుండామాత్రం పడుకున్నాడు.

తూర్పుదిక్కున తొలివెలుగురేకలతోచి, ఉషఃకాలపు పిల్లవాయువులు ఆ గదిలోని ఒకేయొక దిడ్డికిటికీలోంచి లోనికి ప్రవేశించిన వేళకు లేచాడు. లేచి, ప్రార్థనచేసి, దుస్తులు సవరించుకొని, ఇసాక్ పడుకున్న గది గడియ చప్పుడు కాకుండా తీసి లోన ప్రవేశించాడు. లోన, తాను పడుకున్న గడ్డిపరుపువంటిదానిమీదే ఇసాక్ పడుకుని, ఏమి పీడకల వచ్చిందో, చేతులు తపతప కొట్టుకుంటూ, 'కనికరించండి బాబూ, ముసలివాణ్ణి, నిరుపేదను. చిల్లిగవ్వయినా లేదు. మీరు నన్ను నిలువునా చీల్చినా మీ రడిగింది ఇవ్వలేను' అని ఏమేమో కలవరిస్తున్నాడు.

యాత్రికుడతన్ని తన చేతికర్రతో కదిపి లేపాడు. అతడు దద్దిరిల్లి లేచి, తాను ధరించియున్న ఉడుపులో కొన్నిభాగాలను గట్టిగా చిక్కబట్టుకొంటూ, యాత్రికునివంక అతి భయభ్రాంతుడై చూస్తున్నాడు. 'భయంలేదు ఇసాక్! నేను నీ క్షేమం కోరి వచ్చాను' అన్నాడు యాత్రికుడు. ఇసాక్ లేచికొని, యింత చీకటి ఉండగానే నాతో ఏమి పనియుండి వచ్చారని అడిగాడు. 'ఇక్కడనుంచి నీవు వెంటనే బయలుదేరి, అతివేగంగా నీ గమ్యస్థానానికి నీవు చేరుకోకపోతే, త్రోవలో నీకు ప్రమాదం వాటిల్లేటట్లుంది. ఆ సంగతి నీకు చెప్ప వచ్చాను. రాత్రి టెంప్లార్ నిన్ను పలకరించిన తర్వాత తన అరబ్బీబానిసలతో అరబ్బీభాషలో మాట్లాడినది విన్నాను. ఉదయాన నీ ప్రయాణ సమయంలో నిన్ను కనుపెట్టి ఉండి, త్రోవలో నిన్ను బంధించి ఫిలిప్ డీ మాల్వాయిసిన్ కోటలో, రెజినాల్డు ఫ్రాంట్ డిబాఫ్ కోటలో చేర్చవలసిందిగా వారి కాజ్ఞ యిచ్చాడు' అన్నాడు యాత్రికుడు.

ఈ మాటలు వినేసరికి, ఇసాక్ పడ్డ కలవరం చెప్పనలవికాదు. అవయవాలు పట్టుదప్పి, యాత్రికుని కాళ్ళముందు తప్పగూలినట్లు కూలిపోయాడు. తన దైవమైన యెహోవానూ, యెహోవా భక్తుడైన మోషే, అబ్రహాములనూ

స్మరించుకుంటూ, 'అయ్యయ్యో! ఆపాడుకల ఊరికే రాలేదు. కత్తులచే నా ఒళ్ళు చీలుస్తున్నట్లు, కమ్మెచ్చున సాగదీసినట్లు నన్ను యంత్రంతో సాగదీసి బాధిస్తున్నట్లు, ఆ బాధ ఇంకా అనుభవిస్తున్నట్లే ఉంది. ఏమిటి గతి?' అని ఆక్రోశించాడు.

'భయంలేదు ఇసాక్! నేను చెప్పినట్లు చెయ్యి. ఈ యింటి నౌకర్లు ఇంకా లేవలేదు. ఇంతలో లేవరు. నేను నీకు తప్పించుకునే మార్గం చూపిస్తాను. అడవిలో అడ్డదారులన్నీ నాకు తెలుసు. నిన్ను భద్రంగా తీసుకొనిపోయి, ఆష్బీ పోటీలకు పోయే ఏ సామంతుని రక్షణ అయినా నీకు లభించేవరకూ నిన్ను వెంటనంటి ఉంటాను. ఆసామంతుని మంచి చేసుకోడం నీ చేతుల్లో ఉన్నపని' అన్నాడు యాత్రికుడు.

ఇసాక్ తేరుకున్నాడు గాని, చిట్టచివరి మాట అతన్ని తిరిగి భయసంకోచాల్లో ముంచెత్తింది. 'నా చేతుల్లో వున్న పనా! అది యెలాగ? క్రైస్తవుల్ని నేను మంచి చేసుకోవాలంటే, ఒక్కటే సాధనం ఉంది. కాని ఇదివరకే వట్టి బికారినైపోయిన నాకది యెలా సాధ్యమౌతుంది? వద్దు, వద్దు. నీకు పుణ్యముంటుంది. నన్ను వంచించకు. నేను ఎవరికీ ఏమీ ఇచ్చుకోలేను' అని యాత్రికుని అంగీ పట్టుకొని ప్రాధేయపడ్డాడు.

యాత్రికుడు ఆ స్పర్శకు తాను మైలపడ్డట్టుగా భావిస్తూ ఆ పట్టు విడిపించుకొని అన్నాడు: 'నీదగ్గర ధనరాసులు మూలుగుతుంటే మాత్రం, నిన్ను వంచించవలసిన పని నాకేమి? ఇప్పుడు నేను ధనాపేక్ష వర్జించి, దీక్షగా యీ యాత్రికుని దుస్తులు ధరించాను. ఒక ఖడ్గం, ఒక కవచం—ఇవి తప్ప, ఇంకే వస్తుసంపదా ఇప్పుడు నన్నీ దీక్షనుండి మరల్చలేవు. నీ వల్ల నేనేదో ప్రయోజనం కోరి నీ వెంట వస్తున్నా ననుకోబోకు. నీ కిష్టం లేకపోతే ఇక్కడే ఉండిపో. సెడ్రిక్ ది సాగ్జన్ నీకు రక్షణ ఇవ్వవచ్చునులే.'

'అయ్యో! అతడుమాత్రం నన్ను తన పరివారంవెంట ఆష్బీ పోటీలకు రానిస్తాడా? రానివ్వడు! మాల్వాయిసిన్, ఫ్రాంట్ డిబాఫ్‌ల తాలూకు ఎస్టేటులగుండా ఒంటరిగా ప్రయాణించడం బొత్తిగా క్షేమంకాదు. సరే పద, నీతోనే వస్తాను. మనం ఇక్కడనుంచి తక్షణం పారిపోవాలి. నడువు. ఇదిగో నీ కర్ర. ఏం, ఇంకా తడవు చేస్తున్నావ్?' అని తొందరించాడు ఇసాక్.

'తడవు చెయ్యడంలేదు. ఇక్కడనుంచి బయటపడే ఉపాయం చూడాలి. నా వెంట రా' అని యాత్రికుడు అచటినుండి బయలుదేరి, పక్కగదిలో నిద్రపోతున్న గర్తును లేపాడు. 'గర్త్, త్వరగా లే. లేచి పెరటివాకిలి తెరువు. నేనూ యీ యూదీయుడూ వెంటనే ఇక్కడనుంచి వెళ్ళిపోవాలి.'

ఎవడురా ఇంత చొరవగా లేపుతున్నాడని గర్త్ మోచేతిమీద సగం లేచి, 'ఏమిటీ, పెరటి వాకిలి తెరవాలి! యూదీయునితో కలిసి నీవు బయటికి పోతావా? అలా వీల్లేదు! పెద్ద గేటు తెరిచిందాకా ఆగిపోవలసిందే!' అంటూ మరల పడుకున్నాడు గర్త్. యాత్రికుడంతట— 'అలా కాదు గర్త్, నీ విప్పుడు వెంటనే పెరటివాకిలి తియ్యక తప్పదు' అంటూ అతని చెవిలో ఏదో చెప్పాడు. గర్త్ విద్యుత్ప్రవాహం సోకినట్లు అదిరిపడి లేచాడు. యాత్రికుడు, 'జాగ్రత్త సుమా, నోరు మెదపవ'ద్దన్నట్లు తర్జని చూపి, వెంటనే పెరటి వాకిలి తియ్యమని తొందరించాడు.

గర్త్ ఇక ఆలస్యం చెయ్యలేదు. ముగ్గురూ బయలుదేరారు. పెరటి వాకిలి వద్దకు చేరాక, 'నా కంచర గాడిద యేదీ, నా కంచర గాడిద!' అని అదుర్దా పడ్డాడు ఇసాక్. అతని కంచర గాడిద అతనికి తెచ్చిపెట్టమంటూ యాత్రికుడు, తనకు కూడా ఒకటి తెచ్చిపెట్టమని గర్త్‌తో చెప్పాడు. ఆష్బీపోటీలు చూడ వచ్చే సెడ్రిక్ పరివారంలోనివారికి దానిని జాగ్రత్తగా తిరిగి అప్పగించేస్తానన్నాడు. 'అయితే మరి, నీవు—' అంటూ చెవిలో ఏదో చెప్పాడు. గర్త్ సంతోషంగా ఒక గంతు వేసి, 'తప్పకుండా! అంతకంటె ఇంకేం కావా'లంటూ కంచర గాడిదలు తీసుకురావడానికి పరుగెత్తాడు.

కొంతసేపటికి గర్త్ కంచరగాడిదలతో అగడ్త అవలివైపున కనుపించాడు. ఒక సన్నని వంతెనమీదుగా యాత్రికుడు యూదీయునితో అగడ్త దాటి అవలియొడ్డుకు చేరాడు. ఇసాక్ తన అంగీలోపలినుంచి అదరాబాదరాగా ఏదో సంచీ తీసి జీనుక్రింద భద్రపరచి, తొందరగా కంచర గాడిదనెక్కి ప్రయాణమయ్యాడు. యాత్రికుడు కూడా కంచరగాడిద నెక్కి పయనం కాబోతూ గర్త్‌కు చేయి అందిచ్చాడు; అతడు దానిని అత్యంత భక్తితాత్పర్యంతో ముద్దాడి, వారిరువురూ కనుచూపుమేర దాటిపోయేవరకూ అలా చూస్తూ నిలబడిపోయాడు.

యాత్రికునికి ఆ అడవిదారులన్నీ సుపరిచితమైనట్లు కనుపించాయి— ఎన్నెన్నో ప్రక్కత్రోవలు తీస్తున్నాడు. ఇసాక్‌కు లోలోపల గుండెలు కొట్టుకుంటున్నాయి—తీసుకొనిపోయి ఎవరికి అప్పగిస్తాడోనని. అతని భయానికి కారణం లేకపోలేదు. ఆ కాలంలో, నార్మన్లేమి, సాక్సన్లేమి, డేనులేమి, బ్రిటనులేమి, యూదీయజాతిని పెట్టే బాధలు అలాంటివి. రిచర్డు రాజు తమ్ముడు జాన్ పరిపాలనకాలంలో, అతడొక ధనిక యూదీయుని తన కోటలో బంధించి, తాను కోరిన ధనం వానివద్దనుంచి రాబట్టడంకోసం, రోజుకొక దంతం పట్టించి ఊడబెరికించాడట. అలా సగం దంతాలు ఊడగొట్టిన పిమ్మటగాని ఆ యూదీయుడు జాన్ కోరిన డబ్బు ఇస్తాననలేదట. ఇలాంటి బాధలెన్నో పడుతూనే, యూదీయులు, ధనంమీది ఆశకొద్దీ, ఆరోజుల్లో వ్యాపారాలు చేస్తూ

ఉంటేవారు. అపారంగా డబ్బు కూడబెట్టి, దానివలన వచ్చే పర్యమానం నెదు కొక్కడంతోపాటు, కొంత పలుకుబడినిగూడా సంపాదించుకుంటూ ఉంటేవారు.

పలురకములైన ప్రక్కదారులవెంట యాత్రికుడిలా ఇసాక్‌ను త్వరితగతిని తీసుకొని పోయిపోయి, తుదకు ఒకచోటికి వచ్చాక ఇలాఅన్నాడు : 'అదిగో ఆ మూలలి ఓకుచెట్టువరకూ ఫ్రాంట్-డి-బాఫ్ ఎస్టేటు సరిహద్దు. మాల్వో యిసిన్ ఎస్టేటు సరిహద్దును ఇదివరకే ఎప్పుడో దాటాము. ఇక నిన్నెవ్వరూ వెంటాడుతారని భయపడనక్కరలేదు, నీవు వెళ్లిపోవచ్చు.'

ఇసాక్ ఇంకా బెదురుగానే, 'వద్దు వద్దు, నన్నప్పుడే వదలి వెళ్లవద్దు! నీకు పుణ్యముంటుంది. టెంప్లారుగాని, వాని అరబ్బీబానిసలుగాని, ఏ సరిహద్దు నియమాలనూ పాటించే రకంగాదు'అని ప్రార్థేయపడ్డాడు. 'సరే,ఇంక కొంతదూరం పోతే షెఫీల్డునగరం చేరువకు వస్తాం,అక్కడ మీ జాతివాళ్ళెవరైనా నీ కాశ్రయమిచ్చేవాళ్లు దొరకవచ్చు. అంతవరకూ మాత్రమే నేను నీతో రాగలను' అన్నాడు యాత్రికుడు. ఇసాక్ సంతోషించి, 'యెహోవా నిన్ను చల్లగాచూడాలి. షెఫీల్డు దాకా నీవు నాకు తోడువస్తే చాలు. అక్కడ మా బంధువు జారెత్ ఉన్నాడు. ఆ తర్వాత నా తంటాలు నేను పడగలను' అన్నాడు.

ఒక అరగంటలో షెఫీల్డు నగరం పొలిమేరకు వచ్చారు. యాత్రికుడు తానిక వెళ్ళిపోతానన్నాడు. 'ఈ వేళ నాకు ఇంత ఉపకారంచేశావు, నీకేమి ప్రత్యుపకారం చేయగల' నన్నాడు ఇసాక్. 'నాకేమీ నీవు చేయనక్కరలేదు. ప్రతిఫలం కోరి నీకు నేనీ సాయం చేయలేదు. నీకు బాకీవుండి నీ పాలిటబడ్డ ఏ ఒక పేదక్రైస్తవుడైనా నీవు నానాహింసలూ పెట్టకుండా నా పేరున వదలిపెడితే అదే నాకు గొప్ప ప్రతిఫలంగా యెంచుకుంటా'నన్నాడు యాత్రికుడు. 'అలాకాదు,నీకిప్పుడు అవసరంగా ఏమికావలసియున్నదో నేను ఊహించాను,... చెప్పనా ?' అన్నాడు ఇసాక్. 'నీ ఊహ ఒకవేళ సరియైనదేయైనా అది సమకూర్చడం నీ వల్లనయ్యే పనికా'దన్నాడు యాత్రికుడు. 'తప్పకుండా సమకూర్చగలను. ఒక గుర్రం, ఒక కవచం— ఇవికాద నీకిప్పుడు అవసరంగా కావలసినవి ?' అని అడిగాడు ఇసాక్.

యాత్రికుడు చకితుడై ఇసాక్‌కు మరింత చేరువగా వచ్చాడు. 'నిన్నరాత్రి, ఈవేళ ఉదయం నీ వన్న కొన్ని మాటలనుబట్టి నే నిది ఊహించాను. నేను పడుకున్న పక్కమీదికి నీవు ఈ ఉదయాన వంగినప్పుడు, నీ అంగీలోంచి యోధవరులు ధరించే బంగారు గొలుసు మెరుస్తూ కనుపించింది. నీవు యాత్రికుని వేషంలో వున్న ఒక యోధుడవని గ్రహించాను' అన్నాడు ఇసాక్. యాత్రి

కుడు యిక నవ్వాపుకోలేకపోయాడు. 'నీ అంగీని కూడా సోదాచేస్తే ఎలాంటి రహస్యాలు బయటపడతాయో!' అని బెదరించాడు.

ఇసాక్ వివర్ణుడై, మాట తప్పించి, సంచీలోంచి వ్రాతపరికరాలు తీసి, ఒక కాగితంమీద హిబ్రూభాషలో ఏదో వ్రాసి యాత్రికుని చేతికిస్తూ, 'ఇదిగో ఈ కాగితం లీసిస్టరు నగరంలో జైరాం అనే యూదువ్యాపారి కిస్తే నీకు కావలసినవి యిస్తాడు. అతనివద్ద ఆరు మేలిరకం మిలాను కవచాలూ, పది ఉత్తమ జాతి భద్రాశ్వాలూ అమ్మకానికి సిద్ధంగా వున్నాయి. నీ కిష్టమొచ్చినవి ఏరి తెచ్చుకో. పని అయిన తర్వాత జాగ్రత్తగా తిరిగి అప్పగించేసెయ్' అన్నాడు.

'పోటీలో నేను దెబ్బతింటే, పోటీ నియమాల ప్రకారం నా గుర్రం విజేతకు పోవలసి వస్తుందిగదా, అప్పుడు ఎలా?' అన్నాడు యాత్రికుడు. ఇసాక్ కొంచెం కలవరపడి, మళ్ళా ధైర్యం తెచ్చుకొంటూ, 'మరేం ఫరవాలేదు. అలా జరగదు. నీవే తప్పకుండా గెలుస్తావు' అంటూ కంచరగాడిదను షెఫీల్డు వైపుకు తోలబోయాడు.

యాత్రికుడతని అంగీ పట్టుకొని ఆపి, 'గుర్రం ఒకవేళ చచ్చిపోవచ్చు. కవచం చిరిగిపోవచ్చు. పరిహారంగా ఏదో యివ్వాలిగదా' అని అడిగాడు. ఇసాక్ కూలనొప్పి వచ్చినవాడిమాదిరిగా మెలికలు తిరిగి, తిరిగి సంబాళించుకొని, 'అయినా ఫరవాలేదులే. నీ వేమీ యివ్వనక్కరలేదు, నాయందు బంధుప్రీతిచే నీవద్ద జైరాం ఏమీ పుచ్చుకోడు. వెళ్ళిరా. కాని, ఒక్కమాట. పోట్లాటలో అతిచొరవ చెయ్యకుండా ఉండడం మంచిది. గుర్రం కోసం, కవచం కోసం యిలా అంటున్నాననుకోకు! నీ ప్రాణానికి ముప్పువాటిల్లేను! జాగ్రత్త!' అని హెచ్చరించాడు.

యాత్రికుడు మరల చిరునవ్వు నవ్వి, 'నీ హెచ్చరికకు నా కృతజ్ఞతాభివందనాలు. నీ ఉపకారానికి ప్రతిఫలం నేను ముట్టజెప్పకుండా ఉండనులే' అన్నాడు. ఇద్దరూ విడిపడి, వేర్వేరు మార్గాలు పట్టి వెళ్ళిపోయారు.

ఉత్తరద్వారం వైపున అలాగే ఒక పెద్ద ఆవరణ ఉంది. పైన చెప్పిన ఆయుధగుడిలో ఎవరితోనైనాసరే పోరాడ నిశ్చయించిన యోధులకోసం ఆ ఆవరణ ఏర్పాటయింది. దాని వెనుక కొన్ని శిబిరాలున్నాయి. అవి ఆ పోటీదారుల ఉపయోగార్థం కేటాయించబడ్డాయి. పోటీదారుల తాలూకు అనుచరులు తమ యజమానులకు కావలసిన సదుపాయాలు చూడడానికి అక్కడ సిద్ధంగా ఉంటారు.

రంగస్థలానికి వెలుపలి ప్రదేశం చుట్టూ తివాసీలతోనూ, ఇతరవస్త్రాలంకారాలతోనూ, గ్యాలరీలు ఏర్పాటు చేయబడ్డాయి. సామంతులకూ, వారి స్త్రీజనానికీ, ఇతర ఉన్నతవర్గాలకూ ప్రత్యేకించబడ్డ గ్యాలరీలివి. వీటికీ, రంగస్థలానికీ మధ్యనున్న తావుల్లో, సామాన్యజనంతో జమకట్టుటకు వీలులేని మధ్యతరగతి ప్రేక్షకులకు వసతి యేర్పరిచారు. గ్యాలరీలకు చుట్టూవున్న ప్రదేశమంతా సామాన్యజనం కూర్చోడానికి. ఇది చాల యెత్తుగా ఉన్న కారణంచేత, అక్కట కూర్చున్న వారి చూపుకు గ్యాలరీలు అడ్డురావు. పోటీలు చూడవచ్చిన జనసమూహాలతో ఈ ప్రదేశమంతా క్రిక్కిరిసిపోగా, వందలకొలది జనులు ఆ మైదానం అంచులనున్న చెట్లకొమ్మలమీదకూడా ఎక్కి కూర్చున్నారు.

రంగస్థలానికి తూర్పువైపున, సరిగ్గా నడిమి ప్రదేశంలో, అనగా పోటీదారులు సామాన్యంగా ఒండొరులతో డీకొనే ఆ వున కెట్టయెదుటగా, తక్కిన గ్యాలరీలకంటె ఎత్తుగా ఉండేటట్లు ఒక గ్యాలరీ నిర్మించబడి ఉంది. దీనిని రాజచిహ్నాలతో అలంకరించారు. చక్కని చాందినితో, ఒక సింహాసనం లాంటిదాన్ని లోపల అమర్చారు. రిచర్డు మహారాజు స్థానే ప్రస్తుతం దేశాన్ని పరిపాలిస్తున్న ప్రిన్సు జాన్ సపరివారంగా కూర్చోడానికి ఏర్పాటైన గ్యాలరీ ఇది. దీనికి సరిగ్గా ఎదుటివైపున, రంగస్థలానికి పడమటి దిశను, అంత యెత్తునసే మరొక గ్యాలరీ ఉంది. దానిని అంతకంటె పుష్కలంగా కాకపోయినా, ఇంతకంటె విలాసంగా అలంకరించారు. నడుమ నొక చక్కని గద్దె అమర్చబడి ఉంది. దానిచుట్టూ, రంగురంగుల దుస్తులు ధరించి, అందగత్తెలు పెక్కుమంది కూర్చున్నారు. ఎన్నిక కావలసియున్న అందాలరాణి కొరకు ఆ గద్దె యేర్పాటు చేయబడిందని అచట సువర్ణాక్షరాలతో ఒక ప్రకటన వ్రేలాడుతోంది. ఎవరా అందాలరాణి? ఎవరు ఎన్నుకోబడుతారో ఎవరికి తెలుస్తుంది?

ప్రేక్షకస్థానాలన్నీ క్రమేణా జనంతో క్రిక్కిరిసి పోయినాయి. కూర్చుంటే స్థలం విషయమై అల్పజనం తగాయిదాలు పడుతూంటే, సైనికులు కరకుకత్తులూ గండ్రగొడ్డళ్ళూ ఝళిపించి కిక్కురుమనకుండా కూర్చోబెట్టుతున్నారు. పై తరగతులవారిలో వచ్చే తగాదాయిలను పై ఉద్యోగులు తీరుస్తున్నారు. గ్యాలరీలపై మగవాళ్ళ సంఖ్యకంటే ఆడవాళ్ళ సంఖ్యే ఎక్కు

అందరూ తేలిపోతున్నారు. ఆమె తొడిగిన చొక్కాకు రత్నాలు పొదిగిన బంగారు గుండీలున్నాయి. ఎండవేడిమి కారణాన పైన మూడు గుండీలు తగిలించక వదిలివేయడం ఆమె సోయగానికి మరింత విలాసం తెచ్చింది. చొక్కాలోపలినుంచి ఒక రత్నాలహారం బయటికి తొంగి చూస్తోంది. తలపాగకు తురాయిగా తగిలించిన నిప్పుకోడియీకను చూచి, పైన గ్యాలరీలో కూర్చున్న అమ్మమిన్నలు కొందరు, పైకి అపహాస్యం చేసినా, లోలోపల అసూయపడకపోలేదు.

జాన్ ఈ సౌందర్యానికి ముగ్ధుడై, ప్రియర్ ఐమర్‌ను చేరబిలిచి, చూడావా ఈ సౌందర్యరాశినంటూ, అతనికూడా ఆమె సౌందర్య విశిష్టతను పొగడ నారంభించాడు. ఐమర్ అప్పుడప్పుడు మెచ్చుకుంటూనే, ఆమె యెంత సౌందర్యవతియైనా యూదీయురాలనే సంగతి మరచిపోకూడదు సుమండీ అని హెచ్చరించాడు. జాన్ ఆ మాట యేమీ లక్ష్యపెట్టక, తనకు అప్పుపెట్టబోయే ఇసాక్ మొదట ఎక్కడలేని ఆప్యాయత కనబరుస్తూ, ఆమెతోపాటుగా అతనికి గ్యాలరీలో చోటిచ్చితీరాలని అనతిచ్చి, 'ఎవరీమె ఇసాక్, నీ రత్నాలపెట్టెవలె భద్రంగా దాచుకొన్నట్లు చంకక్రింద దాచుకొన్నావ్ పెండ్లామా, కూతురా!' అని అడిగాడు.

ఇసాక్ నిబ్బరంగానే, 'ఈమె నాకూతురు రెబెకా అండీ! ప్రభువులు చిత్తగించాలి' అని సమాధానమిచ్చాడు. అతని సమాధానంలో వినయంతోపాటు వెక్కిరింతకూడా మిళితమయింది.

'కూతురుకానీ, భార్యకానీ,—ఆమెకున్న చక్కదనాన్నిబట్టీ, నీకున్న యోగ్యతలనుబట్టీ, మీకు గ్యాలరీలో చోటు అవశ్యంగా యిచ్చితీరాలి. యెవరా పైన కూర్చున్నది? సాక్సనులాగున్నారే! ఏమిటా పరుచుకొని కూర్చోడం! ఆ గబ్బిలాయిల్ని దగ్గిరగా జరిగి కూర్చోమనండి. మా షావుకారు మహారాజుకూ అతని కుమార్తెకూ చోటు కావాలి' అని కేక పెట్టాడు.

ఆ గ్యాలరీపైన కూర్చున్నది సెడ్రిక్ కుటుంబం. వారితోపాటుగా కోనింగ్స్‌బర్గ్ అధినేత ఎథెల్‌స్టేన్ కూడా అక్కడ కూర్చున్నాడు. ఇంగ్లాండును యేలిన సాక్సన్ రాజుల వంశీకుడైనందువల్ల, అతడంటే సాక్సనులకు యెంతో గౌరవం. కాని, ఆ రాజవంశం తాలూకు కొన్ని అవలక్షణాలుకూడా ఎథెల్‌స్టేనుకు సంక్రమించాయి. అందమైన ముఖమే. మంచి ఒడ్డూ పొడుగూ గల మనిషి. నడియౌవనంలో ఉన్నాడు. కాని, ముఖంలో చురుకుదనం లేదు. కళ్ళలో మందకొడితనం కనిపిస్తుంది, చలాకీ కదలికలేదు. త్వరితంగా ఒక నిర్ణయానికి రాలేడు. ఈ చండితనం అతనికి, నిర్ణయం త్వరగా చేసుకోలేకపోవడంవల్ల వచ్చినదేకాని, ధైర్యంలేకపోవడంవల్ల కాదని, అతనియందు గాఢాభిమానం గల మిత్రు

అంతా అంటూవుంటారు. సెడ్రిక్ అభిప్రాయం కూడా అదే. కాని, ఇతరులు కొందరు ఆ మాట ఒప్పుకోరు. 'వంశపారంపర్యా సంక్రమించిన తాగుడు వ్యసనంమూలంగా అతని మానసికశక్తులు పూర్తిగా కుంటుపడిపోయినాయి— అసలవి వ్యగ్రంగా ఏనాడూ ఉండలేదు. మెచ్చదగిన ఉత్తమగుణాలన్నీ వ్యసన భూయిష్ఠమై నశించిపోగా, స్తబ్ధత్వంతో కూడిన ఒకవిధమైన ధైర్యమూ, సాహసవంతులకుండే ఒకవిధమైన మంచితనమూ, ఇవిమాత్రం మిగిలాయి'—అని వారి వాదం.

రెబెకా ఇసాకులకు చోటు చేయించడంకోసం జాన్ ఎథెల్‌స్టేనువంక చూస్తూనే పైన చెప్పిన కేక పెట్టాడు. హఠాత్తుగా ఎదుర్కొవలసి వచ్చిన యీ ఘట్టంలో ఎథెల్‌స్టేనుకు ఏమి చెయ్యడానికీ పాలుపోలేదు. ఆజ్ఞను వెంటనే పాలించడానికి మనసొప్పించలేదు. పాలించకపోతే ఏ విధంగా ప్రతిఘటించాలో అంతకంటె తోచలేదు. పట్టి స్తబ్ధత్వంతో, కదలకుండా మెదలకుండా, గుడ్లురిమి జానువంక ఆశ్చర్యంగా, హాస్యాస్పదంగా చూశాడు.

జాన్‌కు అసహనం ఎక్కువయింది. 'ఏమిటా సాగ్జను గాడిద అలా చూస్తాడు? నిద్రమత్తులో ఉన్నాడా, లేక, నా మాటంటే లక్ష్యంలేదా? డీ. బ్రేసీ, నీ బల్లెంతో వాణ్ణొక పోటు పొడు' అన్నాడు తన పక్కనున్న ఒక యోధుడితో. డీ. బ్రేసీ జాన్ పోషణలో ఉన్న కూలిసైన్యానికి నాయకుడు. జాన్ ఈ విధంగా ఆజ్ఞ యివ్వడం అతని పరివారంలోనివారికి సైతం వెరపు కలిగించింది. కాని, డీబ్రేసికి ఈ సంకోచాలేమీ లేవు. బల్లెం ఎత్తి గ్యాలరీ వైపు చాచాడు. తనమీదికి వస్తున్న బల్లెంనుంచి తప్పించుకోవాలో లేదో కూడ తెలియని స్తబ్ధస్థితిలో ఉన్నాడు ఎథెల్‌స్టేను. ఇంతలో సెడ్రిక్, మెరపు మెరసినట్లు వరనుండి కత్తిలాగి, ఒక్కవిసురున బల్లెపు మొనను రెండు తునియలు చేశాడు. జాన్ మొగం కంపగడ్డ అయింది. క్రోధోన్మత్తుడై దురుసుగా ఏమో అనబోయాడు. కాని, ఇంతలో, పరివారంలోనివారే అతనిని తొందరపడవద్దని వారించారు. సెడ్రిక్ ప్రదర్శించిన సాహసానికి ఆ చుట్టుపట్ల జనమంతా హర్షధ్వానాలు చెయ్యడంకూడా అతని దూకుడుకు అడ్డకట్ట వేసింది. గుడ్లు తీవ్రంగా సంచలించాయి. లోనిఅక్కసు ఇక ఎలా తీరడం? సెడ్రిక్ చేసిన పనికి సంతోషంతో ఇంకా చప్పట్లు కొట్టుతున్న ఒక రైతువైపు అతని దృష్టి మళ్ళింది. 'ఏమిరా, ఎందుకా చప్పట్లు?' అని వానివైపు ఉరిమిచూస్తూ ప్రశ్నించాడు. 'గురితప్పని వ్రేటు యెక్కడ చూచినా నేను మెచ్చుకోకుండా ఉండలేను' అన్నాడా రైతు. 'అలాగేం? గురి తప్పకుండా నీ కేమాత్రం కొట్టగలవేమిటి?' అని అడిగాడు జాన్. 'విలువిద్య నేర్చిన మా రైతులకు సామాన్యంగా యెలాంటి లక్ష్యశుద్ధి ఉంటుందో అదే నాకూ ఉంది' అన్నా డతడు. 'నూరు గజాలదూరంనుండి వాట్ టైరెల్ ప్రదర్శించిన లక్ష్యశుద్ధి!'

అన్నారెవరో వెనుకనుంచి. యెవ్వరన్నదీ తెలియలేదు. తన తాత విలియం రూఫస్, అలా మూడు గజాల దూరంనుండి వదలబడ్డ బాణానికి బలియైన సంగతి వెంటనే స్ఫురణకు వచ్చింది జాన్‌కు. కోపమూ భయమూకూడ కలిగాయి. తమాయించుకొని, అచటనున్న సైనికులతో, 'ఈ బడాయికోరును కనిపెట్టి ఉండండి. ఇతరుల చేష్టను తెగమెచ్చుకునే వీడు తానెలాంటి చేష్ట చేస్తున్నాడో పరీక్షిద్దాం' అన్నాడు, ఆ రైతువంక చూపిస్తూ.

'పరీక్షిస్తే పరీక్షించవచ్చు. నే నెక్కడికీ పారిపోను'— అన్నాడా రైతు నిబ్బరంగా.

'మంచిది. అదలా ఉండనీ. ఇప్పటికీ యూదీయునికి గ్యాలరీలో చోటు ఇచ్చితీరాలి. ఆ సాగ్జన్ గబ్బిలాయిలు ఇంకా అలా చూస్తారేం, లేచి నిలబడండి!' అని అరిచాడు జాన్.

'వద్దు వద్దు, ప్రభువులు చిత్తగించాలి. మావంటివాళ్లు ఈ దేశప్రభువులైనవారిమధ్య కూర్చోడం తగని పని' అన్నాడు ఇసాక్. పేదసాగ్జనును ప్రక్కకునెట్టి తనకు చోటు కల్పించుకోజూచిన ఇసాక్, ఇప్పుడు ధనిక సాగ్జనులమధ్యకుబోయి కూర్చోడానికి జంకాడు.

కాని జాన్ అంతటితో పోనివ్వలేదు. 'ఛట్, అలా పనికిరాదు. నీవు వాళ్ళమధ్య కూర్చునితీరాలి. లేకపోతే, నీచర్మం ఒలిపించేస్తా' అని బెదిరించాడు.

చేయునదిలేక, ఇసాక్ గ్యాలరీమెట్లు ఎక్కుతుండగా, జాన్ సెడ్రిక్ వంక కొరకొర చూస్తూ, 'చూస్తా ఎవరు అడ్డంవస్తారో!' అని హుంకరించాడు. సెడ్రిక్ వైఖరిచూస్తే, అమాంతం ఇసాకును తలక్రిందులుగా క్రిందికి పడద్రోయడానికి సిద్ధపడుతున్నట్లు తోచింది.

ఇట్టి సంకట పరిస్థితిలో, విదూషకుడు వాంబా ఒక ఉపాయం చేశాడు. 'ఇదిగో నేను అడ్డం వస్తున్నా'నంటూ లేచి, సెడ్రిక్‌కూ, ఇసాక్‌కూ మధ్య నిలబడి, తన అంగీ లోపలినుంచి ఒక పందిమాంసపు వంటకం బయటికి తీసి, ఒక చేత్తో డాలులాగా దానిని పుచ్చుకొని ఇసాక్ ముక్కుదగ్గిర పెట్టాడు. పోటీలు చూడడంతో ఒకవేళ భోజనంవేళ అతిక్రమించి ఆకలివేసేటట్లయితే ఉపయోగిస్తుంది గదా అని పొట్లం కట్టి తెచ్చుకున్నాడది. యూదీయులకు పంది అన్నా, పందిమాంసమన్నా ఎక్కడలేని ఏవగింపు అని అతనికి తెలుసు. అందుచే, అతడది ఇసాక్ ముక్కు దగ్గిరపెట్టి, అంతటితో ఊరుకోక, తన కొయ్యకత్తి త్రిప్పుతూ పరవళ్లు త్రొక్కడం మొదలుపెట్టాడు. ఇసాక్ విపరీతమైన కంపరంతో వెనుకడుగు వేసి, కాలుజారి, గ్యాలరీ మెట్లమీద

నుంచి దొర్లి క్రిందపడ్డాడు. అక్కడ ఉన్న జనమంతా పకాలున నవ్వింది. ప్రిన్స్ జాన్, అతని పరివారం, ఆ జనంతోపాటు తామూకూడా నవ్వేశారు.

'దేవరవారు నాకేం బహుమతి యిస్తారో దయచేయించాలి. డాలూ కత్తితో ధర్మయుద్ధంచేసి శత్రువు నోడించేశాను' అన్నాడు వాంబా జాన్ వంక చూచి. జాన్ ఇంకా నవ్వుతూనే ఉన్నాడు. 'బలే యోధుడవులే! ఎవరు నీవు? నీ వృత్తేమిటి?' అని అడిగాడు వాంబాను. 'నాపేరు వాంబా. తాతతండ్రుల నాటినుంచీ మాది విదూషకవృత్తి. మా తండ్రిపేరు 'విట్ లెస్.' మా తాతపేరు 'వెదర్ బెయిన్.' అంటూ ఏకరువు పెట్టాడు వాంబా. 'మంచిది. నీ సాహసకార్యానికి సంతోషించాం. ఈ యూదీయునికి అయితే ఇక గాలరి దిగువమెట్టుమీద చోటుచేయండి, చాలు. ఓడిపోయినవాణ్ణి గెలిచినవాడి ప్రక్కన కూర్చోబెట్టడం సంప్రదాయం కాదు.' అంటూ జాన్, ఇసాక్ వంక తిరిగి, 'ఇదిగో ఇసాక్. ఏదీ, ఒక గుప్పెడు దీనారాలు చేబదులు కావాలి, ఇలా తే' అని అడిగాడు.

జాన్ ఇలా చేబదులడుగుతాడని ఇసాక్ కలలోగూడ అనుకోలేదు. ఇవ్వననడానికి గుండెలు లేవు. ఇవ్వడానికి మనసొప్పదు. ఈ డోలాయమాన స్థితిలో, మొలనున్న చేతి సంచీ తీసి, లోపలికి చేయి పోనిచ్చి, ఎన్ని తక్కువ నాణేలైతే గుప్పెడుగా చలామణి అవుతాయో అని కాబోలు, తడవడం మొదలుపెట్టాడు. జాన్ ఇది గమనించి, గుర్రంమీదనుంచే వంగి ఇసాక్ చేతిలోనున్న సంచీ కొట్టేసి అతని గుంజాటన తీర్చిపారేశాడు. అందులోంచి రెండు బంగారు నాణేలను తీసి వాంబా మీదికి విసిరి, ఎప్పటివలె రంగస్థలాన్ని చుట్టివచ్చే పనిమీద పరివారంతో ముందుకు సాగిపోయాడు. చూస్తూన్న జనం వింత వింత ధ్వనులు చేసి ఇసాక్ను గేలిచేసింది. ఏదో మహత్తరమైన ఘనకార్యం చేసాడన్నట్లుగా జానును ఉద్దేశించి హర్షధ్వానాలు చేసింది.

# అధ్యాయం ౯

ప్రిన్స్ జాన్ అలా పరివారంతో కలిసి ముందుకు సాగుతూ వుండగా, హఠాత్తుగా ఒక సంగతి అతనికి జ్ఞాపకం వచ్చింది. తటాలున ఆగి, ప్రయర్ ఐమర్‌ను పిలిచి అన్నాడు: 'అసలు విషయం మరిచిపోయాం, ప్రయర్ ఐమర్! ఈ నాటి విజేతకు బహుమానం ఒక అందాలరాణి చేతకదా ఇప్పించవలసివున్నది? ఆమెను ఎన్నుకోవలసిన బాధ్యత యిప్పుడు మనమీద వుంది. ఇలాంటి విషయాల్లో వ్యక్తిగతంగా నాది కొంచెం విశాలదృష్టి. ఆ నల్లని కళ్ళ రెబెకాను అందాలరాణిగా ఎన్నుకోడానికి నాకెట్టి అభ్యంతరమూ లేదు.'

ప్రయర్ ఐమర్‌కు ఒడలు జలదరించినట్లయింది. హడలిపోతూ గుడ్లింత చేసి 'అమ్మయ్యో! ఆ యూదీయకన్యనే! దాన్నిగనుక ఎన్నుకుంటే, ఇక్కడున్న జనమంతా రాళ్ళు రువ్వి మనల్ని చంపేస్తారు! అలాంటి పాపపు పనికి నేను సిద్ధంగా లేను. పైగా, నన్ను గనక అడిగితే, ఆ సాక్సన్ కన్య రొవీనా కాలి గోరుకు సాటిరాదు ఈ రెబెకా' అన్నాడు. జాన్ ఈ మాట సయించలేదు. 'సాక్సన్లేమిటి, యూదీయులేమిటి? ఆ పశువులు ఈ పసరాలకంటే ఎక్కువ వాళ్ళేం కాదు. ఆ సాక్సన్ గాడిదలకు మంచి శాస్తి చేసినట్లుగా వుంటుంది — వెంటనే రెబెకాను అందాలరాణిగా ప్రకటించు' అన్నాడు ధీమాగా.

కాని, ఈ మాటకు అతని అనుచరబృందంలోనే సణుగుడు బయలుదేరింది. 'ప్రభువులిట్లా వేళాకోళమాడుతున్నారేమో' ఇలాంటి అవమానం గనక జరిగితే, ఇక్కడున్న యోధులంతా ఒక్కపెట్టున తిరగబడతారు' అన్నాడు అతని దళవాయి డీ బ్రేసీ. వాల్డిమార్ ఫిట్జర్స్ అనే మరొక ముఖ్యానుచరుడందుకొని, 'ఇలా చెయ్యడం మనము వేసుకొన్న పధకాలన్నిటినీ చేతులార కూలద్రోసుకోడమే సుమండీ' అని హెచ్చరించాడు.

జాన్‌కు ఎక్కడలేని రోషమూ పుట్టుకువచ్చింది. చేతనున్న కళ్ళెపు బిగింపుతో తన దురహంకారం చిందులు తొక్కుతూ వుండగా, 'వాల్డిమార్, నిన్ను మేము పెట్టుకున్నది మా ఆజ్ఞలు పాలించడానికి గాని, మాకు సలహాలివ్వడానికి కాదు' అని మందలించాడు. వాల్డిమార్ తొణక్కుండా బెణక్కుండా తగ్గుస్థాయిలోనే ఇలా సమాధానమిచ్చాడు: 'నిజమే కావచ్చు. కాని, తమ ఆజ్ఞలు పాలిస్తూ, తాము నడిచే దారుల్లో తమ వెంట వచ్చే మావంటివారందరికీ తమకు

నలహాయిచ్చే అధికారంకూడా స్వతస్సిద్ధంగా ఏర్పడుతుందని ప్రభువులు చిత్తగించాలి. ఏలనంటే, ఇక్కడ తమ క్షేమం, తమ భద్రతతోపాటుగా, మా క్షేమం, మా భద్రత కూడా మేము చూచుకోవలసి వుంటుంది.'

వాల్డిమార్ కంఠస్వరంలోని బిగివినిబట్టి, ఇక తాను వెనుకకు తగ్గక తప్పదని జాన్ గ్రహించాడు. 'ఊరికే తమాషాకంటే మీరంతా ఇంత కూతాన్ని కె క్రాంచుపాముల్లై బుసలుకొట్టారే! మీ యిష్టంవచ్చినవారి నెన్నుకోండి, నాకు ఏమీ అభ్యంతరంలేదు' అని తప్పుకున్నాడు.

డీబ్రేసీ వెంటనే అందుకొని, 'అలాకాదు, మనమిప్పుడు ఒక పనిచేద్దాం, ఆ అందాలరాణినిప్పుడు మనంతటమనం యెన్నుకోవద్దు. ఈనాటి విజేతనే ఎన్నుకోమందాం. అతని విజయం అందుమూలంగా మరింత వన్నెకెక్కుతుంది. యోధాగ్రేసరుల ప్రేమోపాయనపు విలువలను అందాలభరిణెలు మరింత యెక్కువగా గ్రహించగల్గుతారు' అని ఒక క్రొత్త ప్రతిపాదనచేశాడు.

'బాగుంది! ఈనాడు విజేత టెంప్లార్ బ్రయాన్ గనుక అయితే ఆ అందాలరాణిని యెన్నుకునే బాధ్యత నాకు వదిలివెయ్యండి' అన్నాడు ప్రయర్ ఐమర్. 'టెంప్లార్ బ్రయన్ గొప్పయోధుడే కాని, ఈ పోటీలో అతనితో డీకొన నుత్సహించే బల్లిదులు చాలామంది వున్నారు' అన్నాడు డీబ్రేసీ.

'ఇక ఆపండి. కాలాతీతం అవుతోంది. ప్రేక్షకులూ, యోధవరులూ కూడా తొందరపడుతున్నారు. కార్యక్రమమిక వెంటనే ప్రారంభించడం మంచిది. ప్రభువులవారిక కూర్చుంటారు' అన్నాడు వాల్డిమార్.

ప్రిన్సుజాన్ యింకా రాజు కాకపోయినా, రాజాగారికి ఆ ప్రసచివులవల్ల వుండే యిబ్బందులన్నీ వాల్డిమార్‌వల్ల అతనికున్నాయి. వాల్డిమార్‌కు ప్రభుచిత్తాన్నిబట్టి తాను నడచుకొనే అభ్యాసంలేదు. తన చిత్తం ప్రకారం ప్రభువు నడుచుకోవలసినదే! చిన్న చిన్న విషయాలకు లేనిపోని పట్టింపులు పట్టి మూర్ఖించడం జాన్‌కు సామాన్యంగా అలవాటు. కాని ఇక్కడ వాల్డిమార్ నిర్దేశాన్ని వ్యతిరేకించలేక, సరాసరి వెళ్ళి తన గద్దెపై యెక్కి కూర్చున్నాడు. పరిజనమంతా చుట్టూ యథోచితస్థానాలలో కూర్చున్నారు. పోటీ నిబంధనలు యెల్లరకూ తెలియజేయవలసిందిగా జాన్ చోపుదారులకు సంజ్ఞ చేశాడు. ఆ నిబంధనల సారాంశం ఏమంటే—

ఒకటి: దక్షిణద్వారంవైపు డేరాలలోని అయిదుగురు యోధులూ 'మాతో ఎవరు పోట్లాటకు రాగలరో రం'డని సవాలుచేసి నిలిచినవారు. ఈ పోటీలలో [illegible] వారు డీకొనడానికి సిద్ధంగా ఉండాలి.

రెండు: ఈ యోధులతో ఢీకొనదలచిన ప్రతియోధులు, తామా యోధులలో ఎవరితో ప్రత్యేకంగా పోరాడదలచినదీ తెలియజేయడానికి గాను, ఆ యోధుల శిబిరాల ముందు ప్రేలాడగట్టబడ్డ డాలును తమ ఈటెతో స్పృశించాలి. ఈటె మొనతో గాక మడమతో ఆ స్పృశించడం జరిగితే, పోరాటం మొనలేని ఆయుధాలతో జరుగుతుంది. అనగా, ఈటె మొనకు ఒక గుండ్రని బిళ్ళను బిగిస్తారు. ఇందువల్ల, యోధులు తమ గుర్రాలను పరుగెత్తించుకుంటూవచ్చి ఒండొరులను తాకినప్పుడు, ఆ వేగతీవ్రతనుబట్టి కలిగే ప్రమాదం తప్ప ఇంకే ప్రమాదమూ ఉండదు. అలా కాకుండా, డాలును వాడిమొనతోనే స్పృశించడం జరిగినట్లయితే, పోరు నిశితమైన ఆయుధాలతో, అచ్చమైన యుద్ధం జరిగినట్లు జరుగుతుంది.

మూడు: పోరాటంలో ఒక్కొక్క యోధుడు అయిదుగురు ప్రతియోధులను ఓడించగలగాలి. అలా జరిగిన పిమ్మట, ఈ మొదటి రోజు పోటీలో అగ్రతాంబూలం అందుకోదగిన విజేత యెవ్వరైనదీ ప్రిన్స్‌జాన్ నిర్ణయించేసి ప్రకటిస్తాడు. మంచి జవసత్వములుగల ఒక చక్కని ఉత్తమజాతి అశ్వరాజం ఆ విజేతకు బహుమతిగా ఇవ్వబడుతుంది. ఈ బహుమతికితోడు, ఈ ఉత్సవానికి అధ్యక్షురాలుగా ఒక అందాలరాణిని ఎన్నుకొనే గౌరవాధికారం కూడ ఈ మొదటిరోజు విజేతదే.

నాలుగు: తరువాత రెండవరోజున, సంకుల సమరమే కాని ద్వంద్వ యుద్ధాలుండవు. పోరాడదలచిన యోధులు సమాన సంఖ్యగల రెండు పోటీ వర్గాలుగా విభజించబడుతారు. పోరాటం ఆపవలసిందని ప్రిన్స్ జాన్ సంజ్ఞ చేసేటంతవరకూ వారు పోరాడాలి. ఈ రెండవరోజున ఎవరు అందరికంటె గొప్పగా పోరాడినట్లు ప్రిన్స్‌జాన్ నిర్ణయిస్తాడో, వాని శిరసున అందాలరాణి చేత సువర్ణమకుటధారణం చేయిస్తారు. ఇక్కడితో అశ్విక యోధుల కయ్యపు పోటీలాఖరు. అటుపిమ్మట, జనసామాన్యానికి వినోదం కూర్చే నిమిత్తం, ధనుర్విద్యా ప్రదర్శనాలు మొదలైనవి జరుగుతాయి. చీటికీ మాటికీ అనాలోచితంగా, కూడని పనులెన్నో చేస్తూ ప్రజాభిమానానికి దూరమౌతూవుండిన జాన్, అప్పుడప్పుడిలాంటి వినోదకాలక్షేపాలు జరిపి తిరిగి వారి అనురాగం సంపాదించుకోడానికి తంటాలు పడుతూ వుండేవాడు.

చోపుదారుల ప్రకటన పూర్తికాగానే, ఆచారం ప్రకారం, వారిమీదికి బంగారు నాణేలూ, వెండి నాణేలూ గ్యాలరీలనుంచి వానజల్లుగా కురిసాయి— బాకాలవారు బాకాలూదడంతోపాటు ఇతర వాద్యాలు హడావుడిగా మ్రోగాయి. రంగస్థలం అతిశీఘ్రంగా ఖాళీ అయింది. శాంతిభద్రతల రక్షణకై నియోగించబడ్డ కొందరాశ్వికులు మాత్రం ఉత్తర దక్షిణ ద్వారములవద్ద శిలా

ప్రతిమలవలె సాయుధులై సావధానంగా నిలబడ్డారు. ఉత్తరద్వారం అవతల వున్న ఆవరణ అంతా యోధులతో కిక్కిరిసిపోయి వుంది. గ్యాలరీలనుంచి చూచేవాళ్లకు, ఆ శిరస్త్రాణాలూ, ఆ యీకల తురాయిలూ, ఆ పొడుగాటి యీటెలూ బహుసుందరంగా కదలాడుతూ కనిపిస్తున్నాయి. ఈ ఈటెన్నిటి చాల కరకు, మొనలు లేకుండునట్లుగా గుండ్రని బిళ్లలతో బిగించబడినవే.

ఈ ప్రతియోధులలోంచి, మొట్టమొదటగా, చీట్లువేసి అయిదుగురిని ఎన్నుకున్నారు. ఉత్తరద్వారం తీయడంతోటే, వీరు తమ గుర్రాలపై మెల్లిగా రంగస్థలంలోకి ప్రవేశించి దక్షిణద్వారం వైపుగా ముందుకు సాగుతూ ఉన్న సమయంలో, దక్షిణద్వారపు శిబిరాల్లోంచి అరబ్బీదేశపు సంగీత వాద్యాలు వినిపించసాగాయి. ఆ వాద్యకాళగతుల ధోరణి ఆ ప్రతియోధులకు ఒకే సమయంలో స్వాగతం చెపుతున్నట్లూ ఉంది, తిరస్కారం చూపుతున్నట్లూ ఉంది. అయిదుగురు ప్రతియోధులూ ఒక్కొక్కరొక్కొక్క యోధుని డాలుడాలును తమ యీటెమొదటితో — మొనలతో కాదు — స్పృశించారు. అచటి ప్రేక్షకజనంలో చాలామందికి — ముఖ్యంగా స్త్రీజనానికి — ఇది నిరుత్సాహకారణమయింది. నేటి కాలంలో, అత్యంత విషాదాంత నాటకాలను చూడడానికి ఉత్సాహపడేవారిని మనం చూడడంలేదూ? ఇలాంటి వారే వారూనూ. ఇలాంటి పోటీ ప్రదర్శనాల్లో పోటీదారులకు ఎంత ఎక్కువగా ప్రమాదం వాటిల్లేటట్లుంటే, అంత ఎక్కువ ఉత్సాహం వారికి.

బ్రయన్ ప్రభృతులతో తామిట్లు సౌమ్యపద్ధతి ప్రకారం పోరాడదలచిన సంగతి తెలియజేసిన పిమ్మట, ఆ ప్రతియోధు లయిదుగురూ వెనుకకు మరలి, ఉత్తరద్వారం చెంతకు చేరి, కయ్యానికి సిద్ధంగా ఏకపంక్తిని నిలబడ్డారు. తోడనే, దక్షిణద్వారం వైపున, బ్రయన్ ప్రభృతులు తమ తమ డేరాలలోంచి బయటికి వచ్చి, తమ తమ గుర్రాలనెక్కి, సర్ బ్రయన్ అగ్రగామియై దారి తీయగా, రంగస్థలంలోకి దిగివచ్చి, ఏకపంక్తిని తామూకూడ తమ తమ ప్రత్యర్థుల కెదురుగా పోరుకు తయారై నిలబడ్డారు.

బాకాలవాళ్ళు బాకా లూదడంతోటే పోరు ప్రారంభమయింది. ఇరువైపులవారూ తమ తమ గుర్రాలను అతివేగంగా పరుగెత్తించుకుంటూ ఒండొరులను తాకడానికి బయలుదేరారు. ఆ సంఘర్షణ ఫలితం ఉత్తరక్షణంలోనే తేలిపోయింది. బ్రయన్, మాల్వాయిసిన్, ఫ్రాంట్-డి-బాఫ్, — ఈ మువ్వురినీ ఎదుర్కొన్న ప్రతియోధులు చాపచుట్టుగ వెంటనే నేలపైకి దొర్లి పడిపోయారు. గ్రాంటుమెస్నిల్‌ను ఎదుర్కొన్న ప్రతియోధుడు తన యీటెను శిరస్సుకో డాలుకో సూటిగా గురిచేయడానికి బదులు, పెడసాటుగా పట్టుకొన్నందున, అది తునియలై అతనిని మరింత అపహాస్యంపాలు చేసింది. ఇక, అయిదవ ప్రతి

లోని ఇంగ్లాండు పరువు దక్కించగలిగేమోనని సెడ్రిక్ ఆత్యాతురతతో యెదురుచూశాడు. కాని, ఆ పండు ఏథెల్ స్టేను కదిలేటట్లుగా కనిపించలేదు.

'ఇంగ్లాండు ప్రతిష్ఠ జారిపోయేటట్లుగా ఉంది. లేచి య్యాటె చేత బట్టాలని నీకు అనిపించడం లేదా?' అని అతను ఏథెల్ స్టేనును హెచ్చరించాడు. 'నేను రేపు సంతోషసమరంలో పాల్గొనదలిచాను. ఇవాళ ఆయుధం చేపట్టడం అనవసరం' అని సమాధానం చెప్పాడు ఏథెల్ స్టేను. సెడ్రిక్ కు ఇదిచాల అసంతృప్తి కలిగించింది. కాని, ఏథెల్ స్టేను యెడ తనకుగల గౌరవ విశేషాన్నిబట్టి ఏమీ అనలేకపోయాడు. అనడానికి వ్యవధికూడా లేకపోయింది. వాంబా తటాలున కల్పించుకొని, 'ఇద్దరిలో శ్రేష్ఠుడనిపించుకోడం కంటె నూరుమందిలో శ్రేష్ఠుడనిపించుకోడం సులభం కాకపోయినప్పటికీ అత్యుత్తమం కాదా మరి!' అన్నాడు. ఏథెల్ స్టేను తనను వాంబా నిజంగా ప్రశంసిస్తున్నాడనే అనుకున్నాడు. కాని, దాని వ్యంగ్యార్థం గ్రహించిన సెడ్రిక్, కొరకొరా వాంబా వంక చూశాడు. ఇంకా తీవ్రంగా అతడు తన ఆగ్రహం ప్రకటించడానికి అది తగిన అదను కాకపోయింది.

ఎంతసేపు చూచినా పోటీదారులెవ్వరూ రంగస్థలంలోకి రావడంలేదు. బ్రయన్ ప్రతిద్వంద్వుల డేరాలలోంచి వినవచ్చే వాద్యఘోషలకు పట్టపగ్గాలు లేకుండా ఉన్నాయి. విజయగర్వంతో గూడిన తిరస్కారభావం ఆ ఘోషలలో వికటతాండవం చేయసాగింది. ప్రేక్షకజనంలోని వృద్ధయోధులు కొందరు, తమ చిన్ననాటి శౌర్యసాహసాలను గూర్చి ప్రక్కవారితో ప్రస్తావిస్తూ,— ఈనాటి యువకుల్లో వీర్యసంపద బొత్తిగా నశించిపోయిందనీ, అసలు ఇలాంటి పోటీప్రదర్శనాలు చూడడానికి ఆ రోజుల్లో వస్తూవుండే సుందరాంగులను చూచిన కండ్లతో ఈనాటి వయస్సుకత్తెలను చూస్తూఉంటే చాలా విచారంగా ఉంటుందనీ, ఇలా ఏమేమో వర్ణిస్తున్నారు. ఇక యెవ్వరూ వచ్చేవారు లేరని నిశ్చయం చేసుకొని, ప్రిన్సుజాన్ తన అనుయాయులతో, తరువాత జరుగవలసిన విందు ప్రయత్నాలను గురించీ, ఒకే యీటెతో యిద్దరు యోధులను నేలగూల్చి మరియొకరినికూడా భంగపరుపజాలిన బ్రయన్ డి-బోయి గిల్బర్టును యీనాటి విజేతగా నిర్ణయించడాన్ని గురించీ ముచ్చటిస్తున్నాడు.

ఇంతలో, హఠాత్తుగా, ఉత్తరద్వారంనుండి ఒక బాకాధ్వని వినవచ్చింది. ఎవరా ఆ వచ్చేదని అందరి దృష్టులూ ఆ వైపు తిరిగాయి. నల్లని ఉత్తమాశ్వం యెక్కి ఒక యోధుడు రంగభూమిలో ప్రవేశించాడు. పెద్ద పొడగరి కాదు. కాయ శరీరం. బంగారు పనిచేసిన ఉక్కుకవచం తొడిగాడు. డాలుపై, సమూలంగా పెళ్ళగించబడిన ఒక చిన్న ఓక్ చెట్టుబొమ్మ ఉంది. గుర్రాన్ని నడిపించే ఆ మెళకువా, ఆ వయ్యారం చూచేసరికి, ప్రేక్షకజనసామాన్యానికి అతనిపై

సానుభూతి కలిగింది. 'నాస్తికులకు యోధుడు రాల్ఫ్-డి-వెపాంట్ ను ఓడించడం తేలిక. అతని డాలునే స్పృశించు, పో!' అని క్రింది తరగతులలోనివారు కేకలు పెట్టి అతనికి సహాయం చేశారు.

కాని, ఆ అజ్ఞాతయోధుడు సరాసరి టెంప్లార్ బ్రియన్ డేరాముందు వ్రేలాడగట్టబడిన డాలువద్దకు పోయి, తన యీటె వాడిమొనతో దానిని ఖణేలుమని మ్రోగునట్లు పొడిచాడు. అతని యీ సాహసానికి ప్రేక్షకలోకం ఆశ్చర్యచకితమయింది. అతడిట్టి సాహసం చేస్తాడని టెంప్లార్ బ్రయన్ కూడా అనుకొనియుండలేదు. ఏదైనదో పట్రకరం అనే ధీమాలో తన డేరాముందర నిర్లక్ష్యంగా నిలబడియున్నా అతడీ సంఘటన జరగగానే చకితుడై, వెంటనే పౌరుషం తెచ్చుకొని, 'ఏం తమ్ముడూ, బ్రతకాలని లేదా ఏమిటి? ఇసుక చేసిన పాపాలకన్నిటికీ పశ్చాత్తాపపడి, చేసుకోవలసిన ప్రార్థనలన్నీ పూర్తిచేసుకున్నావా?' అని ఆ అజ్ఞాతయోధుణ్ణి ప్రశ్నించాడు.

'మృత్యువును ఎదుర్కోవలసివస్తే నిశ్చింతగా ఎదుర్కోగల యోగ్యత నీకంటే నాకే అధికంగా ఉంది' అని సమాధానమిచ్చాడు అజ్ఞాతయోధుడు. 'అయితే వెళ్ళి నిలబడు. కడసారిగా ఒకసారి యీ ప్రపంచాన్ని చూసుకో. ఈ రాత్రి నీకిక స్వర్గలోకంలోనే సుఖనిద్ర' అన్నాడు బ్రయన్.

'నీ ఉపదేశానికి నేనెంతైనా కృతజ్ఞుణ్ణి. దానికి బదులుగా నేనుకూడా నీకొక ఉపదేశం చెయ్యకతప్పదు. ఈ గుర్రం, ఈ యీటె నీకిక పనికిరావు. నా మాటవిని కొత్తవి తెచ్చుకో' అని హెచ్చరించాడు అజ్ఞాతయోధుడు. హెచ్చరించి, బ్రయన్ కు వెన్నివ్వకుండానే, గుర్రాన్ని నేర్పుతో వెనుక వెనుకకు నడిపించుకుంటూ పోయి, ఉత్తరద్వారంవద్ద సంసిద్ధంగా నిలబడ్డాడు. ఈ అశ్వశిక్షాకౌశలానికి ప్రేక్షకలోకం దిక్కులు మారుమ్రోగేటట్లు హర్షధ్వానాలు చేసింది.

అజ్ఞాతయోధుడిచ్చిన ఈ సలహాను సర్ బ్రియన్ ఎంత కోపోద్రిక్తుడైనా, దానిని పాటించకుండా ఉండడానికి అతనికి ధైర్యం చాలలేదు. ఈటెనూ గుర్రాన్నీ మార్చడంతోపాటు డాలునుకూడా మార్చాడు. ఈ సమర పర్యవసానం ఎలా తేలగలదోనని మహోత్కంఠతో ఎదురుచూడసాగింది ప్రేక్షకలోకం.

తూర్యధ్వనులు మ్రోగడంతోనే ఇద్దరు యోధులూ మెరపు మెరసినట్లు తామున్నచోటున అదృశ్యమై, పిడుగుపడ్డట్లుగా రంగస్థలమధ్యమున పరస్పరం ఢీకొన్నారు. ఆ తాకుడుకు ఈటెలు పిడులవరకూ చిట్లిపోయాయి. ఇద్దరూ

పైకిలేచాయి. అశ్వికులిద్దరూ నేర్పుతో వాటిని తిరిగి యథాస్థితికి తెచ్చుకొని, శిరస్త్రాణపు ముఖరంధ్రముల ద్వారా ఒక్క క్షణం సేపు నిప్పులు గురిసేటట్లుగా ఒండొరులను చూచుకొని, తిరిగి క్రొత్త యీటెలతో ఎదుర్కొడానికి సిద్ధపడే నిమిత్తం తమ తమ స్థానాలకు మరలిపోయారు. ఇక ప్రేక్షక జనంలో బయలుదేరిన కోలాహలం ఇంత అంత కాదు.

కొంతసేపటికి తిరిగి భయంకరంగా నిశ్శబ్దం ఆవరించింది. ప్రేక్షక లోకం ఊపిరి పీల్చడం కూడ మానివేసిందా అన్నట్లు కనుపించింది. కొద్దిపాటి విరామమైన తర్వాత, తిరిగి తూర్యధ్వనులు మ్రోగింపగానే, ఉభయులూ మరల అదే జవంతో, అదే నేర్పుతో, అదే తీవ్రతతో, రంగస్థలం మధ్య ఒండొరులను ఢీకొన్నారు. కాని. ఈ పర్యాయం ఫలితం మాత్రం వేరువిధంగా అయింది.

ఈ రెండవ సంఘర్షణలో, టెంప్లార్ బ్రయన్ తన యీటెను అజ్ఞాతవీరుని డాలు నడిబొడ్డుకు గురిచేసి బలం కొద్దీ ఒక పోటు పొడిచాడు. ఈటె చీలికలైంది. అజ్ఞాతవీరునకు తూలినంతపని అయింది. కాని, అంతకుముందే, అజ్ఞాతవీరుడు కట్టకడపటికరకూ బ్రయన్ డాలునకు గురిపెట్టిన యీటెను హఠాత్తుగా శిరస్త్రాణానికి గురిచేసి పొడవగలిగాడు. టెంప్లార్ ఆ దెబ్బకు తట్టుకొన ప్రయత్నించాడు గాని, జీనుపట్టీలు తెగిపోవడంవల్ల ఆ ప్రయత్నం ఫలించలేదు. జీను, గుర్రం, తానూ,—అంతా చుట్టచుట్టుకొని ఒక్క పెట్టున నేలకూలడం జరిగింది.

కాని, బ్రియన్ అంతమాత్రంచేత హతాశుడు కాలేదు. రికాబుల్లో చిక్కుకొన్న పాదాలను చిటికసేపటిలో వదలించుకొని, గుర్రంనుంచి విడివడి, చివాలున పైకిలేచి, క్రోధోన్మాదంతో ఒరనుంచి కత్తిదూసి అజ్ఞాతవీరుని పైకి లంఘించాడు. అజ్ఞాతవీరుడు కూడా వెంటనే గుర్రంమీదనుంచి దూకి తాను కూడ కత్తిదూసి తలపడ్డాడు. ఇంతలో, అచట శాంతి భద్రతల రక్షణకై నియుక్తమైన ఆశ్వికదళం వారిరువురిమధ్యకూ చొచ్చి, ఈ విధమైన పోరాటం పోటీనిబంధనలకు విరుద్ధమని నివారించింది.

టెంప్లార్ అజ్ఞాతవీరుని వంక తీక్ష్ణంగా చూస్తూ, 'ఇంతటితో ఏమయిందిలే! మనం కలుసుకునే సమయం మళ్ళా వస్తుంది. వచ్చేసారి, ఇలా యెవ్వరూ మనల్ని విడదీయకుండా ఉండే చోటున త్వరలో తప్పక కలుసుకుంటాం' అని హుంకరించాడు. 'ఓ, తప్పకుండా! కలుసుకోలేకపోతే అది నీ దోషమౌతుంది గాని నాది కాదు. గుర్రంమీద గాని నేలమీద గాని, ఈటె, కత్తి, గొడ్డలి,—ఏ ఆయుధంతో పడితే ఆ ఆయుధంతో, నీతో తలపడ్డానికి నేను సంసిద్ధం'—అన్నాడు అజ్ఞాతయోధుడు.

ఇంకా మాటలు పెరిగేవే కాని, రక్షణాశ్వికులు తమ యీటెలను అడ్డంగా చాపి వారిద్దరినీ బలవంతాన వేరుచేశారు. ఇద్దరూ ఎవరి విశ్రాంతి స్థలానికి వారు వెళ్ళిపోయారు.

అజ్ఞాతయోధుడు గుర్రంమీదనుంచి దిగకుండానే, శిరస్త్రాణం క్రింది భాగాన్ని మాత్రం ఊడదీసి, ఒక గిన్నెడు మధువు క్రోలి, తక్కిన నలుగురు యోధులతోకూడా వారి యిచ్చవచ్చిన వరుస ప్రకారం పోట్లాడడానికి తాను సిద్ధంగా ఉన్నట్లు ప్రకటించవలసిందిగా చోప్దారులకు తెలియజేసి, తన సహాయులకు సూచనగా తన తరపున తూర్యనాదం ప్రయోగింపజేశాడు.

తోడనే, ఆ ద్వంద్వయుద్ధాలుకూడ ఏర్పాటు చేయబడ్డాయి. మొట్టమొదట, ఫ్రాంట్-డి-బాఫ్ అజ్ఞాతవీరునిమీదికి వచ్చాడు. ఈటెలు ఇరువురివీ సమానంగానే విరిగినా, ఫ్రాంట్-డి-బాఫ్ ఆ సంఘర్షణలో గుర్రపు రికాబు పోగొట్టుకొన్నందున అతడు పరాభూతుడైనట్లు ప్రకటించబడింది. తరువాత, ఫిలిప్ మాల్వాయిసిన్ శిరస్త్రాణం పగిలిపోయేటట్లుగా దెబ్బతిన్నందున ఓడిపోయినట్లు భావించబడ్డాడు. పిమ్మట, అజ్ఞాతయోధుడు గ్రాంటు మెస్నిల్‌తో మొదట కొంతసేపు చెరలాట లాడి, మరల రెండవసారి రొదు రొక్కడానికి అవకాశమివ్వగా, అతడు తనంతట తానే వెనుకకు తగ్గి పరాభూతుడైనట్లు ఒప్పుకొన్నాడు. ఇక చిట్టచివరకు మిగిలినది, రాల్ఫ్-డి-వైపాంట్. ఇతడు మొదటి దెబ్బలోనే నెత్తురు గ్రక్కుకొని స్మృతితప్పి క్రింద పడిపోయాడు. ఇంకేమున్నది? ఆ అజ్ఞాతయోధుడే ఆనాటి విజేతయని ప్రిన్సు జాన్ ప్రభృతులు ఏకగ్రీవంగా నిర్ణయం చేయక తప్పిందికాదు. వేలకొలది ప్రేక్షకజనుల హర్షధ్వానాలు మిన్నుముట్టాయి.

# అధ్యాయం ౯

రంగస్థల రక్షణోద్యోగు లిద్దరు ముందుగా విజేతవద్దకు పోయి, యతని నభినందిస్తూ, ప్రిన్సుజాన్ చేతులమీదుగా బహుమానం స్వీకరించవలసి యున్నదిగాన, శిరస్త్రాణం తొలగించడానికి అంగీకరించవలసినదని, కనీసం ముఖాచ్ఛాదనమైనా తొలగించవలసియున్నదనీ కోరారు. కాని, విజేత అందు కంగీకరించలేదు. తాను అజ్ఞాతుడుగానే ఉండగోరుతున్నాననీ, ఆ సంగతి చోపుదారుల కిదివరకే తెలియజేశాననీ అన్నాడు. ఆ కాలంలో వీరపురుషులు తరచుగా, ఇలాంటి శౌర్యసాహసాలు ప్రదర్శించే సందర్భాల్లో, ఏదో నియమం పేరున, చిట్టచివరివరకూ అజ్ఞాతులుగా వ్యవహరించడం ఉండేది, అప్పటి ప్రజలుకూడా ఆ పద్ధతిని మిక్కిలి హర్షించేవారు. అందుచే, ఆ రక్షణోద్యోగులు విజేతయిచ్చిన సమాధానానికి సంతృప్తులై, ప్రిన్సుజాన్ వద్దకుపోయి, విజేత యిలా అజ్ఞాతుడుగా ఉండగోరుతున్నాడనే సంగతి నివేదించి, ఇక పారితోషిక ప్రదానం కోసం తమ సన్నిధికి అతనిని ప్రవేశపెట్టుతాము, సెలవా అని అడిగారు.

జాన్‌కు కుతూహలం ఎక్కువయింది అతనెవ్వరైనదీ తెలుసుకోవాలని. పోటీల పర్యవసానం ఈ విధంగా కావడం ఏమాత్రమూ అతనికి సంతోషదాయకంగా లేదు. తనకు అభిమానపాత్రులైన అయిదుగురు యోధులూ ఒక్కపెట్టున ఒక్క యోధునిచే యిలా పరాజితులు కావడం అతనికి కష్టంగా వుంది. 'ఏమీ, ముసుగు తొలగించకుండానే వస్తానంటాడూ మా సన్నిధికి? ఎవడీ గర్వపోతు?' అంటూ చిడిముడిపాటుపడి, ఎవడై ఉంటాడా అని తోటి అనుచరులతో ఆలోచింపసాగడు.

'ఎంత ఆలోచించినా అతడు ఎవరైనదీ నేనూహించలేకుండా ఉన్నాను. మన యోధాగ్రేసరుల నైదుగురిని ఒక్కపెట్టున ఓడించగలిగే వీరు డొకడు ఈ నాలుగు సముద్రాలమధ్య మన బ్రిటనులో ఉంటాడని నేను కలలోనూడ అనుకోలేదు. ఆ హాస్పిటలర్ యోధుడు డి-వైవాంట్‌ను అతడు కూలద్రోసినదృశ్యం నా జన్మలో నే నెన్నటికీ మరచిపోలేను. పాపం, వడిసెలతో విసిరిన రాయిలాగా క్రింద పడ్డాడు ఆ హాస్పిటలర్!' అన్నాడు డీబ్రేసీ!

జాన్ పరివారంలోని హాస్పిటలర్ యోధుడొకడు ఈ మాటకు రోషం తెచ్చుకొని, 'ఈ ప్రగల్భాని కేమిలే! మీ టెంప్లార్ యోధుడు మాత్రం అంతకంటె ఘనంగా బయటపడ్డాడా యేమిటి? గుప్పెళ్లలోకి ఇసక దూరేటట్లుగా బ్రయన్ మూడుసార్లు క్రిందికి దొర్లలేదా?' అని సమాధానమిచ్చాడు.

టెంప్లార్లయం దళిమానంగల డీబ్రేసీ ఏదో బదులు చెప్పబోయాడు గాని, జాన్ ఎందుకీ అనవసరపు చర్చ అని వారించాడు. విజేత తమ ఆజ్ఞ కోసం వేచియున్నాడని జ్ఞాపకం చేశాడు దక్షిణాపోర్గి. జాన్ చిరాకుపడి, 'వేచియుంటే ఉండనీ. వాని పేరేమిటో, సందర్భమేమిటో ఇక్కడెవరైనా కొంచెం ఊహించి మాకు చెప్పేటంతవరకూ అలా వేచియుండవలసిందే! అలా అతడు చీకటిపడేవరకూ వేచియుండవలసి వచ్చినప్పటికీ మరేం ఫరవాలేదు' అని కసిరాడు.

వాల్డిమార్ ఫిట్జర్స్ అందుకొని, 'మాకు తెలియని విషయం మమ్మల్ని చెప్పండని, చెప్పే పర్యంతమూ ప్రభువులు విజేతను ఆ రీతిగా నిలిపి ఉంచడం మంచిదికాదు. నా మట్టుకు నేను అతడెవరైనదీ బొత్తుగా ఊహించలేకుండా ఉన్నాను. రిచర్డుమహారాజు వెంట పాలస్తీనాకు పోయిన యోధుల్లో ఎవరైనా అయియుండాలిక. వాళ్ళిప్పుడు గృహోన్ముఖులై మార్గమధ్యంలో చిక్కులు పడుతున్నారనికదా విన్నాము' అన్నాడు.

'సాలిస్బరీ ప్రభువేమో! అతడు దాదాపుగా ఇంతే ఎత్తు' అన్నాడు డీబ్రేసీ. 'సర్ థామస్ డీ-మూల్టన్ కావచ్చు. సాలిస్బరీ ఇంతకంటె యెముక పుష్టి వున్న మనిషి' అన్నాడు ఫిట్జర్స్. ఇంతలో ఒక గుసగుస వినిపించింది అక్కడ ఉన్నవారిలోంచి. ముందుగా అది యెవరన్నారో తెలియదు. 'ఒకవేళ యితడు రిచర్డు మహారాజే నేమో!' అని.

ఇది వినిపించేసరికి, జాన్ మొగాన నెత్తుటిచుక్కలేదు. కనులు చీకట్లు గ్రమ్మినట్లయి, క్రుంగిపోయి, ఆదుర్దాగా తన అనుయాయుల నందరినీ చేరబిలుచుకొని, 'యిదిగో మీరంతా నా దండనే నిలబడాలినుమా! నాకు చేసిన వాగ్దానాలు మరిచిపోకూడదు'—అంటూ కలవరం చెందసాగాడు. అప్పుడు వాల్డిమార్ అతనికి ఈ విధంగా ధైర్యం చెప్పాడు: 'ఇప్పుడు మునకొచ్చిన ప్రమాదం ఏమీలేదు. తమ అన్నగారు యెంత ఒడ్డూ పొడుగూగల విగ్రహమో తాము మరిచిపోయారా? ఈ యోధుడు తొడిగిన కవచంలోకి యిమిడే శరీరమేనా అది? ఎందుకూ? దగ్గరగా చూస్తే మీకే విడిపోతుంది సందేహం. రిచర్డు మహారాజు యింతకంటె కనీసం ఇంకా ఒక బెత్తెడైనా యెత్తు ఉండితీరాలి. యిక ఆ ఛాతీ వెడల్పు యింతకంటె రెట్టింపు వుంటుందని నేను నిశ్చయంగా చెప్పగలను. పైగా, ఈ యోధుడెక్కిన గుర్రం రిచర్డు మహారాజును ఏకధాటిని యింతసేపు మోయగలిగేపాటిదేనా? చూస్తే తమకే తెలుస్తుందిగా? రానివ్వం డతన్ని తమ సన్నిధికి.'

అన్నగారు స్వదేశం చేరుకున్నాడన్న తలంపుచే పుట్టిన కంగారు జానుకింకా వదలకపోవడంచేత, వాల్డిమార్ చెప్పిన దాఖలాలు విజేతను దగ్గరగా

చూడడంలో మరింత బాగా స్పష్టపడినప్పటికీ, అతని భయాలు పూర్తిగా తొలగిపోలేదు. లాంఛనప్రాయంగా విజేత శౌర్యాన్ని ప్రశంసిస్తూ నాలుగు మాటలు ఎలాగో అనేసి, బహుమానంగా నిర్దేశించబడ్డ ఉత్తమాశ్వాన్ని తొందరగా అతనికి ఇప్పించివేశాడు. తన యెట్టయెదుట కవచధారియై నిలబడ్డ ఆ మూర్తి శిరస్త్రాణపు ముసుగు లోపలినుండి తన అన్నగారి గంభీరకంఠధ్వని ఏ క్షణాన వినబడుతుందోనని వణికిపోతున్నాడతడు లోలోపల.

కాని, ఆ అజ్ఞాతయోధుడు ఒక్క మాట కూడా మాట్లాడలేదు. జాన్ పలికిన ప్రశంసావాక్యాలకు కృతజ్ఞతా సూచకంగా, వినయపూర్వకమైన అభివాదంమటుకు చేసి నిశ్చలుడై నిలబడ్డాడు. అతనికి బహూకరించబడ్డ భద్రాశ్వం యుద్ధానికి కావలసియుండే సకల పరికరాలతోనూ చక్కగా అలంకరించబడిఉంది. అచటి అశ్వశాస్త్రకోవిదుల దృష్టిలో, ఆ అశ్వరాజంచేత ఆ అలంకార సముదయం అలంకృతమయిందేకాని, ఆ అలంకార సముదయంచేత ఆ అశ్వరాజం అలంకృతం కాలేదు. విజేత దానిమీదకి రికాబులో పాదం పెట్టకుండానే అవలీలగా ఎక్కి కూర్చున్నాడు, చేతనున్న యీటెను సవిలాసంగా పైకెత్తి త్రిప్పుతూ, చిత్రవిచిత్రమైన గమనంతో ఆ రంగస్థలంచుట్టూ దానిని రెండుసార్లు పరుగెత్తించాడు. ఇంకొక సందర్భంలో అయితే, ఇది ఆడంబరంగా పరిగణించబడేదేకాని, బహుమానంగా ఇవ్వబడ్డ ఆ అశ్వరాజపు విశిష్టత యెట్టిదో ఈ రూపేణా ప్రదర్శితమౌతున్న కారణంచేత, ప్రేక్షకులెల్లరూ హర్షధ్వానాలు మిన్నుముట్టేటట్లు చేస్తూ విజేతను ఉత్సాహపరిచారు.

ఇంతలో, ప్రయర్ ఏమర్, విజేతచేత అందాలరాణి యెన్నిక జరిగించవలసియున్నదనే సంగతి ప్రిన్సు జాన్‌కు జ్ఞాపకంచేశాడు. జాన్ అంతట, రెండవసారి రంగస్థలం చుట్టి రావడంలో విజేత తన ముందునుంచి వెడుతూండగా సంజ్ఞచేసి ఆపాడు. విజేత జాన్ సింహాసనంవైపు తిరిగి, ఈటెను నేలవైపుగా వంచి, ఆనతికై నిరీక్షిస్తూ నిశ్చలుడై నిలబడ్డాడు. మంచి పరుగులో ఉన్న ఆ పొగరుబోతు గుర్రాన్ని అంత తటాలున నిలువరించి, సాక్షాత్తూ ఒక శిలాప్రతిమవలె నిలువగలిగిన ఆ యోధవరుని అశ్వశిక్షాకౌశలం మరియొకసారి ప్రేక్షకుల ప్రశంసకు పాత్రమయింది.

ప్రిన్సుజాన్ ఆ అజ్ఞాత వీరునితో ఇలా అన్నాడు: 'ఇదిగో, రేపటి ఉత్సవానికి అధ్యక్షత వహించవలసిన అందాలరాణిని నీవిప్పుడు ఎన్నుకోవలసి ఉంది. ఈ దేశానికి క్రొత్తవాడవు కాబట్టి, ఈ నిర్ణయం చెయ్యడంలో ఇతరుల సాహాయ్యంకూడ నీవు కోరే పక్షంలో, నేనొక సూచన చేస్తున్నాను, మా వాల్డిమార్ ఫిడ్జర్సు కుమార్తె ఎలిషియా, అందంలో నేమి, అభిజాత్యంలో నేమి, అగ్రగణ్యురాలుగా మా ఆస్థానంలో చిరకాలంనుంచీ పరిగణించబడుతోంది. ఆ వైన

నీ యిష్టం. నీ యిష్టం వచ్చినవారిని ఎన్నుకోవడానికి నీకు పూర్ణాధికారాలున్నాయి. ఇదిగో, ఈ కిరీటం నీ యీటె మొనతో యెత్తి ఏ సుందరికి నీవు అందిస్తావో, ఆమెనే నీవు అందాలరాణిగా యెన్నుకొన్నట్లవుతుంది. ఈటె యిలా పైకెత్తి పట్టుకో, కిరీటం తగిలిస్తాను".

అజ్ఞాతయోధుడు అలాగే ఈటె పైకెత్తగా, జాన్ బంగారువలయం కలిగిన ఒక ఆకుపచ్చని పట్టుకిరీటం దాని మొనకు తగిలించాడు. జాన్ తన ప్రసంగంలో వాల్డిమార్ కుమార్తెను గూర్చి ధ్వనించేలా అలా ఒక సూచన వదలడానికి కారణాలు అనేకం ఉన్నాయి. ఇదివరలో రెబెకాను గూర్చి తమాషాగా తాను చేసిన సూచన తన అనుయాయులకెవ్వరికీ ఒప్పుదల కాలేదుగనుక, ఆ విషయంలో అనుమానం వారి మనస్సుల్లోంచి పూర్తిగా పారద్రోలడానికి అతడీ ఎత్తు యెత్తాడు. అంతేగాక, వాల్డిమార్ అంటే అతనికి మనసులో ఒకవిధమైన భయముంది. అతనికి అసంతృప్తి కలిగించే పనులు ఈ రోజున తాను కొన్ని చేసియున్నాడు. కనుక, అతని కుమార్తె పేరు తాను సూచిస్తే, అతనికి తనయెడల సుముఖత్వం కలుగుతుందని అతని ఉద్దేశం. అదిన్నీగాక, ఏ విధంగానైనా ఎలీషియాను మచ్చిక చేసుకోవాలనే కోరిక అతని కెన్నాళ్లనుంచో వుంది— యీ సూచన అందుకు ఉపయోగపడుతుందని అతని ఆశ. ఈ కారణాలన్నీ ఇలావుండగా, వీటన్నిటిని మించినది యింకోటుంది. వాల్డిమార్‌ను అజ్ఞాతయోధునికి ప్రబల శత్రువుగా తయారుచెయ్యాలని అతని సంకల్పం. అజ్ఞాతయోధుడంటే అతనికి ఇదివరకే ఒకవిధమైన గిట్టనితనం యేర్పడింది. వాల్డిమార్ కుమార్తెను గనుక అజ్ఞాతయోధుడు యెన్నుకోకపోవడం జరిగితే— మూడువంతుల ముప్పాతిక పాళ్లు అంతే అవుతుంది— వాల్డిమార్ అజ్ఞాతయోధునిమీద పగపట్టితీరాడన్నమాటే, సందేహంలేదు. ఇన్ని జిత్తులమారి ఊహలు కడుపులో పెట్టుకొని అజ్ఞాతయోధునికి యీ సూచన చేశాడు జాన్.

అనుకున్నట్లే అయింది. సౌందర్యగర్విత ఎలీషియా ప్రిన్సుజాన్ కూర్చున్న గ్యాలరీకి ప్రక్క గ్యాలరీలోనే కూర్చునివుంది. అజ్ఞాతయోధుడు ఉత్తరక్షణంలోనే ఆమెను గడచిపోయాడు. ఆ రంగస్థలంచుట్టూ యెన్నిచోట్ల సుందర వదనాలున్నాయో అన్నిటినీ సావకాశంగా పరిశీలించే అధికారం యిప్పుడతని కేర్పడింది. ఆ అధికారాన్ని తాను పూర్తిగా చలాయించుకొనగోరుతున్న వాడిలాగా ఒక్కొక్కరినే పరిశీలించుకుంటూ అతడు ముందుకు నెమ్మదిగా గుర్రాన్ని నడిపించసాగాడు. ఈ పరిశీలనకు గురియౌతున్న సమయంలో, అచటి అన్నుమిన్నలు యెన్నెన్ని విలాసచేష్టలు చేశారో వర్ణించడం కష్టం— కొందరు చెక్కిళ్లపై సిగ్గుదొంతరలు చిగిరింపజేసుకొన్నారు. కొందరి వైఖరిలో గర్వరేఖ చిందులు త్రొక్కింది. కొందరు తమకిదంతా ఏమీ పట్టనట్లుగా చూడసాగారు. కొందరు బెదరిపోయి దిక్కులు చూచారు. కొందరు నవ్వు ఆపుకో

చెయ్యకుండా పోరాడే సందర్భంలో, గుర్రాన్నీ కవచాన్నీ అతను లెక్క చెయ్యడం ఎలా సంభవిస్తుంది?'

ఇసాక్ ఇంచుక ఉద్వేగభరితుడై ఇలా సమాధానం చెప్పాడు: 'శ్రద్ధావన్, నీకేమీ తెలియదమ్మాయ్! అతని శరీరం, అతని ప్రాణం అతని సొంతం. వాటినతడు ఏమైనా చేసుకోవచ్చు. గుర్రం, కవచం అలా కాదే! అవి,— ఆఁ, ఆఁ, ఏమంటున్నానూ?— అవును నిజమే, ఆ యువకుడు చాల మంచి వాడు. అదిగో చూచావా? తిరిగి యుద్ధానికి ఎంత హుషారుగా తయారవుతున్నాడో! యెహోవా రక్షించాలి,— అతణ్ణీ, అతనితో పాటు ఆ గుర్రాన్నీ కవచాన్నీ కూడ! బలే! బలే! అతడే గెలిచాడు! టెంప్లార్ దభేలున క్రింద పడ్డాడు. ఇక మన యువకుడు వరుసపెట్టి అందరి గుర్రాలూ, కవచాలూ, వెండీ, బంగారం,— అన్నీ కొట్టేశాడన్నమాటే! సందేహం లేదు.' ఆనాటి యుద్ధ ప్రదర్శనలు ముగిసేపర్యంతమూ ఇసాక్ యిలాంటి భయాభయ పరిస్థితుల మధ్య క్షణక్షణమూ ఊగిసలాడుతూనే ఉన్నాడు.

అనిశ్చయం వల్లనో, మరే కారణం వల్లనో, అజ్ఞాతయోధుడు అలా నిశ్చలుడై కొండొకసేపు నిలబడిపోయాడు. ప్రేక్షకలోకం నిస్తరంగ సముద్రము వలె నిశ్చలంగా, నిశ్శబ్దంగా, దృష్టులన్నీ అతనిమీదనే కేంద్రీకరించి చూస్తోంది. అజ్ఞాతయోధుడంతట నెమ్మదిగా తన యీటెను వాల్చి, దాని కొసను తగిలించబడిన కిరీటాన్ని రొవెనా [illegible] ఉంచాడు. వెంటనే తూర్యనాదాలు చెలరేగాయి. చోపుదారులు రొవెనాను అందాల రాణిగా ప్రకటించారు. ఆమె అధికారం తిరస[illegible] దండనలకు పాత్రులు కాగలరని తెలియజేయబడి[illegible] రాణి [illegible]కీ జై!' అంటూ ప్రేక్షకులు జయజయ ధ్వానాలు చేశారు.



ఇంగ్లాండులో ఈ పోటీ పరిదర్శనాలను ప్రవేశపెట్టినది నార్మను సామంతులు. వారు ఓడిపోవడం ఇదివరకెన్నడూ జరగలేదు. అలాగే, అందాలరాణిగా ఒక సాక్సన్ సుందరి ఎన్నుకోబడడం ఇదివరకు సంభవించలేదు. నార్మన్ యువతీలోకంలో ఇది కొంత అలజడికి కారణమయింది. కాని, సముద్ర ఘోషవలె ఉప్పొంగిన ఆ జయజయ ధ్వానాల మధ్య, అది ఎవ్వరికీ పట్టలేదు. ఈ సందడిలోనే, 'సాక్సన్ రాకుమారికి జై! మహాత్మ ఆల్ఫ్రెడ్ వంశానికీ జై!' అనే కేకలుకూడ ఆకాశం అంటాయి.

ఇష్టంలేకపోయినా ప్రిన్స్ జాన్ ప్రభృతులు విజేత చేసిన యీ నిర్ణయాన్ని అంగీకరించక తప్పలేదు. జాన్ తన గద్దెనుండి లేచి, గుర్రమెక్కి, తనపరివారంతో తిరిగి రంగస్థలంలో పచార్లు మొదలుపెట్టాడు. ముందు ఎలిషియా కూర్చున్న

గ్యాలరీచెంతకు రాగానే యిలా ఒక మాట వినిరాడు: 'ఈ నూతన యోధునికి మంచి కండరపుష్టి ఉన్నట్లు ఇతని సాహసకృత్యాలవల్ల నేడు రుజువయిన మాట నిజమే కాని, యితడు చేసిన అందాలరాణి యెన్నికనుబట్టి చూస్తే, యితని చూపులో ఏదో దోషమున్నట్లు స్పష్టమౌతోంది. ఏమంటారు ?'

ఎవరిని మంచి చేసుకోవాలని తాను అనుకొంటాడో వారి శీలస్వభావాలను సరిగా గ్రహించలేకపోవడం జాన్ జీవితంలో ఒక పెద్ద లోపం. ఇప్పుడు సరిగా అంతే అయింది. తన కుమార్తె చులకన చేయబడిందని ఈ రూపేణా జాన్ చేసిన సూచన వాల్డిమార్ కు సంతోషం బదులు కోపం తెప్పించింది— 'యోధులకు తను యిచ్చవచ్చిన అందాలరాణిని యెన్నుకునే అధికారం వుంది. దానినెవ్వరూ కాదనడానికి వీలులేదు. నా కుమార్తె ఎవరి మన్ననలనూ ఆశించి కూర్చోలేదు. దానికున్న విశిష్టత యేదో దానికుంది. రావలసిన గౌరవప్రతిష్ఠలు దానికెన్నడూ రాకుండాపోవు' అని సమాధానం చెప్పాడు.

జాన్ మారుపలకలేదు. లోని చికాకు యింకొకరీతిగా వెడలగ్రక్కే మార్గంలేక, కాళ్లతో గుర్రం డొక్కల్లో పొడిచి, దానిని రొవెనా కూర్చున్న గ్యాలరీ చెంతకు దూకించాడు. అజ్ఞాతయోధు డర్పించిన కిరీటం ఇంకా ఆమె పాదాలవద్దనే వుంది.

'కిరీటం స్వీకరించు సుందరీ! అందాలరాణిగా నీ ప్రభుతను నీవు నిర్వహించు. ప్రిన్సుజాన్ నీకు ధన్యవాదా లర్పిస్తున్నాడు. ఈ రాత్రి ఆష్బీకోటలో విందు ఏర్పాటుచేశాం. మీ తండ్రితోనూ, బంధుమిత్రులతోనూ, అచటికి విచ్చేయవలసిందిగా కోరుతున్నాను' అన్నాడు రొవెనా నుద్దేశించి.

రొవెనా ఏమీ మాట్లాడలేదు. ఆమెకు బదులుగా సెడ్రిక్, స్వచ్ఛమైన సాగ్జన్ భాషలో జాన్ కు ఇలా జవాబుచెప్పాడు: 'తాము గౌరవ పురస్సరంగా చేసిన యీ ఆహ్వానానికి కృతజ్ఞులం. కాని, తను కిప్పుడు ఉచితరీతిని సమాధానం చెప్పడానికిగాని, తాము ఏర్పాటుచేసిన విందులో తగిన విధంగా పాల్గొనడానికిగాని, ఏ భాష కావలసివున్నదో అది రొవెనాకు రాదు. ఇక, నా సంగతీ, మా ఎథెల్ స్టేను సంగతీ అంటారా? మా తాత తండ్రుల భాష మాట్లాడడమే మా కలవాటు. వారి ఆచారవ్యవహారాలనే మేము పాటిస్తూ ఉంటాం. కనుక, తాము ఏర్పాటుచేసిన విందుకు రాజాలనందుకు అన్యథా భావించకుందురుగాక. రేపటిరోజున మటుకు, రొవెనా తాను ఎన్నికైన పదవి నధిష్ఠించి, తన విధిని నెరవేర్చగలదు.' అని, ఆ పదవీ స్వీకరణకు ఆమె ఆమోదించినదన్నదానికి సూచనగా, సెడ్రిక్ తన చేతులతో ఆ కిరీటమెత్తి ఆమె శిరస్సుపై నలంకరించాడు.

జాన్‌కు సాక్సన్ భాష బాగావచ్చు. కాని, ఏమీ రానట్లు నటించి, 'ఏమంటాడతడు?' అని ప్రక్కనున్నవారి నడిగి, నార్మన్ భాషలో దాని తర్జుమా చెప్పించుకొని విని, 'మంచిది. మానముకాంకితురాలైన యీ అందాలరాణిని రేపు మేమే స్వయంగా తీసుకొనివెళ్ళి గద్దెపైన అధిష్ఠింపజేస్తాము' అంటూ, అజ్ఞాతయోధునివైపు తిరిగి, 'మరి నీమాట యేమిటి? మా విందులో నీవు పాల్గొనడానికి సిద్ధమేనా?' అని అడిగాడు.

తనకు చాలా బడలికగా వున్నదనీ, రేపటి పోరాటానికి తయారుకావలసి వున్నది కనుక విందుకు రాలేననీ అజ్ఞాతయోధుడు మంద్రస్వరంతో జవాబు చెప్పాడు. 'మంచిది! మా ఆహ్వానాలు నిరాకరించారన్నమాట! ఇలాంటి నిరాకరణకు మేమెన్నడూ అలవాటు పడనిమాట నిజమేకాని, ఇంతమాత్రంతో ఏం ఫరవాలేదు. విజేతతోనూ, అతడెన్నుకొన్న అందాలరాణితోనూ కలిసి కూర్చుండి విందారగించే అవకాశం మాకు లేకపోతే లేకపోవుగాక. అరగించిన విందు జీర్ణంకాకపోదు.' అంటూ జాన్, ఇక తన పరివారంతో రంగస్థలం వీడిపోవడానికి ఉద్యుక్తుడై గుర్రాన్ని వెనుకకు తిప్పబోయాడు.

ఇంతలో, తన ఆగ్రహానికి ఇదివరలో పాత్రుడైన రైతుసంగతి అతనికి జ్ఞాపకం వచ్చింది. చాల నిశితంగా ఆ కృషీవలుని వైపు దృష్టి సారిస్తూ, ప్రక్కనున్న సైనికులతో,—'అదిగో, ఆ గాడిద తప్పించుకొని పారిపోయేను జాగ్రత్త! పోనివ్వకండి!' అని హెచ్చరించాడు.

రైతు పూర్వంలాగానే,నిబ్బరంగా చిరునవ్వు నవ్వుతూ, 'మీకా భయమేమీ అక్కర్లేదు. యెల్లుండిదాకా నేను ఆష్బీని వదలిపెట్టను. స్టాఫర్డు మండలం, లీసెస్టరు మండలం యెలాంటి విలువిద్య ప్రదర్శించగలవో చూడాలి!' అని పలికాడు. జాన్ నేరుగా అతనికి సమాధానం చెప్పకుండా, తన అనుచరులతో యిలా అన్నాడు: 'విలువిద్య వీడికేమాత్రం వచ్చునో నేను చూడాలి. ఇదంతా విద్యాకౌశలంలేని అవినయమే అయితే, వీడిపని పట్టుదాం అప్పుడు!'

డీబ్రేసీ వెంటనే అందుకొని, 'అసలీ రైతులు బాగా పొగరెక్కిపోతున్నారు. వీళ్ళందరికీ హడలుగా ఉండేటట్లు గట్టిగా ఏదైనా ఒక చర్య తీసుకోవడం అవసరం' అన్నాడు. ఇలాంటి పనులవల్ల జాన్ ప్రజాభిమానపాత్రుడు కానేరడని గ్రహించిన వాల్డిమార్, ఏమీ మాట్లాడలేదు. అతని వైఖరిలో అసమ్మతి వ్యక్తమయింది.

జాన్ యిక తడయక, గుర్రాన్ని వెనుకకు తిప్పి, సపరివారంగా రంగస్థలంనుంచి నిష్క్రమించాడు. వెంటనే జనసమూహాలు కూడా విచ్చిపోవడం మొదలుపెట్టాయి. పోటీలకు వచ్చిన యోధులంతా యెవరిదారిని వారు వెళ్ళిపోయారు. అజ్ఞాతయోధుడు మాత్రం యెక్కడికీ వెళ్ళలేదు. అతని కోరికపై, ఒక గుడారం అతని విశ్రాంతికొరకు యేర్పాటుచేసి యిచ్చారు. కోలాహలంగా అతని చుట్టూ మూగి అతన్ని చూస్తూ ఉండిన పరిశిష్టజనం, అతడు గుడారంలోపలికి వెళ్ళిపోవడంతోటే క్రమంగా అచటినుండి సర్దుకున్నారు.

జనసమూహాల సందడులు క్రమక్రమంగా దూరమై, కొంతసేపటికి నిశ్శబ్దంలో లీనమైపోయాయి. గ్యాలరీలపైన పతాకలు, బాలీసులు మొదలైనవితీసి ఆ రాత్రికి జాగ్రత్తచేస్తూ, అచట పూర్తిగా ఖాళీచేయకుండ దిగవిడువబడిన పారాబుడ్లు వగైరాలకోసం తగాయిదాలు పడుతున్న నౌకర్ల గొంతుకలు తప్ప ఇంకేమీ రంగస్థలంలో వినిపించడంలేదు.

చెడిపోయిన కవచాలు మరమ్మతు చేయడానికీ, క్రొత్తవి తయారుచేసి సిద్ధంగా ఉంచడానికీ, కొన్ని కొలిమలు రంగస్థలానికి కడు దవ్వున ఏర్పాటు చేయబడ్డాయి. ఆ సందె చీకటిలో వాటి వెలుగులు దూరంనుంచి మినుకు మినుకుమంటూ కనిపిస్తున్నాయి. రాత్రంతా రంగస్థలానికి కావలిగా నియోగించబడ్డ సైనికులు, రెండేసి గంటలకొకసారి జట్లు మార్చుకుంటూ అప్రమత్తులై పహారా యిస్తున్నారు.

# అధ్యాయం ౧౦

అజ్ఞాతయోధుడు తన గుడారం చేరుకోడంతోటే, సేవకవృత్తిలోని వారు పెక్కుమంది అతన్ని సమీపించి, కవచం విప్పుతాం, కొత్త ఉడుపులు తెచ్చిపెడతాం, స్నానానికి ఏర్పాట్లుచేస్తాం, అంటూ, అతనికి సేవచెయ్యాలనే తమ అభిలాషను వ్యక్తపరిచారు. ప్రిన్సుజాన్ ఆదేశాన్నికూడా త్రోసిపుచ్చి తన చహరా బయట పడనివ్వకుండా దాచుకొన్న అతడెవ్వరైనదీ తెలుసుకోవా లనే కుతూహలం వారి పెక్కువగా ఈ పనికి ప్రేరేపించింది. కాని, అజ్ఞాత యోధుడు వారి కెవ్వరికీ సందివ్వలేదు. నాకేం కావాలో నా నౌకరే చూస్తాడు. మీరు వెళ్లండని వారిని పంపించివేశాడు. ఆ నౌకరుగూడా ఒక నల్లని అంగీ తొడిగి, నల్లని టోపీ ఒకటి ముఖంమీదికి బాగా వాలేటట్లుగా పెట్టుకొని, తన యజమానితోపాటు తానుకూడా అజ్ఞాతుడుగా మెలగుతున్న వాడిలాగే కని పించాడు గుడారంలోంచి తక్కినవారంతా వెళ్ళిపోవడంతోటే ఇతడు తన యజమాని కవచాదులనువిప్పి, ద్రాక్షాసవంతోపాటుగా, రుచికరమైన భోజనం అతనికొరకు అమర్చాడు.

అజ్ఞాతయోధుడు తొందర తొందరగా భోజనం ముగించాడు. ఇంతలో నౌకరు లోనికి వచ్చి, ఎవరో అయిదుగురు అయిదు గుర్రాలను తోడ్కొనివచ్చి మిమ్ము చూడగోరుతున్నారని చెప్పాడు. అజ్ఞాతయోధుడు ఒక పొడుగాటి అంగీ తొడిగి, ముఖకవళికలు కానరాకుండ ఒక ముసుగు ముఖానికి తగిలించి తేరా బయటికి వచ్చాడు. నాడు అజ్ఞాతయోధునిచే ఓడింపబడిన యోధవరుల తాలూకు నౌకర్లు వారు. అయిదుగురూ అయిదుగుర్రాలతో నిలబడి ఉన్నారు. గుర్రాలపై, ఆయా యోధవరులానాటి పోటీలో ఉపయోగించిన కవచాదులు భద్రపరచబడి ఉన్నాయి.

ఆ కాలపు సంప్రదాయం ప్రకారం, ఇలాటి పోటీలో ఓడిపోయినవారు గెలిచినవారికి, ఆ నాటి కయ్యంలో తాము ఉపయోగించిన గుర్రాన్నీ కవచాదు లనూ అధీనం చెయ్యాలి. గెలిచినవారు వాటిని తాము అట్టేపెట్టుకోవాలంటే అట్టేపెట్టుకోవచ్చు. లేక, వాటి ప్రత్యామ్నాయంగా ఏదైన ధనం స్వీకరించి, వాటిని తిరిగి ఆ ఓడిపోయినవారికే ఇచ్చివేయవచ్చును. 'సంప్రదాయం ఇలా ఉన్నదిగనుక, మీకివి అప్పగించవచ్చాం, మీ యిచ్ఛవచ్చిన రీతిగా చేయండి,' అని ఆ నౌకర్లు అజ్ఞాతయోధునికి నివేదించారు.

అజ్ఞాతయోధుడు కెంప్లారు బ్రియన్ నౌకరుకు మాత్రం ఎట్టి సమాధా నమూ యివ్వక, తక్కిన నలుగురినీ ఉద్దేశించి యిలా అన్నాడు: 'మీ నలుగురికీ

కూడా నేను చెప్పే సమాధాన మొక్కటే. మీ యజమానుల తాలూకు గుర్రాలనూ కవచాదులనూ లాగిపెట్టుకోవడం నాకు న్యాయంగా కనిపించడంలేదు. వాటిని ఉపయోగించుకోవడానికి నాకే అన్నివిధాలా హక్కు. కాని, నేనున్న పరిస్థితి బట్టి, ఊరకే వాటిని వారికి తిప్పి పంపించి వేయడానికి వీలులేక పోతున్నది. నేనెక్కిన గుర్రం గాని, తొడిగిన కవచం గాని, నాది కాని పరిస్థితి నాది. కనుక, మీ యజమానులతో చెప్పండి. తమకు యుక్తమనిపించినంత ధనం చెల్లించి వీటిని వారు తిరిగి తీసుకొని పోవచ్చు.'

నలుగురి తరఫునా ఫ్రాంట్-డి-బాఫ్ నౌకరు సమాధానం చెప్తూ, 'వీటిని మీరు వదలుకొనే పక్షంలో నూరేసి జెక్కిన్లు చెల్లిస్తామని చెప్పవలసిందిగా మా యజమానులు మాకు హుకుం చేశారు',—అన్నాడు. 'ఓ, చాలు. అందులో సగం మాత్రమే నా ఇప్పటి అవసరాలకోరకు నేను తీసుకుంటాను. తక్కినదానిలో సగం మీలో మీరు పంచుకొని, తక్కినది చోపుదారులూ, బాకాలవాళ్ళూ మొదలైనవారికి పంచండి' అన్నాడు అజ్ఞాతయోధుడు.

ఇంతటి ఔదార్య ప్రకటనం సామాన్యంగా ఎప్పుడూ చూచి యుండక పోవడంచేత, ఆ నౌకర్లు కృతజ్ఞతా భావ సూచకంగా టోపీలు చేతబుచ్చుకొని వినమ్రులై అభివాదం చేశారు. పిమ్మట అజ్ఞాతయోధుడు టెంప్లార్ బ్రయన్ నౌకరుతో ఇలా అన్నాడు: 'ఇదిగో, మీ యజమాని నాకేమీ ఇవ్వనక్కర లేదు. నేనేమీ పుచ్చుకోను. మా ఇద్దరిమధ్యా కయ్యమింకా ముగియలేదు. ఈ బల్లెంతోనే గాక కత్తులతో:—గుర్రాలమీదనే కాక నేలపైగూడ,—ఉభయులమూ తలపడిన నాటికి గాని ఈ కయ్యానికి ముగింపురాదు. ఈ మాట చెప్పండి మీ యజమానితో. అతడే నన్నిట్టి కయ్యానికి సవాలుచేశాడు. నేనది మరచిపోను. అది యేదో పరిష్కారమయ్యేవరకూ, ఇతర యోధులతో వలె అతనితో నేను ఎట్టి మర్యాదలూ నడపను.'

బ్రయన్ నౌకరు బాల్డ్విన్ అంతట ఇలా సమాధానం చెప్పాడు: 'మాటకు మాట, దెబ్బకు దెబ్బ, మర్యాదకు మర్యాద ఎలా బదులివ్వాలో మా యజమానికి బాగా తెలుసు. ఇతర యోధులనుంచి పుచ్చుకున్నట్లుగానే మా యజమాని నుంచికూడా డబ్బు పుచ్చుకోడానికి మీరు నిరాకరించారు గనుక, నేనీ గుర్రాన్నీ కవచాదులనూ ఇక్కడనే విడిచిపోక తప్పదు. వీటిని మా యజమాని ఇక ఎన్నడూ ఉపయోగించడని నాకు గట్టిగా తెలుసు.'

బాల్డ్విన్ చేసిన ప్రసంగాన్ని అజ్ఞాతయోధుడు మెచ్చుకుంటూ, 'చాలా బాగుంది నీవన్నది. యజమాని తరఫున నౌకరు ఎలా మాట్లాడడం తగునో అలా మాట్లాడావు. కాని వాటిని ఇక్కడ వదలిపెట్టి పోకు. మీ యజమానికే తీసుకొనివెళ్ళి అప్పజెప్పు. అతడు నిరాకరించినట్లయితే, వాటిని నీవు

తీసుకో. అవి నా వస్తువులు గనుక నీకు ఉచితంగా ఇచ్చేస్తున్నాను'— అన్నాడు.

బాల్డ్విన్ వినమ్రుడై అభివాదంచేసి, తోటివారలతో కలిసి వెళ్ళిపోయాడు. అజ్ఞాతయోధుడు తిరిగి గుడారంలో ప్రవేశించాడు.

'ఆంగ్లయోధుల కీర్తిప్రతిష్ఠలకు దెబ్బతగలనివ్వకుండా ఇంతవరకూ కాపాడుకుంటూ రాగలిగాను. ఏమంటావు గర్త్?' అన్నాడతను తన అనుచరునితో.

'పందులకాపరినైన నేను ఒక యోధాగ్రేసరుని సేవకపాత్రను కూడా సరిగానే నిర్వహించగలిగాను. ఏమంటావు స్వామీ?' అన్నాడు గర్త్.

'నిజమే. కాని, నేను చాలా జడిసాను—నీ పల్లెటూరి తరహావల్ల నీవెక్కడ బయటపడిపోతావోనని!' అన్నాడు అజ్ఞాతయోధుడు.

'నేనా బయటపడేది? అదిగో, ఆ వాంబా నన్నేపైన కనుక్కొని బయటపెట్టుతాడేమోనని నేను జడిసాను. నన్ను కనుక్కుంటే అతనొక్కడే కనుక్కోగలిగేది. పెద్దదొరగారు ఎలాంటి అనుమానమూ లేకుండా నా ప్రక్కనుంచి వెడుతూఉంటే నేను నవ్వు ఆపుకోలేకపోయాను. నన్ను గనుక వారు గుర్తించడం జరిగితే'—అని ఇంకా ఏమో చెప్పబోయాడు గర్త్.

'నీకేమీ భయంలేదు గర్త్! నేను ఏమి వాగ్దానం చేశానో నీకు తెలుసు' అన్నాడు అజ్ఞాత యోధుడు.

'నేను మాత్రం? నా చర్మం తెగగోసినప్పటికీ నేను మిత్రద్రోహమనేది చెయ్యను. నా మందలోని పందుల చర్మంవలెనే, కత్తి వేటులను గాని, కొరడా దెబ్బలను గాని, లక్ష్యపెట్టనంత మొద్దుచర్మం నాది' అన్నాడు గర్త్.

అజ్ఞాతయోధుడతనికి తిరిగి అభయం పూరిస్తూ, 'నన్ను విశ్వసించు గర్త్! నాయందు ప్రేమకొద్దీ ఎట్టి ప్రమాదాన్నీ లక్ష్యపెట్టక నీవిలా నావెంటవచ్చావు. ఇందుకు నేను తప్పక బదులు తీర్చుకుంటాను. ఈ లోపున, ఇదిగో పది బంగారు నాణేలు నీకు బహుమతిగా యిస్తున్నాను తీసుకో,' అని చేతికిచ్చాడు. గర్త్ కృతజ్ఞతా పూర్వకంగా అవి పుచ్చుకొని తన సంచిలో వేసుకున్నాడు.

'ఇదిగో, ఈ బంగారు నాణేల సంచీ తీసుకొని ఆష్బీ గ్రామానికి వెళ్ళు ఇప్పుడే. అక్కడ ఇసాక్ ఎక్కడున్నాడో కనుక్కొని, అతనికి ఇది అందజేసి, అతని సహకారం మూలంగా నాకు లభించిన యీ గుర్రానికీ, కవచాదులకూ ఎంత డబ్బు చెల్లించాలో అతనినే చెల్లగట్టవెయ్యమనిచెప్పు'— అని అజ్ఞాతయోధుడు వెంటనే అతని పొమ్మని చెప్పాడు.

'బాబో! అది నావల్లకాదు' అన్నాడు గర్త్. 'ఏమీ, అయితే నా ఆజ్ఞ పరిపాలించవా?' అని అడిగాడు అజ్ఞాతయోధుడు. 'పరిపాలించకేం, పరిపాలిస్తాను. కాని, ఒక యూదీయునికి, నీవు కావలసిందంలో నీవే చెల్లగట్టుకోమని డబ్బుసంచీ చేతిలో పెట్టడం నాకేమీ బాగా కనిపించడంలేదు. నా యజమానిని నేనే మోసగించుకొన్నట్లవుతుందది. ఇది అవివేకులచేత చేయించవలసిన పని. క్రైస్తవభక్తుని డబ్బుదోచి భక్తిదూరునికి చేతులారా కట్టబెట్టడం!' అన్నాడు గర్త్.

'బలే నౌకరువు నీవు! నాకు కావలసింది అతడు తృప్తుడు కావడం. వెళ్ళి ఆ పని చేసిరా పో,' అని తిరిగి ఆదేశించాడు అజ్ఞాతయోధుడు. 'ఆఁ, ఆ పని చేస్తాను' అంటూ గర్త్ ఆ సంచీని తన అంగీలోపల భద్రపరచుకొని, గుడారం వెడలి బయటికివస్తూ, 'తేలిగ్గా పోనిస్తానా! అతనంతట అతనే,దీనిలో సగంలోనే తృప్తిపడేటట్లు చెయ్యకపోతే నా పేరు గర్త్ కాదు'అని గొణుక్కున్నాడు. గర్త్ వెడలిపోయిన తర్వాత, అజ్ఞాతయోధుడు మనస్సులో ఏవేవో ఆలోచనలతో వ్యథచెందుతూ ఆ గుడారంలో ఒంటరిగా ఉండిపోయాడు.

ఇప్పుడు మనం ఆష్బీగ్రామ పరిసరాల్లో, ఇసాక్ బసచేసిన యింటికి పోవలసిఉంది. అది ఆ గ్రామంలోని మరొక యూదీయ షావుకారుకు చెందిన యిల్లు. యూదీయులు యితరులతో ఎంత పిసినిగొట్టుగా వ్యవహరించినా, తమలో తాము వ్యవహరించుకోవలసి వచ్చేటప్పుడు, చక్కని ఆతిథ్య మర్యాదలు నడుపుకుంటూ మంచి ఉదారాంతఃకరణలతో మెలగుతూ ఉంటారనేది జగత్ప్రసిద్ధం. ఇసాక్ తన కూతురుతోనూ, ఇతర పరివారంతోనూ ఈ బంధు గృహంలో బస చేసిఉన్నాడు.

లోపల ఒక గది. చాల చిన్నదే అయినా, ప్రాచ్యదేశీయ పద్ధతిలో చిత్రవిచిత్రంగా అలంకరించబడి ఉంది. వింత వింత అల్లికపనులు చేయబడిన బాలీసుల దొంతరపై రెబెకా కూర్చుండి, ఏదో వెర్రియెత్తినవాడిలాగ గదిలో పచార్లు చేస్తున్న తండ్రిని గమనిస్తోంది. యిసాక్ మధ్య మధ్య తల పైకెత్తి పరంబీకేసి శూన్యంగా చూస్తూ, 'ఎంతపని జరిగింది! ఒకటూ రెండా, యాభై షెకెల్సు! ఆ దుర్మార్గుడు ఒక్క పెట్టున నా చేతిలోంచి లాగేశాడు! మోషే ప్రవక్త ధర్మస్మృతిని తూచా తప్పకుండా పాలించే నాకు కలగవలసిన నష్టమేనా యిది!' అని వాపోతున్నాడు. 'ఆ డబ్బు ప్రిన్సు జాన్‌కు మరి అప్పుడు, యిష్టంగా యిచ్చినట్లే కనిపించావు కాదా నాన్నా?' అని అడిగింది రెబెకా.

'నేనా! యిష్టంగానా! లయన్సుసముద్రశాఖలో, తుపాను గాలికి కొట్టుమిట్టాడిన ఓడను తేలిక పరచడం కోసం, చేతులారా నా సరకులను నీటిపాలు చేసినప్పుడు ఎంత యిష్టంగా చేశానో యిదీ అంతే! నిజంగా ఆ రోజున,

సముద్రునికి ఎంత నాణ్యమైన పట్టుసరుకు కట్టబెట్టి, ఎన్ని పరిమళ ద్రవ్యాలను పైన విరజిమ్మి, ఎంత వెండి బంగారు వస్తుసముదాయాన్ని సముద్రగర్భపు నిధి నిక్షేపాలకు చేర్చడం జరిగింది! యిదంతా నా చేతులతో చేసిన త్యాగమే అయినా, ఆ గంటసేపూ నేను పడినబాధ వర్ణనాతీతం!' అన్నాడు ఇసాక్.

'కాని, ఆ త్యాగం, భగవంతుడు మన ప్రాణాలు కాపాడడానికి మన వలన అపేక్షించాడు. ఇప్పుడందుమూలంగా నీకు చెడుగేం కలిగింది? భగవంతుడు నీసంపదను తరువాత వృద్ధిచెయ్యలేదా?' అని అడిగింది రెబెకా.

'నిజమే, వృద్ధిచేశాడు. కాని, ఒక దుర్మార్గుడు నేడు పట్టపగలు నా చేతిలోంచి డబ్బుసంచీ లాక్కొని నా డబ్బు అపహరిస్తూవుంటే, ధైర్యంగా ప్రతీకారం చెయ్యడానికి బదులు, పండ్లికిలించి చూస్తూ వూరుకోవలసిన దుస్థితి పట్టింది. ఏమి దురవస్థ మన జాతికిది! మనకు అపకారం జరుగుతూంటే లోకం విరగబడి నవ్వుతుంది. మనం, బాధంతా లోపలే అణచుకొని, సిగ్గులేని నవ్వొకటి తెచ్చిపెట్టుకొని నవ్వవలసి వస్తోంది.' అని వ్యథపడ్డాడు ఇసాక్.

'అలా అనుకోకు నాన్నా! మనకూ కొన్ని వెసులుబాట్లు వుండనే వున్నాయి. ఈ క్రైస్తవులు మనల నొకవైపు ఎంత ద్వేషించినా, ఏదో ఒక విధంగా మనమీద ఆధారపడి యుండవలసిన స్థితి వారికి వుండనే వుంటోంది. మన ధనసాహాయ్యం లేనిదే ఏ సంధివిగ్రహాలూ వారికి కొనసాగవుకదా! వారికి మనం అప్పిచ్చిన డబ్బు పెరిగి,మన కోశాగారాలకే తిరిగి వచ్చిచేరుతోంది. త్రొక్కిన కొద్దీ ఏపుగా పెరిగివచ్చే ఓషధిలాంటివాళ్ళ మనం. ఇవాళ మటుకు యివాళ, యూదీయుని తోడ్పాటువలన కాదా ఈ పోటీ ప్రదర్శనమింత ఘనంగా కొనసాగడానికి వీలయింది?' అని ఊరడించింది రెబెకా.

కుమార్తె పలికిన చివరివాక్యంవల్ల, యిసాక్‌కు మరొక సంగతి జ్ఞాపకం వచ్చి బాధపడ్డాడు. అజ్ఞాత యోధునికి లీసెస్టరులోని యూదీయు షావుకారు కిర్జత్ జైరాంద్వారా తను యిప్పించిన గుర్రం, కవచం వగైరాలు దక్కుతవో లేదో అని అతని భయం. అయినా, ఆ యువకుడు మంచివాడు గనుక భయం లేదని మళ్ళీ తనలో తానే సర్దిచెప్పుకుంటున్నాడు. 'నాన్నా, ఆ అజ్ఞాత యోధుడు నీకుచేసిన ఉపకారానికి ప్రత్యుపకారంగా కదా, ఆ గుర్రం వగైరాలు అతనికి సంపాదించిపెట్టావు? అందుకు పశ్చాత్తాప పడుతున్నావా?' అని కుమార్తె అడిగింది. లేదు లేదంటూ, యిసాక్ చిరాకుగానే తిరిగి గదిలో పచారు చెయ్యడం మొదలుపెట్టాడు.

చీకటిపడుతోంది. ఒక నౌకరు, పరిమళతైలంపోసి వెలిగించిన రెండు వెండిదీపాలు తెచ్చి మేజామీద పెట్టాడు. మరికొంతసేపటికి, ఇంకొక పరిచారకుడు, రుచ్యమైన భోజనపదార్థాలూ, మాగిన ద్రాక్షాసవమూ తెచ్చి వేరొక

మేజామీద అమర్చి, ఎవరో క్రైస్తవుడు తనతో మాట్లాడగోరుతున్నాడని ఇసాక్‌తో చెప్పాడు. వ్యాపారస్థులైనవారు తనతో పనిమీద ఎవరు ఎప్పుడు వచ్చినా మాట్లాడేందుకు సిద్ధంగా ఉండాలాయె. ద్రాక్షాసవ పాత్రను పెదవికి చేర్చబోయిన ఇసాక్, వెంటనే దానిని తిరిగి మేజాపైన దించివేసి, రెబెకాతో మేలిముసుగు వేసుకోమని చెప్పి, ఆ యాగంతుకుని ప్రవేశపెట్ట వలసిందిగా పరిచారకునికి ఆదేశించాడు.

రెబెకా సన్నని జలతారు మేలిముసుగు ఆపాదమస్తకం జీరాడేటట్లు ధరించి కూర్చున్నంతలో, గర్త్ లోనికి ప్రవేశించాడు. నెత్తిమీద టోపీ తీసి చేత పట్టుకోకపోగా, నుదటిమీదికి మరింతగా లాక్కున్న అతని వైఖరి అనుమానాస్పదంగా కనుపించింది. వచ్చీరావడంతోనే, 'యార్కు నగరపు యూదీయ షావుకారు యిసాక్ మీరేనా?' అని అడిగాడు, అచ్చమైన సాగ్జన్ భాషలో.

వ్యాపారావసరాలనుబట్టి అన్ని భాషలూ బాగా వచ్చిన ఇసాక్, సాగ్జన్ లోనే అతనికి అవునని సమాధానమిస్తూ, 'మరి నీ పేరేమి' అని తిరిగి ప్రశ్నించాడు.

'అది మీకిప్పుడనవసరం' అన్నాడు గర్త్. 'అదేమిటి? నా పేరు నీకు కావలసినట్లుగానే నీ పేరు నాకు తెలియకపోతే, పని నడిచే దెలాగ?' అన్నాడు ఇసాక్. 'చక్కగానే నడుస్తుంది. నేను మీకు డబ్బు చెల్లగట్ట వచ్చినవాణ్ణి గనుక, మీ పేరు నాకు తెలియడం అవసరం. పుచ్చుకునే మీకు, ఎవరిద్వారా అది యివ్వబడిందనే ప్రశ్నతో నిమిత్తం లేదు.' అన్నాడు గర్త్.

'అయితే నీవు డబ్బు చెల్లగట్టేందుకు వచ్చావన్నమాట! రా, రా! ఎవరు నిన్ను పంపింది?'

'నేటి పోటీలో గెలుపొందిన అజ్ఞాతవీరుడు. లీసెస్టరువాసి కిర్జత్ జైరాంచేత మీ రిప్పించిన కవచానికి డబ్బు చెల్లగట్టవచ్చాను. గుర్రాన్ని మీ గుర్రపుశాలలో అప్పజెప్పాను. నేను మీకు ఎంత చెల్లగట్టాలో చెప్పండి' అని అడిగాడు గర్త్.

ఇసాక్ సంతోషాతిశయంతో, 'నేను మొదటినుంచీ అనుకుంటూనే ఉన్నాను ఆ యువకుడు చాల మంచివాడని. రా! ఒక గిన్నెడు ద్రాక్షాసవం త్రాగు మరేం ఫరవాలేదు.' అంటూ, ఆ పందులకాపరి జన్మలో యెన్నడూ రుచిచూచి యెరుగని, మంచి మాగిన ద్రాక్షాసవం అతని కందిచ్చి, 'ఎంత డబ్బు తీసుకొచ్చావేమిటి?' అని ప్రశ్నించాడు.

'ఎంత డబ్బంటూరా! ఎంతో కాదు కొంతే! కాని, మీరడిగేదానికి సరిపోతుంది, న్యాయంగా ఎంత అడుగుతారో అడగండి.' అన్నాడు గర్త్.

ఇసాక్ అతని అంగీలోపలికి పేరాసతో చూస్తూ, 'చాలా బరువుగా ఉంది సంచీ. మీరు జెకిన్సు తెచ్చారనుకుంటాను' అని ఒక గాలం వేసి చూశాడు.

'క్రొసుబిండ్లవు గావలసిన యినప కీలు కూడ కొన్ని ఉన్నాయి లెండి అందులో' అని సమాధానమిచ్చాడు వెంటనే గర్త్.

లాభంమీద గల సహజాపేక్షకూ, అజ్ఞాతయోధుని విషయంలో కొంత ఉదారంగా ప్రవర్తించాలనే ప్రవృత్తికీ మధ్య మనస్సు ఊగిసలాడుతూ ఉండగా ఉక్కిరిబిక్కిరౌతూ, ఇసాక్ ఎట్టకేలకు తెగించి, 'ఎనభై జెకిన్లు చెల్లించమనే, చాలు. అక్కడికి నేనేమీ లాభం చేసుకోకుండా చెప్పాను. ఉన్నదా అంత డబ్బు నీ దగ్గిర?' అని అడిగాడు.

అనుకున్నదానికంటె కొంచెం సరసంగానే అడిగాడని తెలిసినా, గర్త్ అది పైకి తెలియనివ్వక, 'బొటాబొటిగా అంతే ఉంది. మా యజమానికిక పైసా మిగలదు. అదే మీ ఆఖరుమాట అయితే, ఇక నేనేమనగలను?' అన్నాడు గర్త్.

ఇసాక్ మరొక గిన్నెడు ద్రాక్షాసవం అతని కందిస్తూ, 'ఎనభై జెకిన్లడిగానంటే, అక్కడికి చాలా తక్కువ అడిగానన్నమాట. వడ్డీ డబ్బులైనా గిట్టవు' అని నమ్మించజూశాడు.

'ఇన్నిమాటలెందుకు? డెబ్బయి జెకిన్లు తీసుకోడం న్యాయంగా ఉంటుంది. అలా తీసుకుంటే తీసుకోండి. లేకపోతే సంచీ తిరిగి తీసుకొని పోయి మా యజమానికిచ్చేస్తాను'— అని సంచీని గలగలలాడించాడు గర్త్.

'ఇదిగో నామాట విను. ఆ యెనభై జెకిన్లు ముందు యిలా తే. నేను చెప్పేదంతా తరువాత' అని చెయ్యిచాచాడు ఇసాక్.

గర్త్ తుదకు అంగీకరించి, డెబ్భై జెకిన్లనూ మేజామీద ఎంచిపోసి,— గుర్రానికీ, కవచానికీ విడుదల రసీదు వ్రాయించి పుచ్చుకున్నాడు. మొదటి డెబ్బయి జెకిన్లూ ఎంచి తన సంచీలో వేసుకోడంలో ఇసాక్ చెయ్యి మంచి జోరుగానే నడిచింది. చివరి పదీ కొంచెం తటపటాయిస్తూ లెక్కపెట్టసాగాడు. అతనిలోని ఉదారగుణంతో అతని పేరాస ఘర్షణ పడుతూ, ఒక్కొక్క నాణేన్ని బలవంతాన సంచీలో వేయిస్తున్నట్లుగా ఉన్నదా దృశ్యం. తనకు కష్టంలో తోడ్పడ్డ అజ్ఞాతయోధునికి ఏదైనా కొంత రాయితీ చెయ్యాలనీ, లేక, అతని నౌకరుకు ఏదో కొంత ఇనాముగా ఇవ్వాలనీ, అతనిలో బయలుదేరిన కోర్కె లోలోపలనే అణగిపోయింది. చిట్టచివరి పదినాణేలూ లెక్కపెడ్తూ అతడు చేసిన ప్రసంగమిది :

'డెబ్బయి ఒకటి—డెబ్బయి రెండు—మీ యజమాని చాలా మంచివాడు—డెబ్బయి నాలుగు—ఈ నాణెం కత్తిరించినట్లు ఉందే!—డెబ్బయి అయిదు—చాలా అరిగిపోయిందీ నాణెం!—డెబ్బయి ఆరు—మీ యజమాని కెప్పుడైనా డబ్బు కావలసివస్తే నా దగ్గిరకు రమ్మను—డెబ్బయియేడు—తగినహామీ ఉండాలన్న సంగతి తెలిసిందేగా.' లెక్క ఆపి, ఇసాక్ కొంచెంసేపు తటపటాయించాడు. మిగిలిన మూడు నాణేలైనా ఇక వెనుకటివాటితోపాటు సంచీలో పడవనే ఆశతో ఉన్నాడు గర్తు. కాని, లెక్క మళ్లా సాగింది—'డెబ్బయి ఎనిమిది—నీవు చాలా మంచివాడవు—డెబ్బయి తొమ్మిది—నీకేదైనా ఇవ్వాలి.'

ఇక్కడ ఇసాక్ మరొకసారి ఆగాడు. గర్తుకు ఇవ్వాలనే ఉద్దేశంతోనే చిట్టచివరి నాణెం పట్టి చూచాడు. కొనవేళ్లపై ఠంగుమని మోగునట్లు మీటాడు. మ్రోత ఏ మాత్రం జబ్బుగా ఉన్నా, బరువు ఏమాత్రం తక్కువగా వున్నా, గెలుపు అతని ఔదార్య గుణానికే వచ్చేది. కాని, గర్తు దురదృష్టవశాత్తూ, మ్రోత చాల నిండుగా మ్రోగింది. బరువు ఉండవలసిన దానికంటె ఒక చిన్నం ఎక్కువ ఉండేటట్లు తోచింది. ఇసాక్ ఇక దానిని వదలలేక పోయాడు. పరధ్యానంతో ఉన్నట్టుగా దానిని తన సంచీలో పడేస్తూ, 'ఎనభై జెక్నూ ముట్టాయి, బాకీ సీదా అయిపోయింది. నీకు మీ యజమాని ఏదైనా బహుమతీ యిస్తాడులే పో. ఆ సంచీలో ఇంకా ఉన్నాయికదూ నాణేలూ?' అన్నాడు.

గర్తు పండ్లికిలించి, 'మీరు భద్రంగా మీ సంచీలో యెన్ని యెంచిపోసుకున్నారో ఇంకా అన్ని వున్నాయందులో' అంటూ రసీదు కాగితం మడిచి టోపీలో పెట్టుకొని, 'యింకో గిన్నెడు మధువైనా త్రాగనీ' అంటూ, తనంతట తానే మూడోసారి గిన్నెను మధువుతో నింపుకొని త్రాగేసి, సెలవైనా పుచ్చుకోకుండ గది బయటికి నడచిపోయాడు.

అతడు వెళ్ళిపోగానే ఇసాక్, రెబెకాతో ఏదో మాట్లాడబోయి ఆమె కూర్చునియున్న వైపు తిరిగాడు. కాని ఆమె అక్కడ కనపించలేదు. గర్తుతో అతడు మాట్లాడుతున్న సమయంలోనే, అతనికి తెలియకుండ ఆమె నెమ్మదిగా అచటినుండి వెడలిపోయింది.

గర్తు మెట్లు దిగి, క్రింది చావడిలోనికి వచ్చి, బయటికి దారి చూచుకుంటున్న సమయంలో, ఒక స్త్రీ విగ్రహం, చేత చిన్న వెండిదీపం పుచ్చుకొని, ప్రక్క గదిలోకి రమ్మని అతనికి సంజ్ఞ చేసింది. గర్తు చప్పున వెళ్లలేకపోయాడు. మంత్రగత్తెలను గూర్చి సాక్సనులలో చెప్పుకునే కథ లేవో అతనికి జ్ఞాపకం వచ్చాయి. పైగా, యూదులు దయ్యాలతో మాట్లాడుతారని అతడు విని

రయున్నాడు. కాని, కొంచెం సేపటిలోనే ఈ భయ సంశయాలనుండి తెప్పిరిల్లి, ఆమె ననుసరించి లోనికి వెళ్లాడు. దీపం ముందర ఆమె రూపం ఇప్పుడు స్పష్టముగా కనిపించింది. ఆమె ఎవరో కాదు, రెబెకా సుందరియే.

తండ్రితో జరిగిన లావాదేవీ వివరాలు రెబెకా అతని నడిగింది. అతడు పూస గ్రుచ్చినట్లు అంతా చెప్పాడు. అందుపై రెబెకా అతనితో ఇలా అంది: 'మా నాన్న నీతో పరిహాసమాడాడు, అంతకంటె మరేం లేదు. మీ యజమానికి ఆయన యెంతో ఋణపడియున్నాడు. ఇలాంటి గుర్రాలూ కవచాలూ పది యిచ్చినా ఆ ఋణం తీరేది కాదు, ఎంత చెల్లించావు మా నాన్నకు నీ విప్పుడు?'

'ఎనభై జెకిన్లు'—అన్నాడు గర్త—ఆ ప్రశ్నకు అచ్చెరువొందుతూ.

'ఇదిగో, ఈ సంచీ తీసుకో, ఇందులో వంద జెకిన్లున్నాయి. మీ యజమాని కివ్వవలసినవి యిచ్చేసి, తక్కినవి నీవు తీసుకో, పో—త్వరగా వెళ్లు. కృతజ్ఞతలు తెల్పుతూ అనవసరంగా యిక యిక్కడ తడయబోకు. నగర జనసమ్మర్దం మధ్యనుంచి యెలా వెడతావో, జాగ్రత్త. రూబెన్, యితనికి బయటికి దారి చూపించి, జాగ్రత్తగా వీధి తలుపు గడియ వేసిరా!'

రెబెకా ఆదేశించినట్లుగానే నౌకరు రూబెన్ దివిటీ పుచ్చుకొని దారి చూపుతూ, గర్తను బయటి గేటు అవతలివరకూ సాగనంపి, ఒక బందిఖానా గేటుకు వేసేటంత బందోబస్తుగా గేటుకు తిరిగి తాళాలు వేసేశాడు.

చీకటిలో దారి చూచుకుంటూ ముందుకుసాగిన గర్త, తన మనస్సులో ఇలా అనుకొన్నాడు: 'ఈ యూదీయ కన్య నిజంగా స్వర్గంనుంచి దిగివచ్చిన దేవత. పది జెకిన్లు నా యజమానివలన లభించాయి. ఈ దేవత 20 జెకిన్లు యిచ్చింది. యెంత సుదినం! మరొక శుభదినం కూడా త్వరలోనే వస్తుంది. అప్పుడీ దాసిసత్వం నుండి విముక్తుణ్ణి అవుతాను. పందుల కాపరి వృత్తిచేస్తూ కొమ్ము దుడ్డుకర్ర పుచ్చుకొని కాలక్షేపం చెయ్యవలసిన అవసరమిక నాకు ఉండదు. స్వతంత్రులెల్లరికీ ఉండే అధికారంతో, కత్తీ డాలూ చేతబట్టి, ఈ బొందిలో ప్రాణం ఉండే పర్యంతమూ నా చిన్న దొరను సేవిస్తాను. ఎవరు గుర్తుపట్టారో నన్న భయంతో మొంగం దాటుచేసికొని తిరగవలసిన దురవస్థ నాకిక ఉండదు.'

లోపలికి కొంత వెన్నెల ప్రసరిస్తోంది. బహుశః ఆ మూతా వాళ్ళే, మరి యిద్దరు దొంగలు అక్కడ వారిని కలుసుకున్నారు. అందరి ముఖాలకూ ముసుగులూ, మొలను కత్తులూ, చేతిలో బాణాకర్రలూ ఉన్నాయి. 'చెప్పు నీ దగ్గర ఏమున్నదో!' అని అదలించాడు వారిలో ఒకడు.

'నా సొంతం ముప్పయి జెకిన్లు' అని జవాబు చెప్పాడు గర్త్ నిబ్బరంగా. 'ఏమిటీ! ఒక సాక్సన్ దగ్గిర ముప్పయి జెకిన్లా! ఇంత డబ్బుతో నగరంలోంచి వస్తూ, సారా చుక్క వెయ్యకపోవడం మరీ చిత్రంగా ఉంది! ఇలా తే ఆ డబ్బంతా!' అని అరిచారు దొంగలు.

'అది నేను బానిసత్వంలోంచి స్వేచ్ఛ సంపాదించుకోడం కోసం దాచుకున్నాను' అన్నాడు గర్త్. 'ఓరి తెలివితక్కువ దద్దమ్మా! ఒక బుడ్డి సారా చేస్తే కావలసినంత స్వేచ్ఛ లభించేది గదా నీకు! నీ యజమాని కూడా నీ వలెనే సాక్సనైతే, ఒక బుడ్డి సారాతో నీ యజమాని కంటె కూడా ఎక్కువ స్వేచ్ఛనే సంపాదించేవాడవు' అన్నాడొక దొంగ.

'నిజమే,—మీ నోట విషాదకరమైన సత్యం వెలువడింది. సరే, ఇప్పుడు నేను మీ చేతుల్లోంచి బయటపడాలిగదా! ఈ ముప్పయి జెకిన్లూ పుచ్చుకొని నన్ను వదిలి పెయ్యడం మీకు ఇష్టమయ్యే పక్షంలో, చేతులు కలపండి, డబ్బు చెల్లిస్తాను,' అన్నాడు గర్త్.

'అప్పుడే పలుకకండి!' అంటూ, ఆ దొంగలకు నాయకుని వలె కనుపించిన ఒక దొంగ, 'నీ అంగీచాటున ఉన్న సంచీ చాలా బరువుగా ఉన్నట్లుందే! ముప్పయి జెకిన్లే కాదు, ఇంకా ఎక్కువ ఉండి ఉంటాయి. నిజం చెప్పు' అని గర్తును గదిమాడు.

'ఉన్నమాట నిజమే కాని, తక్కిన డబ్బు నాది కాదు, నా యజమానిది' అని సమాధానమిచ్చాడు గర్త్.

దొంగల నాయకుడు గర్త్ అంగీ లోపలనుంచి డబ్బుసంచీ బయటికి లాగి, దానిలోపలనున్న చిల్లర జెకిన్లతో పాటుగా రెబెకా యిచ్చిన సంచీని కూడా వెలికితీస్తూ, 'ఎవరు మీ యజమాని?' అని ప్రశ్నించాడు.

'నేటి పోటీలో గెలుపొందిన అజ్ఞాతయోధుడు.'

'ఏమీ, అజ్ఞాతయోధుడా! అతని పేరేమిటి? ఏ వంశం? నీకు తెలిసి ఉంటాయి చెప్పు' అని అడిగాడు దొంగల నాయకుడు.

'అవి యెవ్వరికీ తెలియనివ్వరాదని మా యజమాని ఆజ్ఞ. నేను చెప్పను. నా వలన మీరు రాబట్టలేరు' అన్నాడు గర్త్.

'పోనీ నీ పేరేమిటి? నీ దే వంశం?'

'నా పేరూ నా వంశం చెప్పితే నా యజమాని పేరూ వంశం బయటపడి పోతాయిగనుక చెప్పను' అన్నాడు గర్త్.

'నీవు చాలా పొగరుబోతులాగున్నావే! ఇంతడబ్బు మీ యజమాని కెలావచ్చింది? పిత్రార్జితమా, లేక సొంతంగా సంపాదించినదా?'

'పోటీలో ఓడిపోయిన నలుగురుయోధులూ తమ గుర్రాలూ కవచాలూ విడిపించుకోడానికి చెల్లించిన బాపతు డబ్బు ఆ సంచీలో ఉంది' అన్నాడు గర్త్.

'ఎంతకు విడిపించుకున్నారేమిటి?'

'రెండువందల జెకిన్లు.'

'రెండువందల జెకిన్లేనా! మీ యజమాని చాల తేలిగ్గా వదిలేశాడే వాళ్లను! డబ్బు చెల్లించింది ఎవరెవరో పేర్లు చెప్పు.'

గర్త్ ఆ పేర్లు చెప్పాడు.

'ఇదిగో నన్ను మోసగించ జూస్తున్నావ్! అది నీ తరంకాదు. టెంప్లార్ బ్రయన్ చెల్లించిన డబ్బుసంగతి చెప్పవేం?' అని అడిగాడు దొంగల నాయకుడు.

'మా యజమాని అతని వద్దనుంచి ఏమీ పుచ్చుకోలేదు, పుచ్చుకోదలచ లేదు. అతని ప్రాణాలు తప్ప ఇంకేది పుచ్చుకోడానికీ మా యజమాని సిద్ధంగా లేడు. ఉభయులకూ ఘోరమైన సంగ్రామం జరిగి, చావుబ్రతుకులు తేలిపోవాలి! ఆ విధంగా ఇద్దరూ ఒకరిపై నొకరు సవాలు చేసుకున్నారు. కనుక ఇంకొక రకమైన మర్యాదలు వారిద్దరిమధ్యా నడవడానికి వీలులేదు' అన్నాడు గర్త్.

'నిజంగానా!' అని దొంగలనాయకుడు రిచ్చపడి, 'మరి యింతడబ్బు దగ్గిర పెట్టుకొని అష్బీకి ఏ పనిమీద వచ్చావ్?' అని అడిగాడు.

'మా యజమానికి ఈ పోటీలో గుర్రమూ కవచమూ సంపాదించి పెట్టినందుకు గాను, యార్కునగరపు యూదీయ షావుకారు ఇసాక్‌కు డబ్బు చెల్లించ వచ్చాను' అన్నాడు గర్త్.

'ఎంత చెల్లించావేమిటి? బరువు చూడబోతే, యింకా రెండువందల జెకిన్లదాకా ఉన్నట్లున్నాయే!'

'యిసాక్‌కు నేను ఎనభై జెకిన్లు చెల్లించగా, అతడు నాకు వంద జెకిన్లు తిరిగి యిచ్చాడు.'

'ఏమిటీ! ఎలాగా! మా వద్ద నీ యాటలు సాగవుసుమా! అబద్ధాలాడి మాకు టోకరా ఇవ్వాలనుకుంటున్నావు కాబోలు!' అని అదలించాడు దొంగల నాయకుడు.

'నేను చెప్పినదాంట్లో ఏమీ అబద్ధంలేదు. నా సంచీలో తక్కిన బంగారు నాణేల కంటే వేరుగా ఉన్న ఆ పట్టుసంచీయే అందుకు ప్రబల నిదర్శనం' అన్నాడు గర్తు.

'యూదీయ షావుకారేమిటి, డబ్బు తిరిగి ఇవ్వడమేమిటకి! ఇసుకలో ఒలికిన నీరు తిరిగి లభించిందన్నట్లుగా ఉంది. దీపం వెలిగించండి రా, ఇందులో ఎంతుందో చూద్దాం' అన్నాడు దొంగల నాయకుడు.

దీపం వెలిగించారు. దొంగల నాయకుడు ఆ పట్టుసంచీని పరిశీలింప సాగాడు. తక్కినవారు అతనిచుట్టూ మూగారు. గర్తును పట్టుకొన్న ఇద్దరు దొంగలూ కూడా మెడలు నిక్కించి చూస్తున్నారు. ఆ సమయంలో వారి పట్టు కొంచెం సడలడం కనిపెట్టి, గర్తు ఒక్క ఊపుతో వారి చేతుల్లోంచి తప్పించుకొని, ఒకని చేతిలోని బాణాకర్ర ఊడలాక్కొని, దానితో దొంగల నాయకుని తలపై బలంగా ఒక దెబ్బ కొట్టి డబ్బుసంచీ లాక్కోబోయాడు. కాని, అతని ప్రయత్నం సాగిరాలేదు. దొంగలు అచిరకాలంలోనే తిరిగి అతనిని పట్టుకొని బంధించివేశారు.

దొంగల నాయకుడు తలపట్టుకుంటూ లేచి, 'తల పగలగొట్టేశావురా దుర్మార్గుడా! ఉండు, నీపని తరువాత చెప్తాను. ముందు, నీ యజమాని సంగతి తేల్చాలి. వీర సంప్రదాయం ప్రకారం యజమాని సంగతి చూచిన తర్వాతనే నౌకరుసంగతి చూడాలి. ఈలోగా, మళ్ళీ కదిలావా అంటే నీ ప్రాణాలు దక్కవ్ జాగ్రత్త!' అంటూ, తోటివారివైపు తిరిగి, 'వీడు చెప్పినమాట నిజం లాగానే తోస్తోంది. ఈ సంచీమీద హీబ్రూ భాషలో అక్షరాలేవో అల్లబడి ఉన్నాయి. వీడి యజమానియైన అజ్ఞాతయోధునివలన మనం ఏలాంటి సుంకమూ వసూలు చేయరాదు. అతడుకూడా మనబోటివాడే! అతని ఆస్తి మనం దోచుకోడం తగదు. తోడేళ్ళనూ గుంటనక్కలనూ వేటాడవలసియున్న వేటకుక్కలు తోటి వేటకుక్కలను బాధించడం పనికిరాదు' అన్నాడు.

'మనబోటివాడా ఆ యోధుడు? ఏ విధంగానో నాకు తెలియడంలేదు' అన్నాడు దొంగల్లో ఒకడు. 'ఓరి చవటా, ఈ మాత్రం తెలియలా నీకు? మన వలెనే అతడు కూడా పేదవాడు. వారసత్వం కోల్పోయినవాడు. మనవలెనే కత్తి చేతబట్టి జీవనభృతి సంపాదించుకుంటున్నాడు. మన విరోధులైన ఫ్రాంట్-డి-బాఫ్, మాల్వాయిసిన్‌లను ఓడించాడు. అంతేకాక, ఏ టెంప్లార్ బ్రయన్‌ను గూర్చి మనం భయపడుతున్నామో, వాని ప్రాణాలు పుచ్చుకోడానికి కూడా శపథం పూనాడు. ఇవన్నీ ఇలా ఉండగా, విశ్వాసదూరుడైన ఒక యూదీయుని కంటెకూడా మనం నీచబుద్ధులమని అనిపించుకోడం ఎంత హేయం!' అని ఉపన్యసించాడు దొంగలనాయకుడు.

'నిజం! నిజం! ఆ హేయపు పని మనం చెయ్యవద్దు. అంతేకాదు. అతని ఈ పొగరుబోతు నౌకరును కూడా నిరపాయంగా వదలివెయ్యడమే మంచిది' అని సమాధానమిచ్చాడు దొంగ.

'అలాగే కానీ, నేనొకటి చెప్తాను'—అంటూ దొంగల నాయకుడు, గర్త వైపు తిరిగి, 'ఏం, బాణాకర్రమీదికి చాలా జోరుగా వాయించ నీ చెయ్యి. ఏ మాత్రం నేర్పుందేమిటి నీకు లాఠీయుద్ధంలో?' అని అడిగాడు.

'ఏ మాత్రం నేర్పుందో నీవే చెప్పు, ఇప్పటికేగా కొంత రుచి చూశావు' అన్నాడు గర్త.

దొంగల నాయకుడు తలపట్టి చూసుకుంటూ, 'నా తలమీద గట్టిదెబ్బే కొట్టావు సరే! ఇదిగో మా వాడు మిల్లర్ ఉన్నాడు, వీడి తలమీద కూడా అలా దెబ్బ కొట్టగలిగావంటే, నిన్ను యథేచ్ఛగా వదిలేస్తాం, వెళ్ళిపోవచ్చు. అలా కానిపక్షంలో, నీ డబ్బు భుక్తపరచుకొనడమే కాక నిన్ను వదలం. ఆరేయ్! వాణ్ణిక వదిలిపెట్టి, చేతికి ఒక బాణాకర్ర యివ్వండి. అరే మిల్లర్, నీవుకూడా నీ బాణాకర్ర తీసుకొని నిలబడు. జాగ్రత్త, తల కాచుకోవాలి సుమా!' అని హెచ్చరించాడు.

పోటీదారు లిద్దరూ బాణాకర్రలు పుచ్చుకొని బరిలోకి దిగారు. ఆ ప్రదేశాన వెన్నెల బాగా ప్రసరిస్తోంది. బాణాకర్రలు శిరస్సులపై అతి చాకచక్యంతో తిప్పుకొంటూ వచ్చి, ఉభయులూ తీవ్రవేగంతో ఒండొరుల మార్కొన్నారు.

ఒకరిదెబ్బ లొకరు కాచుకుంటూ, తిరిగి ఒండొరులపై దెబ్బలు విసురుకుంటూ, కొన్ని నిమిషాలసేపు ఇరువురూ సమానమైన బలమూ, కౌశలమూ, శౌర్యమూ ప్రదర్శిస్తూ పోట్లాడారు. ఆ లాఠీల కటకటధ్వని దూరానికి ఇద్దరి మధ్య పోట్లాటగా అనిపించడం లేదు. ఆరుగురటూ, ఆరుగురటూ నిలబడి ఒండొరులను ఢీకొని ఉంటారని తోపింప జేస్తోంది. తనకు ఇంతటి తీవ్ర ప్రతిరోధం కలుగుతుందని మిల్లర్ అనుకొని యుండలేదు. కొంతసేపటికతని మనస్సుకు స్థాయి తప్పి, చికాకుపడడం మొదలుపెట్టాడు. అతడు చికాకుపడడం చూచి, అతని తోటివారు నవ్వడం సాగించారు. వారు నవ్వినకొద్దీ అతని చికాకు మరీ యొక్కువయింది. ఇలాంటి లాఠీ యుద్ధాల్లో మనస్సు నిబ్బరం కోల్పోకుండా ఉండడం చాలా అవసరం. గర్త అది కోల్పోని కారణంచేత, క్రమంగా అతనిదే పైచేయి కావడం మొదలుపెట్టింది.

మిల్లర్ కోపాటోపంతో ముందుకు చొరబడి, బాణాకర్ర దెబ్బలు ఇరు మొనలతోనూ వరుసప్రకారం ప్రత్యర్థిపై ప్రయోగిస్తూ, అతనికి అంతకంతకు వేధన

కావాలని తొందరపడుతూవుంటే, గర్తు ఒక గజం దూరంలో అతనిని నిలవరిస్తూ, కడు నేర్పుతో, తనకు సర్వాంగరక్షగా లాఠీ తిప్పుకొని ఏ దెబ్బా తనమీద పడకుండ కాచుకొంటూ వచ్చాడు. అతని కంటిచూపు, కాలి అడుగు, చేతి విసురు ఎక్కడా గతి తప్పడంలేదు. మిల్లరుకు ఎప్పుడైతే స్థాయి తప్పిందో, అప్పుడు వెంటనే అతడు తన ఎడమచేతితో అతని ముఖంమీదికి లాఠీ విసిరాడు. ఆ దెబ్బ తప్పించుకోడానికి మిల్లరు ప్రయత్నించేటంతలోనే తిరిగి కుడి చేతితో అతని తలమీద బలంగా కొట్టాడు. దెబ్బ నాటిగా తగిలింది. మిల్లరు చాపచుట్టుగా క్రింద పడిపోయాడు.

'భేష్, భేష్! బలే చక్కని పోరాటం! ఇంగ్లండు దేశపు ప్రాచీన విద్యలు కలకాలం వర్ధిల్లాలి! సాక్సన్ జాతిని తన దబ్బూ ప్రాణాలూ కూడా దక్కించుకున్నాడు. మా మిల్లర్ కు తగిన ఉజ్జీ జోటికి తారసిల్లాడు'— అని ప్రశంసించారు దొంగలు.

దొంగల నాయకుడు గర్తును ప్రత్యేకంగా అభినందిస్తూ ఇలా అన్నాడు: 'ఇక నీవు యథేచ్ఛగా నీ దారిని పోవచ్చు. నీ యజమాని ఉన్న చోటికి అడ్డ దారిని త్వరగా నిన్ను చేర్చేటందుకు మా వాళ్ళ ఇద్దరిని తోడిచ్చి పంపుతున్నాను. ఒంటరిగా పోతే, ఇలాంటి రాత్రివేళ ఇంకెవరైనా నిన్ను అటకాయించ వచ్చు. మనసు మెత్తదనం మాకంటె తక్కువగా ఉన్న దారిదొంగలు ఈ వైపుల చాలామంది ఉన్నారు. కాని, ఒక్క సంగతి మాత్రం చెప్పుతున్నాను జాగ్రత్త! నీవెవ్వరవో, నీ పనేమిటో నీవు మాకు చెప్పనన్నావు. మంచిదే! అలాగే మేమెవ్వరమో తెలుసుకోడానికి కూడ నీవు ప్రయత్నించగూడదు. అలాగనుక ప్రయత్నించావా, ఖబడ్దార్! నీ చావు మూడిందని తెలుసుకో!'

గర్తు దొంగల నాయకునికి తన కృతజ్ఞత తెలియజేసి, ఆ మార్గదర్శకుల వెంట బయలుదేరాడు. వారతనిని ఒక పక్కదోవ వెంట ఆ తోపు దాటించి తీసుకొని పోతూఉండగా, అక్కడ ఎవరో మరి యిద్దరు ఆ మార్గదర్శకులను కలుసుకొని మాట్లాడి, వారేదో చెవిలో చెప్పేసరికి నెమ్మదిగా తిరిగి తోపులోకి అదృశ్యమైపోయారు. ఇదంతా చూడగా, ఈదొంగలది ఒక పెద్ద ముఠాఅనీ, తమ స్థావరాలచుట్టూ కాపలాదారులనుకూడా పెట్టుకొని అప్రమత్తులై సంచరిస్తున్నారనీ గర్తుకు అవగతమైంది.

మార్గదర్శకులు అతనిని ఒక విశాలమైన బయలులోంచి సరాసరి నడిపించుకొని పోయి, ఒక ఎత్తయిన ప్రదేశానికి చేర్చారు. అవతలివైపున దిగువగా అల్లంతదూరాన, పోటీలు జరిగిన స్థలం చుట్టూ కట్టిన దడులూ, ఇరువైపులా

చేసిన గుడారాలూ మొదలైనవి ఆ వెన్నెల్లో కనుపించాయి. గస్తీవాండ్రు కాలం గడవడంకోసం ఏవేవో అల్లాయిపదాలు పాడుతున్నారు.

మార్గదర్శకులిక్కడ ఆగి, 'ఇక మేము ముందుకు రావడానికి వీలులేదు. నీవు వెళ్లు. మా హెచ్చరిక మాత్రం జ్ఞాపకం పెట్టుకో. ఈరాత్రి జరిగినసంగతి ఎవరితోనూ చెప్పకు. చెప్పావంటే, నిన్నిక మాబారినుండి తప్పించడం ఎవరి తరమూకాదు' అని తిరిగి హెచ్చరించి వెనుకకు మరలిపోయారు.

గర్తు తన యజమానిని కలుసుకొని, జరిగినదంతా పూసగుచ్చినట్లు చెప్పాడు. రెబెకా ప్రదర్శించిన ఔదార్యంతోపాటు, దొంగలు ప్రదర్శించిన ఔదార్యం అజ్ఞాతయోధుని కెంతో ఆశ్చర్యము గొలిపింది. కాని, అతడీ ఆలోచన లిప్పుడు తన మనస్సులో చోటునివ్వడానికి వీలులేదు. పగలుపడ్డ బడలిక తీరడంకోసం విశ్రాంతి తీసుకోవలసిన అవసరం ఉంది. మరునాటి పోరాటానికి గూడా తిరిగి తయారు కావలసిన అగత్యముంది. అందుచే, అతడీ ఆలోచనలన్నీ కట్టిపెట్టి, తన సెజ్జపై మేనువాల్చి, సకలావయవములకూ పూర్ణ విశ్రాంతి కలిగేటట్లుగా సాగిలబడి పడుకున్నాడు. గర్తుకూడా, పక్కనున్న నేలపై, తివాసీ లాగా ఉన్న ఒక ఎలుగు చర్మంమీద, గుడారంలోకి ప్రవేశించే మార్గానికి అడ్డంగా ఒరిగాడు. గుడారంలోకి ఎవరు ప్రవేశించినా, అతనికి మెలకువ రాకుండా ఉండడానికి వీలులేదు.

# అధ్యాయం ౧౨

తెల్లవారింది. ఆకాశం మేఘవిరహితమై నిర్మలంగా ఉంది. ప్రొద్దు పొడిచీ పొడవకముందే జనం నలుదిక్కులనుండీ రంగస్థలానికి చేరుకోడం మొదలు పెట్టారు. కూర్చోడానికి అనువైన స్థలం చూచుకోవాలని వాళ్ళ ఆదుర్దా. మరికొంత సేపటికి ఈ పోటీ ప్రదర్శనాల నిర్వాహణోద్యోగులు, చోపుదారులు మున్నగువారచట ప్రత్యక్షమయ్యారు. ఏయే యోధులు ఏ పక్షాన ఈ నాటి పోటీలో పాల్గొనదలిచారో, వారి పేర్లు సేకరించే పని ముందరగా జరగవలసి ఉంది.

అప్పటి ఆచారం ప్రకారం, ఒక పక్షానికి నాయకత్వస్థానం అజ్ఞాత యోధుని కీయవలసి ఉంది. పోతే, క్రిందటి రోజు పోటీలో, ద్వితీయ స్థానం టెంప్లార్ బ్రయన్ దిగా పరిగణించబడింది గనుక, రెండవ పక్షానికి నాయకత్వం అతడు వహిస్తాడు. ఉభయ పక్షాలకూ సంకుల సమరం జరుగుతుంది. తాము ఫలాని పక్షాన పోరాడుతామని ఇతర యోధులు తమ పేర్లివ్వాలి. లేచి తిరిగి కవచం ధరించగల స్థితిలో లేని రాల్ఫ్ డీ-వై పాంట్ తప్ప, నిన్న అజ్ఞాత యోధుని చేతిలో దెబ్బతిన్న యోధులందరూ కూడ ఈ రోజున టెంప్లార్ బ్రియన్ పక్షాన పోరాడడానికే సిద్ధమయ్యారు.

ఇలాంటి పోటీల్లో, ద్వంద్వయుద్ధాలకంటె సంకుల సమరాలే ఎక్కువ ప్రమాదభరితమైనప్పటికీ, ఆ రోజుల్లో యోధులెక్కువగా వీటికే చొరబడుతూ ఉండేవారు. ఏలనంటే, ద్వంద్వ యుద్ధాలలో, ఎవరినో ఒక్కరినే, అభిప్రతిష్ఠుడైన వీరుని ఎదుర్కోవలసి ఉంటుంది. సంకుల సమరంలో అయితే అలా కాదు. తన తాహతుకు తగినవాని ఎంచుకొని వానిముందర తన ప్రతాపం చూపించవచ్చు. అందుచే, ద్వంద్వయుద్ధంలో పాల్గొనే సాహసం లేకపోయినా ఏదో రూపాన తమ శస్త్రవిద్యానైపుణి కొంత ప్రదర్శించాలనే ఉబలాటం గలవారంతా సంకుల సమరంలో పాల్గొనడానికే ఎగబడేవారు. ప్రస్తుత సందర్భంలో, ఇటొక యాభైమంది, అటొక యాభైమంది, మొత్తం నూర్గురు యోధులు తమ పేర్లిచ్చారు. ఆ పైన ఇక చేర్చుకోడానికి నిర్వాహణోద్యోగు లంగీకరించలేదు.

పదిగంటలయ్యేసరికి, ఆ మైదానమంతా అశ్వికులతోనూ సామాన్యజనంతోనూ క్రిక్కిరిసిపోయింది. ఇంతలో తూర్యనాదాలు చెలరేగి, సపరివారుడైన ప్రిన్స్ జాన్ రాకను తెలియజేశాయి. దాదాపు ఈ సమయంలోనే, లేడీ రొవెనాతో సెడ్రిక్ కూడ వచ్చేశాడు. కాని, కేడరని వెంట ఎథెల్‌స్టేన్ లేడు. కవచ శిరస్త్రాణాదులు ధరించి, పోటీలో పాల్గొనే సన్నాహంలో ఉన్నాడతడు. కాని, అతడు టెంప్లార్ పక్షాన చేరివ్వడం సెడ్రిక్‌కు ఆశ్చర్యం కలిగించింది.

అది సమంచితమైన నిర్ణయం కాదని మిత్రుడికి గట్టిగా నచ్చజెప్ప జూచాడు. కాని, ఎథెల్‌స్టేన్ వినిపించుకోలేదు. తనకు యెంతతోస్తే అంతగా కనుపించింది అతని వైఖరి.

తానిలా నిర్ణయించుకోడానికి ఇతర కారణాలెలా ఉన్నా, ఒక ముఖ్య కారణం అతడు ఇతరులెవ్వరికీ చెప్పకుండా తన లోపలే దాచుకున్నాడు. నిన్నటి రోజున అజ్ఞాతయోధుడు రొవెనాను అందాలరాణిగా ఎన్నుకోడం అతనికి కష్టంగా ఉంది. ఆమెను అలా ఎన్నుకునే అధికారం తనకు తప్ప ఇంకెవరికీ లేదని అతని అభిప్రాయం. ఒక విధమైన మందకొడితనం అలవాటైన కారణం చేత, అతడు ఆమె హృదయాన్ని ఆకర్షించగల పనులేవీ స్వయంగా చేయలేకపోయినా, ఆమె సౌందర్యానికతడు ఆకర్షితుడు కాకపోలేదు. ఆమెతో తన వివాహం సెడ్రిక్ ప్రభృతులైన మిత్రులకు సమ్మతమైన కారణం చేత దాదాపు స్థిరపడినట్లే అతడు భావిస్తూ వచ్చాడు. అందుచే, అజ్ఞాత యోధునిపై అతనికి ఒక విధమైన యీర్ష్య కలిగి, అతని పక్షంలో చేరకుండా తగిన శాస్తి చెయ్యాలనుకున్నాడు. తాను మంచి యోద్ధయని తాను అనుకోడమే కాక, తన మిత్రులు కూడా మెచ్చుకుంటూ ఉంటారు గనుక, నాటి సంకుల సమరంలో తన సాహాయ్యం అజ్ఞాతయోధునికి దక్కనివ్వరాదని అతని ఆశయం. అంతేకాదు, అవకాశం దొరికితే, తన గండ్రగొడ్డలి తడాఖా యేమిటో అజ్ఞాత యోధునికి కొంత రుచి చూపించాలనికూడా అతడు లోలోపల నిశ్చయించుకున్నాడు.

ప్రిన్సు జాన్‌కు టెంప్లార్ బ్రయన్ పక్షంమీద సంపూర్ణమైన అభిమానం గనుక, అతని పరివారంలోని డీబ్రేసీ ప్రభృతులగు యోధులందరూ కూడా బ్రయన్ పక్షంలోనే చేరారు. కాని, అంత మాత్రాన, అజ్ఞాతయోధుని పక్షం పేద పడిపోలేదు. అంతటి యోధాగ్రేసరుని పక్షంలో చేరి పోరాడడం ఒక పెద్ద ఘనతగా భావించి, చాలామంది యోధులు—సాగ్జనులూ నార్మనులూ—అతని వైపునకూడా చేరారు.

అందాలరాణి రాక గమనించినంతనే ప్రిన్సు జాన్ ఎంతో మరియాద ప్రకటిస్తూ తన గుర్రాన్ని ఆమె చేరువకు నడిపించాడు. ఎవరికైనా మర్యాద చూపాలనుకుంటే ఎంత చక్కగానైనా చూపగలడతడు. రొవెనాను సమీపించడంతోటే గౌరవపురస్సరంగా నెత్తిమీదనుంచి టోపీ తీసి చేతబుచ్చుకొని, గుర్రందిగి, ఆమెకూడా గుర్రం దిగేందుకు చేయి అందించాడు. అతని పరివారంలోనివారంతా నెత్తిమీది టోపీలు తీసి చుట్టూ నిలబడ్డారు. ఒక ప్రముఖుడు ఆమె గుర్రాన్ని పట్టుకొని నిలిచాడు. పోటీలు చూడవచ్చిన పెక్కుమంది అందగత్తెలు ఆమెకు పరివారంగా ఏర్పడ్డారు. ప్రిన్సు జాన్ అంతట తన గద్దెకు ఎట్టయెదుటనున్న గద్దెవైపునకు ఉచిత మర్యాదలతో ఆమెను తీసుకునిపోయి

అచట ఆసీనురాలిని చేశాడు. తక్కిన అందగత్తెలందరూ ఆమెకు దగ్గరగా కూర్చున్నారు.

రాణిగా ఆసీనురాలు కావటంతోటే, తూర్యనాదాలతోపాటు, ప్రేక్షకుల కరతాళ ధ్వనులు మిన్నుముట్టాయి. చోపుదారులంతట, ఎల్లరూ నిశ్శబ్దంగా ఉండండని హెచ్చరించి, జరుగబోయే సంకుల సమరపు నిబంధనలు జనులకు ఎరుకచేశారు. సమరం వాడిమొనలుగల ఆయుధాలతో జరుగుతుంది గనుక ప్రమాదాలు సాధ్యమైనంత తక్కువగా ఉండడంకోసం ఏర్పాటు చేసిన నిబంధనలవి. యోధులు తమ కత్తులతో, ప్రేటు వేయాలే కాని, పోటు పొడువరాదు. కావలిస్తే గదలూ గొడ్డళ్ళూ ఉపయోగించవచ్చునే కాని బాకు ఉపయోగించకూడదు. గుర్రంమీదనుంచి క్రిందపడ్డవారితో గుర్రంమీద నున్నవారు పోరాడరాదు; ఏ యోధుడైనా తన ప్రత్యర్థిని రంగస్థలం అంచున నున్న దడివరకూ తరుముకుపోగలిగితే, అతనికా ప్రత్యర్థి ఓడినట్లే యెంచబడుతుంది. ఆ ప్రత్యర్థి తన గుర్రమూ కవచమూ అతనికి అధీనం చెయ్యాలి. తాను తిరిగి కయ్యంలో పాల్గొనకూడదు. ఏ యోధుడైనా దెబ్బతిని క్రింద పడిపోయినప్పుడు, తిరిగి తనంతట తానే లేవలేకపోయినపక్షంలో, అతని నౌకరువచ్చి అతనిని ఆ త్రొక్కిడిలోంచి బయటికి లాగివేయవచ్చునుగాని, అతడుమాత్రం పరాజితుడైనట్లే ఎంచబడుతాడు. ప్రిన్సుజాన్ తన చేతిలోని దండాన్ని రంగస్థలంలోకి యెప్పుడు విసిరితే, అప్పుడు వెంటనే యోధులంతా పోరాటం ఆపివేయాలి. పోరాటం అతి దీర్ఘంగా సాగి, అనవసరమైన రక్తపాతం జరగకుండా కాపుదల కోసం ఈ నిబంధన యేర్పాటు చేయబడింది. ఏ యోధుడైనా ఈ నిబంధనల నుల్లంఘించితే, అతనిచేతి ఆయుధాలూడలాక్కొని, డాలు తిరగేసి చేతికిచ్చి, ప్రేక్షకజనుల పరిహాసానికి పాత్రుడుగా, అతనిని ఒక యెత్తయినచోట నిలబెట్టడం జరుగుతుంది. ఈ నిబంధనలన్నీ ఏకరువు పెట్టినపిమ్మట, చోపుదారులు యోధుల నందరినీ హుషారుచేసి, అందాలరాణి చేతి పారితోషికానికి పాత్రులు కావలసిందిగా హెచ్చరించి తిరోహితులయ్యారు.

పిమ్మట, ఇరు పక్షాల యోధులూ తమ తమ గుర్రాలమీద, రెండేసి బారులుగా తీరి ఇరువైపుల నుంచీ ఎదురు బదురుగా ముందుకు వచ్చారు. ముందరి బారులలో నట్టనడుమ ఉభయ పక్షాల నాయకులు అశ్వారూఢులై కదలివచ్చారు. తమ పక్షంలో ఎవరెవరిని ఏ స్థానంలో నిలుపవలెనో అంతా జాగ్రత్తగా ముందు చూచుకొన్న తర్వాతనే ఆ నాయకులు తమ తమ స్థానాల్లోకి వచ్చి నిలబడ్డారు. గుర్రాలమీద ఒక్కొక్కరు ఒక్కొక ఇనుపస్తంభంలాగ ఆ యోధబృందమంతా పోరాటానికి సిద్ధంగా కూర్చుండి ఉంది. ఎప్పుడు ముందుకు దూకుదామా అన్నట్లు, గుర్రాలు డెక్కలతో నేల త్రవ్వుతూ సకిలిస్తున్నాయి. మొనలు ఆకాశం చూచేటట్లుగా యోధులంతా యీటెలు ధరించి ఉన్నారు.

శిరస్త్రాణాలపై పలురకాల తురాయిలు కదలాడుతూ ముచ్చటగొలుపుతున్నాయి. ఈ సమయంలో, పోటీ నిర్వహణోద్యోగులు రంగస్థలమంతా ఒకసారి కలయజూచి, అంతా సరిగా వున్నదని నిర్ధారణ చేసుకొని, తామూ వెనుకకు తప్పుకొని సమర ప్రారంభానికి సంకేతధ్వని చేశారు.

వెంటనే, తూర్య ధ్వనులు దిక్కుల మారుమోగాయి. యోధుల చేతుల లోని యీటెలు ముందుకు వ్రాలాయి. గుర్రాల డొక్కలకు రికాబుపోట్లు తగలడం తడవుగా, యిరువాగులవారిలోనూ మొదటి వరుసలోని యోధులు మహా వేగంతో స్వారీ చేసుకొంటూవచ్చి ఒండొరులతో ఢీ కొన్నారు. చుట్టుపట్ల మైలు దూరంవరకూ వినిపించింది భయంకరధ్వని. వెనుకవరుసలోని యోధులు కొంచెం నెమ్మదిగా ముందుకుసాగారు. ముందు వరుసలోని తమ పక్షంవారికి ఓటమి కలిగితే వెళ్ళి తట్టుకోడమూ, గెలుపు కలిగితే వారికి మరింతగా హంగుచేయడమూ వీరిపని.

అన్ని గుర్రాలు ఒక్కసారిగా పరుగెత్తినందువల్ల రేగిన ధూళికి, కొంతసేపటిదాకా, ఆ తొలి సంఘర్షణఫలితం ఏమైనదీ ఎవ్వరికీ తెలియలేదు. ధూళి కొంచెం పలచబడి చూచేసరికి, ఉభయ పక్షాలలోనూ ఇంచుమించు సగంమంది యోధులు నేలపాలై కనపించారు. ప్రతియోధుల యీటెపోటు తీవ్రతనం కొందరిని పడగొట్టింది. కొందరు, కేవలం ప్రతియోధుల బలాధిక్యత తట్టుకోలేక గుర్రాలతో సహా క్రిందికి దొర్లారు. కొందరు, పడ్డవాళ్లు పడ్డట్టుగానే ఉండిపోయారు. కొందరు, వెంటనే లేచి, తమవలెనే నేలబడి లేచిన వారితో తలపడతున్నారు. కొందరికి బలంగా గాయాలు తగలడంచేత, గాయాలకు రుమాళ్ళతో కట్లు కట్టుకొని ఆ సమ్మర్దంలోంచి బయటపడజూస్తున్నారు. వీరిలాగా క్రిందపడకపోయినా, చాలామంది అశ్వికులకు చేతిలో యీటెలు విరిగిపోయిన కారణంచేత, కత్తులు దూసి భీకరార్భటులు చేస్తూ ఒండొరులపై తలపడ్డారు.

ఇంతలో, వెనుక వరుసలోని అశ్వికులు వచ్చి ముందు వరుసలోని వారికి బాసటలై పోరాడ నారంభించారు. పోరు తీవ్రరూపం దాల్చింది. గెలుపు ఒకసారి యీ పక్షంవారిదైతే ఇంకొకసారి అపక్షంవారిదౌతోంది. ఒకక్షణంలో ఉత్తర పార్శ్వమున జరిగేపోరు మరుక్షణంలో దక్షిణ పార్శ్వానికి మళ్ళుతోంది. ఆ ఆయుధాల చప్పుళ్ళలో, ఆ యోధవరుల అరుపులలో, ఆ బాకాజోళ్ళ వాద్య ధ్వనులలో, క్రిందపడి గుర్రాల కాళ్ళక్రింద నలుగుతున్నవారి మూల్గులు వినిపించడంలేదు. ఎండపట్లో తళతళ మెరుస్తూ కనపించిన కవచాలిప్పుడు ధూళి ధూసరితములై, రక్తసిక్తములై, శస్త్రాహతులచే గంట్లువడి గోచరిస్తున్నాయి. శిరస్త్రాణములనుండి తూలిపడిన తురాయిలు దూది పింజలవలె గాలిలో ఉత్తుంగస్థలములకై ఎగురుతున్నాయి. తీర్చి దిద్దిన అశ్విక విన్యాసంతో

మొదట ఎంతో చూడముచ్చటగొల్పిన ఆ దృశ్యం, ఇప్పుడు భయావహంగానూ దయనీయంగానూ కనిపిస్తోంది.

కాని, ఆ ఆటపాటుచూస్తూన ఆనాటి ప్రేక్షక జనమంతా — గ్యాలరీలలోని గొప్పయింటి స్త్రీలు సైతం — సమధికోత్సాహంతో ఆ భీకర దృశ్యాన్ని తిలకిస్తున్నారే కాని, కంచుకన్నైన మొగం అటు త్రిప్పుకోడం లేదు. ఏ ప్రియుడో, ఏ సోదరుడో, దెబ్బతిని క్రింద పడడం సంభవించినప్పుడు, ఏ ప్రియమాతలో, ఏ ప్రియసోదరియో, అప్పుటప్పుడు నిట్టూర్పులు విడవడంగాని, మన్నని రొమ్ముగుల ఒక కేక పెట్టడంగాని, జరిగితే జరిగియుండవచ్చు. కాని, మొత్తంమీద, ఆనాటి అంగనామణులందరికీ ఆ దృశ్యం ఉత్సాహ జనకంగానే ఉంది. ఏ యోధుడైనా మంచి లాఘవంతో ప్రత్యర్థినొక దెబ్బ కొట్టినప్పుడు, 'భేష్ భేష్' అని చప్పట్లు చరుస్తున్నారు. చేతి రుమాళ్ళు ఎగురవేస్తూ సందడి చేస్తున్నారు.

ఆడవాళ్ళ సంగతే ఇలా వుంటే, ఇక మగవాళ్ల సంగతి చెప్పాలా! — వారి కోలాహలానికి అంతే ఉండడం లేదు. రంగస్థలంలో ఆ యోధవరులు కొట్టే దెబ్బలుగాని, తినే దెబ్బలుగాని, తాము కొడుతున్నట్లే, తామే తింటున్నట్లే వారికి అనిపిస్తోంది. వీరి కోలాహల ధ్వనుల విరామసమయాల్లో, చోపుదారుల హెచ్చరికలు ఈ క్రింది ధోరణిలో వినవస్తున్నాయి — 'యోధాగ్రేసరులారా! వెనుకంజ వేయకండి, శరీరం అనిత్యం. యశస్సు నిత్యం. మీ శౌర్యం ప్రదర్శించండి. అపజయం కంటె మృత్యువు మేలు. ధీరత్వంతో పోరాడండి. అందాల తరుణులు మీ ప్రతాపం తిలకిస్తున్నారు.'

ఈ సంకులసమర సంరంభం మధ్య, ప్రత్యేకంగా అజ్ఞాతయోధుడూ టెంప్లార్ బ్రయనూ చేసే వీరకృత్యాలు ప్రేక్షకుల దృష్టిని విశేషంగా ఆకర్షిస్తున్నాయి. తోటివారికి తమ మాటలచేతనూ చేతలచేతనూ అమితమైన ఉత్సాహం పూరిస్తూ వారిరువురూ రంగస్థలిలో వీరవిహారం చేస్తున్నారు. వారికి దీటైనవారు ఆ ఉభయపక్షాలలోనూ వారే తప్ప మరొకరు లేరు. పరస్పర విద్వేషప్రేరితులై, ప్రత్యేకించి ఒండొరులతో తలపడాలని వారు పదేపదే పట్టుదలగా ప్రయత్నిస్తూవచ్చారు. కాని, ఆ సంకుల సంరంభంలో వారి ప్రయత్నం సాగిరాలేదు. ప్రతిపక్ష నాయకునితో డీకొన్న గౌరవం సంపాదించుకోవాలన్న కోర్కె కొద్దీ ఇతర యోధులు వచ్చిపడి కొంచెము సేపటిలోనే వారిని వేరుపరుస్తూ వచ్చారు. ఉభయపక్షాలలోనూ ఓడిపోయినవారు వైదొలగి, రంగస్థలం కొంత పలచబడిన పిమ్మటగాని, వారిద్దరూ సావకాశంగా ఒండొరులతో తలపడే వెసులుబాటు చిక్కలేదు. చిక్కినదే తడవుగా, ఇద్దరూ తీవ్రాటోపంతో ఒండొరులపై కలియబడ్డారు.

కాని, సరిగ్గా ఈ సమయంలో, అజ్ఞాతయోధుని పక్షానికి ప్రమాదస్థితి ఏర్పడడం సంభవించింది. టెంప్లార్ బ్రయన్ పక్షంలోని ఫ్రంట్-డి-బాఫ్

ఒక పార్శ్వమునా, ఎథెల్‌స్టేన్ వేరొక పార్శ్వమునా విజృంభించి, తమ యెట్టయెదుటి ప్రత్యర్థులను చెల్లాచెదరుచేసివైచి, ఇక యెవ్వరూ తమను ఎదుర్కొనేవారు లేకపోగా, ఇద్దరూ కూడబలుకుకొన్నట్లు ఒకసారిగ తమ గుర్రాలను అజ్ఞాతయోధుడున్న వెపుకు ఉరికించి, టెంప్లార్ బ్రయన్‌తోడి పోరాటంలో మునిగియున్న అతనిపైకి ఇరు పార్శ్వములనుండీ ఒక్కపెట్టున లంఘించారు. తలవని తలంపుగా వచ్చిపడ్డ ఇలాంటి విషమ సంఘర్షణను తట్టుకోడం అజ్ఞాతయోధునికి కేవలం అసంభవమే అయ్యేది కాని, అతని యెడ సానుభూతితో ప్రేక్షకులు పెట్టిన కేకలవల్ల, అతడు తానున్న ప్రమాదస్థితిని వెంటనే గ్రహించి, ఎదుటనున్న బ్రయన్‌ను బలం కొద్దీ గట్టిగా ఒక దెబ్బకొట్టి, తక్షణమే తన గుర్రాన్ని వెనుకకు గంతువేయించి ఫ్రాంట్-డి-బాఫ్ ఎథెల్‌స్టేనుల గురినుండి తప్పుకున్నాడు. ఫ్రాంట్-డి-బాఫ్, ఎథెల్‌స్టేనులు ఆవచ్చిన విసురులో దాదాపుగా ఒండొరులమీద పడ్డంత పనియై, యెట్టకేలకు తమాయించుకోగలిగారు. ఈ రీతిగా అజ్ఞాతయోధుడు ఒక ప్రమాదం నుండి అప్పటికి తప్పించుకోగలిగినా, అంతమాత్రంతో అతడు గట్టెక్కినట్లు కాలేదు. ప్రత్యర్థులు మువ్వురూ కలిసి ఇప్పుడతనిపైకి ఐకమత్యంతో లంఘించారు.

ఈ సంకట స్థితిలో అజ్ఞాతయోధుని అశ్వరాజమే అతనికి రక్షగా నిలిచింది. బ్రయన్ గుర్రం గాయపడ్డట్లుగా అది గాయపడలేదు. ఫ్రాంట్-డి-బాఫ్ ఎథెల్‌స్టేనుల గుర్రాలు అలసట చెందినట్లుగా అది అలసట చెందలేదు. దాని చలాకీకి తగినట్లు, అజ్ఞాతయోధుడు తన అద్భుతావహమైన అశ్వశిక్షా కౌశలంతో దానిని నడుపుతూ, ముగ్గురు ప్రత్యర్థుల పైకీ డేగవలె అవలీలగా లంఘిస్తూ, ముగ్గురినీ వేర్వేరుగా కత్తి వేటు దూరాన నిలవరిస్తూ, కడు చాకచక్యంతో యుద్ధం చేయ మొదలుపెట్టాడు.

ఈ ప్రజ్ఞా విశేషానికి ప్రేక్షకులు దశదిశలు మారు మ్రోగేటట్లు కరతాళధ్వనులు చేశారు. కాని, ఈ రీతిగా అజ్ఞాతయోధుడు కొంతసేపు పోరాడగలిగినప్పటికీ, తుదకు పరాజితుడు కాక తప్పదని ఆచట నున్నవారెల్లరికీ స్పష్టపడుతూనే ఉంది. ఇట్టి విషమ సంగ్రామ ఫలితంగా అజ్ఞాత యోధునివంటి ఉత్తమ వీరునికి పరాజయం సంఘటిల్లడం సహించలేక, ప్రిన్సుజాన్ చుట్టూ ఉన్న పెద్దలు కొందరు, దండం విసిరి పోరాటం నిలుపుదల చేయవలసిందిగా ప్రిన్సు జాన్‌ను అర్థించారు. కాని, జాన్ అందుకు అంగీకరించలేదు. 'మరేం ఫరవాలేదులే! ఈ యువకుని వామ్మనేమిటో చూద్దాం. నేను పేరడిగితే చెప్పలేదు, విందుకు రమ్మంటే రానన్నాడు. నిన్న నొక బహుమతి సంపాదించాడు చాలు. ఇవాళ ఇతరులు సంపాదించుకోనీ!' అని విముఖత్వం చూపించాడు.

జాన్ ఇలా అంటున్న సమయంలోనే, తలవనితలంపుగా ఒక విచిత్ర సంఘటన జరిగింది. అజ్ఞాతయోధుని పక్షంలో ఒక నీల కవచధారి ఉన్నాడు.

అజానుబాహువు. అతనివలెనే అతడెక్కిన నీలాశ్వం కూడ అత్యున్నతమైనది. అతడు ఎవరో ఎవరికీ తెలియదు. దానిపై అతని ఆచోకీ తెలియజేసే చిహ్నాలేమీ లేవు. అజ్ఞాతయోధుని పక్షంగా చేరాడన్న మాటేగాని, పోరాటంలో మొదటినుంచీ ఏమంత ఉత్సాహం చూపడంలేదు. తనంతట తాను యెవ్వరితోనూ కలియబడక, తనతో కలియబడినవారితో మాత్రం హేలగా పోరాడుతున్నాడు. ఎదుటివారిని ఓడించటం మట్టుకే కాని, అంతకుమించి ఏమాత్రమూ విజృంభించడంలేదు. ఒక పక్షానికి చెందినవాడైనా, దాదాపుగా సాక్షివలె వ్యవహరించే అతని యీ వైఖరిచూచి, ప్రేక్షకులప్పుడే అతనికి 'నల్లమందు భాయి' అని పేరు పెట్టేశారు.

తన పార్టీ నాయకుని పరిస్థితి గుర్తించగానే ఈ నీల కవచధారి అమాంతం ఒక్క ఉదటున తన గుర్రాన్ని అక్కడికి ఉరికించాడు. అజ్ఞాతయోధుడు బ్రయన్ వైపు తిరిగిపోరాడే ఆదను చూచి ఫ్రాంట్-డీ-బాఫ్ ఉద్ధృత కరవాలంతో అతనిని సమీపిస్తున్న సమయమది. ఇంకొక క్షణం ఆలస్యమైతే ఫ్రాంట్-డీ-బాఫ్ కత్తి అజ్ఞాతయోధుని నెత్తిమీద పడియుండేదే! నీలకవచధారి సరిగా సమయానికి పిడుగులాగ వచ్చిపడి, ఒక్కటే దెబ్బ ఫ్రాంట్-డీ-బాఫ్ నెత్తిమీద కొట్టాడు. దాని తీవ్రత యెలాంటిదో గాని, ఆ దెబ్బకు ఫ్రాంట్-డీ-బాఫ్ గుర్రంతోసహా నేలమీదికి దొర్లిపడ్డాడు. నీలకవచధారి చేతిలోని ఖడ్గం రెండుముక్కలయింది. అతడంతట వెంటనే ఎథెల్‌స్టేనుమీదికురికి, అతని చేతిలోంచే గండ్రగొడ్డలిని ఊడలాక్కుని, దానితో అతని నెత్తిమీద ఊడ్చి ఒక దెబ్బ కొట్టాడు. కొట్టిన ఉత్తరక్షణంలోనే ఎథెల్‌స్టేన్ స్మృతితప్పి గుర్రంమీదనుంచి క్రిందపడిపోయాడు. 'నల్లమందు భాయి' ఇంతపని చెయ్యగల్గుతాడని ప్రేక్షకు లెవ్వరూ అనుకొనియుండలేదు. అందుచే వారికీ హఠాత్పరిణామం వల్ల కలిగిన ఆనందానికి మేరలేదు. వారి హర్షధ్వానులతో దిక్కులు మారుమోగిపోయాయి.

నీలకవచధారి అలాగే బ్రయన్ మీదికి గూడ దూకుతాడనుకొన్నారుగాని, అతడా పని చెయ్యలేదు. తన మామూలు మందకొడితనాన్ని తిరిగి అవలంబించి వెంటనే ఆచోటు వదలి మరోచోటికి వెళ్ళిపోయాడు. అజ్ఞాతయోధుడిప్పుడు పోరాడవలసిన దొక్క బ్రయన్‌తో మాత్రమే. అది యిప్పుడు వెనుకటంత కష్టసాధ్యమైన పనికాదు. ఏమంటే, బ్రయన్ ఎక్కిన గుర్రం బాగా గాయపడి ఉంది. అజ్ఞాతయోధుని తాకిడిని అది తట్టుకోలేక కూలబడి పోయింది. దానితోపాటు బ్రయన్ కూడా క్రిందబడి పోయాడు. అంతేకాక, అతని కాలు రికాబులో చిక్కుకొనిపోయింది. అజ్ఞాతయోధుడు వెంటనే తన గుర్రం మీదనుంచి క్రిందికి దూకి, బ్రయన్ ముందర ఖడ్గం ఝళి

పిస్తూ, ఓటమి ఒప్పుకుంటావా, లేక కత్తిదెబ్బతింటావా అని అదలిస్తున్నాడు. ఇదివరలో అజ్ఞాతయోధుడు సంకటస్థితిలో ఉన్నప్పుడు చలించని జాన్, ఇప్పుడు బ్రయన్ సంకటస్థితిని చూచి చలించాడు. ఓడినట్లు ఒప్పుకోవలసివచ్చే దైన్యస్థితి నుంచి అతనిని కాపాడడంకోసం, తన చేతి దండం విసరివైచి పోరాటం ఆపు చేయించాడు.

అప్పటికప్పుడే, పోరాటం చాలవరకు ముడిగిపోయి ఉంది. రంగస్థలంలో ఉభయ పక్షాలలోను కొద్దిమంది మాత్రమే యోధులు మిగిలారు. వారైనా దాదాపుగా పోరాటం విరమించి, జయాపజయాలు తమ నాయకుల పోరాటం వలన తేలగలవన్నట్లుగా నిరీక్షిస్తున్నారు.

ప్రిన్సుజాన్ పోరాటం ఆపించడంతోటే, రంగస్థలంమీద గాయాలతో పడిఉన్న తమ తమ యజమానుల వద్దకు నౌకర్లు పరుగెత్తారు. పోరాటం జరుగుతున్నంతసేపూ రంగస్థలంలో అడుగు పెట్టడానికి వారికి సాహసం లేకపోయింది. మొత్తంమీద ఆ నాటి పోరాటంలో ఇంచుమించు ముప్ఫయిమందికి గాయాలు తగిలాయి. నలుగురుమాత్రం రంగస్థలంలోనే చనిపోయారు. శరీరం మీద ఏదో ఒక రకమైన గాయం తిననివాడు ఆ నాటి యోధుల్లో ఎవ్వరూ లేరు.

ఇక, ఆనాటి యోధుల్లో ఉత్తమోత్తము డెవరైనదీ జాన్ నిర్ణయించవలసిఉంది. అతడు నీలకవచధారిని ఉత్తమోత్తమునిగా నిర్ణయించాడు. అది సముచిత నిర్ణయం కాదనీ, విజేత వాస్తవానికి అజ్ఞాతయోధుడేననీ, అతడొక్కడూ తన చేతిమీదుగా ఆరుగురు యోధులను నేల గూల్చాడనీ, తుదకు బ్రయన్‌ను ఓడించినదికూడ అతడేననీ, కనుక అతనినే ఉత్తమోత్తమునిగా నిర్ణయించాలనీ కొందరు సభాసదులు జాన్‌కు నచ్చజెప్ప జూచినా అతడు వినిపించుకోలేదు. నీలకవచధారి వచ్చి ఆదుకోకపోతే అజ్ఞాతయోధుడూ అతని పక్షమూ ఓడిపోయి ఉండేవారు గనుక, నీలకవచధారినే ఉత్తమోత్తమునిగా నిర్ణయించక తప్పదని అతడు పట్టుదల చూపాడు.

కాని, ఆ నీలకవచధారి కోసం చూస్తే అతడెక్కడా కనిపించలేదు. పోరాటం ముగిసిన క్షణమే అతడు రంగస్థలిని వదలి వెళ్ళిపోయాడనీ, అడవి దారుల వెంటపడి అతడు వెడుతూ ఉండడం ఎవరో చూచారనీ అన్నారు. చోపుదారులు ఆచారం ప్రకారం రెండుసార్లు అతనికోసం ఎలుగెత్తి పిలిచినా అతని జాడ కానరాకపోయేసరికి, ప్రిన్సుజాన్ ఇక మరొకరిని ఆ గౌరవస్థానానికి తప్పనిసరిగా ఎన్నుకోవలసివచ్చింది. ఎంత ఇష్టంలేకపోయినా అజ్ఞాతయోధుని త్రోసిపుచ్చడం జాన్‌కు ఈసారి సాధ్యం కాలేదు.

రక్షణోద్యోగులు అజ్ఞాతయోధుని జాన్‌కడకు సముచిత మర్యాదలతో తోడ్కొని తెచ్చారు. లాంఛనం ప్రకారం జాన్ అతనిని సంబోధించి,— అందాలరాణి చేతిమీదుగా జరుగగల పారితోషిక ప్రదానాన్ని గూర్చి ప్రకటన

చాడు. అజ్ఞాతయోధుడు మాటపలుకలేదు. వినయపూర్వకంగా శిరస్సువంచి తన కృతజ్ఞత తెలియచేశాడు. తూర్యనాదాలు చెలరేగుతూ ఉండగా, బోపుదారులు జయజయలు పలుకుతూ ఉండగా, ప్రేక్షకలోకం హర్షధ్వానాలు చేస్తూ ఉండగా, స్త్రీ జనులు ఉల్లాసంతో తమ చేతిరుమాళ్ళు విసురుతూ ఉండగా, రక్షణోద్యోగులంతప అజ్ఞాతయోధుని రంగస్థలం చుట్టూ నడిపించుకొనిపోయి, లేడీ రొవెనా కూర్చున్న గద్దెదగ్గరకు సముచిత మర్యాదలతో తీసుకొనివెళ్ళారు.

నడుస్తున్నంతసేపూ అజ్ఞాతయోధుడు ఇతరుల ప్రోపిడివల్ల నడుస్తున్నట్లున్నదే కాని తనంతట తాను నడుస్తున్నట్లులేదు. కొంతదూరం వచ్చేసరికి అతడు కొంచెం తూలినట్లు కనిపించింది. ఎట్టకేలకతడు రొవెనా గద్దె కడకు చేరి, మొదటి మెట్టుమీద ఆచారం ప్రకారం మోకరించి నిలిచాడు. రొవెనా సవిలాసంగా మెట్లు దిగివచ్చి తనచేతి సువర్ణ కిరీటం అతని శిరస్త్రాణంమీదికి చాపింది. రక్షణోద్యోగు లొక్కసారిగా, 'అదికాదు ఆచారం, అతని శిరస్త్రాణం తొలగించా' లన్నారు. అజ్ఞాతయోధుడు ఏదో అస్పష్టంగా గొణిగాడు. శిరస్త్రాణం తొలగించవద్దని అతడు కోరుతున్నట్లు తోచింది. కాని, ఆచారంమీది అభిమానం వల్లనో, లేక అతడెవ్వరో తెలుసుకోవాలనే కుతూహలం వల్లనో, రక్షణోద్యోగులు అతని కోర్కెను సరకు చెయ్యక, తమంతట తామే శిరస్త్రాణం తొలగించారు. ఒత్తుగా పెరిగిన గిరజాలతో, సుమారొక పాతికేండ్లయువకుని సుందర వదనం కనుపించింది. ముఖం మీద ఒకటి రెండు చోట్ల నెత్తురు స్రవిస్తోంది. చాల సొమ్మసిలిపోయినట్లతని వైఖరి ఉంది.

రొవెనా అతనిని చూడడంతోటనే కవ్వున ఒక కేక పెట్టబోయింది. కాని, ఇంతలోనే తమాయించుకొని, భావోద్వేగంతో ఒడలెల్ల కంపించిపోతూ ఉండగా అతని మస్తకముపై ఆ కిరీట ముంచుతూ, 'యోధాగ్రేసరా, ఈ సువర్ణ కిరీటం ఈనాటి నీ ఘనవిజయానికి పారితోషికంగా నిర్ణయించబడింది. నీశిరస్సున అలంకరిస్తున్నాను'— అంటూ ఇంచుక సేపాగి, 'ఇట్టి గౌరవం పొందదగిన యోగ్యత నీకంటె మరి యెవ్వరికీ లోకంలో ఉండనేరదు!' అని ముగించింది.

అజ్ఞాత యోధుడు శిరసు వాల్చి, ఆమె మృదుహస్తం అల్లన ముద్దాడుతూ ముందుకొరగి ఆమె పాదాలకడ మూర్ఛిల్లాడు.

ప్రేక్షక జనంలో కలవరం బయలుదేరింది. తాను ఇంటినుండి వెడలగొట్టిన తన కుమారుడే ఈ అజ్ఞాతయోధుడని తెలుసుకొని, సెడ్రిక్ ఉద్వేగపూరితుడై రొవెనాను అతనినుండి వేరుచేయడానికి పరుగెత్తాడు. కాని, రక్షణోద్యోగులచే అంతకు పూర్వమే ఆ పని జరిగిపోయింది. ఏదో బలమైన దెబ్బ తగిలి యుండడం వల్లనే ఐవాన్‌హో అలా మూర్ఛిల్లి ఉంటాడని ఊహించి, వారతని కవచం ఊడదీసి చూశారు. కవచాన్ని సైతం భేదించగలిగిన ఒక ఈటెపోటు తగిలి అతని పార్శ్వభాగం తీవ్రంగా గాయపడి ఉంది.

# అధ్యాయం ౧౩

ఐవాన్‌హోయే అజ్ఞాతయోధుడన్న వార్త ఆనోటా ఆనోటా పడి అతివేగంగా నలుదిక్కులా వ్యాపించింది. ప్రిన్సు జాన్‌కు ఈ సంగతి తెలియడంతోటే, అతని ముఖం నలుపుతిరిగింది. కాని, ఒకవిధమైన ఏహ్యభావం ప్రకటిస్తూ చుట్టూ కలయజూచి యిలా అన్నాడు: 'వీడిమీద నాకు ద్వేషం కలిగిందంటే ఊరికే కలుగలేదు. వీణ్ణి చూచీ చూడటంతోటే, వీడు నా అన్నగారి మనిషని నా మనసు పసికట్టేసిందన్నమాట. పైకి కారణం ఏమీ కనుపించకపోయినా రాగద్వేషాలు ఇలా ఎందుకు కల్గుతూవుంటాయో చెపుతూవుంటారు పెద్దలు. ఏమంటావు ప్రియర్ ఐమర్?'

ప్రయర్ ఐమర్ సమాధానమివ్వకముందే డీబ్రేసీ అందుకొని, 'ఇక మన ఫ్రాంట్-డీ-బాఫ్ ఐవాన్‌హో యెస్టేటును తిరిగి ఐవాన్‌హోకు అప్పగింక పెట్టకతప్పదు' అన్నాడు. డీబ్రేసీ సంకులసమరంలో పాల్గొన్న సంగతి పాఠకులకు తెలుసు. ఒకవిధంగా గౌరవప్రదంగానే అతడందులోంచి బయటపడి, డాలూ శిరస్త్రాణమూ పరిహరించి తిరిగి జాన్ పరివారంలో కలిసాడు.

డీబ్రేసీ అన్నమాటను వాల్డిమార్ ఫిట్జర్సు బలపరుస్తూ, 'అవునవును, ఈ వీరునికి రిచర్డు ఇచ్చిన యెస్టేటునే కదా దేవరవారు ఫ్రాంట్-డి-బాఫ్‌కు ఇవ్వడం జరిగింది. తన యెస్టేటు తనకు తిరిగి ఇచ్చివేయాలని అతడు కోరేమాట నిశ్చయం' అని ఉద్ఘాటించాడు.

'ఫ్రాంట్-డి-బాఫ్ అంత తేలిగ్గా ఆ యెస్టేటును వదుల్తాడనుకుంటున్నారు కాబోలు! కావలిస్తే అలాంటి యెస్టేటులను ఇంకా మూడింటిని దిగమ్రింగి కూర్చోగలడు. అదలా ఉండగా, నేనెప్పుడు కోరితే అప్పుడు సైన్యంతో సహా వచ్చి నాకు సేవచేయ సంసిద్ధంగా ఉండే విశ్వాసపాత్రులైన నా అనుయాయులకు యెస్టేటులు ఈనాముగా మంజూరుచేసే అధికారం నాకు లేదంటారా? ఉన్నది. వారిలాగా విశ్వాసపాత్రులై నాకు సేవచెయ్యకుండ పరాయి దేశాలలో తమ యిచ్చవచ్చినట్లు తిరుగాడేవారి యెస్టేటులను ఊడలాక్కొని కూడా ఇచ్చే అధికారం నాకున్నది. ఏమంటారు?' అని అడిగాడు ప్రిన్సు జాన్.

అక్కడ ఉన్నవారంతా జాన్ వలన ఇలా యెస్టేటులను ఈనాముగా పొందినవారూ, పొందాలనే అపేక్ష కలవారునూ! అందుచే, ఎవ్వరూ కూడా అతని వాక్కును ఆక్షేపించలేదు. పైపెచ్చు, ఆ వాక్కు అతనికి కాకపోతే మరె

వ్వరి కన్న దన్నట్లు మాట్లాడారు. విశ్వాసపాత్రుడైన అనుయాయుడిపై అతనికి గల ఆదరాభిమానాలను పెద్దగా కీర్తించారు. ప్రయర్ ఐమర్ కూడా మంత్రం మీద వారితోనే ఏకీభవిస్తూ ఇలా అన్నాడు: 'జెరూసలేంనగరం క్రైస్తవలోకానికి తల్లివంటిది. దానిని పరాయిదేశంగా భావించడానికి వీలులేనిమాట నిజమే కాని, అంత మాత్రాన ఐవాన్‌హో యోధునికి కూడివచ్చేదేమీ లేదు. రిచర్డు నాయకత్వాన వీస్లు ఆస్కాలాన్ నగరాన్ని దాటి ఎన్నడూ ముందుకు పోలేదని నాకు నిశ్చయంగా తెలిసింది. కనుక జెరూసలేంవెళ్లినవాడికి మాపే మర్యాదలేవీ ఐవాన్‌హోకు చూపవలసిన పని ఏంతమాత్రమూ లేదు.'

ఈ ప్రసంగమిలా జరుగుతూ ఉండగా, వాల్డిమార్ కుతూహలంకొద్దీ ఐవాన్‌హో పడియున్న చోటికి పోయి చూచివచ్చి, 'దేవరవారికి ఐవాన్‌హో వలన బహుశా ఎలాంటి చిక్కూ ఉండబోదు లెండి. ఫ్రాంట్-డి-బాఫ్ తన ఐవాన్‌హో ఎస్టేటును నిశ్చింతగానే అనుభవించవచ్చు. ఐవాన్‌హో చాలా తీవ్రంగా గాయపడ్డాడు. బ్రతికినప్పటి మాట!' అని పెదవి విరిచాడు.

'బ్రతకనీ బ్రతక్కపోనీ! అతడు ఈనాటి విజేత కనుక, నా అన్నగారికి భక్తుడై మాకతడు ఎంత అహితుడుగా ఉన్నప్పటికీ, అతని గాయాలకు చికిత్స చేయించడం మా విధి. వెంటనే మా రాజవైద్యునికి ఆపని పురమాయించు' అని ఆదేశించాడు ప్రిన్స్ జాన్. అతని పెదవిపై ఒక వంకరనవ్వు తొంగి చూచింది.

కాని,ఐవాన్‌హో ఇప్పుడక్కడ లేడనీ,రంగస్థలంలోంచి అతడు బయటికి గొంపోబడి చాలాసేపయిందనీ, ఇప్పుడతడు తన మిత్రుల రక్షణలో ఉన్నాడనీ వాల్డిమార్ తెలియజేస్తూ ఇంకా ఇలా అన్నాడు—'ఐవాన్‌హో పరిస్థితిని చూడగానే అందాలరాణి శోకమూర్తిగా మారిపోయింది. నిజంగా ఆమెస్థితి నాకెంతో జాలిగొలిపింది. ఆడది ప్రియుడికోసం ఏడ్చే ఏడ్పులకు ఒకపట్టాన కదిలేమనస్సు కాదు నాదసలు. కాని, లేడీ రొవెనా ఏడుపులో ఒక విశిష్టత వుంది. చాలా ధీరత్వంతో ఆమె తన దుఃఖాన్ని నిగ్రహించుకొంది. కంటివెంట నీటిచుక్క లేదు. చేతులు ముడుచుకొని, తన ఎదుట నిశ్చేతనుడై పడియున్న యువకునివంక తదేకదృష్టితో చూస్తూ నిలబడిపోయింది. అలా చూస్తున్నంతసేపూ ఆమె కనీనికలు కంపించిపోవడం చూచితీరాలి. ఆమె దుఃఖిస్తున్నదని మనం కనుక్కోడానికి ఆ చేష్ట ఒక్కటే ఆధారం.'

'ఎవరీ రొవెనా,— ఈమెను గురించి ఇంతగా చెప్తున్నారు?—'అని అడిగాడు ప్రిన్స్‌జాన్.

'గొప్ప ఆస్తికి వారసురాలైన ఒక సాక్సను కన్నె. అందాల భరిణ, సంపదల ప్రోవు; అత్తరుబుడ్డీ, కర్పూరదండ...' అని వర్ణింపసాగాడు ప్రయర్ ఐమర్.

ప్రిన్సుజాన్ వెంటనే ఇలా అన్నాడు: 'మేమామె దుఃఖం నివారిస్తాం, పుట్టుకచేత సాక్సన్ అయిన దోషం నార్మన్‌కిచ్చి పెళ్లిచేస్తే పోతుంది. ఆమె మైనరని తోస్తోంది. కనుక, ఆమెకు వివాహం చేసే బాధ్యత మేము వహించవలసి ఉంది. ఏమంటావు డీబ్రేసీ? గొప్ప ఆస్తితో కూడా వస్తుంది. సాక్సను కన్నెను పెళ్ళి చేసుకుంటావా?'

డీబ్రేసీ పొంగిపోయి, 'నాకునచ్చిన ఆస్తితో పిల్ల వచ్చేటట్లుంటే ఎందుకు చేసుకోను ప్రభూ! చేసుకుంటాను. ఈ మహోపకారం చేసినందుకు దేవరవారికి కలకాలం సేవాబద్ధుడనై ఉంటానుకూడా' అని సమాధానం చెప్పాడు.

'మంచిది. దాని విషయమై ప్రయత్నం ఇక వెంటనే జరుగుతుంది'— అంటూ ప్రిన్సుజాన్, తన ముఖ్య పరిచారకుని వంక చూచి, 'ఇదిగో టీ-బిగాట్, నీవు ఇప్పుడే వెళ్ళి, లేడీ రొవెనానూ ఆమె బంధువులనూ — అంటే ఆమెకు సంరక్షకుడుగా ఉంటున్న ఆ సాక్సన్ గబ్బిలాయినీ, ఇందాక నీలకవచధారిచేత దెబ్బతిని క్రిందపడ్డ ఆ సాక్సన్‌దున్నపోతునూ— ఈరోజు రాత్రి జరగబోయే విందుకు రమ్మన్నానని చెప్పు. ఎలా మాట్లాడుతావో చాలా జాగ్రత్తగా మాట్లాడాలి. మన ఆహ్వానం ఈసారి వాళ్ళు త్రోసిపుచ్చడానికి వీలు లేనట్లుగా ఉండాలి, పో' అని ఆజ్ఞాపించాడు.

ఇంతలో ఒక ఉత్తరం ప్రిన్సుజాన్ చేతికి అందివ్వబడింది. 'ఎక్కడనుంచేమిటి?' అని అడిగాడు జాన్. 'యెక్కడనుంచో తెలియదు, ఒక ఫ్రెంచి అశ్వికుడు తెచ్చియిచ్చాడు. దేవరవారికి వెంటనే అందివ్వాలని రాత్రింబవళ్లు ప్రయాణం చేసుకుంటూ వచ్చాడట'— అని జవాబు చెప్పాడు పరిచారకుడు.

జాన్ ఉత్తరాన్ని విప్పకుండానే ముందు, పైవిలాసాన్నీ, సీలునూ జాగ్రత్తగా పరిశీలించాడు. అతని ముఖంలో కలవరపాటు కొంచెంగా కానవచ్చింది. ఉత్తరం చదివిన తర్వాత ఆ కలవరపాటు మరింత యెక్కువయింది — ఆ ఉత్తరంలో రెండే ముక్కలున్నాయి: 'సైతాను సంకెళ్లు త్రెంచుకొని బయటపడింది. నీ జాగ్రత్తలో నీవుండు.'

జాన్ మొగాన నెత్తురుచుక్కలేదు, కొంతసేపు నేలవైపు చూచాడు. కొంతసేపు ఆకాశంవైపు చూచాడు. తనకు ఉరిశిక్ష విధించినవార్తను విన్న ఖయిదీ వైఖరిని పోలి వుంది అతని వైఖరి. కొంతసేపటికి తెప్పరిల్లి,— వాల్డిమార్, డీబ్రేసీలను పక్కకు పిలిచి, ఒకరి తర్వాత ఒకరిచేతికి ఆ ఉత్తరమిచ్చాడు. 'నా అన్నగారు రిచర్డు చెరలోంచి తప్పించుకొన్నాడని దీని అర్థం'— అన్నాడు, యెట్టకేలకు కంఠం పెకల్చుకొని.

'అప్పుడే యీలా నిర్ధారణకి ఇది అసత్యవార్త కావచ్చు. లేక, ఇది దొంగ ఉత్తరం కావచ్చు'—అని డీబ్రేసీ జాన్‌కు ధైర్యం చెప్ప జూశాడు. 'కాదు, ఆ వ్రాత ఫ్రెంచిరాజు ఫిలిప్ స్వయంగా వ్రాసినది. సీలు కూడా అతనిదే'—అన్నాడు జాన్.

'అయితే ఇక మనం ఆలస్యం చెయ్యడానికి వీలులేదు—మన పార్టీని వెంటనే సమావేశపరచాలి. ఈ వినోదాలిక ఆపించండి' అన్నాడు వాల్డిమార్.

'ఆపిస్తే రైతులూ సామాన్య జనులూ చాలా అసంతృప్తి చెందుతారు. వాళ్ళుకూడా పాల్గొనే క్రీడలు కొన్ని జరిపించడం అవసరం' అన్నాడు డీబ్రేసీ.

'అయితే పొద్దు ఇంకా ఎక్కువగానే ఉన్నదిగనుక, కొంతసేపు విలువిద్యాప్రదర్శనం జరిపించి బహుమతి నిర్ణయిస్తే సరిపోతుంది. ఈ సాక్సన్ మందకు అంతకంటె ఇంకేమీ అక్కర లేదు.' అన్నాడు వాల్డిమార్.

ప్రిన్సుజాన్ ఇప్పటికి కొంచెం నెమరు త్రిప్పుకొని, 'అవునవును, ముఖ్యమైన సంగతి జ్ఞాపకంచేశావు వాల్డిమార్! నిన్న నాతో తలతిక్కగా మాట్లాడిన ఆ రైతు విలువిద్యాకౌశలం ఏపాటిదో చూచి వానికి తగిన శాస్తి చేయాలి. ఈ రాత్రి మేము ఏర్పాటుచేసిన విందుకూడా యథాప్రకారం జరిగిపోవలసినదే. మా అధికారానికి ఇదే చివరి ఘడియ అయితేకానీ ఈ చివరి ఘడియలోనే మేము తీర్చుకోవలసిన పగ తీర్చుకొని, అనుభవించవలసిన భోగం అనుభవించాలి. రేపటినుంచీ మనకుండే ఆపదలు మనకు ఎలాగూ తప్పవు' అని వెంటనే ధనుర్విద్యాప్రదర్శనకు ఆనతి యిచ్చాడు.

తిరిగి తూర్యధ్వనులు మారుమోగాయి. నిరాశతో ఇంటిదారి పట్టుతున్న ప్రేక్షకజనం తిరిగి ఉత్సాహంతో పరుగెత్తుకొనివచ్చి కూర్చుంది. ప్రిన్సుజాన్‌కు అత్యవసరమైన రాచకార్య మొకటి తగిలినందువల్ల, ఈ వినోదాలూ, విందులూ వెంటనే ఆపుదల చేయవలసివచ్చినదనీ, అయినప్పటికీ, తమ విద్యాకౌశలం చూపాలనే కోర్కెతో ఎంతోమంది విలుకాండ్రు వచ్చియున్నారు గనుక, వారికి ఉత్సాహభంగం కలుగచెయ్యరాదనే ఉద్దేశ్యంతో, రేపు జరగవలసిన విలువిద్యపోటీలు నేడే జరుపుటకు అనుమతి దయచేశారనీ, పోటీలో అందరికంటె మిన్నగా గణించబడ్డ మేటి విలుకానికి వెండిపొన్నులు వేసిన కొమ్ముబూరా ఒకటీ, చక్కని పట్టుపటకా ఒకటీ బహూకరించబడుతుందనీ చాటుదారులు ఎలుగెత్తి చాటిన కొంతసేపటికి ప్రదర్శనం ప్రారంభమయింది.

పోటీకి మొట్టమొదటగా, ముప్పయి మంది విలుకాండ్రు పేర్లిచ్చారు. వీరిలో చాలామంది గవర్నమెంటు ఫారెస్టు రేంజర్లు. కాని, తాము ఎవరితో పోటీ చేయవలసియున్నదో చూచుకొన్న తర్వాత, ఇరవైమంది కంటె పైగా

వెనుకకు తగ్గిపోయారు. చివరకు తేలినది ఎనమండుగురు. ప్రిన్సుజాన్ తనగద్దె దిగివచ్చి వీరిని సావకాశంగా పరకాయించి చూచాడు. నిన్న తనతో ఘర్షణ పడిన రైతు ఆ ఎనమండుగురిలో లేడు. దానికోసం కలయ జూడగా, నిన్న జాన్‌కు కనబడినచోటనే యెప్పటివలె నిబ్బరంతో నిలబడి ఉన్నాడతడు. జాన్ ఆతన్ని సమీపించి, 'ఏంరా, ఇక్కడే నిలబడ్డావ్, నిన్న కోసిన వన్నీ కట్టి కోతలేనా! నేనప్పుడే గ్రహించా నీ సంగతి'—అని యెగతాళి చేశాడు.

'మన్నించాలి. నేను వారితోపాటుగా నిలబడకపోవడానికి, ఓడిపోతాననే భయమే కాదు, మరొక ముఖ్య కారణం కూడా ఉంది'— అని సమాధానమిచ్చాడు రైతు.

'ఏమిటా కారణం?'

'వాళ్ళకు ఎలాంటి లక్ష్యాలు భేదించడం అలవాటో నాకు తెలియదు. వాళ్ళ అలవాట్లూ నా అలవాట్లూ ఒకటి కావేమోనన్న సంశయంతో ఆగిపోయాను. అదిన్నీ గాక, తలవని తలంపుగా తమ ఆగ్రహానికి గురియైన నేను, మూడో బహుమానమైనా గెలుచుకోడం తమకు ఇష్టంగా ఉంటుందో లేదోనని సందేహిస్తున్నాను'— అని ఆ రైతు సమాధానమిచ్చాడు.

జాన్‌కు రోషం ఎక్కువై, 'నీ పేరేమిటిరా' అని అడిగాడు. 'లాక్స్లీ' అని జవాబుచెప్పాడతడు.

'అలాగా! అయితే సరే! వాళ్ళ కౌశలం వాళ్ళు చూపిన తర్వాతనే నీకౌశలం ఏమిటో నీవు ప్రత్యేకంగా చూపిద్దువుగాని! బహుమతికి పాత్రుడవయ్యావా, అదనంగా నీకు నేనొక ఇరవై బంగారు నాణేలు బహుమతీ చేస్తాను. కాని పక్షంలో, నీతలతిక్కకు ప్రతిఫలంగా, చొక్కా ఊడదీయించి, రంగస్థలంలో పరుగెత్తించి కొరడాలతో కొట్టిస్తాను. అందుకు సిద్ధంగా ఉండు'—అన్నాడు జాన్.

'ప్రభువులు చాలా పెద్ద షరతు పెట్టారు. ఒకవేళ నేనా షరతుకు అంగీకరించక, అసలు పోటీకే దిగననుకోండి. అప్పుడు?' అని అడిగాడు లాక్స్లీ.

'అప్పుడైనా నీకు అవమానం తప్పదు. నీ వింటి నారి త్రెంపించి, విల్లు విరగగొట్టించి, పిరికిపందవని చాటింపించి రంగస్థలంనుంచి వెడలగొట్టిస్తాను' అన్నాడు జాన్.

'ప్రభువులు నన్ను చాలా ఇరకాటంలో పెట్టారు. ఇక నాకు గత్యంతర మేముంది? తమరు పెట్టిన షరతుకే పోటీలో పాల్గొంటాను'—అన్నాడు లాక్స్లీ.

దక్షిణద్వారం వైపున మిట్టపై ఒక లక్ష్యాన్ని ఉంచారు. ఎగువ ప్రదేశంలో విలుకాండ్రు నిలబడ్డారు. ముందు వెనకలు చీట్లు వేసి నిర్ణయించ బడ్డాయి. ప్రతి విలుకాడూ వరుసగా మూడుసార్లవరకూ లక్ష్యాన్ని గురిచేసి వదల వచ్చు. ఆ ప్రకారంగానే, ముందు ఆ యెనమండుగురు విలుకాండ్రూ బాణాలు వదిలారు. ఇరవై నాలుగు బాణాల్లోనూ పది మాత్రం లక్ష్యానికి వెళ్ళి గ్రుచ్చు కొన్నాయి. తక్కినవి ఆలా గ్రుచ్చుకోకపోయినా, చాల దగ్గరగా ప్రక్క నుంచి దూసుకొనిపోయినందువల్ల, విలుకాండ్రు నిలువబడ్డ దూరాన్నిబట్టి, వారి కౌశలం కూడా మెచ్చుకోబడింది. లక్ష్యానికి గ్రుచ్చుకొన్న ప్రతి బాణంలోనూ రెండుబాణాలు మాత్రం లోపలి వలయానికి వెళ్ళి గ్రుచ్చుకొన్నాయి. వాటిని కొట్టినవాడు మాల్వాయిసిన్ నౌకరిలోవున్న ఒక ఆటవికుడు హ్యూబర్టు అయినందువల్ల, ఆ యెనమండుగురిలోనూ గెలుపు అతనిదేనని నిర్ణయించబడింది.

ప్రిన్సుజాన్ అంతట లాక్స్లీవైపు తిరిగి, ఓ వంకరనవ్వు నవ్వుతూ, 'ఇక నీ ప్రజ్ఞ ఏమిటో చూపించు చూద్దాం' అని హెచ్చరించాడు.

'చిత్తం! కాని ఒక మనవి! హ్యూబర్టు కొట్టిన లక్ష్యాన్ని నేను వరుసగా రెండు బాణాలతో ఇప్పుడు ఛేదించగలిగితే, మూడోసారి నేను ఏ లక్ష్యాన్ని కొట్టమంటే దాన్ని కొట్టడానికి హ్యూబర్టు సిద్ధమైవుండాలి.' అన్నాడు లాక్స్లీ.

'ఓ, సబబుగానే ఉంది దానికేం!' అంటూ జాన్, హ్యూబర్టు వైపుచూచి, 'ఇదిగో హ్యూబర్ట్, ఈ గర్వపోతును గనుక నీవు ఓడించగలిగావంటే, నీకు బహుమతిగా ఇచ్చే కొమ్ముబూరానిండా వెండినాణేలు నింపిస్తాను' అని వానిని హుషారు చేశాడు. 'మనిషి తన తాహతు ఎంతవరకో అంతవరకే చూప గలుగుతాడు. మాతాత హేస్టింగ్సుయుద్ధంలో పోరాడిన మేటి విలుకాడు. ఆయన పేరు చెడగొట్టనని నా నమ్మకం' అని సమాధానమిచ్చాడు హ్యూబర్టు.

వెనకటి లక్ష్యాన్ని మార్చివేసి ఆలాంటిదే క్రొత్త లక్ష్యం అక్కడ ఉంచారు. మొదట కొట్టవలసినవాడు హ్యూబర్టు. వింటికి బాణం తగిలించి, కంటితో దూరం జాగ్రత్తగా లెక్కవేసి చూచుకొని, లక్ష్యంపై దృష్టిని ఏకాగ్రంచేసి, ఆలీఢపాదుడై, ఆకర్ణాంతమూ నారిలాగి అతడు బాణం వదిలాడు. బాణం ఈలవేస్తూ రివ్వున పోయి లక్ష్యం నడుమనున్న వలయ ప్రదేశంలో గ్రుచ్చుకొంది. కాని, అది ఆ వలయంలోని కేంద్రభాగంలో మట్టుకు కాదు.

'అన్ని లెక్క చూచావుగాని గాలిపాటు లెక్కచూచావు కాదు హ్యూబర్ట్! లేకుంటే ఇంకా బాగుండేది గురి' అంటూ, లాక్స్లీ తాను ముందుకు వచ్చి, లక్ష్యంవైపు తిన్నగా గురిచూచినట్లయినా కనుపించని హేలాగతితో అమ్ము చెవిదాకా లాగి వదలిపెట్టాడు. హ్యూబర్టు వేసిన బాణంకంటె అది ఒకటి రెండంగుళాలు కేంద్రానికి దగ్గరగా వెళ్ళి తగిలింది.

ప్రిన్సుజాన్‌కు ఇది ఏమాత్రం యిష్టంలేదు. హ్యూబర్టును ఇంకా హెచ్చరించగోరి ఇలా అన్నాడు: 'హ్యూబర్ట్! ఈసారి ఇంకా బాగావేయాలి బాణం—ఓడిపోయావంటే నీ విక బ్రతకడం అనవసరం!'

అన్ని సందర్భాలలో ఒకేరకం జవాబివ్వడం హ్యూబర్టుకు అలవాటు. 'ప్రభువులు నన్ను చంపినాసరే, మనిషి తన తాహతు యెంతవరకో అంతవరకే చూపగల్గుతాడు. మా తాత హేస్టింగ్సుయుద్ధంలో......'

జాన్ అర్థోక్తిలోనే అతనిపై విరుచుకుపడి, 'చచ్చారులే! మీతాత, మీముత్తాతా ఏమైతే ఎవడికి కావాలి! వెంటనే బాణం వయ్యి. ఈసారి కేంద్ర స్థానాన్ని కొట్టలేకపోతే నీచావు మూడిందన్నమాటే!' అని తీవ్రంగా కసిరాడు.

హ్యూబర్టు మారుమాటాడకుండ తిరిగి ముందుకువచ్చి నిలబడి, ఈసారి లాక్స్లీ చేసిన హెచ్చరిక మరచిపోకుండా, గాలిపాటుకూడ లెక్కచూచుకొని బాణం వదిలాడు. సరిగ్గా అది కేంద్రస్థానానికి పోయి తగిలింది. 'శభాస్ హ్యూబర్ట్!' అంటూ ప్రేక్షక జనం ఒక్కుమ్మడిగా పెద్దకేక పెట్టింది.

ప్రిన్సుజాన్ వెటకారంగా లాక్స్లీ వైపుచూచి నవ్వుతూ, 'ఇప్పుడేమంటావ్?' అని కవ్వించాడు.

'హ్యూబర్టు వేసిన బాణాన్ని రెండుగా చీల్చివేస్తాను'—అని సమాధానం చెపుతూ లాక్స్లీ వెనుకటికంటె కొంచెం జాగ్రత్తగా గురిచూచి బాణం వదిలాడు. సరిగ్గా అది అతడన్నట్లే హ్యూబర్టుబాణానికి తగిలి దాన్ని చీపురుపుల్లను చీల్చినట్లు చీల్చివేసింది. ప్రేక్షకజనం ఆశ్చర్యచకితమై, ఇలాంటి విద్యానైపుణ్యం బ్రిటనులో యెన్నడూ కన్నదీ విన్నదీ కాదని హర్షధ్వనులు చేశారు.

లాక్స్లీ అంతట తాను యింకొక తమాషా చేస్తానని చెప్పి, చేరువలో ఉన్న ఒక పొదలోంచి, సుమారు ఆరు అడుగుల పొడవుగల ఒక సువ్వను—బొటనవ్రేలి మందంగలదానిని కోసుకొనివచ్చి, దానినింకా సన్నగా చెక్కి, ఉత్తరద్వారం వరకూ నడచివెళ్ళి, దానినక్కడ నిలువుగా పాతిపెట్టి తిరిగి వచ్చాడు. 'ఇదిగో యిప్పుడు ఆసువ్వను నూరుగజాల దూరంనుంచి కొట్టి చీల్చాలి, అలా చీల్చేవాడెవరైనా ఉంటే రమ్మనండి. అలా చీల్చగలిగేవాణ్ణే నేను విలుకాడని పిలుస్తాను. యింతాకటి లక్ష్యాన్ని కొట్టడం ఏమంత గొప్ప! మా వైపున ఏడేండ్ల పిల్లవాడు కొడతాడు'—అని సవాలుచేశాడు.

'మా తాత హేస్టింగ్సుయుద్ధంలో పోట్లాడిన విలుకాడే. కాని, యీ మాదిరి లక్ష్యం ఛేదించినట్లు నేనెప్పుడూ వినలేదు. నాకూ చేతకాదు దాన్ని ఛేదించడం. నాకు చేతకాదని గట్టిగా తెలిసివున్నపనికి నేనెన్నడూ చొర బడను. ఈ రైతు దాన్ని ఛేదించగలిగితే, యితడేదో దయ్యమైవుంటాడు కాని మనిషికాదని నా ఉద్దేశం' అన్నాడు హ్యూబర్టు.

'ఓరి పిరికిపందా! యింతేనా నీ ప్రతాపం?' అని జాన్ హ్యూబర్టును చీదరించుకొని, లాక్స్లీవైపు తిరిగి, 'ఏదీ నీవేమాత్రం కొట్టగలవో చూస్తాను

బాణం వెయ్యమన్నాడు. 'హ్యూబర్టు చెప్పినట్లు, నా కౌశలం యెంతవరకో అంతవరకే చూపగలను. అంతకు మించి చూపటం యెవరికీ శక్యంకాదు'— అంటూ లాక్స్లీ విల్లునమ్ముని సరిచూచుకొని, బాణం సంధించి, లక్ష్యాన్ని పూర్వం కంటె యెక్కువ శ్రద్ధతో లక్ష్యించి వేశాడు. ఆశ్చర్యం! ఉత్తర క్షణంలో ఆ చువ్వ రెండు చీలికలై క్రింద పడిపోయింది. హర్షధ్వానాలతో దిక్కులు పిక్కటిల్లి పోయాయి. ఆ విద్యా కౌశలం చూచి, జాన్ కూడా, ఇంచుకసేపు, లాక్స్లీ యెడ తనకుగల వైషమ్యం విస్మరించి, 'భేష్, వెండిపొన్నుల కొమ్ముబూరాతోపాటు ఇరవై బంగారు నాణేలను కూడా కొట్టేశావులే పో! నీ నేర్పుకు మెచ్చాను. మా అంగరక్షకుల్లో ఒకడవుగా ఉంటానంటే ఇరవై కాదు, యాభై బంగారు నాణేలిప్పుడు నీ కిస్తాను'—అని వెల్లించాడు.

'క్షమించాలి, నేనొక ఒట్టు పెట్టుకున్నాను—తమ అన్నగారైన రిచర్డు మహారాజు వద్ద తప్ప మరి యెవరివద్దా సేవచేయనని. ఈ ఇరవై బంగారు నాణేలు కూడా నేను హ్యూబర్టు కిచ్చివేస్తున్నాను. హేస్టింగ్స్ యుద్ధంలో అతని తాతవలెనే అతను కూడా నేడు చాల చక్కని విలువిద్య ప్రదర్శించాడు. అనవసరంగా సంకోచించాడు గాని, ప్రయత్నించివుంటే నావలెనే అతను కూడా ఈ చువ్వను చీల్చి ఉండేవాడే, అని లాక్స్లీ ఆ ఇరవై నాణేలూ హ్యూబర్టు కిచ్చాడు. నాణేలను పుచ్చుకొన్నాడే గాని, హ్యూబర్టుకు అది యెంత మాత్రమూ సంతోషదాయకంగా లేదు. లాక్స్లీ మరికొంతసేపటికి ఆ జన సమూహంలో కలిసిపోయి తిరిగి యెవ్వరికీ కానరాలేదు.

జాన్ ఒకపట్టాన లాక్స్లీని అంత తేలిగ్గా తప్పించుకుపోనిచ్చి యుండే వాడు కాదు. కాని,అతనిదృష్టి యిప్పుడు వేరొక అత్యవసర కార్యంమీద లగ్నమై ఉంది. చీకటి పడేలోగా తనకి రెండువేల బంగారు మొహరీలు అత్యవసరంగా కావాలిట. త్వరగా ఆష్బీకి దారితీసి, యూదీయసాహుకారు ఇసాక్ యెక్క- డుంటేదీ కనుక్కొని, తన ముద్రిక అతని గుర్తుచూపి, వెంటనే రెండు వేల మొహరీలూ తీసుకురమ్మని ఒక ఆశ్వికుని పంపిస్తున్నాడు. ఇసాక్ ద్వారా యార్కు నగరపు యూదీయసాహుకార్లవల్ల జాన్ పెద్ద ఋణం సేకరించడానికి ప్రయత్నం చేస్తున్న సంగతి పాఠకులకు తెలిసినదే. ఆ ఋణంబాపతు డబ్బులోంచే ముందు రెండువేల మొహరీలూ పంపించాలని కబురన్నమాట. 'పో, త్వరగా పో. తక్కిన సొమ్ము ఇంకొక ఆరురోజుల్లో యార్కు నగరంలో యివ్వవలసివుంటుందని చెప్పు. సొమ్ముకు హామీ యేమి చూపించాలో వాడికి తెలుసు. అనుకొన్నట్లు సొమ్ము యివ్వకపోతే వాడి పుచ్చె యెగిరిందన్నమాటే! ఒకవేళ తోవలోనే వాడు నీకు తగిలితే తగలవచ్చు. జాగ్రత్తగా చూస్తూవెళ్లు' అని వానిని ముందు పంపివేసి, పిమ్మట జాన్ సపరివారంగా ఆష్బీకి బయలుదేరాడు. అతడు వెళ్ళి పోవడంతోటే, ప్రేక్షకజనం కూడా గృహోన్ముఖులై నలుదెసలకూ విచ్చిపోయి కొంతసేపటిలో అదృశ్యమైపోయింది.

# అధ్యాయం ౧౪

ఆష్బీదుర్గంలో విందు. ప్రిన్స్‌జాన్ ఆదేశానుసారం ఏర్పాట్లు చాలా గొప్పగా జరిగాయి. మన కథాకాలానికి ఈ దుర్గాధిపత్యం వించెస్టరు ప్రభువైన రోజర్ డీక్విన్సీది. కాని, రిచర్డు రాజుతో పాటుగా మతయుద్ధాల్లో పాల్గొనడానికై అతడు పాలస్తీనా వెళ్ళిన అదను చూచి, జాన్ ఈ దుర్గాన్ని ఆక్రమించి, జంకుగొంకులు లేకుండా అతని ఎస్టేటు భూములన్నిటినీ స్వాధీన పరచుకున్నాడు. ఇంతచేసినా ప్రజాభిమానానికి తాను దూరమవుట కాగూడదనే ఆదుర్దా జాన్‌కు లేకపోలేదు. విందులూ వినోదాలూ మొదలైనవాటితో ప్రజల కన్నులకు మిరుమిట్లుగొలిపి తద్వారా వారి అభిమానం సంపాదించాలని అతని ఆశయం. ఆష్బీదుర్గంలో విందు ఆ ఉద్దేశ్యంతో సంకల్పించబడిందే.

విందు చాలా ఘనంగా జరిగినదనిపించుకోడానికై, జాన్ అనుచరులు తమ అధికార ప్రాభవాలను పూర్తిగా చలాయించి ఉత్తమ భోజ్యవస్తువుల న్నింటినీ సేకరించారు. విందుకు ఆహ్వానించబడ్డ అతిథుల సంఖ్య కూడా చాలా ఎక్కువగానే ఉంది. ఆ ప్రాంతపు నార్మన్ సామంతులతో పాటు, కొంతమంది సాక్సన్ ప్రముఖులనుగూడ జాన్ విందుకు ఆహ్వానించాడు. సాక్సను లను సామాన్యంగా ఇతర సమయాల్లో ఎంత ఏవగించుకొంటున్నప్పటికీ, దేశంలో అంతఃకల్లోలాలు చెలరేగే చిహ్నాలు కనిపిస్తున్న ప్రస్తుత సమయంలో వారిని కొంత మంచిచేసుకొని ఉండడం మంచిదని జాన్ అభిప్రాయం. లేనియెడల, బహుళసంఖ్యాకులైన సాక్సన్ల వలన తన పథకాలకు చాల హాని వాటిల్లవచ్చు.

ఈ ఉద్దేశ్యంతోనే జాన్, విందుకువచ్చిన సాక్సన్ అతిథులను చాల మర్యాదగా చూడాలనే అనుకున్నాడు, అలాగే కొంతసేపటివరకూ చూశాడు కూడ. కాని, దురదృష్టవశాత్తూ అతనికి, తుదివరకూ మనసు చిక్కబట్టి మాట దక్కించుకునే అలవాటులేదు. మధ్యమధ్య అతని మామూలు వెకిలితనం బయటపడుతూ ఉంటుంది. అవివేకంగా ప్రవర్తించి, ఇంతసేపూ చేసిన నటన అంతా వృథాశ్రమ అయ్యేటట్లు చేజేతులా చేసుకుంటాడు. వెనుక, అతనితండ్రి రెండవ హెన్రీ అతనిని ఐర్లండుకు అచటి ప్రజల భక్తివిశ్వాసాలను చూరగొని రమ్మని పంపినప్పుడు ఇలాగే జరిగింది. అవి ఐర్లాండును క్రొత్తగా జయించిన రోజులు. రాకుమారుడైన జాన్‌కు స్వాగతమిచ్చి తమ భక్తిప్రపత్తులు ప్రకటించాలని ఐరిష్ సామంతులు అహమహమికతో ముందుకు వచ్చారు. కాని, జాన్ వట్టి చాపల్యం కొద్దీ, వారియెడ మర్యాదగా ప్రవర్తించడానికి బదులు, వారి గడ్డాలు పుచ్చుకొని లాగి వారిని అవమానపరిచాడు. ఇందుమూలంగా

తరువాత, ఐర్లాండులో ఇంగ్లీషువారి పరిపాలన పట్ల కలిగిన విపరిణామాలు ఇన్నన్ని కావు.

ఒక విధమైన నిర్ణయం ముందుగానే చేసుకున్న కారణంచేత, పిన్న జాన్ విందుకు విచ్చేసిన సెడ్రిక్ ఎథెల్‌స్టేనులను చాలా ఘనంగానే గౌరవించారు. వారితోపాటు రావెనాకూడా రాకపోయినందుకు విచారం వెలిబుచ్చినా విరసన మాత్రం ప్రకటించలేక, రావెనాకు కులాసా లేకపోయినందువల్ల రాలేకపోయిందనే కారణం చెప్పబడింది. సెడ్రిక్ ఎథెల్‌స్టేనులు పూర్వకాలపు సాక్సన్ పద్ధతిలో దుస్తులు ధరించడం జాన్‌కుగాని వాల్డిహూర్‌కు గాని విపరీతమైన నవ్వుగావుంది. కాని, పట్టు బిగించుకొని నవ్వు ఆపుకున్నారు. నిజానికి, ఆరోజుల్లో సాక్సన్లు ధరించే దుస్తుల్లోనే ఒక విధమైన విలాసముంది. నార్మన్లు ఒక రకమైన పొట్టి అంగీలు ధరించేవారా కాలంలో. అవి హెన్రీ షేన్ చక్రవర్తి హయాములో మొట్టమొదటగా అమలులోకి వచ్చాయట. హెన్రీ షేన్ చక్రవర్తి వీటినిగూర్చి వెటకారంగా ఇలా అంటూవుండేవాడట— 'ఆరి భగవంతుడా! ఎందుకు పనికివచ్చే అంగీలివి! పడుకుంటే కప్పుకోనేందుకు చాలవు, గుర్రంమీద స్వారీ చేసేటప్పుడు గాలీ వానా వస్తే కాపుదలగా ఉండవు. కూర్చుంటే కాళ్ళను మంచుబాధకలగకుండా నివారించలేవు. ఏమిటి వీటివల్ల ప్రయోజనం!' అని. అయినప్పటికీ, అభ్యాసవశంచేత ఆ పొట్టి అంగీలే నార్మన్లకు పసందైన దుస్తులుగా చెలామణీ అయినాయి. సాక్సన్ల పొడుగు అంగీలు వారి దృష్టికి పరిహాస పాత్రాలు.

అతిథులంతా ఒక పెద్ద బల్లవద్ద కూర్చున్నారు. పలురకాల భోజ్యాలూ, పానీయాలూ, మంచి మంచి వంటవాండ్రచే దేశంలో తయారుచేయించినవీ, విదేశాలనుంచి తెప్పించినవీ, బల్లపై క్రిక్కిరిసేటట్లు అమర్చబడ్డాయి. విందులుగడిచే సందర్భంలో నార్మన్లు నాజూకని భావించే ఆచారాలు కొన్నున్నాయి. అవి సాక్సన్లయిన సెడ్రిక్ ఎథెల్‌స్టేనులకు తెలియవు. వారి పద్ధతులు మోటుగా భావించి, అచటి నార్మన్ సామంతులూ నార్మన్ యోధులూ వెటకారంగా వారివంక చూస్తూవచ్చారు. చేతితడి, సెడ్రిక్ తువాలుతో తుడుచుకోడం వారికి పరిహాసపాత్రమయింది. నార్మన్ల ఆచారం ప్రకారం అలా చెయ్యకూడదట. చేతిని గాలిలో విలాసంగా ఆడించి తడి ఆరబెట్టుకోవాలిట! అతి రుచ్యమైన ఒక భోజ్యపదార్థాన్ని ఎథెల్‌స్టేను ఇతరుల కెవ్వరికీ మిగలనివ్వకుండా దాదాపు అంతా తానే తినేశాడు. అది దేనితో తయారయిందో అతనికి తెలియలేదు. దేనితో తయారయిందో చెప్పుకోమని అందరూ గుచ్చి గుచ్చి అడిగేసరికి, అది ఒకటైతే తానింకొకటి చెప్పి హాస్యాస్పదుడయ్యాడు. అతని తిండిపోతుతనం కంటె యీ అజ్ఞానం ఎక్కువగా వేళాకోళానికి పాత్రమయింది.

ఎట్టకేలకు విందు పూర్తి అయింది. ఇక మధుసేవనం మాత్రమే తరువాయి. పరిచారకులు మధుపాత్రలను ఖాళీ అయినప్పుడెల్ల నింపుతున్నారు. అతిథులు మధుసేవనం చేస్తూ, నాటి పోటీలను గురించీ, ఐవాన్‌హో యోధుని శౌర్య సాహసాలను గురించీ, నీలకవచధారి త్యాగ విశేషాన్ని గురించీ, యథేచ్ఛగా, వీరసంప్రదాయానుగుణమైన ధారాళ భావంతో మాట్లాడుతున్నారు. హాస్యాలతోనూ నవ్వులతోనూ ఆ హాలంతా మారుమ్రోగిపోతోంది. ఒక్క ప్రిన్సు జాన్ మాత్రం ఆ చర్చలలో కల్పించుకోవడంలేదు. అతని వదనంలో ఏవో కారుమబ్బులు క్రమ్ముకొన్నట్లు కనిపిస్తున్నాయి. అనుచరులు హెచ్చరిక చెయ్యగా ఉలిక్కిపడి, చర్చలో తాను కల్పించుకోడం ప్రారంభించాడు. ఇలాంటి సందర్భాల్లో, తనకు కొంత హుషారు కల్పించుకోడంకోసం, ఒక మధుపాత్రను ఖాళీచేసి పిమ్మట చర్చలలో తానుకూడ ఒకటి రెండుమాటలు విసురుతూ ఉండటం అతనికి అలవాటు. అలాగే ఇప్పుడుకూడ అతడు మధుపాత్రను పైకెత్తి, 'ఇదిగో, నేటి పోటీల్లో విజయం సాధించిన ఐవాన్‌హో యోధుని పేర ఈ మధుపాత్రను మేము సేవిస్తున్నాము. గాయపడ్డ కారణంచేత ఈ విందులో అతడు పాల్గొనలేక పోయినందుకు విచారిస్తున్నాము. అతనికి త్వరలో ఆరోగ్యం చేకూరుగాక. మీ రందరూ కూడ అతని పేరనే మీ మీ మధుపాత్రలు సేవించండి. ముఖ్యంగా, అంతటి వీరకుమారుని కని ధన్యుడైన సెడ్రిక్‌ను ఈ సందర్భంలో అభినందిస్తున్నాను'— అని ఉటంకించాడు.

సెడ్రిక్ వెంటనే లేచి నిలబడి, మధుపాత్రను రుచి చూడకుండానే బల్లమీద పెట్టివేసి, 'లేదు ప్రభూ, ఆ అవిధేయుడైన యువకుని నా కొడుకని పిలవను. వాడు నా ఆజ్ఞలు ఉల్లంఘించడమే కాక, తాతముత్తాతల నాటి ఆచారాలనుగూడ మంట గలిపాడు' అని ఉద్ఘాటించాడు.

ప్రిన్సుజాన్ ఒక విధమైన తెచ్చికోలు ఆశ్చర్యం అభినయిస్తూ, 'అదేమిటి అలా అంటున్నావు! అంతటి వీరాగ్రేసరుడు తండ్రి యెడల అవిధేయుడుగా ఉండడం అసంభవం!' అన్నాడు. 'కాదు ప్రభూ, ఈ విల్ఫ్రెడ్ నిజంగా నాకు అవిధేయుడుగానే ప్రవర్తించాడు. నా యిచ్ఛకు విరుద్ధంగా, మీ సోదరుని ఆస్థానంలో చేరి, గుర్రపు రౌతులు చేసే ట్రిక్కులు కొన్ని నేర్చుకున్నాడు. ఇలా చేసినందుకు, మా ఆల్ఫ్రెడ్ రాజు కాలంలోనైతే చాలా తీవ్రంగా దండించడం జరిగేది.' అని జవాబిచ్చాడు సెడ్రిక్.

జాన్ సానుభూతి నభినయిస్తూ ఒక నిట్టూర్పు విడిచి, 'అయ్యో పాపం! అలాగా! నా సోదరుని అనుయాయియైన నీ కుమారునికి, పిత్రాజ్ఞను తిరస్కరించే బుద్ధి ఎక్కడనుంచి ఎవరివల్ల సంక్రమించిందో వేరే విచారించనక్కర లేదు' అన్నాడు. ఇలా అంటున్నప్పుడు, తన తండ్రియైన రెండవ హెన్రీపై తిరుగుబాటు చేసిన తన అన్నదమ్ము లందరిలోకీ ముఖ్యమైన తిరుగుబాటుదారు

తానే యన్న సంగతి అతడు బుద్ధిపూర్వకంగా మరచిపోయాడు. క్షణం సేపు ఆగి, పిమ్మట తిరిగి ఇలా అన్నాడు: 'మా సోదరునివల్ల అతనికి ఐవాన్‌హో ఎస్టేటు ఈనాముగా ఇవ్వబడిందికదూ ?'

'అవును, దానిని నా కుమారుడు స్వీకరించడంకూడా నా కిష్టంలేనిపని! మా పూర్వీకులు స్వతంత్రహోదాతో అనుభవించిన ఆస్తిని ఇప్పుడొక అస్వతంత్ర ప్రతిపత్తితో అనుభవించడానికి వాడు సిద్ధపడడం నాకు సుతరామూ ఇష్టంలేదు' అన్నాడు సెడ్రిక్.

'మంచిది. అయితే ఆ ఆస్తిని కుమారునికి వద్దు. ఇదిగో ఈ పెద్దమనిషి ఫ్రాంట్ డీ బాఫ్‌కు దానిని ఇచ్చివేస్తే నీకు అభ్యంతరం ఉండదనుకుంటాను. ఏమంటావు ఫ్రాంట్ డీబాఫ్? ఐవాన్‌హో ఎస్టేటు నీవు తీసుకో! దీనిని సర్ విల్ఫ్రెడ్ తీసుకొని తండ్రి ఆగ్రహానికి గురికావడమెందుకు ?' అన్నాడు జాన్.

'మహాప్రసాదం. దేవరవారు నాకిచ్చిన యీ ఎస్టేటును సెడ్రిక్ గాని, విల్ఫ్రెడ్ గాని, ఇంకే సాక్సన్ జాతీయుడుగాని, నా చేతిలోంచి ఎన్నడైనా లాక్కోవడం జరిగితే, నన్ను సాక్సన్ అని పిలవండి' అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

సాక్సన్లయెడ తమ యేవగింపును నార్మన్లు ఆ రోజుల్లో తరచుగా ఈ ధోరణిలో ప్రకటిస్తూ ఉండేవారు. సహజంగా ఇది సెడ్రిక్‌కు కోపకారణమయింది. 'నిన్నెవరైనా సాక్సన్ అని పిలవడం, నీకు లేని గౌరవమొకటి తెచ్చిపెట్టడం తప్ప మరేమీ కాదు' అని ఫ్రాంట్ డీ బాఫ్‌కు జవాబిచ్చాడు. ఫ్రాంట్ డీబాఫ్ తిరిగి జవాబిచ్చేవాడేగాని, ఇంతలో ప్రిన్స్ జాన్ స్వయంగానే అందుకున్నాడు. అదుపులో పెట్టి ఉంచిన అతని వెకిలితనం బయటపడింది. 'సెడ్రిక్ అన్నది నిజం. సాక్సన్ల వంశవృక్షాలు చాలా పొడుగు. వారు తొడుక్కునే అంగీలుకూడా చాలా పొడుగ్గా వుంటాయి. ఆ విషయంలో నిజంగా సాక్సన్లు మనకంటె చాలా ఘనులు!' అన్నాడతడు.

'అవునవును, మనముందు వాళ్ళు, వేటకుక్కల ముందు లేళ్ళు పరుగెత్తినట్లు బాగా పరుగెత్తగలరు!'— అన్నాడు మాల్వాయిసిన్.

'వాళ్ళకేమిటి! మనకంటె గొప్పవాళ్ళమనుకునే అధికారసంపత్తి వాళ్ళకు ఎంతైనా ఉంది. ఆచారవ్యవహారాల్లో ఆ నాజూకుతనం, ఆ తీరుతీయాలూ ఏమని వర్ణించడం!' అంటూ వెటకారంగా మాట్లాడాడు ప్రియర్ ఐమర్.

'ఆహారవిహారాల్లో మితంగా ఉండే లక్షణానికి వాళ్ళను మరీ ముఖ్యంగా చెప్పుకోవాలి—' అన్నాడు డీబ్రేసీ—తనకు సాక్సన్ కన్నెనిచ్చి పెళ్ళిచేసే ప్రతిపాదన ఒకటి ఉన్నదనే మాట మరచిపోయి.

'కార్యప్రతాపాల విషయంలో మాత్రం? హేస్టింగ్సు యుద్ధంలో ఎంత గొప్పగా పోట్లాడారు!' అన్నాడు టెంప్లార్ బ్రియన్.

జాన్ ఆస్థానంలోనివారంతా ఒకరి తర్వాత ఒకరు ఇలా వ్యంగ్యంగా తన జాతిని అపహాస్యం చేస్తూ మాట్లాడడం చూచేసరికి, సెడ్రిక్ ముఖం కందగడ్డ అయిపోయింది. ఇన్ని దెబ్బలు ఒకటి తర్వాత ఒకటి వెంట వెంటనే అవ్యవధానంగా తగలడం వల్ల, వీటికి సమాధానం చెప్పడానికి అతనికి తోచలేదు. ఒక్కొక్కరివైపే కొరకొరా చూచాడు. చుట్టూ తనను నలువైపుల నుంచీ నలుగురూ కవ్విస్తుంటే ఎవరిపైన పగ తీర్చుకోడానికి పాలుపోక నిలబడ్డ ఆబోతు వలె ఉన్నది అతని పరిస్థితి. ఎట్టకేలకు తెమల్చుకొని, ప్రిన్సుజాన్‌ను ఉద్దేశించి ఇలా అన్నాడు: 'మా సాగ్జన్ జాతిలో ఏలోపమైనా ఉంటే ఉండవచ్చుగాని, ఇప్పుడు దేవరవారి సమక్షంలో నాకు జరిగినట్లు, ఒక అతిథికి ఏ సాగ్జన్ గృహంలోనూ ఇలా అవమానం జరగదు. ఇలా అతిథిని ఏ గృహస్థయినా అవమానించినా, లేక అవమానించబడుతూ వుంటే చూస్తూ ఊరుకున్నా, అతన్ని కడు నీచాతినీచునిగా మా సాగ్జన్లలో లెక్క వేస్తారు. హేస్టింగ్సు యుద్ధరంగంలో మా పూర్వీకులు పరాజయం పొందితే పొందవచ్చుగాక. కాని, ఆవిషయాన్ని, నేడొక సాగ్జన్ చేతిలో దెబ్బలుతిని పడేపడే గుర్రం మీదనుంచి క్రిందబడ్డ నార్మన్ యోధులైనా ప్రస్తావించకుండా మిన్నకుంటే బాగుంటుంది.'

ఈ పోటుమాట జాన్‌కు నసాళం అంటింది. తన అనుయాయులందరినీ కలయజూచి, 'చూచారా! ఈ సాగ్జన్లకు మనముందు మనల్నే ఎత్తిపొడుస్తూ మాట్లాడడానికి ఎంత ధైర్యం వచ్చిందో! ఏమంటారు? ఇక మనం త్వరగా ఓడలెక్కి మన నార్మండీకి తిరిగి సకాలంలో చేరుకోడం మంచిది' అన్నాడు వాళ్ళను కవ్వించే వుద్దేశ్యంతో.

'ఈ సాగ్జన్లకు జడిసా మనం నార్మండీకి పారిపోయేది! వీళ్ళను ఏదు పందులను తరిమినట్లుగా తరమడానికి మన చేతిలో వేటబల్లెలు ఉంటేచాలు, ఇంకే ఆయుధాలూ అక్కరలేదు,' అన్నాడు డీబ్రేసీ చులకనగా నవ్వుతూ.

ఇంతలో వాల్డిమార్ ఫిడ్జర్సు అందుకొని, 'ఈ అపహాస్యాలు ఇక మనం చాలించడం మంచిది. ఊరికే నవ్వులాటలకు అన్నదే కాని ఇందులో అవమానించే ఉద్దేశ్యం ఏమీ లేదని సెడ్రిక్‌కు దేవరవారు నచ్చచెప్పాలి. పరాయి వారి చెవికి ఇది కటువుగా స్ఫురించేమాట నిజమేగాని, ఇందులో అవమానించే సంకల్పం లేశమాత్రమూ లేదు,' అని జాన్‌కు హెచ్చరిక చేశాడు.

జాన్ వెంటనే తన పూర్వపు మర్యాద నటన అభినయిస్తూ, 'అవమానించడమా! అలాంటి దెన్నటికీ నా తలంపులో లేదు, నా సమక్షంలో జరగనివ్వను. ఇదిగో సెడ్రిక్ పేరు చెప్పి ఈ మధుపాత్ర సేవిస్తున్నాను. అతని కొడుకు పేర మధుసేవనానికి అతడు నిరాకరించాడు కాబట్టి, అతని పేరనే మనం సేవిద్దాం'—అన్నాడు.

అందరూ బాగు బాగని హర్షధ్వానాలుచేసి, సెడ్రిక్ పేర మధుపాత్రిలు ఖాళీచేశారు. సెడ్రిక్ మాత్రం ఇందుకేమాత్రమూ సంతోషించలేదు. సహజంగా అంత సునిశిత దృష్టి కలిగినవాడు కాకపోయినా, ఈ స్తోత్రపాఠంవల్ల తన పూర్వపు అవమానాన్ని అతడు మరచిపోగలడని వారు భావిస్తే, వారతనిని సరిగా అర్థం చేసుకోలేదనే అనాలి. కాని, అతడేమీ మారు పలకలేదు. జాన్ అటు తర్వాత, 'ఇదిగో, ఈసారి సర్ ఎథెల్‌స్టేను పేర సేవిద్దాం ఈ మధుపాత్ర'– అంటూ మరొక పాత్రను మధువుతో నింపించి పైకెత్తాడు. ఎథెల్‌స్టేన్ అందుకు కృతజ్ఞతా సూచకంగా నమ్రశిరస్కుడై అభివాదంచేసి, పెద్ద మధుపాత్రనెత్తి దానినిండావున్న మధువును గడగడా త్రాగివేశాడు.

కడుపులోకి వెళ్ళిన మధువుతో జాన్‌కు కొంత హుషారు హెచ్చింది. తన నార్మన్ అనుయాయులను కలయజూస్తూ ఇలా అన్నాడు: 'మన అతిథులైన సాక్సన్ ప్రముఖులను మనమిప్పుడు ఉచితరీతిని మర్యాదచేసినవాళ్ళమైనాం. దీనికి బదులుగా వారివలనకూడా మనం మర్యాదపొందడం సముచితం.' అంటూ సెడ్రిక్ వైపు తిరిగి, 'మా నార్మన్లంటే మీకు మొత్తంమీద అంత ఇష్టం లేక పోవచ్చు. కాని, ఉన్నంతలో, ఏ నార్మన్ ప్రముఖుని పేరు ఉచ్చరించడానికి మీకు విముఖత్వం అంతగా వుండదో అట్టివాని పేరొకటి సూచించండి. ఆ పేరు ఉచ్చరించడం మీ నాలుకకు ఏ మాత్రమైనా చేదుగా తగిల్తే, దానిని మధువుతో దిగమ్రింగి వెయ్యవచ్చు' అని హెచ్చరించాడు.

జాన్ ఈ మాట అనీ అనకముందే, వాల్డెమార్ ఫిడ్జర్స్ నెమ్మదిగా తన ఆసనంనుండి లేచి, వెనకప్రక్కగా సెడ్రిక్ చెంతకు జేరి, 'ఉభయజాతుల మధ్య పెరుగుతున్న వైమనస్యం తుదముట్టించడానికి ఇది మంచి అవకాశం, దీనిని జారవిడువక ప్రిన్సుజాన్ పేరు సూచించవలసిం'దని చెవిలో చెప్పాడు. కాని సెడ్రిక్ ఈ జోక్యపు పెత్తుకేమీ జవాబివ్వక, లేచి మధుపాత్రను పూర్తిగానింపి, జాన్‌ను ఉద్దేశించి ఇలా పలికాడు: 'దేవరవారు, ఈ విందు సందర్భంలో స్మరించదగిన ఏ నార్మన్ ప్రముఖుని పేరైనా సూచించవలసిందని అడిగారు. చాలా కష్టమైన బాధ్యత పెట్టారు నామీద. బానిసను యజమానిని గూర్చి పొగడమన్నట్టున్న దిది. అయినా, ఒక నార్మన్ ప్రముఖుని పేరు తప్పకుండా సూచిస్తాను. అధికారంచేతనేమి, పరాక్రమంచేతనేమి, అతడు నార్మనులలో కెల్ల అగ్రగణ్యుడు. సువిశాల యశోవిభ్రాజితుడు. ఈ మధుపాత్రను సింహపరాక్రముడైన రిచర్డుపేర నేను సేవిస్తున్నాను.'

సెడ్రిక్ తప్పకుండా తన పేరు సూచిస్తాడనే నమ్మకంతో ఉన్న జాన్, ఇది వినేసరికి ఉలిక్కిపడ్డాడు. మధుపాత్రను యంత్రప్రాయంగా పెదవులకు తగిలించి తిరిగి వెంటనే క్రింద పెట్టేసి, తన అనుయాయులందరివంకా వారి ముఖ

కవళికలు కనుపెట్టడంకోసం కలయజూచాడు. ఈ హఠాత్పరిణామం పట్ల సుముఖత్వం ప్రకటించినా విముఖత్వం ప్రకటించినా ప్రమాదంగానే కనుపించింది చాలామందికి. కొందరు అనుభవజ్ఞులు ప్రిన్సుజాన్‌ను అనుకరిస్తూ మధుపాత్రను పెదవులకు అంటించి క్రింద పెట్టేశారు. కొందరు కొంత ఉదార ప్రవృత్తితో, 'రిచర్డు మహారాజు దీర్ఘాయువౌగాక! త్వరలో మనకతడు తిరిగి లభించునుగాక' అని కేకపెట్టి మధువు సేవించడం మొదలుపెట్టారు. ఫ్రాంట్ డీ-బాఫ్, టెంప్లార్ బ్రయన్ ప్రభృతులగు కొద్దిమంది అసలు మధుపాత్రను ఎత్తనేలేదు. ఇందరు ఇన్నిరకాలుగా ప్రవర్తించినప్పటికీ, సెడ్రిక్ చేసిన ప్రతిపాదనను అధిక్షేపించే సాహసం మాత్రం ఎవ్వరికీ లేకపోయింది.

ఈ విజయాన్ని సెడ్రిక్ ఒక్క క్షణంసేపు వినోదించి, వెంటనే ఎథెల్‌స్టేనుతో ఇలా అన్నాడు: 'ఇక లేవండి, మనం ఇక్కడనుండి వెళ్ళిపోవాలి. ఇప్పటికే జాగుచేశాం. ప్రిన్సుజాన్ చేసిన ఆతిథిసత్కారానికి మనం బదులు తీర్చుకోడం అయిపోయింది. మన సాగ్జన్ల మోటుతరహాలను గూర్చి ఇకముందు ఎవరైనా ఇంకా తెలుసుకోదలిస్తే మన ఇండ్లకే వచ్చి తెలుసుకొందురుగాక. నార్మన్ విందులతోనూ, నార్మన్ మర్యాదలతోను మన కడుపు నిండిపోయింది. ఇకచాలు.'

అంటూనే సెడ్రిక్ లేచి, ఎథెల్ స్టేనుతో పాటుగా అచటినుండి నిష్క్రమించాడు. వారితోపాటు, సాగ్జన్ జాతీయులైన మరికొందరు కూడా వెళ్ళిపోయారు. 'ఈ సాగ్జన్ గబ్బిలాయిలకు ఈ రోజు బాగా నడిచింది. చిట్టచివరలో కూడా వాళ్ళే గెలుపొందారు'—అన్నాడు ప్రిన్సుజాన్.

'తిన్నాం, తాగాం, కేరింతలు కొట్టాం. ఇక మనం సెలవు పుచ్చుకోడం మంచిది' అన్నా డీ సందర్భంలో, నెమ్మదిగా ప్రియర్ ఐమర్.

'ఏం, అంత తొందరపడుతున్నారు వెళ్ళిపోవడానికి? పశ్చాత్తప్తులైన సుందరీకెవరికైనా పాపపరిహారకాండ జరపవలసి వున్నదేమిటి?' అని అడిగాడు డీబ్రేసీ.

'అబ్బే, కాదు. చాలా దూరప్రయాణం గదా! ఈ రాత్రిలోగా కొంత ప్రయాణం పూర్తిచేయవలసి ఉంది' అని సమాధానం చెప్పాడు ప్రయర్ ఐమర్.

ప్రిన్సుజాన్ వాల్డిమార్ చెవిలో నెమ్మదిగా,—'చూచావా, అందరూ చల్లగా సర్దుకుంటున్నారు. ఈ పిరికిపంద ప్రయర్ అందరికంటె ముందుగా నన్ను విడనాడేట్లున్నాడు'—అంటూ అదుర్దా ప్రకటించాడు.

'మరేం భయంలేదు ప్రభూ, నేను చెప్పుతాగా దానిసంగతి? యార్కు నగరంలో మనం జరపబోయే సమావేశానికి ప్రియర్ ఐమర్ కూడా వచ్చి తీర

టట్లు చేస్తాను' అంటూ వాల్డిమార్, ఏదో ఏకాంతంగా మాట్లాడవలసియున్న దని చెప్పి ప్రియర్ ఐమర్‌ను ప్రక్కకు తీసుకొనిపోయాడు.

కొంచెముసేపటిలో, ప్రిన్సుజాన్ అంతరంగికులూ, ముఖ్యానుచరులూ తప్ప మిగిలిన అతిథులంతా ఎవరిదారిని వారు వెళ్ళిపోవడం సాగించారు. చిడిముడిపాటుతో ప్రిన్సుజాన్ వాల్డిమార్‌పై నిందారోపణచేస్తూ, 'నీ సలహా ఎంత వరకు వచ్చిందో చూచావా? ఒక సాక్సన్ గబ్బిలాయి నా ఆతిథ్యం స్వీకరిస్తూనే నన్ను తిరస్కరించిపోయాడు. నా సోదరుని పేరు ఉచ్చరించబడినంత మాత్రంతో, నన్ను అంతా కుష్ఠురోగిని వదిలివేసినట్లు వదలి వెళ్ళిపోతున్నారు' అని చిర్రుబుర్రులాడాడు.

'దేవరవారు కాస్త ఓపిక పట్టాలి. తాము అనాలోచితంగా తెలికతనపు మాటలాడి నేను వేసిన పథకాన్ని భగ్నంచేశారు. అయిందేమో అయిపోయింది. నేనూ డీబ్రేసీ ఈ పిరికిపందలను వెంటనే కలుసుకొని, ఏమైనాసరే ఇక వారు మనతో కలిసి ఉండడంకంటె గత్యంతరం వారికి లేదనే సంగతి నచ్చచెప్తాం కదూ!' అని సమాధానం చెప్పాడు వాల్డిమార్.

జాన్‌కు మనస్సు కుదుటపడలేదు. ఆందోళనతో ఇటూ అటూ పచార్లు చేయసాగాడు. కాళ్లు తడబడజొచ్చాయి. మధుసేవనం మూలంగా అతని ఆందోళన మరింత యెక్కువయింది. 'మీరేమైనా చెయ్యండి—ఏమీ ప్రయోజనముండదు, రానున్నది వారు పసికట్టారు. మృగరాజు కాలిజాడలు ఇసుకలో వారికి కనుపించాయి. అడవిని ప్రతిధ్వనింపజేస్తూ సింహగర్జన వారికి వినిపించింది. ఇక వారికి ఏ విధంగానూ ధైర్యం పురికొల్పలేము' అని కలవరపడడం మొదలుపెట్టాడు.

జాన్‌లో కలిగిన ఈ వ్యాకులపరిస్థితి చూచి, డీబ్రేసీతో జనాంతికంగా వాల్డిమార్ ఇలా అన్నాడు: 'ఇతరులకు ధైర్యం పురికొల్పడం మాట యెలా వున్నా, ముందు తనకు ధైర్యం పురికొల్పడం ఎలాగ? సోదరుని పేరు చెప్పబడినంత మాత్రానికే హడలిపోతున్నాడు. మంచిరానీ, చెడురానీ, ధైర్యం విడనాడక పట్టుదలతో కార్యసాధన చెయ్యలేని ప్రభువుకు సలహాదారుగా ఉండే వారి దురవస్థ ఏమని చెప్పాలి!'

# అధ్యాయం ౧౫

సాలెపురుగు, తునిగిపోయిన తన గూడును బాగుచేసుకోడానికి ఎంత శ్రమ పడుతుందో, అంతకంటె ఎక్కువ శ్రమతో వాల్డిమార్ ఫిడ్జర్సు, చెదరిపోయిన జాన్ ముఠానంతనీ తిరిగి కూడగట్టుకోవడానికి తంటాలుపడడం మొదలు పెట్టాడు. ఆ ముఠాలో, సహజ ప్రవృత్తి ప్రేరణవల్ల జాన్‌ను అంటిపెట్టుకున్న వారెవ్వరూ లేరు. వారిలో ఏ ఒక్కరికీ వ్యక్తిగతంగా జాన్‌పై భక్తివిశ్వాసాలు లేవు. అందుచే వాల్డిమార్ వారికి, జాన్‌ను అంటిపెట్టుకున్నందుమూలాన తాము ప్రస్తుతం అనుభవించే సదుపాయాలు గుర్తుకు తేవడంతోపాటు, ఇంకా క్రొత్త క్రొత్త ప్రయోజనాలు ఎరచూపడం కూడ అవసరమయింది.

యువకులూ, భోగలాలసులూ అయిన సామంతులకు వివిధభోగాలు మరింత విశృంఖలంగా అనుభవించగల అవకాశాలను ఎరచూపాడు. అధికార వాంఛగలవారికి అధికారమూ, ధనతృష్ణగలవారికి ధనమూ ఇతోధికంగా లభించగలదని ఆశపెట్టాడు. కూలికి పనిచేస్తున్న సైనికదళాల నాయకులకు వెంటనే సమృద్ధిగా కొంత ధనప్రదానం చేశాడు. అది లేనిదే వాళ్ళకిక ఏమాటా చెవికెక్కదని అతనికి తెలుసు. ఇక వాగ్దానాల సంగతి చెప్పనే అక్కర్లేదు. డోలాయమాన పరిస్థితిలో ఉన్న వారికి స్థిరత్వం చేకూర్చడానికీ, అధైర్యంపడ్డ వారిలో తిరిగి ధైర్యం పూరించడానికీ, అతను ఎన్ని ఉపాయాలు అవలంబించాలో అన్నీ అవలంబించాడు. రిచర్డు రాజు తిరిగి వస్తాడన్న మాట మూడువంతుల ముప్పాతికపాళ్లు అబద్ధమనే అతనివాదం. కాని, అది ఎవ్వరికీ నచ్చడంలేదని వారి చూపులను బట్టియేమి, మాటలనుబట్టియేమి, అతనికి తెలుస్తూనే ఉంది. అందుచే, ఒకవేళ రిచర్డు తిరిగివస్తే మాత్రం భయమేమిటి, మీ ప్రయోజనాలు మీరెందుకు వదులుకోవాలి, అని అతని ప్రశ్న.

అతడిలా వాదించాడు: 'రిచర్డు తిరిగివస్తే ఎందుకు వస్తాడో తెలుసునా? పాలస్తీనాకు తనతోపాటు రానివారి చేతుల్లోంచి ఆస్తిపాస్తులను ఊడలాక్కుని, తన బికారీ అనుయాయులకు పంచిపెట్టడానికి వస్తాడు. తాను లేని రోజుల్లో తన అధికార స్వత్వాలకు భంజకంగానూ, ప్రభుత్వ చట్టాలకు విరుద్ధంగానూ ప్రవర్తించిన వారిని కఠినంగా శిక్షించడానికి వస్తాడు. పాలస్తీనా యుద్ధాల్లో తనను తోసిపుచ్చి ఫ్రాన్సురాజు ఫిలిప్‌ను అనుసరించిన టెంప్లార్లపైనా హాస్పిటలర్లపైనా పగతీర్చుకోడానికి వస్తాడు. తన సోదరుని వెంటనంటి తిరిగిన ప్రతివానినీ తిరుగుబాటుదారునిగ ఎంచి దండించడానికి వస్తాడు. నిజమే. అయినప్పటికీ, అతనేమీ చేయగల్గుతాడని మీరు భయపడనక్కరలేదు. అతడు చాల గొప్ప వీరుడన్నమాట నిజమే. ఒప్పుకుంటాం. కాని, పూర్వం ఎప్పుడో ఆర్థరురాజు కాలంలో, ఒకే వీరుడు అసహాయశూరుడై ఒక మహా

సైన్యాన్ని ఎదుర్కొని జయించగలిగాడంటే, ఆ ప్రతాపాలు ఈ రోజుల్లో చెల్లవు. రిచర్డు తిరిగి వస్తే ఒంటరిగానే వచ్చేమాట నిశ్చయం. మిత్రులూ అనుయాయులూ అతని కెవ్వరూ ఉండరు. అతని ఆధిపత్యాన పోరాడిన వీరసైనికుల బొమికలిప్పుడు పాలస్తీనా యెడారుల్లో పొర్లాడుతున్నాయి. ఏ ఒకరిద్దరో ఈ విల్ఫ్రిడ్ మాదిరిగా చావు తప్పి కన్ను లొట్టయి తిరిగి వచ్చినా, ఆ దౌర్భాగ్యులు చేయగలిగే దేమిటి? అదిన్నీ గాక, రాజ్యాధికారం రిచర్డుకే వున్నదని ఎందుకనుకోవాలి? వెనుక విలియం ది కాంకరర్ చనిపోయినప్పుడు, ప్రజలు అతని పెద్దకొడుకు రాబర్టుడ్యూకును త్రోసివుచ్చి, తరువాతివారిని మాత్రమే తరుసగా గద్దె నెక్కించలేదా? రాబర్టుడ్యూకులో ఏమి లోపముంది? గొప్పయోధుడు. మేటినాయకుడు. మిత్రులయెడ ఉదారుడు. చర్చియెడ భక్తి ప్రపత్తులు గలవాడు. అన్నిటినీమించి, పాలస్తీనాలో మతయుద్ధం అమోఘంగా నిర్వహించి ఏసుక్రీస్తు పవిత్రసమాధిని శత్రువుల స్వాధీనంలోంచి తప్పించినవాడు. అయినప్పటికీ అతనిని ప్రజలు రాజాగా ఎన్నుకోలేదు. అతను రాజు కారాదని నిర్ణయించారు. కాని, ప్రజల అభిమతాన్ని వ్యతిరేకించిన కారణాన, అతడు తుదకు కార్డిఫ్ దుర్గంలో ఖైదీయై, గ్రుడ్డివాడుగా, దీనాతిదీనమైన చావు చావవలసి వచ్చింది. కాబట్టి, రాజవంశీకులలో ఎవరికి రాజ్యాధికారం స్వీకరించి నిర్వహించేయోగ్యత ఉన్నదో—అనగా సామంతుల ప్రయోజనాలు ఎవరి ఎన్నికవలన రక్షించబడుతాయో—నిర్ణయించవలసింది మనం. వ్యక్తి యోగ్యతలనుబట్టిచూస్తే రిచర్డు కంటె జాన్ కొంచెం లొజ్జు అయితే కావచ్చును. కాని, రిచర్డు పగ తీర్చుకునేందుకు వస్తున్నాడనే సంగతి మరచిపోకండి. జాన్ అలాకాదు, మీకు బహుమతులిస్తాడు, మీ దోషాలు మన్నిస్తాడు, ప్రత్యేకసౌకర్యాలు కల్పిస్తాడు. ఇంకా అనేకంచేస్తాడు. కాబట్టి, సామంతులందరూ ఎవరిని రాజుగా ఎన్నుకోవలసి యుంటేదీ ఇప్పుడు స్పష్టంకావడం లేదా ?'

ఈ మాదిరి వాదధోరణిలో, అధికారి తారతమ్యాన్ని బట్టి ఎవరిదగ్గర ఏ మాట పనిచేస్తుందో వారి దగ్గిర అలా మాట్లాడుతూ, వాల్డిమార్ ఆ ముఠావారి నందరినీ చాలవరకు త్రిప్పుకో గలిగాడు. యార్కు నగరంలో జరుగబోయే సమావేశానికి హాజరుకావడానికి వీరిలో చాలామంది తమ అంగీకారం తెలియ జేశారు. జాన్‌ను రాజముకుటధారిని చేసేందుకు గావలసిన యేర్పాటులన్నీ అక్కడ జరుగుతవి.

వాల్డిమార్ ఈ శ్రమలన్నీ పడి, ఫలితం చాలవరకు తృప్తికరంగా ఉన్నందుకు సంతోషించినా చాల బడలికచెంది తిరిగి ఆష్బీదుర్గం చేరుకునేసరికి, చాలా రాత్రిఅయింది. అక్కడ డీబ్రేసీ ఒక క్రొత్త వేషంతో అతనికి కనుపించాడు. విందు సందర్భంలో తొడిగిన ఉడుపులు మార్చి ఒక పొట్టి అంగీ తాల్చాడు. నెత్తిన ఒక తోలు టోపీ వుంది. మొలను కత్తి, భుజంమీదుగా వ్రేలాడుతూ ఒకబూరా, చేతిలో ఒక విల్లు, పటకాలో కొన్ని అమ్ములు. దుర్గంలోని ముందటి చావడుల్లో

ఎక్కడైనా గనుక అతడు కనుపించియుంటే యెవడో కావలివారిలో ఒకడై ఉంటాడని అనుకొని వాల్డిమార్ అతని నంతగా పరీక్షించి యుండేవాడు కాడు. లోపలి హాలులో చూచిన కారణంచేత, యెవరా అని పరీక్షగా చూచి, డీబ్రేసీయని గుర్తించాడు.

'ఏమిటీ విచిత్రవేషం డీబ్రేసీ? ఇదా సమయం నీ వినోద ప్రదర్శనాలకు? అవతల మన ప్రభువు జాన్ భవితవ్యం అట్టిట్టుగా ఉంది. రిచర్డు రాజు పేరు విన్నమాత్రంతోనే కంగారుపడుతున్న యీ పిరికి పందలకు నా మాదిరిగా ధైర్యం పురికొల్పవలసిన పని బోలెడంత ఉంటే, ఈ వేషాలతోనా నీవు కాలక్షేపం చేసేది?'—అన్నాడు వాల్డిమార్, తీవ్రమైన కోపం కనబరుస్తూ.

డీబ్రేసీ తొణక్కుండా ఇలా జవాబుచెప్పాడు: 'ఇందులో వైపరీత్యమేముంది వాల్డిమార్! నీవు నీపనిమీద ఉంటే, నేను నాపనిమీద ఉన్నాను. అంతే!'

'ఏమిటీ! నేను నాపనిమీద ఉన్నానా! నేనున్నది మన ఉభయులకూ పోషకుడైన ప్రిన్సుజాన్ పనిమీద! తెలుసునా?'—అని గద్దించాడు వాల్డిమార్.

'అది నీ ప్రయోజనంకొరకు కాదని నేను నమ్ముతాననా నీ ఉద్దేశం? వాల్డిమార్! నా సంగతి నీకు తెలుసు, నీ సంగతి నాకు తెలుసు. అధికారప్రాప్తి నీ లక్ష్యం. భోగప్రాప్తి నా లక్ష్యం. మన వయస్సుల్లో భేదాలనుబట్టే ఈ లక్ష్యభేదాలు. ప్రిన్సుజాన్ సంగతి నీకూ తెలుసు, నాకూ తెలుసు. ఏ రకమైన రాజలక్షణాలూ అతనివద్ద లేవు. వట్టి చపలచిత్తుడూ, భీరువూనూ! మంచో చెడో, గట్టిగా ఒక పని సాధించలేడు,—కేవల దుర్బలుడు. పోనీ సులభగమ్యుడంటామా,—కాడు, నిరంకుశుడు. ప్రజలకైనా అభిమానపాత్రుడు కాగల్గాడా అంటే,—లేనిపోని స్వాతిశయంలో వారి నవమానిస్తూంటాడు. ఇక మరి, అతడు రాజు కావడం యెందుకూ అంటే, అతనిద్వారా వాల్డిమార్ డిబ్రేసీలు తమ ఉన్నతిని సాధించుకోడం కోసం! కనుక డీబ్రేసీ! నీ రాజనీతి చతురతలో నీ వతనికి తోడ్పడు. నా భటుల ఆయుధబలంతో నే నతనికి తోడ్పడుతాను. ఏం, బాగాలేదూ?' అన్నాడు డీబ్రేసీ.

'చాల మంచిలోకే! ప్రాణంమీదికివచ్చే పరిస్థితిలో వెంగలితనంగా ప్రవర్తించే కోడు!'— అంటూ వాల్డిమార్ చీకాకుపడి, 'మనమిప్పుడున్న పరిస్థితేమిటీ, ఈ చిర్రిబుర్రి మారువేషమేమిటి?' అని అడిగాడు.

'బెంజమిన్ తెగవాళ్ళు సంపాదించుకున్నట్లుగా, ఒక వధువును సంపాదించుకోబోతున్నాను, వధువును!'—అన్నాడు డీబ్రేసీ హుషారుగా.

'వధువునా! బెంజమిన్ తెగవాళ్లు సంపాదించుకొన్నట్లుగానా! ఏమిటిది? నాకేం తెలియడంలేదు' అని వింతగా చూచాడు వాల్డిమార్ అతనివంక.

'సరి సరి, నీ కింకా తెలియదూ? నిన్న సాయంకాలం నీవు లేవా ఏమిటి? ఒక చారణుడు వీరశృంగార గాథ ఒకటి పాడేసరికి, ప్రియర్ ఐమర్ ఒక తమాషా కథ చెప్పాడు. ప్రాచీనకాలంలో చాలాకాలం క్రిందట, బెంజమిన్ తెగ వారికీ, తక్కిన ఇస్రాయేలీయులకూ చాల ఘోరమైన పోరాటం జరిగిందట— పోరాటంలో బెంజమిన్ తెగలోని వీరపురుషులందరినీ చాలవరకు యీతలివారు ఊచకోతలు కోసేశారట. అప్పుడు, అందు మిగిలినవారి కెవ్వరికీ తమ కన్నెల నివ్వబోమని ఆ తెగలోని పెద్దలు క్రీస్తుమాతమీద ఒట్టువేసికొన్నారట. తరువాత పశ్చాత్తాపపడి, దీనినించి బయటపడడ మెలాగని పూజ్యపాదులైన పోప్ స్వాములవారిని అడుగగా, అప్పుడాయన ఉపదేశించిన పద్ధతి ప్రకారం, ఒక పెద్ద ఆటలపోటీ ప్రదర్శన మొకటి జరిపి, ప్రదర్శనం చూడవచ్చిన ఆడపిల్లల నందరినీ బెంజమిన్ యువకులు ఎత్తుకొనిపోయారట. ఆ రీతిగా, ఆ కన్నెల ఇష్టంతో గాని, వారి తలిదండ్రుల ఇష్టంతో గాని, నిమిత్తం లేకుండానే వాళ్ళు వధువులను సమకూర్చుకోగలిగారట' అంటూ ఏకరువు పెట్టాడు డీబ్రేసీ.

'అవా! ఆ కథ నేను విన్నాను. కాని, నీవో, లేక ప్రయర్ ఐమరో, అది జరిగిన కాలమూ సందర్భమూ చాలా మార్చేశారు' అన్నాడు వాల్డిమార్.

'నేనూ బెంజమిన్ తెగవారిలాగ ఒక వధువు నిప్పుడు సమకూర్చుకోబోతున్నాను. అంటే,— ఆ సాక్సన్ పశువులు ఈ రాత్రే దుర్గంవీడి ప్రయాణమై పోతూ ఉంటారు గాబట్టి, ఈ వేషంతో ఆ మందమీదపడి వారిలోంచి రోవెనా సుందరిని ఎత్తుకొని పోతాను'— అని తన ఉద్దేశ్యం బయటపెట్టాడు డీబ్రేసీ.

వాల్డిమార్ రిచ్చపడి, 'నీకేమైనా పిచ్చెక్కిందా డీబ్రేసీ? ఈ సాక్సన్లు సామాన్యులనుకున్నావు కాబోలు. చాలా ధనవంతులూ బలవంతులూనూ. వీరంటే సాక్సన్ జాతి కంతకీ చాలా గౌరవాభిమానాలున్నాయి, తమజాతీయులలో ఇలాటి చాల కొద్దిమందిమాత్రమే కొంత సంపదతోనూ, మానమర్యాదలుగల స్వతంత్రతతోనూ మిగిలిన కారణంచేత' అంటూ జ్ఞాపకం చేశాడు.

'ఆ కొద్దిమందీకూడా మిగలకూడదని నే నంటున్నాను. హేస్టింగ్సు యుద్ధంనాడు ప్రారంభమైన నార్మన్ విజయం ఇంకా అపరిపూర్ణంగానే ఉండిపోయింది, అది పూర్తియై తీరాలి' అని ఉద్ఘాటించాడు డీబ్రేసీ.

'కావచ్చుగాని, దానికిది సమయంకాదు. విపత్సమయం ఆసన్నమౌతోంది. ప్రజాభిమానాన్ని ఎలాగైనా చిక్కబట్టి ఉంచుకోడం అత్యవసరం. వారి అభిమానపాత్రుల కెవరికైనా హాని కలిగితే, వారిపట్ల న్యాయం చెయ్యవలసిన బాధ్యత ప్రిన్సుజాన్ కుంటుంది' అని వాల్డిమార్ హెచ్చరించాడు.

'ఎలా చేస్తాడో చూస్తాగా! ధైర్యముంటే చెయ్యమను. నా కాలూను ఈ డెకాంద్ర సుగటిమిరళన పొందే సాయానికీ, ఊ హృదయంలేని

సాగ్జన్ మూకవలన పొందే సాయానికి గల లేదా ఎలాంటిదో తెలుసు కుంటాడు. సరే దానికేమిగాని, నే నెవ్వరో వెంటనే బయటపడగూడదని నా ఉద్దేశం. నీవు చెప్పు,—నేనిప్పుడు అచ్చంగా ఒక అటవికుని మాదిరిగా ఉన్నానా లేదా? యార్క్‌షైరు అడవుల్లో తిరుగాడే బందిపోటు దొంగల మీదుగా కొట్టుకుపోతుందిలే ఈ దౌర్జన్యమంతా! నా చారులవలన యీ సాగ్జన్ల సమాచారమంతా తెలుసుకున్నాను. ఈ రాత్రికి సెంటువిట్టాల్ కాన్వెంటులో మకాం చేస్తారట. రేపటి ప్రయాణంలో వీళ్లు మా పాలిట బడతారు. డేగల మాదిరిగ వెళ్ళి వాళ్లమీద పడి వాళ్లను పట్టుకుంటాం. మరికొంతసేపట్లో నేను నా నిజరూపంలో అక్కడ ప్రత్యక్షమై, ఒక వీరుడనై వారిలో పోరాడి, భయార్తయై బెగ్గడిల్లుతున్న రొవెనా సుందరిని వారి మొరటుహస్తములనుండి కాపాడి, ఫ్రాంట్ డీ బాఫ్ దుర్గానికో లేక నార్మండీకో చేరుస్తాను. మారిస్ డీ బ్రేసీకి భార్య అయ్యేదాకా ఆమె బంధుజనుల కామెను కళ్లబడనివ్వను. ఇదీ నా పథకం!' అన్నాడు డీబ్రేసీ.

వాల్డిమార్ ఆశ్చర్యపూరితుడై, 'ఔరా, ఏమిటో అనుకున్నాను, బలేఎత్తు యెత్తావే చివరికి! ఇది నీకు సొంతంగా తోచిన ఉపాయంతే నేను నమ్మను. చెప్పు, నిజంచెప్పు, ఎవరు చెప్పారు నీకీ సలహా? ఈ కార్యనిర్వహణం లో నీకు సహాయులెవరు? నీ సొంత అనుచరులంతా చాలదూరంగా యార్క్ నగరంలో వున్నారుగదా, మరి ఎవరి తోడ్పాటుతో ఈ పని చేయదలపెట్టావు, చెప్పు!' అని రెట్టించి అడిగాడు.

'అబ్బా, చెప్పాలిసిందేనా! అయితే చెపుతావిను. ఇందాక చెప్పిన బెంజమిన్ యోధకుల సాహసోదంతం నాలో ఈ ఆలోచనను మొలిపించింది. దీన్ని కార్యరూపంలో ఎలా నిర్వహించవలసినదీ సలహాయిచ్చినవాడు టెంప్లార్ బ్రియన్. ఈ ప్రయత్నంలో అతని తోడ్పాటుకూడా నాకుంటుంది. అతడూ అతని అనుచరులూకూడ బందిపోటు దొంగల వేషాలు వేసికొని వారిని అటకాయిస్తారు. పిమ్మట నేను నా దుస్తులు మార్చుకొని, నిజరూపంలో ప్రత్యక్షమై వారి చేతులనుండి ఆ సుందరిని రక్షిస్తాను' అన్నాడు డీబ్రేసీ.

'పథకంమటుకు మీ యిద్దరి ఉమ్మడిబుద్ధివిశేషానికి తగినట్లుగానే ఉన్నది గాని, ఆ సుందరి ముందుగా టెంప్లార్ బ్రియన్ చేతిలోకి వెళ్ళే పద్ధతికి ఒప్పుకున్న నీ తెలివి యేపాటిదో ప్రత్యేకంగా రుజువయింది. ఆమెను మొదట ఆమె సాగ్జన్ బంధువులనుంచి అపహరించడం నీకు సులభమే కావచ్చుగాని, తరువాత టెంప్లార్ బ్రియన్ పిడికిటిలోంచి ఆమెను ఎలా దక్కించుకో గలవో నాకు తెలియడంలేదు. బ్రియన్ కేవలం మొండి డేగవంటివాడు. పావురాళ్ళపై దూకే ఒడుపంతా బాగా తెలిసినవాడు. పట్టిన పావురాయిని వదిలే స్వభావం లేదతనికి'— అన్నాడు వాల్డిమార్.

'ఆ భయం అక్కరలేదులే! బ్రయన్, టెంప్లార్ మతవ్యవస్థకు చెందినవాడుగదా. ఈ సంపన్నురాలిని వివాహం చేసుకో గోరుతున్న నాతో ఎలా పోటీకివస్తాడు? రాలేడు. ఇక, డీబ్రేసీ కొరకు ఉద్దేశించబడిన వధువుపై దురుద్దేశ్యంతో చేతులు వెయ్యడానికైనా అతని కన్ని గుండెలుండాలి'! అని సవాలు చేశాడు డీబ్రేసీ.

'అయితే యిక నేను ఏమిచెప్పినా నీది పొరపాటని ఒప్పుకోవులే! నీ మొండితనం నేను బాగా ఎరిగినవాణ్ణేగా! సరే, ఇక ఆలస్యం చెయ్యకుండానైనా వెళ్లు. పొరపాటుకుతోడు ఆలస్యంకూడ జరిగితే, మరీ చిక్కు' అని హెచ్చరించాడు వాల్డిమార్.

'ఏంకోసేహా! కొన్నిగంటల పని. తరవాత వెంటనే నా వీరానుచరులందరితోనూ యార్కునగరంలోకి వచ్చి, నీవు వేసే పథకం అమలుజరపటంలో పూర్తిగా సాయంచేస్తాను. అదిగో, నా సహచరులంతా చేరినట్లున్నారు. గుర్రాల సకిలింపులూ, డెక్కల చప్పుళ్ళూ వినిపిస్తున్నాయి. సెలవు,—ఇక నేను వెడతాను,—అచ్చమైన యోధునివలె:—సుందరీ దరహాసకోమలం కొల్లగొట్టుకోడానికి!'

డిబ్రేసీ వెళ్ళిపోతూంటే అతనివైపే వాల్డిమార్ కొంతసేపటివాకా చూస్తూ నిలబడి తనలో తాను ఇలా అనుకున్నాడు: 'బలే అచ్చమయిన యోధుడు! ప్రాణగొడ్డమైన పని ఒకటి అత్యవసరంగా చేయవలసిఉండగా, దానిని వదలిపెట్టి, పక్కనుంచి ఎగిరే ఏ రెల్లుపూవుకో చూచి దానికోసమై పరుగులెత్తుతాడుగదా, వీణ్ణి ఏమనాలి! కాని, ఇలాంటి పరికరాలతోనే నేను పనిచేయవలసి వుంది. ఎవరి ప్రయోజనంకోసం? అవివేకీ, విషయలోలుడూ అయిన ప్రభువుకోసం. ఆ ప్రభువు ఇప్పటికే తండ్రిమీద తిరుగుబాటు చేసిన కొడుకనిపించుకున్నాడు. అన్నగారికి ద్రోహంచేసిన తమ్ముడనిపించుకొన్నాడు. సేవకులయొక్క కృతఘ్నుడైన యజమానియనికూడా రుజువు చేసుకోగలడు సందేహంలేదు. కాని,—అతడు,—అతడుకూడా—నా కార్యసాధనకు నేనుపయోగించుకునే పనిముట్లలో ఒక పనిముట్టే! గర్వంకొద్దీ ఏనాడతడు, నా ప్రయోజనం కంటె వేరుగా తన ప్రయోజనాన్ని భావిస్తాడో, అప్పుడు తెలుస్తుందతనికి దీని రహస్యం.

వాల్డిమార్ ఈ ఊహాతరంగాల్లో తేలియాడుతూ ఉండగా, లోపలినుంచి ప్రిన్సుజాన్ అతనికోసం పెట్టినకేక వినవచ్చింది. వెంటనే ఆ ఆలోచనలకు అడ్డుకట్టవేసి, యెక్కడలేని వినయసంపదా ఉట్టిపడేటట్లు టోపీతీసి చేతబుచ్చుకొని, ఇంగ్లాండుదేశపు ఈ కాబోయే చాన్సెలర్ (ఈ ఉన్నతపదవినే ఈ కూటనీతిజ్ఞుడు వాంఛిస్తున్నది) ఆ కాబోయే రాజుగారినుండి ఆజ్ఞలు గైకొనటకు లోనికి వెళ్ళాడు.

# అధ్యాయం ౧౬

అశ్వపోటీల సంఘాల సమర ప్రదర్శనంలో ఒక నీలకవచధారి మొదటినుంచీ పట్టి మందకొడిగా పోట్లాడుతూ, ప్రేక్షకులచే 'నల్లమందుభాయి' అనిపించుకొని, చివరకు తన ప్రతాపస్ఫూర్తిచే ఐవాన్హోను ఒక ప్రమాద పరిస్థితినుండి తప్పించి, అతనికి విజయం సిద్ధించినట్లోడనే, ఎవ్వరికీ కానరాకుండ రంగస్థలంనుండి నిష్క్రమించి అడవిదారులవెంట ప్రయాణిస్తూ వెడలిపోయిన సంగతి పాఠకులు మరచియుండరు. అతడట్లుపోయిపోయి, చీకటిపడే సమయానికి ఒక మారుమూలసత్రం చేరుకుని, ఆ రాత్రికి అచట బసచేశాడు. తరువాత తనవలెనే అచట బసచేయడానికివచ్చిన ఒక చారణునిద్వారా అతనికి, తాను రంగస్థలం వీడిన పిమ్మట ఏమేమి జరిగినదీ అంతా సవిస్తరంగా తెలిసింది.

మరునాడు, చాల దూరప్రయాణంచేసే సంకల్పంతో, అతడు పెందలకడనే లేచి తిరిగి ప్రయాణమయ్యాడు. క్రిందటిరోజు పోరాటంలో అతని గుర్రం ఏమంత బడలియుండని కారణంచేత, ఈ దూరప్రయాణశ్రమనది తట్టుకోగలిగియుంది. కాని, దారులు చాలా తికమకగా ఉన్నందువల్ల, అతని ప్రయాణం అనుకున్నట్లు సాగలేదు. సాయంకాలమయ్యేసరికి, యార్కుషైరులోని వెస్టురైడింగు ప్రాంతపు సరిహద్దుల్లో తానున్నట్లతడు తెలుసుకున్నాడు, తానూ గుర్రమూకూడ బడలిక తీర్చుకోవలసిన సమయమది. పైగా చీకటి పడవస్తోంది. ఆ రాత్రిమకాముకు ఏదో ఒక చోటు చూచుకోడం అత్యావశ్యకం.

కాని, అక్కడమాత్రం, తానింత తలదాచుకునేందుకుగాని, కడుపు నింపుకునేందుకుగాని, అనువైన చోటెక్కడా ఉండేటట్లు కనిపించలేదు. యదృచ్ఛాసంచారులగు యోధవరులు అలాటిసందర్భాల్లో, తమ గుర్రాలను పచ్చికమేతకు బీడుమీదికి వదిలి, తాము ఏ ఓకువృక్షపు చాందినీ క్రిందనో తమ ప్రియురాండ్రనుగూర్చి తలపోస్తూ పడుకొని ఆ రాత్రి వెళ్ళిస్తూ ఉండడంకద్దు. కాని మన నీలకవచధారికి అలాంటి ప్రియురాలెవ్వరూ ఉన్నట్లు కనిపించలేదు. యుద్ధ సందర్భంలో ఎంత ఉదాసీనుడో ప్రేమవిషయాల్లోకూడ అంత ఉదాసీనుడుగానే కనుపించాడు. ఆకలినీ బడలికనూ కనుపించనీకుండాచేసి, మంచి భోజనమూ మెత్తనిపరుపూలేని లోటును ప్రేమభావనలతో నింపుకుంటూ కాలక్షేపం చెయ్యగల యోగ్యత అతనికున్నట్లులేదు. అందుచే, ఎట్టి ఆశ్రయస్థానమూ లేని అడవిమధ్య తాను చిక్కుకొనిపోవడం అతనికి చాల చికాకు

కలిగించింది. కొన్ని పచ్చికబీడులూ డొంకలూ అచట అతనికి గోచరం కాక పోలేదు. కాని, పెక్కు పశువులమందల త్రొక్కిడిచేతనూ, వేటగాండ్ర వేటల సంరంభం చేతనూ పడ్డ దారులవలె అవి కనుపించాయి.

ఆ దారులలో దేని ననుసరిస్తే ఎక్కడికి తీసుకొని పోతుందో అతనికి తెలియలేదు. ఇక తనంతతానుగా ఏనిర్ణయమూ చేయక, గుర్రాన్ని దాని యిచ్ఛవచ్చినట్లు పోనివ్వడం మంచి దనుకున్నాడు. ఇలాంటి చిక్కు పరిస్థితులయందు గుర్రాలు చాల అద్భుతమైన తెలివితేటలు చూపి యజమానులను చిక్కులలోంచి తప్పించడం అతని కిదివరలో బాగా అనుభవమున్నది.

యజమాని తనమీద ఆధారపడి కళ్ళెం వదలించాడన్న సంగతి గ్రహించ గానే, గుర్రానికొకవిధమైన నూతనశక్తి వచ్చినట్లయింది. బడలికమూలాన ఇదివరలో రికాబులతో పొడిచినా చురుకుదనం చూపని గుర్రం, ఇప్పుడు చెవులు నిక్కించి, యజమాని తనపై ఉంచిన విశ్వాసానికి గర్విస్తున్నదా అన్నట్లు హుషారుగా ముందుకు దారితీయ నారంభించింది. అది యొక ప్రక్క త్రోవ. అతను అరోజెల్లా ప్రయాణిస్తూ వచ్చిన బాట కాదు. అయినప్పటికీ, అది ఒకవిధమైన ఆత్మవిశ్వాసంతో ముందుకు పోతున్నట్లు తోచినందున, అతనేమాత్రమూ దానిని నిరోధించక యధేచ్ఛగా పోనిచ్చాడు.

అతని నమ్మిక వ్యర్థ కాలేదు. ఆకాలిత్రోవ క్రమంగా విపులమై, కొంత దూరం పోయేసరి కొక చిన్న గంట మ్రోగిన చప్పుడు వినవచ్చింది. సమీపంలో ఏదైనా ఒక చర్చియో, సన్యాసి కుటీరమో, ఉండి యుండాలని గ్రహించాడు. మరికొంత దూరం పోయేసరికి, ఒక చిన్న పచ్చిక బయలు, దాని కవతల ఒక పెద్ద కొండగుట్టా కనుపించాయి. ఓకు చెట్లతోనూ ఐవీలతలతోనూ క్రిక్కిరిసి ఉన్న ఆ కొండగుట్ట పాదతలాన ఒక చిన్న కుటీరమున్నది. ఆరణ్యక వృక్ష ప్రకాండములతో నిర్మించబడిన కుటీరమది. చెట్ల కొమ్మలూ రెమ్మలతోటి తడికలల్లి మట్టితో మెత్తిన గోడలు. నమ్మానికి ప్రక్కగా, ఒక పొడుగాటి గుంజ పాతబడి, దాని పైభాగాన అడ్డంగా ఒక కొయ్యముక్క 'క్రాసు' వలె బిగించబడి ఉంది. కుడివైపున కొంచెం దూరంగా కొండగుట్టలోంచి సన్నని జల ధార ఒకటి ఒక చిన్న కుండమువంటిదానిలోనికి జారి అచటనుంచి మర్మర ధ్వనిచేస్తూ కుటీరం ప్రక్కగా ప్రవహించి నెమ్మదిగా అటవీమధ్యంలోకి అంతర్ధానమైపోతోంది.

ఈ సెలయేటి ప్రక్కనే, ఒక చిన్న చర్చి కాలూడి శిథిలాలున్నాయి. పైకప్పు కొంత కూలిపోయిఉంది. పొట్టిగానూ లావుగానూఉన్న నాలుగు స్తంభాలపై నిలబడ్డ నాలుగు ఆర్చీలతో, చదరపురడుగుల పొడవూ, పన్నెండడుగుల

వెడల్పూ గలిగి, పురాతనపు సాగ్జన్ శిల్పపద్ధతిని నిర్మించబడిన కట్టడమది. కప్పు పైన ఒక గూడువంటిదానిలో ఒక గంట అమర్చబడి ఉంది. నీలకవచధారి ఇంతకుపూర్వం విన్నది, ఈ గంటచప్పుడునే.

ఈ దృశ్యం చూడటంతోటే, ఈ రాత్రికి మనకింత విశ్రాంతికి తావు దొరికినదిలే యని సంతసించి, గుర్రంమీదనుంచి తటాలున క్రిందికి దూకి, తన యీటె మడమతో ఆ యాశ్రమ కవాటాన్ని తట్టడం మొదలుపెట్టాడు. ఎంత సేపటికీ లోపలినుంచి జవాబు రాలేదు. నీలకవచధారి మరింత చప్పుడయ్యేటట్లు తలుపును కొడవటం సాగించాడు. కొంతసేపటికి లోపలినుంచి, ‘ఆ తలుపు కొట్టేదెవరో, ఇక్కడ వీలులేదు. మరోచోటికి పొండి! నా దైవప్రార్థనకు భంగం చెయ్యకండి’ అంటూ ఒక కంఠధ్వని వినవచ్చింది.

నీలకవచధారి యిలా జవాబిచ్చాడు: ‘అయ్యా, నేనొక పాంథుడను, ఈ అడవిలో చిక్కుపడిపోయాను. మీ ఆతిథ్య ధర్మనిర్వహణ కిది మంచి అవకాశం’. లోపలనున్న సన్యాసి తలుపు తెరవకుండానే ‘నేనేం చేసేది సోదరా, భగవంతుడు నన్ను ఒకరి ఆతిథ్యం పుచ్చుకునే స్థితిలో ఉంచాడుగాని ఇచ్చే స్థితిలో ఉంచలేదు. నావద్ద పక్కలుగానీ భోజనపదార్థాలు కూడా లేవు. ఇక్కడ నాతోపాటుగా శయనించడానికి గుర్రాలకు కూడ చోటులేదు. పో, ఇంకెక్కడికైనా వెళ్లు, దేవుడు నీకు మేలుచేయుగాక!’ అని దబాయించాడు.

‘చీకటి పడుతూంటే ఇప్పుడెక్కడికి వెళ్లేది! ఈ అడవిలో త్రోవ కనుక్కోవడ మెలాగ! నీవు నిజమైన క్రైస్తవుడవైతే, తలుపు తెరచి, యెలా వెళ్ళాలో త్రోవైనా చెప్పు’—అన్నాడు నీలకవచధారి.

‘అబ్బా, నీకు పుణ్యముంటుంది, నా నిష్ఠ భంగం చెయ్యకు. తెల్లవారే లోగా ఈ పాపిష్ఠివాడింకో జపం, తపం చేసుకోవలసిన నియమమున్నది— ఇప్పటికే కొంత భంగం చేశావు’ అన్నాడు సన్యాసి.

నీలకవచధారి అసహనంతో, ‘నీవు నాకేమీ చేయనక్కరలేదులే! ఎక్కడికి యెలా వెళ్ళాలో త్రోవైనా చెప్పు, తొందర!’—అని అరిచాడు. ‘త్రోవ చెప్పాలా! ఏముంది! ఈ దారినే వెళ్ళావంటే, నీరు నిలచిన ఒక పల్లపు ప్రదేశం తగులుతుంది. అది దాటిపోతే ఒకయేరు కనిపిస్తుంది, ఇప్పుడు వర్షాలు తగ్గిపోయాయి కాబట్టి, ఏరు దాటడానికి వీలుగానే ఉండవచ్చు. ఏటి అవతలి ఒడ్డు యెక్కేటప్పుడు జాగ్రత్త! అది చాల నిట్టనిలువుగా ఉంటుంది. అక్కడనుంచి, ఆయేటి ఒడ్డునే వెళ్లు. త్రోవ అక్కడక్కడ శిథిలమయిందని విన్నాను. జాగ్రత్తగా చూచుకుంటూ వెళ్ళు! అలా తిన్నగాపోతే...’

నీలకవచధారి వెంటనే అతని ధోరణికి అడ్డంవచ్చి, 'ఓ సన్యాసి మహాశయా, ఇక చాలు! నీవెన్ని చెప్పినా ఇక ఈ రాత్రి నన్ని ప్రయాణం చేయించలేవు. ప్రజల దానధర్మాలపై ఆధారపడి బ్రతుకుతున్నవాడవు నీవు. చూడగా, అందుకు నీవు అర్హుడవు కాదేమో అనిపిస్తోంది. త్రోవలో చిక్కువడ్డ నావంటి బాటసారికి ఆశ్రయమివ్వ నిరాకరించడానికి నీకు హక్కులేదు. వెంటనే తలుపు తెరుస్తావా తెరువు. లేదా, పగలగొట్టి లోపలికి ప్రవేశిస్తాను'— అని ఉరిమాడు.

సన్యాసి నిబ్బరంగా, 'ఇదిగో మిత్రమా, నీవలా తొందరపడితే ప్రయోజనంలేదు. నేను నిరాయుధుడ ననుకుంటున్నావేమో! ఆత్మరక్షణకోసం నేను గనుక ఆయుధం చేతపట్టానంటే, నీకు మరీ ప్రమాదం'— అని బెదిరించాడు.

ఈ సమయంలో, లోపలినుంచి కుక్కల మొరుగుళ్ళు వినిపించాయి. తనపై కుక్కల నుసిగొల్పడానికి సన్యాసి ప్రయత్నిస్తున్నాడని తలపోసి, నీలకవచధారి ఇక ఆవేశం పట్టలేక, కాలితో తలుపును ఊడ్చి ఒక తన్ను తన్నాడు. ఆ తాపుకు ఆ కట్టడమంతా గజగజలాడినట్లయిపోయింది.

అలాంటి తాపు మళ్ళీ తన తలుపుకు తగలడం ఇక ప్రమాదకరమని గ్రహించిన ఆ సన్యాసి వెంటనే,—'మిత్రమా, ఆగు, ఆగు! నీ బలమంతా ఆ తలుపుమీద చూపించకు! ఇదిగో వచ్చి తలుపుతీస్తున్నాను. తీసినా నీ కిక్కడ బావుకునే దేమీ లేదు'—అంటూవచ్చి తలుపు తెరిచాడు. అతడొక బలిష్ఠకాయుడు. ఉన్నతమైన విగ్రహం. గోనెపట్టాలాంటి అంగీ ధరించాడు. నడుమున నారతో అల్లిన తాడొకటి వ్రేలాడుతోంది. ఒక చేతిలో కాగడా, మరొక చేతిలో ఒక దుడ్డుకర్ర ఉన్నాయి. తలుపు తెరవడంతోటే మీద పడటానికా అన్నట్లు రెండు పెద్ద జాగిలాలు ప్రక్కన నిలుచున్నాయి. కాని, తలుపుతీసి మన నీలకవచధారి వీరవిగ్రహం చూడడంతోటే, సన్యాసి తన పూర్వపు అభిప్రాయం మార్చుకొన్నాడు గాబోలు, వెంటనే జాగిలాలను అదుపులో పెట్టి, అంతకుపూర్వంలేని మర్యాద కంఠస్వరంతో ఒప్పుతూ ఉండగా అతనిని లోనికి ఆహ్వానించాడు. సూర్యాస్తమయం అయినతర్వాత తానెవ్వరికీ తలుపు తెరవడం లేదనీ, దైవాన్నీ దైవభక్తులనూ కూడ లెక్కచెయ్యని దొంగలు ఈ ప్రాంతాల ఎక్కువగా ఉంటున్నారనీ, సంజాయిషీ చెప్పుకున్నాడు.

నీలకవచధారి ఆ కుటీరంలోనికి ప్రవేశిస్తూ చుట్టూ కలయజూచాడు. ఆకులలములతో తయారు చేయబడ్డ ఒక సెజ్జ, శిలువపై క్రీస్తువిగ్రహాన్ని చెక్కిన ఒక దారుశిల్పం, ఒక మతగ్రంథం, మోటుగా తయారుచేసిన ఒక బల్ల, రెండు కుర్చీపీటలు,—ఇవి తప్ప అచట ఇంకేమీ కనుపించలేదు. 'ఎత్తుకుపోవడానికి ఇక్కడ ఏమున్నది మహాశయా, దొంగలు వచ్చేందుకు! రెండు పెద్ద జాగిలా

లాలను కూడా పెంచుతుంటివా? ఈ జాగిలం ఒక్కొక్కటి యెంతమందికైనా జవాబు ఇవ్వగలదుగదా' అన్నాడతడు సన్యాసితో.

'రోజులు చాల ఒడుదొడుకుగా ఉన్న కారణంచేత, నా యేకాంత జీవితానికి రక్షగా, ఈ జాగిలాలను పెంచుకోడానికి ఫారెస్టు ఉద్యోగి పుణ్యమా అని నాకు అవకాశం చిక్కింది'— అంటూ సన్యాసి, తన చేతిలోని కాగడా ఒక స్టాండుకు తగిలించి, కొన్ని యెండుచిదుకులతో చలిమంట నెగడనదోసి మండించి, దానికి దగ్గరగా బల్ల కిరువైపులా కుర్చీపీటలు వేసి, నీలకవచధారిని కూర్చోమని తానూ కూర్చున్నాడు. ఒకరినొకరు సావకాశంగా చూచుకోడానికి ఇప్పుడిరువురికీ వీలు చిక్కింది. ఎవరిమట్టుకు వారే, యింత బలిష్ఠమైన విగ్రహాన్ని ఇదివరకెక్కడా చూచియుండలేదని ఒకరినిగూర్చి ఒకరు అనుకున్నారు. కొంతసేపు అలా చూచిన తర్వాత, నీలకవచధారి సన్యాసితో, 'బాబాజీ, నీవు ధ్యానభంగం చేస్తున్నా ననుకోకుండావుంటే, ముఖ్యంగా మూడే విషయాలడుగుతాను. నా గుర్రాన్ని యెక్కడ కట్టెయ్యను? ఈ రాత్రి తినేందు నాకేమున్నది? పడుకోవడం యెక్కడ పడుకోను?'—అని అడిగాడు.

సన్యాసి విశేషంగా మాట్లాడకుండానే, చేతితో ఆకుటీరంలో ఒకమూల గుర్రాన్ని కట్టెయ్యడానికి చూపించాడు. వేరొకమూల అతని పడకకు తావు చూపించాడు. పిమ్మట, ఒక అలమారులోంచి పళ్ళెంలో రెండు గుప్పెళ్ళెండు బటాణీలు తీసి అతని ముందుపెట్టి, 'ఇదిగో ఇవి తిని కడుపునింపుకో' మన్నాడు.

నీలకవచధారి బయటికిపోయి, చెట్టుకు కట్టేసివున్న గుర్రాన్ని లోనికి తెచ్చి, జీను వగైరా సామానును శ్రద్ధగా ఊడదీసి, తన అంగీని దాని వీపుమీద నిండార కప్పాడు. గుర్రంపట్ల అతడు చూపుతున్న శ్రద్ధ చూచి సన్యాసికి కూడ మనసు కరిగి, ఒక మూలనుంచి యేదో చొప్పకట్ట లాగి తీసుకొనివచ్చి గుర్రంముందు వేసి, కొంత యెండుగడ్డి అతని పడకకై యేర్పాటుచేసినచోట పరచివచ్చాడు. నీలకవచధారి మనస్సు కృతజ్ఞతాభావంతో నిండిపోయింది. సన్యాసికి తన కృతజ్ఞతను తెలియజేశాడు. పిమ్మట ఉభయులూ బల్లవద్ద భోజనానికి కూర్చున్నారు. సన్యాసి భోజనాత్పూర్వం చదవవలసిన ప్రార్థనలు చదివి, తన అతిథికి మార్గదర్శకంగా ఉండడానికా అన్నట్లు, తన అంత పెద్ద నోటిలోనూ మూడునాల్గు బటాణీగింజలు చొప్పున వేసుకుంటూ భోజనాని కుపక్రమించాడు.

నీలకవచధారి ఆ సూచన గ్రహించి, తానుగూడ అలాగే చేయడం కోసం శిరస్త్రాణం తీసి ప్రక్కన పెట్టాడు. కొంచెము పసపువాయ తేలి ఉంగరాలు తిరిగిన చిక్కని తలవెంట్రుకలు. తీర్చి దిద్దినట్లున్న కనుముక్కుతీరు

తేజోవంతమైన నీల నేత్రాలు. సుస్ఫుటమైన పెదవులు. తలవెంట్రుకలకంటె నల్లనైన మీసకట్టు. అతడొక వీరుడూ ధీరుడూ అనే సంగతి ఆ ముఖలక్షణాలనుబట్టి తేలికగా ఊహించుకోవచ్చు.

నీలకవచధారి ధారాళ ప్రవర్తనకు ప్రతిగా, సన్యాసి తన తలమీది ముసుగునుగూడ తొలగించాడు. చుట్టూ వలయాకారంగా జుట్టు ఉట్టిపెట్టి నడినెత్తిన ముండనం చేసిన శిరస్సు. వెడల్పయిన నల్లని కనుబొమలు. చక్కగా వంపు తిరిగిన నుదురు, కందురంగు తిరిగి బలుపెక్కిన బుగ్గలు. బుగ్గలనుండి క్రిందికి దిగిన నల్లని పొడుగాటి గడ్డం. చూడగా అతడు ఉపవాస వ్రతాదులచే కృశిస్తున్నవాడివలె కనపించలేదు. ఆ కండలు తిరిగిన మేను మధుమాంసాదులతో పెరిగినట్లున్నది గాని, పళ్ళలతోనూ గింజలతోనూ పెరిగినట్లులేదు. ఈ వైరుధ్యం నీలకవచధారి కనిపెట్టాడు. అతికష్టంమీద ఎలాగో ఒక గుప్పెడు యెండు బటాణీలు నమలడం పూర్తిచేసినమీదట, యేదైనా పానీయం వుంటే యిమ్మని అడగవలసిన అవసరం కలిగిందతనికి. సన్యాసి ఒక మంచినీళ్ళ కూజా అతనిముందు పెట్టాడు.

ఆ మంచినీళ్లు ఒక పరమపవిత్రమైన బావిలోనివట ! వాటితో ఇప్పటికి తాను ఆయిదువందలమంది పాపాత్ములకు క్రైస్తవమతదీక్ష ఇచ్చాడట ! ఈ రీతిగా అతను ఆ జలమాహాత్మ్యాన్ని గూర్చి ఏమేమో చెప్తూ, భక్తి పురస్సరంగా ఆ కూజాను తనగడ్డంతో స్పృశించి,ముందు తాను ఒకగుక్కెడు నీటిని పుచ్చుకున్నాడు. ఆ నీటినిగూర్చి అంతగా పొగడినవాడు ఆలా గ్రుక్కెడు మాత్రమే పుచ్చుకుని ఊరుకోడం నీలకవచధారికి చాల వింతగా తోచింది. 'బాబాజీ, ఈ గుప్పెడు బటాణీలతోనూ, గ్రుక్కెడు మంచినీళ్ళతోనూ, నీ వింత దృఢకాయుడవుగా ఉండడం చాలా ఆశ్చర్యంగా ఉంది. నీవు చూడబోతే, మల్లయుద్ధాలూ, చెడీయుద్ధాలూ, కత్తియుద్ధాలూ చేయజాలిన జెట్టివిగా కనిపిస్తున్నావు గాని, ఇన్ని ఎండు బటాణీలు తిని మంచినీళ్ళు తాగి దైవప్రార్థనలు చేసుకుంటూ అరణ్యాల్లో కాలక్షేపం చేయదగినవాడవుగా కనుపించడం లేదు. ఇది యేమి అద్భుతమో !' అని కవ్వించాడు.

'అవును. పామర దృష్టికిది వింతగా తోచడం సహజం. కాని, మేరీమాత అనుగ్రహముంటే ఈ లోకంలో ఏది అసాధ్యం ? ఆమె అనుగ్రహం వల్లనే నేను తినేది అల్పమైనా అనల్పంగా మారిపోతోంది. అంతా ఆమె దయ !'— అన్నాడు సన్యాసి.

'ఆహా ! ఎంత పుణ్యాత్ముడవు నీవు ! ఇంతటి దైవానుగ్రహపాత్రుడవైన నీ పవిత్ర నామధేయ మేమిటో ఈ పాపి తెలుసుకో వచ్చునా ?' అని అడిగాడు నీలకవచధారి.

'నన్నీ ప్రాంతాల కోప్మన్‌హార్స్టు ఫాదరీ అని పిలుస్తారు. పూజ్యపాదుడనే కితాబు కూడా చేరుస్తూ ఉంటారుగాని, నాకంతటి అర్హత లేదుగనుక నేను దానికి విలువ యివ్వను. మరి నీ పేరేమిటో నేను తెలుసుకోవచ్చునా?' అని అడిగాడు సన్యాసి.

'నన్నీ వైపుల నీలకవచధారి యని పిలుస్తూ వుంటారు. 'నల్లమందుభాయి' అనే పేరుతో పిలవడం కూడా కద్దు. విశిష్టతను సంపాదించుకోవాలనే ప్రవృత్తి లేనివాణ్ణి అయినందువల్ల నాకు ఆ పేరు వచ్చింది,'— అని సమాధానమిచ్చాడు నీలకవచధారి.

ఆ జవాబుకు సన్యాసి నవ్వు ఆపుకోలేక ఒక చిరునవ్వునవ్వి, 'నీవు చాలా బుద్ధిశాలివిలాగా కనుపిస్తున్నావు. భోగపరాయణత్వానికి అలవాటుపడిన కారణంచేత కాబోలు, నేను పెట్టిన తిండి నీకు బొత్తిగా అపోవనట్లుంది. నా రక్షణకై ఈ కుక్క అను పెంచుకోమని యిచ్చిన ఫారెస్టు ఉద్యోగి అసమర్థ నాకోసమని కొంత ఆహారం యిక్కడ దిగవిడిచి వెళ్ళిపోయాడు. నాకది పనికిరానిది అయినందువల్ల, నా జపతపాదుల ధోరణిలో దాని సంగతే మరచిపోయాను'— అని యింకా ఏమో చెప్పబోతూవుండగా నీలకవచధారి అందుకొని, 'అయితే యింకా ఆలస్యం చేస్తావేం బాబాజీ! నిన్ను చూచినప్పుడే అనుకున్నాను, యిక్కడ యెక్కడనో మంచి పుష్టికరమైన ఆహారమే వుండితీరాలని. మీ ఫారెస్టు ఉద్యోగి మంచి హుషారు కలిగిన పురుషుడులాగున్నాడు. లేకపోతే, విన్నా, నీ నోటి ఆ దంత సౌష్ఠవాన్ని చూచినవాడెవడు ఈ బటాణీలతోనూ నీళ్ళతోనూ నీవు తృప్తిపడతుంటే చూస్తూ ఊరుకుంటాడు? ఎలాగైనా నీకింతకంటె మంచిఆహారం చేకూర్చిపెట్టడానికి చూస్తాడుగాని! ఏదీ ఆఫారెస్టుఉద్యోగి దాతృత్వం యేపాటిదో చూడనీ'— అని తొందరించాడు.

సన్యాసి ఇంచుక తటపటాయిస్తూ అతనివంక చూచాడు. తన అతిథిని ఎంతవరకు నమ్మవచ్చునో తెలియక గుంజాటనపడుతున్నట్లతని వింతవైఖరి కనుపించింది. 'నీవేమీ సంకోచించవలసిన పనిలేదు. నాయందు పూర్ణవిశ్వాసం ఉంచవచ్చుననే అభయముద్ర నీలకవచధారి చిరునవ్వులోనూ, ముఖరేఖలలోనూ ద్యోతకమౌతోంది. సన్యాసి ఒకటిరెండు క్షణాలు మూగగా అతనివంక చూచి, పిమ్మట కుర్చీపీటమీదనుంచి లేచాడు. ఆ కుటీరంలోనే మరొక మూలగా ఎవ్వరికీ కానరాకుండా భద్రపరచబడిన ఒక భోషాణం తెరచాడు. దాని లోలోపలి అరలోంచి మాంసంతో తయారైన ఒక భోజ్యపదార్థం పళ్లెంనిండా తీసుకొనివచ్చి అతనిముందు పెట్టాడు. పెట్టుటయే తడవుగా, నీలకవచధారి తన కాకువుని కలిగించి దానిని పెద్ద పెద్ద ముక్కలుగా కోసి తినసారంభించాడు.

కొన్ని మాంసపుముక్కలు కడుపులోకి వెళ్ళి క్షుత్తు కొంత తీరిన తరువాత, అతడు సన్యాసివంక చూచి, 'అయితే బాబాజీ, ఫారెస్టు ఉద్యోగి ఇక్కడికి వచ్చి ఎంతకాలమయిందేమిటి?' అని అడిగాడు. సన్యాసి అనాలోచితంగా చప్పున, 'సుమారు రెండు నెల' లని సమాధానం చెప్పాడు. 'అరే భగవాన్, నీ ఆశ్రమంలో ప్రతిదీ అలౌకికంగానే ఉంది బాబాజీ! నా లెక్కప్రకారం ఈ లేడిమాంసం రెండునెలలనాటిది అయివుండడానికి ఎంతమాత్రమూ వీలులేదు. వారంరోజుల క్రితం ఈ మాంసం తాలూకు లేడి ప్రాణాలతో ఉన్నదని మరొకచోటనైతే ఖండితంగా వాదించివుందును'—అన్నాడు నర్మగర్భంగా అజ్ఞాతయోధుడు.

సన్యాసి కొంచెం కంగారుపడి, ఏమీ జవాబు చెప్పలేదు. తనకుగూడా నోరూరుతున్నప్పటికీ తినడానికి వీలులేక లోలోపల గుంజాటన పడుతున్నవాడిలాగా, గ్రుడ్లప్పగించి అతని భోజనక్రియాకలాపాన్ని చూస్తూ అలా కూర్చుండిపోయాడు.

నీలకవచధారి ఇది కనిపెట్టి, 'బాబాజీ, నేను పాలస్తీనాలో చాలకాలమున్నాను. అక్కడొక ఆచారముంది. అతిథికి పెట్టిన భోజనం దోషరహితమని నమ్మకం కలిగించడానికి, ప్రతి గృహస్థూ తాను కూడా విధాయకంగా అతిథితోపాటు కలిసి ఆ భోజనమే చేస్తూవుంటాడు. నీ వంటి పవిత్రాత్ముణ్ణి శంకించడం నా ఉద్దేశం కాదుగాని, ఈ పాలస్తీనా ఆచారం నీవు కూడ పాటిస్తే చాలా సంతోషిస్తాను'—అని అందించాడు.

సన్యాసి ముసిముసి నవ్వులు నవ్వుతూ, 'నీవంతగా కోరుతున్నావు కాబట్టి, ఈ ఒక్కసారికి మాత్రం నా ఆహార నియమం సడలించుకుంటానులే' అంటూ నెమ్మదిగా తాను గూడ ఆ మాంస భోజనాని కుపక్రమించాడు.

కొంచెముసేపటిలో, ఎవరి ఆకలి యెక్కువ, ఎవరు బాగా తింటారు, అనేదాంట్లో ఉభయులకూ పెద్ద పోటీ పడ్డట్లయింది. వాస్తవానికి ఇద్దరిలోనూ యెక్కువసేపటినుంచీ యెక్కువ ఆకలితో ఉన్నవాడు నీలకవచధారే అయినా, తిండివిషయంలో పెద్ద పట్టుబడి తుట్టతుదకు సన్యాసిదేనని తేలిపోయింది.

ఇక్కడికి ఆకలి తీరిందిగాని, మధుసేవనంగూడ చేస్తే తప్ప భోజనం పూర్తయినట్లు కాదు. 'బాబాజీ, నీకు అక్కరలేకపోయినా యింత మాంసాహారం తెచ్చి యిక్కడపడవేసిన ఆ ఫారెస్టు ఉద్యోగి, మధువుకూడా బహుశః తెచ్చివుండవచ్చు. నీవు మరచిపోయావేమో, భోషాణంలో వెతికి చూడు'—అన్నాడు మన నీలకవచధారి. సన్యాసి కండ్లికిలించి, వెళ్ళి ఒక పెద్ద సారాతిత్తిని తీసుకువచ్చి బల్లమీద పెట్టాడు. ఇరువురూ దానినిగూడ సేవించడం మొదలు పెట్టారు.

ఈ సమయంలో నీలకవచధారి సన్యాసిని యింకా ప్రసంగంలోకి దింపి, నీవు మామూలు సన్యాసుల్లాగా లేవు, నీకు వేటాడడం వచ్చునా, ఏఆయుధాలు వాడడం చేతనవును, మొదలైన ప్రశ్నలు వేయడం మొదలుపెట్టాడు. 'నీకెందుకీ వెర్రిమొర్రి ప్రశ్నలన్నీ, అతిథివిగా వచ్చావు! ఆ హద్దులో వుండడం నేర్చుకో, నేనుగనుక ముందుట్లోనే చెయ్యి చేసుకుని ఉంటే నీకీ ఆతిథ్యమే దొరికేది కాదు'— అని చిరాకుపడ్డాడు సన్యాసి. అతడలా అంటున్నకొద్దీ, అతని అచూకీ తెలుసుకోవాలన్న కుతూహలం నీలకవచధారికి మరింత మెండయింది. 'ఈ బెదిరింపులకు జడిసే రకంకాను నేను. ప్రమాదాలను ఏరికోరి ఎదుర్కొనే అలవాటుంది నాకు. నిన్ను గూర్చి ఇంకా తెలుసుకునేటంతవరకూ నేను వదలిపెట్టేదిలేదు' అన్నాడు నీలకవచధారి. 'ప్రమాదాలెదుర్కోడం నీకంత ఉత్సాహంగా ఉంటే స్నేహపూర్వకంగా నే నాచేతి చేవ ఎలాంటిదో నీకు రుచి చూపిస్తాలే! మళ్ళా ఒక సంవత్సరందాకా ఇలాంటి హద్దు మీరిన ప్రశ్నల జోలికి పోవు' అనిసమాధానం చెప్పాడు సన్యాసి. 'ఆ మాటమీదే నిలబడు. ఏ ఆయుధాలతో పోట్లాడాలని ఉన్నదో కోరుకో' మన్నాడునీలకవచధారి.' 'నేను చేతపట్టలేని ఆయుధంలేదు. అయినా వీటితో పోట్లాడడానికి నీకేమైనా అభ్యంతరమా' అంటూ సన్యాసి, మరుగున ఉన్న మరొక భోషాణంలోంచి రెండు పెద్దకత్తులు బయటికి తీశాడు.

ఆ భోషాణంలో, విండ్లూ, అమ్ములూ మొదలైన ఇతర ఆయుధాలుకూడా కొన్ని ఉన్నట్లు నీలకవచధారికి గోచరమయ్యాయి. ఆసామగ్రిలో, ఒక తంత్రీవాద్యవిశేషంకూడా ఉంది. నీలకవచధారి ఆ జంత్రాన్ని బయటికితీస్తూ, 'బాబాజీ, ఇక నీకు కష్టం కలిగించే ప్రశ్నలేవీ వెయ్యనులే. నాకు కావలసిన సమాధానం ఈ భోషాణంలోని వస్తువులే చెప్పేశాయి. ఆయుధ ప్రయోగంలో మనకిక పోటీవద్దు. ఈజంత్ర వాద్య కౌశలంలో పోటీ పడదాం' అంటూ చిరునవ్వు నవ్వాడు.

సన్యాసి నిశ్చలంగా అతనివంక చూస్తూ ఇలా అన్నాడు: 'నల్లమందుభాయి అనే పేరు నీకు ఎలా వచ్చిందో నాకు అర్థంకావడంలేదు. నిన్ను నేను చాలా అనుమానిస్తున్నాను అయినప్పటికీ, ఇప్పుడు నీవు నాకు అతిథివి గనుక, నీకు ఇష్టంలేనిదే బలవంతాన నీ పౌరుషం ఏపాటిదో పరీక్షించదలచుకోలేదు. రా, కూర్చో! మధుపాత్ర నింపుకో. తనివిదీర త్రాగి, పాడుకొని, హాయిగా కాలక్షేపం చేద్దాం. నీకేమైనా మంచి పాటలు వచ్చా? వస్తే నా ఆతిథ్యం స్వీకరించడానికి ఇకముందుకూడా నీవు ఎప్పటికీ అర్హుడవే! రా! మధు పాత్ర నింపు! గొంతుక బాగా విడిలి, చెవులకు మంచి పసందు రాగాలంటే, మధుసేవనం కంటె మించిన ఉపాయం మరి లేదు. నా మట్టుకు నేను, మధుసేవనపు మజా కొన త్రేన్పుదాకా త్రాగితే తప్ప త్రేన్పుతో ఈ జంత్రపు తీగలు మీటడానికి ఇష్టపడను. ఊఁ, కానీ! ఇంకా ఆలస్యం ఎందుకు?'

# అధ్యాయం ౧౭

సన్యాసి పలికిన పలుకులు నీలకవచధారికి మంచి హుషారు కల్పించాయి. కొన్ని మధుపాత్రలు ఒకప్రక్క ఖాళీ చేస్తూనే, జంత్రవాద్యపు తీగెలు శ్రుతిచేయ నారంభించాడు. కాని, అది ఒకపట్టాన శ్రుతి కావడంలేదు.

'బాబాజీ! ఈ జంత్రానికి ఒకతీగ లేనట్లుగా వుంది. తక్కిన తీగెలు కూడా ఎవరో, బాగా పాడుచేశారు.' —అన్నాడతడు సన్యాసితో.

'ఆ! కనుపెట్టావూ ఆ సంగతి? నీవీ జంత్రం వాయించడంలో మంచి నేర్పరి వన్నమాటే. అది యెందుకలా పాడైనా యనుకున్నావ్! మధువుది ఆ దోష మంతా, మధువుది! ఉత్తరదేశంనుండి వచ్చిన చారణుడు ఎలన్ డేలతో నేను మరీ మరీ చెప్పాను—ఏడవ మధుపాత్ర సేవించినతర్వాత ఇక ఆ జంత్రంమీద చెయ్యి వెయ్యకు, తీగెలు పాడైపోతాయని. కాని, అతను వింటేనా?— తీగెలు పాడుచేసికాని వదలలేదు'— అంటూ సన్యాసి, ఆ ఉత్తరదేశ చారణుని అతి వృత్తిని తలచుకొని శిరఃకంపంచేస్తూ, గంభీరముద్రతో మరల నింకొక మధుపాత్రి నింపి ఖాళీచేశాడు.

నీలకవచధారి యెట్టకేలకా జంత్రాన్ని ఒక మాదిరిగా శ్రుతిచేసి, కొద్దిగా ముందు ఏవో కొన్ని వాయించి, 'అయితే బాబాజీ, ఏ గేయం పాడ మంటావ్? నార్మన్ గేయమా, అచ్చమైన ఇంగ్లీషు గేయమా?' అని అడిగాడు.

'అచ్చమైన ఇంగ్లీషు గేయం. నార్మన్ గేయాలిక్కడ పాడడానికి వీలులేదు. అచ్చమైన ఇంగ్లీషువాణ్ణి నేను. ఈ చర్చికి మూలపురుషుడు సెంటు డన్‌స్టన్ నిఖారసైన ఇంగ్లీషువాడు. ఆయనకు సైతాను పదధ్వనులంటే ఎంత కంటకమో, ఈ నార్మన్ గేయాలన్నా అంతే! ఈ ఆశ్రమంలో అచ్చమైన ఇంగ్లీషు గేయాలే పాడాలి!' అన్నాడు సన్యాసి.

'అయితే, నాకు పాలస్తీనాలో పరిచితుడైన ఒక సాక్సన్ చారణుని గేయ మొకటి పాడుతా' అంటూ నీలకవచధారి పాడడం మొదలుపెట్టాడు.

చారణసంగీత కళయందు అంత అందెవేసిన చెయ్యి కాకపోయినా, అతని పాటధోరణి చూస్తే, అతడు కనీసం మంచి అధ్యాపకులవద్ద శ్రద్ధగా శిక్షణ నభ్యసించి యుండాలని తోచింది. విశేషంగా మధ్యమస్థాయిలో మాత్రమే నడిచే గొంతతనిది. మృదుత్వం తక్కువ. అయినప్పటికీ, ఈ దోషాలను చాలవరకు సవరించుకొనగల కళాకౌశలం అతనికి అలవడి ఉంది. స్వాభావికమైన లోపాలను అభ్యాసంచే ఎంతవరకు సరిదిద్దుకోవచ్చునో అంతవరకూ అతడు

దిద్దుకోగలిగాడు. అందుచే, మన వ్యాఖ్యానికంటె సమర్థులైన రసజ్ఞులవద్ద పాడి నప్పటికీ, అతని పాట బాగున్నదనే అనిపించుకుంటుందనడానికి సందేహం లేదు. ఉత్సాహం పూరించవలసిన చోట ఉత్సాహం, కారుణ్యం పూరించవల సిన చోట కారుణ్యం, పూరిస్తూ అతను పాడే ధోరణివల్ల ఆ పాటకు మరింత జీవం వచ్చినట్లయింది. అతను పాడిన పాట ఈ ధోరణిలో ఉంది:—

## యోధవరుని పునరాగమనం

వచ్చెనహో వచ్చెనహో! - మరలివచ్చె యోధవరుడు
క్రైస్తవ మతయుద్ధాల్లో - కీర్తిగన్న వీరవరుడు ॥వచ్చె॥
పాలస్తీనా పోరులలో - పాలస్తీనా గాలులలో
వన్నెదరిగి చినిగినదే - భుజకీర్తిగ వెలయు సిలువ ॥వచ్చె॥

ఎన్ని వేట్లు లాచినదో - ఎన్ని పోట్లు కాచినదో
అన్నీ అన్నీ సాక్షులె - అతనిచేతి డాలుమీద ॥వచ్చె॥
వచ్చెనుగానీ పాపము - వలపురాణి కలియలేదు
కలియరాదె యూదుడి బిగువు - కలచివైచె వీరవరుని ॥వచ్చె॥

వలపురాణి మేడచెంత - పూలపాదల పందిరిలో
పాడదొడగె సంజవేళ - పాటయే తన వలపంతగాగ ॥వచ్చె॥

ఓహోహో నా రాణీ - ఓహో అందాలరాణీ!
ఒకసారి ఇటుచూడవే - ఓ అందచందాల బరణీ! ॥ఓహో॥

చూపుమిటే నీ కోసమె - చూడపోగ ఎదురుతెన్ను
వచ్చినాడు నీకై ఆ - బంగారపుసీమనుండి ॥ఓహో॥
ధనము తెచ్చిన వాడు కాదే - ధనముతో పనిలేదు యతనికి
ఆయుధమ్ములు అశ్వరాజము - అవియె అతని కున్న ధనమే ॥ఓహో॥

ఎవని యీటెకు ఎదురులేదో - ఎవని కత్తికి తిరుగులేదో
అతడెపో నీకోసమిచ్చట - అంగలార్చెనే ॥ఓహో॥

పాలస్తీనా పోరులలో - గెలిచిన పతకాలన్నీ
తనకోసము కాదే, నీ - దరహాసము కొరకేనే ॥ఓహో॥

నిర్వక్రపరాక్రముడై - దుర్వారత దీపించిన
తేజస్ఫూర్తికి మూలమదే! - నీ మూర్తిధ్యానము! ॥ఓహో॥
తను గెల్చిన గెల్పులలో - తన ప్రియకే పేరు తెచ్చె
యోధులు సామంతులెల్ల - ఓహోయన్నారు నిన్ను ॥ఓహో॥

నీ కీర్తి పొగడెనుగా - సకలము వంది సమూహము
నీ ఘనతయె పాడెనిటుల - నిఖిలము చారణసంఘము ॥ఓహో॥

'చూచారా అదిగో ఆ - సుందరి, ఆట గూర్చున్నది
ఆమె కటాక్షమ్ము కొరకె-అన్నిలాను రణవిజయము ॥చూచారా॥

అదిగో ఆ తెలినవ్వు చూడు - డది యెటువంటిదో తెలుసా?
వందల విధవల జేసిన - వాలుకు పదనెక్కించినదది ॥చూచారా॥

ఉంగరాలు తిరిగి క్రేలు - బంగరు కురులవి చూడుడు
ఎన్ని ఉరులో అందరకుల - వెన్నికగా బలిగొన్నవవి' ॥చూచారా॥
ఓహో హో నా రాణీ - ఓహో అందాలరాణీ!
ఒకసారి యిటు చూడవే - ఓ అందచందాల బరణీ! ॥ఓహో॥

శ్రమము నాది యశము నీది - రమణీ! నా అనుగురాణీ!
నాపే రెవ్వరు నెరుగరు - నీ పేరే జగమునిండె ॥ఓహో॥
కీచురాళ్ళ తోడుగాగ - వేచియుంటి నీకేయని
ఉత్తర దిశనుండి వీచి - ఊపసాగె చలిగాలులు ॥ఓహో॥
కన్నెసిగ్గు దొంతరలను వన్నెవలపు తొలగద్రోయ
చెలియా ఇటు రావా? నన్నేలుకోవ కరుణతోడ ॥ఓహో॥

పాట పాడుతున్నంతసేపూ సన్యాసి, అర్ధనిమీలిత నేత్రుడై, ఒక విధమైన తన్మయత్వంలో మునిగిపోయాడు. కాసేపు, చేతులు కట్టుకొని పిడికిళ్ళు బిగించి కూర్చున్నాడు. మరికొంత సేపటిలో, చేతులు విప్పి గాలిలో లయానుగుణంగా ఆడించసాగాడు. ఒకటి రెండు చోట్ల పాట తారస్థాయిని అందుకోలేక పోయినప్పుడు, తన గొంతుకనుకూడ కొంత తోడుచేశాడు. పాట పూర్తికాగానే, 'భేష్! బాగున్న' దని తల పంకించి ప్రశంసించాడు.

'అయితే, మా సాగ్జన్లు చిరకాలం నార్మన్లతో కలసి మెలసి ఉన్నందుకు, ఆ దోషం ఊరకపోలేదు. వాళ్ళ యేడుపుగొట్టు పాటలజాడ్యం వీళ్ళకూ పట్టుకుంది. పాపమా వీరుడు ఇల్లువిడిచి యెందుకు వెళ్ళినట్లు? తిరిగి వచ్చేసరికి ఏమవుతుంది? అతని ప్రియురాలిని ఇంకెవరికో ఇచ్చి వివాహం చెయ్యడానికి నిశ్చయమౌతుంది. ఆమె గది కిటికీకి చేరువగా, పొదరింటిలోనుండి అతడుపాడిన ప్రేమగీతం వినిపించుకునేవారుండరు. ఇంటిప్రక్క మురుగుకాల్వలోపడి అదేపనిగా అరిచే పిల్లికూనగోల ఎంతగా పట్టించుకుంటారో ఇదీ అంతే! అంతేనా? కానీలే! ఏమైనప్పటికీ, నిజమైన ప్రేమికులకు జయం కోరుతూ ఇదిగో ఈ మధుపాత్ర సేవిస్తున్నాను. అన్నట్లు, నీవు అలాంటివాడవు కాదల్లేఉందిలే!'— అన్నాడు సన్యాసి,— ఇప్పటికప్పుడే చాలా మధుపాత్రలు ఖాళీచేయడంచేత

బుర్ర వేడెక్కి, చలువకోసం నీలకవచధారి అచటి కూజాలోని మంచినీళ్ళు కూడా ఒక గిన్నెడు పుచ్చుకోడం చూచి,

'ఏం, ఇందులో విడ్డూర మేముంది బాబాజీ! ఈ నీళ్ళు మీ చర్చి మూల పురుషుడైన సెంటు డన్‌స్టన్ ఉపయోగించినందువలన పవిత్రమైన బావిలోని వని గదా చెప్పావు? వీటిని తాగడం మంచిదేగదా!'—అని అన్నాడు నీలకవచధారి.

'నిజమే,—సెంటు డన్‌స్టన్ ఈ బావినీటితో ఎన్నో వందల మందికి క్రైస్తవమతదీక్ష ఇచ్చి వారిని ఉద్ధరించినమాట వాస్తవం. కాని, ఆయన వీటిని స్వయంగా తాగినట్లు నేనెక్కడా వినలేదు. ఈ ప్రపంచంలో ఏ వస్తువును ఎలాగ ఉపయోగించాలో ఆలాగే ఉపయోగించాలి. సన్యాసులు ఈదురో గోడో అంటూ ఉండకూడదు. ఎప్పుడూ మంచి ఉల్లాసంగా ఉండాలి. అలాంటివారికుండే ప్రత్యేకాధికారాలేమిటో మా సెంట్ డన్‌స్టన్‌కు బాగా తెలుసు'—అంటూ సన్యాసి, నీలకవచధారి చేతిలోని జంత్రం తాను అందిపుచ్చుకొని, ఈ క్రింది ధోరణిలో తానొక ప్రాత ఇంగ్లీషు గేయం అతనికి పాడి వినిపించాడు:—

### ధన్యజీవి – క్రైస్తవ ఫాదరీ

1. ఒకయేడుకాదు, రెండేడులిస్తా గడువు-
బైజాంటియంనుండి స్పెయినుదాకా తిరుగు-
ఎచ్చోట తిరిగినా, ఎన్నేళ్ళు తిరిగినా
అలసిపోయేదాక అంతటా వెతికినా-
పాదచారిగ వాడవాడలం దిరుగాడు
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి,
నీ కెందు కనరాడురా, సోదరా, ఎన్నటికి కనలేవురా!

2. ప్రియురాలికోసమై వీరపథమును మెట్టి-
ఈటెపోటులచేత గాటముగ గాయపడి-
ఈ ప్రదోషపు ఘడియ నిలుసేర్పగా బడ్డ
యోధునకు హృత్కాంతి నొసగునది నేగాద?
అతని ప్రియసఖి జగతి కాదగా పీడార్పు?
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి,
నీకెందు కనరాడురా, సోదరా, ఎన్నటికి కనలేవురా!

3. రాజైననేమి, రారాజైననే మిసీ!
రాలేరు సోదరా, ఫాదరీతో దీటు-
కాకల దొరలాలు కవులైన, సన్యాసి

యాడుపులు దాల్చరే, ధూపులనేకులు-
ధూపుల యాడుపుల మోజు మాకేదయా!
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి,
నీకెందు కనరాడురా, సోదరా, ఎన్నటికి కనలేవురా!

4. పాదచారిగ నెచట పర్యటించినగాని-
ఫాదరీకే ముదుపు ప్రథమ సత్కారమ్ము-
ఏ యెడ తిరిగినా, లేదు నిరోధమ్ము-
ఏ యెడ నిలిచినా, లేదు అభ్యంతరము-
ప్రతి గృహస్థుని గృహము ఫాదరీ గృహమెకద!
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి
నీ కెందు కనరాడురా, సోదరా, ఎన్నటికి కనలేవురా!

5. మధ్యాహ్న వేళను మన యింటి కిదెవచ్చు
ఫాదరీ యని గేస్తు లెదురు చూచెదునపుడు-
అతడు వచ్చేదాక, అతిథిపీఠ మ్మటులు
రిక్తమయ్యేయుండు, భక్తి గృహమున నిండు-
ఆనాటి రుచ్యభోజ్యముల కతడధికారి-
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి,
నీ కెందు కనరాడురా, సోదరా, యెన్నటికి కనలేవురా.

6. ఈ రాత్రి మన యింటి కిదెవచ్చు పూజ్యుండు
ఫాదరీయని గేస్తు లెదురు చూచెదునపుడు-
అతడు వచ్చేదాక, అఖిలభోజ్యమ్ములను
వెచ్చగా నుంచు నెంతో శ్రద్ధతో గృహిణి-
ఏమి యా ఆదర మ్మేమి యా ప్రీతి!
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి,
నీ కెందు కనరాడురా, సోదరా, యెన్నటికి కనలేవురా!

7. జయముహో ఫాదరికి! జయము సన్యాసికి!
అత్యంతజయము సన్యాసి యాడుపుల కెపుడు!
సన్యాసియాడుపులన సైతానుకే హడలు!
జీవితోద్యానమున జీవిత గులాబులను
ముల్లు నాటకయే కోయగలవాడు ఫాదరీ-
ఫాదరీవంటి ధన్యాత్ముండు, సుఖజీవి,
నీ కెందు కనరాడురా, సోదరా, యెన్నటికి కనలేవురా!

'చాల బాగా పాడావు బాబాజీ! నీ సన్యాసాశ్రమపు ఘనతను చాల గొప్పగా కీర్తించుకున్నావు. కాని, బాబాజీ! చివరకు సైతాను పేరెత్తావు గదా,—మతధర్మ విరుద్ధమైన వినోదకాలక్షేపాలకు నీవు లోనయ్యే వేళల్లో ఎప్పుడో ఆ సైతాను నీ లోపల ప్రవేశిస్తాడేమోనన్న భయం నీకు ఏమీ కలగడంలేదా' అని అడిగాడు నీలకవచధారి.

'ఏమిటీ? మతధర్మ విరుద్ధంగా వ్యవహరిస్తున్నానా? నేను? అబద్ధం! ఈ అభియోగం నేను పూర్తిగా నిరసిస్తున్నాను. నా చర్చి విధులను నేను తూచా తప్పకుండా సక్రమంగా నిర్వహిస్తున్నాను. రోజుకు ఏడు వేళల్లోనూ ఎప్పుడు ఏ ప్రార్థనలు జరిపించాలో అన్నీ జరిపిస్తున్నాను—అట్టి నేనా మతధర్మ విరుద్ధంగా...?' అని సన్యాసి అంటూ ఉండగా, నీలకవచధారి అర్ధోక్తిలోనే అందుకొని, 'లేడిమాంసం సిద్ధంగా దొరికే వెన్నెల రాత్రులకు మాత్రం ఈ మతధర్మం బెడద లేనట్లుంది. అవునుకదూ?' అని సాభిప్రాయంగా చూచాడు.

'అవి కొన్ని మినహాయింపులయ్యా! వాటికి దోషంలేదు. నీవంటి కువిమర్శకులెవరైనా మతధర్మములు సరిగా పాటిస్తున్నావా లేదా అని అడిగితే, ఇదే సమాధానం చెప్పమని నాకు సన్యాసదీక్ష యిచ్చిన గురువులు చెప్పారు'—అని సమాధానం చెప్పాడు సన్యాసి.

'నిజమే బాబాజీ! కాని, అలాంటి మినహాయింపులమీద నేకదా సైతాను ఒక కన్ను వేసివుంచేది? ఎక్కడ ఎవరు దొరుకుతారా అని సింహంవలె గర్జిస్తూ తిరుగుతూ వుంటాడు సైతానన్నది నీకు మాత్రం తెలియనిదా?' అని కవ్వించాడు నీలకవచధారి.

'గర్జించనీ, ఇంకా గర్జించనీ, నాకేంభయంలేదు! ఏ మానవుడికీ నేను భయపడి యెరుగను. అలాగే సైతానుకూ, వాని పరివారానికీ నేను భయపడడం కూడ వట్టిది. రమ్మను, ఎవరు రాగలరో నామీదికి, చూస్తాను! వాళ్ళ ఆటలు నాదగ్గిర సాగవు. ఆ సంగతంతా ఇప్పుడెందుకులే! నీకో రహస్యం చెప్తా విను. ఇలాంటి విషయాలు ఈవేళప్పుడు మాట్లాడే అలవాటు లేదు నాకు. తెల్లవారిన తర్వాత ప్రాతఃకాలోపాసనల పిమ్మట మాట్లాడవలసినదే!'

అంటూ సన్యాసి వెంటనే ప్రసంగం మార్చివేశాడు. ఉభయులూ మంచి ఉల్లాసంతో కేరింతలాడుతూ వినోదకాలక్షేపం చేయసాగారు. పోటాపోటీలు వేసికొని కొన్ని గేయాలు పాడుకున్నారు. ఇంతలో, ఆశ్రమం తలుపు ఎవరో బిగ్గరగా తట్టినట్లయి, వారి వినోదకాలక్షేపానికి అంతరాయం కలిగింది.

ఈ అంతరాయానికి పూర్వగాథ తెలుసుకోవాలంటే—మనము కొంచెం వెనుకకు వెళ్ళి, ఈ కథాకథనమున ఇదివరలో దిగవిడిచిన కొన్ని ముఖ్య విషయాలను ప్రస్తావించుకోవడం అవసరం.

# అ ధ్యా యం ౧౮

ఆష్బీ పోటీల విజయకిరీట ప్రదాన సమయంలో ఐవాన్‌హో స్మృతి లేకుండ పడిపోయినప్పుడు, అతని తండ్రి సెడ్రిక్ అచటికి పరుగెత్తుకొనివెళ్ళిన సంగతి పాఠకులకు తెలుసు. కుమారుని విషయమై వెంటనే తను జాగ్రత్త తీసుకోవలసినదిగా తన పరిజనులకు ఆజ్ఞాపించాలనే అతడు మొట్టమొదట అనుకున్నాడు. కాని, మాట నోటినుంచి వెలికి రాలేదు. తాను ఇంటినుండి వెడలగొట్టిన కుమారుని, అంతమంది జనసమూహంముందర తన కుమారుడని ప్రకటించి స్వీకరించడానికి అతనికి మనసొప్పలేదు. అందుచే, ఐవాన్‌హోను ఒక కంట కనిపెట్టుతూ ఉండవలసినదనీ, జనసమూహం చెదరిపోగానే అతనిని అష్బీకి తీసుకుని రావలసినదనీ మాత్రం తన ముఖ్య పరిచారకుడైన ఆస్వాల్డుకు ఆజ్ఞాపించాడు. కాని, ఆస్వాల్డు ఆ పని చెయ్యకముందే ఐవాన్‌హోను అచటి నుండి ఎవరో తీసుకొనిపోయారు. జనసమూహం చెదరిపోయిన పిమ్మట చూచేసరికి, ఐవాన్‌హో అచట కానరాలేదు.

ఏమైపోయినాడా అని ఆస్వాల్డు అంతటా కలియదిరిగి చూచాడు. కాని, ఎచ్చటా ఐవాన్‌హో కనిపించలేదు. అతని నెత్తుటితో తడిసిన స్థలమున్నదిగాని అతడు లేడు. ఎవరైనా గంధర్వులు వచ్చి ఎత్తుకొనిపోయినారా అన్నంత చిత్రంగా ఉండిపోయిందతనికి. ఇలా అతను తిరుగుతూ ఉండగా, యోధుని నౌకరు వేషంతో అచట తచ్చాడుతున్న గర్తుమీద అతని దృష్టి పడింది. గర్తేయని గుర్తుపట్టాడు. గర్తుకూడా అతనికలెనే ఐవాన్‌హో ఏమైపోయినాడా అని తిరుగుతున్నాడు. తన యజమాని పడిపోయినప్పుడే దగ్గరకు వెళ్ళడానికి ఆ బానిస జడిసాడు. తాను సెడ్రిక్‌తో చెప్పకుండా పారిపోయివచ్చినవాడు గనుక, అచటికి వెడితే తన నెవరైనా గుర్తు పడతారేమోనని అతని భయం. గుర్తుపడితే తనను పట్టుకుంటారని అతనికి తెలుసు. అతడనుకున్నట్లుగానే ఆస్వాల్డు అతనిని గుర్తుపట్టాడు. పట్టుకొని తన యజమానివద్దకు తీసుకొనిపోవడం తన విధియని అనుకున్నాడు.

ఐవాన్‌హోను గూర్చి ఆ చుట్టుప్రక్కల నున్నవారిని అడిగితే, ఎవరో మంచి దుస్తులలో ఉన్న పరిచారకులు వచ్చారనీ, ఒక యువతి పాలకీ డోలీలో పరుపుమీద పరుండబెట్టి అతనిని తీసుకపోయారనీ చెప్పారు. అంతకుమించి వివరాలు చెప్పినవారెవ్వరూ లేరు. ఈ విషయం తన యజమానికి నివేదించి, తరువాతి కర్తవ్యం అడగాలని ఆస్వాల్డు అనుకున్నాడు. వెళ్ళేటప్పుడు గర్తును కూడ పట్టి తీసుకొనివెళ్ళి యజమానికి అప్పగించాలని నిశ్చయించుకున్నాడు.

సెడ్రిక్ లోలోపల తన కుమారుని స్థితిని గూర్చి చాలా ఆందోళన చెందుతూనే ఉన్నాడు. పట్టుదలకొద్దీ ఎంత కాదని త్రోసిపుచ్చినా, ప్రకృతి సిద్ధమైన అనురాగం ఏమవుతుంది? అస్వాల్డు తెచ్చిన కబురు వినగానే, అతనికి ఒక సంగతి మాత్రం అర్థమయింది,— ఐవాన్‌హోను ఎవరో మిత్రవర్గం వారే జాగ్రత్తగా తీసుకొనిపోయి ఉంటారని. వెంటనే, కుమారునిగూర్చిన ఆందోళన వెనుకబట్టి, తిరిగి వెనుకటి కోపం— తనయెడ అవిధేయుడై ప్రవర్తించాడన్న రోషం పొడుచుకొని వచ్చింది. 'తిరగనీ వాడి యిష్టం వచ్చినట్లు! ఎవళ్ళకోసం ఈ గాయాలు తిన్నాడో వాళ్ళే చూడనీ వాటి సంగతి. వాడు నార్మన్ ఆయుధాలతో నార్మన్లు చేసే యుద్ధపు గారడీలు చేయవలసినవాడేగాని, సాగ్జన్ ఆయుధాలతో సాగ్జన్ వంశప్రతిష్ఠను నిలబెట్టగలిగినవాడు కాదు' అంటూ కసురుకున్నాడు.

దగ్గరే ఉన్నది రొవేనా. 'కార్యాలోచనలో వివేకం కనబరచడం, కార్యనిర్వహణలో ధైర్యం ప్రదర్శించడం, శూరుల్లోకెల్ల శూరుడుగానూ, సౌమ్యులలోకెల్ల సౌమ్యుడుగానూ మెలగడం,— ఇవే వంశప్రతిష్ఠను నిలబెట్టే గుణాలైతే, అతడు చేసిన తప్పల్లా, అతని తండ్రి—' అని అంటూ ఇంకా ఏమో చెప్పబోయింది.

'చాలు రొవేనా! ఈ విషయంలో నీవు ఏమి చెప్పినా నేను వినను. ప్రిన్స్ జాన్ విందుకు పోవాలి, తయారుకా! హేస్టింగ్స్ యుద్ధం తర్వాత నార్మన్లు మన జాతియెడల ఇంతవరకెన్నడూ చూపియుండని మర్యాదతో ఈనాడు మనల్ని పిలిచారు. తమ జాతిలోకెల్ల వీరాధివీరుడైనవాని నోడించిన కొడుకు సంగతి గూడ ఒక సాగ్జన్ ఎలా పట్టించుకోకుండ ఉండగలడో ఈ నార్మన్లకు చూపించడానికైనా నేను వెళ్ళి తీరాలి'—అన్నాడు సెడ్రిక్.

'వెళ్ళండి- నేనుమటుకు రాను. ధైర్యమని మీ రనుకుంటున్నది హృదయ కాఠిన్యంక్రింద జమకట్టబడుతుందేమో కాస్త యోచించుకోండి'-అన్నది రొవేనా.

'రాకపోతే రాకపోయావులే యింటిదగ్గరే వుండు! కఠినహృదయం నీది! అనుచితమైన ఒక అనురాగానికిలోనై, ఒక పీడితజాతి క్షేమాన్ని బలిచేస్తున్నావు. నాతో ఎథెల్‌స్టేను వస్తాడులే! ప్రిన్స్‌జాన్ విందుకు మేం ఇద్దరం వెడతాం' అన్నాడు సెడ్రిక్.

ఆ ప్రకారంగానే వారిద్దరూ వెళ్ళారు. అక్కడ ఏమిజరిగినదీ పాఠకులకు తెలిసేవుంది. విందు అనంతరం ఆష్బీదుర్గంలోంచి బయటికివచ్చినవెంటనే గుర్రాలెక్కి బయలుదేరారు. ఈ సమయంలో పడింది సెడ్రిక్ దృష్టి తన పరివారంలో వున్న గర్తుమీద. అసలే కోపంలో ఉన్నాడేమో, ఆ కోపమంతా గర్తుమీద వెళ్ళగ్రక్కాడు. 'అరే వెధవల్లారా, యెక్కడున్నార్రా! అస్వాల్డ్! హుండిబర్ట్!

ఈ వెధవకి సంకెళ్ళు వెయ్యకుండా వదిలేశారేమిటి? వెయ్యండి!' అని అరిచాడు ఉగ్రంగా.

పరిచారకులు గర్తు చేతులను ఒకతోలుబద్దతో కట్టేశారు. ఎట్టి ప్రతిరోధమూ చెయ్యకుండా గర్తు వానిని కట్టించుకుంటూ, 'నీ కండలోని కండను నా కంటె ఎక్కువగా ప్రేమించినందుకా ఈ శిక్ష?' అన్నట్లు సెడ్రిక్ వంక నిందాగర్భితంగా చూశాడు.

'ఇక బయలుదేరండి' అని ఆజ్ఞాపించాడు సెడ్రిక్.

'మనం కొంచెం తొందరగా గుర్రాలను పరుగెత్తించడం మంచిది. లేక పోతే, సెంటు విట్‌హోల్డు కాన్వెంటులో మన రాత్రిభోజనానికి చేసిన ఏర్పాటు అన్నీ వృధా అయిపోతాయి' అని ఆదుర్దా ప్రకటించాడు ఎథెల్‌స్టేను.

ఎట్టకేలకు, తరుణం మించిపోకుండానే ఆ కాన్వెంటు చేరుకున్నారు. దాని అధికారి ప్రాచీన సాగ్జన్ వంశీయుడు కావడంచేత, మంచి పుష్కలమైన భోజన పానీయాలతో అతిథి సత్కారం చేశాడు. ఒక్కొక్కప్పుడు అర్ధరాత్రి దాటిన తర్వాతగూడా భోజనాలు చేయడం సాగ్జనుల కలవాటు. మరునాడు ప్రాతఃకాల భోజనాదులు తనివిదీర పూర్తిచేసుకొని, తిరిగి అందరూ ముందుకు ప్రయాణమైనారు.

కాన్వెంటు గేటు దాటి బయటికి వస్తూ ఉండగా, బక్కచిక్కిన నల్లకుక్క ఒకటి, బాట పక్కన బైతాయించి, మోర యెత్తి 'మూయ్యో' మని ఏడవడం మొదలుపెట్టింది. అంతేకాదు, వీళ్ళు ముందుకు సాగిపోతూంటే వెంట దగిలి పిచ్చి గంతులు వెయ్యడం సాగించింది. సాగ్జనకు శకునాలమీద చాలా నమ్మకముంది. వారికి కుక్క ఏడుపు చాలా పెద్ద అపశకునం. 'మంచి శకునం కాలేదు. నా ఉద్దేశం—మన మిపుడు వెనక్కువెళ్ళి, తిరిగి మధ్యాహ్నం బయలుదేరడం మంచిది. ఏలనంటే, సన్యాసి, కుందేలు, ఏడుపుగొట్టు కుక్క, ఇవి యెదురువస్తే, ప్రయాణం ఆపుచేసి, తిరిగి భోజనం చేసిందాకా బయలు దేరకూడదంటారు పెద్దలు'—అన్నాడు ఎథెల్‌స్టేను. కాన్వెంటులో తాగిన ద్రాక్షాసవం రుచి అతని కింకా మరపునకు రావడంలేదు.

కాని, సెడ్రిక్ చికాకుగా ఒక పెద్ద ఉరుము ఉరిమాడు. 'ఛస్! ఇప్పుడు ప్రయాణ మాపితే తరువాత చాల చిక్కుల పడతాం. వ్యవధిలేదు. ఆ కుక్క ఎవరిదోనో కాదు, మన బానిసవెధవ గర్తుది, నాకు తెలుసు. వాడికిమల్లేనే అది విచ్చలవిడిగా తిరుగుతోంది' అని, తన బల్లెం గురిచేసి ఆ కుక్కమీద విసిరాడు.

అది నిజంగా గర్తు పెంపుడుకుక్క ఫాంగ్సే! అతనిని బంధించిన తరువాత అతని జాడ పసికట్టుతూ వచ్చి వచ్చి ఇక్కడ అతడు కంటబడేసరికి తన సంతోషం ఈ వింతధోరణిలో ప్రకటించడం మొదలుపెట్టింది. సెడ్రిక్ విసిరిన

బల్లెం కొంచెంగా గురితప్పి దాని భుజాన్ని మాత్రమే గాయపరచింది గాని, లేక పోతే ఆ దెబ్బ కది నేలకొరగి యుండవలసినదే! దెబ్బ తినడంతోటే అది, 'మాయ్యో' మని అరుస్తూ దూరానికి పారిపోయింది. గర్తుకు కలిగినదుఃఖం ఇంతా అంతా కాదు. తనను బంధించిన వానికంటె, తన కత్యంత ప్రీతిపాత్రమయిన కుక్కను ఆ దెబ్బ కొట్టినందు కతని హృదయం చాలా బాధపడింది. కట్టేసి ఉన్న చేతులతో కన్నీళ్ళు తుడుచుకోడానికి ప్రయత్నించాడుగాని సాధ్యపడ లేదు. యజమానికి వినోదం కల్పించడం కోసం ఇంతకు పూర్వంవాకా సెడ్రిక్‌తో ముందుభాగాన ప్రయాణంచేస్తూ సెడ్రిక్ కోపం చూచి నెమ్మదిగా వెనుకకు తగ్గిన వాంబాను చేరబిలిచి, 'వాంబా, నీ యంగీ అంచుతో ఈ కళ్ళు కొంచెం తుడువు, కళ్ళలో దుమారం పడి చాలా బాధపెడుతోంది. ఈ బంధనంవల్ల నేను చేతు లుపయోగించుకోలేకుండా ఉన్నాను'—అన్నాడు.

వాంబా అలాగే అతని కళ్లు తుడిచాడు. తరువాత కొంతసేపటివరకూ ఉభయులూ ఒకరి ప్రక్కనొకరు ప్రయాణం చేశారు. గర్త కొంతసేపు విచారముద్రతో మౌనంగా ఉండి, తరువాత ఇక పట్టలేక ఇలా అన్నాడు: 'వాంబా, సెడ్రిక్‌కు నౌకరిచేసే అవివేకు లందరిలోకీ, కాస్త నేర్పుతో, నీతప్పు అతనికి ఒప్పుగా కనబడేటట్లు మెలగ నేర్చినవాడవు నీవే. కనుక, అతని వద్దకు వెళ్ళి చెప్పు,—అతనికిక నేను సేవచేయనన్నానని. సేవచెయ్య డానికి భయమైనా ఉండాలి, భక్తయినా ఉండాలి. అతనియెడ నాకు రెండూ పోయాయి. అతడు నా తల నరికివేసినా సరే, నన్ను కొరడాలతో కొట్టిం చినా సరే, ఏంచేసినా సరే, నా భయభక్తు లతడిక సంపాదించలేడు. పో, వెళ్ళి చెప్పు, గర్త ఇక అతని సేవ వదులుకుంటున్నాడని!'

వాంబా యిలా సమాధాన మిచ్చాడు: 'ఇదిగో గర్త్! నేను వట్టి వెంగలి ననే మాట నిజమే కాని, నీవు చెప్పే యీ వెంగలిపనిమాత్రం చెయ్యను. సెడ్రిక్ దగ్గర ఇంకొక బల్లెం ఉన్నది తెలుసా? సెడ్రిక్‌కు గురితప్పడం ఎన్నడోగాని జరగదు.'

'అయితే కానీ! నన్ను చంపుతాడన్న భయం నాకేమాత్రంలేదు. నిన్నటి రోజున, నా చిన్నదొరను విల్ఫ్రెడును— నెత్తురోడుతూ పడియున్నవానిని— నిర్దయగా విడిచి చక్కావచ్చాడు. ఇవాళ నా కళ్లముందరే, ఈ ప్రపంచంలో నేనంటే కనికరం గల ఒకే ఒకజీవిని— నా కుక్కను చంపడానికి చూచాడు. అతనిని నే నెన్నటికీ మన్నించేది లేదు'— అన్నాడు గర్త్.

కుటుంబ కలహాల్లో శాంతిసూచకగా వ్యవహరిస్తూ ఉండడం వాంబాకు అలవాటు. అందుచే అతడు గర్త్‌తో, 'ఇదిగో గర్త్! మన పెద్ద దొరకు ఫాంగ్స్‌ను చంపాలనిగాని, గాయపరచాలని ఉద్దేశ మెంతమాత్రమూ లేదు. భయపెట్టాలనుకున్నాడు, అంతే! బల్లెం విసిరేటప్పుడు, రికాబులపై కొంచెం

లేచాడు నీవు గమనించావో లేదో! ఎందుకు లేచాడు? బల్లెం ఫాంగ్సుకు సరాసరి వెళ్ళి తగలకుండా పైనుంచి దూసుకుపోవాలని లేచాడు. కాని, సరిగ్గా ఆ సమయానికి పైకి గంతువేసింది ఫాంగ్సు. అందుచే బుజందగ్గిర కొద్దిగా గీరుకొనిపోయింది. కాసంత తారుపూస్తే ఆ గాయం మానిపోతుంది, నేను చేస్తాగదూ అవని'—అని సమాధాన పరుపజూచాడు.

'అంతేనంటావా? అంతేనంటావా?— కాదు, కాదు! ఆ బల్లెం బాగా గురిచూచి విసిరినదే! విసిరినవాని అక్కసునంతా వెళ్ళగ్రక్కుతూ అది గాలిలో చాల జోరుగా 'హుస్సు' మని ధ్వనిచేస్తూ వెళ్లింది,—గురితప్పినందుకు చింత పడుతోందా అన్నట్లు, నేలలో గుచ్చుకొనిపోయిన తర్వాతకూడా అది కంపించడం నేను చూచాను. లేదు లేదు, ఈ యజమానికి నే నిక సేవ చెయ్యను'—అని గర్త్, విచారముద్రలో మునిగి తిరిగి మౌనం వహించాడు; వాంబా తిరిగి ఏమి చెప్పినా అతనికి నచ్చేటట్లులేదు.

వీరి పరిసంగం ఈ విధంగా ఇక్కడ నడుస్తూ ఉండగా, ముందు ప్రయాణిస్తూన్న సెడ్రిక్ ఎథెల్ స్టేనులు దేశపరిస్థితిని గూర్చి మాట్లాడుకుంటున్నారు. రాజవంశంలో పుట్టిన విభేదాలు, నార్మన్ సామంతులమధ్య చెలరేగిన సంఘర్షణలు, పీడితులైన సాక్సనులు నార్మన్ దాస్యంనుండి విముక్తి పొందడానికి గాని, కనీసం ఈ రానున్న అంతఃకల్లోలాలలో ఒక విధమైన ప్రాముఖ్యం, స్వాతంత్ర్యం సంపాదించడానికి గాని ఉన్న అవకాశాలు,—ఇవన్నీ ప్రస్తావనకు వచ్చాయి. ఈ విషయాలపై మాట్లాడడం సెడ్రిక్ కు మంచి హుషారుగా వుంది. తన జాతికి స్వాతంత్ర్యం సాధించాలనేది అతనికి అత్యంత ప్రీతికరమైన విషయం. దాని కోసమే అతడు తన కుటుంబ సౌఖ్యాన్నీ, తన కన్నకొడుకు సౌఖ్యాన్నీ కూడ బలిచేసుకున్నాడు. సాక్సన్లు తిరిగి స్వాతంత్ర్యం సాధించుకోవాలంటే, తమలో తాము ముందు కలిసికట్టుగా ఉండి, ఒకే నాయకుని క్రింద వ్యవహరించాలి. ఆ నాయకుడు సాక్సన్ రాజవంశానికి చెందినవాడై ఉండాలనటంలో ఎట్టి సందేహమూ లేదు. అలా అయితేనే యీ పథకం కొనసాగుతుందని సెడ్రిక్ తన అంతరంగిక సాక్సన్ మిత్రులకు విస్పష్టం చేసిఉన్నాడుకూడ. ఎథెల్ స్టేనులో, తక్కినవాటి మాట ఎలా ఉన్నా, ఈ యోగ్యత ఒకటి ముఖ్యంగా ఉంది. నాయకుని కుండవలసిన ధీవిశేషాదులంతగా లేకపోయినా, అతనిలో ఒక విధమైన మంచితనం ఉంది, పిరికివాడు కాదు. సైనిక శిక్షణ నభ్యసించుకొన్నవాడు. తనకు తోచకపోతే తనకంటె బుద్ధిశాలులైనవారి మాట విననేర్చినవాడు. అన్నిటికంటె ముఖ్యంగా, ఉదారుడు, బంధుప్రీతి, స్నేహవాత్సల్యం కలిగినవాడు. అయితే, సాక్సన్ జాతి కంతకీ అధిపతిగా అతనిని ఎన్నుకోడానికి ఈ విధమైన అర్హతలు అతనిలో ఎన్ని ఉన్నా, 'అల్ఫ్రెడ్ ది గ్రేట్' వంశానికి సాక్షాత్తుగా చెందిన రోవెనా ఆ

పదవికి ఉత్తమాధికారిణియని సాగ్జన్లలోనే చాలామందికి అభిప్రాయముంది. రొవెనా తండ్రి గొప్ప ధీరుడు, ఉదారుడు, విజ్ఞాని. అతడు గతించినప్పటికీ అతనిని వారు భక్తివిశ్వాసాలతో స్మరించుకోడం మరిచిపోలేదు.

ఈ రెండు పక్షాలిలా ఉండగా, కావా లనుకుంటే సెడ్రిక్ తాను మూడో పక్ష మొకటి,—కనీసం వాటంత ప్రబలమైనదే,—లేవదీసి, ఆ ఆధిపత్య స్థానాన్ని తాను ఎగదన్నుకుపోయేందుకు ప్రయత్నించి ఉండేవాడే. రొవెనా ఎథెల్‌స్టేనుకంటె తాను సాక్షాత్తూ రాజవంశంలోనివాడు కాకపోయినా, ఆలోపం తీర్చిరాజు చెయ్యగల ధైర్యసాహసాదు లతనిలో మెండుగా ఉన్నాయి. అన్నిటికంటె మించి, సాగ్జన్ జాత్యభిమానం అతని కున్నంతగా మరి యెవ్వరికీ లేదు. అందుకనే అతనికి 'సెడ్రిక్ ది సాగ్జన్' అనే పేరువచ్చింది. అభిజాత్య విషయంలోనైనా, రొవెనాఎథెల్‌స్టేనులకు కొంచెం లొజ్జు కావచ్చునుగాని, సాగ్జనులలో మరెవ్వరికీ తీసిపోరు. కాని, అతనిలో స్వార్థపరత్వం పిసమైనా లేని కారణంచేత, తన పేరుతో మూడో పక్ష మొకటి బయలుదేర దీయడం మతరామా అతనికి గిట్టలేదు. రొవెనా ఎథెల్‌స్టేనులకు పెండ్లి చెయ్యడం ద్వారా, ఉన్న ఆ రెండు పక్షాలనూ ఏకంచేసి విభేదాలు సమయింప జెయ్యాలనే మహదాశయంతో కృషిచేస్తున్నా డతడు. ఈ పథకానికి అవరోధంగా తయారయింది అతని కుమారునికీ, రొవెనాకూ ఉన్న అన్యోన్యప్రేమ. కుమారుణ్ణి అతడు ఇంటినుండి వెడలగొట్టడానికి మూలకారణం ఇదే!

కుమారుడు విల్ఫ్రెడ్ కంటికి కనుపించకుండా గనుక పోతే, రొవెనా అతనిమీద తన అనురాగాన్ని క్రమేణా వదలుకుంటుందని సెడ్రిక్ ఆశ పడ్డాడు. కాని, అతనికి ఆశాభంగ మయింది. ఇందుకు అతడు రొవెనా కిచ్చిన శిక్షణకూడా కొంత కారణం. ఆల్ఫ్రెడ్ అంటే సెడ్రిక్ దృష్టిలో సాక్షాత్తూ ఒక దేవత. ఆ మహారాజు వంశంలో మిగిలిన మొలక రొవెనా. అందుచే ఆమెను ఒక రాకుమారిని చూచేటంత గౌరవ మర్యాదలతో చూడడం అభ్యసించాడు. అతని యింటిలో, ఆమె యిచ్ఛకు తిరుగులేదు. సెడ్రిక్ కూడా, ఆ చిన్న పరిధిలోనైనా ఆమె రాచరికం చెలామణి చేయించాలన్న నిశ్చయం కలవానివలె, ఆమె అనతిని తలదాల్చేవారిలో అగ్రేసరుడు తానుగా వ్యవహరించడానికి కుతూహలపడుతూ వుండేవాడు. ఈ విధమైన పెంపకంలో, ఒక రకంగా నిరంకుశంగాకూడ తన యిచ్ఛను నడిపించుకోడానికి అలవాటుపడిన రొవెనా, తాను ప్రేమించేవానిని ప్రేమించరాదన్నా, ప్రేమించనివానిని ప్రేమించితీరాలన్నా, నిరసించడంలో ఆశ్చర్య మేమున్నది? తలిదండ్రులమీద సామాన్యంగా ఎంతో విధేయతతో ప్రవర్తించడానికి అలవాటు పడిన కన్నెలుకూడా, ఇలాంటి పరిస్థితుల్లో తరచు ఆ తలిదండ్రుల అధికారాన్ని ధిక్కరించడం సహజం. కనుక రొవెనా, తన అభిప్రాయాలను స్పష్టంగా

ప్రకటించడానికి ఏమాత్రమూ వెనుకాడలేదు. ఆమె అభిప్రాయాలకు తలయొగ్గడం అలవాటుచేసుకొన్న సెడ్రిక్, ఈ విషయంలో ఏమిచెయ్యాలో, ఏ విధంగా తన మాటను ఆమె శిరసావహించేటట్లు చెయ్యాలో, తోచక ఉక్కిరి బిక్కిరి అయ్యాడు.

నీవు రాణీవి కాబోతున్నావు సుమా అనే ఆశ ఒకటి ఆమె కనుల యెదుట మెరపింపజేసి ఆమె మనస్సు త్రిప్పజాలడు గాని ప్రయోజనం లేకపోయింది. అతని పథకం నెరవేరేది కాదని ఆమె నిశ్చయం. ఒకవేళ నెరవేరేదైనా, తనకు సంబంధించినంతవరకది అపేక్షణీయం కాదని నిర్ణయించుకుంది. విల్ఫ్రెడ్ నే తాను వివాహమాడుతాననీ, అది సాగని పక్షంలో బ్రహ్మచారిణిగా ఏ కాన్వెంటులోనైన చేరిపోతానుగాని ఎథెల్‌స్టేను ప్రక్క సింహాసనంమీద కూర్చోబోయేది లేదనీ స్పష్టంగా చెప్పివేసింది. ఎథెల్‌స్టేనంటే ఆమె కెప్పుడూ ఏవగింపే ఇదివరకు. ఇప్పుడు, అతనిమూలంగా తనకు కలిగిన చిక్కులనుబట్టి, అది కేవలం ద్వేషంగాకూడా మారిపోయింది.

అయితే, ఆడవాళ్ళ పట్టుదలలు దీర్ఘకాలం నిలువవని సెడ్రిక్‌కు ఒక నమ్మకం. అందుచే, రొవెనాకు ఇష్టంలేకపోయినా, ఈ వివాహం జరగడానికి తాను చెయ్యవలసిన ప్రయత్నాలన్నీ చేస్తూనేవున్నాడు. తద్వారా సాగ్జన్ జాతికే ఒక గొప్ప సేవ తాను చేసినట్లవుతుందని అతని భావన. అష్బీలో తన కుమారుడు హఠాత్తుగా ప్రత్యక్షమై, ఆ రీతిగా విజయం సాధించడం అతని ఆశలకు గొడ్డలిపెట్టుగా తగిలింది. మొట్టమొదట ఒక క్షణంసేపు అతనిలోని పితృవాత్సల్యం అతని జాత్యభిమానాన్ని అహంకారాన్ని అణగద్రొక్కినమాట నిజం. కాని, తిరిగి అవి ద్విగుణీకృత ప్రాబల్యంతో వెంటనే విజృంభించాయి. ఈసారి అతడు, రొవెనా ఎథెల్‌స్టేనుల వివాహానికి గట్టిగా ఒక ప్రయత్నం చేసితీరాలని నిశ్చయించుకున్నాడు. దానితో పాటుగా, సాగ్జన్ జాతి స్వాతంత్ర్యాన్ని తిరిగి సంపాదించడానికి వలయు సన్నాహాలుకూడా, హుటాహుటిగా చెయ్యాలని దృఢ సంకల్పం చేసుకున్నాడు.

ఈ చివరి విషయాన్ని గూర్చిన సంభాషణే అతడిప్పుడు ఎథెల్‌స్టేను ముందర ఎత్తి, అతనిలో ఉత్సాహశక్తిని మేల్కొల్పడానికి తంటాలుపడుతున్నాడు. ఎథెల్‌స్టేను చండితనం అతనికి మధ్యమధ్య నిరుత్సాహం కల్పిస్తూనేవుంది. ఎథెల్‌స్టేను అంత స్వాతిశయం లేనివాడు కాదు. తన అభిజాత్యాన్ని గురించీ, రాచరికానికి తనకుగల వారసత్వపు హక్కును గురించీ తన చెవులవద్ద అందరూ వక్కాణిస్తూవుంటే, అతనికి హాయిగానే వుంటోంది. కాని, ఆ హాయితోనే అతని స్వాతిశయం తృప్తిపడిపోయింది. ప్రమాదాలను యెదుర్కొనే ధైర్యం అతనికి లేకపోలేదుగాని, ఏరి కోరి ప్రమాదాలు కొనితెచ్చుకోడం అతనికి గిట్టదు. సాగ్జన్ జాతి స్వతంత్రం కావాలనే విషయంలోనూ,

స్వతంత్రమైనప్పుడు దానికి అధిపతి కావలసినది తానే అన్న విషయంలో నేమి, అతనికెట్టి అభిప్రాయభేదమూ లేదు. కాని, ఈ హక్కులను సాధించే ఉపాయాలను అన్వేషించవలసి వచ్చినప్పుడు మాత్రం, అతడు తన మామూలు చండితనం వదలిపెట్టలేడు. ఎట్టి కార్యనిశ్చయమూ చేయలేక, 'ఇప్పుడు కాదులే మరొకప్పు'డన్న ప్రవృత్తిలో ఉండిపోతాడు. సెడ్రిక్ ఎన్ని రకాలుగా ఉత్సాహపరిచినా ఏమీ ప్రయోజనం లేకపోయింది. ఎర్రగా కాలిన యినప గుళ్లు నీళ్లలో పడితే ఏమవుతుంది? 'చుంయ్' మని ఒక చిన్న శబ్దమై, కొద్దిగా పొగవచ్చి, వెంటనే ఆ గుళ్లు చల్లారిపోయి ఊరుకొంటాయి.

అలసిపోయి కదలనిరాకరించిన అడగుర్రాన్ని రికాబులతో తెగపొడిచి నడపడంవల్ల ఎంత ప్రయోజనమో, చల్లారిపోయిన యినపకడ్డీలను సమ్మెట వేటులతో సాగదీయ యత్నించడం ఎంత ఉపయోగకరమో, అంతటిదిగానే కనిపించింది ఎథెల్‌స్టేనును ఉత్సాహపరచడం. సెడ్రిక్ ఇక ఆ ప్రసంగం నిలిపి, తనవెనుక వస్తున్న రొవెనాతో కాసేపు ముచ్చటింప నభిలషించాడు. కాని, ఆ సంభాషణ కూడ అతనికి హాయిగా నడవలేదు. సెడ్రిక్ ఆమెను పలకరించక పూర్వం, ఆమె తన అనుగు పరిచారికయైన ఎల్గితాతో ఐవాన్‌హోను గూర్చిన ప్రసంగమేదో చేస్తోంది. సెడ్రిక్ పలకరించడం మూలంగా దానికి అంతరాయం కలిగింది. ప్రసంగవశంలో ఎల్గితా కొంటెతనంగా ఆనాటి పోటీల్లో ఎథెల్‌స్టేను తలక్రిందులుగా క్రిందపడ్డ ప్రస్తావన తెచ్చి, రొవెనాకూ తనకూ వున్న కసి తీర్చుకుంది. ఆ ప్రస్తావన సెడ్రిక్‌ను యెంత ఉక్కిరిబిక్కిరి చేస్తుందో వేరుగ చెప్పనక్కరలేదు. ఈ రోజు ప్రయాణమంతా మొత్తంమీద సెడ్రిక్‌కు చికాకు కలిగించేదిగానే వుంది. అందుచే, అతడేమీ చేయడానికీ తోచక, లోలోపల యెన్నోసార్లు ఆ పోటీప్రదర్శనాలనూ, వాటిని జరిపినవారినీ తిట్టుకున్నాడు. వాటిని చూడాలనే బుద్ధిపుట్టి తాను బయలుదేరి వచ్చినందుకు తననుకూడ నిందించుకున్నాడు వారితో పాటుగానే.

మధ్యాహ్నమయ్యేసరికి, ఒక సెలయేరు ప్రక్కనగల నీడపట్టుకు చేరారు ప్రయాణికులు. ఇక్కడ కాసేపు విశ్రమించి సెంటు విట్‌హోల్డు మఠాధికారి ఒక కంచరగాడిద మూపుపై సమృద్ధిగా కట్టించిపంపిన ఆహారపదార్థాలు భుజిద్దామని ఒక ప్రతిపాదన చేశాడు ఎథెల్‌స్టేను. అలాగే అక్కడ విశ్రమించడం జరిగింది. తిరిగి బయలుదేరడానికి కొంత ఆలస్యంకాక తప్పలేదు. ఈ లెక్కను ఈ రాత్రంతాకూడ ప్రయాణంచేస్తే తప్ప రోథరువుడ్డు చేరుకునేటట్లు కనుపించలేదు. ఎంత సమయం కూడివచ్చినా కూడివచ్చినట్లే ననే ఉద్దేశ్యంతో, పూర్వం కంటె ఎక్కువ వేగంతో ప్రయాణం సాగించడం మొదలుపెట్టారు.

# అధ్యాయం ౧౯

ప్రయాణికులు పోయి పోయి ఒక అడవిదగ్గరకు చేరుకున్నారు. ఇక ప్రయాణం ఆ అడవి దారులవెంట సాగించవలసివుంటుంది. అది ఆ కాలంలో బందిపోటుదొంగలకు బాగా పేరుపడ్డ అడవి. దారిద్ర్యబాధ చేతనూ, యజమానులు పెట్టే హింసలచేతనూ నిరాశావశులై యీ వృత్తిలోకి దిగినవారే సర్వసామాన్యంగా ఈ దొంగలందరూ కూడ. పెద్ద పెద్ద ముఠాలుగా వీరీ అడవులలో కాపురముంటూ దారులుకొట్టి జీవిస్తూ ఉండేవారు. ఆనాటి పోలీసు బలగాలకు వీరిని అరికట్టే శక్తి ఉండేదికాదు. అయితే, వీరివలన తమకు ఎట్టి ప్రమాదమూ ఉండబోదనే ధైర్యంతోనే ఉన్నారు సెడ్రిక్ ఎథల్‌స్టేనులు. ఏలనంటే, విదూషకుడైన వాంబానూ, బందీయైన గర్తునూ మినహాయించినా, తమ పరివారంలో పదిమంది నౌకర్లు పోరాడగలిగినవారున్నారు. అది అలా ఉండగా, తమ శౌర్యం, తమ అభిజాత్యం కూడా తమకు రక్షణగా నిలువగలవనే ధైర్యం సెడ్రిక్ ఎథల్‌స్టేనుల కున్నది. ఈ బందిపోటు దొంగలు సర్వసాధారణంగా సాక్సన్ జాతీయులైనందువల్ల, తమ తోటి జాతీయుల జోలికీ, వారి ఆస్తిపాస్తుల జోలికీ పోరని చెప్పుకుంటూ ఉండడం వారికి తెలుసు.

ప్రయాణికులు ముందుకు సాగుతూ వుండగా, ఆ సమీప ప్రదేశంనుండి హఠాత్తుగా ఆర్తనాదాలు వారికి వినిపించాయి. ఆ వినిపించిన దిక్కుగా గుర్రాలు పరుగెత్తించి చూడగా, అక్కడ ఒక డోలీ నేలమీద దించి వుంది. డోలీ ప్రక్కన ఒక యువతి, యూదీయ పద్ధతిలో విలువైన దుస్తులు దాల్చి కూర్చుండివుంది. ఇంకొక వృద్ధుడు,— అతడు కూడ యూదీయుడే యని అతని నెత్తిమీది పసుపుపచ్చని టోపీనిబట్టి ఊహించవచ్చు,— ఆదుర్దాగా ఇటూ అటూ తిరుగుతూ వివిధ చేష్టలతో తన భయాందోళనలను వెలువరించుకుంటున్నాడు.

ఏమిటి మీకు వచ్చిన ప్రమాదమని సెడ్రిక్ ఎథల్‌స్టేనులు అడుగగా ఆ వృద్ధుడు,— అతడు మన పూర్వపరిచితుడు ఐసాకే,— కొంతసేపటిదాకా విపరీత భయాందోళనలకు లోనై, క్రైస్తవులను శాపనార్థాలు పెట్టుతూ సరియైన సమాధానమివ్వలేదు. ఎలాగో చివరకు తెప్పరిల్లి అతడు చెప్పినదానివలన తేలిన సారాంశమిది: ఆష్బీనుంచి బయలుదేరేటప్పుడే ఒక ఆర్గురు అంగరక్షకులను ఐసాక్ తనవెంట వచ్చుటకు మాట్లాడుకున్నాడు. ఆ డోలీలో ఉన్నది జబ్బుగా

వున్న ఒక మిత్రుడు. ప్రయాణం ఇంతవరకు బాగానే సాగింది. కాని ఇక్కడికి వచ్చేసరికి, కట్టెలు కొట్టేవాడొకడు, ముందు కొంతదూరంలో ఒక పెద్ద దొంగలముఠా పొంచివున్న సంగతి చెప్పాడు. ఆ మాట వినగానే ఆ అంగరక్షకులు తాము పలాయనం చిత్తగించడమే కాక, పోతూ పోతూ ఆ డోలీకి పూన్చిన గుర్రాలను కూడ ఊడదీసి తోలుకొని పారిపోయారు. ఇసాక్ స్థితి వట్టి నిరాధారం అయిపోయింది. రక్షించేవారు లేరు. వెనుకకు వెళ్ళిపోదామన్నా ఉపాయంలేదు. దొంగలు వచ్చి ఏ క్షణాన మీదపడి తన్ను దోచుకొని చంపివేస్తారోనన్న భయంతో తల్లడిల్లిపోతున్నాడు. 'మీకు పుణ్యముంటుంది, దయచేసి మమ్మల్ని మీ రక్షణ క్రిందికి తీసికొని మమ్మీ ఉపద్రవం నుండి తప్పించండి. మీరు వీరపురుషులవలె నున్నారు. ఈ ఉపకారం మాకు చేశారంటే ఎన్నటికీ మరచిపోము. యూదులను క్రైస్తవులు హింసించడం ప్రారంభించాక ఇంతకుపూర్వ మెన్నడూ ఇలాంటి ఉపకారం మా జాతికి జరిగియుండలేదని సంతోషిస్తాము. మమ్మల్ని కాపాడండి'—అని ప్రాధేయపడ్డాడు.

ఎథెల్‌స్టేనుకు సహజంగా జ్ఞాపకశక్తి కొంచెం తక్కువేయైనా, అత్యల్పవిషయాలు కొన్ని వాటంతటవే అతనికి జ్ఞాపకముంటూ ఉంటాయి. 'నీచుడా! నీవే కదూ, అష్బీపోటీల సందర్భంలో గ్యాలరీ మీదికి ఎక్కివచ్చి మమ్మల్ని అవమానపరచింది? నీ సంగతి మాకక్కరలేదు. దొంగలతో పోట్లాడుతావో, పారిపోతావో, రాజీ పడతావో, ఏమైనా చేసుకో, మేము నీకు సాయపడేది లేదు. లోకంమీద పడి తెగదోచుకునే మిమ్మల్ని, దొంగలు దోచుకుంటే ఎంతమాత్రమూ తప్పులేదనే నేనంటాను'—అని అతడు ఇసాక్‌పై కోపం వెలిగ్రక్కాడు.

సెడ్రిక్‌కు ఈ సమాధానం నచ్చలేదు. 'అలా కాదు. రెండు గుర్రాలతోపాటుగా ఇద్దరు పరిచారకులను వీరికి తోడిచ్చి, మన మిప్పుడు గడచి వచ్చిన గ్రామానికి చేర్చిరమ్మందాం. ఇద్దరు తగ్గినందువల్ల మనకు వచ్చే విశేష ప్రమాదమేమీ లేదు. మీ చేత కృపాణముండగా, ఈ తక్కినవారంతా అండమై ఉండగా, దొంగలను ఇరవైమందినైనా అవలీలగా ఎదుర్కొనగలమనుటకు సందేహంలేదు'—అన్నాడతడు ధీరప్రవృత్తితో.

దగ్గరలో దొంగలున్నారన్న మాట వినగానే భయవిహ్వలురైన రోవెనా, సెడ్రిక్ ప్రతిపాదనను బలపరచింది. అంతట, ఇంతసేపూ కడు దీనత్వంతో ముడుచుకొని నిలబడ్డ రెబెకా, మెల్లిగా అచటినుండి కదలి, సరాసరి రోవెనా ఎక్కిన గుర్రంచెంతకు పోయి, ఆమెకు మోకాలిపై వంగి అభివాదంచేసి, ప్రాచ్యదేశీయ పద్ధతిలో ఆమె చేలాంచలం ముద్దిడుకొని, లేచి తన మేలిముసుగు తొలగించి నిలువబడి, తనపై కనికరించవలసిందని, మీ రక్షణక్రింద

మీతోపాటు ముందుకు ప్రయాణించనివ్వవలసిందనీ, ప్రార్థించింది. 'నేనింతగా ప్రాధేయపడుతున్నది నాకోసం కాదు. ఆ వృద్ధునికోసమూ కాదు. మా జాతికి అపకారం చెయ్యడం క్రైస్తవుల కెల్లరికీ ఒక సుగుణవిశేషంగా కాకపోయినా, ఒక అల్పదోషంగా భావిస్తూ వున్నారని నాకు తెలుసు. ఆ అపకారం పట్టణంలో జరిగినా పల్లెలో జరిగినా, అడవిలో జరిగినా యెడారిలో జరిగినా, ఎక్కడ జరిగినా మాకది ఒక్కటే. కాని, నే నిప్పుడడుగుతున్నది ఈ దేశంలో చాలామందికి,—ముఖ్యంగా మీకు కూడా,—అత్యంత ప్రేమాస్పదుడైన ఒకానొక వ్యక్తి రక్షణ. ఈ డోలీలోని రోగిని ఎలాగైనా మీ రక్షణ క్రిందికి తీసుకొని ఈ ఉపద్రవం దాటించాలి. లేనియెడల,— అతని కేమైన అపాయం వాటిల్లితే మాత్రం,— జీవితాంతంవరకూ మీరు చింతపడవలసి వస్తుంది, నే నడిగినదానిని నిరాకరించినందుకు,'—అనియామె అభ్యర్థన.

రొవీనాకు ఆ అభ్యర్థన బలవత్తరంగా నాటి, సెడ్రిక్‌తో, 'ఈ వృద్ధుడు పాపం చాల దుర్బలుడు. ఈ పడుచు చాలా చిన్నది. వీరి మిత్రుడు చాలా ప్రమాదస్థితిలో ఉన్నాడు. వీళ్ళు యూదులైనప్పటికీ, క్రైస్తవులమైన మనం వీళ్ళ నిట్టి విపత్పరిస్థితిలో వదలివెయ్యడం తగదు. రెండు కంచర గాడిదలమీది సామాను తక్కిన కంచరగాడిదలమీదికి సర్ది, ఈ డోలీ ఆ కంచరగాడిదలకు కట్టండి. ఈ ముసలీ, అతని కుమార్తె మన గుర్రాలమీద వస్తారు'—అని తన ఆశయం వ్యక్తంచేసింది.

సెడ్రిక్ వెంటనే దాని నామోదించాడు. కాని, ఎథెల్‌స్టేను దీనికొక షరతు కలిపాడు. 'వీళ్ళను మన అందరికంటే వెనుకగా రమ్మనండి. వీళ్ళకు రక్షగా తన యేకుపంది మాంసఖండరపు డాలుతో వాంబా వీరి వెంట వస్తూవుంటాడు'—అని అతని ప్రతిపాదన. కాని, వాంబా వెంటనే తడుముకోకుండా సన్నగా అప్పుడే అంటించాడు—'నాదగ్గిర ఇప్పుడా డాలు లేదు. అది అప్పుడే పోయింది. పెద్ద పెద్ద హేమాహేమీ అనిపించుకున్న యోధులే డాళ్ళు పోగొట్టుకుంటే నేనొక లెక్కా!'—అని. ఆ దెబ్బ నసాళమంటి ఎథెల్‌స్టేను ముఖం మాడేంది. అతడెంత ఖిన్నుడయ్యాడో రొవీనా అంత సంతోషించింది. ఎథెల్‌స్టేను చేసిన క్రూరహాస్యానికి పరిహారం చెయ్యడం కోసమా అన్నట్లు రెబెకాను వచ్చి తన గుర్రంమీద తన ప్రక్కను కూర్చోమన్నది.

'మా సంఘాని కిట్టి మర్యాద యివ్వడం నా రక్షకురాలికి న్యూనత కల్పిస్తుంది, నేను అలా కూర్చోగూడదు'—అన్నది రెబెకా,— గరువతనం మిళితమైన వినయంతో.

ఈలోపున, రొవీనా ఆజ్ఞాపించిన ప్రకారం, సామానుల సర్దుబాటు చకచకా జరిగిపోయింది. బందిపోటువాండ్ర మాట వినిపించేసరికి ఎల్లరినీ

అపరిమత్తత అవహించింది. సంధ్యాకాలం సమీపిస్తోంది. ఈ సందడిలో గర్తును అతడెక్కిన గుర్రంమీదనుంచి దింపారు. తన చేతులకు కట్టిన కట్టు బాధపెడుతోంది గనుక, కొంచెం సడలించవలసిందిగా వాంబాను కోరాడతడు. వాంబా వానిని అలాగే తిరిగి కట్టడంలో, బుద్ధిపూర్వకంగానే, అతడు వదలించుకొని పారిపోవడానికి వీలుగా కట్టాడు. గర్తు నెమ్మదిగా కట్టు వదిలించుకొని, ప్రక్కనున్న ఒక పొదలోనికి దూకి మాయమయ్యాడు.

అందరూ ప్రయాణపు సందడిలో ఉన్నారు. గర్తు తప్పించుకొనిన సంగతి ఎవ్వరూ గమనించలేదు. వెనుకగా వచ్చే నౌకర్లలో ఎవరో ఒకరు వానిని తన వెనుక కూర్చుండబెట్టుకొని తీసుకుపోవాలని ఆదేశం. కాని, ఆ సందడిలో ఎవరి మట్టుకు వారే, గర్తును ఇంకెవరో జాగ్రత్తగా తీసుకొని వస్తున్నారనుకున్నారు. కొంతసేపటికిగాని గర్తు తప్పించుకుపోయాడన్న సంగతి వారికి తెలియలేదు. గుసగుసలుగా ఈ విషయం ఒకరితో నొకరు చెప్పుకునే సమయానికి, దీనికంత ప్రాధాన్యం ఇచ్చే అదను తప్పిపోయింది. దొంగలువచ్చి మీదపడడం ఈ క్షణమో మరుక్షణమో, అని ఉద్విగ్నంగా ఎల్లరూ ఎదురు చూస్తున్న పరిస్థితి అది.

ఒక ఇరుకైన బాటమీదుగా ప్రయాణమిప్పుడు సాగుతోంది. ఒకరివెనుకగా ఒకరు పోవలసినదేగాని, జంటలుగా పోవడానికి వీలులేదు. బాట ఏటవాలుగా క్రిందికి దిగింది. అక్కడ నొక చిన్న సెలయేరు. దానిని దాటి అవతలికి పోవాలి. నేల చాల తడిగా వుంది. ముందు ప్రయాణిస్తున్న సెడ్రిక్ ఎథిల్ స్టేనులు ఊహించారు, దొంగలు కొడితే ఇక్కడనే కొట్టాలని. కాని, ఉభయులూ కూడా యుద్ధతంత్రం బాగా తెలిసినవారు కాకపోవడంచేత, వీలైనంత త్వరగా ఆ కనుమను దాటిపోవడానికి వేగిరపడడం తప్ప వేరొక ఉపాయమేమీ వారికి తోచలేదు. సరియైన కట్టుబాటు లేకుండా సెలయేటిని దాటడం మొదలుపెట్టారు. కొందరు దాటారు. కొందరింకా దాటలేదు. ఈ సమయంలో, వెనుకనుంచీ ముందునుంచీ ప్రక్కలనుంచీ, ఒక్కసారిగా దొంగలు వచ్చి మీదపడ్డారు. ఆ కంగారులో తగిన ప్రతిఘటన చూపడానికి ఎవ్వరికీ అవకాశం లేకపోయింది. దొంగలు చేసిన నినాదాలు వారు అచ్చమైన సాక్సన్లని ఊహింపజేసేవిగా ఉన్నాయి. ఆ నినాదాలకు దొంగలసంఖ్య ఇంకా వృద్ధియైనట్లు తోచింది.

దొంగ తనమీదికి రావడంతోటే సెడ్రిక్ తన మొలలోంచి చటాలున ఒక చిన్న బల్లెంతీసి వానిమీదికి గురిచూచి విసిరాడు. అది ఆ దొంగను వాని వెనుకనే వున్న ఒక ఓక్ చెట్టుకు గ్రుచ్చివేసింది. సెడ్రిక్ వెంటనే తన గుర్రాన్ని రెండవవానిపై దూకించి, వాలుపెరికి బలంకొద్దీ వానిని కొట్ట

పోయాడు. దురదృష్టవశాత్తూ ఆ చేతిదగ్గర ఒక చెట్టుకొమ్మవుంది. సెడ్రిక్ కొట్టిన కత్తిదెబ్బ ఆ కొమ్మకు తగిలి, ఆ విసురుకు అది చేతిలోంచి జారి క్రిందపడి పోయింది. నిరాయుధుడైన అతనిని దొంగలు వెంటనే చుట్టుముట్టి పట్టుకొని గుర్రంమీదనుంచి క్రిందికి లాగివేశారు. ఎథెల్‌స్టేనును ఖయిదు చేయడానికి వారికి ఇంతసేపుగూడా పట్టలేదు. అతని చేతనున్న కళ్ళెన్ని వారు ముందు లాగివేశారు. వరలోంచి కత్తిని పెరికేలోపుగానే గుర్రంమీదనుంచి క్రిందికి లాగి బంధించివేశారు.

ఈ విధంగా తమ నాయకు లిద్దరూ బంధితులు కావటం చూడగానే, తక్కిన పరిచారకుల కందరికీ సహజంగా హడలు పుట్టింది. దొంగలు వారిని గూడ తేలికగానే పట్టుకొని బంధించారు. రొవెనా రెబెకాలకు గూడ ఇదే దురవస్థ పట్టింది.

ఒక్క వాంబా మాత్రం తమాషాగా తప్పించుకున్నాడు. తాము ధీరులైనట్లు నటించే ఇతరులకంటె ఎక్కువ ధీరప్రవృత్తితో ప్రవర్తించాడతడు. వరలోంచి లాగలేక లాగలేక లాగుతున్న తోటి పరిచారకుని చేతిలోంచి ఒక కత్తిని తాను లాక్కొని, సింహంలాగ లంఘించి తనమీదికి వచ్చే దొంగలను చాలమందిని వెనుకకు తోసి తన యజమానికి సాయపడ నుత్సహించాడు—కాని, అతనికి అలవిగాని పని అయిపోయింది. అంతట అతడు చప్పున గుర్రం మీదినుంచి క్రిందికి దూకి ప్రక్కనున్న ఒక పొదలో దూరి మాయమయ్యాడు.

వాంబా ఇప్పుడు స్వతంత్రుడు. కాని తన స్వతంత్రతను ఏమి చేసుకోవాలో అతనికి తెలియలేదు. యజమాని అంటే అతనికి అమిత విశ్వాసం. పోయి తన యజమానితో పాటుగా దొంగలకు పట్టుబడదామా అని చాలాసార్లు గుంజాటనపడ్డాడు. 'స్వతంత్రత చాల అమూల్యమైనదని అంతా అంటారు. ఇప్పుడు దీనిని నేనెట్లా ఉపయోగించుకోవాలో ఎవరైనా నాకు బోధిస్తే బాగుండును' అనుకున్నాడు తనలో తానే బిగ్గరగా.

ఇంతలో ఎవరో తనను, ఒరులకు తన పిలుపు వినిపించకూడదన్న జాగ్రత్తతో గూడిన గొంతుతో, 'వాంబా' అని పిలిచినట్లయింది. వాంబా వెనుదిరిగి చూచాడు. ఫాంగ్స్ గంతులువేస్తూ తనమీది కెగిరి తనను నాకడం మొదలుపెట్టింది. 'గర్త్!' అని, అంత జాగ్రత్తగానే తానూ సంబోధిస్తూ పరకాయించి చూచాడు. మరుక్షణంలో గర్తు అతని ముందర నిలబడ్డాడు.

'వాంబా! ఏమిటీ సంగతి? ఈ కేకలన్నీ యేమిటి? కత్తుల ఘర్షణ వినిపించిందేమిటి?'—అని అడిగాడు గర్త్ ఆదుర్దాగా.

'ఏముంది? కాలవైచిత్ర్యం! అందరూ ఖయిదీలయినారు'—అన్నాడు వాంబా.

'ఎవరు ఖయిదీలు?' గర్త్ చాల ఆదుర్దాగా అడిగాడు.

'మన పెద్దదొర, మన చిన్న దొరసాని, ఎథెల్‌స్టేను, హుండిబర్టు, అస్వాల్డు—అంతా!

'అరి దైవమా! యెలా జరిగిందది? ఎవరా పట్టుకున్న వారు?'—అని అడిగాడు తిరిగి గర్త్.

'పెద్దదొర పోట్లాడేందుకు సిద్ధంగానే వున్నాడు. ఎథెల్‌స్టేను సిద్ధంగా ఉండీ లేని స్థితిలో ఉన్నాడు. తక్కినవారు బొత్తుగా సిద్ధంగా లేరు. ఎవరో ఆకుపచ్చచొక్కాల వారికీ, నల్లముసుగుల వారికీ వారు ఖయిదీలైనారు. పెడరెక్కలు విరిచికట్టి, అదిగో వారిని ఆ పచ్చికపట్టుమీద కూలవేశారు. ఏడుపు వచ్చినప్పుడు గూడ నేను నవ్వగలిగితే బాగుండును!'—అన్నాడు వాంబా. అతనికి నిజంగా ఏడుపువచ్చి కళ్ళలో నీళ్ళు తిరిగాయి.

గర్త్ ముఖంలో ఒక వెలుగురేఖ తోచింది. 'వాంబా! నీదగ్గిర కత్తివుంది. నీమెదడుకంటె బలమైనది నీగుండె, మనం ఇద్దరమే కావచ్చుగాక. కాని గట్టి పట్టుదలతో గనుక హఠాత్తుగా వెళ్ళి మీదపడితే, ఇద్దరైనా ఎంతో పని చేయవచ్చు. రా, నావెంట!' అని ముందుకు అడుగువేశాడు.

'ఎక్కడికీ?—ఎందుకు?'—అని అడిగాడు వాంబా.

'సెడ్రిక్‌ను విడిపించడానికి'

'ఆయన నౌకరీ నీవు వదలుకొన్నావుగదా,— మరి ఇప్పుడు—' అని ఇంకా ఏదో అనబోయాడు వాంబా.

'అదంతా సెడ్రిక్ స్థితి బాగా వున్నప్పటి సంగతి, ఇప్పుడు కాదు. రా నా వెంట!'—అన్నాడు గర్త్.

వాంబా అలాగే అతనిని అనుసరించడానికి సిద్ధపడుతూ వుండగా, హఠాత్తుగా ఒకవ్యక్తి వారి యెదుట ప్రత్యక్షమై వారిని నిలువరించాడు. ఆ దుస్తు ననుబట్టి, అతడు ఆ దొంగల ముఠాలోనివాడేనని వాంబా అనుకున్నాడుగాని, ఇతని ముఖాన ముసుగులేదు. బుజానికొక పటకా ఉంది. దానినుంచి ఒక కొమ్ముబూరా వ్రేలాడుతోంది. అతని ముఖంలో ఒక శాంత గంభీరమైన ముద్ర ఉంది. ఆ సంజవెలుగులో అతని ముఖ కవళికను వాంబా గుర్తించాడు. అతడు అష్బీపోటీలలో విలువిద్యా ప్రదర్శనయందు ప్రథాన బహుమానం బడసిన గ్రామీణుడు లాక్స్లీ.

'ఏమిటిదంతా? ఈ అడవిలో ప్రయాణికుల నటకాయించి ఖయిదు చేయబూనుకొన్న యీ ముఠావారెవరు?'—అని ప్రశ్న చేశాడు లాక్స్లీ.

'అదిగో ఆ పచ్చని అంగీలు చూడు. నీవు ధరించిన అంగీల మాదిరిగానే ఉన్నాయి. నీ తాలూకు మనుష్యులేనేమో చూచుకో!'—అన్నాడు వాంబా.

'అదేమిటో నేను తెలుసుకొంటాను. నేను తిరిగి వచ్చేదాకా మీ రిక్కడే ఉండండి. కదిలారంటే మీ ప్రాణాలు దక్కవు. నేను చెప్పినట్లుగా చేశారంటే మీకూ మీ యజమానులకూ గూడ శుభం కలుగుతుంది. ఆఁ, అన్నట్లు, నే నిప్పుడు సరిగ్గా వీళ్ల మాదిరిగా వేషం దిద్దుకోవాలి'—అంటూ లాక్స్లీ, బూరాతోసహా పటకానూ, టోపీకి తగిలించిన తురాయినీ, ఊడదీసి వాంబా చేతికిచ్చి, తన సంచీలోంచి ఒక ముసుగుతీసి ముఖానికికట్టుకొని, 'కదిలారా అంటే మీ ప్రాణాలు దక్కవుసుమా' అని మరల వారికిద్దరికీ బెదురు పెట్టి చిటికలో అంతర్ధాన మయ్యాడు.

ఈ అదను చూచి, వాంబా గర్తుతో ఇలా అన్నాడు: 'ఇదిగో గర్త్! వీడు తిరిగి వచ్చిందాకా మనమిక్కడ నిలబడడం మంచిదా, లేక కాళ్లకు బుద్ధిచెప్పడం మంచిదా? నాకు చూడబోతే, వీడూ ఒక దొంగలాగే కనిపిస్తున్నాడుగాని, సరియైన మనిషిగా తోచడంలేదు'.

గర్త్ ఇలా సమాధానం చెప్పాడు: 'దొంగ కానీ, సైతాన్ కానీ! వాడు తిరిగివచ్చిందాకా నిలబడ్డందువల్ల మనం ఇంతకంటె చెడిపోయేదేమీ లేదు. వాడు ఆ దొంగలముఠాలోనివాడే అయితే, ఈపాటికి వాళ్లకు ఆ మాట ఇచ్చేసివుండాలి.మనం ఇక పోట్లాడడంగాని, పారిపోవడంగాని నిష్ప్రయోజనం. అదిన్నీగాక, నాకు ఇటీవల కొత్తగా కలిగిన అనుభవాన్ని బట్టి, దొంగల్లోనైనా అంతా దుర్మార్గులుండరు. ఉండు చూద్దాం.'

లాక్స్లీ కొద్దినిమిషాల్లో తిరిగివచ్చాడు. 'ఇదిగో నేనిప్పుడు వీళ్ళమధ్య నేర్పుగా మసలి, వీళ్ళెవరో, ఎక్కడికి పోతున్నారో, తెలుసుకొనివచ్చాను. ఖయిదీలపై వీళ్లు ప్రస్తుతం పెట్టి దౌర్జన్యానికి పూనుకోరనే నా కనిపిస్తోంది. వీళ్లు చూడబోతే అరితేరిన యోధుల్లా కనిపిస్తున్నారు. క్రొత్తవాళ్ళెవరైనా సమీపిస్తుంటే ముందుగా తెలియచెయ్యడానికి చుట్టూ గస్తీ నిలిపారుకూడ. కేవలం మన ముగ్గురివల్లా ఇప్పుడు ఏపనీ కాదు. త్వరలో నేను కొంత బలగాన్ని సేకరిస్తాను. మీరిద్దరూ సెడ్రిక్ ది సాగ్జన్‌కు నమ్మిన బంటులే కదూ? సెడ్రిక్ సాగ్జన్ జాతికి ఆత్మబంధువు—నాకు తెలుసు. ఈ ఆపత్సమయంలో అతనికి సహాయపడగల సాగ్జన్లు చాలామంది ఉన్నారని చూపిస్తాను. రండి నా వెంట!'

అంటూనే లాక్స్లీ, పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ ముందుకు దారితీశాడు. గర్తు వాంబాలు వాని ననుసరించారు. దీర్ఘకాలం నోరు మూసుకొని

ప్రయాణం చెయ్యడం వాంబాకు చేతకాదు. తన చేతికి లాక్స్లీ ఇంతకుపూర్వం ఇచ్చియున్న బూరాను నిర్దేశిస్తూ అన్యాపదేశంగా, 'ఈ బూరాను సంపాదించిన విలుకాని విలువిద్యాకౌశలం నా కళ్ళల్లో ఇంకా మెసులుతున్నట్లుగా ఉంది'—అన్నాడు. 'అవును, ఆ విలుకాని కంఠస్వరం కూడా నా చెవుల్లో ఇప్పటికీ మారుమ్రోగుతున్నట్లుగా ఉంది'—అన్నాడు గర్త్.

అంతట లాక్స్లీ వారికిలా హెచ్చరించాడు: 'ఇదిగో, నేనెవరో ఏమిటో తెలుసుకోవాలని మీరు చాలా బాధపడుతున్నట్లున్నారు. అది మీకిప్పుడు అనవసరం. మీ యజమానిని నేను చెర విడిపించడం కావాలి మీకు, అంతే. విడిపించిన తరువాత అప్పుడు తెలుసుకుందురుగాని, నావంటి పరమమిత్రుణ్ణి మీ జన్మలో ఇదివరకెన్నడూ చూచియుండలేదన్న సంగతి. నా పేరేమిటో, ఎన్నెన్ని పేర్లతో, ఏమేమిచేస్తూ, ఎక్కడెక్కడ ఎప్పుడెప్పుడు తిరుగుతూ ఉంటానో, వాటితో మీకేమీ ప్రసక్తిలేదు. రండి నా వెంట!'

వాంబా ఇక సాహసించి పైకి ఏమీ అనలేక, గర్తుతో రహస్యంగా, 'మనమేదో చిక్కులో పడ్డట్లే ఉన్నాం—మన రెండుకాళ్ళకోయిలూ సరాసరి సింహం నోట్లో దూర్చామా అనిపిస్తోంది, ఏమిటి గతి!' అన్నాడు. 'హుష్, అట్టే వాగకు, నీవాగుడువల్ల అసలు చెడుతుంది వ్యవహారం. మరేం ఫరవాలేదు. అంతా సవ్యంగా నడుస్తుందనే నా నమ్మకం'—అన్నాడు గర్త్.

# అధ్యాయం ౨౦

మూడుగంటలసేపు అలా యుగ్గుతూ హుటాహుటిగా నడిచిన తర్వాత, ఆ అడవిలోని ఒక చిన్న ఖాళీప్రదేశానికి వారు చేరుకున్నారు. దాని నట్టనడుమ ఒక బ్రహ్మాండమైన ఓక్‌చెట్టుంది. బలిష్ఠమైన దాని కొమ్మలు మెలికలు తిరిగి నలుదిక్కులా విస్తృతంగా విస్తరించుకొని ఉన్నాయి. చెట్టుక్రింద నలుగురైదుగురు విలుకాండ్రు పడుకొని ఉన్నారు. మరియొకడు, పహరాయిస్తున్న వానివలె ఆ వెన్నెలనీడలో అటూ ఇటూ తిరుగుతున్నాడు.

అడుగుల చప్పుడు వినిపించగానే ఆ గస్తీ తిరిగేవాడు పడుకున్నవారిని లేపాడు. వెంటనే వారు లేచి నిలబడుతూనే శరసంధానంచేసి చప్పుడు వినవచ్చిన దిక్కుగా లక్ష్యముంచి దృష్టినిగిడ్చారు. లాక్స్లీని గుర్తుపట్టడంతోనే వారి భయసంశయాలన్నీ తొలగిపోయాయి. ఎంతో ప్రేమగౌరవాలతో అతని నెదుర్కొని తోడ్తెచ్చారు.

'మిల్లరెక్కడ?'—అని లాక్స్లీ మొదటిప్రశ్న.

'రోధరుహాంవైపుకు వెళ్ళాడు.'

'ఎంతమందితో?' అని అడిగాడు నాయకుడు. ఆ అడిగే ధోరణిని బట్టి వారికి లాక్స్లీ నాయకుడనే అనుకోవాలి.

'ఆరుగురితో వెళ్ళాడు. ప్రయత్నం వృథా కాదు. లబ్ధిబాగానే ఉండవచ్చు.'

'మంచిది. అలన్ డేల్ ఎక్కడ?'

'వాట్లింగుస్ట్రీటు దిక్కుగా వెళ్ళాడు,— జోర్వాలక్సు మఠాధిపతి ప్రయర్ ఐమర్ కోసం పొంచిఉండడానికి.'

'అది మంచిపనే. మరి ఫాదరీ ఎక్కడున్నాడు?'

'అతని కుటీరంలో.'

'సరే, నే నక్కడికి వెడతాను. మీ రిప్పుడు వెంటనే వీలైనంత బలగాన్ని పోగుచెయ్యాలి. గట్టి వేటపని ఒకటి తగిలింది. తెల్లవారే సరికల్లా నాకు కనుపించండి'—అంటూ లాక్స్లీ తిరిగి వెంటనే,—'ఆఁ, అన్నట్లు, ముఖ్యమైన సంగతే మరిచిపోయాను. మీలో ఇద్దరు తక్షణమే ఫ్రాంట్-డి-బోఫ్ దుర్గానికి పోయే మార్గాన కాపు కాయండి. మనలాగే వేషాలు వేసుకొన్న యోధులు కొందరు కొంతమంది ఖయిదీలను ఆ దుర్గానికి తీసుకొని వెడు

కున్నారు. వాళ్ళను జాగ్రత్తగా కనుపెట్టి చూస్తూఉండండి. తగినంత బలగం మనం సమకూర్చుకునేలోగా వాళ్ళొకవేళ దుర్గం చేరుకోవచ్చు. అప్పుడు దుర్గాన్ని సాధించియైనా వాళ్లకు తగినశాస్తి చెయ్యవలసి ఉంది. కనుక జాగ్రత్తగా వాళ్లమీద ఒక కన్ను వేసి ఉంచండి. మీలో బాగా పసగత్తగలవా రొకరిద్దరు నాకు, ఎంత బలగం చేకూరిందీ సమాచారం అందజెయ్యండి' అన్నాడు.

అనడమే తడవుగా, వాళ్లు ఆ ఆజ్ఞలు తలదాల్చి వెళ్ళిపోయారు. లాక్సిలీ మన గర్త్, వాంబాలను వెంటనిడుకొని కోప్మన్‌హర్స్ట్ ఆశ్రమం వైపుకు వెళ్ళాడు.

ఆ ఆశ్రమం, అక్కడి చర్చి, అదంతా చూడగానే, వాంబా గర్త్‌తో చెవిలో నెమ్మదిగా ఇలా అన్నాడు: 'ఇది చాలా చిత్రంగా ఉన్నది గర్త్! దొంగకు ఆవాసస్థానమా ఈ చర్చి, ఈ ఆశ్రమమునూ! 'చర్చికి ఎంత దగ్గరైతే దైవానికి అంతదూరం' అని మనలో సామెత ఇందుకోసమే పుట్టిందికాబోలు! అరరే! లోపల ఆ పాటలు విన్నావా ఎంత జోరుగా సాగుతున్నాయో!— సన్యాసి ఆశ్రమమేమిటి, ఇంత అర్ధరాత్రివేళ ఇంత హుషారుగా ఈ పాటలేమిటి! ఆరి దైవమా! చిత్రంగా లేదిదీ?'

గర్త్ అతనికిలా సమాధానమిచ్చాడు: 'చిత్రమేమున్నది? కోప్మన్‌హర్స్టు ఫాదరీ సంగతి ఇక్కడందరికీ తెలిసిందే. ఇక్కడ తిరుగాడే లేళ్లలో సగం లేళ్లను ఇతడే హలాలు చేస్తూ ఉంటాడట. ఫారెస్టు ఉద్యోగి పై అధికారికి తెలియజేశాడనీ, తిన్నగా మెలగడం నేర్చుకోకపోతే ఇతని ఫాదరీ పని ఎప్పుడో ఊడేమాట నిశ్చయమనీ అంటారు.'

వీరిద్దరూ ఇక్కడ ఇలా మాట్లాడుకుంటూ ఉండగా, లాక్సిలీ ఆశ్రమం తలుపు దబదబా కొట్టి, మంచి హుషారులో మునిగితేలే మన పూర్వ పరిచితులగు ఫాదరీకీ, నీలకవచధారికీ అంతరాయం కల్పించాడు. ఫాదరీ పాట ఆపి, నీలకవచ ధారితో ఇలా అన్నాడు: 'మిత్రమా, ఎవర్లో కొత్త అతిథులు తయారైనట్లున్నారు. మనల్ని ఈ స్థితిలో వాళ్లు చూస్తే చాలా చిక్కు. ఎలాటివారికైనా విరోధులు కూడ ఉంటూఉంటారు చూడూ! దీర్ఘ ప్రయాణంచేసి బడలివచ్చిన నీకోసమైకదా నేనీ ఆతిథ్యమిస్తున్నాను! కాని, గిట్టనివాళ్లది అపార్థం చేసుకుంటారు. నేను తాగుబోతుననీ, వ్యభిచారిననీ ప్రచారం సాగిస్తారు. వృత్తినిబట్టియేమి, సహజ ప్రవృత్తినిబట్టియేమి, ఆ రెండు దుర్గుణాలకూ నాకూ చుక్కెదురు.'

'దుర్మార్గులు! నీ మీద ఇట్టి అభాండాలు వేసేవాళ్లు దెబ్బలాంటి శిక్షకైనా అర్హులే. అది సరేగాని, దెబ్బలాంటివారికైనా విరోధులంటూ ఉంటారని నీ

వన్నావు చూడూ! అది అక్షరాలా యథార్థం. శిరస్త్రాణంతో ముఖాచ్ఛాదనం చేసికొనిగాని నేను మాట్లాడగూడనివాళ్లు కొందరు ఈదేశంలో ఉండవచ్చు.'

'అయితే నీ శిరస్త్రాణం తగిలించుకో. నే నీలోగా ఈ మధుపాత్రల నిక్కడనుంచి తొలగిస్తాను. చివరిసారి వేసిన డోసుతో కైపు బాగా తలకెక్కినట్లు తోస్తోంది. నిలకడ కుదురుతున్నట్లు లేదు. పాత్రలు తొలగించేటప్పుడు చప్పుడు కావచ్చు. కనుక, నేను పాడేపాట బిగ్గరగా వాయించు. పాటలోని మాటల అర్థంతో నీకు నిమిత్తం లేదులే. నాకే తెలియదు వాటి అర్థం'అన్నాడు ఫాదరీ.

అంటూ, పెద్ద గొంతుకతో ఒక క్రొత్త పాట యెత్తుకొని, ఆ సందడిలో మధుపాత్రల నక్కడనుంచి తొలగించడం మొదలుపెట్టాడు. నీలకవచధారి తన శిరస్త్రాణాదులు మరల తగిలించుకొని, హుషారుగా నవ్వుతూ, మధ్య మధ్య తన గొంతుకను గూడ అతని పాటకు తోడుచేస్తున్నాడు.

'ఇంత అర్ధరాత్రివేళ ఏ సైతానుప్రార్థనలు చేస్తున్నావ్?'—అని బయటి నుంచి కేక!

తాను చేస్తున్న చప్పుళ్లవల్లనో, త్రాగిన మద్యపు నిషావల్లనో, ఫాదరీ ఆ కంఠస్వరం గుర్తుపట్టలేక, 'ఓయ్ బాటసారీ, ఇక్కడ వీలులేదు వెళ్లు. నేనిక్కడొక సోదర సన్యాసితో దైవప్రార్థనలు చేసుకుంటున్నాను. మా ప్రార్థనలకు భంగం చెయ్యకు'—అని కేక పెట్టాడు.

'ఉన్మత్తుడా! నేను లాక్స్లీని, తలుపు తియ్యి!'—అని వినవచ్చింది ఆ కంఠధ్వని.

'అమ్మయ్యా బ్రతికాం, ఇక నేమీ భయంలేదు'—అన్నాడు సన్యాసి నీలకవచధారితో.

'ఎవరతడు? నేను తెలుసుకోవలసిన అవసరం ఉంది. ఎవరో చెప్పు'—అని అడిగాడు నీలకవచధారి.

'ఎవరా?...అతడొక మిత్రుడులే!'—అని సమాధాన మిచ్చాడు సన్యాసి

'ఎలాంటి మిత్రుడని అడుగుతున్నాను. నీకు మిత్రుడైతే నాకు కావద్దూ?' అని ప్రశ్నించాడు నీలకవచధారి.

'ఎలాంటి మిత్రుడా?...ఆ ప్రశ్న అడగడం తేలికేగాని సమాధానం చెప్పడం చాలా కష్టం. ఎలాంటి మిత్రుడని అడుగుతున్నావు కదూ? ఆఁ, ఇప్పుడు కొంచెం మెదడు విడింది. నే నింతకుముందు ఫారెస్టు ఉద్యోగి అని చెప్పానే, అతడే ఇతడు. చాల నిజాయితీ మనిషి'—అన్నాడు సన్యాసి.

'ఆ, నీవెంత నిజాయితీ సన్యాసివో అతడంత నిజాయితీ ఉద్యోగి. సరే వెళ్లు. అతను తలుపు ఉతక లూడదన్నేట్లున్నాడు. వెళ్లి త్వరగా తలుపు తియ్యి.'

తలుపు కొట్టిన చప్పుడు వినిపించగానే బిగ్గరగా మొరుగుతూ గోల చేసిన కుక్కలు, ఇప్పుడా బయటి కంఠధ్వనిని గుర్తుపట్టాయి కాబోలు, ధోరణి మార్చి, తలుపు తీయడంకోసం తొందరపడుతున్నట్లు వింతధ్వనులు చేస్తూ తలుపును గీరడం మొదలుపెట్టాయి. సన్యాసి తలుపుతీయగానే లాక్స్లీ లోనికి వచ్చాడు.

వెంటనే అతని దృష్టి నీలకవచధారిమీద పడింది. 'ఎవరీ ఉత్సాహ పురుషుడు?' అని ప్రశ్నించాడు ఫాదరీని.

'మా సంప్రదాయంలోని సోదర సన్యాసే. రాత్రంతా జాగరణ చేసి ప్రార్థనలు చెయ్యాలనుకున్నాం'—అని ఫాదరీ సమాధాన మిచ్చాడు.

'చర్చిమిషనరీ సైనిక వ్యవస్థకు చెందిన సన్యాసి అనుకుంటా. ఇలాంటి వాళ్లు విదేశాల్లో చాలామంది ఉన్నారు. అది సరేగాని, ఫాదరీ, నీవిప్పుడు జపమాల వదలి షడీకర్ర చేతబుచ్చుకోవలసిన అవసరం వచ్చింది. మీ అందరితోడ్పాటూ నాకిప్పుడు కావాలి. కాని,'—అంటూ అతనిని కొంచెం ప్రక్కకు తీసుకొని వెళ్ళి, 'నీకేమైనా పిచ్చెక్కిందా ఏమిటి? ఎవరినో ముక్కూ మొగం తెలియని యోధుణ్ణి నీ ఆశ్రమంలోకి రానిచ్చావ్. మన నియమనిబంధనలన్నీ మరిచిపోయావా?' అని అడిగాడు.

ఫాదరీ నిబ్బరంగా, 'ముక్కూ మొగం తెలియకపోవడమేమిటి? నే నితనిని బాగా ఎరుగుదును'—అని బుకాయించాడు.

'అయితే, ఏమిటి అతని పేరు?'—అని అడిగాడు లాక్స్లీ.

'అతని పేరా?...అతని పేరు...అతని పేరు సర్ ఆంథోనీ స్క్రాబెల్ స్టోన్. అంత పేరు తెలియనివాళ్ళను ప్రక్కన కూర్చోబెట్టుకుని మధుపానం చేస్తానా,—అందులో నేను!'—అన్నాడు ఫాదరీ.

'నీ కీ మధ్య అతిగా త్రాగడం అలవాటైనట్లుంది. అతిగా వాగుతున్నావేమో కూడా!'—అన్నాడు లాక్స్లీ.

నీలకవచధారి ఈ సమయంలో ముందుకువచ్చి, 'ఫాదరీపై కోపగించకు భాయీ, నాకతడు ఆతిథ్యమిచ్చాడు తప్ప అంతకంటే ఏమీ చెయ్యలేదు—ఆతిథ్యం అతడు తనంతట తానివ్వకపోతే నేను బలవంతాన్నైనా పుచ్చుకుని తీరేవాణ్ణి'—అని పలికాడు.

'ఏమిటీ! బలవంతాన ఆతిథ్యం పుచ్చుకునేవాడవా! ఉండు, ఈ ఫాదరీ గౌను మార్చి ఆటవిక దుస్తులు ధరించనీ నన్ను, నీ పని చెపుతా! చెడీకర్రతో నీ బుర్రమీద పన్నెండు మ్రోగేటట్లు చెయ్యకపోతే నా పేరు......'

అంటూ వెంటనే ఫాదరీ దుస్తులు మార్చి ఆటవికుడుగా తయారై, వాంబా వంక చూచి, 'ఇదిగో నీ వెధవా, ఈ బొందులు కొంచెం బిగించు, నీకో కప్పు ద్రాక్షాసవమిస్తాను' అన్నాడు.

'ద్రాక్షాసవమిస్తావు సంతోషమే కాని, పవిత్రమైన సన్యాసి రూపం లోంచి పాపిష్ఠి ఆటవిక రూపంలోకి నీవు మారుతూ నాతోడ్పాటు కోరడం న్యాయమా ఫాదరీ'—అన్నాడు వాంబా.

'మరేం ఫరవాలేదులే! నా ఆటవికదుస్తులు చేసిన పాపాలను నా ఫాదరీ దుస్తులముందు పశ్చాత్తప్తుడనై ఒప్పుకుంటాను. ఇక పాపాలు నశించేస్తాయి!' అన్నాడు ఫాదరీ.

'ఆమెన్! తరువాతి మాట యెలా ఉన్నా, ముందు నా విదూషకుని దుస్తుల ముందు ఒప్పుకోన్నావ్, చాలు'—అంటూ వాంబా ఫాదరీ కోరిన సాహాయ్యం చేశాడు.

వీళ్ళిక్కడ ఈ పనిలో ఉండగా, లాక్స్లీ నీలకవచధారిని కొంచెమవతలికి తీసుకొనిపోయి, 'ఇదిగో, ఆష్బీ పోటీల్లో రెండవరోజున ఒక సాక్సన్ యోధునికి విజయం సాధించిపెట్టినది నీవేకదూ? చెప్పు నావద్ద నిజం దాచవద్దు'—అని అడిగాడు.

'కావచ్చు. అయితే ఇప్పుడేం?' అని ప్రశ్నించాడు నీలకవచధారి.

'అలా అయేటట్లయితే, దుర్బలులకు సాయపడడం నీవు ఒక ముఖ్యవిధిగా ఎంచుకుంటావని నా నిశ్చయం'—అన్నాడు లాక్స్లీ.

'నిజమైన ప్రతి యోధుడూ అలా ఎంచుకొని తీరతాడు. నేనూ అంతే!'—అని సమాధానమిచ్చాడు నీలకవచధారి.

'సంతోషం. అయితే నీవు నిజమైన యోధుడవైనట్లే, అచ్చమైన ఆంగ్ల జాతీయుడవనికూడా నేను అనుకోవచ్చునా? ఎందు కడుగుతున్నానంటే,—నే నిప్పుడు చెప్పబోయేది ధర్మచింతగల ప్రతివారూ గుర్తించేపనే అయినా, ఆంగ్లజాతీయులకు ముఖ్యంగా సంబంధించినదిది'—అని ప్రశ్నించాడు లాక్స్లీ.

'ఆంగ్లదేశాన్నీ, ఆంగ్లజాతికి చెందిన ప్రతి ఒక్కరినీ, నాకంటె ఎక్కువగా ప్రేమించగలవా రుండరు. అది నీవు విశ్వసించి నిస్సంకోచంగా మాట్లాడవచ్చు'—అని జవాబిచ్చాడు నీలకవచధారి.

'విశ్వసిస్తున్నాను. నీవంటి దేశభక్తుల తోడ్పాటే ఈ దేశానికిప్పుడు అత్యవసరంగా కావలసి ఉంది. ఇప్పుడు జరగవలసియున్న పనేమిటంటే!—

కొందరు దుర్మార్గులు, తమకంటె ఉత్తము లనదగినవారి వేషాలతో, ఆంగ్ల జాతీయులలో ఉత్తము డనదగిన సెడ్రిక్ ది సాగ్జనునూ, అతని మిత్రుడైన ఎథెల్ స్టేనునూ ఖయిదీలుగా పట్టుకొని, ఈ అరణ్యసీమలో ఉన్న టార్క్విల్ స్టన్ దుర్గానికి తీసుకొని పోతారు. ఆ బందీలను విడిపించవలసిఉంది. నీవు తోడ్పడగలవా?' అని అడిగాడు లాక్స్లీ.

'తప్పక తోడ్పడుతాను. అది నా విధ్యుక్తధర్మం'—అంటూ నీలకవచ ధారి,—'అయితే నీవెవరవో నేను తెలుసుకోవచ్చునా?' అని ప్రశ్నించాడు.

'నేనా! నేనొక అనామకుణ్ణి. కాని, ఈ దేశాన్నీ, ఈ దేశాన్ని ప్రేమించేవారినీ నేను ప్రేమిస్తాను. ఇంతవరకు మాత్రమే నీవిప్పుడు తెలుసుకొని తృప్తిపడాలి. ముఖ్యంగా, నీవు కూడా అజ్ఞాతుడవుగానే ఉండగోరుతున్న సందర్భంలో, ఇంతకంటె ఎక్కువ చెప్పడానికి వీలులేదు. కాని, ఒకటి మాత్రం విశ్వసించు,—నేను మాట యిచ్చానంటే, అది తప్పడం ఉండదని తెలుసుకో!'—అన్నాడు లాక్స్లీ.

నీలకవచధారి తన చేతితో లాక్స్లీ చేతిని కీలించి, 'నిన్ను నేను విశ్వసిస్తున్నాను. ముఖకవళికలను బట్టి అంతర్యాలు గుర్తించడం నాకు మొదటినుంచీ అలవాటు. నీ నిజాయితీ, నీ దీక్షాపటిమా నీ ముఖంలోనే నాకు కనిపిస్తున్నాయి. ఇక నిన్ను ఎలాటి ప్రశ్నలూ అడగను. ఈ బందీలను విడిపించడంలో నీకు పూర్తిగా సహాకరిస్తాను. దీని ఫలితంగా మన స్నేహబంధం దృఢతరం కాగలదని విశ్వసిస్తున్నాను'—అని ఉత్సాహం ప్రకటించాడు.

ఇక్కడ ఫాదరీ ఆటవికవేషధారణ, కత్తి, డాలు, విల్లు, అమ్ములపొది వగైరాలతో పూర్తి అయింది. అందరూ కుటీరం బయటికి వచ్చారు. తలుపు జాగ్రత్తగా తాళంవేసి, తాళపుచెవిని ఫాదరీ మండిగంక్రింద గుర్తుగా దాచాడు. 'ఆఁ, అన్నట్టు, మద్యపానపు కైపు బాగా తలకెక్కింది కాబోలు, పోరాడగల్గిన స్థితిలో ఉన్నావా ఫాదరీ!' అని అడిగాడు లాక్స్లీ.

'ఆఁ, ఫరవాలేదు, ఆ కైపు ఎంతలోకి దిగుతుంది! మెదడులో ఏదో మోత మోగుతున్నది నిజమే. కాళ్లు కూడా కొంచెం తడబడుతున్నాయి. కాని, ఇదిగో, ఈ జలధారలోని నీరు రెండు గుక్కలు తాగానంటే, మత్తూ గిత్తూ పటాపంచలై పోవలసిందే!' అంటూ ఫాదరీ ఆ జలధారవద్ద దగ్గిర వంగి, అదంతా ఒక్కసారే పీల్చేస్తాడా అనుకునేటట్లుగా దోసిళ్లకొద్దీ తాగడం మొదలుపెట్టాడు.

'ఈ ఊటనీరు ఇంత కడుపునిండా నీవు త్రాగి ఎన్నాళ్ళయింది బాబాజీ?'—అని ప్రశ్నించాడు నీలకవచధారి.

'దాక్షిణ్యపు తిత్తి ఆ మధ్య మూత వదులై బోర్లపడి దాక్షిణ్యమంతా కారిపోవడం జరిగింది. అప్పుడు నాకు ఈ నీరే శరణ్యం కావలసివచ్చింది'—అంటూ ఫాదరీ, చేతులూ తలా జలధారక్రింద చాలాసేపు తడిపితడిపి ఈవలకు వచ్చాడు. ఇప్పుడా మనిషే మారిపోయినట్లనిపించింది. బల్లెం హుషారుగా కొనవేళ్లతో తలపై గిరగిరా త్రిప్పుతూ, 'ఏరి ఆ దుర్మార్గులు! వాళ్ళొక డజనుమంది నన్ను చుట్టుముట్టినా నే నొక్కణ్ణే వాళ్లకి సమాధానం చెప్పకపోతే ఒట్టు! సైతానుకు గులాము నైనట్టే!'— అని ఉత్సాహం ప్రకటించాడు.

నీలకవచధారి నవ్వుతూ, 'ఇదేమిటి ఫాదరీ, నీ వృత్తిధర్మానికి విరుద్ధంగా ఒట్లు పెట్టుకుంటున్నావు'— అని అడిగాడు. 'ఇదిగో, ఇప్పుడు నన్ను ఫాదరీ గీదరీయని పిలవకు. ఫాదరీదుస్తులు ఒంటిమీద ఉన్నంతవరకే నేను ఫాదరీని. ఇప్పుడు నేను ఆటవికదుస్తులు ధరించాను గనుక అచ్చమైన ఆటవికుణ్ణి. ఈ వేషంలో నేను ఆటవికు లందరివలెనే, తింటాను, త్రాగుతాను, ఒట్లు పెట్టుకుంటాను, ఒక పడుచుపిల్ల కనిపిస్తే ప్రేమిస్తానుకూడా!' అని సమాధానమిచ్చాడు ఆ ఆటవికసన్యాసి.

'సరే, ఇక చాలించు నీ వాచాలత్వం. మన మిప్పుడు తొందరగా పోవాలి. మన బలగాన్నంతనీ పోగుచేసుకోవలసివుంది. రెజినాల్డు ఫ్రాంట్-డి-బాఫ్ దుర్గాన్ని ముట్టడించి పట్టుకోడమంటే సామాన్యంకాదు, ఎంత బలగమైనా చాలదు'—అని తొందరించాడు లాక్స్లీ.

నీలకవచధారి అచ్చెరువు ప్రకటిస్తూ, 'ఏమిటీ! ఫ్రాంట్-డీ బాఫా! అతడా యీ రాజమార్గాన్ని అటకాయించి బాటసారులను బాధించినది? అతడిలా బందిపోటుదొంగగానూ, ప్రజాకంటకుడుగానూ మారిందెప్పుడు?'— అని అడిగాడు.

'ఆదినుంచీ అతడు ప్రజాకంటకుడే!'— అన్నాడు లాక్స్లీ.

'పచ్చి బందిపోటుదొంగ కూడానూ! నేను ఎంతోమంది బందిపోటు దొంగల నెరుగుదున్నాను. వారికున్న నిజాయితీలో సగమైనా ఈ దుర్మార్గుడికి లేదు'—అన్నాడు ఫాదరీ.

లాక్స్లీ చిరాకుపడి, 'ఇదిగో, నీ వికనోరు మెదపకుండా ముందు నడిచి దారితియ్యి. ఏది మాట్లాడాలో ఏది మాట్లాడకూడదో తెలియకుండా తెగ వాగేటట్లున్నావు' అని హెచ్చరించాడు.

# అధ్యాయం ౨౧

సెడ్రిక్కునూ, అతని పరివారాన్నీ చెరవిడిపించడానికి ప్రయత్నాలు ఈ విధంగా ఇక్కడ జరుగుతూ ఉండగా, అక్కడ, వారిని చెరపట్టిన దుండగులు హుటాహుటిగా వారిని తాము రెండవ కంటివానికి తెలియకుండా భద్రంగా ఖైదు చేయదలచుకొన్న చోటికి తీసుకొనిపోజొచ్చారు. కాని, ఇంతలో, వెన్నెలపోయి చీకటి రావడంచేతనూ, ఆ అడవిదారులు వారికి సరిగా తెలియక పోవడంచేతనూ, చాలసార్లు వారు ఆగి ఆగి మరీ ప్రయాణం చేయవలసి వచ్చింది. ఒకటి రెండుసార్లు తప్పుత్రోవ పట్టినట్లు తెలియగా తిరిగి వెనుకకు వచ్చి సరియైన మార్గాన్ని అనుసరించవలసి వచ్చిందికూడ. ఈ తికమకలతో ఎలాగైతేనేం, తెల్లవారింది. తాము సరియైన త్రోవనే నడుస్తున్నట్లు ఇప్పటికి వారికి ధైర్యం చిక్కింది. ఇక చకచకా ప్రయాణం సాగించడం మొదలు పెట్టారు. ఈ సమయంలో, ఆ ముఠాకు నాయకులుగా కనుపించిన యిద్దరు వ్యక్తులమధ్య ఈ విధంగా సంభాషణ జరిగింది:

'ఇదిగో డీబ్రేసీ! నీవిక మమ్మల్ని విడిచివెళ్ళి, నీవు వేసిన పథకంలోని రెండవభాగం ఆచరణలో పెట్టు. వీళ్ళను చెరవిడిపించే ధీరుడుగా నటన చెయ్యాలనిగదా అనుకొన్నావు?'—అన్నాడు టెంప్లార్ బ్రయన్.

'ఆ అభిప్రాయమిప్పుడు మార్చుకున్నాను. ఫ్రాంట్ డీ బాఫ్ కోటలో వీళ్ళను జాగ్రత్తగా భద్రపరిచేదాకా నిన్ను వదలివెళ్ళేదిలేదు. అక్కడనే రొవేనాకు నేను నా నిజస్వరూపంలో కనిపిస్తాను. ఆమె నా ప్రేమ తీవ్రతకు మెచ్చి యీ నా అకృత్యాన్ని మన్నిస్తుందని నా విశ్వాసం'— అన్నాడు డీబ్రేసీ.

బ్రయన్ అతని వంక సాభిప్రాయంగా చూస్తూ అడిగాడు: 'ఎందుకు నీ అభిప్రాయమిలా మార్చుకోవలసి వచ్చింది డీబ్రేసీ?'

'ఎందుకో నీకు చెప్పడం అనవసరం' — అని డీబ్రేసీ సమాధానమిచ్చాడు.

'నా నిజాయితీ విషయమై వాల్డిమార్ నీకేదో అనుమానం రేకెత్తించాడు. బహుశః అది కారణం కాదనుకుంటాను నీ అభిప్రాయం మార్చుకోడానికి'—అన్నాడు బ్రయన్.

'నా అభిప్రాయాలు నావేగాని మరొకళ్ళవికావు. ఒక దొంగ ఇంకొక దొంగని వంచిస్తుంటే సైతాను నవ్వుకుంటూ ఉంటాడంటారు. ఒక వేళ

అలా నవ్వకుండా అగ్రహించితే మాత్రం, ఒక టెంప్లార్ తాను చేయదలచు కున్న పని చేయకుండా మానుతాడా?'—అన్నాడు డీబ్రేసీ.

'అంతేకాదు,—ఒక యథేచ్ఛా సైనికముతా నాయకుడు, తాను ఇతరుల కపకారం చెయ్యడంలో అందె వేసిన చెయ్యిగనుక, అలాటి అపకారమే తన మిత్రునివలన తనకు జరుగుతుందని అనవసరంగా భయపడకుండానూ మానడు,—' అని ఎత్తిపొడిచాడు బ్రయన్.

'ఇదిగో ఈ ఎత్తిపొడుపులవల్ల ప్రయోజనం లేకపోగా ప్రమాద ముంటుంది. ఎందుకీ అనవసర ప్రసంగం? టెంప్లార్ వ్యవస్థ నీతినియమా లెలాంటివో నాకు తెలుసు. నేను కష్టపడి సంపాదించుకున్న సుందరిని నా చేతిలోంచి కాజేసుకుపోవడానికి నీకు ఎట్టి అవకాశమూ ఇవ్వను'—అన్నాడు డీబ్రేసీ.

'బలే! నీవు ఎందుకు భయపడాలో నాకు అర్థం కావడంలేదు. మా వ్యవస్థకు ఎలాంటి శపథాలున్నాయో నీకు తెలియదూ?' అని అడిగాడు టెంప్లార్ బ్రయన్.

'తెలియకేం, బాగా తెలుసు. అవి ఏ విధంగా పాలించబడుతూ ఉంటాయో కూడా నేను బాగా యెరిగినవాణ్ణే. వీరధర్మాలకు పాలస్తీనాలో ఎట్టి విపరీత వ్యాఖ్యానాలు చేయబడుతూ ఉంటేదీ నాకు చక్కగా తెలుసు. ఇన్ని మాట లెందుకు సర్ బ్రియన్, ఇది నిన్ను విశ్వసించదగిన సందర్భం కాదు' అన్నాడు డీబ్రేసీ.

అంతట బ్రియన్ ఈ విధంగా అన్నాడు: 'అయితే యిప్పుడు నిజంచెప్తున్నాను విను. నీ నీలికళ్ళ జవ్వనితో నాకు నిమిత్తంలేదు. ఈ ఖైదీల లోనే ఇంకొక పిల్ల ఉన్నది. అదీ నాకు తగిన జోడు,'

డీబ్రేసీ చకితుడై, 'ఏమిటీ! దాసీదాన్నా చిట్టచివరకు నీవు అపేక్షించేది!'—అని ఎగతాళిచేశాడు,

'దాసీదాన్ని అపేక్షించేటంత అల్పుణ్ణి కాదు నేను. చక్కదనంలో నీవు కోరే సుందరికేమాత్రమూ తీసిపోవనిదే ఒక పిల్ల ఈ పరివారంలో ఉన్నది'—అన్నాడు బ్రియన్.

'అరి దైవమా, ఆ యూదీయ కన్యకనా ఏమిటీ ఇంతకూ నీవు కోరేది!'—అని అచ్చెరువొందాడు డీబ్రేసీ!

'ఏంకారాదేం? ఎవరు అడ్డంవస్తారో రమ్మను'-అని సవాలుచేశాడు బ్రయన్.

'ఎవరో అడ్డంరావడం మా కెందుకు? నీ బ్రహ్మచర్య వ్రతమే నీకు అడ్డం. ఒక యూదీయకన్యతో చెలికారం కూడదని చెప్పే నీ అంతరాత్మే నీకు అడ్డం'—అన్నాడు డీబ్రేసీ.

టెంప్లార్ బ్రియన్ సాచివేతగా, 'ఆఁ, అలాంటి భయమేమీ లేదులే. బ్రహ్మచర్య వ్రతనియమ పరిపాలన విషయంలో మా సంస్థ అధినేత నాకు కొంత స్వేచ్ఛ మంజూరు చేశాడు. ఇక, నా అంతరాత్మ సంగతంటావా,—మూడు వందలమంది ముష్కర తురుష్కులను బలిగొన్న నా వంటి వీరుడు, ఇలాంటి అల్పదోషాలనుగూర్చి ఒక పల్లెటూరి పిల్ల భయపడ్డట్లు భయపడవలసిన అగత్యం లేదు'—అన్నాడు.

'సరే, దానికేంగాని, నేను ఒక సంగతి మాత్రం నిశ్చయంగా చెప్పగలను. ఆ పడుచుపిల్ల అందచందాల మీదకంటే, ఆ ముసలివాడి డబ్బు సంచుల మీద నీకన్ను ఎక్కువగా పడింది'—అన్నాడు డీబ్రేసీ.

'ఎక్కువేమిటి, తక్కువేమిటి? రెండూ నాకు కావలసినవే. అయితే, ఈ యూదీయుడి డబ్బుకు నేనొక్కణ్ణే అధికారిని కావడానికి ఎలాగూ వీలు లేదు. ఫ్రాంట్ డీబాఫ్ మనకు తన కోట వాడుకోడానికిస్తున్నాడంటే ఊరికే ఇవ్వడంలేదు. ఈ యూదీయుని వద్దనుంచి కొల్లగొట్టే డబ్బులో అతనికిగూడా భాగంపెట్టక తప్పదు. అలా ఇతరులకు భాగంపెట్టనవసరం లేకుండా, కేవలం నా సొంతమని చెప్పుకోడానికి వీలైనదొకటి ఈ సందర్భంలో నేను సంపాదించుకొని తీరాలి. ఈ యూదీయ కన్యను అలా నాకు రావలసిన ప్రత్యేక బహుమానంగా నేను ఎంచుకున్నాను, కనుక డీబ్రేసీ, ఇప్పుడు నా ఆంతర్యం నీకు బాగా స్పష్టమయింది కనుక, నీవు మొదట వేసుకున్న పథకం నిరభ్యంతరంగా కొనసాగనిచ్చుకో. నేను అడ్డంవస్తానని భయం నీ వెంతమాత్రమూ పెట్టుకోనక్కరలేదు'—అన్నాడు బ్రయన్.

కాని, డీబ్రేసీ కించిత్తుకూడా మెత్తబడక ఇలా సమాధానం చెప్పాడు. 'వద్దు వద్దు. నేను కష్టపడి సంపాదించుకొన్నదాన్ని ఇప్పుడు నేను విడిచి పెట్టను. నీవు చెప్పేదంతా నిజంగానే కనిపిస్తోందిగాని, మీ టెంప్లార్ వ్యవస్థ అధినేత నీకు స్వేచ్ఛ మంజూరు చెయ్యడమేమిటో, మూడువందల మంది తురుష్కులను మట్టుపెట్టినందువల్ల నీకు పుణ్యం చేకూరడమేమిటో,—ఇదంతా వింటే, ఇలాంటి అభిప్రాయాలు కలవాడవు నీ వెంతకైనా తగుదువనిపిస్తోంది. పెద్ద పెద్ద విషయాల్లోనే పాపభీతి లేనప్పుడు, ఇక చిన్న విషయాలకా నీవు భయపడేది?'

వీరి ప్రసంగమిలా సాగుతూ ఉండగా, అవతల సెడ్రిక్, తన చుట్టూ ఉన్న కావలివాళ్ళను పలకరించి,—వాళ్ళు ఆ అడవిలోని బందిపోటు ముఠాకు చెందిన సాక్సన్ జాతీయులనే ఉద్దేశ్యంతో,—ఎందుకొరకు తమ్ము ఈ ప్రకారం బంధించడం జరిగిందో వాళ్ళవల్లన రాబట్టడం కోసం అనేక విధాల నయానా

భయానా ప్రయత్నించి చూచాడు. కాని, వారేమీ సందివ్వలేదు. ప్రయాణ
వేగం హెచ్చించబడింది. పోగా పోగా, ఒక మలుపు తిరిగే సరికి, ఇరు
వైపులా వృక్షపంక్తుల మధ్యనున్న బాటకు చిట్టచివర, ఎట్టఎదుటగా, రెజినాల్డు
ఫ్రాంట్ డీబాఫ్ నివసించే టార్క్విల్‌స్టన్ కోట దృగ్గోచరమయింది.

అది అంత పెద్ద కోటకాదు. దాని నడిమి భాగాన ఒక ఎత్తయిన నలు
చదరపు గోపురముంది. ఆగోపురంచుట్టూ అంతకంటె తక్కువ ఎత్తులో భవనా
లున్నాయి. వాటికీ వెలుపలి ప్రాకారానికీ మధ్య చుట్టూ కొంత ఖాళీ
ప్రదేశముంది. ప్రాకారం చుట్టూ ఒక లోతైన కందకం. దగ్గరలో ఉన్న ఒక
సెలయేటి నుంచి అందులోకి నీరు పట్టుతూ ఉంటారు. ఫ్రాంట్ డీబాఫ్
ఈ ప్రాకారం మూలల్లో కూడా బురుజాలు కట్టించి కోటను బందోబస్తు చేశాడు.
సింహద్వారంపైన కూడా ఇరువైపులా రెండు బురుజాలు కట్టబడి ఉన్నాయి.
ఫ్రాంట్ డీబాఫ్ ఆచుట్టుపక్కల చాలా చెడ్డపేరు సంపాదించిన కారణం
చేత, ఎప్పుడు ఏ శత్రువులు వచ్చి మీద పడతారో నన్న భయంతో ఈ కోట
నిలా జాగ్రత్తగా బందోబస్తు చేసుకున్నాడు.

చూచీ చూడడంతోటే, ఇది ఫ్రాంట్ డీబాఫ్ కోట యని సెడ్రిక్
గుర్తించాడు. అందుచే, ఫ్రాంట్ డీబాఫే తను యీ దురవస్థకు కారణమని
నిశ్చయించుకున్నాడు. నిష్కారణంగా ఆటవికముఠాలను అనుమానించానని
చింతపడి, కావలివాండ్రతో ఇలా అన్నాడు: 'మీరు ఫ్రాంట్ డీబాఫ్
నౌకర్లా? ఏమిటి మీ యజమానికి కావలసినది? నా ప్రాణాలా, ధనమా?
ఒకప్పుడు, ఈ దేశంలోని భూమి అంతా మా జాతి పిత్రార్జితపు ఆస్తి. ఇప్పు
డుదులో, నాకూ ఎథెల్‌స్టేనుకూ మాత్రమైనా కొంత మిగలడం మీ యజమానికి
కంటకంగా ఉంటే కాబోలు! మమ్మల్నికూడా చంపివేసి మీ మిగిలిన పని
పూర్తిచేసుకోండి. ఇంగ్లాండును నార్మన్ దాస్యంనుండి తప్పించలేని సెడ్రిక్కు
బ్రతుకుపై ఆశలేదు. ఇంగ్లాండుకోసం చావడానికిగూడా సిద్ధంగా ఉన్నాడు.
రెవొనానుమాత్రం సగౌరవంగా, నిరపాయంగా వదలిపెట్టండి, ఇలా కోరా
నని మీ యజమానితో చెప్పండి. ఆమె అబల. ఆమెవలన అతడు భయపడ
వలసిన పనిలేదు. ఆమె కోసమై పోరాడేవారంతా మాతోనే అంతరించి
పోతారు.'

వెనుకటిమాదిరిగానే కావలివాండ్రేమీ మాట్లాడలేదు. కోట సింహ
ద్వారం సమీపించగానే డీబ్రేసీ మూడుసార్లు తన బూరా ఊదాడు. వెంటనే
బురుజాలమీద కావలికాచే విలుకాండ్రు క్రిందికి దిగి, అగడ్తమీదికి వంతెన దించి
కోటలోనికి వారిని ప్రవేశపెట్టారు. ఖయిదీలనందరినీ ముందు ఒకపెద్ద హాలు
లోనికి తీసుకొనిపోయారు. అక్కడ వారిచేత తొందరతొందరగా ప్రాతః
కాల భోజనం చేయించారు. ఒక్క ఎథెల్‌స్టేనుకు తప్ప తక్కినవారికెవ్వరికీ అది

సహించలేదు. కాని, అతని కైనా సావకాశంగా భోజనంచేసే వ్యవధి లేకపోయింది. కావలివాండ్రు సెడ్రిక్ ఎథెల్‌స్టేనులను రొవేనానుండి వేరుచేసి బంధించే సూచనలు కనుపించాయి. ఇరువురూ అది నివారించడానికెంతో పెనగులాడారుగాని ప్రయోజనం లేకపోయింది. ముందు ఆ ఇరువురినీ బలత్కారంగా ఒక పెద్ద గదిలోనికి తీసుకొనిపోయి బంధించారు.

పిమ్మట రొవేనా ఆ సమూహంనుంచి వేరుచేయబడి, దూరంగా ఉన్న ఒక గదిలో బంధించబడింది. అలాగే తరువాత రెబెకాను మరొక దూరపు గదికి చేర్చారు. ఇసాక్ వారిని అనేక విధాల ప్రాధేయపడ్డాడు—ఆమెను తన దగ్గర ఉంచవలసిందని. ఎంతో ధనమిస్తానని ఆశపెట్టాడు. 'నీచుడా, నిన్ను సమాధిలో పూడ్చేటప్పుడు కూడా నీకూతురును నీప్రక్కన పూడ్చమంటావేమిటి?'—అంటూ కావలివాండ్రు అతనిని దౌర్జన్యంగా, వెనుకటి ఖైదీలు తీసుకొని పోబడినదిక్కుగా గాక, వేరొక దిక్కుగా లాక్కొని పోయారు. నౌకర్లను మరొకచోట బంధించారు. రొవేనావద్ద ఆమె పరిచారికయైన ఎల్గిత్తాను కూడ ఉండ నివ్వలేదు.

ఇలా వేర్వేరు తావుల్లో బంధించబడిన వారిలో, ముందు సెడ్రిక్, ఎథెల్‌స్టేనుల సంగతి విచారిద్దాం. అది ఒక పెద్దహాలు. ఆకోటకు ప్రధానమైన హాలు అసలదే. కాని, సాగ్జన్ శిల్పంతో నిర్మించబడిన కారణాన, ఫ్రాంట్ డీబాఫ్ దానిని పసందుచేయక, నార్మన్ ఫాషన్‌లో తాను వేరే ఒకహాలు కట్టించుకొని, దీనిని ఇతర ప్రయోజనాలకు వినియోగిస్తున్నాడు. సెడ్రిక్ ఈ హాలులో ఉద్రిక్తుడై ఇటూ అటూ తిరుగుతూ ఏమేమో ఆలోచనలతో కలగుండు పడజొచ్చాడు. ఎథెల్‌స్టేనుకు ప్రస్తుత పరిస్థితిలో తనకున్న అసౌకర్యంతప్ప ఇంకే ఆలోచనా వున్నట్లులేదు. అదికూడా అతని నంతగా బాధించడంలేదని చెప్పాలి. అటువంటి మందకొడితనం అతనిది. సెడ్రిక్ చేస్తూన్న హెచ్చరికలకు మధ్యమధ్య తప్పనిసరిగా ఏదో సమాధానమిస్తూన్నాడు. అంతే!

సెడ్రిక్,—అది తనలో తాను మాట్లాడుకోడమో, లేక ఎథెల్‌స్టేనుతో మాట్లాడడమో సరిగా తెలియదు,—ఇలా అంటున్నాడు: 'అవును, ఈ హాలులోనే మా నాన్నగారు టార్క్విల్ వుల్ఫ్‌గాంగర్ చేసిన విందులో పాల్గొన్నది. నార్వేజియన్లపై ఎత్తివెడుతున్న హెరాల్డురాజు కొరకు ఏర్పాటుచేయబడిన విందది. నార్వేజియన్లతోకలిసి తనపై తిరుగుబాటుచేసిన తన సోదరుడు టాస్టీ తన వద్దకు పంపిన రాయబారికి హెరాల్డు ఈ హాలులోనే మెుగంమీద కొట్టినట్లు సమాధానం చెప్పాడు. ఆ కథ మా నాన్నగారు వర్ణించి చెపుతున్నప్పుడెల్ల పొంగిపోతూ ఉండేవారు. ఆ రాయబారిని హాలులో ప్రవేశపెట్టిన సమయానికి, హాలంతా సాగ్జన్ సామంతులతో క్రిక్కిరిసిపోయి ఉన్నదట. ప్రభువు

చుట్టూ పరివేష్టించి కూర్చుండి, అందరూ రక్తారుణ సుందరమైన ద్రాక్షాసవం సేవిస్తున్నారట.'

ఈ మాట వచ్చేసరికి ఎథెల్‌స్టేనుకు తన తిండిమాట జ్ఞాపకంవచ్చింది. 'మధ్యాహ్నానికైనా వీళ్ళు మనకి కొంత ద్రాక్షాసవం, భోజనపదార్థాలూ పంపిస్తారనుకుంటాను. పొద్దుటి భోజనం సరిగా చెయ్యలేదు. చేయనిస్తేగదూ! అందులోనూ, ప్రయాణం చేసి చేసి గుర్రందిగిన తక్షణమే భోజనం చెయ్యాలంటే నాకు తిన్నగా రుచెక్కదు. వైద్యులంటారనుకోండి,—అదే మంచి అలవాటని,'— అన్నాడు.

సెడ్రిక్‌కు ఈ మాటలు చెవిదూరలేదు. తాను మొదలుపెట్టిన కథ ఇలా చెప్పుకుంటూ పోయాడు: 'సామంతులు తీక్ష్ణదృక్కులు తనపై ప్రసరిస్తూ ఉండగా రాయబారి సరాసరి హెరాల్డురాజు సింహాసనంచెంత మోకరిల్లి నిలిచాడు. 'మహారాజా, తమ సోదరుడు టాస్టీ తిరుగుబాటుమాని తమతో కూడి మనగోరుతున్నాడు. ఇందుకు తమ షరతులేమిటి?' అని అడిగాడు. 'నా సోదరస్నేహం యథాపూర్వంగా అతనికి లభిస్తుంది. పైగా, అతన్ని నార్తంబర్లాండు మండలాధిపతిని చేస్తాను'- అని పలికాడు హెరాల్డురాజు. 'తమ సోదరుడిందుల కంగీకరిస్తే మరి, అతని మిత్రుడైన నార్వీజియన్‌రాజు హార్‌డ్రాడాకు ఏమి భూములిస్తారు?'— అని అడిగాడు రాయబారి. హెరాల్డురాజు ఉగ్రుడై, 'ఆఁ, ఇస్తాను,—ఏడు అంగుళాల ఆంగ్లభూమి! హార్‌డ్రాడా బాగా ఒడ్డూ పొడుగూ ఉన్న రాక్షసిలాంటి మనిషంటారు గాబట్టి, ఇంకొక పన్నెండు అంగుళాలుకూడా అవసరమైతే మంజూరు చెయ్యగలం'—అన్నాడు. హాలంతా ఉత్సాహధ్వనులతో మారుమోగిపోయింది. హార్‌డ్రాడా త్వరలో ఆ ఏడడుగుల ఆంగ్లభూమికీ యజమాని అగునుగాకయని కోరుతూ అందరూ ద్రాక్షాసవ పాత్రలు నింపి ఖాళీచేశారు.'

ఎథెల్‌స్టేను ఇక్కడ తిరిగి అందుకొని, 'నేనుకూడా హృదయపూర్వకంగా ఇప్పుడా ఉత్సాహంలో పాల్గొని మధుపాత్ర ఖాళీ చెయ్యాలని ఉంది. నోరు ఎండిపోతోంది'—అన్నాడు.

ఇదేమీ వినిపించుకోకుండానే సెడ్రిక్ కథ మామూలు ధోరణిలో సాగిపోతోంది. 'రాయబారి తికమకపడి చల్లగా అచటినుండి సర్దుకొని, పోయి టాస్టీతోనూ అతని మిత్రునితోనూ జరిగినకథ చెప్పుకున్నాడు. భయంకరమైన స్టాంఫర్డు యుద్ధం ఆ తర్వాత జరిగినదే. నెత్తురు ఏరులై పారింది. పదివేల సైన్యంతో సహా, నార్వీజియన్‌రాజు హార్‌డ్రాడా, టాస్టీ,—ఉభయులూ యుద్ధరంగానికి బలియైపోయారు. కాని, యీ ఘనవిజయం సాధించిన రోజునే, ఏ వాయువులు సాగ్జన్ పతాకలను విజయోత్సాహంతో రెపరెప లాడించాయో అవే, ససెక్సు సముద్రతీరంలో, ఇంగ్లాండుపై ఎత్తివస్తున్న నార్మన్ ఓడల తెర

శాపలనుగూడా పూరిస్తూవుండిన సంగతి యెవరు గుర్తించారు? మరి కొద్దిరోజులకే హెరాల్డురాజు తన రాజ్యం కోల్పోవలసివస్తుందనీ, తన కోపంలో నార్వే జియన్ రాజుకు తాను నిర్దేశించిన ఏడడుగుల భూమే అతనికిగూడ గతి కావలసి వస్తుందనీ, యెవరనుకున్నారు? పోతూత్తూ ఆ హెరాల్డు రాజవంశాంకురమైన నీవుగాని, ఆ రాజవంశ సేవాధురంధరుడగు స్వామిభక్తిపరాయణుని పుత్రుడనైన నేనుగాని, ఆనాడు మన తాత తండ్రుల సమావేశపు కోలాహలంతో ప్రతిధ్వనించిన ఆ హాలులోనే, నేడీవిధంగా ఒక నార్మన్ దుండగునిచే ఖయిదు చేయబడుతామని యెవరు భావించారు?'

ఎథెల్‌స్టేన్ శిరఃకంపంచేసి ఇలా జవాబిచ్చాడు: 'చాలా విచారకరమైన సంగతి. వీళ్ళు మనల్నిప్పుడు విడుదలచెయ్యడానికి యెంతధన మడుగుతారో తెలియకుండా ఉంది. కొంచెం తేలిగ్గా పోనిస్తారనే ఆశిస్తున్నాను. దానిమాట యెలా ఉన్నా, మనల్నిక్కడ తిండిపెట్టకుండా మాడ్చడం వాళ్ళ ఉద్దేశ్యమై ఉండదనే నా నిశ్చయం. కాని, ఇంతవరకు, మధ్యాహ్నభోజనం తీసుకొని వచ్చే సన్నాహాలేమీ కనిపించడంలే దెందుచేతనో! ఆ కిటికిలోంచి చూడండి. ఎండపొడనుబట్టి, మధ్యాహ్నమైనట్లు సులభంగా ఊహించవచ్చు. కాదూ?'

'కావచ్చు. కాని, ఆ కిటికీవంక చూస్తుంటే, నాకు ఇంకేవో సంగతులు జ్ఞాపకానికి వస్తున్నాయి. అద్దాలు తయారుచేయడమూ, వాటికి రంగులు వేయడమూ మన పూర్వీకులకు తెలియదు. ఉల్ఫ్‌గాంగరు తండ్రి ఈ హాలును అద్దాలతో అలంకరించడానికై నార్మండీనుండి ఒక కళాకారుని పిలిపించాడు. సూర్యకిరణాల బంగారు ఛాయను పలురకాల వింత రంగులలో మెరిపించి చూపిస్తున్న ఈ కిటికీల అద్దాలు అతడు వేసినవే. ఆ విదేశీయ కళాకారు డప్పుడు ఎంతో వినయంతో, ఈ కోటలోని సేవకులయెడ సైతం విధేయత చూపుతూ ఇచట కాలక్షేపం చేశాడు. వచ్చినప్పుడు పట్టి బికారి. ఇక్కడ బాగా తిని, పొతరించి, తిరిగి తన దేశం పోయి, ఇక్కడి సాక్సన్ సామంతుల విశ్వాసాన్ని గూర్చి, అమాయకత్వాన్ని గూర్చి తన దేశీయులకు చెప్పాడు. మనమీ పరాయివాళ్ళను విశ్వసించి మన నౌకర్లుగా ఉంచుకున్నామప్పుడు. వాళ్ళ కళాకారులనూ కళలనూ అరువు తెచ్చుకొని, మన నిరాడంబరతనూ, శ్రమజీవన పద్ధతినీ నిరసించాము. నార్మన్ సైన్యాలు మనల్ని జయించకముందే, వారి కళలకు మనం దాసోహమైపోయాము. నా మట్టుకు నాకు, స్వాతంత్ర్యంతో పోయిగా తిన్న మన మోటుతిండే సుఖప్రదంగా ఉంటుంది. ఈ నార్మన్ల వింత వింత రుచుల భోజ్య పదార్థాలు నాకు గిట్టవు. ఆ వింతరుచులకు దాసులం కావడం వల్లనే మన జాతికి ఈ గతి పట్టింది'—అన్నాడు సెడ్రిక్.

'మోటుభోజనం పెట్టినా పరమ నాగరిక భోజనంగా ఎంచుకొనేటట్లుగా ఉంది ఇప్పుడు నా పరిస్థితి. ఆ వెనుకటి సంగతులన్నీ మీ కెంత చక్కగా జ్ఞాపక

మున్నాయి! మధ్యాహ్నభోజనంవేళ అయినసంగతికూడా మరిచి మీరా తల పోతలో మునిగిపోవడం నాకు చాలా ఆశ్చర్యంగా ఉంది'— అన్నాడు ఎథెల్‌స్టేన్.

ఇప్పటికి ఒళ్ళు తెలిసినట్లయి, సెడ్రిక్ చాలా చిరాకు పడి తనలోతాను ఇలా అనుకొన్నాడు: 'ఇతనిముందర భోజనంసంగతి తప్ప ఇంకేంసంగతి మాట్లాడిన వృథా కంఠశోష. ఇంతటి స్ఫురద్రూపంలో ఇట్టి మందకొడి తనం ఉండడం విషాదకరం. సాగ్జన్‌జాతి పునరుజ్జీవన మహోద్యమం ఇలాంటి దుర్బలమైన ఊతకపై ఆధారపడవలసివస్తోంది. రొవేనాను వివాహమాడిన పిమ్మటనైనా ఇతనిలోని గర్భితశక్తులు మేల్కొంటే మేల్కోవాలి. ముందు మేమందరమూ ఈ చెరలోంచి బయటపడతేగదా! మేము స్వేచ్ఛగా ఉంటే తమ జాతికి విపత్తు తెచ్చిపెడతామనే ఉద్దేశ్యంతోనే బహుశః ఈ దుర్మార్గుడు ఫ్రాంట్‌డీబాఫ్ ఈ పని చేసినట్లున్నాడు.'

సెడ్రిక్ ఈ ఆలోచనలలో మునిగియుండగా, పోటు తలుపు తెరచుకొని, ఒక వేత్రహస్తుడు నలుగురు పరిచారకులతో లోనికి వచ్చాడు. వివిధభోజన పాత్ర లమర్చబడిన ఒక బల్లను ఆ నలుగురూ లోనికి తీసుకొనివచ్చారు. భోజనపదార్థాల వాసన ముక్కుకు తగలగానే ఎథెల్‌స్టేనుకు ప్రాణం లేచివచ్చినట్లయింది. ఆ వచ్చినవారంతా తామెవ్వరైనదీ తెలియరాకుండా ముసుగులు ధరించి ఉన్నారు. మాటా, పలుకూ, ఏమీ లేదు. మూగగా, వడ్డనమాత్రం చేయ నారంభించారు.

'ఏమిటీ మూకాభినయం? ఇది యెవ్వరి దుర్గమో, మీ రెవ్వరి నౌకర్లో మాకు తెలియలేదనుకున్నారా? మా వలన డబ్బు సంపాదించుకోవాలనే ఆశ మీ యజమాని ఫ్రాంట్‌డీబాఫ్‌ను ఈ పనికి ప్రేరేపించినట్లుంది. మంచిది, అలాగే సంపాదించుకోమనండి. యెంత డబ్బిస్తే మమ్మల్ని వదుల్తారో చెప్పమనండి. మా శక్తికి మించనిదైతే అలాగే చెల్లిస్తాం. పోయి చెప్పండి,—' అన్నాడు సెడ్రిక్.

వేత్రహస్తుడు జవాబేమీ చెప్పక చిత్తమన్నట్లుగా మాత్రం శిరస్సు వంచాడు.

'ఇదిగో, మీ యజమానితో ఇంకొక సంగతి చెప్పు. మమ్మల్ని విడుదలచేసిన తరువాత ఎనిమిది రోజుల్లోగా నాతో నేలమీదనైనాసరే గుర్రంమీద నైనాసరే, యుద్ధానికి సవాలు చేశానని చెప్పు. అతడే గనుక నిజమైన వీరుడైతే నా సవాలు అందుకొని తీరాలి'—అన్నాడు ఎథెల్‌స్టేన్.

వేత్రహస్తుడు తిరిగి చిత్తమన్నట్లు తలవంచాడు.

అయితే, ఎథెల్‌స్టేన్ ఈ సవాలుచేసిన వైఖరిమాత్రం అంత సొగసుగా లేదు. రెండు దవడలకూ ఒకేసారిగా పని కల్పించేటట్లు నోటినిండా ఏదో నములుతున్న సందర్భంలో అతడీ సవాలు చేశాడు. అందుచే, మాటల్లో ఉన్న తీవ్రత ఉచ్చారణలో మందగించిపోయింది. అయినా, ఆ సవాలుకు సెడ్రిక్ చాల సంతోషించాడు. ఎథెల్‌స్టేనులోని మందకొడితనం వదలిపోతున్నదనే తృప్తి కలిగిందతనికి. అతనిని ప్రశంసిస్తూ కరచాలనం చేశాడు. కాని, ఇందుకు జవాబుగా ఎథెల్‌స్టేన్,— 'ఇలాంటి ఫ్రాంట్‌డీబాఫ్‌లను డజనుమందిని ఎదుర్కోడానికైనా నేను సంసిద్ధమే,— ఈ ఖైదులోంచి నేను త్వరగా బయటపడేటట్లయితే. చూడండి, ఈ పదార్థంలో వెల్లుల్లి ఎంత ఎక్కువగా వేశారో!'— అనేసరికి అతని మనస్సు చివుక్కుమంది.

భోజనమింకా సరిగా పూర్తికాలేదు, ఇంతలో ఎవరో, కోట సింహద్వారంవద్ద అతి తీవ్రతతో, ఏదో మహావిపత్తు వచ్చిపడినట్లుగా ముమ్మారు కొమ్మూదిన ధ్వని వినవచ్చి, అందరూ కిటికీవద్దకు పరుగెత్తి చూచారు. కాని, అది కోట భవనాంతర్భాగమైన ఒక పెల్లా మాత్రమే అయినందున, వారికేమీ కనుపించలేదు. కోటలో ఏదో పెద్ద సంచలనం బయలుదేరినట్లు మాత్రం ఆ సందడులనుబట్టి స్పష్టమయింది.

# అధ్యాయం ౨౨

సెడ్రిక్ ఎథెల్ స్టేనులను అంతటితో వదలి, వారికంటె కఠినతరమైన పరిస్థితులలో ఖయిదుచేయబడిన ఇసాక్ సంగతి ఇప్పుడు చూద్దాం. పాపమా యూదీయుని బంధించినది చీకటికోణంగా ఉన్న ఒక నేలమాళిగ. నేలంతా తేమగా ఉంది. చేతికందిన యెత్తులో ఉన్న ఒకటిరెండు సన్నని కంతల లోంచి మాత్రం కొద్దిగా వెలుగు రావడానికి అవకాశముంది. అదయినా మధ్యాహ్నవేళ మాత్రమే. పొద్దు ఇటు వాలిఉన్నా, అటు వాలిఉన్నా ఆ భూగృహం చీకటికే ఆవాసం. త్రుప్పుపట్టిన ఇనపసంకెళ్లు కొన్ని ఆ చెరసాల గోడలకు వేళ్లాడుతున్నాయి. ఒక సంకెళ్ల జత కడియాలలో రెండు శిధిలమైన బొమికలు ఇరుక్కొని ఉన్నాయి. బహుశః అవి, అచట ఖయిదుచేయబడి దుర్మరణంపాలైన ఏ అభాగ్యుని కాలి బొమికలో అయిఉండాలి. చచ్చి ఎముకల గూడుగా మారేటంతవరకూ గూడ వాని గతి విచారించినవారు ఉండియుండరు.

భయంకరమైన యీ నేలమాళిగకు ఒక మూలగా, ఒక పెద్ద కొలిమి, దానిమీద ఒక ఇనపచట్రం, కొన్ని ఇనపకడ్డీలు—ఉన్నాయి.

ఎంత గుండెనిబ్బరం గలవానికైనా హడలగొట్టేటట్లుగా ఉన్నదా దృశ్యమంతా కూడ. కాని, ఇసాక్ ఇప్పుడు ఇంతకుపూర్వం పడ్డంత కంగారు పడడంలేదు. మృగయావినోద రసికులు చెప్తూఉంటారు—కుందేలు వేటకుక్కలచేత తరుమబడుతున్నప్పుడు పడేటంత ఆందోళన, వాటి కోరలకు చిక్కినప్పుడు పడదని. బహుశః అదే మానసికపరిస్థితిలో ఉన్నట్లు తోస్తుంది ఇసాక్. అనేక సందర్భాల్లో తరచుగా భయపడుతూ ఉండడం యూదీయులకు అలవాటైపోయినందువలన, ఎలాంటి దౌర్జన్య ప్రయోగాన్ని ఎదుర్కోడానికైనా వారి మనస్సు ఒకవిధంగా ముందుగానే తయారై ఉండడం సహజం. అందుచే, సాక్షాత్తుగా దౌర్జన్యం అనుభవించవలసివచ్చేసమయానికి అది వారికి క్రొత్తగా ఉండదు. పైగా, ఇటువంటి ప్రమాద పరిస్థితులలో చిక్కుకొనడం ఇసాక్‌కు ఇది క్రొత్తగాదు. వెనకటి అనుభవాలు ఇప్పుడతనికి మార్గదర్శకమైనాయి. వెనకటి సందర్భాల్లో తప్పించుకొని బయటపడ్డట్టుగానే ఇప్పుడు గూడ ఏదో విధంగా తప్పించుకోవచ్చుననే ఆశ కూడ సన్నగా లేకపోలేదు. అన్నిటికంటె ముఖ్యంగా, ఎలాంటి హింసకూ ఒకపట్టాన లొంగని ఒకవిధమైన మొండితనం ఇసాక్‌లో బాగా ఉంది. యూదీయజాతివారికి ఇలాంటి మొండితనం సర్వసామాన్యం.

ఆ చీకటికోణంలో ఒకమూల ఇసాక్, ఇట్టి నిబ్బరంతో చేతులు కట్టుకొని ఒక శిలాప్రతిమలా కూర్చున్నాడు సుమారొక మూడుగంటలసేపు. కదలలేదు, మెదలలేదు. అప్పటికి, ఎవరో ఆ నేలమాళిగ మెట్లుదిగి వస్తున్నట్లు చప్పుడైంది. మరుక్షణంలో, కిర్రుమని వికృతమైన ధ్వని చేస్తూ తలుపులు తెరుచుకున్నాయి. టెంప్లార్ బ్రియన్ తాలూకు తురుష్క బానిసలిద్దరూ వెంటరాగా రెజినాల్డు ఫ్రాంట్ డీబాఫ్ లోనికి ప్రవేశించాడు.

ఫ్రాంట్ డీబాఫ్ దీర్ఘకాయుడు. బలిష్ఠుడు. జీవితంలో ఎన్నో పబ్లిక్ యుద్ధాల్లోనూ ప్రయివేటు కలహాల్లోనూ పాల్గొని రాటుతేలినవాడు— సామంతప్రభువుగా తన అధికార ప్రాబల్యాలను విస్తరింపజేసుకోడానికి ఉచ్చనీచాలు లేకుండా నానామార్గాలూ తొక్కినవాడు. అతని ఆకృతి విశేషం కూడా ఇందుకు తగినట్లుగానే ఉండి, అతని క్రూరస్వభావాన్ని ప్రస్ఫుటంగా వెల్లడిచేస్తూ ఉంటుంది. ముఖంమీది గాయపుమచ్చలు అతని భయంకర స్వరూపానికి మరింత భయంకరత్వం తెచ్చిపెట్టాయి. మరొకరకం ముఖంమీదనైతే ఆమచ్చలు వీరపురుషలక్షణాన్ని యినుమడింపజేసి ఆవ్యక్తిమీద గౌరవభావాన్ని ప్రేరేపించి ఉండేవి. ఒంటికి గుత్తంగా అంటిపెట్టుకొని ఉండే ఒక తోలు అంగరఖా తొడిగి, నడుమున పటకాలో ఒకవైపున బాకూ, మరొకవైపున ఒక తాళంచెవుల గుత్తితో ఫ్రాంట్ డీబాఫ్ అచట ప్రత్యక్షమయ్యాడు.

వెంటవచ్చిన బానిసల వైఖరి కబేలాలో జంతువులను నరకడానికి సిద్ధంగా ఉన్న కసాయివాళ్లను తలపించేదిగా ఉంది. ఫ్రాంట్ డీబాఫ్ లోనికి రాగానే ముందు జాగ్రత్తగా లోపలివైపున తలుపుకు తాళంపెట్టి, ఇసాక్‌ను తన చూపుతోనే మంత్రమూర్ఛితుని చేసివేస్తాడా అన్నట్లు చూస్తూ సమీపించాడు. భయాతిరేకంచేత ఇసాక్‌కు కీళ్లన్నీ సడలిపోయాయి. నోరుతెరచి, భీతితో రెప్పపాటులేక నిలువుగ్రుడ్లు వేసి చూస్తూ, కూర్చున్నవాడింకా కుప్పకూలినట్లయిపోయాడు. లేచి నిలబడి అభివాదం చెయ్యాలని,- కనీసం నెత్తిమీదటోపీ తీసి తన వినమ్రతను చూపాలనియైనా అతనికి తోచలేదు.

ఇసాక్ రూపం ఎంత కుదించుకొనిపోయిందో, ఫ్రాంట్ డీబాఫ్ రూపం అంత విస్తరించుకొన్నట్లయింది. పావురాయిమీద పడేముందు రెక్కలువిదల్చుకొనే డేగలాగా అతనిముందు మూడడుగుల దూరంలో నిలిచి, చేసన్నతో ఆ ఇరువురు బానిసల్లో ఒకడిని చేరబిలిచాడు. వాడు దగ్గరకు వచ్చి, తన చేతనున్న బుట్టలోంచి ఒక పెద్ద త్రాసూ, కొన్ని తూనికరాళ్ళూ తీసి అక్కడ పెట్టి, తిరిగి వెనక్కు వెళ్ళి రెండవవానితోబాటుగా నిలబడ్డాడు.

అంతట ఫ్రాంట్ డీబాఫ్, కర్కశమైన కంఠస్వరంతో ఈ విధంగా కథాప్రారంభం చేశాడు: 'అరేయ్, నీచాతినీచుడా! చూశావా ఈ త్రాసును?'

చూడాలన్నట్లు ఇసాక్ బెదురుతో తల ఊపాడు.

'ఈ త్రాసుతో నీవు నాకు కచ్చితంగా వేయి పౌనుల నిఖారసు వెండి నాణేలు తూచియివ్వాలి. తెలిసిందా?'—అన్నాడు ఫ్రాంట్‌డీబాఫ్.

'అమ్మబాబో! వెయ్యిపౌన్లే! అంత వెండి నా దగ్గిరెక్కడిది? కట్టుకథల్లోనైనా అంతసొమ్ముప్రసక్తి వినిపించదే! అంత ధనరాశి ఎవరైనా ఎప్పుడైనా కళ్లనైన చూచిఉంటారా? యార్కునగరంలో నా యిల్లేకాదు, మా జాతీయుల ఇళ్లన్నీ గాలించినా అంత సొమ్ము దొరికేమాట అబద్ధం'—అన్నాడు ఇసాక్, అంత భయంలోంచీ పెకలించుకొని.

'ఈ మాటలు నా దగ్గిర పనికిరావు! నేను చాలా సబబుగా అడిగాను. వెండి లేకపోతే బంగారమిచ్చినా నేను వద్దనను. ఒక బంగారు మార్కుకు ఆరు వెండిపౌన్ల చొప్పున ఆ మొత్తానికి బంగారమిచ్చినప్పటికీ, నీ వెన్నడూ కనివిని యెరుగని ఒక ఘోర హింసనుండి యిప్పుడు తప్పించుకొని బయటపడగలుగుతావు!'

ఇసాక్ బిగలాపడి ఇలా ఆక్రందించాడు: 'అయ్యయ్యో! నావంటి చిట్ట పురుగును నలిపివెయ్యడం నీకు ఏమంత ఘనత? పండిపోయిన ముసలిని, అల్పుడను, పరమదరిద్రుణ్ణి. నీవో, గొప్ప యోధాగ్రేసరుడవు. నీ శక్తి నావంటివానిమీద చూపదగింది కాదు. నన్ను కనికరించు.'

ఫ్రాంట్‌డీబాఫ్ వికటాట్టహాసం చేస్తూ, 'నీవు ముసలివాడవే కావచ్చు. అది నిన్ను ఇంతవరకూ బ్రతకనిచ్చినవారి దోషం. మితిలేని దురాశతో, విపరీతపు వడ్డీలు గుంజడంలో ఆరితేరిన నిన్నసలు ఏనాడో కడతేర్చి యుండవలసినది. ఇక పోతే, నీవు పట్టి అల్పుడవనే సంగతికూడా నేను నిరాక్షేపణగా ఒప్పుకుంటాను. కాని, దరిద్రుడవంటే మాత్రం నమ్మడానికి యిక్కడ యెవరూ సిద్ధంగాలేరు. నీవు గొప్ప ధనికుడవనే సంగతి ఆబాలగోపాలానికీ తెలుసు'—అని సమాధానం చెప్పాడు.

'అయ్యో, అలా అంటే నేను ఏం చెప్పేది! ప్రమాణం చేసి చెపుతున్నాను, ఎంత ఒట్టుపెడితే అంత ఒట్టు! నేను'—అని యింకా ఏమో చెప్పబోతున్నాడు ఇసాక్.

'ఇదిగో నీ కబుర్లు నా దగ్గిర పనికిరావు. ఎందుకు వృథాగా చెడిపోతావ్! నే నడిగినదానికి ఒప్పుకోకపోతే నీ కెలాంటి గతిపడుతుందో కళ్ళార చూచి తెలుసుకుంటేనే గాని నీవు దారికి రావల్లేఉంది. నే నూరికే బెదిరిస్తున్నానని పొరబడేవు. పట్టి బెదిరింపులు నాకు చేతకావు. ఈ చీకటికొణం ఎటువంటిదో నీ కింకా తెలియదు. నీ కంటె పదివేలరెట్లు ఎక్కువైనవాళ్లే ఇచట

దిక్కు మొక్కు లేకుండా నశించిపోయారు. లోకానికి ఈ నాటివరకూ వారేమైపోయినదీ తెలియదు. వాళ్లదింకా అక్కడికి చాల సుఖకరమైన చావే. అంతకంటె భయంకరమైన చావు నీవు చావవలసివస్తుంది—నామాట వినకపోతే! జాగ్రత్త!'

అంటూ అతడు బానిసలను చేరబిలిచి, వాళ్ల భాషలో ఏదో చెప్పాడు. వాళ్లు వెంటనే తమ బుట్టల్లోంచి కొన్ని బొగ్గులూ, కొలిమితిత్తులూ, ఒక నూనె సిద్దీ బయటికి తీసి, అక్కడ ఉన్న కొలిమిలో బొగ్గులు పోసి చెకుముకితో నిప్పు రాజేసి తిత్తులూది మండించడం మొదలుపెట్టారు.

'ఇదిగో ఇసాక్, ఆ కణకణ మండే బొగ్గులపైగా యినపఖడ్డీలు పరిచి ఉన్నాయి చూశావా? హంసతూలికా తల్పంమీద శయనించినట్లుగా ఇప్పుడు నీవు ఆ ఖడ్డీలమీద పడుకోవలసి ఉంటుంది. ఒంటిమీద గుడ్డలుండటానికి వీలులేదు. ఒక బానిస కొలిమితిత్తులూది మంట మండేస్తూ ఉంటాడు. రెండవవాడు నీ అవయవాలకు చమురు రాసి నీ శరీరం మాడిపోకుండా వేగేటట్లు చేస్తాడు—ఇప్పుడు నీకు అర్థమయిందనుకుంటాను. నేనడిగిన వేయి పౌన్లూ నన్ను విసిగించకుండా యిస్తావో, లేక యీ నిప్పుల శయ్యపై పవ్వళిస్తావో,—ఏదో ఒకటి చప్పున తేల్చుకో!' అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

'అసంభవం! అంత ఘోరమైన పని నీవు చేస్తానంటున్నావే కాని చెయ్యలేవు. ఈ భగవత్సృష్టిలో యింత క్రూరకృత్యం చేయజాలిన గుండె ఉన్నదంటే నేను నమ్మను'—అన్నాడు ఇసాక్, బెగ్గడిల్లిపోతూ.

'చాలా పొరపడుతున్నావు ఇసాక్. నా సంగతి నీకు సరిగా తెలియదు కాబోలు. ఒక నగరానికి నగరాన్నే నిర్దయగా సర్వనాశన మొనర్చినవాణ్ణి నేను. హాహాకారాలు చేస్తూ మా క్రైస్తవ జాతీయులు వేలకొలదిగా నశిస్తుంటేనే చలించని నేను, యూదుజాతికి చెందిన నీవంటి తుచ్ఛుడు పెట్టే ఏడుపులూ పెడబొబ్బలకూ కరుగుతాననుకోడం వట్టి భ్రమ యని తెలుసుకో! నా మాట విని, నీ అన్యాయార్జిత విత్తభారం కొంత వదుల్చుకో! మా క్రైస్తవుల నుండి గుంజిన సొమ్మేగా! అందులో కొంత తిరిగి ఒక క్రైస్తవునికి ముట్టజెప్పడంలో బేసబబు లేదు. జిత్తులమారివి, తిరిగి చిటికెలమీద సంపాదిస్తావు, నీ కది ఒక లెక్కా! ఈ నిప్పుల శయ్యపై ఒక్కసారి పడుకోడం జరిగితే మాత్రం, ఆ వేగిపోయిన చర్మాన్నీ మాంసాన్నీ మామూలు స్థితికి తేవడం ఇక ఏ వైద్యుని వలనా, ఏ మందులవలనా కాదు. ఈ భూగృహంలో పడి తిరిగి బయటపడ్డవారిదివరకెవ్వరూ లేరు. 'ఇంతసొమ్ము చెల్లించి నేనొక్కణ్ణీ బయటపడ్డా'నని చెప్పుకొందువుగాని—త్వరగా తేల్చు. ఇక యీ వృథా ప్రసంగం నాకిష్టంలేదు'—అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

ఇసాక్ ఇప్పటికీ తన మామూలు ధోరణి విడువలేదు- 'అయ్యో దైవమా! నా వద్ద అసలు అంత సొమ్ము లేనిదే నేను ఎక్కడనుంచి తెచ్చియిచ్చేది!'— అని వాపోయాడు.

'ఇక నీవు సౌమ్యంగా చెపితే వినవు. రండిరా, వీణ్ణి నిలవదీసి గుడ్డలూడదీయండి!'— అని బానిసలకు సంజ్ఞ చేశాడు. ఫ్రాంట్ డీబాఫ్ బానిసలు ముందుకువచ్చి యిసాక్‌ను బలవంతంగా లేవతీసి నిలబెట్టారు. అన్నంతపనీ చేయించేటట్లున్నాడో, లేక ఏ మాత్రమైన తగ్గేటట్లున్నాడో తెలుసుకోడానికి యిసాక్, ఫ్రాంట్ డీబాఫ్ ముఖంలోకి పరిశీలనగా చూచాడు. ఎప్పటివలెనే నిర్ఘృణమైన వికటహాసం అతని వదనంపై తాండవిస్తూ ఉండడం గమనించాడు. ఆ బానిసలధోరణికూడా అతడు చెప్పినంతపనీ సంకోచించకుండా చేసేటట్లుగానే ఉంది. ఇక ప్రయోజనం లేదనుకున్నాడు ఇసాక్. పట్టుదల సడలిపోయింది. 'ఆగండాగండి! వెయ్యి పౌన్లూ చెల్లిస్తాను. అంటే,... మా బంధువుల తోడ్పాటుతో ఎలాగో చెల్లిస్తాను. ఏలనంటే, మా దైవమందిరం దగ్గిర బిచ్చగాడిలాగా ముష్టెత్తితే తప్ప అంతసొమ్ము నాకు ప్రోగుకాదు. ఎప్పటికి చెల్లించాలి, ఎక్కడ చెల్లించాలి?' అని అడిగాడు.

'ఎక్కడో కాదు, ఇక్కడే, ఈ భూగృహంలోనే చెల్లించాలి. కాటాతో తూచి, లెక్కపెట్టి మరీ చెల్లించాలి. సొమ్ము చేతికి చిక్కందే నిన్ను వదలిపెడతాననుకున్నావేమిటి?'— అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

'అయితే,— సొమ్ము చెల్లించబడ్డ తర్వాత నేను నిజంగా విడుదల చేయబడుతాననడానికి హామీ ఏమిటి?' అని అడిగాడు ఇసాక్.

'నా మాటే హామీ. నార్మన్ సామంతుని మాట మీ యూదు షావుకార్లందరి దగ్గిరా ఉన్న వెండి బంగారాలకంటె నిఖారసైనది తెలుసా?'— అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

'క్షమించాలి. నామాటమీద బొత్తుగా నమ్మకముంచనివాని మాటను నేను మాత్రం ఎలా నమ్మను?' ఇసాక్ వీరికిచూపు చూస్తూనే అడిగాడు.

'ఎలాగైనా నమ్మవలసిందే,— నీ కిక గత్యంతరం లేదుగనుక. యార్కు నగరంలో నీ ధనాగారంలో నీ వుండి, నేను నిన్ను అప్పు అడగవస్తే, డబ్బు తిరిగి ఎప్పటికి చెల్లించాలో, హామీ యేమిటో,— అంతా నీ షరతుల ప్రకారం జరిగించుకునేవాడవు కాదా? ఈ భూగృహం నా ధనాగారం. ఇక్కడ నా షరతులు చెల్లాలి. అవి యేమిటో ఇదివరకే చెప్పేశాను. ఇప్పుడు నేను తిరిగి ఏకరువు పెట్టదలచుకోలేదు' అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

ఇసాక్ ఒక పెద్ద గొండ్రింపు గొంద్రించాడు. 'అయితే, నన్ను వదిలే టప్పుడు, నాతోపాటుగా, నా తోడి ప్రయాణీకులను కూడా దయచేసి వదిలి పెట్టండి. యూదీయుణ్ణని నన్ను వాళ్లు అసహ్యించుకున్నా, నా పరిస్థితి చూచి జాలిపడి నాకు సాయం చేయగోరి నా కోసం ఆగి తాముగూడా యీ చిక్కుల పాలైనారు. అదీన్నీగాక, నా విడుదల సొమ్ముకు ఎంతోకొంత వాళ్లుకూడా విరాళమివ్వవచ్చు' అని పలికాడు.

ఫ్రాంట్ డీబాఫ్ చులకనగా ఆ మాట త్రోసివేస్తూ, 'నీ వనేది ఆ సాగ్జన్ తొత్తుకొడుకుల సంగతా? వాళ్ల విడుదలకు వాళ్లు ఎంతసొమ్ము చెల్లించాలో ఆ షరతులు వేరుగా ఉంటాయి. ఆ సంగతి నీ కెందుకు, నీ సంగతి నీవు చూచుకో! ఇతరుల విషయాల్లో జోక్యం నీ కనవసరం'—అని ఉద్ఘాటించాడు.

'అయితే, గాయపడి డోలీలో నా వెంట ప్రయాణమైవచ్చినవానిని మాత్రమే నాతోపాటు వదుల్తా మంటారా?' అని అడిగాడు యిసాక్.

ఫ్రాంట్ డీబాఫ్ ఉగ్రుడై ఒక ఉరిమి ఉరిమాడు. 'ఎన్నిసార్లు చెప్పాలి నీకు యితరుల పరిస్థితి అనవసరమని? నీ విడుదలకు నీవు ఎంతసొమ్ము చెల్లించాలో నిశ్చయించుకొన్నావ్. ఇక అది ఎంతత్వరగా చెల్లిస్తే అంతమంచిది నీకు.'

కాని, ఇసాక్ ఇంకా పెనగులాట మానలేదు. 'మన్నించాలి, ఒక్క మాట. నీ వడిగిన సొమ్మునుగూర్చే. ఏ సొమ్ము సంపాదించడంకోసం నీవు నిస్సంకోచంగా నీ...' తాననబోయే మాట ఫ్రాంట్ డీబాఫ్‌ను యింకా రెచ్చగొడుతుందేమోనని ఇక్కడ ఇసాక్ తటపటాయించాడు. కాని, ఫ్రాంట్ డీబాఫ్ వెంటనే అందుకొని, 'ఎందుకలా తటపటాయిస్తావ్? అనదలచిందేమిటో అనేసెయ్. 'ఏ సొమ్ము సంపాదించడంకోసం నీవు నీ అంతరాత్మను చంపుకోడానికి గూడ వెనుదీయలేదో'—అని కాదూ నీవు నన్ను అనదలచింది? అను!—నాకేం అభ్యంతరం లేదు. నేను అంత బొత్తుగా సరసుణ్ణి కాదనుకున్నావేమిటి? నాతో వ్యవహారంలో నష్టపడేవాళ్లు నన్ను యెన్నిఅన్నా సైరించగల సరసత్వం నాకు ఉంది. ఆ అనేది యూదీయుడైనా సరే నేనేమీ అనుకోను. నేను చూపే ఓరిమి జాన్స్ ఫిడ్జ్‌డోటెరెల్ విషయంలో నీవు చూపలేకపోయావు. జ్ఞాపకముందా? తన పిత్రార్జితమంతా నీ ఋణతీర్మానానికి సెలవై పోయిందనే కడుపుమంటచేత అతడు నిన్నేదో తిట్టాడనికాదూ, అతన్ని కోర్టుకీడ్చి, నానాతిప్పలూ పెట్టావు?'—అన్నాడు.

'పొరపాటు పొరపాటు! నాకు రావలసిన డబ్బు నేను ప్రాధేయపడి అడిగినందుకు, ఫిడ్జ్‌డోటెరెల్ నా గదిలోనే నన్ను బాకుతో పొడవ వచ్చాడు. అప్పటికి డబ్బు చెల్లించవలసిన గడువు దాటిపోయింది.' అన్నాడు యిసాక్.

'అతనేమైనా చెయ్యనీ— నాకు కావలసినదిప్పుడు నా డబ్బు నాకు రావడం. చెప్పు, ఎప్పుడు చెల్లిస్తావు నా డబ్బు?'— అని గద్దించాడు ఫ్రాంట్ డీ బాఫ్. 'నా కుమార్తె రెబెకాను భద్రంగా యార్కు నగరానికి వెళ్ళేటట్లు చెయ్యి. వెళ్ళినమనిషి గుర్రంమీద తిరిగి రావడమే తడవుగా, నీ వడిగిన డబ్బు'—ఇసాక్ ఇక్కడ కొద్ది క్షణాలు తటపటాయించి తరువాత వాక్యం పూర్తిచేశాడు,— 'నీవడిగిన డబ్బు, యిక్కడే— ఈ భూ గృహంలోనే—ఎంచి నీకు అప్పగించబడుతుంది.'

ఫ్రాంట్ డీబాఫ్ ఆశ్చర్యంతో, 'ఏమిటి ఆ తుమ్మెదరెక్కల నల్లటిజుట్టు పిల్ల నీ కూతురా! అరే! ఈ సంగతి నాకు ముందే తెలిస్తే ఎంత బాగుండి పోయేది! నీ ఉంపుడుగత్తేమో అనుకున్నాను. అనుకుని, టెంప్లార్ బ్రయన్‌కు దాసీగా దాన్ని అప్పగించేశాను' అన్నాడు.

గుండెలో ఈషణ్మాత్రమైన జాలిలేకుండా ఫ్రాంట్ డీబాఫ్ తెలియజేసిన యీ సమాచారం వినగానే, ఇసాక్ ఆ భూగృహమంతా ప్రతిధ్వనించేటట్లు గోండ్రించాడు. అతనిని ఇరువైపులా తమ చేతులతో గట్టిగా పట్టుకొని నిలబడ్డ తురుష్కబానిసలుకూడా ఈ మాటకు, తమ చేతిపట్టు సడలిపోయేటంతగా ఆశ్చర్యచకితులయ్యారు. ఈ అదను చూచుకొని, ఇసాక్ తటాలున నేలమీద వ్రాలి ఫ్రాంట్ డీబాఫ్ మోకాళ్లు చుట్టవేసి యిలా ప్రాధేయపడ్డాడు:

'నీకు ఎంతడబ్బు కావాలన్నావో అంతా తీసుకో! ఇంకా పదిరెట్లు తీసుకో! నన్ను పట్టి బిచ్చగాణ్ణిగా చేసి వదలిపెట్టినా నా కిష్టమే. బాకుతో నన్ను చీల్చివెయ్యి, ఈ కొలిమిలో పెట్టి కాల్చివెయ్యి, నేనొప్పుకుంటాను— కాని నా కుమార్తెను మాత్రం నిరపాయంగా, సగౌరవంగా వదలిపెట్టించు. నీవూ ఒక ఆడకూతురుకు పుట్టినవాడవే. దిక్కులేని ఒక ఆడపిల్ల గౌరవం దయచేసి కాపాడు. అచ్చంగా అది తల్లిపోలిక పిల్ల. తల్లి చనిపోతూ చనిపోతూ జాగ్రత్త యని దీనిని నా చేతిలో అప్పగించిపోయింది. ఈ బ్రతుకులో నాకు ఈ ఒక్క ఆధారంకూడా లేకుండా చేస్తావా? నీకు జాలి అనేదే లేదా?'

ఫ్రాంట్ డీబాఫ్ బిగువు కొంచెంగా సడలింది. 'ఈ సంగతి నాకు ముందుగానే తెలిసివుంటే బాగుండేది. మీ జాతికి ఈ ప్రపంచంలో డబ్బు సంచుల మీద తప్ప యింక దేనిమీదా ప్రేమ ఉండదనుకున్నాను'—అన్నాడు.

ఫ్రాంట్ డీబాఫ్‌కు తన యెడ సానుభూతి కలిగినట్లుగా కనుపించిన ఈ యవకాశాన్ని ఇంకా విస్తరింప చేసుకోవాలని ఆశపడ్డాడు ఇసాక్. 'యూదులమైనంతమాత్రాన మేమంత పరమనికృష్టులమని అనుకోబోకు. వేటకాండ్రచేత తరుమబడే గుంటనక్కకూడా తన బిడ్డలమీద మమకార మూంటుంది. క్రైస్తవ

లోకమంతా అసహ్యించుకొని హింసించే యూదులుకూడా తమ సంతానాన్ని ప్రేమిస్తారు'—అన్నాడు.

'కావచ్చుగాక. నిన్నుబట్టి ఇకముందు ఈ మాట నమ్ముతాను. కాని, అందువల్ల ప్రస్తుతం మనకు కలిసివచ్చేదేమీ లేదు, జరిగినదేదో జరిగిపోయింది. జరగబోయేదాన్ని నేనేమీ మార్చలేను. నా మిత్రునికి నేను మాట యిచ్చేశాను. ఆ మాటకిక తిరుగులేదు. అయినా, టెంప్లార్ బ్రియన్ చేతిలోపడ్డ నీ పిల్లకు ఏదో అనర్థం వాటిల్లుతుందని నీ వెందు కనుకోవాలి?' అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

'అనర్థంకాక ఇంకేమిటి? పురుషులను క్రూరహింసలపాలు చెయ్యడం, స్త్రీలను మానభంగం చెయ్యడం — ఇది తప్ప టెంప్లార్లకు మరొకటి చేతకాదు'- అని ప్రత్యుత్తర మిచ్చాడు ఇసాక్, హృదయం వేదనతో ఘూర్ణిల్లిపోతుండగా, చేతులు నలుపుకుంటూ.

'నోరుముయ్! పవిత్రమైన టెంప్లార్ వ్యవస్థను దూషిస్తావురా! నీ బ్రతుకు సంగతి యేమిటో నీవు చూచుకో! నీ విస్తానన్న సొమ్ము ఇప్పుడు చెల్లించక పోతే నే నన్నంత పనీ చేశానన్నమాటే!' అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్. అతని కండ్లలోంచి నిప్పులు కురిసాయి. సడలిన ఉద్రేకాన్ని తిరిగి పూరించుకోడానికి ఇదొక అవకాశంగా దొరికిందతనికి.

ఇసాక్ ఇక భరించలేకపోయాడు, అతని కెంత చేతకాని ఉద్రేకమైనప్పటికీ, దాన్ని నిగ్రహించుకోడం అతనివలన కాలేదు. 'దుష్టుడా! దుర్మార్గుడా! ఏమిటి నీకు చెల్లించేది? ఏమీ చెల్లించను! నా కుమార్తెను భద్రంగా, సగౌరవంగా తిరిగి నాకు అప్పగిస్తే తప్ప, చిల్లిగవ్వైనా నావద్దనుంచి నీకు రాదు' అన్నాడు తిరస్కారంతో.

'ఒళ్ళు తెలిసే మాట్లాడుతున్నావా? నిప్పులమీద వేయించినా నీ శరీరం కనుగందదని నీకేమైన ధైర్యమున్నదా ఏమిటి? మంత్రశక్తులేమైన సంపాదించావా!'—అని వికటాట్టహాసం చేశాడు ఫ్రాంట్ డీబాఫ్.

'ఏమైనా చేసుకో! నేను లెక్కచెయ్యను. నీవు క్రూరహింసల పాలు చేస్తానని బెదిరిస్తున్న యీ నా శరీరంకంటె వెయ్యిరెట్లు ప్రీతిపాత్రమైనది నాకు నా కుమార్తె. నీవు నన్నేమిచేసినా సరే, నీకు నేను వెండిపౌన్లు చెల్లించేమాట అబద్ధం! ఎప్పుడు చెల్లిస్తానో తెలుసా? ఆ వెండిని మూసలో కరిగి, ఆ సలసలా మరిగేదాన్ని నీ దురాశా పాతకపు గొంతుకలో పోసే సందర్భంలో నైతే చెల్లిస్తాను. జీవితంలో నీవుచేసిన మహాపాపాల ఫలితంగా నీకు ప్రాప్తించనున్న ఘోరనరకంనుండి నిన్నొకవేళ డబ్బుతో తప్పించడానికి వీలుంటే, నీవు అర్థి చచ్చినా నీకొక పైసాయివ్వను. ఏ విధంగా నన్ను చంపదలచుకొన్నావో

చంపు! యూదీయుడు క్రైస్తవుని చేతిలో తానెన్ని ప్రహారహింసలైనా అనుభవించనీ, క్రైస్తవుని ఆశ నిరాశ చెయ్యక మానడనే సంగతి ఈ రోజున తెలుసుకొందువుగాని!'— అన్నాడు ఇసాక్. పుత్రికమీద వాత్సల్యం అతనిని అంతగా తెగించేటట్లు చేసింది.

ఫ్రాంట్ డీబాఫ్ తలపంకించి, 'చూస్తాం ఆ సంగతేమిటో! ఎర్రగా కాలిన ఇనపచట్రపు శయ్యాసుఖ పారవశ్యం ఇప్పుడనుభవిద్దువుగాని! కానివ్వండిరా, వీడి బట్టలూడదీసి, ఆ యినపచట్రానికి వీణ్ణి గొలుసులతో కట్టెయ్యండి!'—అని ఆజ్ఞాపించాడు.

ఆ ముష్కరతురుష్కులముందర ఈ ముసలి ఇసాక్ పెనుగులాట లేమి అక్కరకు వస్తాయి? త్రుటిలో వారతని పైయంగీని చించివేసి, వెంటనే లోపలి దుస్తులను గూడ లాగిపారవెయ్యడాని కుపక్రమించారు. ఈ సమయంలో వినవచ్చింది, ఏదో ఆపత్తును సూచిస్తూ కోటబయటినుండి శృంగధ్వని. వెన్వెంటనే, సర్ రెజినాల్డు ఫ్రాంట్ డీబాఫ్ కోసం ఆతుర్దాగా పిలుస్తున్న గొంతుకలు సమీపంలో వినిపించాయి. తానెట్టి బీభత్సపుకృత్యంలో నిమగ్నుడైనదీ పరులకు తెలియనివ్వడాని కిష్టంలేక, ఫ్రాంట్ డీబాఫ్ తొందరతొందరగా తిరిగి ఇసాక్ కు దుస్తులిప్పించివేసి, బానిసలతోసహా ఆ భూగృహంనుండి నిష్క్రమించాడు. అప్పటికా ప్రమాదం తప్పినందుకు భగవంతునికి కృతజ్ఞతాభివందనాలు సమర్పించినా, తన కుమార్తె ఎలా ఉన్నదో, ఎట్టి దౌర్జన్యాల పాలౌతున్నదోనని బెగ్గడిల్లుతూ, తన వాత్సల్యాతిశయంకొద్దీ ఏమేమో విపరీతసంఘటనలు భావించి తల్లడిల్లుతూ ఆ భూగృహంలో ఉండిపోయాడు ఇసాక్.

# అధ్యాయం ౨౩

రాణీ రోవెనాను ప్రవేశపెట్టిన గది పట్టి బోసిగది కాదు. ఏదో కొంత ఘనంగా అలంకారం చేసినదే. రోవెనాను అచట ప్రవేశపెట్టడం, ఇతర ఖయిదీలెవ్వరికీ చూపని గౌరవం ఈమెకు చూపడంకోసమేనని భావించవచ్చు. ఒకప్పుడు ఫ్రాంట్ డీబాఫ్ భార్య నివసించిన గది అది. ఆమె ఇప్పుడు లేదు. చాలా కాలం క్రిందటనే చనిపోయింది, అప్పటినుంచీ ఈ గదివిషయమై శ్రద్ధపట్టిన వారులేరు. ఆమె జీవించియున్న కాలంలో చేయబడిన అలంకారమిది. అందుచే ఇప్పుడు చాలా శోభ దక్కిఉంది. గోడలకు వ్రేలాడవేసిన తెరలు వగైరాలు రంగువెలిసి మాసి ఉన్నాయి. అయినప్పటికీ, ఉన్నంతలో ఆ కోట అంతటిలోకీ ఈ గదే సాక్సన్ రాజవంశీకురాలైన రోవెనాను ఉంచడానికి తగినదిగా భావించబడింది. ఏ దుర్విధిని తాను ఎదుర్కొనవలసివస్తుందోనని భీతిల్లుతూ ఆమె ఆ గదిలో కాలక్షేపం చేయసాగింది. ఈ లోపున, ఈ పాపిష్ఠినాటకంలో ముఖ్య పాత్రధారులైన ఫ్రాంట్ డీబాఫ్, డీబ్రేసీ, టెంప్లార్ బ్రయన్‌లు తాము ఎవరెవరితో ఏయే పాత్రలు నిర్వహించవలసినదీ నిర్ణయించుకున్నారు. ఇందుకోసం ముగ్గురూ చేరి ఒక చర్చ జరిపారు. చర్చ కొంత తీవ్రగతిలో కూడ నడిచింది. ఎవరికి వారు తమ తమ వాటాకు చెందవలసిన ప్రయోజనాలను గూర్చి వాదించుకున్నారు. ఎట్టకేలకు, ముగ్గురికీ ఒక విధమైన ఒడంబడిక కుదిరింది.

ఈ సమాలోచన అంతా ముగిసి, డీబ్రేసీ కొంత సావకాశంగా తన్నుతా నలంకరించుకొని రోవెనా గదిలోనికి వచ్చేసరికి, దాదాపు మధ్యాహ్నవేళ అయింది. మోకాళ్లవరకూ జీరాడే లోపలి దుస్తుపైన, మెత్తని బొచ్చుతో కూడిన విలువైన ఉన్ని అంగీ తొడిగాడు. ఉంగరాలుంగరాలుగా త్రిప్పిన గిరజాలు విలాసంగా మెడ వెనుక వ్రేలాడుతున్నాయి, చక్కగా గడ్డంచేశాడు. మొలను బిగించిన పటకానుండి ఒక పెద్ద కత్తి వ్రేలాడుతోంది. దాని పిడిపైనా, ఒరపైనా బంగారు నగిషీ పని చేయబడి ఉంది. కాలికి గూడ అలాగే నగిషీ చెడావులు తొడిగాడు. వాటి ముక్కులు పొట్టేలుకొమ్ముల్లాగా వెనుకకు వంగి ఉన్నాయి. మనిషికూడా కొంచెం స్ఫురద్రూపి అనే చెప్పాలి. సైనికోద్యోగికి ఉండే మోటుతనమూ, రాజాస్థానీయునికి ఉండే నాజూకుతనమూ అతని వైఖరిలో మిళితమై ఉన్నాయి.

వచ్చీరావడంతోటే, అభివాదసూచకంగా, నెత్తిమీది మొఖమల్ జరీటోపీ తీసి చేతబట్టుకొని, అలా కూర్చోవలసిందిగా చేసన్న చేశాడు. కాని ఆమె

యింకా నిలబడే ఉన్నందున, తాను తోసుకెళ్ళి ఆమెను కూర్చోబెట్టడానికని చేయిసాచాడు. కాని ఆమె వెనక్కు తగ్గి యిలా సమాధానం చెప్పింది— 'అయ్యా, మీ రెవరవో,- బహుశా నన్ను ఖయిదు చేసినవాడవే అయివుంటావు,— ఖయిదు చేసినవానిముందు ఖయిదీ నిలబడి ఉండడమే మంచిది. ఎట్టి విధిని నేను అనుభవించవలసియున్నదో తెలుసుకోగోరుతున్నాను.'

'కాదు సుందరీ, ఖయిదీవి నీవు కావు, నేను! ఎట్టి విధిని అనుభవించాలో ఎదురుచూడవలసినవాడు యీ డీబ్రేసీ,— నీవు కావు. నా విధిని నిర్ణయింపజాలినవి నీ సుందర నేత్రాలు'— అన్నాడు డీబ్రేసీ.

రొవెనా తన మానమర్యాదలకు దెబ్బ తగిలిందన్న రోషంతో, ఒకవిధమైన గరువతనాన్ని ప్రకటిస్తూ, 'అయ్యా నీ వెవ్వరవో నేనెరగను. మర్యాదమాలిన పరిచయం కల్పించుకొని, చారణకవిత్వపు ధోరణిలో ఏదో అనుచిత ప్రసంగం చేస్తున్నావు. బందిపోటు ధూర్తత్వాని కిదేమీ పరిహారం కానేరదు'— అని సమాధానమిచ్చింది.

డీబ్రేసీ ఇందాకటి ఒద్దికతోనే తిరిగి ఇలా అన్నాడు: 'సుందరీ, నీ కీయవలసిన మర్యాద నతిక్రమించి నేనేమి చేసినా, దానికి కారణం నీవూ, నీ సౌందర్యాతిశయమే! ఏది చేసినా నేను, నా హృదయేశ్వరిగా, నా నయన జ్యోతిగా భావించుకొన్న సుందరాంగికొరకే చేశాను. ఇది నీవు అవధరించాలి.'

రొవెనా తిరిగి వెనుకటి హుందాతనంతోనే, 'మళ్ళీ ఇందాకటి మాటే చెపుతున్నాను.— నీ వెవరవో నేను ఎరగను. చూపులకొక వీరపురుషునివలె కనిపిస్తున్నావు. వీరపురుషుడైనవా డెవ్వడూ ఇలా నిరాశ్రయంగా ఉన్న ఒక స్త్రీతో జోక్యం కల్పించుకొని అనవసరప్రసంగం చెయ్యడు'— అన్నది.

'నీవు నన్ను ఎరగకపోవడం నా దురదృష్టమే. కాని, డీబ్రేసీ పేరు ఈ ప్రాంతాల్లో చెప్పుకోనిది కాదు. వివిధ రణరంగాల్లోనేమి, పోటీ ప్రదర్శనాల్లోనేమి, వీడొనర్చిన వీరకృత్యాలు చారణులంతా గానం చేస్తూనే ఉంటారు'— అన్నాడు డీబ్రేసీ.

'చారణులు నీ వీరకృత్యాలను పొగిడితే పొగడవచ్చుగాక. ఆ పొగడ్త వాళ్ళ నోటికి అతికినట్లు నీ నోటికి అతకదు. ఆ చారణులైనా, గతరాత్రి జరిగిన సంఘటనను ఏ విధంగా పొగడుతారో తెలుసుకొనగోరుతున్నాను. శూరులుకాని కొద్దిమంది అనుచరులతో బయలుదేరి వెళ్ళి ఒక వృద్ధుని జయించి, అబలయైన ఒక కన్యను బలవంతంగా, ఒక బందిపోటుదొంగతాలూకు కోటకు చేరవెయ్య

డం,—ఇదికూడా ఒక ఘనకార్యంగానే వాళ్ళు పొగడుతారా?' అని ప్రశ్నించింది రొవెనా.

డీబ్రేసీ కొంచెం కంగారుపడి పెదవులు కొరుక్కుంటూ, తానొక గొప్ప వీరుడైనట్లు తెచ్చికోలుదర్పంతో ఇందాకటినుంచీ మాట్లాడుతున్న ధోరణిమాని, తన సహజ కంఠస్వరంతో ఇలా అన్నాడు: 'అన్యాయం రొవీనా, అన్యాయం! అనవసరమైన ఉద్రేకం తెచ్చుకొని మాట్లాడుతున్నావు. నీ సౌందర్యం కారణంగా ఏదో చేసిన నా పిచ్చిపనినిబట్టి నీవు లేనిపోని ఉద్రేకం పడవద్దు, కొంచెం స్థాయి తెచ్చుకొని మాట్లాడు.'

'నా స్థాయికేమిగాని, చారణులు మాట్లాడే చౌకబారు ధోరణిలో మాత్రం నీవిక మాట్లాడబోకు. యోధులూ సామంతులూ మాట్లాడదగిన ధోరణి కాదది'—అని రెట్టించింది రొవెనా.

తాను వీరపురుషుడ ననిపించుకోవాలని చేసిన ప్రయత్నం ఈ విధంగా విఫలమయ్యేసరికి, డీబ్రేసీకి రోషం వచ్చింది. 'ఎంత స్వాతిశయం! సరే! నీ స్వాతిశయానికి తగినట్లే నేనుకూడ వ్యవహరించక తప్పదు. ఇప్పుడు చెపుతున్నాను విను,—నేను నీ గుణశీలానికి అనురూపమైన పద్ధతిలోనే నిన్ను ఆసించి తీసుకొని వచ్చాను. నీవంటి తలతిక్క పిల్లలను ఆయుధాలతో మచ్చిక చేసుకోవలసిందే కాని మర్యాదమాటలతో కాదు'—అని బుసకొట్టాడు.

'మర్యాదమాటలా! నీచపుచేష్టలను కప్పిపుచ్చే మర్యాదమాటలు ఎవరి మెప్పుకోరకు? నాటకంలో నీచపాత్రధారి ఉత్తమపాత్రధారి దుస్తులు తొడుక్కొన్నంత మాత్రాన ఏమయినట్లు? బందిపోటు దొంగగా, ఆ దుస్తుల్లోనే ఉండి, ఆ మాటలే మాట్లాడితే నీ కెక్కువ గౌరవప్రదంగా ఉండేది. ఈ మర్యాదమాటలు నీకు సరిపోవు'—అన్నది రొవెనా.

'మంచిది! మంచి సలహాయే ఇచ్చావు! నీ వింత తెగించి మాట్లాడినందుకు నేనుకూడా తెగించి తగిన ప్రతిక్రియ చెయ్యకపోవడం భావ్యంకాదు. ఇదిగో చెప్పుతున్నాను విను,—ఈ కోటలోంచి నీ విక బయటపడడమనేది ఉండదు,—డీబ్రేసీకి భార్యగా తప్ప! ఎట్టి అవాంతరాలు వచ్చినా లెక్కచెయ్యకుండా నా పనులు నెరవేర్చుకోడం నా కలవాటు. ఒక సాక్సన్ కన్నెముందర నిలిచి తన ప్రవర్తనకు సంజాయిషీ చెప్పుకోవలసిన అవసరం నార్మన్ సామంతునికి లేదు. నేను నిన్ను చేపట్టగోరడం నీకే గౌరవమని తెలుసుకో! నీకు స్వాతిశయం చాలా ఉంది. ఉన్నదికాబట్టే నా భార్యగా ఉండతగినదానవని మరింతగా ఉద్ఘాటిస్తున్నాను. నన్ను చేపట్టితే నీ కన్నో గౌరవాధికార ప్రతిపత్తులు లభిస్తాయి. ఇంకొక విధంగా అవి నీకు లభించడం అసంభవం. పల్లెటిదిక్కున ఎక్కడో మారుమూల, పందులమందలే సంపదగా వాటిమధ్య జీవితం వెళ్ళబుచ్చే

సాగ్జన్ మూకల మధ్యనుంచి బయటపడి, నీ అందచందాలకు తగిన అధికారప్రపత్తితో ఇంగ్లాండులో కల్పి మన్నవకకే స్థితికి నీవు రావాలంటే, దానికి ఉపాయం నన్ను చేపట్టడమే!'—అన్నాడు డీబ్రేసీ.

'సాగ్జన్లన్నా, సాగ్జన నివాసాలన్నా నీ కంటికి అంత హేయంగా కను పిస్తే కనిపించవచ్చు. కాని, నేను చిన్నప్పటినుంచీ పుట్టిపెరిగినది వారిమధ్యనే, వారి నివాసస్థానాల్లోనే! ఆ స్థానాన్ని నేను వదలిపెట్టే రోజంటూ వస్తే, ఆ స్థానాన్ని గాని అచటి ఆచార వ్యవహారాలనుగాని హేయంగా భావించని వ్యక్తికి సహధర్మచారిణిగా మాత్రమే వస్తాను' అన్నది రొవెనా.

'నాతోమాకు అందనివ్వకుండా ఏదో చాలగూఢంగా చెప్పాలనుకున్నావు గాని, నీ అభిప్రాయం నా కర్థమయింది. కాని, రిచర్డురాజు తిరిగి సింహాసనం ఎక్కగలిగేమాట అబద్ధమని తెలుసుకో! అతనికే స్వాగతం లేనపుడు, అతని ఆశ్రితుడు ఐవాన్‌హో నిన్ను చెట్టపట్టి అతని ఆస్థానానికి చేరగలుగుతాడనేది కూడ కలలోని వార్తే! నీ ప్రేమసాధనలో ఐవాన్‌హో నాకు ప్రతిద్వంద్వి. అందని మ్రానిపండుకు అతడు అర్రులు చాస్తున్నాడు. నేనా, అతని కది అంద నిచ్చేది! అతడిప్పుడు నా గుప్పిట్లో ఉన్నాడు. ఫ్రాంట్ డీబాఫ్ కింకా తెలి యదు,—అత డీ క్షణంలో ఈ కోటలోనే ఉన్నాడన్న సంగతి. ఫ్రాంట్ డీబాఫ్కు గనుక ఈ రహస్యం చెవిని వేశానంటే, నాకంటె భయంకరుడైన ప్రతిద్వంద్వి చేతిలో పడ్డాడన్నమాటే ఐవాన్‌హో, తెలుసునా?'—అని బెదరించాడు డీబ్రేసీ.

'ఐవాన్‌హో ఈ కోటలో ఉండడమేమిటి! అతనికి ఫ్రాంట్ డీబాఫ్ ప్రతిద్వంద్వి కావడం ఎంత నిజమో, ఇదీ అంతే!' అన్నది రొవెనా.

డీబ్రేసీ నిదానించి ఆమెవంక ఒక్కక్షణం చూశాడు. 'ఏమిటీ! నిజం గానే తెలియదా ఈ సంగతి నీకు? మీతోపాటు ఆ యూదీయుని డోలీలో ప్రయాణమై వచ్చినది ఐవాన్‌హో కాక మరెవ్వరు?' అని ఉటంకించాడు.

రొవెనా భయవిహ్వలయై వణికిపోయింది. కాని, వెంటనే, ప్రయత్న పూర్వకంగా మనస్సును చిక్కబట్టుకొని, ఒకవిధమైన నిర్లక్ష్యభావంతో,— 'అతడిక్కడ ఉంటేమాత్రం, ఫ్రాంట్ డీబాఫ్ వలన అతడు భయపడవలసిం దేముంది? ఫ్రాంట్ డీబాఫ్కు అతనిమీద పగ ఉండవలసిన పనిలేదు. కొంత కాలం నిర్బంధించవచ్చు. వీరసంప్రదాయానుసారంగా ఏదైనా కొంత సొమ్ము పరిహారం అడిగి పుచ్చుకోవచ్చు. అంతేగా!' అన్నది.

'ఇదిగో రొవెనా! మీ ఆడవాళ్లందరూ సామాన్యంగా ఈ పొరపాటే పడుతూ ఉంటారు. పురుషులమధ్య ప్రతిస్పర్థలకు మీ హావభావ విలాసాలే

కారణమని మీ అభిప్రాయం. కాని, ప్రేమకోసమే కాక, అధికారం కోసం, ధనంకోసం కూడ పురుషులు ప్రతిస్పర్థించుకొంటారనేది మీకు తెలియదు— ఐవాన్‌హో ఎస్టేటు మీ విల్‌ఫ్రెడుకు దక్కనీయకుండా చెయ్యాలని చూస్తున్నాడు ఫ్రాంట్ డీబాఫ్. ఈ రహస్యం గనుక తెలిస్తే, ఒక అందాల రాణి నిమిత్తంగా పగబూనిన విధంగానే, నిర్దయగా, నిస్సంకోచంగా, నిరాలస్యంగా అతనిని తుదముట్టించివేసి తన మార్గం నిష్కంటకం చేసుకుంటాడు. నన్ను గనుక నీవు చేపట్టడానికి అంగీకరిస్తే, ఐవాన్‌హోను ఫ్రాంట్ డీబాఫ్ కంటబడనీయకుండా చేస్తాను. అలా కానిపక్షంలో, ఫ్రాంట్ డీబాఫ్ కనికరమనేది ఎరగనివాడని తెలుసుకో!'— అన్నాడు డీబ్రేసీ.

ప్రియునికి రానున్న ఆపద మనస్సుకు తగలగానే రొవెనా భయకంపిత అయిపోయింది. బింకం వదలి, 'అయ్యో! అతన్ని రక్షించు రక్షించు!' అని ఆక్రందించింది.

'ఆఁ, రక్షించగలను, రక్షిస్తాను. రక్షించడం నా విధి అవుతుంది. ఏలనంటే, రొవెనా డీబ్రేసీని పెండ్లాడ నంగీకరించిన తర్వాత, ఆమె చిన్ననాటి స్నేహితుడూ, సంరక్షకుని కుమారుడూ నయిన ఆమె బంధుజనుని మీద ఎవరు చేయి వేయ సాహసించగలరు! కాని, అతడు నాచేత రక్షించబడాలంటే, నీవు నీ ప్రేమమూల్యం చెల్లించాలి. లేనియెడల, నాకూ నా కోరికకూ అడ్డంగా నిలిచేవానిని రక్షించడానికి పూనుకొనేటంత వెంగలిని కాను నేను. నన్ను వరించి అతని తరఫున నన్ను వినియోగించుకో! అతని కెట్టి ప్రమాదమూ రానివ్వను. లేదా, విల్‌ఫ్రెడ్‌కు చావు తప్పదు! ఇంత జరిగినప్పటికీ, నీవు నా చేతిలోంచి తప్పించుకోనూ లేవు!'— అన్నాడు డీబ్రేసీ.

'నీ మాటల ధోరణిలోని స్తబ్ధత్వానికీ, ఆ మాటలద్వారా నీవు వెల్లడించాలనుకున్న భయానక కృత్యాలకూ ఎక్కడా పొంతన కుదరడంలేదు. నీ వింత దురుద్దేశ్యం కలవాడవని గాని, చెప్పుకున్నంత సమర్థతకలవాడవని గాని, నేను విశ్వసించను!'— అన్నది రొవెనా.

'అలాగే నమ్మకొని తృప్తిపడుతూ ఉండు. నీ నమ్మిక పొరపాటని కాలమే తెలియజేస్తుంది. నీవు ప్రేమించినవాడు గాయపడి కదలమెదలలేని స్థితిలో ఈ కోటలోనే ఉన్నాడు. ఫ్రాంట్ డీబాఫ్ పెట్టుకున్న ఆశల కతడొక పెద్ద అవరోధం. ఒక్క బాకుపోటుతోనో, ఒక్క కత్తివేటుతోనో, అతడు నీ ప్రియుని తుదముట్టించివెయ్యడం చాల అవలీల. ఒకవేళ బట్టబయలయేటట్లు ఆ పని చెయ్యడానికి అతనికి సంకోచముంటే, వైద్యునిచేత ఏ తప్పుడు మందు ఇప్పించినా, లేక పరిచర్య చేసేవారిచేత ఏ ఒడుదొడుకు పని చేయించినా, నెత్తుర

చింపించ నవసరం లేకుండానే అతని పని కాస్తా అయిపోతుంది. ఇకపోతే సెడ్రిక్‌నుకూడా...' అని ఇంకా ఏమో అనబోయాడు డీబ్రేసీ.

రొవెనా మరింత కలవరపడి,—'అయ్యో! నన్ను వాత్సల్యంతో చిన్ననాటినుంచీ పెంచి పోషించిన సెడ్రిక్! ఎంత కృతఘ్నురాల్ని! ఆయన కుమారునికొరకు పడే ఆదుర్దామధ్య ఆయన సంగతే మరచిపోయాను! నా పాపానికి తగిన ప్రాయశ్చిత్తమే అవుతోంది!' అనుకొని కుమిలిపోయింది.

'సెడ్రిక్ గతి నిర్ణయించేది కూడా నీవే. నీ నిర్ణయంమీదనే అతని బ్రతుకు ఆధారపడి ఉంది. బాగా ఆలోచించుకో!' అన్నాడు డీబ్రేసీ.

ఇంతవరకూ ధైర్యం సడలకుండా ఏదో ఒక విధంగా నెట్టుకొని రాగలిగిన రొవెనా, ఇక తట్టుకోలేకపోయింది. జన్మతః ఆమె సాధుశీల, భీరువు. కాని, పెరిగిన పెంపకాన్ని బట్టి, కొంత నిబ్బరంకూడ ఆమెకు అలవాటయింది. ఇంటివద్ద ఉన్నప్పుడు ఆమె ఇచ్ఛకు సెడ్రిక్‌తోసహా అందరూ విధేయులౌతూ ఉండేవారు. అందువల్ల, ఒక విధమైన ఆత్మవిశ్వాసంతో, చాల చొరవగా ఆమె వ్యవహరించడం జరుగుతూఉండేది. కాని, తన అధికారం చలామణి కావాలనే ఈ పట్టుదల ఆమెయందు కృతకంగా పెంపొందినదేకాని, స్వభావసిద్ధంగా ఏర్పడినది కాదు. అందుచే, ఎప్పుడైతే ఆమెకు, తన ప్రియుడూ సంరక్షకుడూ అత్యంత ప్రమాద పరిస్థితిలో ఉన్నసంగతి స్పష్టమై, తన ఇచ్ఛ చలామణి అయ్యే అవకాశం ఎంతమాత్రమూ లేదని బాగా తెలిసిపోయిందో, ఆమె బింకమంతా ఒక్కపెట్టున సడలినట్లయిపోయింది. ఈ దిక్కులేని పరిస్థితిలో, ఎవరూ రక్షించేవారు లేరా అన్నట్లు చుట్టూ కలయజూచింది. ఇక చేయునదిలేక, ఆకసమువైపు చేతులెత్తి, దుఃఖం ఒక్కపెట్టున కట్టలు త్రెంచుకొని రాగా, అవశయై వెక్కి వెక్కి యేడ్వసాగింది.

అంత అందాలరాణి, అంతటి మహాదుఃఖంలో మునిగిఉండగా చూచినప్పుడు మానవమాత్రుడెవడు కరగకుండా ఉండగలడు? డీబ్రేసీకూడా కొంచెం కరిగాడు. కరిగాడనడంకంటె కళవళపడ్డాడనడం ఎక్కువ సమంజసంగా ఉంటుంది. తాను చేసిందేమిటో చేసేశాడు. అన్నదేమిటో అనేశాడు. ఇప్పుడదేమీ తిరగతోడ్డానికి వీలులేదు. కాని, ఇప్పుడు రొవెనా పరిస్థితి చూస్తే, హేతువాదాలూ పనిచేసేటట్లు లేవు, బెదరింపులూ పనిచేసేటట్లు లేవు. ఏమిచెయ్యడానికీ తోచక, ఆ గదిలో ఇటూ అటూ తిరగసాగాడు. ఊరుకో ఊరుకోమని ఒకొక్కసారి ఓదారుస్తున్నాడు. ఇప్పుడీ యేడుపుతో తాను కరిగిపోయేటట్లయితే ఏమవుతుంది? ఏ ఆశలు పెట్టుకొని తానీ గ్రంథమంతా నడిపాడో, ఆ ఆశలన్నీ కూలిపోతాయి. ప్రిన్స్ జాన్ ప్రభృతులందరూ తనను అపహాస్యం

చేస్తారు. పోనీ, ఎలాగైనాసరే, అనుకున్న కార్యం సాధించే తీరాలని నిశ్చయించుకుంటూండా, ఆ నిశ్చయానికి కావలసిన గుండె నిబ్బరం కుదరడం లేదు. ఇలాంటి పాత్రలు నిర్వహించడం తన కసలు చేతకాదేమో అనికూడా అనిపిస్తోంది. ఆ అందాలరాణి సుందర వదనం అలా దుఃఖావిలమైపోవడం, ఆ అన్నుల మిన్న నీలంపు కన్నుగవ అలా అశ్రుపూరితమైపోవడం, తాను చూడలేకుండా ఉన్నాడు. రొవెనా కొంట్టెకొండట్లో ప్రదర్శించిన బింకం సడలకుండా అలాగే ఉంటే ఎంతో బాగుండేదికదా అనిపించిందతనికి. కనీసం, తనకు ఫ్రాంట్‌డీబాఫ్‌కున్న కఠినగుండె వంటిదైనా ఉండకూడదా, అని తలపోసి వికలమనస్కుడయ్యాడు.

ఈ కళవళపాటులో, రొవెనాను మధ్యమధ్య 'ఊరుకో ఊరుకో' మని ఓదార్చడంతప్ప అతనికేమీ చెయ్యడానికితోచలేదు. అప్పుడే ఏమి మునిగిపోయిందని ఇంతగా ఏడ్వడమని అతని సముదాయింపు! ఈ సందిగ్ధస్థితిలో ఉండగా వెనుక చెప్పిన బూరాధ్వని అతనికి వినవచ్చింది. వెనువెంటనే కోటలో గందరగోళం బయలుదేరిన సవ్వడులు వినిపించాయి. ధనతృష్ణచేనేమి, కామాంధతచే నేమి, ఎవరెవరు వేసుకొన్న పథకాలకూ పెద్ద అంతరాయం కలిగింది. అంతరాయం కలిగినందుకు అంతగా చింతించనివాడు అందరిలోకీ డీబ్రేసీ ఒక్కడే! అనుకొన్న పనిని కొనసాగించుకొననూ లేక, విరమించుకొననూలేక, ఒక విచిత్రమైన విషమస్థితిలో పడ్డాడతడు. ఈ అంతరాయం ఆతనిని ఈ చిక్కులోంచి బయటికిలాగి తెరపిన పడవేసినట్లయింది.

# అధ్యాయం ౨౮

ఆ కోటలో, విసిరివేసినట్లు దూరంగా ఉన్న చిట్టచివరి అంతస్తులోని ఒక చిన్న గది. ఆ గదిలో, తన దుర్విధి ఎట్టి రూపం దాల్చనున్నదో యని భీతిల్లుతూ ఎదురుచూస్తోంది రెబెకా. ఫ్రాంట్ డీబాఫ్ పరివారంలోని ఇద్దరు ముఖ్యసేవకులు ఆమెను అక్కడికి తీసుకొనివచ్చి విడిచిపెట్టారు. విడిచిపెట్టిన సమయానికి, ఒక వృద్ధనారి అచట రాట్నం వడుక్కుంటూ, దాని ఝుంకారాని కనుగుణంగా ఏదో సాక్సన్ గీతం పాడుకుంటోంది. రెబెకా ఆగదిలోనికి తోయబడడంతోటే ఆ వృద్ధనారి తల పైకెత్తి చూచి, గుడ్లురిమి వికటంగా ఒక ఛీత్కారం చేసింది.

'ఇదిగో ముసలీ, నీవిక్కడనుంచి వెంటనే వెళ్ళిపోవాలి. దొరగారి ఆజ్ఞ. ఈ పిల్లకు ఈగది ఖాళీ చెయ్యాలి!'—అన్నాడు ఆ యిద్దరిలో ఒకడు.

'అవునవును, చేసిన సేవకు మంచి ప్రతిఫలమే చూపించాడు దొరగారు. ఒకప్పుడు నేను ఒక్కమాట అంటే చాలు, మీనౌకరీలు ఊడేటట్లుగా ఉండేవి. ఇప్పుడు ప్రతివాడూ వచ్చి నామీద అధికారం చలాయించేవాడే!'—అన్నదా వృద్ధనారి.

'ఎందుకీ అనవసర ప్రసంగం ఉర్ఫ్రీడ్! లేనిపోనివాదం చెయ్యక త్వరగా తప్పుకో. దొరగారి ఉత్తరువులు చులకన చెయ్యడం ప్రమాదమని నీకు తెలుసు. ఒకప్పుడు నీవు బాగానే వెలిగావు. ఇప్పుడు నీప్రభ ఆరింది. యుద్ధరంగానికి పనికిరాక వదలివేసిన ముసలిగుర్రం మాదిరిగా ఉన్నా విప్పుడు. నామాట విని, త్వరగా సర్దుకో!' అన్నాడు రెండవవాడు.

'మీరెంతయినా అరుచుకోండి. నన్ను చంపినా సరే, ఈ కదురు నిండితేగాని నేనిక్కడినుంచి కదలను'—అన్నది ఉర్ఫ్రీడ్.

'సరే నీ యిష్టం, దొరగారికేమి సమాధానం చెప్పుకుంటావో చెప్పుకో!'—అని వాళ్లిద్దరూ అక్కడనుంచి వెళ్ళిపోయారు. ఉర్ఫ్రీడ్ తిరిగి రాట్నం త్రిప్పుతూ, మధ్యమధ్య రెబెకావంక వికటంగా ఓరచూపులు చూస్తూ, 'మళ్ళీ ఏదో ఘోరకృత్యం తలపెట్టినట్లున్నారు. తెలుస్తూనేఉంది. తెల్లని మైచాయ, నిగనిగలాడే నల్లని ఉంగరాలజుట్టు, తళుకులు విరజిమ్మే చూపులు,— ఈ పిల్లనింతటి ఏకాంత స్థలానికి ఎందుకు పంపిందీ స్పష్టమే. అయిదువందల నిలువుల లోతు నూతిలోంచి కేక పెడితే బయటవారి కెంతవినిపిస్తుందో, ఇక్కడనుంచి కేక పెట్టినా అంతే!'— అని తనలో తాననుకొని, రెబెకా నుద్దేశించి ఇలా అంది:

'పిల్లా, గ్రుడ్లగూబలుతప్ప ఇక్కడ నీ కెవ్వరూ సహవాసం దొరకరు. నీ వేషం చూస్తే ఈ దేశం పిల్లవుగా లేవు. ఏదేశం నీది? టర్కీయా? ఈజిప్టా? మాట్లాడ వేం? ఏడవడం చేతైనప్పుడు మాట్లాడ్డం చేతకాదూ?'

రెబెకా గద్గదస్వరంతో 'కోపపడకమ్మా కోప్పడకు,'—అన్నది.

'ఆఁ, తెలిసింది, నీవిక ఏమీ చెప్పనక్కర్లేదులే. తోకను బట్టి గుంట నక్కనీ, మాటనిబట్టి యూదుపడుచునీ తెలుసుకోమన్నారు'—అని వ్యాఖ్యా నించింది ఉర్ఫ్రీడ్.

'అమ్మా, దయచేసి కాస్త చెప్పు. వీళ్ళు నన్ను బలాత్కారంగా ఇక్కడికి తీసుకువచ్చింది దేనికి? యూదీయురాలిననే కారణాన నన్ను చంపెయ్యడం వీళ్ళ ఉద్దేశ్యమా? చంపితే నాకు పరమసంతోషమే!' అన్నది రెబెకా.

'చంపడమా! నిన్ను చంపితే వాళ్ళకేమి వస్తుంది? చంపరు. ఆ ప్రమాదం నీకేమీ లేదు. ఒకప్పుడు ఈ విధంగానే తీసుకొనిరాబడ్డ సాగ్జన్ కన్నెకు జరిగిన మర్యాదకంటె ఎక్కువ మర్యాద నీకేమీ జరగదు. ఇదిగో నన్ను చూచావా? ఒకప్పుడు నీ యంత పడుచుదాన్నే నేనుకూడ. నీ కంటె రెండు రెట్లు చక్కనిదాన్నిగూడ! ఈ రెజినాల్డ్ ఫ్రాంట్ డీబాఫ్ తండ్రి తన నార్మన్ అనుయాయులతో ఈ కోటను ముట్టడించిన కాలమది. ఈ పిత్రార్జితాన్ని సంరక్షించుకోడానికి మా నాన్న తన ఏడుగురు కుమాళ్ళతోనూ కలిసి అంగుళమంగుళమూ ఎదిర్చి పోరాడారు. వాళ్ళ నెత్తురుతో తడియని గదిగాని, మేలుగాని, సోపాన పంక్తిగాని, ఈ కోటలో ఒక్కటికూడ లేదు. కాని, ప్రయోజనం లేకపోయింది. అందరూ చచ్చిపోయారు. వాళ్ళ మృత కళేబరాలింకా చల్లబడకముందే,—వాళ్ళ శరీరాలనుండి నేలపై చిందిన నెత్తురింకా ఎండిపోకముందే,—విజేత దుర్వృత్తికి నేను బలియై పోవడమూ, వానిచే హేయంగా చూడబడడమూకూడ జరిగిపోయింది!'— అన్నది ఉర్ఫ్రీడ్.

'అయితే మరి ఏమిటి రక్షణ? తప్పించుకునే ఉపాయంలేదా? చెప్పు! నీ మేలు మరిచిపోను. కావలసినంత ధన మిస్తాను!'—అని మొర పెట్టుకుంది రెబెకా.

'లాభంలేదు, అలాంటి ఆశలేమీ పెట్టుకోకు. ఇక్కడనుంచి తప్పించుకోడానికి మృత్యువు తప్ప ఇంకొక మార్గమేమీ లేదు. కాని, మన బోటి వాళ్ళకు మృత్యుద్వారం ఎప్పటికోగాని తెరువబడదు. అయితే, మన తర్వాత మనవంటి నిర్భాగ్యజీవులనే ఇంకా ఈ భూమిమీద వదలిపెట్టి పోవడంలో ఒక తృప్తి ఉంటుంది'—అంటూ ఉర్ఫ్రీడ్,—'సరే, ఇక నేను వెళ్ళాలి. నాకు పట్టిన గతే నీకూ పట్టుతుంది. ఏలనంటే, మంచీ చెడ్డా, దయా దాక్షిణ్యం

లేనివారితో నీవిప్పుడు వ్యవహరించవలసి ఉంటుంది. శుభం! నేను వడకవలసిన కండె పూర్తి అయింది. ఇక నీపని ప్రారంభం కావాలి' అని లేచింది.

'వెళ్ళకమ్మా వెళ్ళకు! నీకు పుణ్యముంటుంది. తిట్టిపోస్తున్నా వెక్కిరిస్తున్నా, నీవు దగ్గర ఉండడం నాకు కొంత రక్షణ!'—అని ప్రాధేయపడింది రెబెకా.

'రక్షణ! నీకు రక్షణ ఇవ్వడం దేవమాతకైనా సాధ్యం కాదు. అదిగో!'—అని అచటనున్న ఒక మేరీమాత విగ్రహంవంక చూపిస్తూ,—'ఆమెనడుగు, నీకిప్పుడు జరగనున్నది తప్పించగలదేమో!' అంటూ ఉల్ఫ్రీడ్ ఒక వికట హాసంతో అచటినుండి వెడలిపోయింది. ఆమె వికటహాసం ఆమె వికట భ్రూవిక్షేపంకంటె భయానకంగా ఉంది. గదికి తాళం పెట్టి, క్రింది అంతస్తు ఒక్కొక్క మెట్టే క్రిందికి అతికష్టంతో దిగుతున్న సందర్భంలో కూడా ఆమె ఏదో తిడుతూనే ఉంది.

రోవెనాకంటె భయంకరమైన దుర్విధినే రెబెకా ఎదుర్కోవలసియున్న మాట నిజం. కాని, పుట్టుకతో అబ్బిన చిత్తస్థైర్యాన్ని బట్టియేమి, అభ్యాసవశం చేత కలిగిన మనఃప్రవృత్తిని బట్టియేమి, ఇలాంటి ఆపదల నెదుర్కోగల ధీరత్వం ఆమెకు రోవెనా కంటె ఎక్కువగా ఉంది. చిన్నప్పటి నుంచీ విశేషంగా పరిశీలన స్వభావం కలది కావడంచేత, తన తండ్రి యింటిలో ఆ నాలుగు గోడలమధ్యా తానెంత మహదైశ్వర్యం అనుభవిస్తున్నా, అది స్థిరం కావనీ, శత్రుమధ్యంలో నివసించే తమ జాతికి ఏక్షణంలో ఏమి జరిగినా జరగవచ్చునీ, ఆమెకు బాగా తెలుసు. అది ఒకవిధమైన సాత్వికప్రవృత్తినీ, విచక్షణ జ్ఞానాన్నీ ఆమెకు అలవరించింది. ఇతర పరిస్థితుల్లో నైతే, పెంకితనం, గర్వం, అసహనం మొదలైన అవగుణాలు ఆమెలో పెంపొంది ఉండేవి.

ఎవరితోనైనా సరే మర్యాదగా వ్యవహరించడం ఆమె తండ్రినుండి నేర్చుకొంది. కాని, అతనివలె, ఇతరులకు తలయొగ్గడంలో నీచత్వానికి మాత్రం పాల్పడదు. గరువతనం విడనాడని వినయశీల ఆమె. ఎల్లరిచేతా ద్వేషించబడే జాతిలో పుట్టిన కారణంచేత తానెట్టి విపరీత పరిస్థితులకు లోనుగావలసి వచ్చినా, గుణంచేత తాను ఉన్నతస్థానం ఆక్రమించే అర్హత గలదాననని ఆమెకు తెలుసు. అందుచే, ఎట్టి విపరీత పరిస్థితుల్లోనైనాసరే నిబ్బరం వీడకుండ ఆమె వ్యవహరించగలదు. ప్రస్తుత పరిస్థితిలో అదే ఇప్పుడామెకు ఆసరా అయింది.

తప్పించుకొని పోయేందుకుగాని, రక్షణ చేసుకునేందుకుగాని, దారి ఏమయినా దొరుకుతుందేమోనని ముందు ఆ గదిని జాగ్రత్తగా పరిశీలించి చూచింది.

కాని, అలాంటిదేమీ కనిపించలేదు. దొంగదారులలాంటి వేమీ ఆ గదికి లేవు. తాను లోనికి ప్రవేశించిన ద్వారమొక్కటే ఆ గదికి ద్వారం. వేరొకద్వారం లేదు. ఉన్న ద్వారానికి బయటి గొళ్ళెమే కాని లోపలి గడియ లేదు. పోతే, ఒకే ఒక గవాక్షంలాంటిది ఆ గదికి ఉంది. దానికి ఊచలేమీ లేవు. అది దాటి అవతలికి పోవచ్చు. కాని, చుట్టూ పిట్టగోడతో ఒక చిన్న ఖాళీస్థలం తప్ప అక్కడ ఇంకేమీ లేదు. యుద్ధసమయాల్లో నలుగురైదుగురు విలుకాండ్రు ఆ చిట్టచివరి అంతస్థులో కూడ నిలిచి కోటరక్షణలో పాల్గొనే నిమిత్తం ఒక బురుజాగా ఏర్పాటైన స్థలమది. పిట్టగోడ మీదనుంచి క్రిందకి చూస్తే కళ్లు తిరిగిపోతాయి. దైవమే ఇక శరణ్యమనుకొని, రెబెకా ఒకవిధమైన నిబ్బరంతో గదిలోకి తిరిగి వచ్చి, కానున్నదానికొరకు ఎదురుచూడసాగింది.

కాని, ఎంత నిబ్బరంగా ఉన్నా, మెట్లమీద అడుగుల చప్పుడు బయటి నుంచి వినిపించగానే, ఆమె ఒడలు కంపించింది. చెక్కిళ్ళు రంగు మార్చుకున్నాయి. మరి కొంచెము సేపటిలో, తలుపు తెరచుకొని, టెంప్లార్ బ్రయన్, వెనుకటి బందిపోటు దొంగ వేషంతోనే లోనికివచ్చి తలుపు వేశాడు. ప్రసంగం ఎలా ప్రారంభించాలో అని అతడింకా ఆలోచించుకుంటూ ఉండగానే, రెబెకా తన చేతుల రత్నకంకణాలూ, మెడలోని ముత్యాలహారమూ తీసి అతనికి అందివ్వబోతూ ఇలా అంది: 'అయ్యా! ఇవి నీవు తీసుకొని నన్నూ మా నాన్ననూ కనికరించు. ఇవి చాలా విలువగల ఆభరణాలు. కాని, నిరపాయంగా ఈ కోటలోంచి మేము తప్పించుకొని బయట పడటంకోసం ఆయన వీటిని తృణప్రాయంగా ఎంచుతాడనటానికి సందేహంలేదు.'

ముఖం సరిగ్గా కనిపించనివ్వకుండా హాటును కనుబొమ్మలమీదికి లాక్కుని ఉన్నందువల్ల సర్ బ్రయన్ నిజంగా బందిపోటు అనే ఆమె భావించింది. ఆమె పలికినదానికి అతడిలా సమాధానమిచ్చాడు: 'సుందరీ, ఆ ముత్యాలు మేలిరకమే, నాకు తెలుసు. కాని, అందంలో నీ పల్వరుసతో పోటీ చేయడానికవి ఎందుకు పనికివస్తాయి? ఆ వజ్రాలు కూడ ఎంత ధగధగా మెరుస్తున్నా నీ సుందర నేత్రాలకవి తీసికట్టే! ఈ బందిపోటువృత్తి నవలంబించినప్పటినుంచీ నేనొక నియమం పెట్టుకున్నాను, — ఐశ్వర్యం, సౌందర్యం, ఈ రెండూ పోటాపోటీలతో నా కెదురైనప్పుడు, ఐశ్వర్యాన్ని త్రోసిపుచ్చి సౌందర్యాన్నే స్వీకరిస్తానని!'

రెబెకా అతని కిలా నచ్చజెప్పజూచింది: 'అయ్యా, అది నీకెంతమాత్రమూ మంచిదికాదు. ఇవి తీసుకుని మమ్మల్ని కనికరించు. ఈ ధనంతో నీకు కావలసిన భోగాలు సంపాదించుకో. మాకు అపకారం చేస్తే తుదకు నీవే చింతపడవలసి వస్తుంది. మా నాన్న నీవు ఏమడిగితే అది సంతోషపూర్వకంగా ఇస్తాడు. మేమిచ్చేదానితో సంఘంలో తిరిగి స్థానాన్ని నీవు సంపాదించుకోవచ్చు. వెనుక

నీవు చేసిన తప్పులు మన్నించబడేటట్లు చేసుకొని, తిరిగి అలాంటి తప్పులు చేయకుండా ఉండగల సంపన్న స్థితిని పొందగలుగుతావు. కాదు కూడదని మా కపకారం చేస్తే నీకేమి వస్తుంది ?'

ఇంతసేపూ బందిపోటు దొంగల భాషయైన సాక్సన్‌లో మాట్లాడుతున్న బ్రియన్, ఇక అందులో ప్రసంగం నడపడం కష్టమని తోచినందువల్ల కాబోలు, నార్మన్ భాషలో ఇలా మొదలుపెట్టాడు ! 'చాల ముచ్చటగా ఉన్నది నీవు చెప్పినది. కాని, నీకింకా తెలియదు గాబోలు, మీ నాన్న ఇప్పుడు ఒక సర్వసమర్థుడైన రసాయనశాస్త్రవేత్త చేతిలో పడ్డాడు. భూగృహంలోని తుప్పు ఇనపకడ్డీలను సైతం బంగారంగా ఎలామార్చాలో తెలుసు ఆ రసాయనవేత్తకు. ఇసాక్‌ను మూసలో వేసి కరిగి కందుతీసి మేలిమి బంగారం లాగే ప్రయత్నంలో ఉన్నాడిప్పుడు. నా తోడ్పాటూ నీ తోడ్పాటూ లేకుండానే అతడు తన పని నెరవేర్చుకొనగలడు. ఈ చెరలోంచి నీవు తప్పించుకోవాలంటే మాత్రం ప్రేమమూల్యం చెల్లించి తప్పించుకోవలసినదే ! ఇంకొక నాణెం నా దగ్గిర మారదు.'

రెబెకా తానుకూడ నార్మన్ భాషలోనే ప్రసంగిస్తూ,—'నీవు మాట్లాడిన భాషను బట్టి, నిజంగా నీవు బందిపోటు దొంగవు కావని స్పష్టమయింది. ఈ దేశంలో ఏ బందిపోటుదొంగా నార్మన్ భాష మాట్లాడడు. నీవు నార్మన్ జాతివాడవే అయివుండాలి. బహుశః ఒక సామంతుడవేమో! చర్యకూడ సామంతంగా ఉండడం బాగుంటుంది. ఈ ప్రచ్ఛన్న వేషం ఇక తీసివెయ్యి'—అని హెచ్చరించింది.

సర్ బ్రయన్ తన ముఖాచ్ఛాదనం తొలగించివేస్తూ, 'సరిగా ఊహించావు సుందరీ ! నేను బందిపోటు దొంగను కాను. నీవన్నట్లు సామంతుణ్ణే ! నీ మెడనెల్ల రత్నభూషణాలతో నింపివేయగల సామంతుణ్ణి. అంతేనేగాని, నీకు ఉన్న ఆభరణాలను ఊడ్చుకోడం నాపనికాదు'—అని సగర్వంగా పలికాడు.

'ధనం తప్ప నావల్ల నీవు అపేక్షించడానికి ఇతరం ఇంకేముంది ? నీవు క్రైస్తవుడవు. నేను యూదుకన్యను. మన మిద్దరి కలయికకూ మీ శాస్త్రమూ మా శాస్త్రమూ కూడ ఒప్పవు'—అన్నది రెబెకా.

టెంప్లార్ వికటహాసంచేస్తూ, 'వివాహమైతేగా శాస్త్రాలు అడ్డురావడానికి! కట్నంతో తెచ్చి కాళ్ళముందు పడేసే క్రైస్తవవంశీకురాలినైనా సరే నేను పెండ్లి చేసుకోడానికి వీలులేదు. వివాహబంధం లేని ప్రియురాలిగా తప్ప, ఏ కన్యకనూ నేను చేరదీయడం పొసగదు. మాది టెంప్లార్ వ్యవస్థ! ఇదిగో చూడు, సిలువచిహ్నం !'—అని చూపించాడు.

'ఇలాంటి సమయంలో ఆ పవిత్రచిహ్నం పేరు ఉచ్చరించడానికి నీకు నోరెట్లా ఆడింది!'—అన్నది రెబెకా.

'ఎట్లా ఆడిందో ఆ సంగతి నీకెందుకు? మా మోక్షసాధనలపై నమ్మకం లేనివానికి నీకు అవన్నీ అనవసరం'—అన్నాడు బ్రయన్.

'మా తాత తండ్రులు ఏది నమ్మి నాకు బోధించారో అదే నేనూ నమ్ముతున్నాను. నా నమ్మిక తప్పునమ్మికైతే భగవంతుడు నన్ను క్షమించుగాక! కాని, నీ నమ్మిక ఏ దుస్థితిలో ఉన్నదో ఆలోచించుకో! నీవు పరమ పవిత్రమని విశ్వసించే మతచిహ్నం పేరును ఉచ్చనీచాలు తెలియకుండా వాడేస్తున్నావు. అంతే కాకుండా, నీ యోధ ధర్మానికీ మత ధర్మానికీ కేవలం విరుద్ధమైన పనికి కూడా సాహసిస్తున్నావు!'—అని హెచ్చరించింది రెబెకా.

'ఎంత చక్కని ధర్మబోధకురాలవు! నీబోధకు చాలా సంతోషించాం గాని, మా టెంప్లార్లకు ఎట్టి ప్రత్యేకాధికార యోగ్యతలు ప్రసాదించబడ్డాయో నీకు తెలియనందుకు విచారంగా ఉంది. వివాహం మాత్రమే మా టెంప్లార్లకు నిషిద్ధం. అది తప్ప ఇంక నేను ఏమి తప్పుచేసినా క్షణంలో మా గురు సన్నిధానమందు దానినుండి విముక్తి గాంచగలను. పాలస్తీనాలోని సోలమన్స్ టెంపుల్ రక్షణ కొరకు మేము చూపిన ఉత్సాహఫలితంగా, మా టెంప్లార్ యోధులకు సోలమన్‌రాజుకు సైతం లేని అధికారయోగ్యతలు ప్రసాదించబడ్డాయి. సోలమన్ రాజంత విజ్ఞాని 'నభూతో నభవిష్యతి'—అని గదా అంటారు. ఆయన చూపిన త్రోవనే మేమూ అనుసరించి విశృంఖలంగా విహరిస్తే అందు దోషమేముంది?'—అని సమర్థించుకున్నాడు బ్రయన్.

'మతగ్రంథాలు చదివి పుణ్యపురుషుల చరిత్రలు తెలుసుకున్న నీ విజ్ఞానాన్ని ఇలా నీ విశృంఖలవృత్తి సమర్థనకు ఉపయోగించుకోడం చూస్తే, అమృతం నుంచి కూడా విషం పిండగలవానివలె కనిపిస్తున్నావు'—అని ఎత్తిపొడిచింది రెబెకా.

టెంప్లార్ కండ్లు నిప్పులుగ్రక్కాయి ఈ ఎత్తిపొడుపుకు. 'ఇదిగో రెబెకా! ఇంతవరకూ నీతో నేను సౌమ్యంగా మాట్లాడాను. ఇక లాభంలేదు. నీవు నా బందీవి. నా బాహుబలంచేత పట్టి తెచ్చుకున్నాను. నా ఇచ్ఛాధీనురాలివి నీవు. ఈ ధర్మం అన్నిదేశాల్లోనూ చలామణీలో ఉన్నదే కాని కొత్తదికాదు. నా హక్కును నేను కించిత్తు కూడా వదులుకోను. బ్రతిమాలితే నీవు ఇవ్వనిదాన్ని బలాత్కారంగానైనా గ్రహించితీర్తానుగాని వదలిపెట్టను'—అని గర్జించాడు.

'వద్దు వద్దు, అంతటి పాపకృత్యాని కొడిగట్టకు! నీ బలం ముందు నా బలమెంత! మగవాళ్ళ ఔదార్యమే రక్షణయని నమ్మి, ఆడవాళ్లను అబలలుగా

సృష్టించాడు భగవంతుడు. నీ దుశ్చేష్టితం నీవు విరమించకపోతే, యూరపంతా మారుమోగేటట్లు నీ అత్యాచారం చాటుతాను. యూదుకన్యను వెంటాడి నీవు ధరించే సిలువను అపవిత్రమొనర్చిన మహాదోషం నీ వ్యవస్థలో పెద్దనుంచి చిన్నదాకా ఎరిగి, నాయందు సానుభూతిచేత కాకపోయినా, తమ ఆచారవిధుల యందుగల అంధవిశ్వాసాన్ని పురస్కరించుకొనియైనా నిన్ను చీదరించుకొనేటట్లు చేస్తాను' అని బెదరించింది రెబెకా.

రెబెకా చెప్పినది సత్యమేననీ, తన యిప్పటి దుశ్చేష్టితాన్ని తన సంఘ నియమాలు పూర్తిగా నిషేధిస్తున్నాయనీ, తీవ్రమైన దండనలుగూడ విధిస్తున్నాయనీ, కొన్ని సందర్భాల్లో అధోగతియే శరణ్యమౌతుందనీ బ్రయన్‌కు బాగా తెలుసు. అయినా అదేమీ లెక్కచేయకుండా ఇలా సమాధానం చెప్పాడు: 'యూదుకన్నెవైనందుకు మొత్తానికి చాల గడుసుదానవే! కాని, నీ కంఠశోష ఈ కోటగోడలు దాటి బయటికి పోయినప్పటి మాట గదా! ఏడ్పులూ పెడబొబ్బలూ, అభ్యర్థనలూ ఆర్తనాదాలు,—అన్నీ ఈ నాలుగు గోడలమధ్యా తుదకు నిశ్శబ్దతలోకి లీనమై పోవలసినవే! నీ రక్షణకు ఒక్కటే ఉపాయముంది—మారు మాట్లాడకుండా నీ విధికి తలయొగ్గు! మా మతం పుచ్చుకో! టెంప్లార్ యోధులలోకెల్ల ఉత్తమోత్తము డైనవానికి ప్రియురాలివనే గౌరవ ప్రపత్తి సంపాదించుకుంటావు. ఐశ్వర్యానికేమి సౌందర్యానికేమి ఏ నార్మన్ సుందరులూ నీతో సరితూగలేరు!'

రెబెకా ఛీత్కారం చేస్తూ ఇలా మారుపలికింది: 'విధికి తలయొగ్గవలెనట విధి! ఎంత చక్కని ఉపాయం! పైగా మతంగూడ పుచ్చుకోవలెనట మతం! నీవంటి దుర్మార్గుణ్ణి సహిస్తున్న మతం ఏమి మతము? ! సిగ్గులేక, టెంప్లార్లలో ఉత్తమోత్తముడనని గూడ చెప్పుకుంటున్నావు. ఛీ ఛీ! నీ మొహం చూస్తే పాపం! ఈ మహావిపత్తులోంచి తప్పించుకొనే దారి భగవంతుడు నాకు చూపించలేకపోడు'—

అంటూనే ఆమె ఉత్తరక్షణంలో చెంగున గవాక్షంగుండా అవతలికి దూకి పిట్టగోడ అంచునకు పోయి నిలబడ్డది. అక్కడనుంచి దూకితే ఇక అధఃపాతాళంలోకి పడిపోవడమే! ఆమె ఇంత సాహసం చేస్తుందని బ్రయన్ అనుకొనియుండలేదు. ఏలనంటే, ఆ కిందటి క్షణంవరకూ ఆమె శిలాప్రతిమలా కదలక మెదలక నిలబడి ఉంది. ఇంతలోనే మెరుపు మెరిసినట్లు అవతలనుండి పరుగెత్తిపోయినందున, అడ్డగించే వ్యవధి బ్రయన్‌కు లేకపోయింది. అయినా 'ఎక్కడికిపోతావు నా చేతుల్లోంచి తప్పించుకొని'అన్నట్లు ముందడుగు వేశాడు. అది చూచి రెబెకా—'ఆగిపో, అక్కడే! ఇంక ఒక్క అడుగు ముందుకు వేశావా, ఇక్కడనుంచి అమాంతం క్రిందికి దూకేశానన్నమాటే! క్రిందనున్న రాతిపెల్లలపై బడి నా దేహం నుగ్గునుగ్గయిపోతుంది. ఆ తర్వాత నీ యిష్టం!'—

అంటూ ఆమె చిట్టచివరిసారిగా భగవంతుని తలచుకొన్నదివోలె చేతులు ఆకాశంవైపు సాచి క్రిందికి దూకడానికి సిద్ధంగా నిలబడ్డది. బ్రయన్ తటపటాయించాడు. కనికర మెరుగని అతని ధూర్తత్వం సడలి, ఆమె ప్రదర్శించిన సాహసానికి 'సెబాస్' అనుకొన్నాడు. 'ఆఁ, ఆఁ, దూకబోకు! నిన్నేమీ చెయ్యనులే! పంచభూతాల సాక్షిగా నిన్నేమీ చెయ్యను. దిగిరా క్రిందికి — బలే తొందర పిల్లవు!' అని వారించాడు.

'నీ మాట నేను నమ్మను. టెంప్లార్ల గుణసంపద యెలాంటిదో నాకిదివరకే చక్కగా బోధించావు. ఉత్తరక్షణంలో నీ ఒట్లు రద్దుచేసిపెట్టగల గురువులున్నారు నీకు. నిర్భాగ్యురాలైన ఒక యూదుకన్నెకు మానభంగం చేసేవిషయంలో ఒట్లా నీకు అడ్డం?' అన్నది రెబెకా.

'అన్యాయం రెబెకా! నన్నంత నీచుణ్ణిగా తలంచకు. నామీద ఒట్టు, ఈ సిలువచిహ్నం మీద ఒట్టు, ఈకత్తిమీద ఒట్టు! నిన్ను నేను ఏమీ చెయ్యను. నీకోసం కాకపోయినా నీ తండ్రికోసం ఆ అఘాయిత్యం మాను. నీతండ్రిని ఆపదనుంచి తప్పిస్తాను. నావంటి శక్తిమంతుని సాహాయ్య మిప్పుడు ఈకోటలో అతనికి చాలా అవసరం' — అన్నాడు బ్రియన్.

విషాదచ్ఛాయ గ్రమ్మిన ముఖంతో రెబెకా, 'అవును నిజమే. నాకది బాగా తెలుసు. కాని, నిన్ను నేను ఎలా నమ్మడం' అని పలికింది.

'నమ్ము రెబెకా, నేను నిన్నేమైనా చేస్తే నా చేతులు కాలిపోవాలి, నా పేరు అవమానాల పాలైపోవాలి. నామాట విశ్వసించు. ఎన్నో శాస్త్రవిధులను, ఎన్నో దైవాజ్ఞలను ఉల్లంఘించా నిదివరకు. కాని, ఎన్నడూ నా మాట తప్పి యెరుగను!' — అన్నాడు బ్రియన్.

'అయితే నిన్ను ఇంతవరకు మాత్రం విశ్వసిస్తాను' — అంటూ రెబెకా ఆ పిట్టగోడ అంచునుంచి క్రిందికి కొంచె మివతలకువచ్చి, 'ఇదిగో ఇక్కడ నిలబడుతున్నాను. నీవుకూడా అక్కడే నిలబడాలి. ఒక్క అడుగు ముందుకు వేశావో — యూదుకన్నె తన మానరక్షణకు భగవంతుని నమ్ముకొంటుందిగాని టెంప్లారును నమ్ముకోదని రుజువు చేస్తాను' — అన్నది.

ఆమె యిలా అంటూ ఉంటే, ఆ సుందరవదనంలో తొణికిసలాడే దృఢనిశ్చయం ఆమె సౌందర్యశోభను మరింత ఇనుమడింప జేసింది. ఆ చూపుల్లో, ఆ చవారాల్లో, ఆ వైఖరిలో, ఏదో అలౌకిక విశేషం తొంగిచూచింది. క్షణమాత్రంలో మృత్యువు నెదుర్కొవలసివస్తున్నందుకు, ఆ చూపులు చలించలేదు, ఆ చెక్కిళ్ళు పాలిపోలేదు. మీదుమిక్కిలి, తన విధి తన చేతిలోనే ఉన్నదనీ, ఎప్పుడు కావాలంటే అప్పుడు మృత్యువు ద్వారా మానరక్షణ చేసుకోగలననీ, ఆమెకు ఒకవిధమైన ధైర్యం కలిగి, ఆమె కపోలాలు మరింతగా

కెంపు సొంపు నింపుకున్నాయి. ఆమె నేత్రజ్యోతి మరింతగా విద్యుత్కాంతులను వెలార్చుకొంది. స్త్రీ సౌందర్యం అంతటి చైతన్య ప్రభవాలను మూర్తీభవించుకోడం తానెన్నడూ చూచియుండలేదనుకున్నాడు, స్వతః దర్పోద్ధతుడైన టెంప్లార్ బ్రియన్.

'మనమిద్దరమూ రాజీ పడదాం రెబెకా! ఏమంటావు?' అని అడిగాడతడు.

'రాజీయా! అలాగే,—కాని, మన యిద్దరి మధ్య ఈ యెడం ఉంటే షరతుమీద'—అన్నది రెబెకా.

'ఇక నా వలన నీవు ఏ మాత్రమూ భయపడ నక్కరలేదు రెబెకా!'—అన్నాడు బ్రయన్.

'అవును, భయపడ నక్కరలేదు. భయపడను. ఈ చిత్రాకు అంతస్తుపైని బురుజును ఇంత ఎత్తుగా, క్రిందకు పడితే బ్రతకడానికి వీలులేనంత ఉన్నతంగా ఏ మహానుభావుడు కట్టించాడో, అతని పుణ్యమా అని, నీకు నేను ఎంత మాత్రమూ భయపడడం లేదు'—అన్నది రెబెకా.

'ఇంకా నన్ను గూర్చి అన్యాయంగానే తలపోస్తున్నావు రెబెకా. నీ వనుకున్నంత కఠినుణ్ణీ, స్వార్థపరుణ్ణీ కాను నేను. క్రూరత్వం నాకు నేర్పినది ఒక స్త్రీ. కనుక ఆమె మీదనే నేను నా క్రూరత్వం చూపాను. కాని నీవంటి స్త్రీ మీద కాదు. సావధానంగా విను రెబెకా! ఆమెను నేను ప్రేమించినంతంగా, లోకంలో ఏ యోధుడూ తన ప్రియురాలిని తాను ప్రేమించి యుండడు. కావడానికి ఆమె ఒక క్షుద్ర సామంతుని కుమార్తెయే అయినా, నా సాహస విక్రమాలచే ఆమె పేరు దశదిశల మారు మ్రోగేటట్లు చేశాను. అవును!'—ఇక్కడ బ్రయన్ ఏదో భావనలో మునిగి అటూ యిటూ పచారు చేస్తూ, ఎదుట రెబెకా ఉన్నసంగతే మరచిపోయాడు,— 'అవును! ఎడిలెడ్ డీ మెటిమార్ పేరు కేస్టిల్ నుంచి బైజాంటియం దాకా చెప్పుకోడం కోసం ఎన్ని సాహసాలు చేశాను! ఎన్ని ప్రమాదాలెదుర్కొన్నాను! ఎంత రక్తం ధారపోశాను! కాని, తుదకు నాకు కలిగిన ప్రతిఫలమేమిటి? తిరిగి వచ్చేసరికి, ఆమె ఒక క్షుద్ర జమీందారును వివాహమాడినట్లు తెలిసింది. వాని పేరు ఆ క్షుద్ర జమీందారీకి వెలుపల ఎవ్వరూ ఏనాడూ వినియున్నది కాదు. ఎంతో గాఢంగా ప్రేమించా నామెను నేను. ఎంత గాఢంగా ప్రేమించానో, అంత తీవ్రంగానే తుదకా విశ్వాసఘాతకిపై పగ తీర్చుకున్నాను. కాని, నా పగ నామీదనే విరుచుకొని పడింది. జీవితానుబంధాలకు నన్ను నేను దూరం చేసుకున్నాను. ఈ జన్మకు నాకు ఇల్లుతోనూ, ఇల్లాలితోనూ పనిలేదని నిశ్చయించుకొన్నాను. చస్తే, ఒంటరిగానే నేను సమాధి చేయబడాలనీ, నా వంశం నాతోనే అంతరించి

పోవాలనీ నిర్ధారణ చేసుకున్నాను. టెంప్లార్ వ్యవస్థ అధినేత పాదాలకడ నా స్వతంత్రప్రవృత్తిని అర్పించివేశాను. పేరుకు బానిసకాదు గాని, టెంప్లార్ వస్తుతః బానిసయే! ఏవిధమైన ఆస్తిపాస్తులూ అతని కుండరాదు. స్వతంత్రించి ఊపిరి పీల్చుకోడానికి గూడ వీలులేదు. అంతా పరాధీనపు బ్రతుకు!'

'అయ్యో! ఏపరిహారం చూచుకొని అంత కఠోరత్యాగం చెయ్యడం!'- అన్నది రెబెకా.

'పగ తీర్చుకునే శక్తి సంపాదించుకోడమే పరిహారం రెబెకా! తద్వారా అధికారప్రాభవాలను కైవసం చేసుకోడం!'— అన్నాడు బ్రయన్.

'అత్యంత ప్రీతిపాత్రములైన మానవజీవిత స్వత్వాలు వదలుకోడం ఈ విపరీత పరిహారంకోసమా?'- అని ప్రశ్నించింది రెబెకా.

'అలా అనకు రెబెకా! పగతీర్చుకోడం దేవతలుకూడా ఒక గొప్ప విందుగా భావిస్తారట. ఇక అధికార ప్రాభవాసక్తి అన్నావా, స్వర్గసౌఖ్యం అనుభవించేవానికిగూడ విశేషం కలిగించే శక్తి దానిలో ఉంది,'— బ్రియన్ ఇక్కడ ఒక క్షణం ఆగి తిరిగి ఇలా ప్రారంభించాడు,— 'రెబెకా! మానభంగం కంటె మృత్యువే వరణీయంగా భావించిన స్త్రీహృదయం కడు ఉదాత్తమైనదని నా నిశ్చయం. నీవు నాదానవు కావాలి! అలా ఉలిక్కి పడకు రెబెకా! నీ యిచ్ఛానుసారమే, నీ షరతులప్రకారమే, నీవు నాదానవు కావాలని కోరుతున్నాను. రాజులకు గూడా అందరాని భోగైశ్వర్యాలలో నాకు భాగస్వామినివి కావడానికి నీవు సమ్మతించాలి. పూర్తిగా చెప్పనీ రెబెకా, నా కోర్కె త్రోసిపుచ్చేముందు బాగా విచారణ చెయ్యి. నీ వన్నట్లు, టెంప్లార్ తన సాంఘిక స్వత్వాలనూ తన స్వతంత్రతా ప్రవృత్తినీ కోల్పోయేమాట నిజమే. కాని, సింహాసనాలను సైతం దద్దరిల్లచేసే ఒక మహాప్రబల సంస్థకు అతను అంగభూతుడనేది మరువకు! గొప్పగొప్ప నౌకాదళాలను సైతం మ్రింగివేయగల మహాసముద్రమందు లీనమైనప్పుడు, వానచినుకుగూడా ఆ మహావిభూతికి భాగస్వామియే అవుతుంది. ఈ మహాసంస్థలో నాకున్న స్థానం అల్పమైనది కాదు- ఇప్పటికే నేనొక ముఖ్యసేనానిని. ఒకప్పటికి ఈ సంస్థకు అధినేతనుగూడ కాగలను. కావాలంటే టెంప్లార్లు రాజుల రాజదండాలను ఊడలాగుకొని వారి సింహాసనా లెక్కగలరు. మీ జాతివారేదో, ఎప్పటికో, మెస్సయా వస్తాడనీ, మీ జాతికేవో అధికారప్రాభవాలు సంపాదించి పెడతాడనీ అడియాసలు పడుతున్నారు. అంతకంటె మించిన అధికార ప్రాభవాలను లక్షిస్తున్నాను నేను. ఈ ప్రయత్నంలో నాకు అనురూపమయిన ఒక భాగస్వామిని కావాలి. అందుకు నీవే తగినదానవు.'

'ఈ యూదుజాతీయురాలినా తుదకు నీవు అపేక్షించేది?'—అని అడిగింది రెబెకా!

'ఈ మతభేదాలు నా ముందర చెప్పకు రెబెకా! మా రహస్య సమాలోచనల్లో ఈ పిల్లలకథలను ఎంత అపహాస్యిస్తూ ఉంటామో నీకు తెలియదు. మా టెంప్లార్ వ్యవస్థ మూలపురుషుల పిచ్చిఊహలనే పట్టుకొని మేమింకా వ్రేలాడుతున్నామని అనుకోబోకు. మూఢవిశ్వాసంకొద్దీ ఒక మరుభూమిని రక్షించే ప్రయత్నంలో, నుష్కర తురుష్కుల కరవాలాలకే గాక, ఆకలిదప్పులకూ ఘోరమైన అంటుజాడ్యాలకూ బలికావడమనేదే ఒక ఘనకార్యంగా ఎంచుకొని, జీవిత సౌఖ్యాలకు దూరం కావడం ఎంత అవివేకమో మేము ఏనాడో గ్రహించాము. గ్రహించడం వల్లనే, మా సంస్థ విశాలదృష్టి నవలంబించి, మా త్యాగాలకు పరిహారంగా పెక్కు ఉత్తమోపాయాలను కనుపెట్టింది. ప్రతి యూరపియన్ రాజ్యంలోనూ మాకున్న విస్తారమైన ఎస్టేటులుగాని, దిగంతవిశ్రాంతమైన ప్రతాపకీర్తిస్ఫూర్తులుగాని నేడు వినియోగించబడుతున్న పద్ధతికీ, మూలపురుషుల ఆశయాలకూ విపరీతమైన అంతరముంది. వెనుకటి మూఢవిశ్వాసాలతోనే మా సంస్థలో చేరే దుర్బలజీవులకు ఈ రహస్యాలు చెప్పము. ఇక చాలు—మా రహస్యాల నిక బట్టబయలు చేయను. అదిగో, బూరాధ్వని వినవస్తోంది—నేను వెళ్ళవలసిన పని ఉంది. ఇప్పుడు చెప్పినదంతా సావధానంగా ఆలోచించు. నీకు శుభమగుగాక! నా దౌర్జన్యపు బెదరింపును మన్నించవలసిందిగా నిన్ను కోరను. బెదరించాను కాబట్టే నీ గుణసంపత్తి బయటపడింది. ఒరిపిడితో గాని బంగారపు నిగ్గు తేలదు. త్వరలోనే వచ్చి మళ్ళీ నీతో సంప్రతిస్తాను.'

అంటూ బ్రయన్ వెంటనే ఆగది విడిచి చరచరా మెట్లు దిగి వెళ్ళిపోయాడు. ఎట్టి భయంకరమైన కాంక్షతో దహించుకొనిపోవు దుస్సాహసికుని చేతిలో తాను పడ్డానా అని బెగడొందుతూ, రెబెకా గదిలోనికి తిరిగి వచ్చింది. ఇప్పుడామె పొందుతున్న భయం, ఇంతకు ముందు మృత్యువు నెదుర్కొన బోయినప్పుడు పొందిన భయంకంటె తక్కువదేమీ కాదు. గదిలోనికి రాగానే, తనను ఎలాగో ఒక ఆపదనుండి రక్షించినందుకు భగవంతునికి కృతజ్ఞతాభివందనము లర్పించింది. ముందుకూడా ఇట్లే తననూ తన తండ్రినీ కాపాడవలసిందని ప్రార్థించింది. ఇంకొకరిపేరు కూడా ఆమె ప్రార్థనలో దొర్లింది,—తన వలెనే శత్రుమధ్యమందున్న క్షతగాత్రుడగు ఆ క్రైస్తవ యోధునిపేరు. 'నీ జాతికీ నీ మతానికీ బద్ధవిరోధులగువారి తెగకు చెందిన వాని స్మరణ నీ దైవప్రార్థనలో దొర్లదగునా' యని ఆమె హృదయం ఆమె నధిక్షేపించినది గాని, ఏమైనప్పటికీ ఆ పేరు ప్రార్థనలో దొర్లనే దొర్లింది. దొర్లినందుకామె చింతపడలేదు కూడ.

# అధ్యాయం ౨౬

క్రైంప్లార్ బ్రయన్ సరాసరి కోటకచేరీ చావడికి చేరుకునేసరికి, అంతకు ముందే అక్కడికి వచ్చివున్నాడు డీ బ్రేసీ. బ్రయన్‌ను చూడగానే అతడిలా అన్నాడు: 'ఏమి సర్ బ్రయన్! నీ ప్రేమకలాపానికి గూడా అంతరాయం కలిగినట్లుందే! ఆలస్యంగా రావటం చూస్తే, నీ వ్యవహారం నా దానికంటే కొంచెం సుముఖంగా నడిచినట్లు తోస్తోంది. నిజమేనా?'

బ్రయన్ ఆ ప్రశ్నకు సమాధానం చెప్పకుండానే,—'ఆ సాక్సన్ సుందరి దగ్గర ఇంతకూ నీ ప్రాచీక పారశీకా రేమిటి?' అని ఎదురుప్రశ్న వేశాడు.

'ఏమిచెప్పను, ఆడదాని కన్నీళ్లు చూచి నేను సహించలేని రోజెనా కలాగో తెలిసివుండాలి'— అన్నాడు డీ బ్రేసీ.

'భాభా! మళ్ళీ పెద్ద దళవాయివి! ఆడదాని కన్నీళ్లు చూచి దిగజారి పోవడమా! కన్నీటిచుక్కలు కొన్ని చిలకరిస్తే ప్రేమదివిటీ మరింత ఉజ్జ్వలంగా మండాలి నిజానికి'—అని అధిక్షేపించాడు బ్రయన్.

'కొన్ని చుక్కలేమిటయ్యా, ఒక పెద్ద భోగిమంట నార్పివేయుగలిగినంత కన్నీరు వెల్లువగా వచ్చిపడితేనూ! అంతటి అశ్రుపరివాహం ఎవ్వరూ ఏనాడూ చూచియుండరు. ఏదో జలదేవత ఆమె నావహించి యుండాలి'—అన్నాడు డీ బ్రేసీ.

'ఒకటికాదు, వెయ్యి దేవతలో దయ్యాలో ఆ యూదుకన్నె నావహించి నట్లున్నాయి. అంతటి పట్టుదల ఒకే దేవతో దయ్యమో ఆవహిస్తే కలిగేదికాదు. అది సరేగాని, ఫ్రాంట్ డిబాఫ్ ఎక్కడ? శృంగధ్వని అంతకంతకు తీవ్రంగా వినవస్తోంది' అన్నాడు బ్రయన్.

'బహుశః ఆ యూదీయునితో బేరసారాల్లో మునిగి ఉంటాడు. ఇసాక్ పెట్టే పెడబొబ్బలమధ్య అతనికీ శృంగధ్వని వినిపించలేదేమో! యూదీయుడు తన ధననిధులను విడనాడుకోవలసి వచ్చేటప్పుడు ఎలాంటి ఓండ్రలు పెట్టేదీ నీ కనుభవమే. అంతలోనూ మన ఫ్రాంట్ డిబాఫ్ వంటివాడు తగులుకొని దబ్బు గుంజేటప్పుడు చేసే గోండ్రింపులమధ్య ఇలాంటి శృంగధ్వనులు ఇరవై ఒక్క సారిగా చేస్తేమాత్రం వినిపిస్తాయా! ఇదిగో ఎవరినైనా పంపి పిలిపిద్దాం'—అని డీ బ్రేసీ అంటూవుండగానే ఫ్రాంట్ డిబాఫ్ అక్కడికి వచ్చాడు.

‘ఈ శృంగధ్వనికి కారణమేమిటో ఇంకా తెలియలేదు. ఇదేదో ఉత్తరం వచ్చింది. సాగ్జన్ భాషలో వ్రాసినట్లున్నారు,’ అంటూ ఫ్రాంట్ డీబాఫ్ దానిని అటూ ఇటూ త్రిప్పి చూచి డీబ్రేసీకిచ్చాడు. ఆ భాష అతనికి కూడా తెలియనందున, టెంప్లార్ బ్రయన్ దానిని అందుపుచ్చుకొని చదివి ఇలా అన్నాడు: ‘ఇదొక సవాలు ఉత్తరం. కాని, పరిహాసానికి వ్రాసిన తమాషా ఉత్తరంలాగా కూడ కనిపిస్తోంది. ఇలాంటి ఉత్తరం సవాలుగా ఒక కోటలోకి పంపబడడం మానవేతిహాసంలోనే అపూర్వమనేమాట నిశ్చయం.’

‘ఆఁ, పరిహాసమా! ఎవడు నాతో పరిహాసమాడ సాహసించినది! ఉత్తరం చదువు సర్ బ్రయన్’— అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

బ్రయన్ ఈ రీతిగా చదివి వినిపించాడు:

‘గొధరువుడ్డు ఎస్టేటుదారైన సెడ్రిక్ ది సాగ్జన్ పరివారంలో హాస్యగాని వృత్తియందుంటూ జీవనం చేస్తున్న విట్‌లెస్ కుమారుడు వాంబా అనే పేరుగల నేనున్నూ,—

‘సదరు సెడ్రిక్ వద్దనే పందులకాపరిగా ఉంటూ జీవనం చేస్తున్న బోవుల్ఫ కుమారుడు గర్త్ అనే పేరుగల నేనున్నూ,—

‘ఈ కార్యంలో మాకు బాసటగా నిలిచిన నీలకవచధారి అనే యోధుని యొక్కయూ, లాక్సిలీ అనే విలుకాని యొక్కయూ సహాయ సంపత్తులను పురస్కరించుకొన్నవారమై,—రెజినాల్డు ఫ్రాంట్ డీబాఫ్ అని పిలువబడే నీకున్నూ, నీకు సహాయులుగా ఎవరెవరుంటే వారికిన్నీ, యింమూలంగా తెలియజేసేది యేమనగా,—

‘మా దొరయైన సదరు సెడ్రిక్‌ను మీరు, కారణం తెలియజేయకుండానూ, కార్యం ప్రకటించకుండానూ, అక్రమంగా ఆక్రమించి పట్టుకొని బంధించియున్నందువల్లనున్నూ, అదేవిధంగా లేడీ రొవెనా అనే సాగ్జన్ రాకుమారినిన్నీ, కోనింగ్స్‌బర్గు ఎస్టేటుదారైన ఎథెల్‌స్టేన్ అనే సాగ్జన్ సామంతునిన్నీ, ఇంకా కొందరు స్వతంత్రులనున్నూ దాసులనున్నూ, అదే ప్రకారంగా యార్కునగర వాస్తవ్యుడైన ఇసాక్ అనే యూదీయునిన్నీ, అతని కుమార్తెనున్నూ, కొన్ని గుర్రాలూ కంచరగాడిదలతో సహా పట్టి బంధించి యున్నందువల్లనున్నూ, రాజమార్గాన శాంతియుతంగా ప్రయాణించే సదరు సెడ్రిక్ వగైరాలను అలా బంధించడమనేది సహించరానిది కావుననున్నూ—

‘ఈ ఉత్తరం అందజేయబడిన గంటసేపటిలోగా, సదరు సెడ్రిక్ వగైరా వ్యక్తులను యావన్మందినీ, వారి వారి గుర్రాలూ కంచరగాడిదలూ ఇతరవస్తు

వులూ నగరాలతో, మాకుగాని, మాచే నియమింపబడినవారికిగాని, యథాతథంగా, ఎవ్వరికీ కించిత్తు హానిలేకుండా, ఏ వస్తువూ కించిత్తు బీరుపోకుండా, అప్పగించెదరుగాక యని ఆశిస్తున్నాము. అలా అప్పగించనిపక్షంలో, మిమ్మల్ని చోరులక్రిందనూ, రాజద్రోహుల క్రిందనూ జమకట్టి, మీమీద కయ్యం నడిపి, మిమ్మల్ని హతమార్చడానికి ఎంత చెయ్యాలో అంతా చెయ్యగలవారమనుటకు సందేహంలేదు. భగవంతుడు మీ బుద్ధులను సక్రమమార్గంలో నడిపించుగాక!

'ఈ ఉత్తరం మాచేత యీ...రోజున, యీ...కోనలోని మహావట వృక్షం క్రింద సంతకం చేయబడినది. దస్తూరీ కోప్ మన్ హార్స్టు పాదరీది.'

పై ఉత్తరం క్రింద, వాంబా సంతకానికి నిశానీగా ఒక కోడిపుంజు తలకాయి బొమ్మా, గర్తు సంతకానికి నిశానీగా ఒక సిలువబొమ్మా చీకిరిబాకిరిగా గీయబడి ఉన్నాయి. వాటిక్రింద పెద్ద పెద్ద అక్షరాలతో నీలకవచధారి సంతకముంది. అన్నిటికంటె దిగువను, లాక్స్లీ సంతకానికి నిశానీగా, ఒక బాణం గుర్తు ముచ్చటగా గీయబడి ఉంది.

ఈ విచిత్రమైన ఉత్తరం ఆదినుంచి అంతంవరకూ చదివి, దాని లోతుపాతులు అంతుచిక్కక, రిచ్చపాటుతో ముగ్గురూ నోటమాట లేకుండా ఒకరి మొగంవంక ఒకరు చూచుకున్నారు. కొంత సేపటికి గ్రుక్క తిరిగినట్లయి, డీ బ్రేసీ అదే పనిగా పెద్ద పెట్టున నవ్వడం ప్రారంభించాడు. అంతకంటె కొంచెం తగ్గు స్థాయిలో టెంప్లార్ కూడా అటుతర్వాత నవ్వులలోకి దిగడు. వీరి అసమయ వినోదం చూచి ఫ్రాంట్ డీ బాఫ్ పడ్డ చికాకు ఇంతా అంతా కాదు.

'ఎందుకలా నవ్వుతారు? ఇంతటితోనైనా ఈ అసందర్భపునవ్వు విరమించి, ప్రస్తుత పరిస్థితిలో ఎలా వ్యవహరించాలో ఆలోచించండి'—అని అతడు హెచ్చరించాడు.

'మొన్నటి పోటీల్లో క్రిందపడ్డ తర్వాతనుంచీ కలిగిన చిరాకు ఫ్రాంట్ డీ బాఫ్‌కింకా వదలనట్లుగా ఉంది సర్ బ్రయన్! ఇది సవాలు ఉత్తరం అయినంత మాత్రానికే బెదిరిపోతున్నాడు. ఇంతా చేస్తే ఒక హాస్యగాడూ, ఒక పందుల కాపరీ చేసిన సవాలిది!'—అన్నాడు డీ బ్రేసీ.

'మాటలవల్ల ప్రయోజనంలేదు డీ బ్రేసీ! ఇక్కడ కావలసినవి చేతలు. ఈ తాకిడి అంతా నీ వొక్కడవే తట్టుకోవలసివచ్చేటట్టుగా ఉంటే బాగుండును! అప్పుడు తెలిసివచ్చేది. వెనుక రొంతో బలమైన మద్దతు చూచుకొనికే ఈ వెధవలిలా సవాలు చెయ్యడానికి సాహసించేవారంటావా? ఈ యడవిలో

బందిపోటుదొంగలు చాలామంది ఉన్నారు. అడవిలోని లేళ్ల జోలికి ఇతరులెవ్వరూ పోరాదని నేను చేసిన శాసనం వాళ్లకు కంటకంగా ఉంది. మొన్న నొకసారి ఆ శాసనాన్ని ఉల్లంఘించిన ఒక వెధవని పట్టుకొని, ఒక అడివిదున్న కొమ్ములకు కట్టి వదిలేసరికి, అయిదునిమిషాల్లో అది వాణ్ణి నేలనువేసి కొట్టి చంపేసింది. ఈ పని చేసినందుకు తరువాత నామీద యెన్నిబాణాలు వచ్చిపడ్డాయో లెక్కలేదు'—అంటూ ఫ్రాంట్‌డీబాఫ్ తన ప్రక్కనున్న నౌకరుతో,—'ఈ సవాలు పంపినవాళ్ళు యెంత బలగంతో వచ్చారో యెవరైనా వెళ్ళి చూచి వచ్చారా'—అని అడిగాడు.

'కనీసం ఒక రెండువందలమంది ఉండవచ్చు'—అని సమాధానమిచ్చాడు నౌకరు.

ఫ్రాంట్‌డీబాఫ్ తనమిత్రులవంక తిరిగి, —'చూడండి ఏం జరిగిందో! గుట్టు చప్పుడు కాకుండా వ్యవహారం చక్కబెట్టుకోడం చేతకాక మీకు నా కోట ఉపయోగించుకోడానికిచ్చిన ఫలితం! ఈ కందిరీగలదండు నా మీదికి వచ్చిపడింది!' —అని చిరాకుపడ్డాడు.

'కందిరీగలా! కుట్టడం చేతగాని ఉసుళ్ళయితే కావచ్చు- ఈ సోమరి పోతు వెధవలు మనల్నేం చేస్తారు'— అన్నాడు డీబ్రేసీ.

'కుట్టడం చేతవచ్చునో లేదో వాళ్లు వేసే బాణాలు వచ్చి మీదపడ్డప్పుడు తెలుస్తుంది'— అన్నాడు ఫ్రాంట్‌డీబాఫ్.

'ఎందుకీ అనవసర ప్రసంగం! మన మనుష్యుల్ని అందరినీ ప్రోగు చెయ్యండి. వెళ్లి వాళ్లమీద పడతాం. అలాంటి వెధవలకి ఇరవైమందికి ఒక యోధుడు సమాధానం చెప్పవచ్చు,'—అన్నాడు బొంగ్లాక్.

'రాగారాగా ఈ అడివిమూకమీదనా మన యోధత్వానికి వినియోగం!'—అని అధిక్షేపించాడు డీబ్రేసీ.

'వెళ్లి అవలీలగా మీదపడడానికి వీళ్లు పాలస్తీనాతురుష్కులు కాదు సర్ బ్రయన్! అంత చులకనగా డీబ్రేసీ చూడడానికి ఇది ఫ్రెంచి మూకా కాదు. విలువిద్యలో ఆరితేరిన సాగ్జన్ ఆటవికులు. అడవిలో ఇట్టే మాయమై ఇట్టే బయటపడుతూ ఉంటారు. వెళ్ళి మీదపడడం సులభమయిన పని గాదు. కోటలో మనుష్యులా, ఎక్కువగా లేరు. నామనుష్యులంతా యార్కులో ఉండి పోయారు. డీబ్రేసీ సైనికబృందం కూడా యార్కులోనే ఉంది. ఈ పిచ్చి ప్రయత్నంలో ప్రవేశించినవాళ్లు గాక పై బలగం ఏ ఇరవైమందో కంటె యెక్కువ తేలేటట్లులేదు'—అని వితర్కించాడు ఫ్రాంట్‌డీబాఫ్.

'అయితే ఈ కోటను భేదించగలిగేటంత బలగం ఈ ఆటవికులకున్నదని నీ భయమా?'—అని ప్రశ్నించాడు బ్రయన్.

'అది కాదుగాని, ఈ ఆటవికుల నాయకుడు చాలా అసాధ్యుడు. అయితే, త్రాటినిచ్చెనలూ, ఇతర యంత్రపరికరాలూ, అనుభవం గలిగిన విన్నాణులూ ఉంటే తప్ప ఈ కోట ఒకపట్టాన యెవ్వరికీ సాధ్యం కాదులే'—అని సమాధానమిచ్చాడు ఫ్రాంట్ డీ బాఫ్.

'వెంటనే నీ ఇరుగుపొరుగు మిత్రులకు కబురుచెయ్యి,—ఇలా ఒక హాస్యగాడిచేతనూ, ఒక పందులకాపరిచేతనూ నీకోట ముట్టడించబడిందని. వాళ్ళువచ్చి, కోటలో చిక్కుపడ్డ యోధాగ్రేసరులను మన ముగ్గురినీ ఈ చిక్కులోంచి బయట పడెయ్యవచ్చు'—అన్నాడు బ్రయన్.

'నీ హాస్యం అర్థమయిందిలే గాని, ఎవరికి కబురుచెయ్యనా అని ఆలోచిస్తున్నాను. మాల్వాయిసిన్ కూడా తన బలగంతో యార్కులోనే ఉన్నాడు. అలాగే ఇతరమిత్రులుకూడా. నేనుకూడా అక్కడే ఉండవలసింది,—ఈ చండాలపు వ్యాపారమొకటి తగులుకున్నదిగాని!'—అని విసుక్కున్నాడు ఫ్రంట్ డీబాఫ్.

'అయితే యార్కుకే ఎవరినైనా పంపి మనవాళ్లను పిలిపిస్తే సరిపోతుంది, ఏ చిక్కూ ఉండదు'—అని సూచించాడు డీబ్రెసీ.

'నిజమే. కాని వెళ్ళేవారెవరు? ఈ దొంగవెధవలు అన్నిదారులూ కాచి తీర్తారు గాని ఊరుకోరు. ఆఁ, ఒకపనిచేద్దాం,'—అని ఫ్రాంట్ డీబాఫ్ ఒక క్షణం ఆగి,—'నీకు చదవడమే కాక వ్రాయడంకూడా చేతవచ్చుగా సర్ బ్రియన్! ఈ సవాలుకు నీవొక జవాబు వ్రాయి, వాళ్లకు పంపిద్దాం'—అన్నాడు.

'కత్తితో సమాధానం చెప్పడమే కాని, కలంతో చెప్పడం నాకలవాటులేదు. అయినా నీవు కావాలంటే అలాగే చేస్తాను' అన్నాడు బ్రయన్.

వ్రాత పరికరాలు తెప్పించబడ్డాయి. బ్రయన్ ఫ్రెంచిభాషలో ఈ ఉత్తరం తయారుచేశాడు:

'సర్ రెజినాల్డు ఫ్రాంట్ డీ బాఫ్ కు గాని, అతని మిత్రులగు యోధాగ్రేసరులకు గాని, బానిసలూ, సంఘబాహ్యులూ చేసే సవాళ్ళను ఒకలెక్కలోకి తీసుకునే ఆచారం లేదు. నీలకవచధారి అనే అతడు నిజంగా యోధవర్గానికి చెందినవాడే అయితే, బానిసలతోనూ సంఘబాహ్యులతోనూ అతడి

విధంగా పొత్తు కుదుర్చుకోడం అతని గౌరవానికే హానికరమని తెలుసుకోడం మంచిది. కనుక, అతని సవాలునుకూడా మేము పరిగణించడానికి వీలులేదు. ఇక, మా స్వాధీనంలో ఉన్న ఖయిదీల సంగతి. చావబోయే ముందర వీళ్లు తమ పాపాలు వెళ్లబోసుకొని, తగిన మతబోధ పొంది, దైవానుగ్రహం పొందడానికి వీలుగా, మతబోధకుని ఎవరినైనా పంపవలసిందిగా క్రైస్తవ ధర్మం ప్రకారం మిమ్మల్ని అడుగుతున్నాము. ఏలనంటే, ఈ ఉదయమే వాళ్లను ఉరితీసి, వాళ్ళ సహాయార్థం వచ్చినవాళ్ళను మేమెంత నిర్లక్ష్యంగా చూస్తున్నామో తెలియజేయగలందులకు వాళ్ల తలకాయలు కోటబురుజులకు వ్రేలాడదీయ నిశ్చయించుకున్నాం. కనుక, ఒక మతబోధకుని వెంటనే పంపుకోండి. అది మీవాళ్లకు మీరు చేసుకోదగిన చిట్టచివరి సాహాయ్యం."

ఉత్తరం మడిచి నౌకరుకివ్వగా, దానిని వాడు జవాబుకోసం బయట వేచియున్న వార్తాహరునికి అందజేసాడు. వెంటనే ఆ వార్తాహరుడు, కోటబయట మూడు అలుగువ్రేటుల దూరంలో తనకోసం ఎదురుచూస్తున్న లాక్సిలీ ప్రభృతుల వద్దకు చేరాడు. అక్కడ ఒక వటవృక్షం క్రింద లాక్సిలీ, నీలకవచధారి, గర్తు, వాంబా, ఫాదరీ — ఈ అయిదుగురూ కూర్చుండి ఉన్నారు. వాళ్లకు కొంత దూరంలో, సుమారు రెండువందలమందిదాకా ఆటవికులున్నారు. క్రమక్రమంగా ఇంకా చాలామంది వచ్చిచేరుకుంటున్నారుకూడా. అందరూ ఒకేమాదిరి దుస్తుల్లో ఉన్నా, వారిలో నాయకులైనవారికిమాత్రం పక్షియీకల తురాయి టోపీలున్నాయి.

వీరుగాక, ఆ సమీపపు బస్తీకిచెందిన సాక్సన్ జాతీయులు కూడ కొందరు, సెడ్రిక్ పట్టుపడ్డాడని తెలిసి, చెరవిడిపించే ప్రయత్నంలో తోడ్పడడం కోసం కొడవళ్లూ, గడ్డపలుగులూ పెందలైన ఏవేవో చిల్లరమల్లర ఆయుధాలు తీసికొని వచ్చారు. సైనికులు ధరించే కత్తులూ ఈటెలూ మొదలైనవి సాక్సన్ జనసామాన్యం ధరించడానికి వీలులేదు ఆరోజుల్లో. అందుచే ఈ సాక్సను అవసరాన్నిబట్టి కొడవళ్లు, గడ్డపలుగులు పెందలైన పనిముట్లనే ఆయుధాలుగా కూడ ఉపయోగిస్తూ ఉండేవారు. ఇలాంటి చిల్లరమల్లర సైన్యంతో అచట విడిసియున్న లాక్సిలీ ప్రభృతులకు టెంప్లార్ బ్రయన్ వ్రాసిన ఉత్తరం అందజేయబడింది.

ఉత్తరంలో ఏమున్నదో చదవమని ముందు ఫాదరీ చేతికిచ్చారు. కాని, అతనికా భాష తెలియలేదు. నాకిది అయోమయంగా ఉన్నదని చెప్పి గర్తుచేతికిచ్చాడు. అతడు వాంబా కందించాడు. వాంబా దాన్ని గిరగిరా తిప్పి చూచి వికటంగా మొగంపెట్టి పండ్లికిలించి లాక్సిలీ చేతిలో పెట్టాడు. ఈ పొడుగక్షరాలు విండ్లూ, పొట్టి అక్షరాలు అమ్మలూ అయితే నాకేమైనా తెలుస్తుందేమో

కాని, లేకపోతే నాకేమి తెలుస్తుందని నీలకవచధారికిచ్చాడు. అతడు దానిని ముందు లోలోపల చదువుకొని, పిమ్మట దాని అర్థం వివరణగా వారికి తెలియ చెప్పాడు.

'ఆఁ, మా సెడ్రిక్ దొరగారిని ఉరితీస్తారా! అబద్ధం! మీరు పొరపాటుగా చూచివుంటారు!'— అని చకితుడై పలికాడు వాంబా.

'పొరపాటేమీ లేదు. అంతా ఉన్నదున్నట్లుగా మీకు వివరించాను. ఒక్క అక్షరం పొల్లు పోనివ్వలేదు'— అని నీలకవచధారి సమాధానం చెప్పాడు.

'అయితే ఈ కోటను పట్టుకొని తీరాలిసిందే! కాని,...ఎలా పట్టుకోడం!' అని వితర్కించాడు గర్త్. 'ఎలా పట్టుకోడం?' అని వాంబాకూడా వితర్కించి, ఏమీ పాలుపోక గుడ్లు తేలవేశాడు.

'ఇది యెలాగైనా కాలయాపన చెయ్యడానికి వేసిన యెత్తుగాని మరేమీ కాదు. ఎన్ని గుండెలతో ఉరితీస్తారో చూస్తానుగదా! వీళ్ళకు నరకం రుచి చూపిస్తాను'—అన్నాడు లాక్స్లీ.

నీలకవచధారి ఇదంతావిని, 'మన మిప్పుడు ఒక పనిచేస్తే బాగుంటేట్లు తోస్తోంది. మనలో ఎవరైనా వెళ్ళి అచట బందీల స్థితిగతులు ఎలాఉన్నాయో తెలుసుకొని రావాలి. ఎవరినైనా మతబోధకుని పంపించమన్నారు గనుక, మన ఫాదరీ వెళ్ళి మనకు కావలసిన భోగట్టా సేకరించుకొని రావచ్చు' అన్నాడు.

'నీ సలహా కాటుగాని, చంపేశావు! ఫాదరీదుస్తులు తీసివేసి ఆటవిక వేషంలో ఉన్నానిప్పుడు నేను. ఫాదరీదుస్తులు ఎప్పుడైతే తీసి అవతల పెట్టానో అప్పుడే నా ఫాదరీతనాన్నిగూడ తీసి అవతలపెట్టేశాను. ఇప్పుడు నేను కావలిస్తే ఇరవై లేళ్లను చంపమంటే చంపగలను గాని, ఫాదరీతనం చెయ్యడం నా వల్ల కాదు'— అన్నాడు ఫాదరీ.

'అయితే ఇక్కడ యెవ్వరూ ఆ పని నిర్వహించగలవారు లేరనుకుంటాను' అన్నాడు నీలకవచధారి. అక్కడ ఉన్నవాళ్లంతా ఒకరిమొగం ఒకరు చూచుకున్నారు.

కొద్దిక్షణా లయింతర్వాత వాంబా ఈ విధంగా అన్నాడు: 'విజ్ఞులు నిర్వహించ వెనుకాడే పనిని ఇక నిర్వహిస్తే విదూషకుడే నిర్వహించాలి. ఒకప్పుడు నేను ఫాదరీ వృత్తికి శిక్షణ పొందినవాణ్ణే. ఇంతలో ఏదో సన్నిపాతజ్వరం వచ్చి, విదూషకుణ్ణి కావడానికి తగ్గ బుద్ధిమాత్రం ఈబుర్రలో మిగిల్చి చక్కాపోయింది. ఇప్పుడు నేను ఫాదరీ దుస్తులతో మీరు కోరిన పని చేసుకురాగలనని నా నమ్మకం.'

నీలకవచధారి గర్తువంక చూసి, 'ఈ పని ఇతను చేసుకురాగలడని నీకు నమ్మకమేనా?'— అని అడిగాడు.

'చేసుకురాగలడో లేదో తెలియదు గాని, ఇదివరకెప్పుడూ ఇతను తన వెంగలితనాన్ని అవసరం వస్తే సదుపయోగంలో పెట్టజాలకపోయింది లేదు'— అని సమాధాన మిచ్చాడు గర్త్.

'అయితే యికనేం, వెంటనే ఫాదరీ దుస్తులు వేసుకొని బయలుదేరు. కోటలోని పరిస్థితులన్నీ మీ దొరగారివల్ల తెలుసుకో. బహుశః కోటలో బలగం చాలా తక్కువగానే ఉండిఉంటుంది. విజృంభించి మనం ఒక పట్టు పట్టామంటే, కోట మన స్వాధీనం కావచ్చు. కాలహరణ మౌతోంది. త్వరగా వెళ్లు'— అన్నాడు నీలకవచధారి.

'ఈలోగా మేము చుట్టూ కాపలా ఉండి, లోపలనుంచి ఒక్క ఈగ కూడా బయటికి పోకుండ చూస్తూ ఉంటాలే. ఆ దుర్మార్గులికి ఒక విషయం మాత్రం స్పష్టం చెయ్యి. వాళ్ల స్వాధీనంలో ఉన్న ఖయిదీలను వాళ్లు ఏ రూ రకంగా శిక్షిస్తే, అంతకు పదిరెట్లుగా తాము తర్వాత అదేరకంగా ప్రాయశ్చిత్తం అనుభవించవలసివస్తుందని చెప్పు'— అన్నాడు లాక్సిలీ.

వాంబా ఫాదరీదుస్తులు ధరించడం ఇంతలో పూర్తి అయింది. విదూషకుడుగా ఉన్నప్పటి పూర్వపు వెకిలినడక మాని, ఫాదరీ నడక కుండవలసిన గాంభీర్యాన్ని అనుకరిస్తూ బయలుదేరాడు తన కర్తవ్యం నిర్వహించడానికి.

# అధ్యాయం ౨౬

ఫాదరీ దుస్తుల్లో మున్నాయైన వాంబా ఫ్రాంట్ డీ బాఫ్ కోట సింహద్వారంవద్ద నిలబడగానే, ద్వారరక్షకుడు,—'నీ పేరేమి, ఎందుకు వచ్చావ' వని అడిగాడు.

'సెంటు ఫ్రాన్సిస్ వ్యవస్థకు సంబంధించిన ఫాదరీని నేను. ఈ కోటలో బంధింపబడ్డ దురదృష్టవంతులగు ఖైదీల పాపశాంతికొరకు ప్రార్థన చేయ వచ్చాను'—అని సమాధానమిచ్చాడు వాంబా.

'చాలా సాహసికుడవే! ఇరవై యేళ్లయింది ఈ కోటలో నీ వంటివాడు అడుగుపెట్టి,—తెలుసునా ?' అన్నాడు ద్వారరక్షకుడు.

'అయినా మీ దొరగారితో వెళ్ళి చెప్పు. నన్ను తప్పక ఆయన లోనికి రమ్మంటారు' అన్నాడు వాంబా.

'అలాగా! అయితే ఉండు, కనుక్కొస్తాను. అనవసరంగా నా స్థానం కదలివచ్చినందుకు నాకు చివాట్లు తగిలితే మాత్రం, ఈబాణాలతో నిన్ను కోటాగా వన్నమాటే!'—అని బెదరిస్తూ ద్వారరక్షకుడు లోనికి వెళ్ళి, ఫ్రాంట్ డీబాఫ్‌కీ సంగతి నివేదించాడు. వెంటనే ప్రవేశపెట్టమని ఫ్రాంట్ డీ బాఫ్ అనేసరికి అతని కాశ్చర్యం కలిగింది. సింహద్వారానికి తిరిగివచ్చి వాంబాను వెంటనే తన యజమాని సన్నిధికి చేర్చాడు. ఆ భయంకర విగ్రహాన్ని సన్నిధానంలో వాంబాకు దడపుట్టినట్లయింది. బయటుదేరడం మట్టుకు 'ఓస్, ఈ పని యెంత' అనే ధైర్యంతోనే బయలుదేరాడు. కాని, అది యిక్కడ అంతగా అక్కరకు రాలేదు. తడబడుతూ ఆశీర్వచనం చేశాడు. తనముందర ఎలాంటివాళ్ళూ గజగజలాడుతూ ఉంటారనేది ఫ్రాంట్ డీబాఫ్‌కు తెలిసినదే. అందుచే, వాంబా తడబాటు అతనికేమాత్రమూ అనుమానం కలిగించలేదు. 'ఎవరు నీవు ఫాదరీ, ఎక్కడివాడవు?' అని ప్రశ్నించాడు కొట్టొందటగా.

'నేను సెంటుఫ్రాన్సిస్ సంప్రదాయానికి చెందిన సన్యాసిని. ఈ అడవిలోంచి ప్రయాణం చేస్తుండగా దొంగల చేతిలో పడ్డాను. తమ ధర్మానుశాసనానికి గురియై ఇరువురు ఖయిదీలు ఈ కోటలో ఉరికంబాని కెక్కబోతున్నారని చెప్పి, అంతిమ సమయంలో వారి పాపశాంతికొరకు ప్రార్థన చేసిరమ్మని పంపారు'—అన్నాడు వాంబా.

'అది సరేగాని, దొంగలు ఎంతమందిఉన్నారో లెక్క చెప్పగలవా ?'—అని అడిగాడు ఫ్రాంట్ డీ బాఫ్.

'అబ్బో! సైతానుసైన్యమంతమంది ఉన్నారు వాళ్లు'—అన్నాడు వాంబా.

ఫ్రాంట్ డీ బాఫ్ కనుబొమలు చిట్లించి, 'అదంతా పనికిరాదు. ఎంత మంది ఉన్నారో తిన్నగా లెక్క చెప్పు. లేకపోతే,— నాసంగతి నీకు తెలియదు కాబోలు, నీ ఫాదరీతనం నిన్నేమీ రక్షించదు'— అంటూ బుసకొట్టాడు ఫ్రాంట్ డీ బాఫ్.

'అయ్యో, నేనేం చెప్పేది? ఆ కంగారులో సరిగా లెక్కపెట్టలేదు. ఆటవికులూ జానపదులూ—అంతా కలిసి బహుశా ఒక ఐదువందలమంది ఉంటారేమో'— అన్నాడు వాంబా.

'ఆఁ, అన్ని కండిరీగలు ముసిరినాయిగా ఇక్కడ! త్వరగా వీళ్ళను వదిలిపి పారవెయ్యవలసిందే!'— అంటూ ఈ సమయంలో టెంప్లార్ బ్రయన్ హాలులోకివచ్చి, ఫ్రాంట్ డీ బాఫ్‌తో— 'ఈ ఫాదరీ నీకు తెలిసినవాడేనా?' —అన్నాడు.

'ఇతడెవరో దూరదేశంనుంచి వస్తున్నాడు. నే నెరగను'—అన్నాడు ఫ్రాంట్ డీ బాఫ్.

'అయితే ఇతన్నినమ్మి నోటిమాటలతో డీబ్రేసీ సైనికదళానికి కబురు చెయ్యడం మంచిదికాదు. డీబ్రేసీ ఆజ్ఞగా తక్షణం బయలుదేరి రావలసిందని ఉత్తరం వ్రాసి చేతికిద్దాం. ఈలోపుగా ఆ సాక్సన్ వెధవల్ని కబేలాకు సిద్ధం చేసి రమ్మను'—అన్నాడు బ్రయన్.

'అవును, అలాగే చేద్దాం,'—అన్నాడు ఫ్రాంట్ డీ బాఫ్. తక్షణం వాంబాను సెడ్రిక్ ఎథెల్‌స్టేన్‌ల వద్దకు తీసుకొనిపోవడానికి ఒక నౌకరును నియోగించాడు.

అక్కడ సెడ్రిక్, తనను నిర్బంధంలో ఉంచినందుకు పడుతున్న చికాకు ఇంతాఅంతాకాదు. ఏ శత్రువుమీదికో దండెత్తబోతున్న వాడిలాగా హాలులో అటూఇటూ పచార్లు చేస్తున్నాడు. మధ్యమధ్య, తనలో తానే బిగ్గరగా ఏమేమో అనుకుంటున్నాడు. ఒక్కొక్కసారి ఎథెల్‌స్టేన్‌తో ఏమేమో అంటున్నాడు. ఎథెల్‌స్టేన్‌కు ఇదేమీ పట్టినట్లు లేదు, తాపీగా, మధ్యాహ్నం స్వేష్టకృత్తుగా తిన్న భోజనాన్ని జీర్ణం చేసుకుంటూ, ఏమౌతుందో కానీలే చూద్దాం, దేనికైనా అంతు అనేది ఎప్పటికైనా ఉండితీరుతుందిగదా'—అన్న ధోరణిలో ఉంది అతని వైఖరి.

'భగవానుడు మీ పాపాలు మన్నించుగాక!'— అంటూ వాంబా లోనికి అడుగుపెట్టాడు. అతన్ని చూడడంతోటే సెడ్రిక్,—'రండి లోపలికి, నిరభ్యంతరంగా రావచ్చు. ఏమిటి మీరు వచ్చినపని?'—అని అడిగాడు,

'మిమ్మల్ని మృత్యువుకు సిద్ధం చేసేపనిమీద వచ్చాను'—అన్నాడు వాంబా.

సెడ్రిక్ చకితుడై,— 'అసంభవం! అదెన్నటికీ జరగదు. వాళ్ళెంత దుర్మార్గులైనా, అకారణంగా ఇంత క్రూరకృత్యానికి ఒడిగట్టుతారనేది అసంభావ్యం!'— అన్నాడు.

'మీకా సంశయం ఏ మాత్రమూ అక్కరలేదు. పారిపోయిన గుర్రాన్ని పట్టుదారపు కళ్ళెంతో పట్టదలచడం ఎలాంటిదో, వాళ్ళను దయ అనేది అదుపులో పెట్టుతుందని ఆశించడం అలాంటిది. కనుక, అడియాసలు మాని, ఈ అవసాన సమయంలో, మీ పూర్వపాపాలన్నీ జ్ఞప్తికి దెచ్చుకొని పశ్చాత్తాపపడండి. ఈ రోజుతో మీ ఆయువు తీరిపోతుంది,'— అన్నాడు వాంబా.

'విన్నావా ఎథెల్‌స్టేన్? ఇక మనం మన మనస్సులను ఈ చరమయాత్రకు సిద్ధంచేసుకోడం మంచిది. బానిసలంగా బ్రతికిఉండడంకంటె మానవులంగా చచ్చిపోవడం మేలు'— అన్నాడు సెడ్రిక్.

'నేను సిద్ధంగానే ఉన్నాను. భోజనానికి ఎంత స్థిమిత చిత్తంతో వెడతానో అలాగే మృత్యుముఖానికి గూడ వెళ్ళగలను'—అన్నాడు ఎథెల్‌స్టేను.

'అయితే యిక నీ పని ప్రారంభించు బాబాజీ, మా మనస్సులను భగవత్సన్నిధానానికి చేర్చు'—అన్నాడు సెడ్రిక్.

వాంబా యిప్పుడు కంఠస్వరం మార్చి, తన మామూలు గొంతుకతో, 'కొంచెం ఆగండి బాబాయిగారూ! అంధకారంలోకి దూకేముందు కొంచెం పరకాయించండి'—అన్నాడు.

'ఎవరది! నేను విన్న గొంతుకలాగే ఉన్నదే!' అని సెడ్రిక్ తేరిపార జూచాడు.

వాంబా తన ఫాదరీముసుగు తొలగించివైచి, 'నేను దొరా, తమ బానిసను, తమ హాస్యగాణ్ణి వాంబాను. ఈ హాస్యగాడి సలహాయే గనుక తమరు వినివుంటే ఈ స్థితిలో తమరిప్పుడు ఉండేవారుకాదు. ఇప్పుడైనా వినండి. ఈ స్థితిలోంచి అచిరకాలంలో బయటపడతారు'—అని అర్థించాడు.

'అంటే? ఏమిటి నీ అభిప్రాయం?'—అని అడిగాడు సెడ్రిక్.

'ఈ ఫాదరీ దుస్తులు తమరు వేసుకొని మెల్లగా కోట బయటికి వెళ్ళిపొండి. తమ దుస్తులు నేను ధరించి తమ బదులుగా నిలబడతాను'—అన్నాడు వాంబా.

సెడ్రిక్ ఆశ్చర్యంతో అతనివంక చూచి, 'ఏమిటీ! నా బదులుగా నీవు బలికావూ! నిన్ను ఉరితీస్తారన్న సంగతి తెలుసునా?—అని ప్రశ్నించాడు.

'ఏమైనా చెయ్యనివ్వండి, తమ బానిసను, నాకది సంతోషమే'— అన్నాడు వాంబా.

'అయితే ఒక పనిచెయ్యి, నీ కోర్కె అంగీకరిస్తాను. నీ దుస్తులు ఎథెల్ స్టేను కిచ్చి అతని దుస్తులు నీవు తీసుకో,' అన్నాడు సెడ్రిక్.

'అహాం, తమరలా సెలవివ్వడం సబబుకాదు. మా తాతతండ్రుల నాటి నుంచీ సేవిస్తున్న తమరి కొరకు నేను చచ్చిపోవాలికాని, ఎవరికొరకో చచ్చిపోవడమేమిటి?'— అన్నాడు వాంబా.

'వెధవా! అదేమిటిరా అలా అంటావు? ఎథెల్ స్టేన్ పూర్వీకులు మన దేశాన్నేలిన ప్రభువులురా'— అన్నాడు సెడ్రిక్.

'ఏమైనా కానివ్వండి దొరా! నా తలకాయ వాళ్ళకోసం ఉరిత్రాటిలో బిగవడం నే నొప్పుకోను. నా దుస్తులు తమరు తీసుకొని వెడితే వెళ్ళండి. లేక పోతే, నా దారిని నన్ను తిరిగి పోనివ్వండి,'— అన్నాడు వాంబా.

'అలా కాదురా, ఈ ముసలివాడు ఉంటే నేం, లేకపోతే నేం? ఎథెల్ స్టేన్ సాక్సన్ జాతికంతకీ ఆశాజ్యోతి. అతనిని సేవించడం సాక్సన్ రక్తం శరీరంలో ప్రవహించే ప్రతివానికీ విధ్యుక్తధర్మం. నీవూ నేనూ ఇక్కడ ఉండిపోదాం, ఏమైతే అది అవుతుంది. ఎథెల్ స్టేన్ విముక్తుడైతే, సాక్సన్ జాతిని ఉద్రేక పరచి, ఎప్పటికైనా పగతీర్చుకోగలడు'— అన్నాడు సెడ్రిక్.

ఈ మాటలు ఎథెల్ స్టేనుకు కొంత ఉత్తేజం కలిగించాయి. ఉత్తేజం కలిగి నప్పుడు సామాన్యంగా అతని అభిజాత్యానికి తగిన ఉన్నతభావాలే అతనిలో పొటమరిస్తూ ఉంటాయి. సెడ్రిక్ తో ఇలా అన్నాడు: 'అలాకాదు సెడ్రిక్ దాదా, అలా కావడానికి వీలులేదు. ఖయిదీలకు కొలతగా ఇవ్వబడే రొట్టె ముక్కలు మాత్రమే తింటూ, పచ్చిమంచినీళ్ళే త్రాగుతూ, ఈ పాంలో ఇంకా కొన్నిరోజులున్నా నా కిష్టమేగాని, యజమానియెడల భక్తికొద్దీ అతని విడుదల కొరకు ఒక బానిస కల్పించే అవకాశాన్ని నా కొరకుగా వినియోగించుకో డానికి నే నంగీకరించను.'

ఇలా 'నీవు వెళ్ళమంటే నీవు వెళ్ళ'మని సెడ్రిక్ ఎథెల్ స్టేనులు ఘర్షణ పడడం ప్రారంభించే సరికి, వాంబాయే తుదకు వారి తగవు ఇలా పరిష్కరించి వేశాడు: 'ఎందుకు మీలో మీకు తగాదా? మీరు చాలా బుద్ధిమంతులూ,

నేను పట్టి వెంగలినై కావచ్చు. కాని యీ తగాదా వెంగలినైన నావలన తీరవలసిదే! నేను నా యజమానిని రక్షించుకోడానికి వచ్చాను. ఆయన అందుకు అంగీకరిస్తే సరేసరి. లేకపోతే వచ్చిన త్రోవనే వెళ్ళిపోతాను. నా సేవను మీరిద్దరూ బంతిగా చేసి ఆడేటట్లున్నారు. నా యజమాని కోసం తప్ప మరొకరికోసం నేను చావదలచుకోలేదు—చావను.'

అంతట ఎథిల్‌స్టేన్ సెడ్రిక్కును ఇలా అర్థించాడు: 'నామాట వినండి సెడ్రిక్ దాదా! మీరు వెళ్ళండి. ఈ అవకాశం జారవిడవకండి. మీరు బయట పడితే, మిమ్మల్ని బట్టి మా విడుదలకు ప్రయత్నించడానికి మన మిత్రులకు ఉత్సాహం కలుగుతుంది. మీరు ఇక్కడే ఉండిపోతే, తుదకు అందరికీ ప్రాణహాని కలగడం తప్ప మరి ప్రయోజన ముండదు. వెళ్ళండి.'

'బయటికి వెడితే, విముక్తిసాధనకు అవకాశాలు ఏమైనా ఉన్నవా?'— అని వాంబాను అడిగాడు సెడ్రిక్.

'ఉన్నవా అని నెమ్మదిగా అడుగుతారేమిటి? అయిదువందలమంది సిద్ధంగా ఉన్నారు కోట ముట్టడించడానికి. వారిలో మన గర్త్ కూడా ఉన్నాడు. వాణ్ణీ, వాడి కుక్కనూ మాత్రం దయతలచండి. తమరు వెళ్ళండి. రోథరువుడ్డులో తమ కచ్చేరీచావడిలో నా కోడిజుట్టుటోపీ, నా జ్ఞాపకార్థం వ్రేలాడగట్టించండి. మరచిపోకండి, స్వామిభక్తితో ప్రాణాలు బలిదానం చేసిన యీ ...యీ వెంగళిని!'

ఈ చివరిమాట అంటూంటే వాంబా ముఖంలో హాస్యమూ భక్తీ రెండూ కూడ పెనవేసుకొన్న ఒక విచిత్ర భావసన్నివేశం ద్యోతకమయింది. సెడ్రిక్ కనుల్లో నీళ్లు గిర్రున తిరిగాయి.

'స్వామిభక్తి అనేదానికి ఈ ప్రపంచంలో గౌరవం ఉన్నంతకాలమూ, నీ పేరు ఎవ్వరూ మరచిపోలేరు. రొవేనానూ, ఎథిల్‌స్టేనునూ, నిన్నూ దక్కించుకునే ఉపాయం నాకు లభిస్తుందని ఆశిస్తున్నాను. ఇక తడవు చేయకూడదు' అంటూ సెడ్రిక్ తొందరతొందరగా దుస్తులు మార్చుకున్నాడు. ఇక్కడ ఒక సందేహం కలిగిందతనికి— దుస్తులు మార్చుకున్నా క్రైస్తవ ఫాదరీగా అభినయించడం యెలాగా అని. కనిపించినవారికెల్లా ఫలాని రకంగా లాటిన్ భాషలో ఆశీర్వదించుకుంటూపోతే ఎక్కడికిపోయినా అదిమంత్రంలాగ పనిచేస్తుందని వాంబా అతనికి బోధించాడు. సరేనని సెడ్రిక్ ఆ మాటలు వల్లెవేసుకొని బయలుదేరుతూ వాంబా ఎథిల్‌స్టేనులతో ఇలా అన్నాడు: 'ఇక నేను పోయివస్తాను. మిమ్మల్ని రక్షించడానికి సాయశక్తులా ప్రయత్నిస్తాను. రక్షించలేకపోతే మీతోకలిసి [illegible]గా చనిపోడానికి ఇక్కడికే తిరిగివస్తాను. నా శరీరంలో రక్తం

ఉండగా, నా సాగ్జన్ పూర్వీకుల రక్తం నేలపై చిందనివ్వను. అలాగే, నా ప్రాణం ఒడ్డియైనా, స్వామిభక్తిపరాయణుడైన నా యజమానిని అపాయం నుండి తప్పించుకుంటాను. ఇక కాలక్షేపం చేయకూడదు. వెళ్లివస్తాను.'

'మంచిది వెళ్ళిరండి. ఎవరైనా ఏమైనా ఆరగించమంటే మాత్రం వద్దనబోకండి. పెట్టినదల్లా ఆరగించడం ఫాదరీల విధ్యుక్తధర్మం' అని హెచ్చరించాడు ఎథెల్‌స్టేన్. 'వెళ్లిరండి, ఆశీర్వచనం ఏ విధంగా చెయ్యాలో నేను చెప్పినది మరచిపోకండి'— అని జ్ఞాపకం చేశాడు వాంబా.

సెడ్రిక్ బయలుదేరి, ఫ్రాంట్ డీబాఫ్ ప్రభృతులున్న కచేరీచావడి చేరుకోడంకోసం, మసకచీకటిగా ఉన్న ఒక నడవాగుండా తోవ వెతుక్కుంటూ వస్తూవుండగా, ఒక స్త్రీవ్యక్తి అతని కడ్డుతగిలి ఏమో చెప్పబోయింది. వాంబా చెప్పిన ఆశీర్వచన మంత్రం ప్రయోగించి ఆమెను తొందరగా తప్పించుకొని పోజూచాడుగాని, ఆమె వదిలిపెట్టలేదు. లాటిన్ భాషలో ఏదో అన్నది. సెడ్రిక్‌కు లాటిన్ భాష రాదు. 'నాకు చెముడు, నన్ను వెళ్లనీ, తొందరగా పోవా'లని అచ్చమైన సాగ్జభాషలో అన్నాడు. లాటిన్ భాష రాని ఫాదరీలు ఆ భాషలో ప్రసంగం వచ్చినప్పుడెల్ల సామాన్యంగా తమకు చెముడు ఉన్నట్లు నటిస్తూ ఉంటారని తెలిసిన ఆ స్త్రీ, తిరిగి స్వచ్ఛమైన సాగ్జన్ భాషలో, 'బాబాజీ, ఒక చిన్న మనవి ఆలకించండి. ఈ కోటలో ఒక ఖయిదీ గాయపడి చాల దీనస్థితిలో ఉన్నాడు. కనికరించి మీరతని చేరవకు విచ్చేసి, మీ బోధామృతంతో ఆతనికి మనశ్శాంతి కలుగజేయ్యండి. పరోపకారం మీ ఆశ్రమధర్మం'— అని ప్రాధేయపడింది.

సెడ్రిక్‌కు కలిగిన కళవళపాటు ఇంతా అంతా కాదు. 'వ్యవధి లేదమ్మాయీ! నేను చాల తొందరగా పోవలసిఉంది. ఆలస్యమైతే ప్రాణాలకు ముప్పురావచ్చు'— అని చెప్పి తప్పించుకొనబోజూచాడు.

'ఆపన్నులను ఆదరించకుండా వదలిపోరాదనే వ్రతనిష్ఠ ఉన్న మహానుభావులు మీరు. ఏలాగైనా కొంచెం వ్యవధి కలగజేసుకోండి'— అని ప్రార్థించింది తిరిగి ఆ స్త్రీవ్యక్తి.

సెడ్రిక్కుకు ఇక సహనం తప్పిపోయింది. తాను ఫాదరీగా నటిస్తున్న సంగతే మరచిపోయి, చికాకుతో తన్ను తాను తిట్టుకోడం మొదలుపెట్టాడు. అదృష్టవశాత్తూ, ఆ ధోరణి మితిమీరక ముందే, వృద్ధనారి ఉర్‌ఫ్రీడ్ కంఠధ్వని పరుషంగా వెనుకనుండి వినిపించి వారి ప్రసంగానికి అంతరాయం కల్పించింది.

'ఆసి ఛడవా! పోనీలే పాపమని నీ గదిలో నిన్ను తాళం పెట్టకుండా బయటికి రానిచ్చినందుకు, ఇదా నీవు చేయవలసినపని? యూదుపడుచుకైనం

దుష్టు, నీ బుద్ధిపోనిచ్చావు కాదు. నిన్ను వదిలించుకోడానికి పాపమా ఫాదరీ రొట్టి దురుసుమాటలు మాట్లాడవలని వచ్చిందో చూచావా?' అని అదలించిందామె ఆ స్త్రీవ్యక్తిని.

తప్పించుకొని పోవడానికి ఇదొక మంచి అవకాశమిచ్చినట్లుకాగా, సెడ్రిక్ మరింత హంగామా చేస్తూ, 'నాదారి కడ్డంరాకు, నన్ను పోనీ! మీ జాతివాళ్ల గాలి సోకితే మేము మైలపడతాం. నన్ను అనవసరంగా రెచ్చగొట్టావంటే, నీ మర్యాద దక్కదు జాగ్రత్త!'— అని ఆ స్త్రీవ్యక్తిని బెదరించి ముందుకు పోజూచాడు.

'రండి బాబాజీ, నాతో రండి! మీకు త్రోవ చూపుతాను. మీయంతట మీరీ కోటలో దారి తెలుసుకోడం కష్టం. ఇలారండి, మీతో మాట్లాడాలి. ఇంకా నిలబడ్డావేమే! పో! వెళ్లి ఆ గాయపడ్డవానికి పరిచర్య చేస్తూవుండు. నే నిప్పుడే వస్తాను. నా అనుమతి లేకుండా గనుక నీ వా గది వీడివచ్చావంటే, చూచుకో ఏం చేస్తానో!' అని ఉరిమింది ఉర్‌ఫ్రీడ్.

రెబెకా మారుమాటాడకుండా అటనుండి వెడలిపోయింది. ఆమెను ఐవాన్‌హోకు పరిచర్యచేయ నియోగించినది ఉర్‌ఫ్రీడ్. తాను మనస్సులో ఏ పని చెయ్యాలని కోరుకుందో ఆ పనికే ఆమెను ఉర్‌ఫ్రీడ్ నియోగించడం జరిగింది. భగవన్నామోచ్చారణ యొన్నడూ చెవులబడని యీ కోటలోకి నేటికి ఒక భగవద్భక్తుడు ప్రవేశించాడన్నవార్త ఆమె ఉర్‌ఫ్రీడ్‌వల్లనే విన్నది. అతనిని కలుసుకొని మాట్లాడితే, తాము ప్రస్తుతమున్న ఆపదలోంచి తప్పించుకునే ఉపాయమేదైన లభిస్తుందేమోనని ఆమె ఆశ. ఆ ఉద్దేశ్యంతోనే దారి కాచి, అతనితో పరిచయంకల్పించుకొని ఖయిదీల పరిస్థితి అతనికి విన్నవించాలనుకుంది. కాని, ఆమె ప్రయత్నం సరిగా సాగిరాలేదు.

# అధ్యాయం ౨౭

రెబెకాను ఆవిధంగా ఆదరించి బెదరించి సాగనంపివేసిన తర్వాత, ఉర్‌ఫ్రీడ్ నెమ్మదిగా సెడ్రిక్కును, అతని కిష్టం లేకుండానే ఒక చిన్న గది లోనికి తీసుకొనిపోయి తలుపు జాగ్రత్తగా లోపల గడియ వేసింది. పిమ్మట ఒక అలమారలోంచి ద్రాక్షాసవ పూర్ణములైన రెండు గాజు బుడ్లను వెలికితీసి మేజాబల్లపై ఉంచుతూ, ఈరీతిగా ప్రసంగం ప్రారంభించింది :

'బాబాజీ, నీవు సాగ్జన్ జాతీయుడవు కాదూ? అవును, సాగ్జన్ జాతీయుడవే నాకు తెలుసు. కాదని బుకాయిస్తే నేనొప్పుకోను. నా మాతృభాష కూడ సాగ్జనే. సాగ్జన్ భాష నా చెవులకు ఎంతో తియ్యగా వినిపిస్తూ ఉంటుంది. నార్మన్ ధూర్తుల యాజమాన్యంలో ఉన్న ఈ కోటలో, నీచాతి నీచమైన పనులు చేసేవారి నోటివెంట తప్ప, సామాన్యంగా మరెవ్వరి నోటా ఈభాష వినిపించనే వినిపించదు కదా! ఆహా, నీవు సాగ్జన్ మాట్లాడుతుంటే ఎంత మధురంగా ఉంది! నీవు నిజంగా సాగ్జన్ జాతీయుడవే,—సందేహం లేదు.'

సెడ్రిక్ ఇక మౌనంగా ఉండడానికి వీలులేక, 'అయితే ఈ కోటలోకి ఎన్నడూ సాగ్జన్ ఫాదరీలు రానేరారా? రావలసినదే సే! వచ్చి ఇచ్చట నికృష్ట జీవనం గడిపే సాగ్జన్ జాతీయులకు ధర్మబోధ చేసి మనశ్శాంతి కల్పించవలసిన బాధ్యత వారికున్నది'—అని సమాధానం చెప్పాడు.

'రారు,—ఎవ్వరూ రారు. ఒకవేళ వచ్చినా, నార్మన్ ప్రభువుల పంక్తిని చేరి విందులు కుడవడమే వారికి ప్రధానంగాని, స్వజాతీయుల గోడు వినిపించుకొని ఆదరించే ఉత్సాహం వారికుండదు. పది సంవత్సరాలనుంచీ చూస్తున్నాను. ఈ కోటలో ఒక్క ఫాదరీకి కూడ ఆతిథ్యమివ్వడం జరగలేదు. త్రాగుబోతూ తిరుగుబోతూ అయిన ఒక నార్మన్ పురోహితుడు మాత్రం, వెనుక ఒకప్పుడు, ఫ్రాంట్‌డీబాఫ్ చేసే జలసాల్లో పాల్గొనడానికి వస్తూ ఉండేవాడు. దేవుని ఎదుట సంజాయిషీ చెప్పుకోడానికి సమన్లువచ్చి, ఏనాడో అతడు ఈ లోకం నుంచి నిష్క్రమించాడు. ఈనాటికి నీ సందర్శనం లభించడం ఆనందంగా ఉంది. అందులోనూ, నీవు సాగ్జన్ ఫాదరీవి కావడం మరింత ఆనందప్రదం—నిన్ను ఒక చిన్న ప్రశ్న అడుగుతాను, దయచేసి సమాధానం చెప్పాలి'—అంటూ ఉర్‌ఫ్రీడ్ ఏదో అడగబోయింది.

సంభాషణ పెరిగినకొద్దీ తాను చిక్కుల్లో పడవలసివస్తుందన్న భయంతో సెడ్రిక్ అక్కడితోనైనా ప్రసంగం త్రుంచివెయ్యదలచి, 'అవును నేను సాగ్జన్‌నే. కాని ఫాదరీ హోదాకు తగినవాణ్ణిమాత్రం కాను. నన్నిప్పుడు

త్వరగా వెళ్లనీ. సావకాశంగా మళ్లీ వస్తాను. లేదా నాకంటె యోగ్యుడైన ఫాదరీని పంపిస్తాను. ఇప్పటికి నన్ను వెళ్లనీ' అని తప్పించుకొని పోజూచాడు.

'వద్దు, అప్పుడే పోవద్దు. ఒక్క క్షణం ఆగు—నీ విప్పుడు వినే యీ గొంతుక ఇక కొద్దికాలానికే అంతరించిపోతుంది. ఈ పాపిష్ఠి జీవికి యిక యీ భూమిమీద బ్రతికే రోజులైపోయాయి. ఉండు, కొంత మధువు సేవించనీ! మధుసేవనపు నిషా ఉంటే తప్ప నా ఘోరవిషాద గాథ నీకు నేను వినిపించలేను'—అంటూ ఆమె ఒక పాత్రనిండా మధువునింపి, ఒక్క గుక్కలో త్రాగివైచి, 'నీవు కూడా కొంత పుచ్చుకో బాబాజీ, లేకపోతే నా భయంకర గాథను విని తట్టుకోలేవు, నిట్టనిలువునా కూలిపోతావు'—అని సన్న చేసింది. ఆ హెచ్చరికలో, ఏదో చెప్పనలవికాని వ్యథ, చిరాకు కనిపించాయి. ఆమె కోరినట్లుగా తాను కూడ పుచ్చుకోకపోతే ఆమె తృప్తిపడేటట్లులేదు. అందుచే తప్పనిసరిగా సెడ్రిక్ తాను కూడ ఒక మధుపాత్రను నింపి ఖాళీచేసి, యిక కానిమ్మన్నట్లు ఆమెవంక చూచాడు. ఆమె ఇలా ప్రారంభించింది!

'చూడు, బాబాజీ! ఇప్పుడు నేనొక నికృష్టజీవినన్నమాట నిజమే. కాని, నికృష్టస్థితి పుట్టినప్పటినుంచీ ఉన్నది కాదు. పుట్టినప్పుడు నేను ఎంతో ఉన్నతస్థితిలో ఉన్నదానినే! స్వేచ్ఛా వాతావరణంలో, ఎంతో ఆనందంగా పెరిగాను. ఎల్లరిచేతా గౌరవించబడ్డాను. ఎంతో ముద్దు మురిపెము లనుభవించాను. అప్పటికీ ఇప్పటికీ ఎంత వ్యత్యాసం! ఇప్పుడు నేనొక బానిసను! నీచాతినీచంగా చూడబడుతున్న నిర్భాగ్యురాలను! యౌవనం, అంద చందాలూ ఉన్న కాలంలో, నా యజమానుల ప్రీతిలో క్రీడా వస్తువును. ఆ యౌవనం జారిపోయిన తర్వాత, వారి దృష్టిలో నేనొక హేయ వస్తువునైపోయాను. ఎక్కడలేని ద్వేషమూ, ఏవగింపూ కలిగింది నేనంటే వారికి. ఇట్టి పరిస్థితిలో, మానవజాతిమీదనే నాకు ద్వేషం కలగడంలో వింత యేముంది బాబాజీ! ముఖ్యంగా, నాయీదురవస్థకు కారణభూతమైన నార్మన్ జాతిమీద నాకున్న కసి ఇంతా అంతా కాదు. కాని, యేమి చేసేది? తిట్టడానికి నోరున్నది కనుక తిట్లూ, శాపనార్థాలూ పెట్టడం తప్ప ఇంకేమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాను. అయితే, ఎంత చెడినప్పటికీ, ఒకప్పుడు నేనొక ఉత్తమ వంశ సంజాతనని,—చండశాసనుడైన టార్క్విల్‌స్టన్ దుర్గాధిపతి కుమార్తెనని,—ఈజీవితంలో ఎలా మరచిపోగలను?'

సెడ్రిక్ ఈమాటకు చకితుడై, ఒక అడుగు వెనుకకు వేసి,—'ఆఁ! ఏమిటీ! టార్క్విల్‌స్టన్ అధినేత ఉల్ఫ్‌గాంగర్ కుమార్తెవా నీవు? మా నాన్నగారికి ఆప్తమిత్రుడైన ఉల్ఫ్‌గాంగర్ కన్నబిడ్డవే? ఉల్రికా కాదూ నీపేరు?'—అని చప్పున అడిగాడు.

ఉల్ఫ్రీడ్ కొంచెం నిదానంగా అతనివంక చూచి,—'ఏమిటీ! మీ నాన్నగారికి ఆప్తమిత్రుడా మా నాన్నగారు? అయితే నీవు, క్రోధరువృద్ధు హెరివార్డు కుమారుడవైన సెడ్రిక్కువు కావుగద! హెరివార్డుకు ఒక్కడే కుమారుడు నాకు తెలుసు. నీవేగనుక సెడ్రిక్కువైతే, ఈ ఫాదరీ వేషమేమిటి? నీ మాతృభూమిని నార్మన్ల చేతినుంచి రక్షించడం ఇక దుస్సాధ్యంగా తోచి, వీరి బాధలలోంచి తప్పుకోగోరి యీ ఆశ్రమం స్వీకరించావా యేమిటి?'— అని అడిగింది.

'నేనెవరైతే నీకెందుకు గాని, నీవు వివరించదలచుకొన్న నీ భయంకర గాథ సాగనీ! నీవేదో మహాదోషం చేసినట్లున్నావు. ఆదోషం ఇలా చెప్పుకో. దానికి బ్రతికి ఉండడంకూడా ఒక మహాదోషమే నేమో!'—అని సమాధానమిచ్చాడు సెడ్రిక్.

'అవును, మహాదోషమే చేశాను ఒక పర్వతమంత బరువుతో అది నా హృదయాన్ని కృంగదీస్తోంది. ఎలాంటి పశ్చాత్తాపాగ్నులు గూడ ఈ మహాదోషాన్ని శుద్ధిచెయ్యలేవు. అవధిలేని మహాపాపం నాది. నా తండ్రినీ నా సోదరులనూ పొట్టను పెట్టుకొన్న దుర్మార్గునికి ఉంపుడుగత్తెనై, వారి పవిత్ర రక్తం ప్రవహించిన యీ గదులలోనే, దానిస్సబతుకు బ్రతుకుతూ కాలక్షేపం చేసిన మహాదోషానికి నిష్కృతి ఉండడం అసంభవం! నేను ఏనాడో చచ్చిపోయి ఉండవలసింది. చావక బ్రతికాను. నేను పీల్చే ప్రతిశ్వాసతోనూ నా పాపం పెరుగుతూనే ఉంది'— అని విహ్వలించింది ఉల్ఫ్రీడ్.

సెడ్రిక్ ఇక ఉండబట్టలేక ఇలా అన్నాడు: 'ఓసి నిర్భాగ్యురాలా! ఎంత పనిచేశావు! నీ తండ్రితోపాటూ సోదరులతోపాటూ నీవుకూడా హత్యచేయబడ్డావనుకున్నాం మేమందరమూ అప్పుడు. దేశంలోని ప్రతిసాక్సన్ హృదయమూ మీ దుర్మరణ వార్త విని క్షోభించిపోయింది. మీ అందరి ఆత్మలకూ శాంతిని ప్రసాదించవలసిందిగా భగవంతుని వేడుకుంటూ ఎల్లెడల ప్రార్థనలు జరిగాయి. మృతులైనవారికి ఎల్లరూ ఇలా జోహారు అర్పిస్తున్న సమయంలో, నీవు చేసినదేమిటి? నీ ఆత్మబంధువు లెల్లరినీ ఊచకోతలు కోసిన ఆదుర్మార్గుని చేపట్టి, విశృంఖల ప్రేమవిహారాలతో కాలక్షేపం చేశావు,—అంతేనా?'

'అది విశృంఖల విహార మన్నమాట నిజమేకాని, ప్రేమ మట్టుకు కాదు. ఈ నరకకూపంలో ప్రేమ అనేది చొరబడడానికే వీలులేదు. నేను ఏపాపమైనా చేశానుగాని, దుర్మార్గుడైన ఆ ఫ్రాంట్ డీబాఫ్‌ను ప్రేమించిన పాపం మట్టుకు చెయ్యలేదని గుండెమీద చెయ్యివేసి చెప్పగలను. లేదు,—ఫ్రాంట్ డీబాఫ్‌మీద నాకు ద్వేషమేకాని ప్రేమలేదు. అతడు నన్ను బుజ్జగించి లాలిస్తున్న వేళల్లో కూడా, అతని యెడ నా అంతరాంతరాల్లో ఉన్నది అచ్చమైన ద్వేషం తప్ప మరి యొకటి కాదు—'అన్నది ఉల్ఫ్రీడ్.

'చాల విపరీతంగా ఉన్నది నీవు చెప్పింది. ఫ్రాంట్ డీబాఫ్‌ను ద్వేషిస్తూనూ ఉన్నావు, చావకుండా బ్రతికీ ఉన్నావు. ఎందుకీ హేయపు బ్రతుకు బ్రతకడం? చావాలంటే ఏ కత్తో కటారో దొరకకనే పోయిందా? లేదు, అటువంటి నీచజీవితం నీకిష్టమైనది కాబట్టే ఇలా బ్రతకగలిగావు. మా ఉల్ఫ్‌గాంగర్ కుమార్తె ఇంకా బ్రతికివుండి తన తండ్రిని చంపిన హంతకునితో కూడి సుఖా లనుభవిస్తున్నదని కలలోనైన నాకు తెలిసివుంటే, నీ ప్రియుని కౌగిటిలో నీవు దాక్కొన్నప్పటికీ ఏనాడో నా కత్తికి బలియైపోయి ఉండేదానవు'—అని ఉద్రేకం ప్రకటించాడు సెడ్రిక్.

'ఆపని నిజంగా నీవు చేసివుంటే ఎంత బాగుండేది! నీ పేరుప్రతిష్ఠలకు తగిన పని చేశా వనిపించుకునేవాడవు. అవును, నీ పేరుప్రతిష్ఠలు నాకు తెలుసు. రెండవ కంటివానికి తెలియరాని ఘోరపాపాలెన్నో జరుగుతూ ఉండే ఈ కోటగోడల మధ్యకూడా నీ పేరు నాకు తరచుగా వినిపిస్తూనే ఉండేది. ఎంత పతితనై పోయినప్పటికీ, మన సాగ్జన్ జాతి పక్షమున శత్రువులపై పగ సాధింప సమర్థుడైన వ్యక్తి యొకడు జీవించి ఉన్నందుకు లోలోపల ఎంతో సంతోషిస్తూ ఉండేదాన్ని. పగ సాధించే అవకాశాలు నాకు కూడా లభించాయి. మన శత్రువులమధ్య కలహాలు పెంచాను. ఒళ్ళు తెలియని జలపాలు హత్యాకాండలలోకి పర్యవసింప జేస్తూ వచ్చాను. శత్రువుల రక్తం వరదలై ప్రవహించగా కనులార చూచాను. వారి మరణవేదనలను చెవులార విన్నాను. చూడు సెడ్రిక్, ఈనా రూపురేఖల్లో మా నాన్నగారి పోలికలు ఇప్పటికీ నీకు కనిపించడంలేదా?'—అని అడిగింది ఉల్రికా. ఉర్‌ఫ్రీడ్ అన్న మారుపేరు వదలి, ఇకనుంచి ఆమెను అసలు పేరుతోనే పిలుద్దాము.

'పోలికల సంగతి నన్ను అడగబోకు ఉల్రికా! పోలికలుంటే ఉండవచ్చు. కాని అవి, చచ్చిపోయిన శవాలు లేచి తిరిగితే ఉండే పోలికల్లాగా ఉన్నాయి, వట్టి పిశాచపు పోలికలు'—అన్నాడు సెడ్రిక్, దుఃఖసమ్మిశ్రితమైన జుగుప్సతో.

'కావచ్చు. కాని, ఈ పిశాచపు పోలికలే, ఒకవిధమైన వెలుగు ముసుగు వేసుకొని, పెద్ద ఫ్రాంట్ డీబాఫ్‌కూ చిన్న ఫ్రాంట్ డీబాఫ్‌కూ మధ్య—తండ్రీకొడుకులకీ మధ్య—స్పర్థ రేకెత్తించి పరస్పరం విద్వేషింపజేశాయి. తరువాత ఏమి జరిగింది? ఏమి జరిగిందో అది నరకకూపపు చీకటిముసుగులో దాగిఉండవలసినదే! అయినప్పటికీ దానిని వెల్లడిస్తేగాని నా పగకు తృప్తిలేదు. తండ్రికొడుకుల మధ్య రాజుకున్న యీ విద్వేషాగ్నిని రహస్యంగా నేను ఇంధనాలు వేసి పోషించాను. చివరకి విద్వేషం మధుపానపు మదోన్మత్తత ప్రకోపించివున్న ఒక సమయంలో భగ్గుమన్నది. విందు కుడుస్తూ కుడుస్తూ పెద్ద ఫ్రాంట్ డీబాఫ్ తన

కొడుకు చేతుల్లోనే హతమారిపోయాడు. ఇలాంటి ఘోరపాపాలు ఈ కోట గోడలమధ్య ఎన్ని జరిగాయో! ఈ కోట యావత్తూ ఒక్కసారిగా కుప్పకూలి, ఈ భయానక చరిత్రకు పాత్రులైనవారి నందరినీ శాశ్వతంగా పూడ్చివేస్తే ఎంతో బాగుండును!'—అన్నది ఉల్రికా.

ఆమెమీద సెడ్రిక్కుకు జాలీ, ఏవగింపూ రెండూకూడ ఒక్కసారిగా కలిగాయి. 'పెద్ద ఫ్రాంట్ డిబాఫ్ మరణానంతరం ఏమయింది నీ పరిస్థితి?'—అని ప్రశ్నించాడు.

'ఏమయిందని అడగడ మెందుకు? ఊహిస్తే తెలియడంలేదా? ఆకాల వృద్ధాప్యం వచ్చి నా ఆకార రేఖలపై పైశాచికపు ముద్ర వేసే పర్యంతమూ ఇక్కడనే ఉండిపోయాను. ఎల్లరూ నాకు విధేయులై మెలగిన చోటనే, అసహ్యించుకోబడి అవమానాల పాలయ్యాను. నా పగ తీర్చుకోడానికి ఇది వరకు అవకాశాలు చాల లభిస్తూ ఉండేవి. ఇప్పుడు చేతకానితనం కొద్దీ తిట్లూ శాపనార్థాలూ పెట్టడం తప్ప ఇంకేమీ చెయ్యలేని స్థితిలో ఉండిపోయాను. కోటలో జరిగే జలసాల కోలాహలం చెవిని బడుతూ ఉండగా, విసరి వేసినట్లు ఎక్కడో చిటారు అంతస్తులో ఒంటరిగా కాలక్షేపం చెయ్యవలసివచ్చింది. ఫ్రాంట్ డిబాఫ్ దౌష్ట్యానికి బలియౌతూవచ్చిన క్రొత్త క్రొత్త ఆపన్నుల ఆక్రందనధ్వనులు సైతం అక్కడినుంచే వింటూవచ్చాను'— అన్నది ఉల్రికా.

'నీ ధోరణి చూడగా, పాపాలు చేసినందుకు విచారపడడమేకాక, ఏ ఫలితం కోరి యీ పాపాలు చేశావో అది చేజారిపోయినందుకు గూడా విచారపడుతున్నట్లుగా ఉన్నావు. ఇలాంటిదానవు ఈ ఫాదరీ దుస్తుల్లో ఉన్నవానిని ఏ ధైర్యంతో పలుకరించగలిగావో అర్థం కావడంలేదు. నిర్భాగ్యురాలా! నిన్ను ఉద్ధరించడం ఎవరికి శక్యమౌతుంది? సాక్షాత్తూ భగవంతునివలన కావలసినదే ఆ పని! ఇక నేను వెడతాను,—' అన్నాడు సెడ్రిక్.

'వద్దు! అప్పుడే వెళ్ళిపోవద్దు. కనికరించి ఒకసంగతి చెప్పు. ఏకాంతంలో నన్ను బాధిస్తున్న యీ విపరీత భావాల కన్నిటికీ పర్యవసాన మేమిటి? ఏనాడో జరిగిపోయిన సంఘటనలు అనివార్యంగా నాలో ఏవేవో క్రొత్త క్రొత్త భయానక దృశ్యాలను తాండవింపజేస్తున్న దెందుచేత? ఇంత నికృష్టపు బ్రతుకు బ్రతికిన మహాపాపికి మరణానంతరం ఏమి గతిపట్టుతుంది? జాగ్రదవస్థలోనూ స్వప్నావస్థలోనూకూడ నన్ను వెంటాడుతున్న యీ భయంకర భావాల ధాటికి తట్టుకోలేకుండా ఉన్నాను. దయవుంచి నా కేదైనా గతి చూపించు—' అని ప్రాధేయపడింది ఉల్రికా.

సెడ్రిక్ జుగుప్సతో ఆమెకు దూరంగా తొలగుతూ,—'గతి చూపించడం నావల్ల ఏమవుతుంది? నేను ఫాదరీనికాను, నీకు దారి చూపించడానికి; దుస్తులు మాత్రం ఫాదరీవి'—అని జావ్రిచ్చాడు.

'ఫాదరీవికా, కాకపో! కడచిన ఇరవైయేండ్లలోనూ దైవభీతి మానవత్వమూగల ఉత్తమ వ్యక్తిని చూడడం నాకిదే మొదటిసారి. నిరాశతో కుమిలి పోవడమే నాకిక గతియనియా నీ యభిప్రాయంకి?' అని ఆక్రందించిందామె.

'పశ్చాత్తాపమే నీకిక శరణ్యం ఉల్రికా! తపించి తపించి భగవంతుని శరణు వేడుకో. అతడే నిన్ను అనుగ్రహించగలడు. నేనిక యిక్కడ ఉండడానికి వీలులేదు. వెళ్ళిపోవాలి' అని బయలుదేరాడు సెడ్రిక్.

'ఇంకొక్క నిమిషం ఆగు. దయమాలిన తిరస్కారభావంతో గనుక నన్ను నీవిపుడు విడనాడిపోతే, నా పాపిష్ఠి మనస్సు నీమీద కూడ పగబట్టుతుందేమోనని భయంగా ఉంది. సాగ్జన్ ప్రముఖుడు సెడ్రిక్ ఇలా మారువేషంతో తన కోటలో ప్రవేశించాడని ఫ్రాంట్ డీబాఫ్‌కు తెలిస్తే ఏమవుతుందో తెలుసునా? డేగ పావురాయిమీద కన్ను వేసినట్లు నీమీద ఇదివరకే కన్నువేశాడతడు'—అన్నది ఉల్రికా.

సెడ్రిక్ నిర్లక్ష్యంగా ఇలా సమాధానం చెప్పాడు: 'కన్ను వెయ్యడమే కాదు నన్ను నిట్టనిలువున చీల్చివేసినా అభ్యంతరమేమీ లేదు. ఏమిచేసినా, నా మనసును మభ్యపరచే మాటలు ఈ నోటివెంట పలికించడం మాత్రం వాని తరంకాదు. మనసులో భావించినదే నోటితో ఉచ్చరిస్తూ, నోటితో ఉచ్చరించినదే చేతితో చేస్తూ, ఈ సెడ్రిక్ అచ్చమైన సాగ్జన్ వీరునివలె మృత్యువునైనా ఎదుర్కోగలడు. లే, ఇక నాదారికడ్డంలే! నన్ను తాకబోకు, దూరంగా ఉండు నీవంక చూడడంకూడా నాకిక దుర్భరంగా ఉంది. ఫ్రాంట్ డీబాఫే నీకంటె నయం!'

ఉల్రికా ఇక అతనికి అడ్డంరాదలచలేదు. పక్కకు తొలగి నిలబడి ఇలా అంది: 'సరేలే వెళ్ళు. ఈ పతితురాలిని ఏవగించుకోవడమే నీ ఆధిక్యతకు లక్షణమైతే అలాగే కానీ! నేను మీ నాన్నగారి ఆప్తమిత్రుని కుమార్తె నన్న సంగతి ఇక యెన్నడూ తలపునకు రానీయకు. వెళ్ళిపో! నా దౌర్భాగ్య జీవితం నన్ను మానవజాతికి దూరం చేసివేసింది. ఎవరి ఆసరా నాకు లభించగలదని ఆశపడ్డానో వారికికూడా దూరమే అయిపోయాను. అలాగే కానీ! పగసాధించుకోడమే ఇక నాకు శరణ్యం. నన్ను ఉద్ధరించడానికి ఇక ఎవ్వరూ చేయి అందీయవలసిన పనిలేదు. కాని, నేనిప్పుడు చేయబోతున్న పనిని గురించి మానవజాతి సకలమూ చకితమై ఆలకించగలదని మాత్రం నిశ్చయంగా చెప్పగలను. ఇక సెలవు తీసుకుంటున్నాను. నాకూ నా సాగ్జన్ జాతికీ ఇంకా ఏదో అనుబంధం ఉన్నదని,—నాదుఃఖగాథ విని నాజాతీయులు సానుభూతి నాయెడ చూపగలరని,—ఇంతకాలం అనుకొనే దాన్ని. నీ ఏవగింపుతో ఆ అనుబంధం పూర్తిగా తెగిపోయింది.

సెడ్రిక్ మనస్సు ఈ మాటలకు కొంచెం మెత్తబడింది. 'ఉల్రికా, ఎందుకు నీకీ నిరాశ? ఎంత పాపానికో ఒడిగట్టి, ఎన్ని బాధలనో ఓర్చుకుంటూ, ఇంతకాలమూ బ్రతుకగలిగావు. చేసిన పాపాలు స్పష్టంగా మా మతంలో కలుగుతున్నా విశ్వాసం. పశ్చాత్తాపమే పతితుడు తరించే తరణోపాయం. అంతే నేకాని, ఈ కష్టాలన్నీ గడచి బ్రతికినది ఇప్పుడు నిరాశకు లోనైపోవడానికా?' అని ఓదార్చజూశాడు.

'మానవహృదయం నీవు సరిగా అర్థం చేసుకోలేవు సెడ్రిక్. తీవ్రమైన ప్రతీకార వాంఛతో పాటు తీవ్రమైన భోగలాలసత్వం కూడా తప్ప, ఎవ్వరూ నాలాగ ప్రవర్తించడం జరగదు. అధికారం చెలాయించగల పరిస్థితి కూడా ఇందుకు తోడు కావాలి. గుండె యిక తట్టుకోలేనంతగా మత్తెక్కేటట్టు మద్యం సేవిస్తూ ఉండాలి. కాని, అంతఃకరణంలోనూ నిలకరించుకునే శక్తిని కోల్పోరాదు. కాని, అదంతా ఏనాటి సంగతో! ఇప్పుడా శక్తులన్నీ ఉడిగిపోయాయి. ఇప్పుడా పశువుదనమూ లేదు, ఆ భోగాలూ లేవు. ముఖంమీద ముడతలు వశీకరణ శక్తిని హరించివేశాయి— ప్రతీకార వాంఛ కూడా కుప్పించి, చేతకానితనంతో తిట్లకూ శాపనార్థాలకూ దిగింది— ఇలాంటి పరిస్థితుల్లో జరిగేదేమిటి? అయ్యో, ఇలాంటి గతి పట్టించేదని బాధ బయలుదేరుతుంది. గతించినదానిని గూర్చి వృధాచింతలు కలుగుతాయి. జీవితమిక యింతే కాబోలునన్న నిరాశ పైకొంటుంది. తీవ్ర ప్రవృత్తులన్నీ ఉడిగిపోయిన యీ పరిస్థితిలో, మేము పట్టిపిశాచముల వంటిది, చేసిన పాపాలకు శోక చింతపడడమే కాని, పశ్చాత్తాపం చెందడం జరగదు. కాని నీ మాటలిప్పుడు నాలో ఒక నూతనోత్తేజం కలిగించాయి. చావడానికి ధైర్యం ఉన్నవాళ్లకు ఎంతటి పనైనా సాధ్యమేనని నీవన్నది నాకు బాగా నచ్చింది. పగ తీర్చుకోవడానికి నాకొక దారి చూపించావు. తప్పక ప్రతీకారం చేసితీరాను. ఇంతకాలం ఈ నీరస హృదయంలో యితర ప్రవృత్తులకు కూడ చోటు ఉంటూ ఉండేది. యికమీదట ఒకటే ప్రవృత్తి — పగ సాధించాలనే తీవ్ర ప్రకోపానికి తప్ప మరిదేనికీ ఈ హృదయంలో స్థానం లేదు. ఉల్రికా ఎలాంటి బ్రతుకు బ్రతికినప్పటికీ, చావడంమాత్రం టార్క్విల్ సామంతుని బిడ్డ అనిపించుకొనేటట్లుగా చచ్చిందని నీ చేతనే అనిపిస్తాను. వెళ్లు. కోట వెలుపల ఒక సైన్యం కోటపై ముట్టడి సాగించబోతోంది. వెళ్ళి వారికి నీవు కూడా సహాయపడు. తూర్పువైపు కోటకొమ్ము మీదుగా మీకు త్వరలో ఒక రక్తజ్వాలాపతాకం కనిపిస్తుంది. అది చూడగానే మీ ముట్టడిని తీవ్రతరం చెయ్యండి. కోటలోనివారికి లోపలి పని యెక్కువగా తగుల్తుంది. మీరప్పుడు అవలీలగా కోటగోడ నధిగమించవచ్చు. వెళ్లు,—ఇక నీ దారి నీది, నా దారి నాది.'

ఉల్రికా ప్రకటించిన యీ సంకల్పాన్ని గూర్చి ఇంకా వివరంగా తెలుసుకోడానికి సెడ్రిక్ ప్రయత్నించి ఉండేవాడే కాని, ఇంతలో, ఫ్రాంట్ డీబాఫ్ పరుష కంఠధ్వని వెలుపలనుంచి ఇలా వినవచ్చింది: 'ఎక్కడున్నాడీ ఫాదరీ? ఇంతసేపు ఏంచేస్తున్నాడు? నా నౌకర్లతో చేరి ఏదైనా కుట్ర చేస్తున్నాడా యేమిటి? చీల్చి చెండాడుతాను !'

ఉల్రికా ఇక అక్కడ నిలువక, 'చూడు, ఎంత సరిగా ఊహించిందో వీడి పాపిష్ఠి మనస్సు. కాని, నీవేమీ వీణ్ణి లెక్క చెయ్యకు. త్వరగా మీవాళ్ళను కలుసుకొని, దాడి ప్రారంభించు. సాక్సన్ వీరాలాపాలతో దిక్కులు పిక్కటిల్లిపోవాలి'—అంటూ ఒక ప్రక్కద్వారం గుండా అంతర్ధానమయింది. రెజినాల్డు ఫ్రాంట్‌డీబాఫ్ గదిలోనికి ప్రవేశించాడు.

# అధ్యాయం ౨౭

ఎట్టయెదుట నిలిచిన దర్పోద్ధతుడైన ఫ్రాంట్ డీ బాఫ్‌కు సెడ్రిక్ అతికష్టంమీద ఎలాగో మేనువంచి అభివాదం చెయ్యగా, ఫ్రాంట్ డీ బాఫ్ ఇంచుక శిరస్సువంచి ప్రత్యభివాదంచేస్తూ,— 'ఏం, బాబాజీ! ఖైదీలు తమ ముందర చాల దీర్ఘంగా పశ్చాత్తాపం వెళ్ళబోసుకున్నట్టున్నారే! మళ్ళీ మరొక అవకాశం ఈ జీవితంలో ఇక వారికి లభించదుగనుక నాకేమీ అభ్యంతరంలేదు గాని, సర్వమూ ఇక పూర్తిఅయినట్లేనా? చావుకు ఇక వాళ్లు సిద్ధంగా ఉన్నట్లేకదా?' అని అడిగాడు.

సెడ్రిక్, వచ్చీ రాని ఫ్రెంచిభాషలో,—'వాళ్ల లక్షణం చూడగా, తమ చేతిలో పడ్డామని ఏ క్షణాన తెలుసుకున్నారో, అప్పటినుంచీ చావుకు ఎదురుచూస్తున్నట్లే కనుపించారు'— అని సమాధానం చెప్పేసరికి, ఫ్రాంట్ డీ బాఫ్ నిశితంగా అతనివంక చూస్తూ—'ఏమిటి బాబాజీ, నీ మాటలో సాక్సన్‌ధ్వని వినిపిస్తోందే?' అని ప్రశ్నించాడు.

'నేను సెంటు విట్‌హోల్డు కాన్వెంటులో శిక్షణ పొందినవాణ్ణిలెండి'— అని ప్రతివచన మిచ్చాడు సెడ్రిక్.

'అలాగా? నీవు నార్మన్ జాతీయుడవైఉంటే ఎంతో బాగుండేది. నా పనికి ఇంకాయెక్కువ వీలుగా ఉండేది. దానికేంలే, అవసరాన్నిబట్టి వార్తాహరునిగా ఎవరినైనా పంపవలసే ఉంటుంది. సెంటు విట్‌హోల్డు కాన్వెంటు గుడ్లగూబల గూడుగా తయారైన సంగతి నాకు తెలియనిదికాదు. నార్మన్ దుస్తుల్లో ఉన్నా, ఫాదరీ దుస్తుల్లో ఉన్నా, సాక్సనుకు రక్షణ ఉండజాలని రోజు అచిర కాలంలోనే రాబోతోంది'—అన్నాడు ఫ్రాంట్ డీ బాఫ్.

ఉద్రేకంతో కంపించిన కంఠస్వరంతో సెడ్రిక్, 'అంతా ఈశ్వరేచ్ఛ' అని సమాధానమిచ్చాడు. ఆ కంపం భయంచేతనని అనుకున్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

'ఏం, అప్పుడే మా సైన్యాలు మీ కాన్వెంటుమీదికి వచ్చిపడ్డట్టుగానే భయపడుతున్నట్టున్నావు. మరేం భయంలేదులే! నా కొక పని చేసిపెట్టు— ఇతరులమాట ఎలా ఉన్నా, నీకు మాత్రం ఆపద రానివ్వను. నీ కాన్వెంటు గదిలో నీవు నిశ్చింతగా నిద్రపోవచ్చు, నాదీ హామీ'—అని జవాబుకై మొగం వంక చూచాడు.

'అది ఏ పనో ఆజ్ఞాపించండి'— అన్నాడు సెడ్రిక్, ఆవేశం చిక్కబట్టుకొని.

'అయితే ఇలా రా నా వెంట. దొడ్డివాకిలిగుండా నిన్ను బయటికి పంపుతాను'— అంటూ ఫ్రాంట్ డీబాఫ్ అతన్ని వెంటనిడుకొని, తాను అపేక్షించిన పని యీ విధంగా అతనికి తోవలో తెలియజేశాడు:

'చూశావు కదా బాబాజీ, ఈ కోటను ముట్టడించిన ఆ సాగ్జన్ మూకను? ఈ కోటగోడ ఇక్కడ దుర్బలంగా ఉన్నదని చెప్పిగాని, ఇంకేమైనా చెప్పిగాని, ఇక్కడనే వాళ్లు తమ ముట్టడిని కేంద్రీకరించేటట్లు చెయ్యి. ఒక్క ఇరవై నాలుగు గంటలసేపు వాళ్లను ఇక్కడనుంచి కదలకుండా చేస్తే చాలు. ఈలోపుగా, ఇదిగో ఉత్తరం తీసుకొని,—అఁ, అన్నట్లు, నీకు చదవడం వచ్చునా?'

రాదని కచ్చితంగా చెప్పివేశాడు సెడ్రిక్. 'బాగుంది. నా పనికి నీలాంటివాడే కావాలి. ఈ ఉత్తరం ఫిలిప్ డీ మాల్వాయిసిన్‌కు అందజేసి, టెంప్లార్ బ్రయన్ దీనిని వ్రాశాడని తెలియజేస్తూ, వెంటనే యార్కు నగరానికి ఒక ఆశ్వికుని ఉరికించమన్నానని నా మాటగా చెప్పు. వాళ్ళు వచ్చే లోపుగా ఇక్కడ మేము కోటను ఎలాగో రక్షించుకొంటూ ఉంటాము. ఇంతకీ, రోజిలా వచ్చింది. మా జెండా అల్లంతదూరాన కనిపించేసరికే తుర్రున పారిపోతూఉండే సాగ్జన్ మూకలకు వెరచి యీనాడు దాక్కోవలసిన పరిస్థితి యేర్పడింది. ఏ ఉపాయంచేతనైనా, మా మిత్రుల సైన్యాలు మాకు తోడు వచ్చే పర్యంతమూ వీళ్లను ఆకట్టి ఉంచగలిగావా, తరువాత చూపిస్తాను వీళ్లకు నా తడాఖా యేమిటో!' అని పలికాడు ఫ్రాంట్ డీ బాఫ్.

'ఓ,—తప్పకుండా అలాగే చేస్తాను, వాకచక్యమంతా చూపి. ఇక్కడనుంచి వాళ్లను కదలనీకుండా చేసే భారం నాది!'—అన్నాడు సెడ్రిక్. ఈ ఉత్సాహప్రకటన ఫ్రాంట్ డీబాఫ్‌ను సంశయగ్రస్తుని చేసింది—'ఇతడు జాతిచే సాగ్జనై ఉండీ ఈ పనిలో ఇంత ఉత్సాహం ఏల చూపుతున్నాడా' అని. సెడ్రిక్కు మాయనటనలు నటించడంలో నేర్పు చాలా తక్కువ. ఫ్రాంట్ డీబాఫ్ ప్రకటించిన సంశయం అతనికి నిజంగా చిక్కు తెచ్చిపెట్టింది. కాని, అదృష్టవశాత్తూ చప్పున ఒక ఉపాయం తోచిందతనికి: ఈ దొంగలు మతబాహ్యులూ సంఘబాహ్యులూ కనుక, వీరంటే తనకు అసహ్యమన్నట్లు సూచించడానికి లోలోపల ఏవో జపించడం మొదలుపెట్టాడు. ఇది అవకాశంగా తీసుకొని, ఈ దొంగలు చాలా దుర్మార్గులనీ, ఫాదరీలనుసైతం హింసించడానికి వెనుకాడరనీ, ఏవేవో కల్లబొల్లి మాటలు తాను కూడ చెప్పి, అలాంటి మతబాహ్యులపై పగతీర్చుకోడం నీ విధి సుమా యని అతనికింకా పురికొల్పింప

ప్రశ్నించాడు ఫ్రాంట్ డీబాఫ్. 'ఓ, తప్పకుండా పగ తీర్చుకుంటాను, నా ఆంతర్యం భగవంతుడెరుగు' అని వ్యంగ్యంగా మారుపలికాడు సెడ్రిక్.

ఇంతలో ఇద్దరూ దొడ్డివాకిలి వద్దకు చేరారు. ఫ్రాంట్ డీబాఫ్ సెడ్రిక్‌ను మెల్లిగా ఒక వంతెన మీదుగా అగడ్తను దాటించి తీసుకొని పోయి, దాని అవతల, మంచి బందోబస్తులో ఉన్న రక్షణ మార్గాన్ని కూడ దాటించి సాగనంపుతూ,—'ఇక వెళ్ళు, నేను చెప్పినట్లుగా చెయ్యి. నీవు తిరిగి వచ్చేలోపుగా ఈ మతశాహుల్యాల కందరికీ గట్టిశాస్తి చేసేస్తాం. అన్నట్లు, నీవు మంచి ఉల్లాసప్రియుడవులాగ కనిపిస్తున్నావు. ఈసారి నీవిక్కడికి వచ్చినప్పుడు, చూసుకో,—నిన్ను ఒకటోరకం ద్రాక్షాసవంలో ఓలలాడించేస్తాను. తప్పకుండా రా!' అన్నాడు.

'ఓ, తప్పకుండా తిరిగి కలుసుకుందాం మనం'—అన్నాడు సెడ్రిక్ వ్యంగ్యంగా. 'ఈలోపుగా ఇది చేతిలో ఉంచుకో'—అంటూ ఫ్రాంట్ డీబాఫ్ అతని చేతిలో ఒక బంగారు నాణెం బలవంతాన పెట్టి, 'నేను చెప్పినట్లుగా చేయకపోతే మాత్రం, కపర్దార్, నిలువునా చీల్చి యెండేస్తాను.'—అని అదలించాడు.

'నిరభ్యంతరంగా అలాగే చెయ్యవచ్చు,'—అంటూ సెడ్రిక్, ఆ దొడ్డివాకిలి దాటి, పొలాలలోకి ఉల్లాసంగా నాలుగడుగులు ముందుకు వేస్తూ తటాలున వెనుకకు తిరిగి, చేతనున్న బంగారునాణేన్ని ఫ్రాంట్ డీబాఫ్ వైపుకే విసిరి కొట్టుతూ, 'దుర్మార్గుడా! నీవూ, నీడబ్బూ సర్వనాశం కావాలి!' అని శపించాడు.

వెనుదిరిగి కోటలోకి పోబోతున్న ఫ్రాంట్ డీ బాఫ్‌కు ఈ మాటలు స్పష్టంగా వినిపించలేదుగాని, సెడ్రిక్ వైఖరిమాత్రం అతనికి అనుమానాస్పదంగా తోచింది. వెంటనే బాణప్రయోగంచేసి చంపండని కోట బురుజులపైనున్న విలుకాండ్రకు ఆజ్ఞాపించాడు గాని, అంతలోనే తమాయించుకొని, వద్దని నివారించాడు. 'చంపితే వచ్చే ప్రయోజనమేమిటి? గత్యంతరం లేనప్పుడు నమ్మితే వచ్చే ప్రమాదమేమీ లేదు. కానీలే చూద్దాం'— అనుకొని కోటలోపలికి తిరిగివచ్చాడు.

వచ్చీ రావడంతోటే సరాసరి ఆయుధాగారంలో ప్రవేశించి, సెడ్రిక్ ఎథెల్‌స్టేనులను తన ముందర హాజరుపెట్టవలసిందని సేవకుల కాజ్ఞాపించాడు. ఒకటోరకం ద్రాక్షాసవంకూడా తీసుకువచ్చి దగ్గర ఉంచమన్నాడు. సెడ్రిక్ వేషంలో ఉన్న వాంబా, ముఖంమీదికి అదో రకంగా టోపీని లాక్కొని ఎదుట నిలబడినందువల్ల, ఆ ఆయుధాగారపు మసక వెలుగులో ఫ్రాంట్ డీబాఫ్ అతనిని సెడ్రిక్ గానే భావించాడు. పైగా, సెడ్రిక్ రూపురేఖ లెలాంటివో అతనికి

సరిగా తెలియదు. సెడ్రిక్ సాధారణంగా తన ఎస్టేటువిడిచి బయటికి వచ్చేవాడుకాదు. వచ్చినా సాధ్యమైనంతవరకు నార్మన్ సామంతులను తప్పించుకొని తిరగడమే పనిగా పెట్టుకునేవాడు. అందుచే, సెడ్రిక్ తన చేతిలోంచి తప్పించుకొని పోయాడన్న సంగతి ఫ్రాంట్ డీబాఫ్ కనిపెట్టలేకపోవడంలో ఆశ్చర్యంలేదు.

'ఓహో! ఇంగ్లాండు సుదర్శించగల యోధాగ్రేసరులు కాబోలు! ఏం, ఎలా ఉంది మా కోటలో ఆతిథ్యం! పిరిస్సరాన్ మీకు మర్యాదచేసి ఆతిథ్యమిస్తే, అమర్యాదగా ప్రవర్తించి లేచివచ్చిన ప్రబుద్ధులు కామా మీరు? మీకెలాంటి మర్యాద చెయ్యాలో నాకు తెలుసు. ఇదిగో చెపుతున్నాను,— ఈ కోటలోంచి మీరు తప్పించుకొని బయటపడాలని ఉంటే, పుష్కలంగా మాకు ఎంత నజరానా చెల్లిస్తారో చెల్లించండి. లేకపోతే, మిమ్మల్ని ఇప్పుడే ఈ కిటికీ ఊచలకి తలక్రిందులుగా వేళ్ళాడదీయిస్తాను. కాకులూ గ్రద్దలూ మిమ్మల్ని బొమికెల గూళ్ళుగా చేసి వదిలేస్తాయి. ఏమిటి, చెప్పండి, చెల్లిస్తారా లేదా? ఏమంటారు శాక్సనువృద్ధులార?'— అని ప్రారంభం చేశాడతడు ప్రసంగం.

'ఏమనడానికేముంది? తలక్రిందులుగా వ్రేలాడవేయడం నాకు మరీ మంచిది. నా మెదడు తలక్రిందులు మెదడని అంతా అంటూఉంటారు. తలక్రిందులుగా వ్రేలాడదీస్తే మెదడు తిన్నగాఉంటుంది. అలాగే చెయ్యండి'— అన్నాడు వాంబా.

ఫ్రాంట్ డీబాఫ్ చకితుడై, 'ఎవరురా వీ'డని చెయ్యి విసిరి వాంబానెత్తి మీది టోపీ ఎగరగొట్టాడు. వాంబా కంఠాన ఉన్న వెండి కడియాన్నిబట్టి అతను బానిస అని స్పష్టమయింది. ఫ్రాంట్ డీబాఫ్ ఉగ్రుడై 'అరేయ్, వెధవల్లారా! వీడెవడురా, వీణ్ణి తీసుకొచ్చా'రని ఒక పెద్ద కేక పెట్టాడు.

'వీడా? వీడు సెడ్రిక్ దగ్గర హాస్యగాడు. ఆష్బీలో ఇసాక్‌తో కొయ్యకత్తియుద్ధం చేసింది వీడే!'—అన్నాడు డిబ్రేసీ,— ఆసమయంలో లోనికి ప్రవేశిస్తూ.

'మంచిది-వీళ్ళందరికీ తగినశాస్తి ఇప్పుడే చేస్తాను. డబ్బు చెల్లించడమే కాదు, నాదగ్గిర బానిసలుగా బ్రతకడానికి కూడా ఒప్పుకుంటేనే వీళ్ళకు బొందిలో ప్రాణం ఉండనిచ్చేది!'అంటూ ఫ్రాంట్ డీబాఫ్, అసలు సెడ్రిక్కును తీసుకు రావలసిందిగా నౌకర్లకాజ్ఞాపించాడు. 'ఇంకా సెడ్రిక్ ఎక్కడున్నాడు? అక్కడ ఉన్నది నాలాంటి బానిసలే!'—అన్నాడు వాంబా. ఫ్రాంట్ డీబాఫ్ ఏమిటిదని నౌకర్లవంక చురచురా చూశాడు. నౌకర్లు వణికిపోయి, 'మాకు తెలియదు దొరా, ఇతడే సెడ్రిక్ అనుకున్నాం. ఇతడు కాకపోతే మరి

ఏమైనాడో చెప్పలే'మని తడబడుతూ చెప్పారు. 'చెప్పడానికేముందీ! ఫాదరీ వేషంలో సెడ్రిక్ తప్పించుకొనిపోయి ఉంటాడు,—అంతే!' అన్నాడు డిబ్రేసీ.

'అరెరే! అయితే, ఆ సాక్సన్ గాడిదను నా చేతులారా నేనే దొడ్డి తోవను తీసుకొనిపోయి వదలిపెట్టానన్నమాట! ఎంత పని జరిగింది!'—అని ఫ్రాంట్ డీబాఫ్ బొబ్బగరచి,—'ఇంతకీ ఈ హాస్యగాడు చేశాడిదంతా! వీడికి తగినశాస్తి చెయ్యాలి. బుర్ర గొరిగించి, మాడు చెక్కించి, కోట బురుజుమీద నుంచి వ్రేలాడదీయిస్తాను. వీడి హాస్యం అప్పుడేమౌతుందో చూస్తా!'—అని హుంకరించాడు.

మృత్యువు ఉరిమి చూస్తున్నా వాంబా తన హాస్యధోరణి వదిలిపెట్టలేదు. 'ఓ, అంతకంటే కావలసిందేముంది? నీవు నా నెత్తికి తగిలిస్తానన్న ఎర్రటోపీతో నా హోదా మరింత ఎక్కువౌతుంది. సామాన్యపు ఫాదరీల్లా పెద్ద మతాధికారినై కూర్చుంటాను'—అని చమత్కరించాడు.

ఈ జవాబుకు డీబ్రేసీ నవ్వి,—'ఈ కోతి వెధవ చచ్చేటప్పుడు కూడా తన వృత్తిధర్మం మానదల్లే వుంది. వీణ్ణి చంపబోకు ఫ్రాంట్ డీబాఫ్! నాకు వదిలేసెయ్, నా దగ్గిర విదూషకుడుగా ఉంటాడు. ఏరా ఏమంటావు? నా దగ్గిరుంటావా?'—అని అడిగాడు.

'ఉంటాను ఉండకేం, మా యజమాని సెలవైతే సరి! ఈ కడియం ఆయన సమ్మతితో ఊడిపోవలసిందే!'—అన్నాడు వాంబా.

'ఎవరి సమ్మతీ అక్కర్లేదు. సాక్సన్ కడియాలు కోసిపారెయ్యడానికి నార్మన్ రంపాలున్నాయిగా!'—అన్నాడు డీబ్రేసీ.

'అవునవును! అందుకనే గాబోలు ఈ పాట పుట్టింది,'—అంటూ వాంబా ఏదో పాట పాడడం మొదలు పెట్టాడు.

ప్రసంగం ఇలా పెరుగుతూఉండేసరికి ఫ్రాంట్ డీబాఫ్ చికాకుపడి,—'ఏమిటి డీబ్రేసీ, ఈ మూర్ఖుడితో వినోదం? అవతల ఒక పెద్ద ప్రమాదం మన మీద విరుచుకొని పడబోతోంది, మిత్రులకు కబురుచేద్దా మనుకుంటే, ఆ ప్రయత్నం చెడగొట్టాడు ఈ గాడిద. వీడితో నీవు సరాగాలు పెట్టుకుని కూర్చుంటున్నావు. నాకేం బాగాలేదు నీ వ్యవహారం'—అని హెచ్చరిక చేశాడు.

డీబ్రేసీ అంతట వాంబాతో ప్రసంగం కట్టిపెట్టి, యుద్ధానికి బయలుదేరే సన్నాహాలు చేస్తుండగా అతనికొక ఆలోచన తట్టింది. ఎథెల్‌స్టేనును గనుక రాయబారిగా ఉపయోగించుకుంటే అసలీ యుద్ధంబెడదలోంచే తప్పించుకో

వచ్చునేమోనని. ఎథెల్‌స్టేన్ దృష్టి ద్రాక్షాసవం బుడ్డీమీద ఉండడం అతను కనిపెట్టి, ఒక కప్పు ద్రాక్షాసవం అతనికి అందిస్తూ, 'తాగవయ్యా, తాగు,— తాగి కొంచెం హుషారు తెచ్చుకో! బొత్తుగా మందకొడిగా ఉన్నావు. హుషారు తెచ్చుకొని చెప్పు,— నిన్ను విడుదలచేస్తే మాకు కలిగే ప్రయోజనమేమిటి?'— అని అడిగాడు.

'నన్నూ నాతోటివారినీ విడిచిపెడితే, వెయ్యిమార్కుల నాణేలు చెల్లిస్తాను' అన్నాడు ఎథెల్‌స్టేను.

'కోటబయటమూగిన సాగ్జన్ మూకనుగూడా మరలించుకొని పోగలవా?' అని అడిగాడు ఫ్రాంట్‌డిబాఫ్. 'మూడు వంతుల ముప్పాతిక పాళ్ళు మరలించుకు పోగలననే అనుకుంటా' నన్నాడు ఎథెల్‌స్టేను. బేరం బాగున్నదంటే బాగున్న దనుకున్నారు. 'అయితే, ఇది యిసాక్‌కు వర్తించదు సుమా, యిప్పుడే చెప్తున్నా' నన్నాడు ఫ్రాంట్‌డిబాఫ్. 'ఇసాక్ కూతురుకూడా వర్తించదు'— అన్నాడు టెంప్లార్ బ్రయన్. 'వాళ్ళిద్దరూ మీ సాగ్జన్ పరివారంలోనివాళ్ళు కానే కారుగదా' అన్నాడు ఫ్రాంట్‌డిబాఫ్. 'అవును, వాళ్ళతో నాకు సంబంధం లేదు, వాళ్ళను మీ రేమైనా చేసుకోం' డన్నాడు ఎథెల్‌స్టేను. 'ఈ ఒడంబడిక లేడీ రొవెనాకుకూడా వర్తించదు సుమా!' అన్నాడు డీబ్రేసీ. 'ఈ హాస్యగాడికిసైతం వర్తించదు, వీడికనుంచి నా దగ్గిరే ఉంటా' డన్నాడు ఫ్రాంట్‌డిబాఫ్. అంతట ఎథెల్‌స్టేన్ కోపం వెళ్ళగక్కుతూ,— 'లేడీ రొవెనా నేను వివాహం చేసుకొనబోయే వధువు,— ఆమెను నేను వదలిపెట్టడం యెన్నటికీ పొసగదు. యిక పోతే, ఈ వాంబా మా సెడ్రిక్‌దాసు మా ప్రాణం రక్షించాడు. నా ప్రాణమైనా వదులుకుంటానుగాని వాని కెట్టి అపాయమూ రానివ్వను'— అని ఉద్ఘాటించాడు.

దీనిపై వాగ్వాదం పెరిగింది. 'రొవెనా నీకు భార్య కావడమేమిటి! అసంభవం! ఆమె సంరక్షణభారం ప్రిన్సుజాన్ వహిస్తున్నారు. ఆమెను నీవంటి నీచవంశ సంజాతున కివ్వనివ్వ' రన్నాడు డీబ్రేసీ. ఎథెల్‌స్టేనుకు మరింత కోపం కలిగి,— 'దొంగల మూకలకు నాయకత్వం వహించే ఫ్రెంచినీచుల వంశంకంటె మా వంశం ఘనతరమైనదే! మా వంశీయులల్లో రాజ్యాలేలినవా రున్నారు, రణతంత్ర విశారదులున్నారు, రాజనీతికోవిదులున్నారు. వారి పేరు కీర్తు లిప్పటికీ చారణులు పాడుతునే ఉంటారు. మా పూర్వీకుల సమాధులపై గొప్ప గొప్ప చర్చిలు వెలిసాయి. మాది నీచవంశం?'— అని ఉటంకించాడు.

డీబ్రేసీకి ఈ దెబ్బ తగలడం ఫ్రాంట్‌డిబాఫ్‌కు సంతోషంగా ఉంది. ఇది డీబ్రేసీ ఉక్రోషాన్ని మరింత పెంచింది. ఇంతలో, దొడ్డివాకిలివద్ద ఎవరో

సన్యాసి నిలబడి ప్రవేశానికి అనుమతి కోరుతున్నాడని నౌకరువచ్చి చెప్పాడు. అతనుకూడా దొంగ సన్యాసియే మోనని ఫ్రాంట్ డీ బాఫ్ కి అనుమానం. 'కాదు, సెలవిస్తున్నాను, అతను జోర్వాల్క్స్ మఠాధిపతి ప్రయర్ ఐమర్ దగ్గరఉండే ఫాదర్ అంబ్రోజ్' —అని సందేహ నివృత్తి చేశాడు నౌకరు. సరే ప్రవేశపెట్టమని నౌకరును పంపి, ఎథెల్‌స్టేను వగైరాలను అక్కడ నుంచి తీసుకొని పొమ్మని ఇతర పరిచారకులను ఆజ్ఞాపించాడు ఫ్రాంట్ డీ బాఫ్.

నౌకరు కొంచెము సేపటిలో ఫాదర్ అంబ్రోజ్‌ను లోపలికి ప్రవేశ పెట్టాడు. ఫాదర్ అంబ్రోజ్ ఏదో పెద్ద ఆందోళనలో ఉన్నట్లు కనుపించాడు. లోనికి రావడంతోటే అన్యాయ్యో అని పెద్ద నిట్టూర్పు విడిచి, తాను వచ్చిన పనిని వారికి నివేదించడానికి ఈవిధంగా ప్రారంభించాడు: 'పూజ్యులైన మా ప్రయర్ ఐమర్ మహాశయులకు మీ రంతా ఆత్మీయులు. మీ సాహాయ్యం వారికిప్పుడు కావలసి వచ్చింది. వీరధర్మాన్ని బట్టి యేమి, సామాన్యమైన క్రైస్తవ ధర్మాన్ని బట్టియేమి, వారికి తోడ్పడవలసిన విధి మీ కున్నది. సెంటు అగస్టిన్ తన గ్రంథంలో ఏమన్నాడంటే'—

'ఏమంటాడీ సైతాను? — ఏమంటావయ్యా ఇంతకీ నీవు? ఈ పుణ్యగ్రంథాల్లోంచి వచనాలు వింటూ కూర్చునే తీరికలేదు మాకిప్పుడు. త్వరగా తేల్చి చెప్పు'— అని చిరాకుపడ్డాడు ఫ్రాంట్ డీ బాఫ్.

'అరి దైవమా! ఈ లౌకిక జనానికి కోపం ముక్కుమీదనే ఉంటుంది గదా! వినండి చెప్తున్నాను. హత్యలు చెయ్యడానికి వెనుదీయని కొందరు దుర్మార్గులు ఏంచేశారంటే,—దైవభీతి అనేది ఏమాత్రమూ లేకుండా, దైవ ప్రతిష్ఠితమైన చర్చియెడల భక్తిభావం విసర్జించి, దైవాజ్ఞలతో తుల్యమైన పోప్ గురుపీఠపు ఆదేశాలను లెక్కచెయ్యక,'—

'అవన్నీ మాకు తెలుసును లేవయ్యా! తెలియకపోతే ఊహించుకోగలం. అసలు సంగతి యేమిటో సూటిగా చెప్పేసెయ్! ప్రయర్ ఐమర్ ఖయిదు చేయబడ్డాడా ఏమిటి? ఎవరిచేత?'—అని విసిలించాడు టెంప్లార్ బ్రయన్.

'అవునవును, ఖయిదు చేయబడ్డారు. ఈ అడవుల్లో విచ్చలవిడిగా సంచరించే సైతానుమూకే వారిని ఖయిదు చేసింది. 'నా కార్యములందు నియుక్తులైన వారిపై చేయి వేయకండి. నేను పంపిన ప్రవక్తలను యెట్టి హానీ తల పెట్టకండి'— అన్న భగవదాదేశాన్ని వాళ్ళు తిరస్కరించి మహాపాపం చేశారు'—అన్నాడు ఫాదర్ అంబ్రోజ్.

‘సరిసరి! ప్రయర్ ఐమర్ ఇప్పుడు మాకేమైనా సాయపడతాడేమో ననుకుంటే, మా సాయమే తాను కోరే పరిస్థితిలో ఉన్నాడన్నమాట. ఈ సోమరిపోతు మతాధికారులు, అవసరంలేని సమయాల్లో మాత్రం బాగా తోడ్పడగలరు— ఇంతకీ మమ్మల్ని ఏం చెయ్యమంటాడు మీ ప్రియర్?’—అని అడిగాడు ఫ్రాంట్ డీబాఫ్.

‘తమ చిత్తం! జరిగిన సంగతి ఇదీ: నేను ఇందాక వినిపించిన దైవాదేశం ఉల్లంఘించినవారై ఆ సైతానుమూక మా ప్రియర్‌ను బలాత్కారంగా పట్టి బంధించడమే కాక, సామాను కొల్లగొట్టి రెండువందల బంగారు మార్కు నాణేలు హరించి, అంతటితోనైనా తృప్తిపడక, ఇంకా డబ్బు తెమ్మని బలవంత పెట్టుతున్నారు. వారికి మీరు ఆప్తులు గనుక, ఏలాగైనా తమ్ము బంధవిముక్తుని చెయ్యవలసిందిగా వారు మిమ్మల్ని కోరుతున్నారు. డబ్బే చెల్లించి విడిపిస్తారో, లేక ఆయుధబలంతో సాధించి విముక్తుని చేస్తారో, అదంతా మీ యిష్టం!’—అన్నాడు అంబ్రోజ్.

‘ఏడ్చినట్లే ఉంది! మీ ప్రయర్ ఇవాళ కొంచెం ఎక్కువ డోసు వేసి నట్లున్నాడు. మతాధికారి బంధవిముక్తికి నార్మన్ సామంతుడు డబ్బు చెల్లించడం మీ ప్రయర్ ఎన్నడైనా విన్నదీ కన్నదీనా? మాకంటె పదిరెట్ల ధనంతో తులతూగుతూ ఉంటారు గదా మీ మతాధికారులు! ఇక పోతే, ఆయుధ బలంతో వచ్చి తోడ్పడడానికా, మేమే ఇక్కడ మాకంటె పదిరెట్ల బలాన్ని ఎదుర్కోవలసివచ్చి సతమతమౌతూంటే, మా కెక్కడ అవకాశం!’— అని ఈసడించాడు ఫ్రాంట్ డీబాఫ్.

‘ఆ మాటే నేనూ చెప్పొస్తున్నాను. నన్ను చెప్పనివ్వకుండా మీరే అనేశారు. దైవమా! ఈ దుండగాలు చూస్తుంటే గుండెలవిసిపోతున్నాయి. కోటగోడ యెక్కడానికి కాబోలు, పెద్ద కట్ట వేస్తున్నారు!’—అని ఒక కొత్త సమాచారం వినిపించాడు అంబ్రోజ్.

‘ఆఁ! అలాగా! ఇంకా చూస్తారేం, లేవండి! ఇక ఆలస్యం చేస్తే ప్రమాదం తప్పదు’—అంటూ డీబ్రేసీ తలుపులు తెరచి వెలుపలికి చూశాడు. అంబ్రోజ్ చెప్పినది నిజమే: ముట్టడి తీవ్రంగా సాగుతోంది, పెద్ద పెద్ద రక్షణ ఫలకాలు చాటుచేసికొని ముట్టడిదారులు ముమ్మరంగా పనిచేస్తున్నారు. అల్లంత దూరాన వర్షాగమం ముందు కనిపించే నీలి మబ్బులలాగా విలుకాండ్ర బారులు చిక్కనై కనుపించాయి.

రెజినాల్డు ఫ్రాంట్ డీబాఫ్ కూడా కిటికీలోంచి ఈ దృశ్యం చూశాడు. వెంటనే శృంగధ్వని చేసి, తన అనుచరుల నందరినీ కోటగోడల వద్దకు తరుమ

పోగాడు. 'డీబ్రేసీ! నీవు తూర్పువైపు కాయి. బొస్లాక్ బ్రయన్ పడమటి వైపు కాస్తాడు. నేను ముఖద్వారం కాస్తాను. అయితే, యెవ్వరమూ కూడా ఒక్కచోటనే బంధింపబడిపోకూడదు. ఎక్కడపడితే అక్కడే ప్రత్యక్షమౌతూ, అంతటా మనమే యైనట్లు పోరు సాగించాలి. శత్రువుల ఒత్తిడి యెక్కడెక్కడ యెక్కువగా ఉంటే అక్కడక్కడికెల్ల వచ్చి వాలుతూ ఉండాలి. మన సంఖ్యాబలం చాల తక్కువగా ఉన్నది గనుక, ఆ లోటును మనం, మనఉత్సాహశక్తితో పూరించుకోవాలి. పదండి!—'అని మిత్రులను హుషారు చేశాడు.

'మరి మా ప్రియర్ మాట ఏం చెప్పారు? వారుచెప్పినది కొంచెం వినండి. వారేమన్నారంటే,—'అని ఈసందడిలో ఫాదర్ అంబ్రోజ్ తిరిగి ఏదో చెప్పబోయాడు.

'మీదగ్గరకాదు, దేవుడి ముందు పెట్టుకోండి మీ గొడవ! మాకు ఆలకించే అవకాశం లేదు,'—అని ఫ్రాంట్ డీబాఫ్ అతన్ని ఒక్క గదుము గదిమి,—అనుచరుల నిలా ఆదేశించాడు: 'ఊఁ, వెళ్ళండి. ఇక ఆలస్యం పనికిరాదు. నూనెలు కళపెళా కాచండి. అలుగుల సమృద్ధిగా సమకూర్చి పెట్టుకోండి. నా 'అబోతు తల' బావుటా ఎల్లరికీ కనుపించేలాగ ఎగరవేయండి. ఎలాంటివానితో వైరం పెట్టుకున్నారో ఈ రోజున ఈ తుట్టపురుగులకు తెలిసివచ్చేటట్లు చేస్తాను.'

కాని, అంబ్రోజ్ తన విజ్ఞాపనలింకా మానలేదు. నా మాట వినిపించుకోండని వెంటబడి బ్రతిమాలసాగాడు. ఫ్రాంట్ డీబాఫ్ మరింత మండిపడి, 'ఏమిటీ వాగుడు! వీణ్ణి తీసుకుపోయి మందిరంలో పడేసి తాళంవెయ్యండిరా! ఈ హడావుడి పూర్తి అయిందాకా బయటికి తీయకండి. అక్కడే జపంచేసుకుంటూ కూర్చుంటాడు. ఈ కోటలో శిలాప్రతిమల రూపంలోవున్న క్రైస్తవ భక్తులు ఇదివరకెన్నడూ భగవన్నామోచ్చారణ ఇక్కడవినలేదు. ఈనాడైనా వింటారు'—అని కేకపెట్టాడు.

'భాగవతనింద చేస్తున్నావు ఫ్రాంట్ డీబాఫ్! నేడు మన శత్రువుల బారినుండి మనం బయటపడడానికి ఆ భాగవతుల అనుగ్రహంకూడా కావలసి వస్తుంది'—అన్నాడు డీబ్రేసీ.

'వాళ్ళ అనుగ్రహం నాకేంఅక్కరలేదు. వాళ్ల సాయం నే నపేక్షించను. కోట బురుజాలమీదనుంచి శత్రువుల నెత్తిమీదికి దొర్లించడానికి ఆ విగ్రహాలను ఉపయోగించుకుంటే ఉపయోగించుకుంటానేమో! అంతే! అదిగో, విపరీతమైన స్థలం ఆక్రమించుకుంటున్న ఆ సెంటు క్రిస్టఫర్ విగ్రహం ఉన్నదే—దాన్ని

దొర్జిస్తే ఒక పటాలం పటాలం యావత్తూ భూస్థాపితం చెయ్యవచ్చు!'— అన్నాడు ఫ్రాంట్ డీబాఫ్.

టెంప్లార్ బ్రియన్ ఈ గందరగోళమేమీ పట్టలేదు. శత్రువుల ముట్టడి లక్షణం జాగ్రత్తగా పరిశీలిస్తూ నిలబడ్డాడు. 'వీళ్ళ ముట్టడిలో మంచి కట్టుబాటూ, శిక్షణా కనిపిస్తోంది ఫ్రాంట్ డీబాఫ్! అడ్డగోలు ముట్టడిగా లేదు. విలుకాండ్ల బాణాలకు గురికాకుండా ఎంత జాగ్రత్తగా మాటులు పెట్టుకొని ముందుకు వస్తున్నారో చూడు! ఆధునిక యుద్ధాల్లో ఆరితేరిన వీరు డెవడో వీళ్ళకు నాయకత్వం వహించినట్టున్నాడు'— అన్నాడతను, గాంభీర్యం ముఖంలో ప్రకటిస్తూ.

'అదిగో చూడూ, ఆపాదమగ్గా, సీలకవచం ధరించి శస్త్రాస్త్రాలతో కనిపిస్తున్నవాడే అయినప్పటికీ బహుశః వాళ్ళ నాయకుడు. ఆష్బీ పోటీలో నిన్ను గుర్రంమీదనుంచి పడకొట్టిన సీలకవచధారి కాడుగదా! తిన్నగా చూడు ఫ్రాంట్ డీబాఫ్!'— అన్నాడు డి బ్రేసీ.

'అయితే కానీ! నా పగతీర్చుకోడానికి వాడే ఈరూపేణా నాకు మంచి అవకాశమిస్తున్నాడు. లేకపోతే, వాణ్ణి గతికి పట్టుకోడం కష్టమయ్యేది!'— అని సమాధాన మిచ్చాడు ఫ్రాంట్ డీబాఫ్.

శత్రువుల కోలాహాల ధ్వనులు మరింత సన్నిహితం కావడంతో, ఇక అందరూ ప్రసంగాలంతటితో కట్టిపెట్టి, ఎవరికి నిర్దేశించబడ్డ రక్షణ స్థానాల్లో వారు నిలబడి పోరాడడం కోసం వేగిరపడి సన్నద్ధులయ్యారు.

# అధ్యాయం ౨౮

తరువాతి కథ చదువరులకు బాగా అవగాహన కావడానికి, ఇక్కడ కొంచెం వెనుకకుపోయి వెనుకటి వృత్తాంత మొకటి వారికి విశదం చెయ్యడం అవసరం. ఆష్బీ పోటీల సందర్భంలో ఐవాన్‌హో మూర్ఛితుడై పడిపోయి నప్పుడు, అతనిని గూర్చి పట్టించుకొన్నవారెవ్వరూ లేకపోగా, రెబెకా తన తండ్రిని ప్రోత్సహించి అతనిని తమ బసకు చేర్పించిన సంగతి చదువరు లిదివరలో స్థూలంగా తెలుసుకొని ఉన్నారు. ఇసాక్ మొట్టమొదట రెబెకా ప్రార్థన నంగీకరించలేదు. స్వతః దయాస్వభావం కలవాడే అయినా, మతసంబంధమైన రాగద్వేషాల కతీతుడు కాకపోవడంచేత, వ్యాపార ప్రయోజనం కోసం తప్ప ఇతరత్రా క్రైస్తవులతో వ్యవహరించడం శాస్త్రవిరుద్ధమని నివారింపజాలాడు. కాని, విందులూ వినోదాల్లో క్రైస్తవులతో కలసిమెలసి తిరగడం నిషిద్ధం కావచ్చునుగాని ఆపదలో ఉన్నప్పుడు క్రైస్తవుడైనా సోదరప్రాయుడేనని రెబెకా అతనికి నచ్చజెప్పి ఐవాన్‌హోను తమ బసకు చేర్పించే ప్రయత్నం చేయించింది.

నౌకర్లచేత మోయించి ఐవాన్‌హోను బసకు చేర్పిద్దామనుకున్నాడు ఇసాక్. కాని, రెబెకా అందు కంగీకరించక, తన డోలీలో అతనిని తీసుకొని వచ్చే ఏర్పాటుచేసి, తాను వేరొక ఒక గుర్రమెక్కి రావడానికి సిద్ధపడింది. 'వద్దు, అలా చేయవద్దు, ఈ దుర్మార్గుల విషపు దృష్టిలో నీవు పడడం శ్రేష్ఠం కా'దని ఇసాక్ ఆమెకు అడ్డు తగిలాడు. అయినా ఆమె తన ప్రయత్నం విరమించకపోవడం చూచి, ఆదుర్దాగా,—'ఎందుకీ లేనిపోని జంజాటం మనకు? చచ్చిపోతే చచ్చిపోనీ, ఈ యువకుని జోలికి మనం పోవద్దు. మన ఆశ్రయంలో ఉండగాగనుక చస్తే మనం చంపామని మనమీద విరుచుకొని పడతారు కూడాను!' అని ఆమె చెయ్యి గట్టిగా పట్టుకొని నివారించాడు. రెబెకా ఆ పట్టును నెమ్మదిగా వదలించుకుంటూ, 'అలా కాదు నాన్నా, ఈ యువకుడు చచ్చిపోడు. మనం ఆదరించకుండా వదలివేస్తే మాత్రం అన్యాయంగా చంపినవాళ్ళ మౌతాం. ఆ పాపం మనల్ని చుట్టుకుంటుం'దని సమాధానం చెప్పింది.

ఇసాక్ ఇక ఆమెను వారించలేక పోయాడు. వ్రణచికిత్సలో తన కుమార్తె బాగా ఆరితేరినదనీ, ఆమె చేతిలో అతడు తప్పక బ్రతకగలడనీ అతనికి తెలుసు. పైగా, కుమార్తె అంటే అతనికి అపార ప్రేమ. అంతటి సాధుశీల తనకు కుమార్తెగా జన్మించినందుకు అతడెంతో మురుస్తూ ఉంటాడు. తనకూ తన యింటికీ తన జాతికీ ఆమె ఒక వరంగా యెహోవాచే ప్రసాదించ బడిందని

అతని తలంపు. అందుచేత, 'సరే, నీ యిష్టం వచ్చినట్లే కానీ'మ్మని వదిలేసి ఊరుకున్నాడు. కాని, అతను భయపడినట్లే అయింది. తోవలో టెంప్లార్ బ్రియన్ విషపు చూపు ఆమెమీద పడింది. అదే పనిగా ఆమెను చూస్తూ అతడు రెండుసార్లు ఆమె ప్రక్కగా ఇటూ అటూ తన గుర్రం నడిపించాడు. దాని పర్యవసానం ఎంతవరకూ వచ్చిందీ మనకు తెలిసినదే.

బసకు చేరడంతోటే రెబెకా, ఐవాన్‌హో గాయాలను కడు జాగ్రత్తగా పరిశీలించి కట్లు కట్టడం మొదలుపెట్టింది. ఆ కాలంలో ఈ చికిత్సావిధానం సామాన్యంగా ఆడవాళ్ళందరూ నేర్చుకొని ఉండేవాళ్ళు. యూదీయులలో, ఆడవాళ్ళూ మగవాళ్ళూ కూడ సాధారణంగా మంచి వైద్యులే. గొప్ప గొప్ప రాజులూ సామంతులూ కూడ, అనుభవజ్ఞులైన యూదీయ వైద్యులచే చికిత్స చేయించుకోడం ఉండేది. యూదీయులకు మంత్రవిద్య తెలుసుననికూడా అప్పట్లో అంతా అనుకుంటూ ఉండేవాళ్ళు. ఇది వారియెడ క్రైస్తవులకుగల ఏవగింపును కొంతవరకు తగ్గించడానికి ఉపయోగపడుతూ ఉండేది. ఇదిగాక, ఎన్నెన్నో అద్భుత చికిత్సలను యూదీయులు చేసియుండడాన్నిబట్టి, వారివద్ద ఇతరులకు తెలియని వైద్యరహస్యాలు చాలా ఉండడంలో ఆశ్చర్యంలేదు. ఆ రహస్యాలను వారు అతి జాగ్రత్తగా యెవ్వరికీ చెప్పకుండా దాచి ఉంచుకునేవారు. రెబెకా మిరియం అనే యూదీయ వృద్ధవనితవద్ద ఈ చికిత్సావిధానం నేర్చుకుంది. మిరియంకు ఆ విద్యను నేర్పినది ఆమె తండ్రి. అతనికి యూదీయులలో మంచి ఘనవైద్యుడని పేరుండేది. అతడు తన వైద్య రహస్యాలన్నీ కూతురుకు చెప్పగా, ఆమె రెబెకాకు చెప్పినదని అనుకుంటూ ఉండేవారు. మిరియం మతావేశపరుల దురాగ్రహానికి బలియై అసువులు కోల్పోయింది. కాని, ఆమె వైద్యరహస్యాలు మాత్రం ఆమెతో అంతరించి పోలేదు. వాటిని రెబెకా సద్వినియోగం చేస్తూ వచ్చింది. రెబెకా మంచి అందగత్తెయే కాక, వయస్సుకు మించిన తెలివి తేటలు గల పిల్ల. ఆ అల్పవయస్సులోనే ఆమె యూదీయ జాతికి సంబంధించిన విజ్ఞానమంతా తనలో జీర్ణించుకోగలిగింది. అందుచే, ఒక్క ఇసాకే కాక, యూదీయులెల్లరూకూడా ఆమెను ఒక అసాధారణ వ్యక్తిగా భావించి ఎంతో గౌరవాదరణలతో చూస్తూ ఉండేవారు. అందుచేతనే ఇసాక్ ఆమెకు తమ జాతి ఆడవాళ్ళకు సాధారణంగా ఉండే స్వేచ్ఛకంటె ఎక్కువ స్వేచ్ఛ ఇవ్వడం సంభవించింది. అంతేకాదు, తన యిష్టాన్ని తోసి పుచ్చియైనా ఆమె యిష్ట ప్రకారం నడచుకోడం అతడు అలవాటు చేసుకున్నాడు. ఐవాన్‌హోను బసకు చేర్పించే విషయంలో అతని ప్రవర్తనయే ఇందుకు తార్కాణం.

అత్యధికమైన రక్తస్రావంచే మూర్ఛితుడై పడిఉన్న ఐవాన్‌హో గాయాలకు రెబెకా జాగ్రత్తగా కట్లుకట్టి, జ్వరం గనుక రాకుండా ఉండే ప్రాణ

భయం లేదనీ, జ్వరం బహుశః రాగూడదనీ, మరునాడు నిరాక్షేపంగా యార్కు నగరానికి ప్రయాణం కావచ్చుననీ తండ్రితో చెప్పింది. ఈ మాటకు ఇసాక్ వెలవెలబోయాడు. ఐవాన్‌హోను ఆష్బీలోనే ఉంచి చికిత్సకు యేర్పాట్లుచేసి వెళ్ళిపోవాలని అతని అభిప్రాయం. కాని, రెబెకా అనేక కారణాలు చెప్పి ఆ ప్రతిపాదనను త్రోసిపుచ్చింది. ముఖ్యంగా, ఆమె చెప్పిన రెండు కారణాలను ఇసాక్ కాదనలేకపోయాడు. గాయాలకు రాసిన మందును గనుక ఇతరుల చేతి కిస్తే దాని అమూల్య రహస్యం బయటపడిపోతుందని ఆమె అన్నది. అదిన్నీ గాక, ఐవాన్‌హో అంటే రిచర్డు రాజుకు చాలా ఇష్టం. రిచర్డురాజు ఏపాక వేళ ఇంగ్లండుకు తిరిగివచ్చే పక్షంలో, అతని సోదరుడైన ప్రిన్సుజాన్ చేసిన తిరుగుబాటు ప్రయత్నాలకు ఇసాక్ ధనమిచ్చిన సంగతి బయటపడుతుంది, అట్టి సందర్భంలో ఇసాక్‌ను రిచర్డురాజు ఆగ్రహంనుండి కాపాడగలిగే యోధుని సాహాయ్యం అవసరమౌతుంది కనుక ఐవాన్‌హోను ఇప్పుడు విడనాడడం మంచిదికాదు.

'అవును రెబెకా, నీవన్నది అక్షరాలా నిజం'—అంటూ ఇసాక్ వెంటనే ఆమె చెప్పినట్లుగా ఐవాన్‌హోను తన వెంట తీసుకొనిపోవడానికి ఒప్పుకున్నాడు. బంగారు నాణేలను ఎంత భద్రంగా దాచాలో, వైద్యరహస్యాలను కూడ అంత భద్రంగానే దాచవలసిన విధి ఉన్నదన్నాడు. ఇక, రిచర్డురాజు దేశానికి తిరిగి వస్తే, ఐవాన్‌హో తనను కాపాడగలడని ఆశపడడం మాత్రమే కాదు, ఒకవేళ రిచర్డురాజు రాకపోయినప్పటికీ ఐవాన్‌హో తన ఋణం అట్టే పెట్టుకోడనీ, ఆరోగ్యం చేకూరగానే తన శౌర్యప్రకటనచే తిరిగి ధనం సంపాదించి, క్రిందటిరోజున యిచ్చినట్లుగానే తెచ్చియివ్వగలడనీ అతని ధైర్యం. రెండు వైపులాకూడ ఇది గిట్టుబాటు బేరంగానే తోచిందతనికి.

ఆ సాయంకాలానికిగాని ఐవాన్‌హోకు తెలివిరాలేదు. కొంతసేపటి వరకూ తాను ఏపరిస్థితిలో ఉన్నదీ అతనికి తెలియలేదు. మూర్ఛిల్లడానికి ముందు ఏమి జరిగిందో అతికష్టంమీద నెమ్మది నెమ్మదిగా అతనికి స్ఫురణకు రాసాగింది. తానిప్పుడొక మంచముమీద శయనించియున్నాడు. మంచానికి కట్టియున్న తెర తొలగించడానికి చెయ్యిచాచేసరికి గాయం బాధపెట్టింది. ఎలాగో తెరను కొంచెం ప్రక్కకు తొలగించి వెలుపలకు దృష్టి నిగిడ్చి చూశాడు.

ప్రాచ్య దేశీయ పద్ధతిని అలంకృతమైన గదిలో తానుండడం అతని కాశ్చర్యం కలిగించింది. గదిలో, కూర్చుండడానికి పరుపులేగాని కుర్చీలు లేవు. నిద్రలో ఎవరైనా తనను పాలస్తీనాకు చేర్చారా ఏమిటని అనుమానం కలిగిందతనికి. ప్రాచ్యదేశీయ పద్ధతిలోనే అలంకృతయైన ఒక స్త్రీమూర్తి అల్లనల్లన తనను సమీపిస్తూ ఉండడం చూచేసరికి అతని అనుమానం మరింత బల

పడింది. ఆ స్త్రీమూర్తి వెనుక, ప్రాచ్యదేశవాసిగా కనుపించిన ఒక బలిష్ఠుడైన నౌకరున్నాడు. ఐవాన్‌హో ఆ స్త్రీమూర్తిని పలకరించడానికి ప్రయత్నం చెయ్యబోగా, మాట్లాడవలదన్నట్లు ఆమె తన బింబాధరముపై తర్జని మోపి సంజ్ఞ చేసింది.

ఇంతలో, నౌకరు ఐవాన్‌హోను సమీపించి అతని పార్శ్వభాగం పైని గల వస్త్రం తొలగించాడు. కట్టిన కట్లు సరిగా ఉన్నవనీ, గాయం నయం కావడానికి అభ్యంతరం లేదనీ పరిశీలనమీద తెలుసుకొని ఆమె తృప్తిచెందింది. ఆ పరిశీలన చెయ్యడంలో ఆ సౌకుమార్యం, ఆ సరళత్వం, ఆ వినమ్రత, అపురూపమైన శోభను వెలార్చుకొన్నాయి. కేవలం ఒక లావణ్యవతి ఒక పురుషునికి సేవ చేస్తున్న దృశ్యంగా కనిపించలేదది. కరుణామయమైన ఒక దివ్యమూర్తి తన అమోఘశక్తిచే అతని సకల బాధలనూ ఉపశమింపజేసి మృత్యువును పారద్రోలుతున్నట్లుగా ఉంది.

రెబెకా హీబ్రూభాషలో నౌకరుకు చిన్న చిన్న మాటల్లో ఏమేమో ఆదేశించింది. అతడు అలవాటు చొప్పున ఆయాపనులన్నీ మారు మాటాడకుండ చేశాడు. రెబెకానోట హీబ్రూభాష తన పరుషత్వాన్ని విడనాడి, ఒక వింత మాధుర్యాన్ని సంతరించుకొంది. ఎవరో దేవత తన ముంగిట నిలబడి, ముగ్ధమనోహరంగా మంత్రాలేవో ఉచ్చరిస్తున్నట్లు ఐవాన్‌హోకు తోచింది. అర్థం తెలియకపోయినా ఉచ్చారణ విశేషంచేతనే ఆ మంత్రాలు హృదయాన్ని స్పృశించి సేద తేరుస్తున్నట్లుగా ఉన్నాయి. అందుచే, తిరిగి ఎట్టి ప్రశ్నలూ వేయడానికి ప్రయత్నించకుండానే, ఐవాన్‌హో ఆ మంత్రప్రభావం తనమీద సావకాశంగా పనిచేయనిస్తూ మౌనంగా అలా ఉండిపోయాడు. ఆపని అంతా పూర్తియై, ఆమె అచటినుండి వెడలిపోవడానికి ఉద్యుక్తురాలవుతున్న సమయంలో, ఇక అతనికి మనస్సు ఆగలేదు. అరబ్బీ భాషలో ఆమెను ఈ రీతిగా పలకరించబోయాడు: 'అమ్మాయీ, ఒకచిన్న సంగతి అడుగుతాను. దయచేసి...'

రెబెకా అతని మాటకు మధ్యలోనే అడ్డం వచ్చింది. విచారముద్రితమైన ఆమె ముఖమండలంపై ఒక సన్నని దరహాసరేఖ మెరసినట్లయింది. 'అరబ్బీ భాషతో పనిలేదు వీరాగ్రేసరా! మా పూర్వీకులు పరాయి దేశీయులేయైనా నేను ఇంగ్లాండుకు చెందిన దాననే, ఇంగ్లీషు మాట్లాడగలను'—అని ఆమె జవాబు చెప్పింది.

'నీవు చాలా గొప్పయింటి బిడ్డవై ఉండాలి'— అంటూ ఐవాన్‌హో మరల సంభాషణ ప్రారంభించాడు. రెబెకా తిరిగి అతనిమాటకడ్డంవచ్చి ఇలా అంది: 'లేదు,—అలాంటిదేమీ మీరనుకోవద్దు. నేనొక అల్పురాలను,

మా జాతి యూదుజాతి, ఇటీవల మీరు రక్షించి కాపాడిన ఇసాక్ నా తండ్రి. మీరు ప్రస్తుతమున్న పరిస్థితిలో, మీకు పరిచర్య చేయడం మా విధ్యుక్తధర్మం."

రెబెకా సౌందర్యాన్ని ఐవాన్‌హో ఇంతసేపూ ఏమెట్టి భావబంధురమైన దృష్టితో వీక్షిస్తూవచ్చాడో ఆ లక్షణం రోవెనాసుందరి గమనించి ఉంటే సంతోషించియుండేదని చెప్పడానికి వీలులేదు. ఆ సుందరమైన గాత్రయష్టి, ఆ మనోజ్ఞమైన ముఖరేఖలు, ఆ తేజోవంతమైన కన్నులు, ఇతని దృష్టిని అతనికి తెలియకుండానే కొల్లగొట్టుకొనిపోయినట్లయింది. దట్టమైనట్టి పక్ష్మశ్రేణుల నీడలను దాటుకుంటూ వచ్చే ఆ నేత్రద్యుతులు మల్లెపూలరించినట్లుగా ప్రకాశించే సంజచుక్క సోయగమును తలపింపజేస్తూ ఉండె. కాని, ఐవాన్‌హో అచ్చమైన కేథలిక్ మతావలంబి. రెబెకా పట్ల మనసులో అతనికి కలిగిన ఆ భావబంధురత దీర్ఘకాలం నిలువడం అసంభవం. ఇది ఊహించియే రెబెకా తన తండ్రి పేరు, తన జాతిపేరు అతనికి తెలియజేసే ప్రయత్నానికి వేగిరపడింది. అయినా స్త్రీ సహజమైన దౌర్బల్యపు సాక్ష్యం కొంచెం ఆమెను స్పృశించకుండా వదల లేదు. తాను యూదుకన్నెనని తెలుసుకొన్న తర్వాత అతని చూపులో వచ్చిన మార్పును ఆమె లోలోపల ఒక సన్నని నిట్టూర్పు విడువకుండ ఉండజాలక పోయింది. అంతకు పూర్వం అతను చూపిన చూపులో, మాధుర్యంతో మిళితమైన సౌందర్యమూర్ధత్వం తొంగిచూచింది. తర్వాత చూపిన చూపులో అది కేవలం కృతజ్ఞతాభావ సూచకమైన మృదుత్వం మాత్రమే ఉంది. మొదట చూచిన చూపులోనైనా, యువక సహజమైన సౌందర్యమూర్ధత్వం తప్ప అంతకంటె విశేషార్థం స్ఫురించే లక్షణమేమీ లేనిమాట నిజం. అయినప్పటికీ తాను పలికిన ఒక్క మాటతో, ఆ సౌందర్యమూర్ధత్వానికి కూడ తన మనస్సులో అతను చోటీయకపోవడం ఆమెకు బాధకలిగించింది. అతనివలన ఆ మాత్రపు ఉపాయనమైనా గ్రహించే అధికారం తనకు లేదా?

అయినప్పటికీ, స్వభావతః సాధుశీలమైన రెబెకా, ఐవాన్‌హోను మనసులో ఏ విధముగానూ నిందించలేదు. ఆ కాలంలో యూదులంటే క్రైస్తవులకు సామాన్యంగా ఉండే వైముఖ్యమే అతనుకూడ కనబరిచాడు, అంతే! అవసరమైనంత మేరకే తప్ప అంతకు మించి యూదులతో ప్రసక్తి పెట్టుకోవడం గౌరవహీనంగా భావించబడేది. దాదాపు అలాంటి భావానికే ఐవాన్‌హో ఇప్పుడు లోనైనట్లు ఆమె గ్రహించినా, అతనికి పరిచర్య చేయడంలో తన పూర్వపు శ్రద్ధాసక్తుల నేమాత్రమూ సడలించలేదు. యార్కు నగరానికి తీసుకొని వెళ్ళబోతున్నామనీ, అక్కడ తమ ఇంట్లో అతనికి ఆరోగ్యం కలిగే పర్యంతమూ అట్టేపుంచి చికిత్స చేయించుటకు తన తండ్రి నిశ్చయించాడనీ ఆమె తెలియజేసింది.

ఈ యేర్పాటు ఐవాన్‌హోకు నచ్చలేదు. 'మీకింకా శ్రమకలిగించడం నాకిష్టంలే'దనే కారణం చెప్పి, తన ప్రతికూల భావాన్ని వ్యక్తపరిచాడు. కొంతకాలం పాటు తనను ఆదరించగల సాగ్జన్ కుటుంబం గాని, కాన్వెంటు గాని, దగ్గరలో ఏదీ లేదాయని అడిగాడు. కనీసం, సెంటు విట్‌హోల్డు కాన్వెంటుకైనా తనను చేర్చవలసిందని అర్థించాడు.

రెబెకా, విచార ముద్రితమైన చిరునవ్వు పెదవిపై ద్యోతకం కాగా యిలా సమాధానం చెప్పింది: 'నిజమే,— ఎల్లరిచేతా అసహ్యించుకోబడే యూదీయుని గృహాంకంటె, యిప్పుడు మీరు పేర్కొన్న స్థలాలే మీకు ఆశ్రయమివ్వదగిన స్థలాలనుటకు సందేహంలేదు. కాని, మీరు వేరొకచోటికి పోదలచుకుంటే, వైద్యుణ్ణి సైతం మార్చుకోవాలి. మా జాతికి వైద్యం తెలుసుననే సంగతి మీ రెరుగనిది కాదు. మనుష్యులను గాయపరచడం మా వృత్తి కాదుగాని, గాయాలను మాన్పగలం. ముఖ్యంగా, సోలమన్ చక్రవర్తి నాటి నుంచీ వంశపారంపర్యంగా వైద్యరహస్యాలు అందిపుచ్చుకుంటూ వచ్చిన కుటుంబం మాది. మా వైద్యపద్ధతి యెటువంటి గుణం యివ్వగలిగి ఉన్నదో మీ రిప్పుడు అనుభవంద్వారా కొంతవరకు తెలుసుకునే ఉన్నారు. ప్రస్తుతం, ఈ నాల్గు సముద్రాలమధ్యా, ఈ బ్రిటనులో, ఏ క్రైస్తవ వైద్యుడూ కూడ,— క్షమించాలి యిలా అంటున్నందుకు,— నెలరోజుల లోపున మీకు తిరిగి కవచం ధరించగల శక్తికలిగేటట్లు చేయలేడు.'

'అంతకంటె తక్కువకాలంలో ఆ శక్తి నాకు వచ్చేటట్లు నీవు చెయ్యగలవా? ఎంతకాలంలో?'— అని అడిగాడు ఐవాన్‌హో.

'ఓపికపట్టి నా నిర్దేశాల ప్రకారం నడచుకొంటే, ఎనిమిదిరోజుల్లో కలుగజేయగలను'— అన్నది రెబెకా.

'మంచిది. అయితే నీ దగ్గిరే చికిత్స పొందుతాను. నీ వాగ్దానం నీవు చెల్లించుకో గలిగేటట్లయితే, నా శిరస్త్రాణం నిండేటన్ని వెండి జెంపారీలు నీకు బహూకరిస్తాను, నేను సంపాదించినదే తడవుగా!' అన్నాడు ఐవాన్‌హో.

'జెంపారీల కంటె, ఒక చిన్నవరం నాకు ప్రసాదిస్తే మీరు కోరినట్లు నా వాగ్దానం చెల్లించుకోగలను'— అన్నది రెబెకా.

'ఏమిటావరం? అచ్చమైన క్రైస్తవయోధుడు మీ జాతివారికి యివ్వదగిన వరం ఏదికోరినా సరే, సంతోషపూర్వకంగా, కృతజ్ఞతాపూర్వకంగా ఇస్తాను. ఏమిటది?'— అని అడిగాడు ఐవాన్‌హో.

'యూదులనూ క్రైస్తవులనూ గూడ సృష్టి చేసినవాడు ఒకడే భగవంతుడు. అట్టి భగవంతుని అనుగ్రహం తప్ప యితరమేమీ కోరకుండా, యూదులు

కూడ క్రైస్తవులకు చక్కని సేవచేయగలరనేది ఇకమీదటనుంచి విశ్వసించాలని మిమ్మల్ని కోరుతున్నాను. అదే మీరు నాకు ప్రసాదించగల వరం'— అన్నది రెబెకా.

'ఆ విషయంలో నీకేమీ సందేహమక్కరలేదు. నీ సేవను సందేహించడం పాపమవుతుంది. నీపై పూర్ణవిశ్వాసముంచుతున్నాను. ఎనిమిదవ రోజుకు నేను తిరిగి కవచం ధరించేటట్లు చేయగలవని ఆశిస్తున్నాను. అది అలా ఉండనీ. నిన్ను కొన్ని సంగతులడగాలని ఉంది. సెడ్రిక్ ది సాక్సన్ కుటుంబానికి సంబంధించిన వార్తలేమైన నీకు తెలుసునా? ఆ సాక్సన్ సుందరి... అదే...అదే...'—రొవీనా పేరు ఆ యూదుగృహంలో ఉచ్చరించడం అతనికి ఇష్టం లేనట్లుగా తోచింది,— 'అదే... మొన్న పోటీలో అందాలరాణిగా ఎన్నుకోబడిన సుందరాంగి,— ఆమెను గూర్చినవార్త నీకేమైన తెలుసునా?'— అన్నాడు ఐవాన్‌హో.

'అవును—అందాలరాణిగా—ఎవరిచేతనో కాదు మీ చేతనే స్వయంగా ఎన్నుకోబడిన సుందరాంగి. మీరు యోధాగ్రేసరులే కాక, సౌందర్య రసగ్రాహణ పారీణులని కూడా మిమ్మల్ని ఆ ఎన్నికవలన లోకం ప్రశంసించింది'— అని ఉటంకించింది రెబెకా. రొవీనాయెడ తన అభిలాషను దాచుకోయి బయట పడ్డందుకు ఐవాన్‌హో చెక్కిళ్లు— అంత పాలిపోయిన స్థితిలో కూడ— దబ్బున కెంపు తిరిగాయి.

'ఆమెసంగతి సరేలావున్నా, ప్రిన్సుజాన్‌నుగూర్చిన వార్తలు నీకేమైన తెలుసునా? నా తాలూకు నౌకరొకడు ఉండాలి, అతడు ఏమైనాడు? ఇక్కడ కనిపించడేందుచేత?'—అని అతడు తిరిగి ప్రశ్నించాడు.

'నామాటవిని, మీరాట్టే మాట్లాడకండి. మీరు కోరినదంతా నేను చెపుతాను. ఆదుర్దాపడకుండా వినండి. పోటీ ప్రదర్శనాలను ముగించివేసి ప్రిన్సుజాన్ తన పార్టీకిచెందిన సామంతులు, యోధులు, మతాధికారులు మున్నగువారితో యార్కు నగరానికి హుటాహుటిగా వెళ్ళినట్లు తెలుస్తోంది. వెళ్లేటప్పుడు, దేశంలోని పెద్ద పెద్ద ధనవంతులవద్దనుంచి నయానా భయానా డబ్బుగుంజుకొని మరీ వెళ్ళినాడు. సోదరుని రాజ్యం హరించడానికి అతడు కుట్ర పన్నుతున్నాడని వదంతి'— అన్నది రెబెకా.

ఐవాన్‌హో ఆవేదనతో పక్కమీదనుంచి తటాలున పైకిలేచి, 'అది ఎన్నటికీ సాగదు,— నాకంఠంలో ప్రాణం ఉండగా సాగనివ్వను. రిచర్డే దేశానికి న్యాయమైనరాజు. ఆయన కొరకు నేను పోరాడి తీరుతాను'— అని ఉద్ఘాటించాడు.

రెబెకా మెల్లగా అతని భుజముపై చేయివేసి నారిస్తూ— 'మీ రంతటి వారే కావచ్చు. కాని, యాత్రికుని వద్దలో మీరు విన్న సంగతి మరచిపోకండి. అధికంగా మాట్లాడవద్దు'— అని హెచ్చరించింది.

'అలాగే మాట్లాడను గాని,— సెడ్రిక్ కుటుంబం కబురు ఏమైనా తెలిసిందా?'— అని అడిగాడు ఐవాన్‌హో.

'ఆయన ముఖ్యపరిచారకుడు విపుకునుంచి ఆకస్మికంగా మా నాన్నగారివద్దకు పరుగెత్తుకొనివచ్చి, సెడ్రిక్ గారిలమందు ఉన్న హామీపై డబ్బు కావాలని అడిగాడు. ఆ సమయంలో అతనిని నే నడిగితే చెప్పాడు. సెడ్రిక్, ఎథెల్‌స్టేనులు చాల చిరాకుతో ప్రిన్స్‌జాన్ విందునుండి లేచివచ్చేసి ఇంటికి ప్రయాణమయ్యే ప్రయత్నంలో ఉన్నారట'— అని చెప్పింది రెబెకా.

'విందుకు వారితో పాటుగా ఎవరైనా ఆడవాళ్ళుకూడా వెళ్ళారా'— అని తిరిగి ప్రశ్నించాడు ఐవాన్‌హో.

రెబెకా ఆ ప్రశ్నకు కూటిగా ఇలా సమాధానం చెప్పింది: 'లేడీ రొవేనా ఆ విందుకు వెళ్ళలేదట! ఆమెకూడా సెడ్రిక్‌తోసహా ఇప్పుడు రోథరు వుడ్డుకు పయనమయిందని తెలిసివచ్చింది. ఇక, విశ్వాసపాత్రుడైన మీ సేవకుడు గర్త్ సంగతి'— అని రెబెకా ఏమో చెప్పబోతుంది. ఐవాన్‌హో,— 'ఆఁ! అతని పేరు నీకు తెలుసునా? — అవును, నీకు తెలియడానికి వీలుంది. నీ వేకదా నిన్నటిరోజున, ఉదారబుద్ధితో, వానికి నూరు జెకిన్ నాణెములు నాకొరకు ఇచ్చి పంపినది'— అన్నాడు, తనను తానే తిరిగి సమాధానపరచుకొంటూ.

రెబెకా ఇంచుక లజ్జితయై— 'ఆ మాట ఎత్తబోకండి. హృదయం దాచగోరినది నాలుక ఒకొక్కప్పుడు తలవని తలంపుగా బయటపెట్టేస్తూ ఉంటుంది'— అని వాక్రుచ్చింది.

'ఈ నూరు జెకిన్లూ మీ తండ్రికి నేను తిరిగి చెల్లించివేయడమే గౌరవప్రదముగా భావిస్తున్నాను'— అన్నాడు ఐవాన్‌హో.

'చెల్లించాలని ఉంటే అలాగే చెల్లిద్దురుగాని. ఈ ఎనిమిది రోజులూ కానివ్వండి. ప్రస్తుతం మీ ఆరోగ్యానికి భంగకరమయ్యే ఆలోచనలేమీ పెట్టుకోవద్దు'— అని ప్రార్థించింది రెబెకా.

'అవునవును. కృతజ్ఞతమాలి నీ ఆజ్ఞలను ఉల్లంఘిస్తున్నాను. గర్త్ విషయం ఏమయిందో చెప్పివేదూ, ఇక నిన్ను యెట్టి ప్రశ్నలూ అడగను'— అన్నాడు ఐవాన్‌హో.

'అతడు సెడ్రిక్ ఆజ్ఞచే బంధింపబడ్డాడు'— అని రెబెకా చెప్పేసరికి, ఐవాన్‌హో ఆందోళిత మనస్కుడయ్యాడు. అంతట ఆమె వెంటనే ఇలా

అతని మనస్సును సమాధాన పరచింది: 'అయితే, క్రొత్త తప్పులేవీ చెయ్యకుండా ఉంటే, సెడ్రిక్ అతని యీ తప్పిదాన్ని తప్పక మన్నించగలడని ఆస్వాల్డు చెప్పాడు. తన కుమారుని యెడ ప్రేమకొద్దీ అతను చేసిన యీ తప్పిదాన్ని సెడ్రిక్ మన్నించకుండా ఉండలేడన్నాడు. ఒకవేళ సెడ్రిక్‌కు అతనిపై కోపం తగ్గకపోతే, త్రోవలో తప్పించుకొని పారిపోవలసిందిగా ఆస్వాల్డు ప్రభృతులు గర్తుకు హెచ్చరిక చేసి ఉంచారట.'

'వారి ఆశయం ఫలించాలని మనసార కోరుతున్నాను. నా దురదృష్టమేమో, నాపై ప్రేమ చూపినవారందరికీ ఆపదలే వస్తున్నాయి. నన్ను ఆదరించిన ప్రభువుకై ఆయన సోదరుడే అత్యంత కృతఘ్నుడై తిరుగుబాటు చేశాడు. నా ప్రేమకు పాత్రమైన కాంతామణి ఒక సౌందర్యరాశి, పెక్కు అనుకోని బాధలకు లోనై చిక్కులపాలవుతోంది. నా యెడ భక్తివిశ్వాసాలు చూపిన తప్పిదానికి ఇప్పుడీ నిర్భాగ్యుణ్ణి నా తండ్రే చంపివేసేటట్లున్నాడు. చూశావా, ఎలాంటి దురదృష్టవంతునికి నీవు తోడ్పడగోరుతున్నావో! నా మాట విని, నన్ను పోనీ! లేకపోతే, నా దురదృష్టం నిన్ను గూడ చుట్టుకుంటుందేమో!' అని విచారం ప్రకటించాడు ఐవాన్‌హో.

రెబెకా అతనికి ధైర్యం చెప్పగోరి యిలా అంది: 'అధైర్యంకొద్దీ, దైవ సంకల్పాన్ని మీరు అన్యథా భావిస్తున్నారు. మీ మాతృదేశానికి మీ వంటి యోధవరుని అండదండలు అత్యవసరంగా కావలసివున్న సమయానికి మీరు తిరిగి దేశం చేరుకోగలిగారు. మీకూ మీ రాజుకూ శత్రువులైన దుండగుల దర్పోద్ధతిని మీ విక్రమస్ఫూర్తిచే అణచివేయగలిగారు. ప్రాణగండమైన గాయాలు తగిలి అపాయంలో ఉన్న స్థితిలో, మీ చేత ద్వేషింపబడే జాతిలోంచే మీకు వైద్య సాహాయ్యం అందుతోంది. ఇదంతా దైవసాహాయ్యంగా కనుపించడం లేదా? ధైర్యం తెచ్చుకోండి. మీ చేత ఒక అద్భుతకార్యం చేయించడానికే భగవంతుడు మిమ్మల్ని ఇలా నిలిపాడని విశ్వసించండి. సెలవు. మీకిప్పుడొక మందు పంపిస్తాను. అది వేసుకొని విశ్రాంతి తీసుకోండి. రేపటి ప్రయాణపు బడలికను తట్టుకోగలశక్తి మీకు చేకూరుతుంది.'

ఐవాన్‌హోకు ఈ హేతువాదం బాగా నచ్చింది. ఆమె చెప్పిన ప్రకారం మందు వేసుకొని నిశ్చింతగా పడుకున్నాడు. అది నిద్రపట్టించే మందు. రాత్రి అతనికి బాగా నిద్రపట్టింది. ఉదయం రెబెకా వచ్చి పరీక్షించి చూడగా, జ్వరమేమీ రాలేదు. ప్రయాణపు బడలికను నిరాక్షేపంగా తట్టుకోగలడని ఆమె నిర్ధారణ చేసింది.

గుర్రాలు పూన్చిన డోలీలో, కుదుపులేకుండా ప్రయాణం సాగేటట్లు రెబెకా ఏర్పాట్లు చేయించింది. కాని, ప్రయాణం నెమ్మది నెమ్మదిగా సాగాల

ఆమె కోర్కెను ఇసాక్ లక్ష్యపెట్టలేదు. బందిపోట్లవలని భయంకొద్దీ, ఎక్కడా కూడ ఎక్కువసేపు విశ్రాంతి తీసుకోనివ్వకుండా అందరినీ ఉరుకులూ, పరుగులూ పెట్టించాడు. అందుచేతనే, సెడ్రిక్ ఎథెల్‌స్టేనులకంటె ఆలస్యంగా బయలుదేరిన వీరిజట్టు, సెంటు విట్‌హోల్డు కాన్వెంటులో వారు విందు కుడుస్తున్న సమయంలో వారినిదాటి ముందుకు సాగిపోయింది. కాని, యీ తొందర ప్రయాణం ఇసాక్ కిరాయికి మాట్లాడి వెంటతెచ్చుకొన్న రక్షణ సిబ్బందికి నచ్చలేదు. ప్రయాణం తాపీగా సాగుతుందనీ, త్రోవలో బాగా తిని త్రాగవచ్చనీ వారాశించారు. కాని, ఇసాక్ వారిని సరిగా తిననివ్వలేదు, త్రాగనివ్వలేదు. ఉభయులమధ్యా కీచులాటలు సాగిసాగి, తుదకు ఆపత్సమయంలో ఆ సిబ్బందిచేత పరిత్యక్తుడై ఇసాక్ తన స్వల్పపరివారంతో ఒంటరిగా నట్టడవిలో చిక్కుకొనిపోవలసి వచ్చింది. అయితే, రెబెకా మందుప్రభావం వల్లనో, ఐవాన్‌హో పిండపుష్టివల్లనో, యింత ఒడుదొడుకు ప్రయాణంలోనూ అతనికి మాత్రం ఎలాంటి నిస్త్రాణా కలగలేదు. ఈ పరిస్థితిలోనే సెడ్రిక్ ఎథెల్‌స్టేనులు వారిని వచ్చి కలుసుకోడం, వెన్వెంటనే డీబ్రేసీబృందంచేతిలో అందరూ పట్టుబడడం, సంభవించింది. చదువరులకు ఈ విషయమంతా సువిదితమే.

ఈ దొమ్మీకూడావ్యవడిలో ఐవాన్‌హో పడుండియున్న డోలీసంగతి మొదట ఎవ్వరూ గమనించలేదు. కుతూహలంకొద్దీ డీబ్రేసీయే కొంతసేపటికి డోలీలోనికి తొంగిచూచాడు. అందులో, తాను కాంక్షించే రొవెనాసుందరి ఉన్నదేమోనని అతని ఆశ. అప్పటికి రొవెనా ముసుగులో ఉన్నందువల్ల, ఈ డోలీలో ఉండి ఉంటుందేమోనని అతడనుకున్నాడు. కాని, తీరా చూచేసరికి అందులో ఉన్నది ఐవాన్‌హో! తమ్ము అనురోధించినది ఆ అడవిలోని సాగ్జన్ బందిపోటు దొంగలై ఉంటారని ఐవాన్‌హో తలపోసి, వారివలన తనకుగాని తన మిత్రులకుగాని ఎట్టిప్రమాదమూ ఉండకపోగా రక్షణకూడా కలుగుతుందనే అభిప్రాయంతో, తనపేరు దాచకుండా చెప్పివేశాడు. ఎంత వెర్రిమొర్రి ఆలోచనలుగలవాడైనా డీబ్రేసీకి వీరపురుషోచితమైన ఉదారభావాలుకూడా కొన్ని ఉన్నాయి. నిస్సహాయస్థితిలో ఉన్న ఐవాన్‌హోకు అపకారం చెయ్యడానికి అతని మనసొప్పలేదు. అందుచేతనే ఫ్రాంట్‌డీబాఫ్‌కుకూడా ఈ సంగతి తెలియనివ్వకుండా దాచాడు. ఫ్రాంట్ డీబాఫ్‌కే గనుక తెలిసివుంటే, ఐవాన్‌హోను నిస్సంకోచంగా చంపివేసి ఐవాన్‌హో యెస్టేటు సంపాదనలో తనకు పోటీలేకుండా చేసుకొనియుండేవాడు. అయితే, నిస్సహాయస్థితిలో ఐవాన్‌హోను చంపనొల్లని డీబ్రేసీ ఔదార్యం అంతటితోనే ఆగిపోయింది. చంపనొల్లకపోయినా, విడిచిపెట్టడానికి మాత్రం అతడు సిద్ధంగాలేడు. తాను పెండ్లాడగోరే రొవెనా ఐవాన్‌హోను వలచినదన్న సంగతి అతనికి తెలుసు. చూస్తూ

చూస్తూ అలాంటి పోటీదారును యెలా విడిచిపుచ్చగలరు? అందుచే ఉద్రే మార్గ మవలంబించి, ఐవాన్‌హో డోలీకి ఇద్దరు సొంత నౌకర్లను కాపుంచి, ఇతరులెవ్వరినీ డోలీదగ్గరకు రానివ్వకుండా కట్టుదిట్టంచేశారు. ఎవరైనా అడిగితే, అది లేడీరొవెనా తాలూకు డోలీ అనీ, ఈ దొమ్మీ సందర్భంలో గాయపడ్డ మిత్రుడొకడు ప్రస్తుతం డోలీలో ఉన్నాడనీ చెప్పుతున్నారు.

టార్క్విల్‌స్టన్ కోటకు చేరినతర్వాత డీబ్రేసీ నౌకర్లు ఆ డోలీని నెమ్మదిగా దూరంగా ఉన్న ఒక గదికి చేర్చారు. ఎల్లరినీ యుద్ధరక్షణకు బయటికి రావలసిందిగా హెచ్చరిక చేస్తూ శృంగధ్వని వినవచ్చినప్పటికీ కూడ, ఈ నౌకర్లు అక్కడనుండి కదలకపోవడం ఫ్రాంట్ డీబాఫ్ కంటబడింది. ఇంకా అక్కడే ఉన్నారేమని అదలించాడు. గాయపడి ప్రాణాపాయస్థితిలో ఉన్న ఒక మిత్రునికి పరిచర్యకోసం నిలిచామని, యిది తమ నాయకుడైన డీబ్రేసీ ఆజ్ఞయనీ, డీబ్రేసీకి తమపై ఆగ్రహం కలగకుండేటట్లు హామీపడేటట్లయితే తాము బయట చేరి రావడానికి సిద్ధమేనని వారు చెప్పుతున్నారు.

ఫ్రాంట్ డీబాఫ్ మండిపడి,—'ప్రాణాపాయస్థితిలో లేనివాళ్ళెవరు? గట్టిగా నిలిచిపోరాడకపోతే మనమంతా కూడా ప్రాణాపాయస్థితిలోనే పడతాం. వెధవలారా, పోండి యిక్కణ్ణుంచి! ఆయుధాలు పుచ్చుకొని పరుగెత్తండి. ఇక్కడ పరిచర్యసంగతి యింకెవరైనా చూస్తారు! ఉర్‌ఫ్రీడ్! ఓ ఉర్‌ఫ్రీడ్! యెక్కడ చచ్చావు! యిలారా! ఇక్కడ ఒక గాయపడ్డ మనిషి ఉన్నాడు గాని, వీడికి జాగ్రత్తగా పరిచర్యచెయ్యి! తెలిసిందా? వెధవల్లారా, యింక మీరు యిక్కడ ఒక క్షణం నిలవడానికి ఒప్పుకోను, చీల్చేస్తాను. పదండి!'—అని ఆ కోటంతా మారుమ్రోగేటట్లు బొబ్బలుపెట్టి వెళ్ళిపోయాడు.

ఐవాన్‌హోకు పరిచర్యచేసేపని యీ రీతిగా ఉర్‌ఫ్రీడ్‌కు అప్పగించ బడింది. పూర్వస్మృతులతో ఉడుకెత్తిపోతూ ఫ్రాంట్ డీబాఫ్‌పై పగ సాధించుకోడం యెలాగా అని తహతహ చెందుతున్న ఉర్‌ఫ్రీడ్, ఆ పనిని [illegible] అప్పగించింది.

# అధ్యాయం ౩౦

ఆపత్సమయాలలో అనురాగరసం బట్టబయలుగా వెల్లుబుకుతూ ఉండడం సాధారణంగా చూస్తూ ఉంటాం. ఇతర సమయాల్లో ఏ భావతీవ్రతలను పైకి పొక్కనీయకుండా నిగ్రహించడానికి తంటాలుపడుతూ ఉంటామో, అవి ఆపత్సమయంలో ఇట్టే బయటపడిపోతూ ఉంటాయి. రెబెకా విషయంలో సరిగా ఇదే జరిగింది. ఎప్పుడు ఏ ప్రమాదం ముంచుకొని వస్తుందోనన్న పరిస్థితిలో తాను తిరిగి ఐవాన్‌హో చెంతకు చేరగలిగినందువల్ల ఆమెకు కలిగిన సంతోషం ఇంతా అంతా కాదు. ఆమె సంతోషం ఆమెకే ఆశ్చర్యం కలిగించింది. నాడి పరీక్ష చేసేటప్పుడు ఆ కరస్పర్శలో గాని, ఒంట్లో ఎలా ఉన్నదని పలుకరించేటప్పుడు ఆ కంఠస్వరంలో గాని, ఉట్టిపడిన ఒక సౌకుమార్యం ఆమె అంతఃప్రీతిని తెలవనితలంపుగా బట్టబయలొనరించినట్లయింది. ఇతర సమయాల్లోనైతే దానినా రీతిగా ఆమె బయటపడనిచ్చి ఉండేది కాదు. చేయి వణికింది. గొంతు డగ్గుత్తిక చెందింది. మనసు మనసులో లేదు. ఇంతలో, 'నీవేనా?'—అని సామాన్య ధోరణిలో ఐవాన్‌హో వేసిన ప్రశ్నతో, ఆమెకు ఒడలు తెలిసినట్లయింది. తనలో ఏ భావోన్మీలనం కలిగిందో, అది అతనిలో కలుగడానికి ఆస్కారం లేదనే సంగతి గుర్తుకు వచ్చి, సన్నగా వినబడీ వినబడనట్లొక నిట్టూర్పు విడిచింది. ఇక తరువాత ఆమె అడిగిన ప్రశ్నలలో, మామూలు స్నేహభావం తప్ప మరేదీ ప్రకటన కాలేదు. ఆమె ప్రశ్నలకు సమాధానంగా ఐవాన్‌హో, తనకు ఒంట్లో తేలిగ్గానే ఉన్నదని చెపుతూ,—'ప్రియకరమైన నీ చేతుల చలువ ఇది రెబెకా! నీకెంతైనా కృతజ్ఞుడను'— అని వక్కాణించాడు.

'ప్రియతమమైన' అనే మాట రెబెకాకు ఎలాగో ఉంది. ఆ మాటకు తగిన ఆప్యాయత అతని కంఠంలో ఆమెకు ద్యోతకం కాలేదు, 'ఎవరికీ ఇచ్చకపు మాట? నిజంగా నేను తనకు ప్రియతమురాలినేనా? కాను. నాకంటె ప్రియతమమైనవి అతనికి చాలా ఉన్నాయి. తన భద్రాశ్వం, తన జాగిలం కంటె నేను ఎక్కువ ప్రియతమురాలను కాను'—అనుకున్నదామె లోలోపల.

'శారీరకమైన బాధల కేమిగాని, మనస్సు చాలా ఆందోళనగా ఉండి పరిపరివిధాల బాధపడుతోంది సుందరీ! ఇంతకు పూర్వం కావలివాళ్ళు ఇచట మాట్లాడిన మాటలను బట్టి చూస్తే, నేనిప్పుడొక ఖైదీనని స్పష్టమౌతోంది— వాళ్లను ఏదో యుద్ధకార్యానికి తరిమిన ఆ కర్కశ కంఠధ్వని రెజినాల్డ్ ఫ్రాంట్ డీబాఫ్‌దై ఉండాలి. నేనిప్పుడున్నది అతని కోటలో నన్నమాట. ఇప్పుడు విముక్తికి ఏమిటి ఉపాయం? రొవీనా, మా నాన్నగారిని ఎలా కాపాడం?' —అని అతడు తన ఆందోళన వ్యక్తపరిచాడు.

రోవెనా సంగతీ, సెడ్రిక్ సంగతీ తలపోశాడే కాని, తనసంగతి అతడు ఎత్తలేదుగదా యని రెబెకా మనస్సు చివుక్కుమంది. 'అవును, మమ్మల్ని గూర్చి అతడు తలపోయడానికి మేమెవరం? భగవంతుడు నాకు తగిన శాస్తి చేశాడు. ఎందుకు చోటివ్వాలి నా మనస్సులో ఈ యోధునికి నేను?'— అని తనకు తానే లోలోపల నిందించుకొని, ఇదంతా బయటికేమీ తెలియనివ్వకుండానే, తనకు తెలిసిన వృత్తాంతం ముక్తసరిగా అతనికి తెలియజేసింది. కోటను ఇప్పుడు ఎవరో బయటినుండి ముట్టడించారనీ, వాళ్ళెవరైనదీ తెలియలేదనీ, ఒక క్రైస్తవ ఫాదరీ ఇంతకుముందే లోపలికి వచ్చినట్లు తెలిసిందనీ, అతని కేమైన కొంత భోగట్టా తెలియవచ్చునేమోననీ ఆమె చెప్పేసరికి, ఆ క్రైస్తవ ఫాదరీని ఎలాగైనా తనవద్దకు తీసుకురమ్మని అతడామె నభ్యర్థించాడు. కాని, ఉర్ ఫ్రీడ్ మూలంగా ఆ ప్రయత్నం ఎలా సాగిరాలేదో మనం ఇదివరకే చూచి ఉన్నాం.

ఈ సంగతి అంతా రెబెకా ఐవాన్ హోకు తెలియజేసిన కొంచెము సేపటిలోనే, కోటలో రణకోలాహలం పదిరెట్లు అధికమై వారికి వినిపించింది. సైనికుల పదఘట్టనలు, ఆయుధముల రాపిడులు, నాయకుల హెచ్చరికలు, అనుయాయుల నినాదములు,— అన్నీ కలగాపులగమై, వాటి ప్రతిధ్వనులతో సహితంగా ఒక భయంకరమైన సన్నివేశాన్ని కల్పించాయి. కాని, ఆ భయంకరత్వంలోనే ఒక విధమైన ఉదాత్తతకూడా మిళితమై ఉన్నట్లు రెబెకాకు అనిపించింది. భయముచే చెక్కిళ్లు పాలిపోయినట్లు కనుపించినా, ఉత్సాహంలో కన్నులు దీప్తిమంతములై మెరిశాయి. యూదు మతగ్రంథంనుండి వీర రసపూరితములైన కొన్ని వాక్యాలను ఐవాన్ హోకు వినిపించేటట్లుగానే తనలో తాను ఉచ్చరించుకొన సాగింది. ఈ ఆత్యవసరసమయంలో తానేమీ చెయ్యలేని పరిస్థితిలో ఉండిపోవలసివచ్చినదే యని మథనపడ్డాడు ఐవాన్ హో. యుద్ధం ఎలా జరుగుతోందో ఆ కిటికీవద్ద నిలబడి చూచే తాహతైన లేకపోయిందిగదా యని వాపోయాడు. కనీసం ఒక బాణం వదలడానికిగాని, అదను చూచి ఒక గొడ్డలిపెట్టు పెట్టడానికిగాని, చేతిలో ఆయుధాలేమీ లేకపోయినవిగదా యని విలపించాడు. ఎట్టి పనికిమాలిన బ్రతుకని తనను తానే నిందించుకొన మొదలుపెట్టాడు.

'చింతించకండి- అదుగో, ఆ కోలాహలధ్వని అకస్మికంగా నిలిచిపోయింది, ఇక యుద్ధం జరగదేమో'—అన్నది రెబెకా.

'నీకు తెలియదు. అది యుద్ధం ఆగిపోతుందనడానికి సూచనకాదు. సైనికులంతా ప్రాకారంపై ఎవరిస్థానాల్లో వారు నిలబడి శత్రువులతాకిడి కెదురు చూస్తున్నారన్నమాట. ఈ నిశ్శబ్దత ఎంతోసేపుండదు. త్వరలోనే పోరు

ముమ్మరంగా సాగుతుంది. ఆ కిటికీవద్దకు నేను చేరగలిగితే బాగుండును గదా!'— అంటూ లేచే ప్రయత్నం చెయ్యబోయాడు ఐవాన్‌హో.

'వద్దు వద్దు! లేస్తే మీ కిప్పుడు చాల ప్రమాదం. కిటికీవద్ద నేను నిలబడి బయట ఏమి జరుగుతుందో మీకు చెపుతూ ఉంటానులెండి'— అంటూ రెబెకా కిటికీవైపు నడిచింది.

'వద్దు రెబెకా, అలా వీలులేదు. శత్రువులు కిటికీల లోపలికిగూడ బాణాలు వదుల్తూవుంటారు. చెదురుమాటుగా ఏదైనా ఒక బాణమువచ్చి తగిల్తే'— అని అతను అంటూ ఉండగానే రెబెకా, 'తగిల్తే మరీమంచి' దంటూ కిటికీ మెట్లు ఎక్కనారంభించింది.

'వద్దు రెబెకా, నామాట విను. ఇది నీవంటి కన్నెపడుచులు చేయదగిన పనిగాదు. నీవు అపాయానికి గురయై నన్ను జీవితాంతం దుఃఖభాజనుణ్ణి చేయకు. కనీసం, అదిగో, ఆ డాలునైనా నీకు అడ్డంపెట్టుకో'— అని కేకపెట్టాడు ఐవాన్‌హో.

రెబెకా అలాగే అచట గోడకు తగిలించి ఉన్న డాలుతీసి తన కడ్డం పెట్టుకొని కిటికీలో నిలబడింది. ఆ కిటికీలోంచి చూస్తే, కోట గోడ అవతల ఒక భాగంలో ఏమి జరుగుతోందో కనుపెట్టవచ్చు. అది ఇంతదాక ఫ్రాంట్‌డీబాఫ్ సేద్రిక్కును దొడ్డివాకిలిగుండా వదిలిపెట్టిన భాగం. కోట గోడకు అవతల ఒక అగడ్త ఉంది. దానికి అవతలగా, ఒకమాదిరి రౌతుల్లో, దొడ్డివాకిలి రక్షణకొరకు నిర్మించబడిన కట్టడ మొకటి ఉంది. కోటలోని వారు శత్రువులతో ముందు ఈ బాహ్యరక్షణ స్థానంనుంచి పోరాడి, ఇది శత్రుహస్తగతమయ్యే పరిస్థితిలో వెనుకకు తగ్గుతూ, అగడ్తపైని వంతెనను ఎత్తివేసి పిమ్మట అసలు కోట రక్షణలో నిమగ్నులౌతారు. ప్రస్తుతం ఈ బాహ్య రక్షణ స్థానాన్ని కాపాడడానికి నిలపెట్టబడ్డ సైనికుల సంఖ్య చాలా తక్కువగా ఉన్నట్లు రెబెకాకు గోచరించింది. ఈ దౌర్బల్య స్థితిని కనుపెట్టడంవల్లనే కాబోలు, ముట్టడిదారులు తమ ముట్టడికి దీనినే ప్రధానలక్ష్యం చేసుకొని విజృంభించదలచినట్లు వారి సైనికవిన్యాసాన్ని బట్టి స్పష్టమయింది.

ఐవాన్‌హోకు ఈ పరిస్థితినంతా వర్ణించిచెపుతూ రెబెకా,— 'అదిగో, ఆ చిట్టడవి అంచున బారులుతీరి పొదల్లో చాలామంది నిలబడినట్లుగా ఉన్నారు. ఎంతమందో చెప్పడానికి వీలులేదు. చాలా కొద్దిమందిమాత్రం ముందుకు వచ్చి కనుపిస్తున్నారు'— అని నివేదించింది.

'వారిజెండా ఏమిటి?'— అని ప్రశ్నించాడు ఐవాన్‌హో. 'జెండా అనేది ఉన్నట్లు కనిపించడంలే'దన్నది రెబెకా.

'జెండా లేకుండ కోటను ముట్టడించ బూనుకోడం విచిత్రంగా ఉంది. నాయకులుగా ఊహించవగినవా రెవరైనా కనిపిస్తున్నారా?' అని అడిగాడు ఐవాన్‌హో.

'ఆపాదమస్తకం కవచం ధరించిన యోధుడు ఒక్కడే కనిపిస్తున్నాడు. అతడే తన చుట్టునున్నవారిని నడుపుతున్నట్లుగా ఉంది'— అన్నది రెబెకా.

'అతని డాలుపైన ఏమిచిహ్నం కనిపిస్తోంది?' అని అడిగాడు ఐవాన్‌హో.

'ఇనుపసంకెలకు వేసే కప్పతాళం మాదిరిగా ఉన్నదది,'— అని జవాబిచ్చింది రెబెకా.

'ఇనుపసంకెలకు వేసే కప్పతాళమా? అది యెవరిచిహ్నమై ఉంటుందో ఏమీ బోధపడడంలేదు. చూడగా, నేనున్న పరిస్థితికి అది నాకు బాగా సరి పోయేటట్లుగా ఉంది. దానిపైన ఏమైనా వ్రాసిఉన్నదా?'—అని మరల ప్రశ్నించాడు ఐవాన్‌హో.

'ఇంతదూరానికి సరిగా కనుపించడంలేదు'— అన్నది రెబెకా.

ఐవాన్‌హో తిరిగి ఇలా అడిగాడు: 'పోనీగాని, అతనుతప్ప మరెవ్వరూ నాయకులు కనిపించడంలేదా?'.

రెబెకా ఇలా సమాధానం చెప్పింది: 'ఈ వైపున ఇంకెవ్వరూ కనుపించడంలేదు. కాని, ధోరణిచూడగా, ఈ దిక్కునుంచేకాదు, అవతలి దిక్కునుంచికూడా కోట ముట్టడి తీవ్రంగా సాగుతున్నట్లుంది. ఇప్పుడు వారు ముందుకు కదలి వస్తున్నారు. ముందువరుసలోనివారు అత్యున్నతములైన పలకలను చాటుచేసుకొని ముందుకు వస్తూవుంటే, వెనకనున్నవారు కోట గోడలమీదనున్న సైన్యాలమీదికి బాణాలు విరజిమ్ముతూ ముందడుగువేస్తున్నారు. అమ్మో! చాలా భయంకరంగా ఉన్నదీ దృశ్యం!'

ఇంతలో, చెవులు గింగురు మనేటట్లుగా ఈల వినవచ్చింది. వెంటనే, భేరీ నినాదాలతోపాటు తూర్యధ్వనులు చెలరేగాయి. పోరు తీవ్రగతిలో ప్రారంభమైనట్లు నానావిధమైన చప్పుడులూ వినబడసాగాయి. ఇరువాగుల వారిలోనూ విజృంభించిన సమరార్భటులతో రోదసీకుహరం నిండిపోయింది.

కాని, ఈ కేకలతో కాదుగదా విజయం సాధించబడేది? ధనుర్విద్యలో ఆరితేరిన ఆటవికుల అమ్ములవర్షంనుండి తప్పించుకోడం కోటగోడలపైన ఉన్న వారికి కష్టసాధ్యమవుతోంది. పిట్టగోడల సందులనుంచి ఎక్కడ ఏకొంచెం మనిషి శరీరం కనుపించినా క్షుటిమాత్రంలో అలుగువచ్చి ఒకటిగా మీదపడుతోంది. ఆ అమ్ములవర్షం దాదాపాక వడగండ్లవాన కురిసినట్లే ఉంది. దాని ఫలితంగా,

కొందరు చచ్చిపోయారు. చాలామందికి గాయాలు తగిలాయి. అయినా ఫ్రాంట్ డీబాఫ్ అనుయాయులు తమ పట్టుదల ఎంతమాత్రమూ విడనాడలేదు. పలురకాల ఆయుధాలు ఎదిరిపై తామూ కూడా ప్రయోగింపసాగారు. కవచాదుల రక్షణ సరిగాలేని కారణంచేత, ఆ ఆటవికులు కూడా వాటివలన విపరీతమైన నష్టాలే పొందవలసివచ్చింది.

కిటికీవద్ద నిలబడి ఈ యుద్ధవిశేషాలన్నీ చూచి ఐవాన్‌హోకు వర్ణించి చెప్తూంది రెబెకా. ఐవాన్‌హో సావధానంగా వింటున్నాడు. కోటబురుజుల మీద నున్నవారిపై ఆటవికుల అంపవృష్టి ఒకప్రక్కన తీవ్రంగా సాగుతూఉన్న సమయంలోనే, నీలకవచధారి కొంతమంది అనుయాయులతో విజృంభించి దొడ్డివాకిలి వద్దనున్న బాహ్యరక్షణశ్రేణిని నిర్మూలిస్తూ ఉండడం రెబెకా చూచింది. తమ గండ్రగొడ్డళ్ళ సాహాయ్యంతో వారాపనిని అచిరకాలంలో పూర్తిచేసి లోనికి చొరబడిన సమయంలో, ఫ్రాంట్ డీబాఫ్ కొంతమంది సైన్యంతో అమాంతం వచ్చిపడి వారి నెదుర్కొన్నాడు. రెండు పక్షాలు ఒండొంటితో ఢీకొన్నట్లుగా ఉన్న ఆ భయంకర దృశ్యాన్ని చూడలేక రెబెకా కొంచెంసేపు ఓసరిల్లి నిలిచింది. పిమ్మట మనస్సును కుదుటపరచుకొని ఆమె మరల చూచేసరికి, నీలకవచధారికీ, ఫ్రాంట్ డీబాఫ్‌కూ తీవ్రమైన ద్వంద్వయుద్ధం జరుగుతోంది.

రెబెకా ఆ పోరును వర్ణించబూనుకొనేటంతలోనే, హఠాత్తుగా కెవ్వుమని ఒక కేకపెట్టి, 'అయ్యో, అతడు పడిపోయాడు!'—అని అరచిందామె.

ఐవాన్‌హో ఆతుర్దాగా,—'ఎవరు పడిపోయారు? త్వరగా చెప్పు రెబెకా! ఎవరు పడిపోయింది?'—అని ప్రశ్నించాడు.

'అతడే, ఆ నీలకవచధారి'— అని నీరసపు గొంతుకతో పలుకుతూనే, ఉత్తరక్షణంలో తిరిగి మహోత్సాహంతో,— 'లేదు, లేదు! అతడు తిరిగి లేచాడు. ఫ్రాంట్ డీబాఫ్ మీదికి సింహంలాగా లంఘించాడు. అతని భుజాదండంలో ఇరవైమంది బలం ఉన్నట్లుగా ఉంది. అయ్యో, అతని కత్తి ముక్కలై పోయింది! ఆఁ, ఫరవాలేదు! ప్రక్కనున్నవాని గండ్రగొడ్డలి ఊడబెరుక్కొని మరల ఫ్రాంట్ డీబాఫ్‌తో తలపడ్డాడు. గిర్రక్కత్రిప్పుతో నిల్వకుండ దెబ్బమీద దెబ్బ కొడుతున్నాడు. అయిపోయింది అతడిపని! మొదలునరికిన ఓక్‌వృక్షంలాగ క్రిందపడ్డాడు. అయిపోయిం దతడిపని!'—అని అంది.

'ఎవరు? ఫ్రాంట్ డీబాఫేనా?'— అని అడిగాడు ఐవాన్‌హో ఆదుర్దాగా.

'అవును, ఫ్రాంట్ డీబాఫే. అదిగో, అతని రక్షణకు టెంప్లార్ కొంతమంది సైన్యంతో వచ్చిపడ్డాడు. నీలకవచధారి కొంచెం వెనుకకు తగ్గవలసి

వచ్చింది. ఫ్రాంట్ డీబాఫ్ను వాళ్ళు కోటలోకి మోసుకొనిపోయారు'—అని నివేదించింది రెబెకా.

'ముట్టడిదారులిక ముందుకు చొచ్చుకొని రావడానికి అభ్యంతరం ఉండదు. ఏం, అంతేనా? వాళ్ళిప్పుడు ఏం చేస్తున్నారు?'—అని అడిగాడు ఐవాన్హో.

'ప్రాకారం చేరువదాకా వచ్చేశారు. ప్రాకారం ఎక్కడానికి తీవ్ర ప్రయత్నాలు చేస్తున్నారు. కొందరు నిచ్చెనలు వేశారు. కొందరు ఒకరి భుజాలపై ఒకరెక్కి కోటగోడల కొసలు అందుకోజూస్తున్నారు. గోడలమీదివారు కొండరాళ్ళూ, కొయ్యదుంగలూ వాళ్ళ నెత్తిమీదికి దొర్లిస్తున్నారు. గాయపడ్డ వారు కూలగా, క్రొత్తవారు ఆ స్థానాల నాక్రమించి గోడ లెక్కే ప్రయత్నం కొనసాగిస్తున్నారు. భగవాన్! ఏమి దారుణ దృశ్యమిది! మానవుణ్ణి నీ ప్రతికృతిగా నీవు సృష్టించుకొన్నది, ఇలా తోటివారిచేత నిర్మూలం చేయబడుటకేనా?' అని ఆక్రోశించింది రెబెకా.

'అలాంటి ఆలోచనలేమీ ఇప్పుడు వద్దు రెబెకా! వాటికిది సమయం కాదు. తరువాత ఏమి జరుగుతోందో చెప్పు. ముట్టడిదారుల ప్రయత్నం ఫలిస్తున్నదా?'—అని అడిగాడు ఐవాన్హో.

'ప్రాకారంమీదివారు నిచ్చెనలను పడగొట్టేశారు. క్రిందనున్నవారు నిచ్చెనలక్రిందబడి కొట్టుకుంటున్నారు. ప్రాకారంమీదివారిదే ఇప్పుడు పై చేయిగా ఉంది,'—అన్నది రెబెకా.

'అరెరే! అయితే మరి, ముట్టడిదారులు జంకినట్లేనా?'

'లేదు. తిరిగి వారు విజృంభిస్తున్నారు. నీలకవచధారి తనకెదురైనవారినెల్ల గండ్రగొడ్డలితో మట్టుపెట్టుతూ గేటు సమీపించాడు. పైనుంచి కొండ రాళ్ళూ కొయ్యదుంగలూ అతనిమీదికి దొర్లించబడుతున్నాయి. కాని, వాటి నతడు పక్షి యీకలంత తేలిగ్గా విదిలించివేస్తున్నాడు'— అన్నది రెబెకా.

ఐవాన్హో సంతోషంతో తన ప్రక్కమీదినుంచి కొంచెంగా పైకిలేచి,—'ఏమిటీ! అంతటి బలశాలిగా అతడు! అలాంటి పనులు చేయగలవాడు ఈ ఇంగ్లాండులో ఒకడు తప్ప మరియొవ్వరూ లేరని అనుకొనేవాణ్ణి' అని అచ్చెరువు చూపాడు.

'నీలకవచధారి గొడ్డలిపెట్లతో బయటిగేటు దద్దరిల్లిపోతోంది. పగిలి కూలిపోయిందికూడా! ఆటవికులు లోనికి చొరబారి బురుజుమీదికెక్కి సైనికులను ముక్కలలోకి త్రోస్తున్నారు. అయ్యయ్యో, ఏమిటీ అన్యాయం!

ప్రతిఘటించలేనివారియెడలకూడా అలా క్రౌర్యం చూపదలిసినదేనా ?—అని ఘోషించింది రెబెకా.

ఐవాన్‌హో ఇదేమీ వినిపించుకోక,—'ఆ వంతెన ఏమైనది,—వంతెన? ముట్టడిదారులు దాన్ని కైవసం చేసుకోగలిగారా ?—'అని ఆత్రంగా అడిగాడు.

'లేదు. టెంప్లార్ బ్రయన్ కొద్దిమంది సైన్యంతో కోటలోకి తిరోగమిస్తూ ఆ కొయ్యవంతెనను పగులగొట్టివేశాడు. కోటతాలూకు సైనికులు చాలామంది బయటనే మిగిలిపోయారు. వారి గతి ఏమైనదీ వారు పెట్టే పెడబొబ్బలే చెప్పక చెప్పుతున్నాయి. అబ్బ! పోరుకంటె గెలుపు తిలకించడమే భయానకమనిపిస్తోంది' అన్నది రెబెకా.

'తరువాత అక్కడ ఏం జరుగుతోంది ? మళ్లీ చూచి చెప్పు రెబెకా!—ఇది నెత్తురు చూచి బేజారై మూర్ఛపోదగిన సమయంకాదు'—అని హెచ్చరించాడు ఐవాన్‌హో.

'స్వాధీనపడిన స్థానాన్ని బలపరచుకొని, మన మిత్రులు మంచి నిబ్బరంగా ఉన్నారు. వారిమీద యిచ్చవచ్చినట్లుగా బాణాలు వెయ్యడానికి శత్రువుల కిప్పుడు అలవిగాకపోతున్నది. చెదురువాటుగా అప్పుడప్పుడు మాత్రం కొన్ని బాణాలు వేస్తున్నారు'—అన్నది రెబెకా.

'ఆ నీలకవచధారి ఏంచేస్తున్నాడిప్పుడు ? అతడెవరైనదీ ఊహించే అవకాశమేమైన కనిపిస్తున్నదా? ఇనుపసంకెల కప్పుకొంగుర్తు డాలుమీద ఉండడమేమిటో తెలియడంలేదు. గొడ్డలిపెట్టుతో ఇనుపస్తంభాలను ముక్కలుచెయ్యగల తాకతు నే నెరుగున్నంతలో ఒక్కరికే ఉంది. అలాంటివాళ్లు ఇద్దరుండడం నిజంగా ఆశ్చర్యకరం. అతని చహరా ఇంకేమైన చెప్పగలవా ?'—అని అడిగాడు ఐవాన్‌హో.

'ఏమి చెప్పడానికీ వీలులేకుండా ఉంది. అంతా ఒకటే నీలకవచం. కాని, ఆ రణపాండిత్యం ఎచ్చట చూచినా గుర్తు పట్టదగినదిగా ఉంది. తిరిగి వెయ్యమంది యోధులమధ్య అతని యుద్ధప్రక్రియ చూడడం తటసించినా అతనిని నేను గుర్తుపట్టగలను. యుద్ధంలోకి దూకడమంటే విందుకు పోయినట్లుగా ఉందతనికి. అతని దెబ్బలో, వట్టి భుజబలశక్తియేకాదు, అతని మనోబలం, ఆత్మబలం కూడ ఎదిరిపై విరుచుకొని పడుతున్నట్లుగా ఉంటోంది. ఒక్కచేతితో బండలను పట్టుపెట్టుతున్న ఆ దృశ్యం భయంకరమే కాక, అద్భుతావహం కూడ!' అంది రెబెకా.

'రెబెకా! నీవు నిజంగా నీ మాటల్లో ఒక మహాశూరుని చిత్రించావు. అట్టి నాయకుని నాయకత్వాన నడిచే సైన్యానికి భయసంశయాలుండవు. కర్తవ్యాన్ని విడనాడడమూ ఉండదు. కష్టాలు కలుగవచ్చుగాక. కాని అవన్నీ కీర్తిప్రతిష్ఠలను పెంపొందించేవే అవుతాయి. అట్టి నాయకుని ప్రక్కన నిలబడి, ఇలాంటి సమరంలో, ఒక్కరోజు పోరాడగలిగితే చాలు,—తరువాత పదిసంవత్సరాలు బందిఖానాలో గడపవలసివచ్చినా చింతపడనక్కరలేదు. ఈ యుద్ధంలో పాల్గొనే భాగ్యం ఈనాడు నాకు కలుగకూడదా?'— అని భావవివశత్వం ప్రకటించాడు ఐవాన్‌హో.

రెబెకా ఈ మాటలు వినగానే చప్పున కిటికీ దిగి ఐవాన్‌హోను సమీపిస్తూ,—'అయ్యో! ఏమిటి మీ కీ ఉద్రేకం! ఇలా అయితే మీరు కోలుకోవడం కష్టం. నా మాట విని, మనస్సు చిక్కబట్టుకోండి'—అని అర్థించింది.

'నీకు తెలియదు రెబెకా! వీరకృత్యాలు అలా ఒక ప్రక్కన జరుగుతుంటే, నావంటివాడు కేవలం ఆడదానివలె ఒకమూల ఎలా కూర్చోగలడు? వీరరసమే మాకు ఆహారం. విజయపరంపరలు సాధించి కీర్తి గడిస్తూ ఉన్నంతవరకే మాకు బ్రతుకుమీద ఆశ. ఆపైన మేము మరణమే ప్రియతమంగా యెంచుకుంటాం'—అన్నాడు ఐవాన్‌హో.

దీనిపై, కీర్తి అనే విషయంపైన ఇరువురకూ కొంత ప్రసంగం నడిచింది. కుటుంబ సుఖశాంతులు విడనాడి, ప్రేమపూరితులైన ఆప్తజనులకు దూరమౌతూ, కీర్తి కోసం పరుగెత్తి పరుగెత్తి ఆత్మబలిదానం చేసినందువల్ల ఒరిగేదేమిటని ఆమె ప్రశ్నించింది. ప్రియుడు వీరకృత్యాలు సాధిస్తుంటే ప్రియురాలు పొందే ఆనందం ఎలాంటిదో నీవు క్రైస్తవకన్యవు కాకపోవడంవల్ల నీకు తెలియదు, క్షాత్రధర్మం ధూర్తులనరికట్టి, ఆర్తులకు రక్షణ ఇవ్వడమేకాక, అచ్చమైన ప్రేమకు కూడ చక్కని దోహదం చేస్తుందన్నాడు ఐవాన్‌హో. క్షాత్రధర్మపు పిచ్చిలో వెర్రిపోకడలలోనూ క్రైస్తవవీరులను తాను అభిశంసించినందులకుగాను తనది పిరికిగుండెగా ఐవాన్‌హో తలపోశాడేయని రెబెకా బాధపడింది. యూదుజాతిలో క్షాత్రగుణం మరుగునపడిపోయినందుకు నిట్టూర్పు విడిచింది. పతితావస్థలోనున్న యూదుజాతి నుద్ధరించడానికి తన రక్తం ధారపొయ్యగల అవకాశం భగవంతుడు ప్రసాదించకూడదాయని విలపించింది. ఆ సంగతి అలా ఉన్నా, నేడు తన తండ్రికీ యీ యువకునికీ బంధవిముక్తి కలిగించడానికి ఆత్మబలిదానంచేసే భాగ్యం భగవంతుడు తనకు ఒసగూర్చాలని మొరపెట్టుకుంది. అలా తాను బలిదానం చెయ్యగలిగినప్పుడుగదా, యూదుకన్య యెంత తృణప్రాయంగా మృత్యువు నెదుర్కొగలదో ఈ యువకుడు తెలుసుకోగలిగేది!

ఈ యోచనలలో ఇలా నిమగ్నురాలైన కొంతసేపటికి రెబెకా ఐవాన్‌హో వంక చూచేసరికి, అతడు కునుకు తీస్తున్నాడు. ఇంతసేపూ ఆవేశంతో మాట్లాడిన బడలికచేత అతనికి నిద్రపట్టింది. రెబెకా అతని సుందర వదనాన్ని వీక్షిస్తూ అలా కొంతసేపు ఉండిపోయింది. ఆమె హృదయములో పలురకాల భావాలు ముసురుకొన్నాయి. తాను ఆ విధంగా అతనివంక చూడడం తప్పో, తప్పుకాదో ఆమెకు తెలియలేదు. అతడిప్పుడు శత్రువుల స్వాధీనంలో ఉన్నాడు. వారతన్ని బ్రతక నిచ్చేమాట కల్ల. ఏ క్షణంలో పొట్టన బెట్టుకొన్నా పెట్టుకోవచ్చు. అలాంటి పరిస్థితిలో, తానతనివంక ఇంచుకసేపు వీక్షించడం దోషమౌతుందా? కాదు. కాదని మనస్సును సమాధానపరచుకొంటూ ఉన్న సమయంలోనే, తండ్రి సంగతి ఆమెకు జ్ఞాపకానికి వచ్చింది. ఇంతసేపూ తండ్రిని మరచినందుకు తనను తాను నిందించుకొంది. ఒక నూతన వ్యక్తినిగూర్చి ఆలోచించడంలో, తన తండ్రి మరవసనూ, తన జాతి మరవసనూ తాను మరవడం పాపం కాక మరి ఏమిటని మథనపడింది. ఐవాన్‌హోనుగూర్చిన ఆలోచన తన హృదయంనుంచి పెకలించి వేయాలని నిశ్చయించుకొంది. అది సుసాధ్యమైనపని కాదని ఆమెకు తెలుసు. హృదయంలోని ప్రతికండరమూ ఆపనివలన తీవ్రంగా గాయపడే మాట నిశ్చయం. కాని, ఏమైనప్పటికీ ఆ పని తాను చేయక తప్పదు.

ఇలా నిశ్చయించుకొని, రెబెకా, మేలిముసుగు ఒడలెల్ల కప్పుకొని,— ఐవాన్‌హోకు కడుదూరంగా అవ్వలివైపుగా కూర్చుని ఏమో ధ్యానింపసాగింది. బయట ఒకవిధమైన ప్రమాదం, లోపల ఇంకొక విధమైన ప్రమాదం. ఈ రెంటినీ ఎలా తట్టుకోవడమా అనేదే ఆమెనిప్పుడు వేధిస్తున్న సమస్య.

# అధ్యాయం ౩౧

పోరాటానికి కొంచెం విరామం ఏర్పడిన సమయమది. తొలి విజయం తమదే అయినందుకు ఉత్సాహపడుతూ, ముట్టడిదారులు తిరిగి తమ ముట్టడిని తీవ్రతరం చేసే ప్రయత్నాలలో ఉన్నారు. ఈ పర్యాయమైనా వాళ్ళను అడ్డుకట్టి తీరాలనే పట్టుదలతో, రక్షణ కార్యాలను మరింతగా బలపరచుకొంటున్నారు కోటలోనివారు. ఈ సమయంలో, టెంప్లార్ బ్రయన్‌తో, డీబ్రేసీకి కోట కచేరీ చావడిలో ఈ విధంగా మంతనం జరుగుతోంది:

'ఫ్రాంట్ డీబాఫ్ ఎక్కడ? బ్రతికున్నాడా? చచ్చిపోయాడని అనుకుంటున్నారేమిటి?'—అని అడిగాడు డీబ్రేసీ.

'చావలేదు. ఇంకా బ్రతికే ఉన్నాడు. కాని, ఆ తిన్న దెబ్బమాత్రం సామాన్యమైన దెబ్బకాదు. ఇంకా పదిరెట్లు దళసరితనంగల శిరస్త్రాణం ధరించి ఉన్నప్పటికీ, ఆ గొడ్డలిపెట్టు కతడు కూలిపోకుండా ఉండడానికి వీలులేదు. ఇంక కొన్నిగంటల్లో అతడు పెద్దల్లో కలియడం ఖాయం. ప్రిన్స్ జాన్‌కు ఒక చెయ్యి విరిగినట్లు అవుతుందన్నమాట!' అని సమాధానమిచ్చాడు బ్రయన్.

'పోనీలే, నరకంలో సైతానుకు లోటేమైనా ఉంటే మనవాడు తీరుస్తాడు. భాగవత నింద చేసి మూటకట్టుకొన్న పాపం ఊరికే పోతుందా మరి? పైగా, వారి పవిత్రమైన శిలావిగ్రహాలను, కోటగోడల మీదనుంచి శత్రువుల మీదికి దొర్లించే కొండరాళ్లుగా ఉపయోగించాడు. తుదకు ఫలితం అనుభవించాడు'—అని వ్యాఖ్యానించాడు డీబ్రేసీ.

'ఏడ్చినట్లే ఉంది నీ మూఢవిశ్వాసం! ఫ్రాంట్ డీబాఫ్ అవిశ్వాసానికీ, నీ మూఢవిశ్వాసానికీ తేడా నాకేమీ కనిపించడంలేదు. రెండూ కూడా అర్థంలేనివే!'—అని టెంప్లార్ ఎద్దేవా చేశాడు.

'ఇదుగో బ్రయన్, నా విషయం ఎత్తుకొనేటప్పుడు, మాటలు కొంచెం తిన్నగా రానివ్వాలని కోరుతున్నాను. నా క్రైస్తవమత విశ్వాసాన్ని అధిక్షేపించే అధికారం నీకు లేదు. ఇప్పటికే కాదు, ఎప్పటికీ కూడ నీకంటే, నీ టెంప్లార్ వ్యవస్థలోని వారికంటే, నేనే ఉత్తమ క్రైస్తవుడనని ఘంటాపథంగా చెప్పగలను. టెంప్లార్ వ్యవస్థలో ఎటువంటి మతబాహ్యులున్నారో నాకు తెలియదనుకుంటు

న్నారు గాబోలు!—సర్ బ్రయన్ డీబోయి గిల్బర్టు కూడా అలాంటి మత బాహుళ్యుల్లో ఒకడని లోకమంతా కోడై కూస్తోంది'—అని వివరించాడు డీబ్రేసీ.

'కూసుకోనీ, నాకేం లెక్కలేదు. అది అలా అట్టేపెట్టి, ముందు ఈ కోటను రక్షించే మార్గం ఆలోచించు. అన్నట్లు, తూర్పువైపున నీ పోరాటం విశేషాలేమిటి? ఈ యాటవికుల మూక నిన్ను ఏ విధంగా ఎదిరించింది?' —అని అడిగాడు టెంప్లార్.

'ఏ విధంగా ఏమిటి? దయ్యాలూ భూతాలూ వచ్చి మీదపడ్డట్లేననుకో! వాళ్ళనాయకుడు ఆష్బీ విలువిద్య పోటీలో బహుమానం కొట్టేసినవాడే ననుకుంటాను. వాడిబూరా, వాడిపటకా నాకు బాగా గుర్తు. వాడిదుంప తెగ, వాడు నన్ను పడగొట్టాలని ఏడుసార్లు బాణాలు గురి చూచి వదలాడు. కవచాన్ని కీలుకీలుగా ఛేదించాలని ప్రయత్నించాడు. కవచంలోపల మరొక ఇనపగొలుసుల చొక్కాకూడా తొడుక్కొని ఉండబట్టి సరిపోయిందిగానీ, లేకపోతే ఈ పాటికి ఎక్కడుండేవాణ్ణో!'—

'ఏమైనప్పటికీ నిలవరించుకొని పోరాడగలిగావన్నమాట. ఇక్కడ మేము కొంచెం వెనుకకు తగ్గవలసి వచ్చింది. బాహ్యరక్షణ స్థానాన్ని శత్రువులాక్రమించారు,'— అన్నాడు టెంప్లార్.

'చాల ప్రమాదమే! ముట్టడి ఇకమీద మరింత తీవ్రంగా కొనసాగేమాట నిశ్చయం. కోటలో మనకు తగినంత సైన్యంలేదు. ప్రతి రక్షణస్థానాన్నీ జాగ్రత్తగా కాపుకాయాలంటే తగినంతమంది ఉండాలిగదా మరి! ఉన్నవాళ్ళు కూడా, ఆ బాణవృష్టికి తట్టుకోలేక తల్లడిల్లిపోతున్నారు. ఫ్రాంట్ డీబాఫ్ చావటానికి సిద్ధంగ ఉన్నాడుగనుక, ఇక అతినివల్ల మనం ఎట్టి సాహాయ్యాన్నీ అపేక్షించలేం. ఇట్టి పరిస్థితిలో,— ఏమంటావు బ్రయన్!— ఈ ఖైదీలను వాళ్ళకు అప్పగించేసి ఈ బెడదలోంచి బయటపడడం మంచిది కాదా? సమయం తప్పవచ్చినప్పుడు ఏంచేస్తాం మరి?'— అన్నాడు డీబ్రేసీ.

'ఆఁ, ఏమంటున్నావు? ఖయిదీలను అప్పగించాలీ! అప్పగించి ఆ తర్వాత లోకం ముందర తలయెత్తుకొని ఎలా తిరగాలనుకుంటున్నావో అర్థం కావడం లేదు. దిక్కులేని బాటసారులను రాత్రిపూట దొంగచాటుగా మీదపడి బంధించినందుకే లోకం మనల్ని ఎంతైనా అపహసిస్తుంది. దీనికితోడు, టార్క్విల్‌స్టన్ వంటి బలిష్ఠమైన కోటను ఒక అడవిమూక బారినుండి రక్షించుకోటం చేతగాక ఖయిదీలను వదలుకున్నామని కూడా లోకంచేత ఎద్దేవా చేయించుకోడం కంటె సిగ్గుచేటు మరొకటి ఉండదు. ఆహాహా, ఈ సలహా నీకు తోచినందుకు

చెప్పాలి! ఈ కోట శిథిలాలకింద పడి నేను చావడానికైనా అంగీకరిస్తానుగాని, ఈ సిగ్గుమాలిన పనికి మాత్రం ఒప్పుకోను'— అన్నాడు బ్రయన్.

'అయితే కానీ! డీబ్రేసీ చావుకు వెరచే పిరికిపంద అనుకున్నావేమిటి? చావుకు తెగించడంలో డీబ్రేసీ టెంప్లారుకు తీసిపోడని రుజువుచేస్తాను. అయితే, ఈ సమయంలో నా స్వేచ్ఛా సైనికదళం తాలూకు వీరులు, కనీసం ఏ నలభై యాభైమంది అయినా ఇప్పుడు నా దగ్గిర ఉండి ఉంటే ఎంతో బాగుండేదికదా! నేను సంకటపరిస్థితిలో ఉన్నానని వాళ్ళకేమాత్రం తెలిసినా, రెక్కలు కట్టుకొని వచ్చి ఇక్కడ వాలి ఉండేవారు! ఎంత దురదృష్టం!'— అని వాపోవసాగాడు డీబ్రేసీ.

'లేనివాళ్ళకోసం ఈ తీరిపోని ఆశలు పెట్టుకుంటూ కూర్చోవాలని నీకు ఉబలాటంగా ఉంటేగాబోలు, ఉండనీ! కాని, అందువల్ల మనకిప్పుడు కలిసివచ్చేది శూన్యం. ఉన్నవాళ్ళతో ఎలాగో కోటను రక్షించుకునే ప్రయత్నం చేసుకోవాలి. ఈ ఉన్నవాళ్ళంతా ఫ్రాంట్ డీబాఫ్ అనుచరులు. ఫ్రాంట్ డీబాఫ్ ప్రేరణచే ఈ ప్రాంతాల్లోని ప్రజలను అనేకవిధాల హింసించినవాళ్లు. వీళ్లంటే ప్రజలకుండే ద్వేషం ఇంతా అంతా కాదు'— అన్నాడు బ్రయన్. 'అయితే మరీ మంచిది, ప్రజలచేతికి చిక్కితే తమకు గట్టి శాస్తి జరుగుతుందని తెలుసుగనుక, చిక్కకుండా తుదివరకూ నిలిచిపోరాడుతారుగాని ఊరుకోరు. పద! వెళ్ళి పోట్లాడుదాం. డీబ్రేసీ శరీరంలో ప్రవహించేది వీరరక్తమే నన్నది ఈ రోజున రుజువు చేస్తాను'— అన్నాడు డీబ్రేసీ.

అయితే పదమన్నాడు టెంప్లార్ బ్రయన్. కోటబురుజులమీదకెక్కి, పరిస్థితులన్నీ కలయజూచుకొని కర్తవ్య మాలోచించారు. ఎక్కువ ప్రమాదం, ఇదివరలో శత్రువు ఆక్రమించుకొనియున్న బాహ్యరక్షణ స్థానంవైపునుంచే రాగలదని ఉభయులకూ అవగతమైంది. అయితే, ఆ రక్షణస్థానానికీ కోటగేటుకూ మధ్య అగడ్త ఉంది. శత్రువులది దాటగలిగితేకాని గేటును సమీపించలేరు. అయితే, బ్రయన్, డీబ్రేసీలకు ఒక అనుమానంకూడా ఉంది. తమ దృష్టి అంతా ఈ గేటుమీదనే కేంద్రీకరించబడేటట్లు చెయ్యడానికి పెద్ద హంగామా చేసినట్లు కనుపిస్తూ, శత్రువులు ఈ యవకాశంలో కోటను మరొకవైపునుంచి సాధించడానికి చూస్తారేమోనని, అందుచే, ఈ ప్రమాదం నివారించడంకోసం, ఉన్నంతలో సైనికులను దూరదూరంగా అన్ని గోడలమీదా కాపుపెట్టి, ఎక్కడైనా ప్రమాదం వాటిల్లేటట్లుంటే వెంటనే నినాదాలద్వారా తెలియజేసే యేర్పాట్లు చేశారు. ప్రమాదం అతిసన్నిహితంగా కనిపిస్తున్న దొడ్డిగేటు రక్షణభారం డీబ్రేసీ వహించాడు. పోతే, పది పదిహేనుమంది సైనికులతో టెంప్లార్ ఒక రిజర్వుదళాన్ని ఆయత్తపరచుకొని, ఎక్కడ ఏ క్షణంలో ప్రమాదం ముంచుకువచ్చేటట్లున్నా

అమాంతం వెళ్ళి ప్రాకేటట్లు ఏర్పాటు చేసింది. అయితే, బాహ్యరక్షణ స్థానం శత్రువుల స్వాధీనమైనందువల్ల కలిగిన పరోక్ష చిక్కు ఏమంటే, కోట గోడలమీదినుంచి చూసేవారికి, ఇంతకుపూర్వంలాగా, శత్రువులు ఎంత బలగంతో ఏ విధంగా ముట్టడి ప్రయత్నాలు చేస్తున్నారో సరిగా కనిపించడం లేదు. అందుచే, ఇదిగో ఫలానివైపునుంచి శత్రువులు ఫలానివిధంగా ఇప్పుడు తోసుకొని వస్తున్నారని ఊహించుకోడానికి వీలులేని అనిశ్చిత పరిస్థితిలో ఉండిపోయారు బ్రయన్ డీబ్రేసీలు. వారి అనుచరులకు కూడా మనసులో చాల దిగులు దిగులుగానే ఉంది. ఇదివరలో కాగా యుద్ధాలు చేసి అనుభవము గడించినవాళ్ళే వాళ్ళంతా. కాని, శత్రుమధ్యంలో చిక్కుకొనిపోయి, యే వైపునుంచి వచ్చి మీదపడతారో తెలియని అయోమయ పరిస్థితిలో ఉండవలసి వచ్చినప్పుడు, ఎంత అనుభవశాలురైతే మాత్రం దిగులుపడక ఏం చేస్తారు?

ఈ యుద్ధసన్నాహాలిక్కడ ఇలా జరుగుతూ ఉండగా, అక్కడ ఫ్రాంట్ డీబాఫ్ శారీరకంగానూ మానసికంగానూ కూడ ఒక మహావేదనలో పడి కొట్టుకుంటున్నాడు. అతడనుభవించే మానసికమైన మహావేదన ఎటువంటిదో ఇచట కొంచెం వివరించడం అవసరం. మూఢవిశ్వాసాలు ప్రబలంగా ఉండిన ఆ కాలములో, పాపకృత్యాలు చేసినవాళ్ళందరూ సామాన్యంగా, తమ పాప పరిహారానికై చర్చికి భూరివిరాళాలొసగి, అందుకు ప్రతిఫలంగా చర్చివలన పాప పరిహారం మంజూరు చేయించుకుంటూ, తద్వారా తమ నరకభయాన్ని బాపుకోడానికి ప్రయత్నిస్తూ ఉండేవారు. యథార్థమైన పశ్చాత్తాపం పొందినవారికి కలిగే మనశ్శాంతికీ, వీరు పొందే మనశ్శాంతికీ చాల భేదముంటుందనే సంగతి వేరుగ చెప్పనక్కరలేదు. ఆరోగ్యస్థితిలో సహజంగా పట్టిన నిద్రలో ఉండే సుఖానికీ, అనారోగ్య స్థితిలో నల్లమందు వేసి పట్టించిన నిద్రలో ఉండే సుఖానికీ ఎలాంటి తేడా ఉన్నదో, ఈ రెంటికీ కూడ అలాంటి తేడాయే ఉన్నది. ఫ్రాంట్ డీబాఫ్ మొదటిరకం మనశ్శాంతికే కాక రెండవరకం మనశ్శాంతికి కూడ నోచుకోలేదు. కారణమేమంటే, అతనికున్న దుర్గుణాలలో, విపరీతమైన ధనతృష్ణ అనేది ఒక ముఖ్యమైన దుర్గుణం కావడంచేత, పాపపరిహారం కోసం చర్చికి ధనరాసులు చెల్లించడమంటే అతనికి మహాకంటకంగా ఉండేది. చర్చియందు విశ్వాసం పెంచుకుంటే ధనరాసులు సమర్పించి పాపపరిహారాలు పొందవలసివస్తూ ఉంటుంది కనక, ఆ చిక్కునుండి తప్పించుకోడంకోసం చర్చినీ చర్చి అధికారులనూ నిరసించడం అలవాటు చేసుకున్నాడు. ఆధ్యాత్మిక సుఖశాంతులను చర్చిఅధికారులు అంతంత అత్యధిక మూల్యాలకు విక్రయించడం అతనికేమీ బాగుండలేదు. అందుచే, అసలు చర్చికి ఆ అధికారం ఎక్కడిదని తుండూ తుపాకీ ఎగరగొట్టేస్తూ ఉండేవాడు. వైద్యునికి ఫీజు చెల్లించవలసివస్తుంది కనుక, అసలు వైద్యంలోనే పసలేదు పొమ్మనడం అతనికెక్కువ వీలుగా కనిపించింది.

కాని, ఇదంతా వెనుకటి సంగతి. ఇప్పుడా పరిస్థితి మారింది. ఇప్పటి అవసానదశలో, ఫ్రాంట్ డీబాఫ్‌కు ప్రపంచమే తలక్రిందులై పోతున్నట్లుగా ఉంది. తన భావిగతినిగూర్చి తలపోసుకునేసరికి, కేవలం అంధకారబంధురంగా కనుపించి, అతని రాతిగుండె సైతం విహ్వలించి పోయింది. దీనికి తోడు, విపరీతమైన జ్వరంతో అతని ఒళ్లు కాలిపోతోంది. ఆ జ్వరతీవ్రత వల్లకూడా అతని మనోవేదన మరింత భయంకరమై అతనిని కాల్చివేస్తోంది. నరకయాతనంటే నిజంగా అదేనని చెప్పాలి. ఆర్తితో ఘోషపెట్టడమేగాని, అందు ఆశ అనేదానికి తావులేదు. చేసిన పాపాలు తలపునకువచ్చి తల్లడిల్లడమేగాని, మనస్సును క్షాళితమొనర్చే పశ్చాత్తాపం కలుగదు. విపరీతమైన ఆ బాధలో, దానికిక విరుగుడ ఉండదనే భావంకూడా మిళితమై ఉన్నప్పుడు, అది యెలాంటి దుర్భరపరిస్థితో వర్ణించడానికి వీలులేదు.

ఇలాంటి స్థితిలో, ఫ్రాంట్ డీబాఫ్‌కు క్రైస్తవ ఫాదరీలు జ్ఞాపకానికి వచ్చారు. పూర్వం అతని తండ్రి స్వయంగా ఒక కాన్వెంటు స్థాపించి, దానికి మంచి మంచి మాన్యాలు ఏర్పాటుచేశాడు. ఆ కాన్వెంటు తాలూకు ఫాదరీలు ఇప్పుడు ఎక్కడ చచ్చారని ఫ్రాంట్ డీబాఫ్ చికాకుపడడం మొదలుపెట్టాడు. వాళ్ళను ఆ కోటలో అడుగుపెట్టనీయకుండా చేసింది తానే! కాని, యిప్పుడు తాను అవసానదశలో ఉంటే, వచ్చి తన పాప పరిహారార్థం ప్రార్థనలు చెయ్యరేమని అతని తగ్గోలు. టెంప్లార్ బ్రయన్ కూడా ఒక మత వ్యవస్థకు చెందినవాడే కనుక, పోనీ అతనిని పిలిపించి అతనివలన ఈ ప్రార్థనలు చేయిద్దామా అనుకున్నాడు. కాని, అంతలోనే మనసు మార్చుకొని, ఛీ ఛీ, వాడితో నేను నా పాపాలు చెప్పుకోడమేమిటి, వాడికంటె సైతానుతో చెప్పుకోడం నయమని అనుకున్నాడు. ఏ ఫాదరీతోనూ పనిలేదు, సొంతంగా ప్రార్థన చేసుకుంటే అంతకంటె ఉత్తమమైనది లేదని ముసలివాళ్ళు అంటూవుంటారు గదా, పోనీ అలా సొంతంగానే ప్రార్థన చేసుకుందామా అనుకున్నాడు తరువాత. కాని,—'అమ్మయ్యో! ఎలా ప్రార్థనచెయ్యడం? అది నావల్లకాదు. అసంభవం! అపని నేను చెయ్యలేను!' అనుకొన్నాడు వెంటనే.

జ్వర తీవ్రతలో బయలుదేరిన ఒక విధమైన ప్రేలాపనలో, ఇదంతా బయటికి వినిపించేటట్లే అనేస్తున్నాడు ఫ్రాంట్ డీబాఫ్. ఇంతలో, ఒక కర్కశమైన గొంతు అతనికి ఈ విధంగా వినిపించి అతని ప్రేలాపనకు అడ్డుతగిలింది:

'ఫ్రాంట్ డీబాఫ్ నోట, ఈనాడు ఎన్నడూ వినబడని మాటలు వినబడుతున్నాయేమిటి? జీవితంలో ఎలాంటి ఘోరమైన పనికీ వెనుకాడి యెరుగని ఫ్రాంట్ డీబాఫేనా— ఈ రోజున ఇలా అంటున్నది?'

ఫ్రాంట్ డీబాఫ్‌కు ఆ ధ్వని మానవ కంఠధ్వనిగా వినిపించలేదు. పిశాచ మొకటి వికటాట్టహాసం చేస్తున్నట్లుగా ఉంది. పాపాత్ములైనవారికి అవసాన కాలంలోనైనా మంచిబుద్ధులు కలుగనివ్వకుండా విక్షేపం కలుగజెయ్యడానికై ఇలా పిశాచాలు చుట్టుముట్టుతూ ఉంటాయని ఆ కాలములో సామాన్యంగా అందరూ అనుకునే మాట జ్ఞాపకానికి వచ్చి మరీ తల్లడిల్లిపోయాడు. ఒడలు జలదరించింది. ఎలాగో మనస్సును చిక్కబట్టుకొని, ఇలా కేకపెట్టాడు— 'ఎవరురా అది? నన్ను కవ్వించడానికి సాహసిస్తున్న దెవడు? ఇలా వచ్చి నా యెదుట కనబడండి!'

'నేనా? నిన్ను ఆశించిన పిశాచాన్ని'— అన్నదా గొంతు.

'ఏమిటీ? పిశాచానివా? ఏదీ, ఎలా ఉంటావో చూడనీ! ఇలా రా నా యెదుటికి! నిన్ను చూచి భయపడతా ననుకుంటున్నావేమో! అలా భయపడేవాణ్ణికాదు. చేతికి చిక్కాలే కాని, నీవంటి వాళ్లతో పెనగులాడడానికి కూడ ఈ ఫ్రాంట్ డీబాఫ్ వెనుకాడేవాడు కాడని రుజువుచేస్తాను. ఇలారా నా ముందరికి!'— అని పలికాడు ఫ్రాంట్ డీబాఫ్.

'జ్ఞాపకానికి తెచ్చుకో ఫ్రాంట్ డీబాఫ్! నీవు చేసిన పాపాలన్నీ జ్ఞాపకానికి తెచ్చుకో! తిరుగుబాట్లు చేశావు, దోపిడీలు చేశావు, హత్యలు చేశావు— అన్నీ జ్ఞాపకానికి తెచ్చుకో! ఇంద్రియ భోగలాలసుడైన జాన్‌ను ప్రేరేపించి, ముసలియైన తండ్రిమీదా, ఉదారుడైన సోదరునిమీదా తిరుగుబాట్లు చేయించిన దెవరు? నీవు కాదా? జ్ఞాపకానికి తెచ్చుకో!' అని అభియోగం ప్రారంభించింది ఆ గొంతుక.

'కాదు. నీవు చెప్పేవన్నీ అబద్ధాలు. జాన్ చేత తిరుగుబాటు చేయించినది నేను కాదు— నేను ఒక్కణ్ణే కాదు— ఇంకా యాభైమంది సామంతులూ, యోధులూ ఆ పని చేశారు. యాభైమంది కలిసిచేసిన తప్పుకి నేనా బాధ్యుణ్ణి? ఓసి పిశాచీ! నీ అబద్ధాలు కట్టిపెట్టి, ఇక ఇక్కడనుంచి వెళ్ళిపో! నీ వొకవేళ పిశాచివికాక మనిషివే అయితే, నేను శాంతంగా చచ్చిపోవాలి నన్ను వదలిపెట్టిపో! అలా కాకుండా నీవు పిశాచివే అయినప్పటికీ, నన్ను వేధించే సమయం ఇంకా ముందుంది, ఇప్పుడు కాదు, వెళ్లిపో!'— అని అరిచాడు ఫ్రాంట్ డీబాఫ్.

'నీవు శాంతంగా చచ్చిపోవడానికి వీల్లేదు. శాంతంగా నేను చచ్చిపోనివ్వను. నీవు చేసిన హత్యలు— చచ్చేటప్పుడుకూడా నిన్ను వెంటాడి తీరాలి. ఈ కోటగోడల మధ్య నీ మూలంగా ఎందరి ప్రాణాలు ఘోషిల్లాయో, ఎందరిరక్తం ఈ నేలపైన ఓడికలు కట్టిందో,— అదంతా ఈ చావుకాలంలో నిన్ను వేధించితీరాలి'— అని రట్టించింది ఆ గొంతుక.

ఫ్రాంట్ డీబాఫ్ వికటంగా ఒక పెద్దనవ్వునవ్వి ఇలా సమాధానం చెప్పాడు: 'ఈ బెదిరింపులవల్ల నాకేం భయంలేదు. యూదుజాతీయులను బాధ పెట్టడం పాపమా? కాదు. ఏంతమాత్రం పాపంకాదు. పైపెచ్చు, పుణ్యం అని కూడా గట్టిగా చెప్పగలను. పుణ్యంకాబట్టే, అలాంటి క్రైస్తవ మతద్రోహుల నెత్తురు నేలపై చిందించిన వారికి క్రైస్తవ ప్రపంచంలో పరమ పూజ్యస్థానం లభిస్తున్నది. ఇకపోతే, సాక్సన్ పశువులను అనేకమందిని నేను చంపినమాట నిజం. కాని, అందులో తప్పేమీ లేదు. వాళ్లు నా జాతికీ, నా దేశానికీ శత్రువులు. వాళ్లను నేను ఏం చేసినా చెయ్యవచ్చు. వాడి తప్పని ఎవరనగలరో చెప్పు! ఏం, మాట్లాడవేం? ఇక మళ్లీ నోరెత్తలేక తోకముడిచిపెట్టినట్లున్నావు, అంతేనా?'— అని బుకాయించాడు ఫ్రాంట్ డీబాఫ్.

'ఓరి పితృహంతకుడా! ఏమి నీ బుకాయింపు! నీ తండ్రిని చేతులారా చంపివేశావే! దానికేమి సమాధానం చెపుతావు? పితృరక్తం నేలపై చిందించిన నీ పాపానికి ఏమిటి నిష్కృతి?'—అని ప్రశ్నించింది తిరిగి ఆ కంఠస్వరం.

'ఆఁ!'—అని ఒక కొంతసేపు మరి మాట్లాడలేకపోయాడు ఫ్రాంట్ డీబాఫ్. 'ఆ రహస్యం నీ కెలా తెలిసింది? నీవు నిజంగా సైతానువే అయివుంటావు నిశ్చయం. సైతానుకు అన్ని సంగతులు తెలుస్తూవుంటాయంటారు— ఇంతకాలమూ ఆ రహస్యం నాకూ, నా పనిలో భాగస్వామినియైన మరొకరికీ తప్ప ఇంకెవ్వరికీ తెలియదనుకుంటూ వచ్చాను. ఇక నన్ను వేధించక, వెళ్లి ఆ సాక్సన్ మంత్రగత్తె ఉల్రికాను పట్టుకో! అదే ఆనాడు శవానికున్న గాయాలను కనిపించనీకుండా చేసి, అది మామూలు చావేకాని హత్యకాదని లోకం నమ్మేటట్లు చేసింది. అదే నన్ను ఈ పనికి ప్రోత్సహించినది కూడ! పో,— వెళ్లి దాన్ని పట్టుకో! నరకయాతనల రుచి అది కూడా నా వలెనే అనుభవించాలి!'—అన్నాడు, కొంతసేపటికి ఎలాగో పెకల్చుకొని.

'అనుభవిస్తూనే ఉంది ఇదివరకే,— ఇప్పుడు కొత్తగా అనుభవించవలసిందిలేదు,— ఆ అనుభవంలో ఇప్పుడు నీవుకూడా పాలు పంచుకుంటున్నావు కనుక, ఆ చేదులోనే కొంచెం తీపికూడ నాలుకకు తగులుతోంది'— అంటూ ఉల్రికా చాటునుండి ఇవతలకువచ్చి, ఫ్రాంట్ డీబాఫ్ మంచంముందర నిలబడింది. 'నేనే ఫ్రాంట్ డీబాఫ్! నీవిప్పుడెంత పండ్లు కొరికినా, గ్రుడ్లు ఉరిమినా, పిడికిళ్లు బిగించినా, నాకేం భయంలేదు. ఒకప్పుడు నీ పిడికిలి పోటుకు, అడవిదున్న తలకాయలు చితుకగొట్టగల తాహతుండే ఉండి ఉండవచ్చు. కాని, ఇప్పుడు మాత్రం, నా చేయియెంతో నీది అంతే!', అని రొప్పి వాదించింది.

'ఓసి దుర్మార్గురాలా! నీవటే! నేనీ స్థితిలో ఉండడం చూచి ఆనందించవచ్చావన్నమాట! ఎంత అసహ్యంగా ఉంది నీ రూపం! ఛీ ఛీ!! అవతలికిపో!' అని — ఛీత్కరించాడు ఫ్రాంట్ డీబాఫ్.

'అవును నేనే, — ఉల్రికాను. మీరు హత్యచేసిన టార్క్విల్ ఉల్ఫ్‌గాంగరు కుమార్తెను. ఆయనవలెనే హత్యచేయబడిన ఆయన కుమారులతోబుట్టువును. మీ ఫ్రాంట్ డీబాఫ్ వంశం నన్ను సర్వనాశం చేసివైచింది. దానికి ప్రతీకారం ఇప్పుడు చేయ నిశ్చయించాను. నీవుకూడా సర్వనాశమయ్యేటంతవరకూ నిన్ను వదలిపెట్టను' — అని వికటాట్టహాసం చేసింది ఉల్రికా.

ఫ్రాంట్ డీబాఫ్ కంగారుపడి, వారా వీరా అని అరవడం మొదలుపెట్టాడు. కాని, అక్కడ ఎవరూ అతని ఘోష చెవిని బెట్టినవారు లేరు. బయటినుంచి సమరార్భటులు అతి భయంకరంగా వినిపిస్తున్నాయి. 'అదిగో వింటున్నావా? అవి వట్టి సమరార్భటులు కావు. నీకు సర్వనాశం తెచ్చిపెట్టబోతున్న ప్రళయగర్జనలు. నీ అధికార సౌధం పునాదులతో కదిలిపోతోంది. నీ కంటికి తుట్టపురుగులుగా కనిపించిన సాగ్జన్లే నీ కోటగోడలనిప్పుడు అధిగమించబోతున్నారు. ఇంకా ఇక్కడే పడుకున్నావేమి ఫ్రాంట్ డీబాఫ్! వెళ్ళి వాళ్ల నెదిరించవూ?' — అని ఎకసక్కెం చేసింది ఉల్రికా.

ఫ్రాంట్ డీబాఫ్ విపరీతమైన ఆవేదనతో ఘూర్ణిల్లిపోతూ, ఒక్కక్షణం సేపు తనకు ఏ దేవుడైనా, ఏ దయ్యమైనా, ఆ సమరాంగణంలోకి వెళ్లి పడే ఓపిక కలుగజేయ్యగూడదా అని విహ్వలించాడు. అచటికి వెళ్ళపడితే, యుద్ధం మధ్యలో వీరమరణం పొందవచ్చునుగదా యని అతని ఆశ.

కాని, ఉల్రికా ఆ ఆశను నిరాశ చేస్తూ ఇలా అంది: 'మహావీరుడవు పాపం! వీరమరణం పొందాలని ఆశపడుతున్నావు. కాని, ఉల్రికా నిన్ను అలా వీరమరణం పొందనివ్వదు. పొదలోని గుంటనక్క పొదకు నిప్పంటించినప్పుడు పొదలోనే మలమలమాడి చచ్చినట్లు నీవు చావాలి! అంతకంటె మంచి చావు నీకు రావడానికి వీలులేదు!'

ఫ్రాంట్ డీబాఫ్ ఆపాదమస్తకం క్రోధంతో కంపించిపోతున్నాడు — కాని, చేయగలిగినదేమున్నది? ఏమీ చెయ్యలేక తిట్టిపోయడం మొదలుపెట్టాడు. 'కోట ఆ సాగ్జన్ మూకకు వశమౌతుందని ఆశపడుతున్నావు కాబోలు! అదెన్నటికీ జరగదు. టెంప్లార్ డీబ్రేసీలే గెలిచితీర్తారు. గెలవగానే విజయసూచకంగా వేయబోయే భోగిమంటలో, మొట్టమొదటగా నిన్ను ఆహుతి చేయించే వరకైనా నేను బ్రతికి ఉండకపో' నని అక్కసు వెళ్లగ్రక్కాడు.

'అలాగే ఆశపడుతూ ఉండు. అది నెరవేరే ఆశ కాదని చివరకు నీకే తెలుస్తుంది'—అంటూ ఉల్రికా అంతలోనే త్రిప్పుకొని,—'ఆఁ, అలా కాదు,—ఇంక కొద్దిసేపటిలో నీకు ఎలాంటి దుర్గతి పట్టనున్నదో ఇప్పుడే నీవు తెలుసుకోవాలి! ఎంత తన్నుకుచచ్చినా ఆ దుర్గతిని ఇక నీవు తప్పించుకోలేవు. అదిగో చూచావా, ఆ గదులలోంచి చుట్టలు చుట్టుకుంటూ కారుపొగలు ఎలా పైకి లేస్తున్నాయో! అవి యేమిటని నీ అభిప్రాయం? చావుకాలంలో నీకళ్లకు గ్రమ్మే చీకట్లే అలా కనిపిస్తున్నాయని అనుకునేవు! కాదు. ఆ కారుపొగలకు వేరే కారణం ఉంది. ఆ గదులక్రింద నేలమాళిగలలో కట్టెలు కర్రా సామగ్రి నిల్వచేయబడిన సంగతి గుర్తున్నదా?'—అని వికటంగా నవ్వింది ఉల్రికా!

'ఆఁ! ఏమిటీ! కొంపతీసి, ఆ సామగ్రికి నిప్పంటించలేదుకద! ఓసి దయ్యమా! ఇంకా అనుమానించడాని కేముంది! నిప్పంటించావు, కోట అగ్ని జ్వాలల కాహుతియై పోతోంది'—అని ఆక్రోశించాడు ఫ్రాంట్ డీబాఫ్.

'అవును,—ఆహుతియైపోతోంది. ఆ మంటలు చల్లార్చడానికి కోట లోపల ప్రయత్నాలు జరిగే సమయంలోనే, కోటబయట ముట్టడిదారుల ముట్టడి మరింత తీవ్రతరం కాగలదు. ఏ సంకేతం చూడగానే వారు విజృంభించాలో వారి కిదివరకే తెలియజేశాను. ఇక సెలవు. నే వెడుతున్నాను. నీ మరణ శయ్య పక్కనే నిన్ను ఓదార్చడంకోసం భూతప్రేత పిశాచాలుంటాయి, ఫరవా లేదు. ఆఁ, అన్నట్లు, ఇంకో సంగతి కూడ నీకు చెప్పాలి. ఇది నీకు ఏ కొంచె మైనా ఓదార్పు కలిగించేటట్లుంటే కలిగించనీ, నాకేం అభ్యంతరంలేదు. ఈ అగ్నిజ్వాలల్లో నీ వొక్కడవే కాదు, ఈ ఉల్రికా కూడ ఆహుతియై పోనున్న దని తెలుసుకో! పితృహంతకుడా, ఇక సెలవు! ఈ గదిలో ఉన్న ప్రతి శిలా ఒకొక్క నోరై, ఈ నీ బిరుదాన్ని యెలుగెత్తి చాటుతూ నీ చెవులలో ప్రతి ధ్వనింపచేయుగాక!'

ఉల్రికా ఇలా అంటూ ఆ గది విడిచి బయటికి వెళ్లిపోయింది. వెంటనే తలుపులు మూయబడ్డాయి. అంతేకాదు, వాటికి తాళం మీద తాళం రెండు తాళాలు వేసిన చప్పుడు కూడా ఫ్రాంట్ డీబాఫ్ చెవులపడింది. ఇప్పుడతడు శాశ్వతంగా ఆ గదిలో బంధితుడైపోయాడు. తప్పించుకునే అవకాశం యిక ఏ మాత్రమూ లేదు. భరింపరాని ఆవేదనతో తల్లడిల్లుతూ, 'నేనిక్కడ చస్తున్నాను రండర్రో' యని సేవకులను పేరుపేరునా ఎలుగెత్తి పిలువసాగాడు—'వస్తే చావనీమని ఇలా నన్ను వదిలేసి పోవలసిందేనా' యని మిత్రులైన బ్రయన్ డీబ్రేసీలను సంబోధించి ఘోషపెట్టాడు. కాని, ఆ రణకోలాహలం లో ఎవరికీ అతనిగోడు వినిపించడంలేదు. పొగలూ, సెగలూ ఎక్కువైనాయి.

నేలఅంతా కుతకుత ఉడికిపోతున్నట్లుగా ఉంది. ఒక్కొక్క క్షణం గడుస్తున్న కొద్దీ, అతడు చెందుతున్న ఆందోళన ఇంతా అంతా కాదు. పిచ్చెత్తినట్లయి,— ఒక్కొక్కసారి ఆ రణకోలాహలం మధ్య తాను కూడా గొంతు చించుకొని అరుస్తున్నాడు. ఒక్కొక్కప్పుడు చేయునది లేక తనను తానే తిట్టుకొంటు న్నాడు. మానవజాతిని తిట్టిపోస్తున్నాడు. ఇక దైవాన్ని తిట్టేతిట్లు సరేసరి!

క్రమంగా గదిని చుట్టుముట్టిన నల్లని పొగలు ఎర్రని మంటలుగా మారజొచ్చాయి. ఆ మంటలు చూస్తుంటే, అగ్నిపతాక లెగరవేసికొంటూ సైతానే తనమీదికి వస్తున్నట్లుగా ఉందతనికి. 'పోరా సైతాన్, పో! ఏమైనా సరే, నేను ఒంటరిగా మాత్రం నీ వెంట రాను. నా పరివారముంది, నా స్నేహితు లున్నారు. వాళ్లంతా వస్తేనే నేను కూడా వచ్చేది. పో, అందరినీ పిలుచు కొనిరా! అందరినీ వెంటవేసికొని అప్పుడు నేనూ బయలుదేరుతాను. నరక లోకానికి ఇలాంటి యాత్రికబృందం మళ్లా ఎప్పటికి బయలుదేరుతుందో! బలే! బలే యాత్ర! అహాహా...'!

ఫ్రాంట్ డీబాఫ్ పిచ్చివాడిలాగా ఒక పెద్ద నవ్వు నవ్వాడు. ఆ నవ్వు తో గది అంతా మారుమోగినట్లయి, ఎవరో తిరిగి తనను అపహసిస్తున్నట్లు భావించుకొన్నాడు. 'ఎవరా నవ్వేది?' అని పెద్దపెట్టున అరిచాడు. 'ఎవరా నవ్వేది? ఉల్రికా! నీవేనా ఆ నవ్వినది? చెప్పు, ఫరవాలేదు! ఇలాంటి నవ్వు ఈ సమయంలో నవ్వటం అందరికీ చేతయ్యే పనికాదు. నవ్వితే నీవు నవ్వాలి, లేకపోతే సైతానే నవ్వాలి! ఇతరులకు మాత్రం ఇలాంటి నవ్వు నవ్వడం దుస్సాధ్యం. పో, ఇక వెళ్ళిపో ఇక్కణ్ణుంచి! ఇక చాలు నీ వికటాట్టహాసం!'

దైవద్రోహీ పితృద్రోహీ అయిన రెజినాల్డ్ ఫ్రాంట్ డీబాఫ్ అవసానదశను గూర్చి యిక తరువాత వర్ణించబూనుకోడం మంచిది కాదు.

# అధ్యాయం ౩౨

నీలకవచధారి ప్రభృతులు ఆక్రమించగలిగిన బాహ్యరక్షణ స్థానానికి కోట ద్వాడివాకిలికీ మధ్యగా ఒక అగడ్త ఉన్నదనీ, దానిపైని వంతెననే టెంప్లార్ బ్రియన్ ఇదివరలో బాహ్యరక్షణ స్థానాన్ని వదలుకొని కోటలోనికి తిరోగమించిన సమయంలో పగులగొట్టివెయ్యడం జరిగిందనీ పాఠకులకు తెలిసియే యున్నది. ద్వాడివాకిలిని కూడా స్వాధీనం చేసుకొని లోనికి చొరబడాలంటే ఈ అగడ్తను దాటే ఉపాయం ఏదైనా చెయ్యాలి. నీళ్ళమీద తేలగల ఒక సన్నని వంతెనలాంటిదానిని నీలకవచధారి కొయ్యదూలాలతో తయారుచేయించాడు. తడవకు ఇద్దరిద్దరు మాత్రమే ఈ వంతెనమీదినుంచి నడచిపోవడానికి వీలౌతుంది. అదను చూచి ఎలాగో మొత్తం ఈ వంతెనను అగడ్తలోకి త్రోయించారు. ఇక దాటడమే తరువాయి. కాని, అది సులభమైన పనికాదు. వంతెన మీదికి అడుగుపెట్టినవారినెల్ల హతమార్చడానికి కోటగోడలమీదివారు సకల ప్రయత్నాలూ చేస్తున్నారు.

కాని, నీలకవచధారి తన పట్టుదల విడువలేదు. సాయంకాలమయ్యే లోగా ఎలాగైనా కోట సాధించితీరాలి. లేనియెడల, కోటలోనివారికి తోడ్పాటు కలగడానికి యార్కు నగరమునుంచి ఎవరైనా వచ్చిపడితే, ఈ చేసిన శ్రమంతా వృధా అయిపోతుంది. అందుచే వేగిరపడి, శత్రువుల దృష్టిని చెదరగొట్టడం కోసం అవతలివైపునుంచి కూడ బాగా ఒత్తిడి తెమ్మని లాక్స్లీకి కబురుచేసి, తానిక్కడ వంతెన దాటే ప్రయత్నములో నిమగ్నుడయ్యాడు. అగ్రగాములుగా తాము ముందుండడం నాయకుల లక్షణం గనుక, సెడ్రిక్కుతో సహా ముందు తాను ఒక్క ఉదుటున నిమేషమాత్రంలో వంతెన దాటి అవతలివైపు చేరగలిగాడు. ఆ రీతిగానే అతని అనుయాయులు కూడా ఇద్దరు చొప్పున దాటవలసి ఉంది. కాని, శత్రువుల బాణపరంపర తీవ్రంగా వచ్చి మీదపడుతూ ఉండడంవల్ల అది వారికి సాధ్యం కావడంలేదు.

అవతలివైపు చేరిన నీలకవచధారి తన గండ్రగొడ్డలితో గేటు తలుపులు పగలగొట్టడానికి ప్రయత్నం చేయసాగాడు. ఇదివరలో టెంప్లార్ పగులగొట్టి వేసిన వంతెనయొక్క భగ్నశేషం అతనికి కొంచెం ఆచ్ఛాదనగా ఉన్నందువల్ల, శత్రువులు ప్రయోగించే శిలలు, అమ్ములు పెందరైనవి అతనికి అంతగా తగలడంలేదు. అదికాకుండా, బాహ్యరక్షణస్థానంలో స్థావరం ఏర్పరచుకొని యున్న అతని అనుయాయులుకూడ అతని వలె నిస్సహాయస్థితిలో వదిలేసి ఊరుకోలేదు. కోటబురుజులమీదివారిపై ఊపిరి సలపనీకుండ అంపవృష్టి కురి

పిస్తున్నారు. బురుజులమీదివారు అందుచే నీలకవచధారినీ సెడ్రిక్కునూ మట్టుపెట్టడానికి చేసే ప్రయత్నమంతగా సాగిరావడంలేదు. అయినా, వారి ఉభయులస్థితీ చాలా ప్రమాదకరంగానే ఉన్నదని చెప్పకతప్పదు. క్షణక్షణానికీ ఆ ప్రమాదం హెచ్చుతోంది గాని తగ్గటంలేదు. డీబ్రేసీ తన అనుయాయులను ప్రోత్సహించి, ఆ యిద్దరిమీదికీ పెద్దపెద్ద శిలలు దొర్లింపజేసే ప్రయత్నంలో ఉన్నాడు.

సరిగ్గా ఈ సమయంలో, ఉల్రికా సెడ్రిక్కుతో చెప్పిన అరుణపతాకం కోటగోపురంమీద ఎగురుతూ కానవచ్చింది. దానిని మొట్టమొదటగా చూచినవాడు లాక్స్లీ. ఆ సమయానికతడు దొడ్డివాకిలి వైపున పోరు ఏ రీతిగా జరుగుతున్నదీ చూడడానికి వచ్చాడు. సెడ్రిక్ వలన ఉల్రికాను గూర్చిన ఉదంతమంతా ఇదివరకే వినియున్నాడు గనుక, ఇక కోట మనదేనని సంతోషంతో ఒక గంతు వేసి, గట్టిగా తిరిగి ఒక పట్టు పట్టండని అనుచరులను ఒకప్రక్క పురికొల్పుతూనే, తానొక బాణం సంధించి సరిగ్గా గురిచూచి వదిలాడు. నీలకవచధారిమీదకీ, సెడ్రిక్కు మీదకీ ఒక పెద్ద గండశిల దొర్లించడానికై లివరు మీటబోతున్న ఒక సైనికుని వక్షస్థలంలోంచి దూసుకొనిపోయిందది. అతడు క్రిందబడిపోయాడు. వెంటనే మరొక సైనికుడు ఆ లివరు అందిపుచ్చుకొని మీటబోయాడు. లాక్స్లీ బాణం ఈసారి అతని శిరస్త్రాణాన్ని సైతం భేదించి అతన్ని కందకంలోకి కూలద్రోసింది. ఆ శరఘాతవేగానికి కవచాలూ శిరస్త్రాణాలూగూడ ఆగేటట్లులేవు. అందుచే మూడోవాడెవ్వడూ ఇక ఆ లివరు మీటడానికి ముందుకు రాలేకపోయాడు.

అంతట డీబ్రేసీ, తానే స్వయంగా ఆపని చెయ్యడానికి లివరు చేతబట్టాడు. లాక్స్లీ అతనిమీదకూడా గురిచూచే బాణం వదిలాడు గాని, అతను తొడుక్కున్న కవచాన్ని భేదించడం దానికి సాధ్యం కాలేదు. వరుసగా మూడు బాణాలు ఇలా వృథ అయ్యేసరికి, ఇక ప్రయోజనం లేదనుకొని, పైనుంచి గండశిల పడబోతోంది తప్పుకోండని సెడ్రిక్కునూ నీలకవచధారినీ హెచ్చరిస్తూ ఒక పెద్ద కేకపెట్టాడు. కాని, గేటు తలుపులను గండ్రగొడ్డలితో, ఖణేలు ఖణేలు మని రొద పుట్టేటట్లు అదే పనిగా బద్దలుకొట్టుతున్న నీలకవచధారికి గాని, సెడ్రిక్కుకు గాని ఆ కేక వినిపించలేదు. గండశిల కదల నారంభించింది. కొద్ది సేపటిలో క్రిందబడడం ఖాయం. స్వామిభక్తి పరాయణుడైన గర్త్ ఇది చూస్తూ ఊరకుండలేకపోయాడు. ఎలాగైనా సెడ్రిక్కును రక్షించాలని సాహసించి వంతెనమీద కెగబడ్డాడు. కాని, అతడు సెడ్రిక్కును చేరేలోపుగానే ఆగండశిల వచ్చి వారిమీద పడేటట్లుంది. డీబ్రేసీ ఆఖరిపట్టు పట్టి లివరు మీటే ప్రయత్నంలో ఉన్నాడు. ఇంతలో,

టెంప్లార్ బ్రయన్ వచ్చి అతని చెవిదగ్గర ఇలా అన్నాడు: 'అయిపోయింది డీబ్రేసీ, సర్వనాశమైపోయింది! కోట యావత్తూ తగులబడిపోతోంది!'

ఆ మాటతో, డీబ్రేసీకి చేతిలో పట్టు సడలిపోయింది. 'ఆఁ, ఏమిటీ!-' అంటూ లివరు జాడవిడిచాడు. కోట పశ్చిమ భాగమంతా తగులబడిపోతోందనీ, మంటలు ఆర్పడానికి తానుచేసిన ప్రయత్నాలు సాగిరాలేదనీ బ్రయన్ తెలియజేశాడు. అయితే ఇప్పుడు ఏం చెయ్యాలన్నాడు డీబ్రేసీ. 'ఈ విధమైన పోరాటంవల్ల ఇక ప్రయోజనంలేదు. కొంతమంది అనుచరులతో నీవు దొడ్డిగేటు తెరచుకొని శత్రువులమీద పడు. నేను కొంతమంది అనుచరులతో ముఖద్వారం తెరచుకొని అవతలి వైపునుంచి బాహ్యరక్షణ స్థానంమీదికి వచ్చిపడతాను. ఆ బాహ్యరక్షణ స్థానాన్ని గనుక ఎలాగైనా మనం తిరిగి స్వాధీనపరచుకోగలిగితే, మనకు కొంత వెసులుబాటు చిక్కుతుంది'—అని సమాధానమిచ్చాడు బ్రియన్.

డీబ్రేసీకి ఈ ఉపాయం బాగానే తోచింది. సరేనని కొంతమంది అనుచరులతో వెళ్ళి దొడ్డిగేటు తెరిచాడు. కాని, తెరిచీ తెరవడంతోటే, ముందున్న ఇద్దరినీ చెరియొక దెబ్బతోనూ నేలకూల్చి, నీలకవచధారి సెడ్రిక్‌తో సహా లోనికి చొరబడ్డాడు. ఆ ధాటీకి తట్టుకోడం చేతగాక తక్కిన అనుచరులుగూడా ఓసరిల్లేసరికి, ఇక డీబ్రేసీయే స్వయంగా నీలకవచధారితో తలపడ్డాడు. డీబ్రేసీ ఖడ్గంతోనూ, నీలకవచధారి గండ్రగొడ్డలితోనూ ఒండొరులపై విసురుకొంటున్న ఆ దెబ్బలకు ఆ పరిసరాలన్నీ దద్దరిల్లిపోతున్నాయి— డీబ్రేసీ చాలా గొప్పగానే పోట్లాడాడు. కాని ఆ గొప్పతనం నీలకవచధారి ముందు అక్కరకు రాలేదు. తుట్టతుదకు, ఒక బలమైన గొడ్డలి పెట్టుతో డీబ్రేసీ నేలపై చాపచుట్టుగా కూలిపడ్డాడు. ఆ దెబ్బను అతని డాలు కొంత ఆపుకొని యుండబట్టిగాని, లేకపోతే అతనికిక తిరిగి లేవడమంటూ ఉండేదికాదు.

నీలకవచధారి వెంటనే ఒక బాకును డీబ్రేసీ ముఖానికి గురిచేసి పట్టుకొని,—'లొంగిపో డీబ్రేసీ! లేకపోతే నీ ప్రాణాలిక దక్కవు'—అని అదలించాడు. 'ప్రాణాలు దక్కకపోయినాసరే,— ఒక అనామకుడికి మాత్రం నేను లొంగను. నీవు ఎవరవు, నీ పేరేమి'టని అడిగాడు డీబ్రేసీ. నీలకవచధారి అతని చెవిలో ఏదో చెప్పాడు. అంతే! డీబ్రేసీ ఇక బీరాయించడం మాని పిల్లివలె అయిపోయి అతనికి స్వాధీనమయ్యాడు.

'అయితే, నేను తిరిగి ఉత్తరువుచేసేదాకా, వెళ్ళి ఆ బాహ్యరక్షణస్థానం దగ్గర ఉండు'—అని ఆజ్ఞాపించాడు నీలకవచధారి.

'అలాగే ఉంటాను కాని, ఒక ముఖ్యమైన సంగతి మీతో చెప్పాలి. ఐవాన్‌హో గాయపడి ప్రస్తుతం ఖైదీగా ఈ కోటలో ఉన్నాడు. వెంటనే వెళ్ళి రక్షించకపోతే అతడీ మంటల్లో ఆహుతియైపోతాడు'—అన్నాడు.

'ఆఁ! ఐవాన్‌హో ఇక్కడ ఖైదీయా? మంటలమధ్య చిక్కుకున్నాడా? అతని కేమాత్రం అపాయం వాటిల్లినా ఈ కోటలోనివారి నెవ్వరినీ నేను మన్నించను. చెప్పు, ఏ గదిలో ఉన్నాడతడు?'—అని అడిగాడు నీలకవచధారి.

'అదుగో, ఆ కనబడే మెట్లవరుస సరాసరి అతడున్న గదిలోకే తీసుకొని పోతుంది. అనుజ్ఞ అయితే దారి చూపిస్తాను'—అన్నాడు డీబ్రేసీ.

'అక్కర్లేదు. నిన్ను నేను నమ్మను. నీవు వెళ్ళి బాహ్యరక్షణస్థానం వద్దనే ఉండు'—అని ఆజ్ఞాపించాడు నీలకవచధారి.

ఈ ప్రసంగం ఇలా నడుస్తున్న సమయంలో, గ్రామభృత్యుల నాయకత్వాన సెడ్రిక్, అచటనున్న డీబ్రేసీ అనుచరులతో తలపడ్డాడు. వారిని పారద్రోలడం అతనికెంతోసేపు పట్టలేదు. తమ నాయకుని పరాజయం చూడడంతోటే వారిక నిలిచిపోరాడలేక కాలికి బుద్ధిచెప్పారు. డీబ్రేసీ నెమ్మదిగా లేచి నిలబడి, తనను విశ్వసించనందుకు నీలకవచధారివంక అదోరకం చూపు దీనంగా చూస్తూ, నేలపైబడియున్న కత్తిని గైకొని, సరాసరి బాహ్యరక్షణ స్థానంవైపు నకు నడిచి, త్రోవలో యెదురువచ్చిన లాక్స్లీకి ఆ కత్తి నప్పగించివేశాడు.

అగ్నిజ్వాల లంతకంతకు విజృంభించి, ఐవాన్‌హో పరుండియున్న గదిని చుట్టుముట్ట నారంభించిన సమయమది. రెబెకాకు మొదట ఈ పొగలెందువల్లనో అర్థంకాలేదు. యుద్ధకోలాహలం వల్ల ఐవాన్‌హోకు తిరిగి మెలకువ రాగానే వెనుకటివలె గవాక్షం వద్ద చేరి అతనికి యుద్ధవిశేషాలు వినిపించ నారంభించింది. పొగలు అంతకంతకు దట్టమై, నీళ్ళకోసం జనం కేకలు పెడుతూ అటూ ఇటూ పరుగులెత్తుతూ ఉండడం చూచినమీదట, కోటకు నిప్పంటుకున్న సంగతి ఆమె కవగతమైంది. ఆదుర్దాగా ఐవాన్‌హోకు ఈ సమాచారం తెలియజేస్తూ, 'అయ్యో! ఇప్పుడెలాగ మనం తప్పించుకోడ'మని భీతచిత్తయై దిక్కులు చూడ నారంభించింది.

'నా సంగతి నీ విక పెట్టుకోవద్దు రెబెకా! నన్ను మానవమాత్రు డెవ్వడూ కాపాడలేడు. నీవైనా ప్రాణాలు దక్కించుకో! పారిపో వెంటనే యిక్కడినుంచి!'—అని తొందరించాడు ఐవాన్‌హో.

'అదెన్నటికీ జరగడానికి వీలులేదు. పోతే మనమిద్దరమూ పోవలసినదే! పారిపోయేమాట కల్ల. అయ్యో దైవమా! మా నాన్న స్థితి ఏలా ఉన్నదో ఇప్పుడు!'— అని విహ్వలించింది రెబెకా.

ఈ సమయంలో, గదితలుపు తెరచుకొని టెంప్లార్ బ్రయన్ అచట ప్రత్యక్షమయ్యాడు. కవచం అచ్చటచ్చట పగిలి రక్తసిక్తంగా ఉంది. నెత్తిమీద కుళాయి సగం కాలిపోయి చీకిరిబాకిరిగా ఉంది. 'నీకోసమే వెతుకుతున్నాను రెబెకా! నా సుఖదుఃఖాలకు భాగస్వామినివి నీవే! ఇక్కడనుంచి తప్పించుకొని పోయేందుకు ఒక్కటే మార్గముంది. ఎన్ని ప్రమాదాల నెదుర్కొని నీ ముందుకు వచ్చి పడ్డానో తెలుసా? రా వెంటనే! వెళ్ళిపోదాం!'— అని ఆమెను తొందరించాడు.

'ఒంటరిగా మాత్రం నేనిక్కడనుంచి కదలను. మీలో కనికరమనేది యేమైన ఉంటే, నీవు తొడుక్కున్న కవచం లాగ నీగుండె ఇనుముతో చేసినది కాకపోతే, నా తండ్రిని ఈవిపత్తు నుంచి తప్పించు. అలాగే ఈ నిస్సహాయుడైన యోధుని కూడా తప్పించి బయటపడెయ్'— అనిఅర్థించింది రెబెకా.

టెంప్లార్ నిబ్బరంగా ఇలా సమాధాన మిచ్చాడు: 'ఏమంటావు? యోధుణ్ణి తప్పించాలిసిందా? అది పొసగని మాట రెబెకా! యోధుడైన వానికి చావు ఆయుధాల వలన రానీ, అగ్ని ప్రమాదంవలన రానీ, ఎలా వచ్చినా అతడు దానికి సిద్ధ పడవలసినదే! ఇక పోతే, యూదీయుని రక్షణ విషయమై నావంటివాడు పట్టించుకోడం అసలే కుదరదు. వాడు చస్తే యెంత, బ్రతికితే యెంత!'

రెబెకా ఈ హృదయకాఠిన్యాన్ని తీవ్రంగా నిరసిస్తూ, 'నిర్ఘృణుడా! ఈ అగ్నిజ్వాలల్లో పడి నశించిపోవడానికైనా ఒప్పుకుంటానుగాని, నీ వలన రక్షణపొందడానికి మాత్రం అంగీకరించను' అని తన వైముఖ్యం ప్రకటించింది.

'నీ అంగీకారంతో ఇక్కడ నాకు పనిలేదు. ఒకసారి ఇదివరలో నా ప్రయత్నం సాగనీకుండ చేయగలిగావు. రెండవసారి కూడా నా ప్రయత్నాని కడ్డుతగలడం ఇంతవరకు ఏ మానవమాత్రునికీ సాధ్యం కాలేదు'— అంటూ టెంప్లార్, హఠాత్తుగా ఆమెనొడిసిపట్టి, చేతులలోకి ఎత్తుకొని చరచర బయటికి నడచిపోయాడు. భయవిహ్వలయై ఆమె పెట్టిన కేకలతో ఆ పరిసరములన్నీ మార్మ్రోగిపోయాయి. ఇదంతా తన కళ్ళముందర జరగడం ఐవాన్‌హోను చాలా ఉద్రిక్తుని చేసింది. కాని, ఏం చెయ్యగలడు? బొత్తుగా లేవలేని పరిస్థితి అయిపోయిందతనికి. 'అరే దుర్మార్గుడా! విడిచిపెట్టరా ఆ పిల్లని! టెంప్లారు

సని చెప్పుకోడానికి నీకు సిగ్గులేదటరా! నీలాంటివాళ్ళ మూలంగానే ఆ పవిత్ర వ్యవస్థ కళంకితమౌతోంది. విడిచిపెట్టవేమిరా! పాపీ! ఇది ఐవాన్‌హో ఆజ్ఞ! విడిచిపెట్టు! విడిచిపెట్టకపోతే, నీ గుండెలు వ్రక్కలుచేశానన్నమాటే!' అంటూ ఉద్రిక్తుడై గర్జింపసాగాడు.

ఇంతలో నీలకవచధారి లోనికి ప్రవేశిస్తూ, 'నీ కోసమే వెదుకుతున్నాను విల్ఫ్రెడ్! నీ కేకలమూలంగా తుదకు నీవున్నచోటు తెలుసుకోగలిగాను. లేక పోతే నిన్ను కనుక్కోగలిగియుండేవాణ్ణి కాదు'— అంటూ ఐవాన్‌హోను సమీపించాడు.

'మీ రెవరో ఉత్తమ వీరుల్లాగ ఉన్నారు. నా సంగతి కేమిగాని, ఆ దుర్మార్గుణ్ణి వెంటాడండి. రొవెనా సుందరిని కాపాడండి. సెడ్రిక్‌ను ఎచ్చట ఖైదు చేశారో చూడండి'— అని అర్థించాడు ఐవాన్‌హో.

'వారి సంగతీ చూస్తాం. ముందు నీసంగతి చూడనీ'— అంటూ నీల కవచధారి అతనిని, ఇంతకుముందు రెబెకాను టెంప్లార్ ఎత్తుకొన్నట్లుగానే, అవలీలగా ఎత్తుకొని చరచరా దొడ్డిగేటు వద్దకు పరుగెత్తి, జాగ్రత్తగా చూస్తూ ఉండమని ఇద్దరాటవికులకు అతని నప్పగించి, తిరిగి యితర ఖయిదీల రక్షణార్థం కోటలోనికి పరుగెత్తాడు.

ఇప్పటికే కోటలోని ఒకభాగం పూర్తిగా తగులబడిపోయింది. గోడలు చాల బలిష్ఠమైనందున, తక్కిన భాగాలకు అగ్ని ఇంకా అంత తొందరగా వ్యాపించడంలేదు. కాని, ఆప్రదేశాలన్నీ ఇప్పుడు ఫ్రాంట్‌డీబాఫ్ అనుచరులకూ ముట్టడిదారులకూమధ్య సంగ్రామరంగాలుగా మారిపోయాయి. ఫ్రాంట్‌డీబాఫ్ అనుచరుల యెడ వారంతా అమితమైన ద్వేషం కలిగినవారు కావడంచేత, తరిమి తరిమి మరీ వారిఅంతు కనుక్కోడం మొదలుపెట్టారు ముట్టడిదారులు. ఫ్రాంట్‌డీబాఫ్‌అనుచరులు కూడా అందుకు తగినట్లుగానే, మేన ప్రాణాలున్నంతవరకూ పోరాడి నేల కొరిగారే కాని దాదాపుగా ఎవ్వరూ దాసోహమని శరణు వేడలేదు. వేడిన ఒకరిద్దరినీ ముట్టడిదారులు కనికరించనూలేదు. కోటంతా వారిఆయుధసంఘర్షణ ధ్వనులతోనూ, వీరాలాపాలతోనూ, హాహాకారాలతోనూ పిక్కటిల్లిపోయింది. గదులన్నీ ఎక్కడ చూచినా, నెత్తుటితో తడిసి రొచ్చు రొచ్చు అయినవే!

ఈ గందరగోళం మధ్య సెడ్రిక్, రొవెనాను వెతుక్కుంటూ బయలుదేరాడు. విశ్వాసపాత్రుడైన గర్త్, అతని కంగరక్షకుడుగా, అతనిమీదపడే దెబ్బలన్నీ తాను కాచుకుంటూ వెన్నంటి వస్తున్నాడు. సెడ్రిక్ రొవెనా ఉన్నగదిని చేరిన సమయానికి, ఆమె ఇక జీవితముపై ఆశ వదులుకొన్నదై, మెడలోనిసిలువను

హృదయానికి హత్తుకొని, అంతిమ ఘడియకోసం ఎదురు చూస్తోంది. సెడ్రిక్ ఆమెను జాగ్రత్తగా దొడ్డిగేటుదగ్గరకు చేర్చమని గర్తుకు అప్పజెప్పి, తాను ఎథిల్‌స్టేనును వెతుక్కుంటూ బయలుదేరాడు.

కాని, వాంబా చాకచక్యంవల్ల ఎథెల్‌స్టేను యిదివరకే తప్పించుకొని ఆ ప్రమాదంలోంచి బయట పడ్డాడు. కోటలోపల యుద్ధం బాగా తీవ్రగతిలో సాగుతున్న అదను కనిపెట్టి, పారుతున్న హాలులోకికూడ ముట్టడిదారులు ప్రవేశించినట్లుగా వాంబా పెద్దపెద్ద కేకలు వేస్తూ, అచట వ్రేలాడ గట్టబడియున్న డాళ్ళు వగైరాలను ఒకదానితో మోగిస్తూ పెద్ద హంగామా చేయ నారంభించాడు. అవతలిగదిలో ఉన్న కాపలివాడు, ఇదివరకే చాల కంగారుగా ఉన్నవాడు గనుక, ఈ హంగామాకు మరింత బేజారై, హాలులోకి శత్రువులు ప్రవేశించారని టెంప్లార్‌కు విన్నవించడానికి తలుపుతీసి పరుగెత్తాడు. ఈ యవకాశంలో వాంబా ఎథెల్‌స్టేనును చల్లగా మునుపు ఆగదిలోకి నడ్డుకొని, అచటినుండి నెమ్మదిగా కోట మెల్లాలోపలకి అడుగుపెట్టారు.

మెల్లాలో, వారికి కనుపడిన దృశ్యమిది: టెంప్లార్ బ్రయన్ అశ్వారూఢుడై ప్రయాణసన్నాహంలో ఉన్నాడు. అతనిచుట్టూ మరికొందరు ఆశ్వికులూ పదాతులూ పరివేష్టించి ఉన్నారు. బ్రయన్ నాయకత్వాన ఎలాగైనా ఈ కోటలోం తప్పించుకొని పారిపోవాలనే ప్రయత్నంలో ఉన్నారిప్పుడు వీరు. అది సాగిరావడానికి వీలుగా, ముఖద్వారాని కెదురుగానుండే వంతెనను అగడ్తమీదికి తిరిగి వాల్పించారు. కాని, వంతెన వాలడంతోటే లాక్స్‌లీ అనుచరబృందం కోలాహలంగా వంతెనమీదికి తోసుకొని వచ్చింది. వీరిని భేదించుకొని టెంప్లార్ తన అనుచరులతో బయటికి ఉడాయించా లన్నమాట. దొడ్డిగేటునుండి చొచ్చుకొని వచ్చిన ఆటవికసైన్యంకూడా ఈ సమయానికే అవతలివైపునుంచి మెల్లామీదికి వచ్చిపడినందున, టెంప్లార్ ఉద్యమం నెరవేరడం చాల కష్టసాధ్యంగానే కనిపిస్తోంది. అయినా, అతని ధోరణి ఈ యవరోధాలనేమీ లెక్కచేసేటట్లుగా తోచడం లేదు. అనుచరులుకూడా అంతటి తెగింపుతోనే ఉన్నారు.

బ్రయన్ గుర్రపు జీనిసలలో నొకడు తాను గుర్రంమీద యెక్కి రెబెకాను తనముందర కూర్చోబెట్టుకున్నాడు. ఆమె రక్షణవిషయమై బ్రియన్ తీసుకుంటున్న శ్రద్ధ యింతా అంతా కాదు. ఆ తీసుకోడంలో, తనకు వచ్చే ప్రమాదం కూడ లెక్కచెయ్యడంలేదు. ఎదురైన శత్రువులనెల్ల ముందుకు దూకి మట్టుపెట్టుతూ తిరిగివచ్చి రెబెకా ప్రక్కన నిలబడుతున్నాడు. ఇలా బ్రియన్‌చేత అంత జాగ్రత్తగా కాపాడబడుతున్న ఆ స్త్రీవ్యక్తి రెబెకానా అయి

వుంటుందని ఎథెల్‌స్టేన్ భ్రమించాడు. అతనిలో వీరావేశం తటాలున పొంగింది. ఆమె రొవెనా కాదని వాంబా ఒక ప్రక్క చెపుతూనే ఉన్నా వినిపించుకోలేదు. నేలకొరిగిన ఒక సైనికుని చేతిలోని గదను అమాంతం తీసుకొని, ఎదురైనవారిని ఎడాపెడా బాదుతూ బ్రియన్ పరివారం మీదికి దూకబడ్డాడు. అదంతా త్రుటికాలంలో జరిగింది. చాలామంది ఆ గదాఘాతాలకు తూలి క్రింద పడిపోయారు.

బ్రియన్‌కు ఒక రెండుగజాల దూరంలో ఉన్నాడు ఎథెల్‌స్టేన్. 'ఆరే, వదుల్తావా లేదా ఆ పిల్ల' నని గర్జించి అతనిమీదికి గూడా ఉరకబోయాడు. కాని, అతడున్నది నేలమీద. టెంప్లార్ ఉన్నది గుర్రంమీద. పైగా ఎథెల్‌స్టేనుకు కవచాదుల రక్షణ ఏమీ లేదు. అయినా సాహసించి తనమీదికి విజృంభించబోతున్న ఎథెల్‌స్టేనును చూడగానే, బ్రయన్ ప్రక్కవాటుగా అతనిమీదికి గుర్రాన్ని తోలి, రికాబులపై నిలబడి, కత్తితో ఊడ్చి ఒక దెబ్బ నెత్తిపై కొట్టాడు. ఆ దెబ్బను ఎథెల్‌స్టేన్ తన గదతో ఆపుకోడానికి ప్రయత్నించాడు గాని ప్రయోజనం లేకపోయింది. గద రెండు ముక్కలు కావడంతోపాటు, ఎథెల్‌స్టేనుకు కూడా నెత్తిపై బలమైన దెబ్బతగిలి చాపచుట్టుగా క్రింద పడిపోయాడు.

బ్రియన్ పరివారాన్ని ఎదుర్కొంటున్నవారిలో ఇది కొంత కలవరం కలిగించింది. కంగారుపడి వారు కొంతదూరంగా తొలగి నిలిచిన సమయంలో, బ్రియన్ తన పరివారాన్ని హెచ్చరించి, ముందుకు ఉరికించాడు. అతని తురుష్క బానిసలతో సహా, మరికొంద రాశ్వికులు కూడా అతని ననుగమించారు. ఎదురైన ఆటవికులను చెల్లాచెదరు చేసుకుంటూ నిమేషమాత్రంలో వంతెన దాటివేశారు. ఆటవికుల అంపవృష్టి ఒక ప్రక్కన వచ్చి తనమీద బడుతున్నా లెక్కచేయక, బ్రయన్ తన గుర్రాన్ని బాహ్యరక్షణస్థానం వైపునకు పరుగెత్తించాడు. అది యీపాటికి డీబ్రేసీవశమై యుండవచ్చునని అతని అంచనా. కాని, అక్కడ డీబ్రేసీ స్వతంత్రుడుగా లేడు, ఖయిదీగా ఉన్నాడు. 'నిన్ను విడిపించితీసుకుపోతాను నావెంట ర'మ్మన్నాడు బ్రయన్. కాని, డీబ్రేసీ అంగీకరించలేదు. 'నేను పారిపోనని మాట యిచ్చాను కనుక పారిపోను, నీవు మాత్రం వెంటనే వెనుదిరిగి చూడకుండా పారిపోవడం మంచిది. ఈ దేశంలో ఇక ఉండవద్దు. సముద్రం కూడా దాటి ఎంత త్వరగా పలాయనం చిత్తగిస్తే అంత మంచి'దని సలహా యిచ్చాడు. 'మరేం ఫరవాలేదు, టెంపుల్‌స్టో ప్రముఖాన్ని గనుక నేనిప్పుడు చేరుకున్నానంటే నన్ను ఇక ఎవ్వరూ ఏమీ చేయలే'రంటూ పరివారంతో సహా దౌడుతీసి యించుక సేపటిలో అదృశ్యుడైపోయాడు బ్రయన్.

పారిపోవడానికి అవకాశంలేక కోటలోనే దిగబడిపోయిన వారితో కొంతసేపు వెనుకటి మాదిరిగానే పోరు జరిగింది. ఇంతలో, అగ్నిజ్వాలలు

కోట అన్ని వైపులకూ వ్యాపించాయి. అంతకంతకు వాటి ఘోష అధికం కాజొచ్చింది. ఆ భయంకర సన్నివేశంలో ఉల్రికా జుట్టు విరబోసుకొని, పిచ్చి త్తినదాని వలె వికటాట్టహాసాలు చేస్తూ కోట గోపురం మీద కనిపించింది. పగతీర్చుకోగలిగాననే వికటసంతోషంతో ఆమెకు పట్టపగ్గాలుండడం లేదు. చిందులు త్రొక్కుతూ, చేతిలోని కఱ్ఱ ఆకాశంలో ఆడిస్తూ, ఒక ప్రళయగీతమేదో పాడడం మొదలు పెట్టింది.

అగ్నిజ్వాల లింకా వృద్ధిఅయ్యాయి. సూర్యాస్తమయం కాబోతున్న ఆ సమయంలో, అదంతా ఒక పెద్ద భోగిమంటవలె దూరప్రదేశాలవారికి కూడ కనిపింపసాగింది. శత్రువులంతా నిర్జితులై, పోరాటం ఉపశమించినకారణం చేత, విజేతలు గుంపులు గుంపులుగా కూడి ఆ ప్రళయదృశ్యం ఆశ్చర్యంతో తిలకిస్తూ ఉండిపోయారు. ఉల్రికా ఉన్మత్తరూపం చాలసేపటి వరకూ ఆ గోపురం మీద అలా కనిపిస్తూనే ఉంది. ఆ ప్రళయ సామ్రాజ్యాని కంతకీ తానే అధికారిణియైనట్లు ఆమె ఆ గోపురంపై విహరిస్తోంది. ఇంతలో, ఒక బ్రహ్మాండమైన ధ్వనితో ఆ గోపురం యావత్తూ ఒక్కపెట్టున కూలి, ఆ అగ్నిజ్వాలల మధ్య ఉల్రికా ఇక తిరిగి కానరాలేదు. ఆ భయానక దృశ్యం అచట ఉన్నవారి నెల్లరినీ నిశ్చేష్టుల నొనర్చివేసింది. కొన్ని నిమిషాలవరకూ ఎవ్వరూ కదలలేదు, మెదలలేదు. కొంతసేపటికి, లాక్స్లీ తన అనుయాయులను హెచ్చరిస్తూ వేసిన కేక ఆ నిశ్శబ్దాన్ని చీలుస్తూ ఈ విధంగా వినిపించింది: 'రాక్షసులు నశించారు. రాక్షసావాసం నేలమట్టమైంది. కొల్లగొట్టిన వస్తుసంచయం ఇక పంపిణీ చేసుకోవలసి ఉంది. ఎవరెవరు ఏమేమి కొల్లగొట్టారో, అంతా తీసుకొని, మన వటవృక్షం చెంతకు రేపు ఉదయానికల్లా చేరండి. మిత్రులతో కలిసి, ఈ పంపిణీ న్యాయపద్ధతిలో జరుపుకుందాం.'

# అధ్యాయం 33

సూర్యోదయమయింది. అది హార్టుహిల్ అడవిలోని పురాతన వట వృక్షం. సంఘ బాహ్యులుగనూ, బందిపోటు దొంగలుగనూ ఎంచబడే లాక్స్లీ అనుయాయులంతా ఆ వటవృక్షంక్రింద సమావేశమైనారు. గత దినం టార్క్విల్‌స్టన్ కోటలో వారు కొల్లగొట్టి తెచ్చిన వస్తుసంచయమంతా ప్రక్కన కుప్పలు కుప్పలుగా పోయబడిఉంది. తివాసీవలె గడ్డి ఒత్తుగా పెరిగిన ఒక ఎత్తయిన మట్టిగడ్డపై లాక్స్లీ కూర్చునిఉన్నాడు. దానిమీదనే తన కుడి వైపున నీలకవచధారినీ, ఎడమవైపున సెడ్రిక్కునూ అతడు కూర్చుండబెట్టుకున్నాడు.

ఇక కార్యక్రమం ప్రారంభం కావలసిఉంది. క్రైస్తవ అతిథులు కూడా ఉన్నారుగనుక, కార్యక్రమం క్రైస్తవ ప్రార్థనతో ప్రారంభం కావడం సముచితమని చెప్పి, లాక్స్లీ కోప్మన్‌హర్స్టు ఫాదరీకోసం కలయజూచాడు. కాని అతడెక్కడా కనిపించలేదు. ఏమైనాడని భోగట్టా చెయ్యగా, ఫ్రాంట్ డీ బాఫ్ తాలూకు మద్యశాల ప్రాంతంలో తచ్చాడుతుండగా తాను చిట్టచివరిసారి చూచినట్లు మిల్లర్ చెప్పాడు. అంతట లాక్స్లీ, తక్షణమే కొంతమంది మనుష్యులతో వెళ్లి వానిని వెదకి పట్టుకొని తీసుకురావలసినదిగా మిల్లర్‌ను ఆదేశించి పంపాడు.

అయితే, అతడు వచ్చేవరకూ కార్యక్రమం ఆపడానికి వీలులేదు. నిన్నటి వృత్తాంతం తెలుసుకొన్నమీదట డీ బ్రేసీ సైన్యాలూ, మాల్వాయిసిన్ సైన్యాలూ మొదలైనవి తమమీదికి వచ్చిపడకముందే తాము పని పూర్తిచేసుకొని అదృశ్యం కావడం అవసరం. అందుచే లాక్స్లీ, వెంటనే తరువాతి కార్యక్రమాన్ని ఉపక్రమించాడు. అచటనున్న వస్తుసంచయాన్నంతనీ రెండు భాగాలుగా విభజించి, ఈ రెండిటిలో మీకిచ్చవచ్చిన భాగాన్ని మీరు తీసుకోండని ముందుగా సెడ్రిక్కును కోరాడు. ముట్టడిలో పాల్గొన్నవారిలో, సెడ్రిక్కునందు అభిమానంతో ఆ చుట్టుప్రక్కలనుంచి వచ్చినవారుకూడా చాలామంది ఉన్నారుగనుక, కొల్లగొట్టిన ధనంలో సగముపాలు సెడ్రిక్కుకు వదలివెయ్యడం న్యాయమని అతని నిర్ణయం.

కాని, ఎథెల్‌స్టేన్ మరణించాడన్న దుఃఖంలో మునిగియున్న సెడ్రిక్ ఈ పాలుపంపుళ్ళయందుత్సాహం చూపే స్థితిలో లేడు. 'నాకు గాని, నావాళ్లకు గాని ఈ వస్తుసంచయంలో ఏమాత్రమూ పనిలేదు. మమ్మల్ని ఆపదనుండి రక్షించినందుకు మీకు కృతజ్ఞత తెల్పుకోడంకోసం ఇక్కడ ఇంతసేపు ఉన్నాము గాని, పాలుపంపుల్లకోసం కాదు. ఎథెల్‌స్టేనుకు వెంటనేపోయి అంత్య సంస్కారాలు జరపాలి. రోవెనాకూడా త్వరగా రోథరువుడ్డు చేరుకోవాలని తొందర

పడుతోంది. యెవరికైనా ఆమెను తోడిచ్చి పంపితే సంతోషిస్తాను. ఇప్పటికే ఆలస్యమయింది. మేమిక వెడతాం. మమ్మల్ని ఆపదనుండి తప్పించినందుకు మీకు కృతజ్ఞతాభివందనా లర్పిస్తున్నాను,'—అన్నాడు సెడ్రిక్.

'అలా కాదు. ఈ వస్తుసంచయం మీ సొంతానికి అక్కరలేకపోవచ్చు. కాని, మీ అనుచరులనూ, మీ యిరుగుపొరుగువారినీ సత్కరించడానికైనా ఇది ఉపయోగించుకోవచ్చునుగదా? అంతా మేమే తీసుకోడం న్యాయంగా లేదు. మేము చేసిన కష్టం మీవాళ్లు చేసినదానికంటె ఎక్కువదేమీ కాదని నిశ్చయంగా చెప్పగలను. కనుక నిరాకరించక తీసుకోండి'— అని అర్థించాడు లాక్సిలీ.

'మా వాళ్లను సత్కరించుకో దానికి, నాకున్న ఆస్తియే నాకు చాలు, తక్కిన ఆస్తులతో నాకు పనిలేదు'— అని సమాధాన మిచ్చాడు సెడ్రిక్.

'కొందరు తెలివిగలవాళ్ళు తమ్మతామే సత్కరించుకున్నారు. అలాంటి వాళ్లు కేవలం వట్టిచేతులతో వెళ్లిపోబోవడం లేదు. అంతా తెలివితక్కువ వాళ్లే ఉండరుగదా మరి!'—అన్నాడు వాంబా.

'అది నాకు సంతోషమే! మా కట్టడులు మాకేగాని ఇతరులకు వర్తించవు'—అన్నాడు లాక్సిలీ.

వాంబా కంఠధ్వని వినిపించడంతోనే, అతను తనకోసం మృత్యువు నెదుర్కోడానికైనా సిద్ధపడి తనను చెరనుండి తప్పించిన సంగతి సెడ్రిక్కుకు జ్ఞాపకానికి వచ్చింది. ఆదరపురస్సరంగా అతని నాలింగనం చేసుకొని,—'వాంబా! నీకు నేను ఏమి ప్రత్యుపకారం చెయ్యగలను? నీవు వట్టి హాస్యగాడివనుకున్నాను గాని, నీలో ఇంతటి విశ్వాసం ఉన్నదనుకోలేదు,'— అని అంటూఉండగా అతని కన్నులలో నీరు నిల్చింది. అలాంటి ఆర్ద్రత కలగడం ఇదివరకెప్పుడూ అతనికి అలవాటులేదు. ఎథెల్‌స్టేన్ మరణంకూడా అతని కంటివెంట నీరు తెప్పించలేకపోయింది. అలాంటివాడిప్పుడు అశ్రుపూరితనయను డైనాడంటే, వాంబా తనపట్ల చూపిన విశ్వాసం అతని నంతగా కదిపివేసిన దన్నమాట.

వాంబా నెమ్మదిగా అతని కౌగిలిని విడిపించుకొని, 'అదేమిటి దొరా! అలా అంటున్నారు? నేను చేసిందేముంది? ఈ మాత్రానికి మీరు మీ కన్నీటిని వెచ్చిస్తే, మీతోపాటు నేనుకూడా కన్నీరు కార్చవలసివస్తుంది. అప్పుడు నా విదూషకవృత్తే భగ్నమైపోదా! అలా కాదు. నన్ను సంతోషపెట్టాలని మీకుంటే, ఇదిగో, ఈ గర్త చేసిన తప్పిదాన్ని మన్నించండి. మీతో చెప్పకుండా ఒక వారంరోజులు, మీ కుమారునికి నౌకరీ చెయ్యడంకోసం మీ నౌకరీనుంచి గైరుహాజరయ్యాడు'—అని విన్నవించాడు.

గర్త ప్రశక్తి సెడ్రిక్కును మరింత భావవివశుణ్ణి చేసింది. ఆవేశంతో ఇలా అన్నాడు: 'మన్నించడమా! గర్తను మన్నించటమే కాదు,—ఈ క్షణమే

బంధవిముక్తుని చేసివేస్తున్నాను. వంశపారంపర్యా అనుభవించడానికి మూరెకరాల భూమిని కూడా నా ఎస్టేటులో వ్రాసియిచ్చేస్తున్నాను. నేటినుంచీ అతను నా బానిసకాడు,—స్వతంత్రుడు!'

సెడ్రిక్ ఈ మాటలు అంటున్న సమయంలో, గర్త్ అతని పాదాలకడ నేలపై వ్రాలాడు. బానిసతనం తొలగిపోయిన సంతోషంతో అతను తిరిగి లేచి నిలబడేసరికి, ఆ ఒడ్డూ పొడుగూ మరింతగా పెరిగినట్లయింది. కంఠానవున్న బానిసకడియం తెగగొట్టడానికి ఇక్కడ ఎవ్వరూ కమ్మరిలేడా అని నలుదిక్కులా కలయజూచి తహతహ ప్రకటించాడు. కృతజ్ఞతాభారంతో సెడ్రిక్కుకు పునరభివాదం చేసి, 'మీరుచేసిన యీ మేలు నేనెన్నటికీ మరచిపోలేను. మీరు ప్రసాదించిన స్వతంత్రతవల్ల నాకు శరీరంలో రెట్టింపుబలం వచ్చినట్లుగా ఉంది. ఇనుమిక్కిలిగా మీ కొరకై పోరాడేందుకు నే నెప్పటికీ సంసిద్ధమే'— అని తన విశ్వాసం పునరుద్ఘాటించుకున్నాడు. తానూ తన పరిసరాలూ— అంతా మారిపోయినట్లుగా ఉన్నదతనికి. అతనిలో ఈ మార్పు అతనికుక్క ఫాంగ్సుకూడా గుర్తించినదికాబోలు, వెర్రిసంతోషంతో అది అతనిచుట్టూ ఎగిరి ఎగిరి గంతులువేయ నారంభించింది. 'నేను మారిపోయినట్లుగా ఉన్నాను, నన్ను ఎలా గుర్తించగలుగుతున్నావు ఫాంగ్సూ?'— అని గర్త్ ఫాంగ్సు నుద్దేశించి పలికాడు.

'ఫాంగ్సుగాని నేనుగాని నిన్ను గుర్తించలేకపోవడమనేది ఉండదు గర్త్! మరిచిపోతే, ఇక నీవే మమ్మల్ని నిన్నూ కూడ మరిచిపోవాలి'—అన్నాడు వాంబా.

'అలా ఎన్నటికీ జరగదు నేస్తం! నా ఒళ్లు నాకు తెలిసి ఉన్నంతవరకూ, నిన్ను నేను మరచిపోలేను. నీవంటివాడు స్వతంత్రులలో కనిపించడం అరుదు! మన సెడ్రిక్ నిన్నుకూడా స్వతంత్రుని చెయ్యాలని ఆశిస్తున్నాను'— అన్నాడు గర్త్.

'నీవు స్వతంత్రుడవైనావు నేను కాలేదని చింతపడుతున్నాననుకోబోకు గర్త్! స్వతంత్రులకు బాధ్యతలు చాలా ఉంటాయి. రణరంగాల్లోకి దూకి పోరాడవలసిన బాధ్యత స్వతంత్రునికి ఉంటుంది. మాకేమున్నది? హాయిగా ఇంటిపట్టున కూర్చుంటాం. రచ్చపట్టు సంఘర్షణల్లో తెలివిగలతనం కంటె, ఇంటిపట్టు కాలక్షేపాల్లో తెలివితక్కువతనం మేలంటారు; వినలేదా?' —అన్నాడు వాంబా.

ఇంతలో, గుర్రాల డెక్కలచప్పుడు వినపడింది. రొవెనా అశ్వారూఢయై కొంతమంది అశ్వికులతోనూ పదాతులతోనూ అచటికి విచ్చేసింది. ఆమె యిప్పుడు

యొప్పటి మాదిరిగా చక్కగా ముస్తాబై ఉంది. తన పూర్వపు హుందాతనాన్ని మరల చిక్కబట్టుకుంది. ఇంచుక విషణ్ణత్వం ఆమె ముఖంలో కనిపిస్తూ ఉన్న మాట నిజం. ఇంతకుపూర్వం ఆమెపడ్డకష్టాల కదియొక గురుతు. విషాదచ్ఛాయ ఇంకా తొలగకపోయినా, ఆమె ఫాలతలంపై, ఏదో ఆశారేఖ ఒకటి తిరిగి మెరుస్తున్నట్లుగా ఉంది. ఆపదనుండి ఉద్ధరించబడినందుకు ఒక విధమైన కృతజ్ఞతాముద్ర కూడా ఆ నొసలిపైన కనిపిస్తున్నట్లుగా ఉంది. ఐవాన్ హో క్షేమంగా ఉన్నాడని ఆమెకు తెలుసు. ఎథెల్ స్టేను చనిపోలేదన్న సంగతికూడా ఆమెకు అవగతమే. ఐవాన్ హో క్షేమంగా ఉండడం ఆమెకెంతో ఆనందంగా ఉంది. ఎథెల్ స్టేన్ బ్రతుకు కూడా ఆమె అలాగే సంతోషించిందని చెప్పరాదు గాని, ఏ ఒకేఒక విషయంలో తన అభిప్రాయాన్ని త్రోసిపుచ్చి సెడ్రిక్ తనకు బాధ కలిగిస్తూ వచ్చాడో, ఆ విషయమైన అడ్డంకి యిప్పుడు తొలగిపోయినందుకు తెరపిని బడినట్లయి ఆమె ఒక నిట్టూర్పు విడిచినదని చెప్పక తప్పదు. అందుకామె తృప్తురాలు.

రొవెనా తన గుర్రాన్ని సరాసరి లాక్స్లీ సమీపానికి నడిపించింది. లాక్స్లీ ఆమెకు స్వాగతం చెప్పడానికి లేచేసరికి, అతనితోపాటు అతని అనుచర బృందమంతా లేచింది. ఆ మరియాదకు రొవెనా చెక్కిళ్లు కెంపెక్కాయి. వినమ్రురాలై లాక్స్లీకి ప్రత్యభివాదం చేస్తూ ఇలా అంది: 'పీడితజనులను రక్షించడం కోసం ప్రాణాలు కూడా ఒడ్డి మీరు ప్రదర్శించిన శౌర్యసాహసాలు మరువరానివి. భగవంతుడు మీకు మేలు చేకూరుస్తాడు. ఇకముందు మీలో యెవరైనాసరే, ఆకలిగొన్నప్పుడు గాని దప్పిగొన్నప్పుడు గాని, సరాసరి మా గృహానికి విచ్చేయండని మనసారా అర్థిస్తున్నాను. మీరెప్పుడు వచ్చినా మా గృహం మీకు సుస్వాగతం పలుకుతుంది. నార్మన్ అధికారధూర్వహులు మిమ్మొకవేళ ఈ అడవులలోంచి వెడలగొట్టివేసే పక్షంలో, మీరేమీ చింతనొందవలసిన పని లేదు. రొవెనాకు సొంత యెస్టేటు అడవులున్నాయి. అందులో మీరు స్వేచ్ఛగా సంచరించవచ్చు. అక్కడ ఫారెస్టు రేంజర్ల బాధలు మీకేమీ ఉండవు.'

ఈ ఔదార్య ప్రకటనకు లాక్స్లీ తన అనుయాయులందరి తరఫునా కృతజ్ఞత వెల్లడిస్తూ—'మాకు వేరే ప్రత్యుపకృతి ఏమీ అవసరంలేదు రొవెనా సుందరీ!— నిన్ను ఒక ఆపదలోంచి రక్షించే భాగ్యం మాకు కల్గడమే ఒక మహోపకృతి. ఈ అడవుల్లో సంచరిస్తూ మేము పలురకాల దుడుకుపనులు చేస్తుంటాము. వాటికన్నిటికీ పరిహారంగా భావిస్తున్నాం ఈనాడు నిన్ను మేము రక్షించగల్గడం'—అన్నాడు.

రొవెనా తిరిగి అతనికి అభివాదం చేసి అచటినుండి కదిలింది. సెడ్రిక్ కూడా ఆమె ననుగమించడానికి లాక్స్లీవద్ద సెలవు గైకొంటున్నాడు. రొవెనా

గుర్రం ఒక చెట్టుప్రక్కనుంచి పోతూఉండగా, అక్కడ ఏదో దీర్ఘాలోచనా నిమగ్నుడైనట్లు చేతులుకట్టుకొని నిలబడివున్న డీబ్రేసీ ఆమెవంక తలయెత్తిచూచి ముందుకువచ్చి, రొవెనా గుర్రాన్ని కళ్లెం పుచ్చుకుని ఆపి, 'రొవెనా సుందరీ, ఈపరాభూతుడగు డీబ్రేసీ,—ఈఅగౌరవంపాలైన డీబ్రేసీ— నీకొకమాట చెప్పుకోవాలనుకొంటున్నాడు'—అని అన్నాడు.

రొవెనా అతనివంక నిదానంగా చూచి ఇలా అంది: 'ఇలాంటి పనులు తలపెట్టినప్పుడు, పరాజితుడవు కావడమే నీకు యెక్కువ గౌరవప్రదమని తెలుసుకోదం మంచిది! ఓటమికంటె గెలుపే నిన్ను నిజంగా మరింత అగౌరవం పాలు చేసిఉండేది.'

డీబ్రేసీ తలవంచుకొని,—'ఉద్రిక్తుడనై నీ యెడ చేసిన అపచారాన్ని మన్నించాలి. డీబ్రేసీ నీకు యెట్టి ఘనతరమైన సేవ చెయ్యగలడో ముందు ముందు నీవు తెలుసుకోగలవు'—అన్నాడు.

'క్రైస్తవ ధర్మం ప్రకారం నిన్ను నేను మన్నిస్తున్నాను. కాని, నీ ఉన్మాద ప్రవృత్తి మూలంగా మేము అనుభవించవలసి వచ్చిన మనోవేదన మాత్రం నిన్ను కించిత్తుకూడా మన్నించ నిచ్చేదిగా లేదు—'అన్నది రొవెనా.

ఇంతలో సెడ్రిక్ వెనుకనుంచి వచ్చి రొవెనాను కలుసుకుని, డీబ్రేసీతో ఇలా అన్నాడు: 'వదిలిపెట్టు కళ్ళెం! తగనిపని యని ఊరుకున్నానుగాని, లేకపోతే ఈ ఒక్క బల్లెపుపోటుతో నేలకొరగి ఉండేవాడవు. లే! తొలగు అవతలకి!'

డీబ్రేసీ కళ్లెం వదలి ప్రక్కకు తొలగుతూ,—'కూపడవ! ఖయిదీని బెదిరించగల మహాశూరుడవు! సాగ్జన్‌జాతివానికి మర్యాద తెలిసి యేడ్చిందెప్పుడు?' అన్నాడు.

రొవెనా ముందుకు సాగింది. ఆమెతో కూడా అచటినుండి నిష్క్రమించే ముందు, సెడ్రిక్ నీలకవచధారిని ప్రత్యేకంగా కలుసుకొని అతనికి తన కృతజ్ఞతను తెలియజేస్తూ, తనతోపాటు రోథరువుడ్డువచ్చి అక్కడ ఉండిపోవలసిందని అర్థించాడు 'రోథరువుడ్డు నీ స్వగృహంగా ఎంచుకోవలసినది. నా కున్నదంతా నీదే. అతిథివిగా నా యింటికి రమ్మనడంలేదు. నాకు అనుజాడవుగా, లేక కుమారుడవుగా, రమ్మనికోరుతున్నాను'—అని అతని అభ్యర్థన.

'మీ వలన నే నిదివరకే సుసంపన్నుడనయ్యాను. సాగ్జన్ల సుగుణసంపద ఎటువంటిదో మీ మూలాన నా కవగతమైంది. ప్రస్తుతం నాకు చాలా పనులున్నాయి. రోథరువుడ్డుకు ఇప్పుడు రాలేను. త్వరలోనే వస్తాను. వచ్చినప్పుడు

మిమ్మల్ని ఒక వరమడుగుతాను. మీ దానశీలం అప్పుడు పరీక్షకు వస్తుంది'— అన్నాడు నీలకవచధారి.

సెడ్రిక్ ఉత్సాహంతో తన చెయ్యి అతని అరచేతిలో వేస్తూ, 'మీరడగదలచిన వరం అడక్కముందే మీకిచ్చివేస్తున్నాను. నా ఆస్తిలో సగం కావాలని అడిగినా ఇవ్వడానికి నేను సంసిద్ధుడనే' అన్నాడు.

'అది అంత తేలికగా ఇచ్చే వరమని భావించకండి. అయినా నే నడగబోయేది మీ రివ్వగలరనే ఆశిస్తున్నాను. వెళ్ళిరండి, సెలవు'— అన్నాడు నీలకవచధారి.

రొవీనా కూడా నీలకవచధారికి సవినయంగా అభివాదం చేసింది. అతను ప్రత్యభివాదం చేశాడు. రొవీనా, సెడ్రిక్‌లు సపరివారంగా ముందుకు సాగి వెళ్ళిపోయారు. వారు వెళ్ళిన కొంచెము సేపటికి, ఎథెల్‌స్టేన్ శవపేటికతో మరొక బృందం బయలుదేరింది. వారిలో కొంతమంది ఫాదరీలు కూడా ఉన్నారు. ఎథెల్‌స్టేన్ మరణవార్త విని, అతని అంత్యక్రియల సందర్భంలో తమ కేదో బాగా ముట్టుతుందనే ఆశచేత కూడా, చేరువలోనున్న కాన్వెంటు నుండి వచ్చిన ఫాదరీలు వారు. దుఃఖసూచకంగా ఏవో ప్రార్థనలు చేస్తూ ఆ శవపేటిక ననుగమిస్తున్నారు. యెథెల్‌స్టేను ఎస్టేటు తాలూకు ప్రముఖులు కొందరు శవపేటికను మోస్తున్నారు. లాక్సిలీ ప్రభృతులు లేచి నిలబడి ఆ మృతవీరుని యెడ తమ గౌరవం ప్రకటించారు. గత దినపు పోరాటంలో అసువులు కోల్పోయిన తమ ఇతర మిత్రులు కూడా వారికా సమయంలో గుర్తుకు వచ్చారు. కాని అది కొద్ది క్షణాలు మాత్రమే. కొంచెము సేపటిలో, ఆ బృందం కనుచూపుమేరదాటి అదృశ్యమై పోయింది.

లాక్సిలీ ప్రభృతులు ఆ తర్వాత తమ పాలుపంపుళ్ళ కార్యక్రమంలో నిమగ్నులయ్యారు. మీ కేది కావాలో ముందు మీరు తీసుకోండని నీలకవచధారిని లాక్సిలీ కోరాడు. నీలకవచధారి సరేనని, 'ఈ డీబ్రేసీని నా యిచ్ఛ వచ్చినట్లు నేను చేసుకుంటాను, నాకు వదిలెయ్యండి' దన్నాడు. 'వీడు నా తండ్రిని చంపిన పాతకుడు. వీణ్ణి వీడి అనుచరులతో సహా ఈ చెట్టు కొమ్మలకు ఉరితీయాలి నిజానికి! కాని, యిప్పుడు వీడు మీ ఖైదీ. కనుకనే బ్రతికిపోయాడు. మీ యిష్టం, మీ రేమి చేసుకున్నా సరే'— అన్నాడు లాక్సిలీ.

'డీబ్రేసీ! నిన్నిప్పుడు బంధ విముక్తుని చేస్తున్నాను. వెళ్ళిపో! గతించిన దాన్ని మనస్సులో పెట్టుకొని నీచంగా పగ సాధించేవాణ్ణి కాదు నేను. కాని, ఇక ముందైనా జాగ్రత్తగా ఉండు. ఉండకపోతే, తగిన శాస్తి

అప్పుడు నీకు జరిగితీరుతుంది. జాగ్రత్త! పో, వెళ్ళిపో!'—అన్నాడు నీలకవచధారి.

డీబ్రేసీ మారుమాటలేక వినమ్రుడై అతనికి అభివాదంచేసి వెడలిపోబోతుండగా, లాక్స్లీ అనుయాయులు అతనిని గేలిచేస్తూ ఏవేవో కేకలు వేశారు. అతనికి యెక్కడలేని కోపమూ వచ్చింది, వాళ్లను తిరస్కరిస్తూ మాట్లాడాడు. లాక్స్లీ గనుక అడ్డుపడకపోతే, అతనిపై బాణవర్షం కురిసిఉండేదే. అంతటితో బ్రతికిబయటపడి, డీబ్రేసీ ఆదగ్గరలో ఉన్న ఒక గుర్రంమీదకు చరాలున యెగిరికూర్చుని దౌడుతీసి త్రుటిమాత్రంలో అదృశ్యమై పోయాడు.

ఈ సంఘటన మూలంగా కలిగిన సందడి అణగిన తర్వాత, లాక్స్లీ తన మెడలోని కొమ్ముబూరాను నీలకవచధారికి సమర్పించబోతూ,—'ఈ కానుకను మీరు దయచేసి స్వీకరించండి. ఆ అటవీప్రాంతాల్లో మీరు యెప్పుడు యెక్కడ కొట్టిచిక్కులోఉన్నాసరే, మూడుసార్లు ఇదిగో ఈ రీతిగా ఈబూరా ఊదండి. మీకు కావలసిన సాహాయ్యం లభించడానికది ఉపయోగపడుతుంది'—అంటూ, ఆ ఊదే తరహాను రెండు మూడు సార్లు ఊది చూపించి బూరా చేతికిచ్చాడు. నీలకవచధారి దానిని సంతోష పూర్వకంగా అంది పుచ్చుకొని, లాక్స్లీఊదిన పద్ధతిలో తానుగూడ ఊది వినిపించాడు.

'భేష్! బాగున్నది. రణతంత్రంలోనేకాక ఆటవిక విద్యలో కూడా మీరు బాగా ఆరితేరినవారులాగా కనిపిస్తున్నారు. సంతోషం! మిత్రులారా! వింటున్నారా! ఈ బూరా ఊదిన తరహా గుర్తుంచుకోండి. ఇది మీకు యెక్కడ వినిపించినా అది యీ మన నీలకవచధారి పిలుపని తెలుసుకోండి. యెవడైతే ఆ పిలుపు వినికూడా అతనికి సాయంవెళ్ళడో, వాడికిక మన యీ జట్టులో ఉండే యోగ్యత ఉండదు. వాడి వింటినారితోనే వాడిని కొట్టించి తరిమేయిస్తాను'—అన్నాడు లాక్స్లీ. ఆ ఆదేశాన్ని ఆమోదించినట్లుగా అతని అనుయాయులందరూ జయజయ ధ్వానాలు చేశారు.

లాక్స్లీ ఇక పాలుపంపుళ్ళు మొదలుపెట్టాడు. చాల నిష్పాక్షికంగా, కడు ప్రశంసనీయంగా ఆతడీ పనిని నిర్వహించాడు. కొల్లగొట్టబడ్డ సొమ్ములో పదోభాగం చర్చికీ, తదితర ధర్మసంస్థలకూ కేటాయించబడ్డది. మిగిలినదానిలో కొంత, ఒకవిధమైన పబ్లిక్ నిధికి ప్రత్యేకించాడు. పోరాటంలో మృతులైనవారి కుటుంబాలకు కొంతయేర్పాటు చేశాడు. ఆచనిపోయినవారికి 'నా'యన్నవారెవ్వరూ లేనప్పుడు వారి ఆత్మశాంతికొరకు చర్చిలలో ప్రార్థనలు జరిగించే నిమిత్తం కూడా ఆ సొమ్ము వెచ్చించబడుతుంది. ఇలా కేటాయింపులు చేయగా మిగిలిన దానిని లాక్స్లీ, తన అనుయాయులకు వారి అధికారి తారతమ్యాన్ని బట్టి పంచాడు. ధర్మసందేహాలు కలిగినచోట్ల లాక్స్లీ తీర్పు అత్యద్భుతంగా

ఉంటోంది. అనుత్సాహులు చాల భక్తివిశ్వాసాలతో ఆ తీర్పుని ఆమోదిస్తు న్నారు. ప్రేక్షకవర్గానికి ఇదంతా చాలా ఆశ్చర్యంగా ఉంది. వారికోపిళ్లు చేసే ఒక దొంగలగుంపు, తమలోతాము ఇంత న్యాయబద్ధంగా ప్రవర్తించడమనేది అతడిదివరకెన్నడూ కనీవినీ ఎరుగనిది. ఇక, వాళ్ళనాయకుడిలో కనుపించిన న్యాయపరాకాష్ఠ సరేసరి!

లాక్స్లీ చేసిన పంపకం ప్రకారం, అంతా ఎవరెవంతుకు వచ్చినది వారు తీసు కొనిపోయారు. మిగిలిన నిధికి చేర్చబడిన దానిని జాగ్రత్తగా ఒక రహస్య స్థలాన భద్రపరిచారు. చర్చికి కేటాయించిన దానిని స్వాధీనపరచుకోవలసినది మన కోప్మన్‌హర్స్టు ఫాదరీ. కాని, అతడేమైపోయిందీ తెలియలేదు. అతడ్ని పట్టుకోడానికి పంపిన మనుష్యులింకా రాలేదేమో అనుకుంటూ ఉండగా, హడా వుడిగా కేకలు వేసుకొంటూ వస్తున్న ఫాదరీ గొంతు దూరాన్నుండి వినిపించింది. ఉత్తరక్షణంలో, ఒక చేత్తో బరిసె, మరొకచేత్తో ఇసాక్ మెడకు ఉచ్చుపోసి తగిలించిన త్రాడూ పుచ్చుకొని, ఫాదరీ అచట ప్రత్యక్షమయ్యాడు.

జరిగిన విషయమిది: టార్క్విల్‌స్టన్ కోటను కొల్లగొట్టే సమయంలో,— మేలురకం మద్యాలు నిల్వచేయబడ్డ చోటుకోసం మన ఫాదరీ ప్రత్యేకించి వెదకి, ఎలాగైతేనేం ఒకచోట ఒక పెద్ద సారాపీపా కనుగొన్నాడు. దానిని బయటికి చేర వెయ్యడం ఎలాగా అని ఆలోచిస్తుండగా, ఇసాక్ బంధించబడి ఉన్న భూగృహ ద్వారం కనుపించింది. ఇక్కడ ఇంకా మంచి సారాపీపాలు దొరకవచ్చునని అతని ఆశ. పరీక్షించి చూడగా, ఆ తలుపు తాళంచెవి దానికే తగిలించబడి ఉంది. కావలివాళ్లెవరూ అచట లేరు. ప్రాణభీతికొద్దీ యెప్పటికో పారిపో యారు. మన ఫాదరీ తలుపు తెరచి చూచేసరికి, సారాపీపాలకు బదులుగా అచట కనుపించినది ఇసాక్!

ఆ యూదుడంటే ఫాదరీకి విపరీతమైన యేవగింపనేది వేరుగా చెప్పనక్క ర్లేదు. అతన్ని ఖైదీగా పట్టుకొని, సారాపీపాలతో సహా బయటపడాలని ప్రయ త్నిస్తూ ఉండగా, [illegible] అగ్నిజ్వాలల కారణమైన ఒక కోటగోపురం హఠా త్తుగా నేలకూలి దారి మూసేసింది. ఎటువైపుకు పోదామన్నా వీలు కనుపించ లేదు. అందుచే అక్కడే ఆగిపోయి, ఆ రాత్రింతా మద్యం సేవిస్తూ, ఆ నిషాలో ఏమేమో వాగుతూ, క్రైస్తవ మతోపన్యాసాలతో ఇసాకును హడలుగొట్టుతూ, కడకు బాగా కైపెక్కి పడియున్న స్థితిలో లాక్స్లీ పంపిన మనుష్యులతన్ని వెతికి పట్టుకోగలిగారు.

'ఇసాక్‌కు రాత్రంతా క్రైస్తవమతం బోధించాను, మతం మార్చుకోడానికి అతడు ఒప్పుకొన్నాడుకూడా, ఆవిధంగా నేను సత్కాలక్షేపం చేశాను గాని తాగితందనాలు త్రొక్కలేదు, కావలిస్తే అడగండి వీడినే'—అంటాడు ఫాదరీ

'లేదు మొంక్రో, నేను మతం మార్చుకుంటానవలేదు, నన్ను ఈ పిచ్చివాని బారి నుండి రక్షించ'మని ఇసాక్ లాక్స్లేని ప్రాధేయపడ్డాడు. 'హత్తేరీ, నన్ను పిచ్చివాడంటావా'అని ఫాదరీ బరిసె తిరగేసి అతన్ని మోదబోయేసరికి, నీలకవచధారి అడ్డుపడ్డాడు.

ఫాదరీ అక్కడనుంచి నీలకవచధారితో పోట్లాట వేసుకున్నాడు. 'నా పిడికిటిపోటు నీవెప్పుడూ రుచి చూడలేదు కాబోలు, ఇదిగో ఒకటి బహూకరిస్తా'నంటూ ఒక గ్రుద్దు గుద్దబోయాడు. 'గ్రుద్దులు ఊరికే పుచ్చుకోడం నా కలవాటు లేదు– వడ్డీతోసహా తిరిగితీర్చే పద్ధతిలోనైతే పుచ్చుకుంటాను–అందుకు ఒప్పుకొంటేనే గ్రుద్ద'మన్నాడు నీలకవచధారి. ఫాదరీ గ్రుద్దంటే సామాన్యమైనది కాదని లాక్స్లీ అనుయాయులెల్లరకూ తెలుసు. కాని, అతని గుద్దుకు నీలకవచధారి ఏమాత్రమూ చలించలేదు– చూపరులెల్లరూ ఆశ్చర్యపోయారు–

ఇప్పుడు నీలకవచధారి వంతు వచ్చింది– పిడికిలి బిగించి దవడమీద ఒకటి పుచ్చుకునేసరికి, ఫాదరీ తలక్రిందులుగా క్రిందపడ్డాడు– కాని, వెంటనే బంతిలాగ పైకిలేచి, ఏలాంటి ఉద్రేకమూ లేకుండా నీలకవచధారిని ప్రశంసిస్తూ, ఇకముందు మనలో మనం పోట్లాడుకోగూడదని తిరిగి స్నేహం కలుపుకొన్నాడు–

ఇక ఇప్పుడు ఇసాక్‌ను ఏం చెయ్యాలనే ప్రశ్న మిగిలింది– మతం మార్చుకోడానికి అతడు ఒప్పుకోలేదు గనుక, అతని విడుదలకోసం తగినంత డబ్బు పుచ్చుకోవలసిందే నన్నాడు ఫాదరీ. 'ఎంతసొమ్ము చెల్లిస్తానంటావో ఆలోచించుకో. ఈలోగా మేము మరొక ఖైదీ విషయం ఆలోచిస్తూ ఉంటా'మని ఇసాక్‌తో చెప్పి, లాక్స్లీ ఆ కొత్తఖైదీని ప్రవేశపెట్టమని అనుచరుల కాజ్ఞాపించాడు– అనుచరులు మన పూర్వ పరిచితుని,—జోర్వాలక్సు మఠాధిపతియైన ప్రయర్ ఇమర్‌ను ప్రవేశపెట్టారు–

# అధ్యాయం ౩౪

ఎంత విచిత్రంగా ఉండాలో అంత విచిత్రంగా ఉంది బ్రయర్ విమర్ అవస్థ. నా అంతవాణ్ణి పట్టుకుంటారా అనే దురభిమానం ఒకవైపున, ఏరికోరి కుట్టించిన సొగసైన బట్టలు చింపరవందర అయిపోయినందుకు ఏడుపు మరొకవైపున. ఇంతకీ వీళ్లు నన్ను ఏం చేసిపోతారోననే భయం ఇంకొకవైపున. ఇన్నింటితో సందరగోళపడుతూ, అతను లాక్స్లీని ఈవిధంగా బుకాయించబోయాడు :

'ఏమిటిది? ఎవరు మీరు? ఎందుకు నన్నిలా పట్టుకున్నారు? మాలాంటి క్రైస్తవ ధర్మల జోలికా మీరు రావలసింది? నా సామానంతా దోచేసుకున్నారు. ఈ అపురూపమైన జరీవస్త్రాలు చించిపారేశారు. ఇంకో మతాధికారి అయితే, నిజంగా మిమ్మల్ని ఆంక్ష వేసి ఉండేవాడు. ఇప్పటికైనా మించిపోయిందిలేదు. నా పరివారాన్ని విడుదలచేసి, నా సామాను తిరిగి నాకు అప్పగించేస్తూ, నూరు క్రౌను నాణేలు అపరాధంక్రింద సమర్పించుకోండి. మా మఠంలో అది కట్టిపెట్టి, మీ పాపపరిహారానికి ప్రార్థనలు చేయిస్తాను. వచ్చే పెంతికోస్టు పండుగదాకా వేటమాంసం ముట్టుకోకండి!'

లాక్స్లీ ఈ బుకాయింపును లోలోపల నవ్వుకొని, పైకి సానుభూతి ప్రకటిస్తున్నవాడిలాగా నెమ్మదిగా, 'స్వామీ, నాకు చాలా విచారంగా ఉంది,—మీ లాంటి పవిత్రమూర్తులయెడ మావాళ్లు ఈ విధంగా ప్రవర్తించారంటే! మూర్ఖులు! ఎవరితో ఎలా నడచుకోవాలో తెలియదు!'—అన్నాడు.

'తెలియదని నెమ్మదిగా అంటారేమిటి! ఇదిగో వీడు చూడండి, వీని పేరు అలన్ డేలట. నా దగ్గర ఉన్న ధనమంతా,— బంగారు గొలుసులు, రవ్వల ఉంగరాలు ఖరీదైనవి కొల్లగొట్టినది చాలక, నాలుగు వందల క్రౌను నాణేలు అదనంగా కుమ్మరిస్తే తప్ప విడిచిపెట్టననీ, చెల్లించకపోతే కొడతాననీ చంపుతాననీ బెదిరించిన బెదిరింపు ఇంతంతకాదు'—అంటూ, లాక్స్లీ సానుభూతిని మరింతగా సంపాదించుకోవాలని చూచాడు విమర్.

'అలన్ డేల్ తమలాంటివాళ్లను ఆ రీతిగా బాధించాడంటే నమ్మశక్యంగాకుండా ఉంది'— అన్నాడు లాక్స్లీ.

'నేనేమీ అబద్ధం ఆడడంలేదు. నేను చెప్పినదంతా అక్షరాలా నిజం. నన్ను ఈ అడవిలో అన్నిటికంటె పెద్ద చెట్టుచూపి దాని కొమ్మకు ఉరితీయకపోతే ఒట్టంటూ, ఏవేవో ఒట్లు పెట్టుకున్నాడుకూడా!'— అని తానన్నది బలపరచుకున్నాడు విమర్.

'ఏమిటీ? అలా అని ఒట్టుకూడా పెట్టుకున్నాడూ? అయితే స్వామీ, తమరిక ఆతడడిగినదానికి ఒప్పుకోడమే మంచిదని తోస్తోంది. ఎందుచేతనంటే, ఒట్టంటూ పెట్టుకున్నతర్వాత, ఇక మాట తప్పే అలవాటులేదు అలన్ డేలుకు,'—అని సమాధానమిచ్చాడు లాక్సిలీ.

ఐమర్ తెల్లబోయి, ఇంతలోనే తెచ్చికోలునవ్వు నవ్వుతూ ఇలాఅన్నాడు: 'మీరు నాతో పరిహాసమాడుతున్నారు. పరిహాసం నాకిష్టమే. మీ మాటలకు నాకు నిజంగానే నవ్వువస్తోంది. అహ్హాహా! కాని, రాత్రంతా హాస్య వినోదాలతోనే గడచిపోయింది. ఇంకా హాస్యాలెందుకులెండి. నిజంగానే మాట్లాడుకుందాం.'

అంతట లాక్సిలీ ఇలా అన్నాడు: 'నిజంగానే మాట్లాడుతున్నాను స్వామీ! హాస్యమాడడంలేదు. తమ విడుదలకు తమరు కచ్చితంగా తగినంత ధనం చెల్లించక తప్పదు. లేనియెడల, ఇక్కడనుంచి తమరిక బయటపడే ఆశ వదలుకోవలసినదే! మీ కాన్వెంటు క్రొత్త ప్రయరును ఎన్నుకోవలసిన అవసరం పట్టుతుంది.'

'ఎంత అపచారం! ఎంత అపచారం! మావంటి క్రైస్తవ భక్తుల ముందర, ఇదా మీరు మాట్లాడవలసిన తీరు? నిజంగా మీరు క్రైస్తవులైతే ఈవిధంగా మాట్లాడరు'—అన్నాడు ప్రియర్.

'మేము క్రైస్తవులం కాదని తమరంటే కాదంటా పోము. తమకంటె అచ్ఛమైన క్రైస్తవులమే. ఆవిషయం తమకు, ఇదిగో మా ఫాదరీ విశదంగా వివరించి చెపుతాడు'—అన్నాడు లాక్సిలీ.

ఫాదరీకి రాత్రి త్రాగిన సారా నిషా ఇంకా పూర్తిగా వదలలేదు. ఆ ఆటవిక వేషంమీదనే ఫాదరీ దుస్తు వేసుకొని, చిన్ననాడు క్రైస్తవ మతగ్రంథంలో బట్టీపట్టిన వాక్యాలను నెమరుకు తెచ్చుకుంటూ ఏమేమో ఉపన్యసించడం మొదలుపెట్టాడు.

'చాలులేవయ్యా, చాలు! ఇక ఆపు! నీవు నిజంగా చర్చికి సంబంధించినవాడవే అయితే, మనమంతా ఒక కూటమిలోనివాళ్లం గనుక, నేనిప్పుడు వీళ్ళ చేతుల్లోంచి తప్పించుకునే మార్గమేదైనా ఉంటే చెప్పు. ఎంతసేపని పండ్లికిలిస్తూ ఇచట నిలబడి నాట్యం చెయ్యను!'— అన్నాడు ప్రయర్.

'చెప్పడానికేముంది! ఒకటేమార్గం. ఇవాళ సెంటు ఆంద్రూ పుట్టిన రోజు పండగ. మా చర్చికి కానుకలు వసూలు చేస్తున్నాం'— అన్నాడు ఫాదరీ.

'మంచిదే! కాని, ఆ వసూళ్లు చర్చితాలూకు మనుష్యులపట్లకూడా చేస్తారా? చెయ్యరు! చెయ్యకూడదు! ఏమంటావు భాయీ!'— అన్నాడు ఐమర్.

'మేము ఆ భేదం పాటించం. అందరి దగ్గరనుంచీ వసూలు చేస్తాం. ఇక్కడ డబ్బుస్నేహమేగాని ఇంకో స్నేహం చెల్లదు. ఊఁ, కానివ్వండి'— అన్నాడు ఫాదరీ.

'అంత మరీ నిక్కచ్చిగా మాట్లాడితే ఎలాగ? నేనుకూడా మీకు సన్నిహితుణ్ణే. ఆటవిక విద్యలో నాకుకూడా పరిచయముంది. అవసరమైతే హోరు మ్రోగేటట్టు నేనుకూడా మీవలెనే కొమ్ము ఊదగలను'— అన్నాడు ప్రయర్.

'అలాగా? ఏదీ ఊదు చూద్దాం'— అని లాక్స్లీ ఐమర్‌కు ఒక కొమ్ము ఇప్పించాడు. ఐమర్ అలాగే ఊదాడుగాని, అది అతనికి మరీ అపకారమయింది. 'స్వాములవారు బాగానే ఊదారుగాని, ఆ ఊదినపద్ధతిలో, క్రొత్తగా దిగుమతి యైన నార్మన్ పలుకుబడి ఉన్నదేకాని, అనాదినుంచీ వస్తున్న మా సాక్సన్ పలుకుబడి లేదు. కనుక తమరు తమ విడుదలకు కచ్చితంగా డబ్బు చెల్లించుకొని తీరవలసిందే! సాక్సన్ పలుకుబడిని ధ్వంసంచేశారు గనుక, ఇంకొకవంద క్రౌను నాణేలుకూడా అదనంగా చెల్లించుకోవలసి ఉంటుంది,'— అన్నాడు లాక్స్లీ.

ఐమర్‌కు ఇక ఏమీ పాలుపోక, 'అంత కచ్చితంగా మాట్లాడితే ఎలాగ, ఏదో సాయిలాపాయిలాగా మాట్లాడాలిగాని!'— అంటూ ప్రాధేయపడ్డాడు. ఈ సమయంలో లాక్స్లీ ముఖ్యానుచరు డొకడు లాక్స్లీతో,—'మన మింకో పని చేస్తే బాగుంటుందేమో. ఎంత ధనానికి ప్రయర్‌ను విడుదల చెయ్యవచ్చునో ఈ యూదీయునిచేత చెప్పిద్దాం. అలాగే, ఎంత ధనానికి ఈ యూదీయుని విడుదల చెయ్యవచ్చునో ప్రయర్ను చెప్పమందాం. ఏమంటా'రంటూ ఒక సూచన చేశాడు.

'శభాష్! మంచి సూచన చేశా' వని లాక్స్లీ మెచ్చుకొని, వెంటనే ఇసాక్‌ను ముందుకు పిలిచి, 'ఇదిగో, ఈ జోర్వాలక్స్ మఠాధిపతిని యెంత సొమ్ముకు విడుదల చెయ్యవచ్చునో నీవు చెప్పు. ఆ మఠానికి రాబడి యెంతో నీ వెరిగిందేకదా' అని అన్నాడు.

'ఎరగకేం, బాగా ఎరుగున్నాను. ఈ మఠసన్యాసులకు గోధుమ, బార్లీ, మేలురకం ఉన్ని, అపురూపములైన పండ్లు మొదలైనవి నేనే సప్లయి చేసేది. మేలురకం ద్రాక్షాసవాలంటే ఈ సన్యాసులకు చాలా ఇష్టం. ఈ మఠానికి బలే ఆదాయముంది. నేనే గనుక ఈ మఠాధికారినయితే, నా విడుదలకు ఎంత వెండి బంగారాలు విరజిమ్మడానికైనా వెనుకాడను'— అన్నాడు ఇసాక్.

'ఓరి నీచుడా! ఎందుకలా అబద్ధాలాడుతావు? మా మఠం తాలూకు తూర్పువైపు భవననిర్మాణం పూర్తి చెయ్యడానికి వెయిన్నూటే కదా బోలెడు అప్పయింది! నీకంటె బాగా తెలిసినవారెవరీ సంగతి?'— అని తిట్టిపోయసాగాడు ప్రయర్.

'అవునవును. నేలమాళిగల్లో మేలురకం ద్రాక్షాసవం పీపాలు నిల్వ చేయడానికి ఎంత అప్పు అయిందీకూడ తెలుసు. అయినా అది స్వల్పవిషయం లే!'— అని వెటకారం చేశాడు ఇసాక్.

'చూడండి చూడండి, ఈ నీచుడు పవిత్రమైన చర్చికి అపచారంగా ఎలాంటి కారు కూతలు కూస్తున్నాడో! ద్రాక్షాసవం నిల్వచెయ్యడం మూలంగా మా మఠం అప్పులపాలైనట్లు దూషిస్తున్నాడు. మీరంతా క్రైస్తవులై ఉండిన్నీ ఈవాగుడు సహించవలసిందేనా?'— అని అరచి చేయసాగాడు ప్రయర్.

'ఇదిగో, ఈ తకరారువల్ల ఏమీ ప్రయోజనంలేదు. చెప్పు ఇసాక్, ఎంత డబ్బు చెల్లిస్తే ఇతన్ని మేము విడుదల చెయ్యాలి?'— అని అడిగాడు లాక్స్లీ.

'ఆరువందల క్రౌను నాణేలు'—అని వెంటనే తడుముకోకుండ చెప్పేశాడు ఇసాక్. 'భేష్! బలే తీర్పు చెప్పా'వని ఆ ముఠాలోని వాళ్ళంతా పొగిడారు. 'విన్నావా ప్రయర్? ఏమిటి నీసమాధాన'మని ప్రశ్నించాడు లాక్స్లీ.

ప్రియర్ ఐమర్ తికమకపడి,—'అంత సొమ్ము నేనెక్కడినుంచి తేగలను? మఠంలోని క్రొవ్వొత్తి స్టాండులతో సహా సామానంతా అమ్మినా అందులో సగం డబ్బు రాదు. దానికైనా నేను వెళ్ళి ఆ ప్రయత్నం చెయ్యాలి. నా సహచరుల నిద్దరిని ఇక్కడ హామీగా ఉంచుతాను. నన్ను వెళ్ళనివ్వండి,'— అన్నాడు.

'అదేం కుదరదు. తమరే ఇక్కడ ఉండి వాళ్ళను పంపాలి. తమకేమీ ఆతిథ్యం విషయంలో లోపం చెయ్యంలెండి, ఆ భయం అక్కరలేదు,'— అన్నాడు లాక్స్లీ.

ఈ సమయంలో ఇసాక్ లాక్స్లీని మంచిచేసుకునే ఉద్దేశ్యంతో,— 'నేనొక ఉపాయం చెప్తాను. అలా చెయ్యండి. యార్కు నగరంలో ఒక బాపతుడబ్బు నావగ్గిరుంది. ఆరువందల క్రౌన్లూ అక్కడ నుంచి తెప్పిస్తాను. అందుకుగాను ప్రయరును నాకొక విడుదల దస్తావేజు వ్రాసి యిమ్మనండి'— అని సూచించాడు. 'మంచిది అలాగే చెయ్యి. ఆ ఆరువందల క్రౌన్లతో పాటు నీవిడుదలకు చెల్లించవలసిన సొమ్ముకూడ తెప్పించేసెయ్'—అన్నాడు లాక్స్లీ.

ఇసాక్ కుప్పకూలినట్లయి,—'అయ్యో, నా విడుదలకు నేనేమి యివ్వగలను? పట్టి బికారిని! వందలకాకా పోనక్కరలేదు— ఒక యూదై

కాస్త మీకీనాడు చెల్లించుకోవలసి వచ్చినా మొత్తుకుంటూ పోవలసిందే’ అని బీద అరపులు అరవసాగాడు.

‘ఆ విషయం ప్రయర్ నిర్ణయిస్తాను. ఏమి ప్రయర్! ఇసాక్ విడుదలకు ఎంతసొమ్ము పుచ్చుకోవచ్చునంటారు?’—అని అడిగాడు లాక్స్లీ.

‘ఎంతేమిటి, ఎంతైనా పుచ్చుకోవచ్చు. ఇతనివద్ద చాలా డబ్బుంది. ఇతనితో మా కోశాధికారి వ్యవహరించడమే కాని నేను సాక్షాత్తుగా వ్యవహరించకపోవడంవల్ల, ఇతని లోటుపాటులు నాకైతే సరిగ్గా తెలియవు గాని,— యార్కు నగరంలోని ఇతని గృహం వెండి బంగారాల నిధి అని చెప్తారు— క్రైస్తవుల సీమలో యూదీయుడు ఇంతింత డబ్బు ఆర్జించగలుగుతున్నాడంటే, అది క్రైస్తవలోకానికే తీరని తలవంపు. విపరీతమైన వడ్డీలు గుంజి, ప్రభుత్వపు బొక్కసంలోని ద్రవ్యమే కాక, చర్చినిధులను కూడా హరించుకొనిపోతున్నాడు’ అన్నాడు ప్రయర్.

‘స్వాములవారు అక్కడితో ఇక ఆపాలి! అక్కసుకొద్దీ ఏమేమో మాట్లాడేస్తున్నారు. నాడబ్బు అప్పుతీసుకోండని ఎవరినైనా నేను బలవంతం చేస్తున్నానా? రాజులు, సామంతులు, మతాధికారులు, సేనాపతులు,— నానారకాలవాళ్లూ నా తలుపు కొట్టుకుంటూవచ్చి ఎంత ప్రాధేయపడి అడిగితే ఇవ్వవలసివస్తోంది? పుచ్చుకునేటప్పుడు, నేను తమకు ఎంతో ఆప్తబంధువునైనట్లు, తమ ఆపదలో నేనువచ్చి ఆదుకోకపోతే విలులేనట్లు మాట్లాడి, అనుకున్న రోజుకల్లా తప్పక తెచ్చిఇస్తామని నమ్మించి పుచ్చుకుంటూ ఉంటారు. తీరా తెచ్చిఇవ్వవలసిన రోజున, నా డబ్బు నే నడిగితే నిష్ఠురం! పుట్టుపూర్వోత్తరాలెత్తి తిట్టిపోస్తారు. ఏమిటి ఇందులో ఉండే సబబు?’— అని ఎదురు తిరిగాడు ఇసాక్.

‘అవునుస్వామీ, ఇసాక్ మాట్లాడినదానిలో బేసబబు ఏమీలేదు. మీ విడుదలకు చెల్లించవలసిన డబ్బెంతో ఇసాక్ చెప్పినట్లుగానే, ఇక ఇసాక్ విడుదలకు చెల్లించవలసిన డబ్బెంతో మీరు చెప్పండి’— అన్నాడు లాక్స్లీ.

‘ఈ నీచునివద్దనుంచి వేయి క్రౌన్లకంటె ఒక గవ్వ తక్కువ పుచ్చుకున్నా మీకు మీరు అన్యాయం చేసుకున్నట్టే!’— అన్నాడు ప్రయర్.

‘శభాష్! శభాష్!’అని అరిచాడు లాక్స్లీ, ‘ఏమైనా క్రిస్టియన్ క్రిస్టియనే! మా పట్ల యూదీయునికంటె ఎక్కువ ఉదారత చూపా’డని ప్రశంసించింది అతని అనుచర బృందం.

'అయ్యయ్యో! ఈ నిరుపేదమీద మీకు జాలిలేదా? అసలే కన్నబిడ్డ పోయినందుకు కుమిలి రోదిస్తున్నాను. జీవనోపాధికి కూడా ఇప్పుడు నన్ను దూరం చేస్తారా?'— అని ఆక్రందించాడు ఇసాక్.

'కన్నబిడ్డ పోతే మంచిదేకదా! కొంత ఆస్తి ఆ బిడ్డకోసం కేటాయించవలసిన బాధ నీకు ఉండదు'- అని ఎద్దేవా చేశాడు ప్రియర్.

'అయ్యో! మాకు మా కన్నబిడ్డలమీద ఉండే ప్రేమ మీకేం తెలుస్తుంది? తెలియదు, అయ్యో రెబెకా! ఎక్కడున్నావు? నీవు బ్రతికి ఉన్నావో లేదో నాకెలా తెలుస్తుంది? ఏ క్రైస్తవుని చేతిలోనైనా పట్టుబడ్డావా? ఈ చెట్ల ఆకులన్నీ జెకిన్ నాణెములై, ప్రతి ఒక్క నాణెమూ నా సొంత ఆస్తి అయితే, అది అంతా ధారపోసియైనా నిన్ను తిరిగి దక్కించుకోడానికి వెనుకాడను'— అని పితృవాత్సల్యం వెళ్ళబోసుకుంటున్నాడు ఇసాక్.

అంతట ఆ దొంగలలో ఒకడు,—'అయితే నీకూతురు ఎలా ఉంటుంది? జుట్టు నల్లగా ఉంటుంది కదూ? జరీ అంచుగల జడలు పోగుల పట్టు మేలి ముసుగు ధరించింది. అంతేనా?'— అని అడిగాడు.

'అవునవును, ఆ మెరుపే! ఎక్కడైనా చూచావా? దైవం నిన్ను రక్షిస్తాడు. ఎక్కడ చూచావో చెప్పు!' అని ఆదుర్దాగా అడిగాడు యిసాక్. ఆ తొందరకు అతని ఆపాదమస్తకం కంపించిపోతోంది,

'అయితే, నిన్న టెంప్లార్ ఎత్తుకుపోయింది ఆమెనే అయి ఉండాలి. వెనుకనుంచి వాణ్ణి హతమార్చుదామని బాణం సంధించికూడా, ఆపిల్లకు తగులుతుందనే భయంతో మానేశాను'— అన్నాడా అనుచరుడు.

'అయ్యో! ఎందుకు మానేశావు? నీబాణం ఆమెను చీల్చిఉంటే నేనెంతో సంతోషించి ఉండేవాణ్ణి. దుర్మార్గుడైన టెంప్లార్ శయ్యకంటె శ్మశానంలో గోరీయే మేలు నాబిడ్డకు. అయ్యో దైవమా! నా ఇంటి దీపం ఆరిపోయింది!' —అని వాపోవ జొచ్చాడు యిసాక్.

లాక్స్లీకి మనస్సు ద్రవించింది. 'మిత్రులారా! ఇతడు యూదీయుడైనా, ఇతని దుఃఖం జాలిగొల్పుతోంది. దాపరికం లేకుండా చెప్పు ఇసాక్! మాకు వెయ్యి క్రౌనులూ చెల్లిస్తే నీకేమీ మిగలదా?'— అని అడిగాడు.

ఇసాక్‌లో తిరిగి పూర్వపు లోభగుణం తలఎత్తింది. కొంత మథనపడ్డాడు. కలవరపడ్డాడు. తడబడుతూ చిట్టచివరకు, కొద్దిగా మిగులవచ్చునని ఒప్పుకోకుండా ఉండలేకపోయాడు.

'సరే, నీ విషయంలో మేమంత కఠినంగా ఉండదలచుకోలేదు. టెంప్లార్ పిడికిట్లోంచి నీ బిడ్డను నీవు రక్షించుకోవాలన్నా డబ్బు కావలసి ఉంటుంది గనుక, వెయ్యి క్రౌన్లూ మాకు చెల్లించనక్కర్లేదు. ప్రయర్ చెల్లించేటంతా నీవుకూడ చెల్లించు చాలు. పోనీ, ఇంకో వంద తక్కువ చెల్లించు. ఆ వందా మా సంఘానికి నష్టంలేకుండా నేను నా సొంతంలోంచి ఇచ్చుకుంటాను. యూదీయుడు పావు కారును క్రైస్తవమతాధికారితో సమానంగా విలువకట్టిన దోషంనుంచి బయట పడినవాళ్లమౌతాం. ఇందుమూలంగా నీకు మిగిలే డబ్బు నీ కూతురును విడిపించుకోడానికి వినియోగించుకో. టెంప్లార్లకు, తరళలోచనాల తళతళలమీదే కాదు, వెండి బంగారు నాణెముల మిలమిలలమీద కూడా ప్రీతి యెక్కువ. పో,... త్వరగా వెళ్లు! తక్షణం మించిపోకముందే నీ నాణెముల మోత టెంప్లార్ బ్రయన్ చెవికి వినబడేటట్లు చెయ్యి. ఇక్కడికి దగ్గరలోనే, టెంపుల్ స్టోవులో టెంప్లార్ల మఠముంది. బహుశః అతను నీకక్కడ దొరకవచ్చు. మిత్రులారా, ఏమంటారు? నేనన్నది మీకు సమ్మతమేనా?'— అని అడిగాడు లాక్స్లీ.

సమ్మతమే నన్నట్టు అందరూ హర్షధ్వానాలుచేశారు. ఇసాక్ కు సగం బెంగ తీరినట్లు అయి, లాక్స్లీ కాళ్లమీదపడి, ప్రాచ్యదేశపద్ధతిలో అతని అంగీ అంచును ముద్దిడుకొనబోయాడు. లాక్స్లీ చిరాకుతో వెనుకకు తప్పుకొంటూ, 'వద్దువద్దు,— యిలాంటి అభివాదాలు నాకు గిట్టవు. అచ్చమైన సాక్సన్ జాతీయుణ్ణి. దైవానికి మోకరిల్లు, నావంటి పాపికి ఎందుకు మోకరిల్లుతావు?'— అన్నాడు.

'అవును. దైవానికి మోకరిల్లు. దైవానికి ప్రతినిధిగా ఇక్కడ మా మఠం తరఫున నేనున్నాను. నాకు మోకరిల్లు. హృదయపూర్వకంగా పశ్చాత్తాపం వెల్లడించుకో. మా మఠానికి కానుక లర్పించుకో. నీకూ నీ కుమార్తెకూ శుభం వాటిల్లుతుంది. నీ కుమార్తెను ఆష్బీ పోటీల్లో చూశాను. నాకు చాలా జాలి కలుగుతోంది. టెంప్లార్ బ్రియన్ను నే నెరుగుదును. నీ తరఫున ఏమైనా మాట్లాడమంటే మాటాడుతాను'— అన్నాడు ప్రయరు ఐమరు. డబ్బు సంపాదించడానికి యిదొకమంచి అవకాశంగా లభించిందతనికి.

ఇసాక్ కు ఏమీ పాలుపోలేదు. ప్రయర్ ఐమర్ ను నమ్మితే ఏమిచిక్కో, నమ్మకపోతే ఏమిచిక్కో, అని దిగులులో క్రుంగిపోతూ ఉండగా, లాక్స్లీ అతన్ని ప్రక్కకు తీసుకొని వెళ్లి, ప్రయర్ ఐమర్ ను ఏలాగైనా డబ్బు ఎరచూపి మంచిచేసుకోడం మంచిదని సలహా యిచ్చాడు. 'బీద అరపులు అరవబోకు. నీవు డబ్బు సంచులు దాచే యినప్పెట్టె సంగతి నాకు తెలియదనుకుంటున్నావా? యార్కునగరంలో మీ తోటలోని రేగిచెట్టు, దాని క్రింద ఉండే రాయీ, అక్కడనుంచి లోపలికి ఉన్న సొరంగం,— యిదంతా నాకు తెలిసినవేలే!'

—ఆ పిలుపుకి ఇసాక్ నిలువుగ్రుడ్లు వేశాడు. 'మరేం భయంలేదు, నావల్ల నీకేమీ అపకారం జరగదు. మనం పూర్వ పరిచితులమే. వెనుక ఒకప్పుడు, నీ కుమార్తె రెబెకా, వ్యాధిగ్రస్తుడై ఉన్న ఒక ఆటవికుణ్ణి చెరలోంచి తప్పించి, వ్యాధి పూర్తిగా నయమయ్యేటంతవరకు యింట్లోనే అట్టేఉంచుకొని సాకిన సంగతి గుర్తున్నదా? చివరకతనిని పంపించివేసేటప్పుడు, ఒక వెండి నాణెం చేతబెట్టి పంపావు నీవు. ఎంత వడ్డీతో నీకిప్పుడా వెండినాణెం గిట్టుబాటయిందంటావు? ఆయిదు వందల క్రౌనులనాణేలను నీకు లాభం చేసిపెట్టింది' —అన్నాడు లాక్సిలీ.

'ఆఁ, ఏమిటీ! ఆనాడు మా వద్ద చికిత్స పొందిన డిక్కన్‌వా నీవు? నీ కంఠస్వరం గుర్తించి యుండవలసింది'—అన్నాడు ఇసాక్.

'అవును,—ఆ డిక్కన్ నే నే. ఇప్పుడు లాక్సిలీ అనే పేరుతో ఉన్నాను. ఇదిగాక, అసలు పేరు వేరే ఉంది' అన్నాడు లాక్సిలీ.

'ఇదిగో చూడూ,—ఇందాక నేలమాళిగ అని అన్నావే,—అందులో నేను వ్యాపారం నిమిత్తం కొని తెచ్చిన సరుకంటె వేరేమీ లేదు. నీకో వంద గజాల చొక్కాగుడ్డ పంపిస్తాను గాని, మీ వాళ్లందరికీ చొక్కాలు కుట్టించు. అలాగే, విల్లుకు పనికివచ్చే స్పానిష్ చువ్వలు ఒక వందా, మేలి రకపు అల్లెత్రాళ్లు ఒక వందా కూడ పంపిస్తాను. తీసుకోండి. ఆ నేలమాళిగ సంగతి మాత్రము ఎవ్వరికీ చెప్పకు',—అన్నాడు యిసాక్.

'దానికేంలేగాని, ముందు నీ కుమార్తె సంగతి ఆలోచించు. నేనే పోయి విడిపించి తీసుకొద్దామంటే, ప్రత్యక్ష సమరంలో టెంప్లార్ ఈటెపోటుల ముందు మా విల్లమ్ములు అక్కరకురావు. కనుక, ఏదైనా ఇతరోపాయం చేతనే కార్యం సాధించాలి. ఈ విషయములో ప్రయర్ ఐమర్‌తో నీ తరఫున బేరమాడి చూస్తాను. ఏమంటావు?'—అన్నాడు లాక్సిలీ.

'ఏంచేస్తావో ఏమో,—ఎలాగైనా నా కుమార్తెను కాపాడితే నీ మేలు ఎన్నటికీ మరువను'—అన్నాడు ఇసాక్.

'అయితే యిలా రా! నీ పిసినిగొట్టుబుద్ధితో మాత్రం నేను మాట్లాడే దానికి అడ్డము రాకు'—అని చెప్పి, లాక్సిలీ ఐమర్ దగ్గరికి వచ్చాడు. నూరు మార్కు నాణేలను యిసాక్ ఐమరుకిచ్చేటట్లూ, ఐమర్ తన పలుకుబడి వినియోగించి టెంప్లార్ చేతిలోంచి రెబెకాను తప్పించడానికి తోడ్పడేటట్లూ బేరమాడాడు. తన మఠానికి ప్రత్యేకముగా మరొక యిరవై మార్కులు కూడ యివ్వవలసి ఉంటుందన్నాడు ప్రయర్. అలాగే యిప్పిస్తానన్నాడు లాక్సిలీ. ఇసాక్

పిసినిగొట్టుతనం అతని నోరకుండనివ్వలేదు. ఏదో అడ్డం చెప్పబోయాడు—కాని లాక్స్లీ అతనిని నోరెత్తనివ్వలేదు.

ప్రియర్ సావకాశంగా ప్రెసెప్టార్ బ్రయన్‌కు ఒక ఉత్తరం వ్రాసి, సీలు చేసి, 'యిది జాగ్రత్తగా బ్రియన్‌కు అందజేశావంటే నీ కుమార్తె నతడు తప్పక విడిచిపుచ్చుతాడు. అయితే అతనికి కొంత డబ్బు చెల్లించడానికి కూడ నీవు సిద్ధపడాలి,'—అని చెప్పి యిసాక్ చేతికిచ్చాడు. కార్యం సానుకూలపడగానే, ఐమర్‌కు ఇసాక్ ఇవ్వవలసిన డబ్బు ఇప్పించే బాధ్యత తనదని పూచీపడ్డాడు లాక్స్లీ.

పిమ్మట ఐమర్, తన విడుదలకై తానిప్పుడు లాక్స్లీకి చెల్లించవలసియున్న ఆరువందల క్రౌన్లూ తనకోసం యిసాక్ అస్వాన్ను చేస్తున్నాడు గనుక, ఆ మొత్తానికి యిసాక్ పేర తానొక నోటు వ్రాసియిచ్చాడు. ఐమర్ సపరివారంగా విడుదల చేయబడ్డాడు. కాని, అతని బంగారు గొలుసులూ, రత్నాల ఉంగరాలూ మటుకు అతనికి తిరిగి స్వాధీనం చెయ్యడానికి లాక్స్లీ అంగీకరించలేదు. నిరాడంబరంగా జీవించవలసిన మీవంటివాళ్లను యివి ప్రలోభపెట్టుతవి కనుక, వీటిని మీ కివ్వబోయేది లేదని సమాధానం చెప్పాడు.

కాని, వాటిని వదులుకోడం ఐమర్‌కు చాల కష్టంగా ఉంది. 'అవి చర్చిసొమ్ములున్నూ, వాటిని మీరు వాడుకుంటే, మీకు నరకప్రాప్తే'నని బెదిరింపజూచాడు. 'ఆ జాగ్రత్త నేను పడతానులే, వాటిని నేను ధరిస్తా'నన్నాడు కోప్మన్‌హార్స్టు ఫాదరీ. ఐమర్ ఫాదరీతో వాగ్వాదం వేసుకున్నాడు. మాటలు పెరిగి, అది చేతులు కలవడంలోకి దిగింది. లాక్స్లీ వారిని విడదీసి ఆ ప్రమాదం నివారించాడు. కాని, వాగ్యుద్ధం మాత్రం యింకా సాగుతూనే ఉంది. యిద్దరూ తప్పుతడక లాటిన్ భాష ప్రేల్చేస్తున్నారు. అయితే, తప్పులతోనైనా ఐమరంత ధారాళంగా ఆ భాషను మాట్లాడలేనిలోపం, అతనికంటె ధాటీగా మాట్లాడడంతో సర్దుబాటు చేసుకున్నాడు ఫాదరీ. కొంతసేపటికి గాని, తాను మాట్లాడుతున్నది తన హోదాకు ఎంత అనర్హమైనదీ ఐమర్‌కు స్ఫురించలేదు. వాగ్వాదం విరమించి, చిన్నబోయిన ముఖముతో, పరివారముతోసహా అచటినుండి వెడలిపోయాడు. వెనుకటి దర్పం ఏమాత్రమూ యిప్పుడాతని వైఖరిలో కనుపించలేదు.

పిమ్మట లాక్స్లీ, తనకు ఐమర్ యివ్వవలసిన దానికీ, యిసాక్ యివ్వవలసినదానికీ కలిపి మరొక యూదీయ షావుకారుమీద ఒక దర్శనహుండీ యిసాక్ చేత వ్రాయించి పుచ్చుకొని, 'యిక త్వరగా బయలుదేరి నీ కుమార్తె విముక్తికి ప్రయత్నించవలసిం'దని ప్రోత్సహించి పంపుతూ, వెళ్లేటప్పుడు ఈ విధ

ముగా హితబోధ చేశాడు: 'ఎంత డబ్బయినా విరజిమ్మి, నీ కుమార్తెను రక్షించుకో యిసాక్! డబ్బుకోసం వెనుకాడి కుమార్తెను పోగొట్టుకున్నావంటే, అందుమూలంగా నీవు మిగుల్చుకోబోయే బంగారం, కరగించి నీ గొంతులో పోసినంతగా నిన్ను తరువాత దహించివేస్తుంది. జాగ్రత్త!'

యిసాక్ వెళ్ళిపోయిన తర్వాత, నీలకవచధారి లాక్స్లీ వద్ద సెలవు పుచ్చుకోడానికి వెళ్ళాడు. ఈనడిచిన కథ అంతా అతనికి చాల విచిత్రంగా ఉంది. ముఖ్యంగా, సంఘ బాహ్యులైనవారిలో యింతటి ధర్మనిష్ఠ ఉండడాన్ని అతడు ప్రశంసించకుండా ఉండలేకపోయాడు. లాక్స్లీ అసలెవరైనదీ తెలుసుకోవాలనే కుతూహలం కలిగిందతనికి. కాని లాక్స్లీ అది బయటపెట్టలేదు. 'మీరుకూడా యిప్పుడు పరిచ్ఛన్న వేషంలో ఉన్నవారే కదా. మీ రహస్యం మీరు బైటపెట్టవద్దు. నా రహస్యం నేను బైటపెట్టను. ప్రస్తుతానికి యిలా జరగనివ్వం'డని సమాధాన మిచ్చాడు. నీలకవచధారి సంతోషించి,—'మంచిది. వచ్చేసారి మన మిద్దరం కలుసుకొనే నాటికి ఈ రహస్యాలు విడిపోగలవనే ఆశిస్తున్నాను. ప్రస్తుతానికి, మన ముభయులం మిత్రులమనే సంతృప్తితో విడిపోదాం. యిది చాలు—' అని అన్నాడు.

ఉభయులూ ఒకరియొక నొకరు మైత్రిని పునరుద్ఘాటించుకున్నారు. లాక్స్లీవద్ద సెలవు గైకొని, నీలకవచధారి తన భద్రాశ్వము నెక్కి ఆ యడవి దారివెంట ఎచటికో పయనమై వెడలిపోయాడు.

# అధ్యాయం ౩౯

అన్నగారైన రిచర్డును తోసిరాజుచేసి తాను సింహాసన మాక్రమించే దురుద్దేశ్యంతో కుట్రకు తలపెట్టిన ప్రిన్సుజాన్, యార్కు దుర్గంలో ఒక విందు ఏర్పాటుచేసి, కుట్రలో తనకు సహాయభూతులు కాగలరనుకున్న సామంతులు, మతాధికారులు, యోధులు మున్నగువారి నచటి కాహ్వానించాడు. వచ్చిన వారితో రహస్యంగా మంతనాలు జరిపి, వారంతా ప్రిన్సుజాన్ పక్షాన బహిరంగంగా నిలబడేటట్లు ఉత్సాహ ప్రోత్సాహాలు కల్పిస్తున్నాడు వాల్డిమార్ ఫిడ్జర్సు. రావలసిన ముఖ్యులింకా రాలేదు. ప్రధానంగా, ఫ్రాంట్ డీబాఫ్, డీబ్రేసీ, టెంప్లార్ బ్రయన్ లింకా రాకపోవడం జానుకూ వాల్డిమారుకూ బలే చిరాకుగా ఉంది. వాళ్ళుకూడా వస్తేనే కాని అంతిమనిర్ణయాలేవీ చెయ్యడానికివీలులేదు. తమ కుట్ర విజయవంతం కావాలంటే, వాళ్ళతోడ్పాటు అత్యవసరం. అందుచే, వాళ్ళింకా రాకుండా జాగుచేస్తున్నందుకు వాళ్ళు లోలోపల తిట్టుకుంటున్నారు. దీనికితోడు, యూదీయ షావుకార్లనుంచి తమకు కావలసిన డబ్బు సమకూర్చి పెట్టడానికి ఒప్పుకున్న ఇసాక్ కూడా రాలేదు. ఇది వారిని మరీ అయోమయావస్థలో పడేసింది. చేతిలో పుష్కలంగా డబ్బులేకుండా యిలాంటి కుట్రల లోకి దిగడం ఎంత ప్రమాదకరమో వారికి తెలుసు.

యిలాంటి పరిస్థితిలో, టార్క్విల్ స్టన్ కోట పతనమైన వృత్తాంతం మరునాటి ఉదయానికల్లా యార్కునగరంలో ఒక పుకారుగా వ్యాపించింది. బ్రయన్, డీబ్రేసీ, ఫ్రాంట్ డీబాఫ్‌లను చంపివేయడమో, ఖయిదీలుగా పట్టుకోడమో,— ఏదో జరిగిందని ఊరంతా చెప్పుకోసాగారు. ఇది వాల్డిమార్ చెవులబడింది. అతడు ప్రిన్సుజాన్‌కు ఈ సంగతి తెలియజేస్తూ, యిది బహుశః యథార్థమై యుండవచ్చునేమో యని తన అనుమానం వెల్లడించాడు. ఎలనంటే, సెడ్రిక్కునూ అతని పరివారాన్నీ దారికాచి కొట్టడానికి కొద్దిమంది అనుచరులతో వీళ్ళు బయలుదేరి వెళ్ళిన సంగతి అతనికి తెలుసు. మామూలు పరిస్థితిలోనైతే, యిలాంటి బందిపోటు ప్రయత్నాలను జాన్ హర్షించియుండే వాడే. కాని యిప్పుడు, తన కార్యక్రమానికిది అంతరాయం కలిగించినందున, లెక్కలేని కోపంతోనూ ధుమధుమలు చెయ్యడం మొదలుపెట్టాడు. 'దేశంలో బొత్తిగా శాంతి భద్రతలు లేకుండా పోతున్నాయి. ప్రజావేటు ఆస్తులకు ఏమాత్రమూ రక్షణ ఉండడంలేదు. చట్టధిక్కారం అంతకంతకు పెచ్చుపెరిగిపోతోంది. ఇలాంటి బందిపోటుతనాలు ఇక సహించడానికి వీలు లేదు. చూడండి, నేను రాజ్యానికి వచ్చిన తర్వాత ఏంచేస్తానో! ఇలాంటి దుండ

గులను కోట కొమ్ములకు వ్రేలాడగట్టి ఉరి తీయిస్తాను'— అని ఉపన్యసింప సాగాడు,— కేవలం ధర్మరక్షణకై అవతరించిన ప్రభువు లాగ.

అంతట వాల్డిమార్ అతని కిలా హితోపదేశం చేశాడు: 'దేవరవారు కొంచెం నిగ్రహించుకోవాలి. తమరు రాజ్యానికి రావాలంటే, తమరు కోపగిస్తున్న యీ మూండగుల తోడ్పాటుతోనే రావలసిఉంటుందనేది మరచిపోకండి. కాబట్టే, వీరు చేసే యీ దుండగాలను తమరు సైరించడమే కాక, సర్వవిధాలా వీరికి రక్షణ కూడా యివ్వవలసి ఉంటుంది. టెంప్లార్, డీబ్రేసీ, ఫ్రాంట్ డీబాఫ్‌లు లేనిదే మనం ఒక్క అడుగు ముందుకు వెయ్యలేము. వేస్తే ప్రమాదంలో పడ్డామన్నమాటే! పోనీ, వీళ్లతో మనకు పొసగదని చెప్పి, వెనుకడుగు వెయ్యడానికా, అంతకన్నా వీలులేదు. ఏమైనప్పటికీ ముందుకు పోవలసిందే కాని వెనుకకు పోవడానికి వీల్లేని పరిస్థితిలో ఉన్నాం. దేవరవారు చిత్తగించాలి!'

ప్రిన్సుజాన్ ఏమీ సమాధానం చెప్పలేక, చేతితో నొసలు బాదుకొని, పిచ్చెత్తినవానిలాగా అటూ ఇటూ పచార్లుచేస్తూ,—'దుర్మార్గులు! ద్రోహులు! ఇలాంటి విషమ స్థితిలో నన్ను విడనాడారో చూడు!' అని ఆవేదన పడ నారంభించాడు.

'ద్రోహులు కాదు— ఉన్మత్తులని అనండి. ఇంత కార్యభారం ముందు పెట్టుకొని, ఇలాంటి తెలివి తక్కువ పనుల్లోకి దిగడం ఉన్మాదం కాక మరేమిటి?' అన్నాడు వాల్డిమార్.

జాన్ తటాలున వాల్డిమార్ ముందర ఆగి,—'అయితే ఇప్పుడు ఏమిటి చెయ్యవలసింది?'— అని అడిగాడు.

'చెయ్యవలసిందేమిటో చేసిన తర్వాతనే తమకీ సమాధానం చెప్పడానికి వచ్చాను. అంతకంటె చెయ్యదగింది లేదు'—అన్నాడు వాల్డిమార్.

'భేష్! నా క్షేమం కోరినవాడవంటే నిజంగా నీవే! నీవంటి సలహాదారు నా దగ్గిరుండగా ఇక నాకు లోటేమిటి? ఈ జాన్ పరిపాలన చరిత్రలో ఒక మహత్తర ఘట్టంగా నిలిచిపోతుంది. ఆఁ, అన్నట్లు, ఏమిటి నీవు చేసి నది?'— అని అడిగాడు జాన్.

'డీబ్రేసీ లెఫ్టినెంటు నికిల్ బ్రాండును వెంటనే అశ్వికదళంతో ఫ్రాంట్ డీబాఫ్ కోట వైపుకు ఉరికించాను. మన మిత్రులను ఆపదలోంచి తప్పించడానికి ఏమైనా చెయ్యదగ్గది ఉంటే చేస్తాడు'—అన్నాడు వాల్డిమార్.

తనతో చెప్పకుండానే వాల్డిమార్ ఈ పని చెయ్యడం జాన్‌కు చాల కష్టమనిపించింది. ముఖం చిట్లించుకొని, 'అయితే వాల్డిమార్, నేనిక్కడ ఉండగానే, నాతో చెప్పకుండా, నా ఉత్తరువు లేకుండా ఆ విధంగా నీవు

చేశావంటే, నిన్నేమనాలి! మరి ఇంత నిర్లక్ష్యమా!'— అన్నాడు.

జాన్ స్వాతిశయ ప్రవృత్తిని వాల్డిమార్ లోలోన ఏవగించుకుంటూ ఇలా సమాధానం చెప్పాడు: 'దేవరవారు మన్నించాలి. తమకు విన్నవించే వాణ్ణే,— కాని, ప్రతిక్షణమూ అమూల్యంగా భావించవలసిన పరిస్థితి అయిపోయింది. ఒక్క క్షణం ఆలస్యమైనా అది ప్రమాదంగా పరిణమించవచ్చు. అందుచే, దేవరవారి శ్రేయస్సు ఆలోచించి, ఈ మాత్రం స్వతంత్రించడం అవసరంగా భావించాను.'

జాన్ ఒక విధమైన గర్వస్ఫూర్తితో ఇలా అన్నాడు: 'మంచిది! తొందరపడినా నా మేలుకోరి చేశావుగనుక నిన్ను మన్నించాను. సరేగాని,— ఎవరావచ్చేది? డీ బ్రేసీలాగున్నాడే! ఏమిటీ వింత వేషం?'—

అవును, ఆ వచ్చినది డీ బ్రేసీయే. అతివేగంతో గుర్రపుస్వారీ చేసివచ్చిన బడలిక అతనిలో కనిపిస్తోంది. కవచం అచ్చటచట పగిలి రక్తసిక్తమైంది. ఆపాదమస్తకం ధూళిధూసరితంగా ఉన్నాడు. నెమ్మదిగా శిరస్త్రాణం తీసి బల్లమీద పెట్టి, మార్గాయాస మపనయించుకోడానికి కొంచెంసేపు మౌనంగా అలా ఉండిపోయాడు.

'డీ బ్రేసీ! ఏమిటిదంతా? సాగ్జన్లేమైన తిరుగుబాటు చేశారా? త్వరగా చెప్పు!'— అని అడిగాడు జాన్.

జాన్ మాట్లాడిన సమయంలోనే వాల్డిమార్ తానుకూడ మాట్లాడుతూ డీ బ్రేసీని ఇలా హెచ్చరించాడు: 'చెప్పు డీ బ్రేసీ! ఏమిటీ అవస్థ? టెంప్లార్ ఎక్కడ? ఫ్రాంట్ డీబాఫ్ ఏమైనాడు?'

'టెంప్లార్ పలాయితుడైనాడు. ఫ్రాంట్ డీబాఫ్ ఇక ఎన్నటికీ మనకు కనిపించడు. అతని కోట తగులబడిపోయింది. దానితోపాటే అతడుకూడ తగులబడిపోయినాడు. బ్రతికి బయటపడినది నేనొక్కడనే!'— అన్నాడు డీ బ్రేసీ.

'ఓస్! ఇంతేగదా! ఈ మాత్రానికి దిగులుపడేవాళ్లెవ్వరూ లేరిక్కడ' అన్నాడు వాల్డిమార్.

'దిగులుగొలిపే వార్త ముందున్నది'— అంటూ డీ బ్రేసీ ప్రిన్స్ జాన్కు సమీపంగా వచ్చి, మంద్రస్వరంతో ఇలా వాక్రుచ్చాడు: 'తమ సోదరుడు

రిచర్డు ఇప్పుడు ఈ దేశంలోనే ఉన్నాడు. నేను స్వయంగా చూశాను,— మాట్లాడాను కూడ !'

ఈ మాట వినేసరికల్లా ప్రిన్సుజాన్‌కు మొగాన నెత్తురుచుక్క లేదు— గుండెలో శూలం గుచ్చుకొన్నట్లయింది. తూలి పడబోయి, పక్కనున్న బెంచీ పట్టుకొని ఎలాగో చేరగిలబడ్డాడు. డీబ్రేసీ చెప్పినమాట వాల్డిమార్ ఒకపట్టాన నమ్మలేదు. 'నీకు పిచ్చెత్తినట్లుగా ఉంది. ఎవరిని చూచి ఎవరనుకున్నావో పొమ్మన్నాడు. కాని, డీబ్రేసీ వివరంగా అంతా చెప్పేసరికి, ఇక నమ్మకతప్పిందికాదు. టార్క్విల్‌స్టన్ కోటను సంఘబాహ్యులైన ఆటవికులు కొందరు ముట్టడించగా రిచర్డు వారికి తోడ్పడడం జరిగిందనీ, అతడు రిచర్డనే సంగతి ఆ యాటవికులకు తెలియదనీ, వారిని వదిలివేసి ఆతడీపాటికి ఎచటికో వెళ్ళిపోయియుండవచ్చుననీ, అన్నాడు డీబ్రేసీ.

రిచర్డుకు సాహసకృత్యాలంటే ఎంతో ఇష్టమనీ, రాచకార్యాలు పట్టించుకోకుండా, తనకు వచ్చే ప్రమాదాలైన లెక్కచేయకుండా, అసహాయ శూరుడుగా పెక్కు సాహసకృత్యాలుచేస్తూ సంచరించడం అతనికి అలవాటనీ, వాల్డిమార్‌కు తెలుసు. అందుచే, తప్పక అతడు రిచర్డే అయియుంటాడని విశ్వసించి, 'అయితే నీవిప్పుడు ఏమి చెయ్యదలచుకున్నావు డీబ్రేసీ?'— అని అడిగాడు.

'నేనా ? సైన్యంతో ఓడెక్కి ఫ్లాండర్సు చేరుకోడమే గత్యంతరంగా తోస్తోంది. స్వసైన్యంగా వచ్చి మీకు సేవచేస్తాను, అంగీకరించండని రిచర్డును అర్థించాను. కాని, అతడు సమ్మతించలేదు. ఫ్లాండర్సు గనుక చేరానంటే, అక్కడవున్న కల్లోల పరిస్థితులనుబట్టి, నావంటి కర్మవీరునికి ఏదో ఒక ఆశ్రయం దొరక్కపోదు. మరి నీ సంగతేమిటి ? నీవుకూడా నాతో రాగలవా ?'— అని అడిగాడు డీబ్రేసీ.

'పడుచువాడవు, నీకేం ! ఎచటికైనా పోగలవు, ఏమైనా చేయగలవు. నేను వయసుమీరినవాణ్ణి. నాకొక కుమార్తెకూడా ఉంది'— అన్నాడు వాల్డిమార్.

'నీ కుమార్తెను నాకిచ్చి వివాహం చెయ్యి. ఆమె హోదాకు తగినట్లుగా ఆమెను పోషిస్తాను. ఎలాంటి లోటూ ఆమెకు రానివ్వను'— అన్నాడు డీబ్రేసీ.

'అక్కరలేదు. నేనిక్కడ సెంటుపీటర్సు చర్చిలో మతదీక్ష పుచ్చుకొని శేషజీవితం గడిపేస్తాను. ఆర్చిబిషప్ నా సోదరుడే'— అన్నాడు వాల్డిమార్.

ఇద్దరూ ఇలా మాట్లాడుకుంటూ ఉండగా, ప్రిన్సుజాన్ తన మనోవైక్లబ్యంనుండి క్రమంగా తెప్పరిల్లాడు. ఇరువురి సంభాషణా అతడు జాగ్రత్త

గానే విన్నాడు. తనను విడనాడడానికి ఇద్దరూకూడ సంసిద్ధులైఉన్నారనే విషయ మతనికి స్పష్టమైపోయింది. వీళ్లు విడనాడితే ఆత్మరక్షణకు తనకిక మార్గాంతరమే దొరక్కపోతుందా అనుకున్నాడు. అందుచే, కాని నవ్వొకటి పైశాచికంగా నవ్వుతూ ఇలా అన్నాడు: 'ఆహాహా! మీ రేదో ధీరులూ, వీరులూ, వివేకవంతులూ అనుకున్నాను. సమయానికి ఇలా దిగజారుతున్నారేమిటి? సిద్ధాన్నం కాలదన్నుకుంటున్నట్లుగా ఉంది మీ వైఖరి. ధైర్యంగా నిలబడితే, మీ కోర్కెలన్నీ ఈవేళే సఫలమయిది. తెలుసునా?'

'అది రేపో మాపోగాని, ఒకటిమాత్రం నాకు బాగా తెలుసు. రిచర్డు తిరిగి వచ్చినవార్త దేశమంతా గుప్పుమనగానే, త్రుటిమాత్రంలో అతని నాయకత్వాన ఒక పెద్ద సైన్యం తయారయ్యేమాట నిశ్చయం. మన పని బండి మున్నారయే! కనుక నా సలహా పాటించి, మీరుకూడా ఫ్రాంసుకు పారిపొండి. లేకపోతే, మీ అమ్మగారి ఆశ్రయం పొందినాసరే,'—అన్నాడు డీబ్రేసీ.

పిరిస్సుజాన్ దర్పంతో ఇలా సమాధానమిచ్చాడు: 'నా మాటకేం,- నన్ను నేను కాపాడుకోవాలంటే ఎవరెవరినో ఆశ్రయించ నక్కరలేదు. నా సోదరునితో ఒక్కమాట మాట్లాడితే చాలు, అతడే నన్ను తప్పక మన్నించగల దనే ధైర్యం నాకుంది. నే నాలోచించేది మిమ్మల్ని గూర్చి. ఈ పరీక్షా సమయంలో మీ రైతే నన్ను విడనాడడానికే సిద్ధపడుతూ ఉన్నా, మీ తలకాయలు కోటగోమ్మలకు వేళ్లాడకుండా చెయ్యడం ఎలాగనే నేనాదుర్దా పడుతున్నాను. ఇదిగో వాల్డిమార్! మీ ఆర్చిబిషప్ నిన్ను రక్షిస్తాడనుకుంటున్నావు కాబోలు! తాను రిచర్డు అనుగ్రహం సంపాదించుకోడంకోసం నిన్ను నిర్దయగా బలిపెట్టగల సమర్థుడతడు. ఆ సంగతి నీకుకూడా తెలిసినదే. ఇంక ఫ్లాండర్సుపారిపోవడానికి ఓడెక్కు తానంటున్నాడు డీబ్రేసీ. దారిలో రాబర్ట్ ఎస్టోటివిల్ సైన్యసమేతంగా విడిసిఉన్న సంగతి మరిచిపోయాడా? ఎసెక్సు ప్రభువుకూడా కొంత సైన్యాన్ని కూర్చుకొని మనల నెదిరించడానికి సిద్ధపడుతున్న సంగతి విస్మరించాడా? వీరిరువురినిగూర్చి రిచర్డు దేశానికి రాకమునుపునుంచీ మనం భయపడుతున్నాంగదా! ఇప్పుడు, రిచర్డు దేశానికి వచ్చేశాడని తెలిసిన తర్వాత, వీరంతా రిచర్డు తరఫున పోట్లాడేవారేనన్నది మీకు తెలియదా? డీబ్రేసీసీ, అతని సైనికదళాన్నీ మట్టుపెట్టడానికి ఒక్క ఎస్టోటివిల్ దగ్గరఉన్న సైన్యమే చాలు'—ఆ సరికి వాల్డిమార్ డీబ్రేసీలు దిగులు మొగాలతో ఒకరివంక ఒకరు చూచుకున్నారు. జాన్ తన ఉపన్యాసం ఈ విధంగా పూర్తిచేశాడు: 'కనుక ఇప్పుడు మనం ఈ చిక్కులోంచి తప్పించుకొని బయటపడడానికి ఒకటే మార్గముంది. ఏమిటంటే'—ఈ మాట చెప్పబోతూఉంటే జాన్ నొసలు కొరుగవిసినట్లు నల్లబడింది— 'రిచర్డు ఇప్పుడు ఒంటరిగా తిరుగాడుతున్నాడు. ఇదే సమయం అతని నెదుర్కోడానికి!'

ఈమాటకు డీబ్రేసీ కంగారుపడుతూ, 'అమ్మబాబోయ్! ఆ పని నావల్ల కాదు. నేను తన చేతికి చిక్కిన సమయంలో, నన్నతడు కనికరించి వదిలేశాడు— అలాంటి వానికి చేజేతులా నేను హాని చెయ్యలేను.'

జాన్ ఒక వింత నవ్వు నవ్వి,— 'హాని చెయ్యమంటున్న దెవరు? అతనిని చంపమని నేనేమీ అనడంలేదే? చంపవద్దు! ఖయిదీగా పట్టుకుంటే చాలు! ఖయిదీగా అతడు ఆస్ట్రియాలో ఉంటే ఎంతో, బ్రిటనులో ఉన్నా అంతే! ఆస్ట్రియాలో శాశ్వతంగా ఖయిదీగా ఉండిపోగలడన్న ధైర్యంతోనే గదా, మనం ఈ ఉద్యమం సంకల్పించాము. ఆస్ట్రియాకు బదులుగా బ్రిటన్‌లో ఖయిదీగా ఉన్నప్పటికీ, మన ఉద్యమం కొనసాగడానికి అభ్యంతరముండదు. మా పెత్తండ్రి రాబర్టు సంగతి యేమైంది? చచ్చేటంతవరకూ కార్డిఫ్ కోటలో ఖయిదీగానే గదా కాలక్షేపం చేశాడు?'

'నిజమే,— కాని, అలా చెయ్యడం మీ తండ్రికి సాగినట్లుగా మీకు సాగదు. నన్నుగనుక అడిగితే, చర్చి ఆవరణలోని సమాధే ఉత్తమమైన ఖయిదు! ఆ తర్వాత మీ ఇష్టం!'— అన్నాడు వాల్డిమార్.

'మీ రేమైనా చేసుకోండి. నాకు మాత్రం ఈ వ్యవహారంతో ఇక సంబంధంలేదు'— అన్నాడు డీబ్రేసీ.

'దుష్టుడా! మా రహస్యాలోచనలు వెల్లడిచేస్తావా యేం!' అన్నాడు జాన్.

'రహస్యాలోచనలు వెల్లడిచేసే నీచత్వం నాకు లేదు. నన్ను దుష్టునిక్రింద జమకట్టడం నేను సహించను' అన్నాడు డీబ్రేసీ సగర్వంగా.

'కొంచెం నిదానించి మాట్లాడు డీబ్రేసీ!'— అంటూ వాల్డిమార్, ప్రిన్సు జాన్‌తో, 'తమరుండండి ప్రభూ! వీరవరుడైన డీబ్రేసీకి పిచ్చినియమాలు కొన్ని ఉన్నాయి. తమరు కొంచెం మన్నించాలి. వాటిని తొలగించే భారం నాది' అన్నాడు వాల్డిమార్.

'అది నీతరం కాదు'— అని సమాధానమిచ్చాడు డీబ్రేసీ.

కుటిలరాజనీతిజ్ఞుడైన వాల్డిమార్ అతనినిలా బుజ్జగించాడు: 'ఇదిగో డీబ్రేసీ, నీవు నిష్కారణంగా బెదిరిపోతున్నావు. రిచర్డంటే నీ కెందుకా భయం? రణరంగంలో అతనిని ముఖాముఖి యెదుర్కోవాలని నిన్న మొన్నటిదాకా ఎంతో ఉబలాటపడుతూ ఉండేవాడివే! ఒకసారి కాదు పదిసార్లు ఆ మాట నీవంటూవుండగా ఈ చెవులతో విన్నాను. ఇంతలో ఏమిటీ మార్పు?'

'నిజమే, నీవన్నట్టు రణరంగంలో రిచర్డును ముఖాముఖి ఎదుర్కోవానికి నే నభిలాషపడినమాట వాస్తవం. కాని అరణ్యాలలో ఒంటిపాటున దొరుక్కో

దానికి నేను ఉబలాటపడినట్లు యెప్పుడైన విన్నావా? లేదు, అలాంటి కోరిక నేనెన్నడూ కోరలేదు' అన్నాడు డీబ్రేసీ.

'దానికి దీనికీ తేడా ఏమిటో నాకు అర్థం కావడంలేదు. రణరంగంలో పోరాడితేనే కీర్తిప్రతిష్ఠలు వస్తాయనుకుంటున్నావా? పూర్వం, ఆర్థరు మహారాజు రౌండు టేబులు చుట్టూ పరివేష్ఠించి యుండే లాన్సిలాట్ మొదలైన యోధవరులకు పేరుప్రతిష్ఠలు ఏవిధంగా వచ్చాయి? మామూలు యుద్ధరంగాల్లో పోరాడినందువల్ల కాదు. అరణ్యసీమల్లో మహాబలవంతులైన ప్రత్యర్థులను నిర్జించినందువల్లనే వచ్చాయి. తెలుసునా?'— అన్నాడు వాల్డిమార్.

'నిజమే,— కాని, ఆ లాన్సిలాట్ ప్రభృతులెవ్వరూ యెక్కటి కయ్యంలో రిచర్డుతో సరిపోలరని నిశ్చయంగా చెప్పగలను. అయినా, ఒంటి పాటున చూచి పైబడడమనేది ఆ వీరులపద్ధతి కాదనే నేననుకుంటాను'— అన్నాడు డీబ్రేసీ.

'నీకు నిజంగా పిచ్చెక్కింది డీబ్రేసీ! నిన్ను మేము అడుగుతున్న దేమిటి? నీవూ నీ సైన్యమూ ప్రిన్సుజాన్ డబ్బు తిని ఆయన కొలువులో ఉంటున్నారు. ఫలాని పని చెయ్యి, అనగానే చెయ్యాలి. అందుకు బదులుగా, ఏవో ధర్మ సందేహాలు పెట్టుకొని కూర్చుంటున్నావు. ప్రిన్సుజాన్ ఒక్కడికే కాదు, మన అందరికీ గూడ ప్రాణగొడ్డమైన పరిస్థితి దాపురించి కూర్చుంది. ఇలాంటి సమయంలోనా నీ ధర్మసందేహాలు?'— అని హెచ్చరించాడు వాల్డిమార్.

'నిజమైనా చెప్పు వాల్డిమార్! రిచర్డు నాకు ప్రాణదానం చేశాడు. నా సేవ అందుకోడానికి నిరాకరించి నన్నతడు వెళ్ళగొట్టివేసిన మాట నిజం. అందుచే అతనియెడ భక్తి చూపవలసిన అవసరం నాకేమీ లేదుగాని, అయినప్పటికీ, అతనిపై నేనిక కత్తి యెత్తడం మాత్రం అసంభవం'— అన్నాడు డీబ్రేసీ.

'నీవు ఎత్తవలసిన పని లేదు. నీ ముఖ్యానుచరుడైన వింకిల్ బ్రాండును కొంతమంది సైనికులతో పంపితే చాలు'— అని సూచించాడు వాల్డిమార్.

'అది కూడా పొసగదు. ఇలాంటి పనిలో నా తాలూకు మనుష్యులెవరూ ప్రవేశించడానికి నేనొప్పుకోను. అందుకు తగినవారు మీవద్ద ఇంకా చాలామంది ఉన్నారు, వాళ్లను పంపుకోండి'— అన్నాడు డీబ్రేసీ.

'ఇంత మొండితనం ఏమిటి డీబ్రేసీ నీకు? ఇదేనా నీ స్వామిభక్తి? ఈ సమయంలో నన్ను విడనాడవలసిందేనా?' అని అడిగాడు జాన్.

'విడనాడను. ఆస్థానంలోగాని రణరంగంలోగాని మీకు ఎలాంటి సేవ చేయడానికైనా నేను సంసిద్ధుడనే. కాని, ఈ బందిపోటు వ్యవహారము మాత్రం నా చేతకాదు'— అని సమాధానమిచ్చాడు డీబ్రేసీ.

డీబ్రేసీని ఇక పురికొల్పి ప్రయోజనము లేదని నిశ్చయించుకొని, వాల్డిమార్ ఆ కార్యభారాన్ని తనమీద వేసుకున్నాడు. వెంటనే తనను వచ్చి కలుసుకోండని కొంతమంది ముఖ్యానుచరులకూ, స్టాట్ మాస్టర్ హ్యూబార్డన్ కూ పరిచారకుని ద్వారా కబురుచేసి, తాను ప్రయాణానికి సిద్ధం కావడానికై బసకు వెళ్లిపోయాడు.

వాల్డిమార్ వెళ్ళిపోగానే ప్రిన్సుజాన్ డీబ్రేసీతో ఇలా అన్నాడు: 'నా సోదరుని బందీగా పట్టుకోడానికి వెడుతున్నాడిప్పుడు వాల్డిమార్. నేనిచ్చిన ఆదేశం జాగ్రత్తగా పాటించి, నా ప్రియసోదరునికి ప్రాణాపాయం కలుగ నివ్వడనే ఆశిస్తున్నాను!'

డీబ్రేసీ దీనికి జవాబుగా ఒక చిరునవ్వు నవ్వాడు.

ప్రిన్సుజాన్ తిరిగి ఇలా అన్నాడు: 'అవును. ఎలాటి సంశయానికీ తావు లేకుండేటట్లుగానే ఆదేశమిచ్చాను. నీవు వినియుండకపోవచ్చు. అదిగో, ఆ కిటికీదగ్గర మేమిద్దరమూ నిలబడ్డాము.— అప్పుడు స్పష్టంగా చెప్పాను,— నా సోదరునికి ప్రాణాపాయం మట్టుకు రానివ్వగూడదు సుమా, జాగ్రత్తసుమీ. నా ఈ ఉత్తరువును గనుక సరిగా పాటించకపోతే, అతని తల దొర్లగొట్టిస్తానన్నమాటే!'

'చిత్తం. నాకది వినిపించలేదు. పొరపాటున ఒకవేళ వాల్డిమార్ కూడా వినపడలేదేమో! నేనుపోయి హెచ్చరించివస్తాను'— అన్నాడు డీబ్రేసీ.

జాన్ చిరాకుపడి,— 'వద్దు వద్దు, నీవు వెళ్ళనక్కరలేదు. నేనన్నది అతడు బాగా విన్నాడు. నీకా సందేహ మక్కరలేదు. నీతో నాకు వేరే పనిఉంది. ఇలారా' అంటూ అతనిని వెంటబెట్టుకొని ముందుకునడుస్తూ, తన అంతరంగికునికి ఒక రహస్యం చెప్పుతున్న ధోరణిలో ఇలా అన్నాడు: 'చూడు డీబ్రేసీ! ఈ వాల్డిమార్ నుగూర్చి ఏమిటి నీ అభిప్రాయం? మేము రాజ్యానికి రాగానే ఛాన్సెలర్ పదవి నాక్రమించాలనే ఆశతో ఉన్నాడు. కాని, ఇలాంటివాడికా ఆ ఉన్నతపదవి! మా రాజవంశీయులను ఇంత చులకనగా చూచేవాడెవ్వడూ ఆ పదవికి తగడు. చూడు, రిచర్డుమీద చేయి చేసుకోడానికి ఎంత త్వరపడి ముందుకు దూకాడో! అప్రియమైన ఆ పని చెయ్యలేనని నీవు ధైర్యంగా చెప్పగలిగినందుకు నాకు చాల సంతోషంగా ఉంది. ఇందుమూలంగా నీయెడ నాకున్న గౌరవభావం హెచ్చింది. ఒకొక్కప్పుడు తప్పనిసరిగా కొన్ని పనులు చేయిస్తూ ఉంటాం. కాని ఆ పనులు చేయడానికి జొరబడిన వాళ్ళను మాత్రం గౌరవించం. చేయనని నిరాకరించిన వాళ్ళనే ఎక్కువగా గౌరవిస్తాం. నీవిప్పుడు ఆవిధంగా మాకు గౌరవ భాజనుడవైనావు. నా సోదరుని అరెస్టు చెయ్యడానికి త్వరపడివెళ్ళిన వాల్డిమార్ ఛాన్సెలరు పదవికి

ఎంతమాత్రమూ అర్హుడు కాడు. వాళ్లనని ధైర్యంగా చెప్పగలిగిన నీవు నిజంగా హైమార్షల్ పదవికి అర్హుడవు. ఉన్న సంగతి నీకు చెప్పేశాను. మనసులో ఉంచుకొని, నీ పనిమీద నీవుండు. వెళ్లిరా.'

డీబ్రేసీ జాన్ వద్దనుంచి సెలవు పుచ్చుకొంటూ లోలోపల ఇలా అనుకున్నాడు: 'ఔరా! నీవంటి చపలచిత్తుణ్ణీ, నిరంకుశుణ్ణీ నమ్ముకున్న వాడు నిజంగా గోతిలోదిగి నట్లేకదా! ఛాన్సెలర్ కాగోరి నీకు అంతరంగికుడుగా మెలగడం కంటె ప్రమాదం మరొకటి లేదు. కాని, అదిగో, హైమార్షల్ పదవి నన్నాహ్వానిస్తోంది. ఎన్ని శ్రమలు పడినా సరే, అది సాధించితీరుతాను'.

డీబ్రేసీ వెడలిపోగానే జాన్, స్టాట్ మాస్టర్ హ్యూబార్డన్‌కు కబురు చేశాడు,- వాల్డిమార్‌తో మాట్లాడిన వెంటనే తనను వచ్చి కలుసుకోవలసిందని. అలాగే కొంతసేపటికి హ్యూ బార్డన్ వచ్చాడు. అడవిదారులన్నీ బాగా తెలిసి దొంగల జాడలను బాగా పసికట్టగల ఇద్దరు నేర్పరులను వెంటతీసుకొని వాల్డిమార్ కొంతమంది ముఖ్యానుచరులతో బయలుదేరి వెళ్లినసంగతి నివేదించాడు. జాన్ సంతోషించి,—డీబ్రేసీని ఒకకంట కనిపెట్టుతూ ఉండవలసిందనీ, అత డెప్పుడెప్పు డెవరెవరితో మాట్లాడుతూ ఉంటాడో తన కెప్పటి కప్పుడు తెలియజేస్తూ ఉండవలసిందనీ, ఇలా కనిపెట్టుతున్నట్లు డీబ్రేసీకి అనుమానం తగలకూడదనీ, ఈ పనిలో అప్రమత్తుడవైనావంటే నీ తలకాయ ఊడుతుందనుమా జాగ్రత్తయనీ, బార్డన్‌కు హెచ్చరిక చేశాడు. 'దేవరవారి ఆనతిప్రకారం అక్షరాలా నడుచుకొంటా'నని సమాధానమిచ్చాడు బార్డన్. 'డీబ్రేసీ నాకుగనుక ద్రోహం తలపెట్టితే, ఉత్తరక్షణంలో వాని తలకాయ ఎగిరిపోయిందన్నమాటే!'- అని తనలోతాననుకొని సంతృప్తి చెందాడు జాన్.

# అధ్యాయం ౩౬

కుమార్తెను చెరవిడిపించడంకోసం టెంపుల్ స్టోవ్ మఠానికి బయలుదేరిన ఇసాక్‌ను మన మిప్పుడనుసరింతము. లాక్స్లీ అతనికొక కంచరగాడిదనిచ్చి, ఇద్దరు ఆటవికులను తోడుగా వెంటపంపాడు. చీకటి పడేలోపుగానే టెంపుల్ స్టోవ్ చేరుకోగలనన్న ధైర్యంతో, ఇసాక్ ఆ అడవి దాటగానే వారి చేతిలో ఏవో కొన్ని డబ్బులుపెట్టి వెనుకకు పంపివేసి, ఆ పైన తానొక్కడూ ముందుకు ప్రయాణం సాగించాడు. కాని, శరీరం బాగా బడలియున్న కారణాన, టెంపుల్ స్టోవ్‌కి నాలుగుమైళ్లు ఉన్నదనగానే అతని పని అయిపోయింది. అప్పటి కతడొక చిన్న సంతఊరు చేరాడు. అక్కడ, అతనెరుగున్న యూదీయవైద్యుడొకడున్నాడు. యూదీయులెక్కడ ఉన్నా, తోటి యూదీయుడువస్తే పరమప్రీతితో ఆదరించి ఆతిథ్యమివ్వడం ఆచారం. నాథన్ బెన్ అలాగే ఇసాక్‌ను ఆదరించి, ఆ రాత్రి కక్కడ విశ్రాంతి తీసుకొమ్మని బలవంతపెట్టి, అతని మార్గాయాసాన్ని అపనయించేందుకు తగు చికిత్సలు చేశాడు.

మరునాటి ఉదయం ఇసాక్ తిరిగి ప్రయాణమైనాడు. ఇప్పటి అనారోగ్య పరిస్థితిలో ప్రయాణం ప్రమాదకరమని నాథన్ హెచ్చరించినా వినలేదు. 'టెంప్లార్ వ్యవస్థకు సర్వాధికారియైన గ్రాండుమాస్టరిప్పుడు టెంపుల్ స్టోవ్ మఠంలో విడిసియున్న సంగతి నీకు తెలుసునా' అని అడిగాడు నాథన్. తెలియదన్నాడు ఇసాక్. ఇరువురూ ఆ సర్వాధికారిని గూర్చి చెప్పుకొన్నారు. అతడు అగ్నిహోత్రం వంటి మనిషి. తన మతవిధులను తు–చ తప్పకుండా పాటించాలనే పట్టుదల గలవాడు. ఇతర టెంప్లార్లవలె భోగలాలసులై అవినీతికి పాల్పడేవాడు కాదు. కామినీ కాంచనాల కతీతుడు. టెంప్లార్ వ్యవస్థ క్రైస్తవ ధర్మ రక్షణకోసం బలిదానాలు చెయ్యడాని కేర్పడింది కనుక, అట్టి బలిదానాలకు తన అనుయాయులను నిత్యమూ ప్రేరేపిస్తూ ఉండడమే అతని లక్ష్యం. ఈ దృష్ట్యా, యూదీయులతో సహా, క్రైస్తవేతరులందరూ అతనికి శత్రువులు. వారియెడ అతడు కనికరం చూపడు. టెంప్లార్ వ్యవస్థ నియమ నిబంధనల నుల్లంఘించే అనుయాయులయెడ కూడా అతడు అంతటి కఠినుడే!— అతడంటే వారందరికీ సింహస్వప్నం. అవినీతిపరులైన టెంప్లార్లపై నిప్పులు గ్రక్కుతూ, వారిని దండించే నిమిత్తమే అకస్మాత్తుగా ఇప్పుడు ఇంగ్లాండు వచ్చాడు. అతడిలా వస్తున్నాడని ఎవరికీ తెలియదు. టెంప్లార్లు హడలి పోతున్నారు. ఈ సంగతులన్నీ ఇసాక్‌కు చెపుతూ నాథన్,—'ఇలాంటి ఉగ్రమూర్తి దగ్గరకి ఇప్పుడెందుకు వెడతావు? అతనికి తురుష్కుల రక్తమంటే

ఎంత ప్రీతితో, యూదీయుల రక్తమున్నా అంతే! పైగా, మనది సైతాను వైద్యమని నిందిస్తూ ఉంటాడు, వెళ్ళబోకు' మని హెచ్చరించాడు.

కాని, అతనిముఖం యింకా యెన్నిరెట్లు నిస్పృహ పెరిగిపోతున్నా సరే తాను వెళ్ళక తప్పదన్నాడు ఇసాక్. ఏ కార్యంమీద తాను వచ్చినదీ సవిస్తరంగా నాథన్‌కు తెలియజేశాడు. టెంప్లార్లపై సర్వాధికారి గనుక, బ్రయన్‌ను దుర్వృత్తినుండి మరలించి రెబెకాను తిరిగి తనకు దక్కేటట్లు చేయవచ్చునేమో యని ఆశ వెలిబుచ్చాడు. నాథన్ యింక అడ్డుపెట్టక, రెబెకా విషయమై అపరిమితమైన ఆదుర్దా చెంది, అయితే వెళ్ళవలసినదేనని ప్రోత్సహించాడు. సరాసరి ఆ సర్వాధికారియెదుట పడడం కంటె, బ్రయన్‌ను ప్రయివేటుగా కలుసుకొని మాట్లాడితే తేలిగ్గా కార్యం సాధించుకోవచ్చునేమో ఆలోచించమన్నాడు. 'ఇది నీ పితృగృహమనుకో, తిరిగి ఇక్కడికే రావాలిసుమా! వచ్చేటప్పుడు రెబెకానుగూడ తీసుకొని రాగలవని ఆశిస్తున్నా'నని సాగనంపాడు.

ఇసాక్ ఒక గంటసేపటిలో టెంపుల్ స్టోవు మఠం చేరుకున్నాడు. టెంప్లార్ల మఠాలను ప్రిసెప్టరీలంటారు. టెంపుల్ స్టోవు ప్రిసెప్టరీ చక్కని పచ్చిక మైదానాల మధ్యఉంది. మతధర్మంతో పాటు క్షాత్రధర్మంగూడా నిర్వహింపబూనుకున్న సంస్థగనుక, దానినొక కోటవలె బందోబస్తుచేశారు. సాయుధులైన యిద్దరు నీలాంశుకధారులు అగడ్తపైగల వంతెనను కావలి కాస్తున్నారు. అలాంటివారే మరికొందరు, చావు ఊరేగింపు వేళ నడిచే పద్ధతిలో ఇటూ అటూ గోడలపై పహరాయిస్తున్నారు. అది భూత ప్రేతపిశాచాలు పహరాయిస్తున్నట్లుంది గాని సైనికులు పహరా ఇస్తున్నట్లు లేదు. అవతల ఆవరణలో, ఎడనెడ శ్వేతాంబరధారులైన యోధులొకరిద్దరు చేతులు కట్టుకొని తలవంచి అదో వింతరకంగా తిరుగాడడం కనిపిస్తోంది. ఇలాటి పహారాల హడావుడి ఈమధ్య టెంపుల్ స్టోవు ప్రిసెప్టరీలో లేదు. ఇదంతా చండశాసనుడైన సర్వాధికారి లూకాస్ ఆగమనం ఫలితం.

ఇసాక్ గేటుకద్ద నిలిచి, లోనికి ప్రవేశించడమెలాగా అని ఆలోచిస్తున్నాడు. సర్వాధికారి రాకవలన ప్రిసెప్టరీలో కలిగిన యీ మార్పువల్ల అతడు సంతోషించదగినదేమీ లేదు. అతని పాటికి, ఆ ప్రిసెప్టరీలోని వెనుకటి భోగపరాయణత్వం ఎంత ప్రమాదకరమో, ఇప్పటి మతాభినివేశమూ అంత ప్రమాదకరమే! ఇదివరకైతే, అతనినుండి డబ్బు గుంజడానికి అతనిని బాధించేవారు. ఇప్పుడతని మతాన్నిబట్టి అతని ద్వేషించి హింసిస్తారు.

ఇలాంటి పరిస్థితిలో, ప్రిసెప్టరీకి చెందిన ఒక చిన్నతోటలో, సర్వాధికారి లూకాస్, ఒక సహచరునితో ఏదో మాట్లాడుతూ తిరుగాడు

తున్నాడు. బాగా వయస్సుమీరిన మనిషి. తెల్లని పొడుగైన గడ్డం. కనులమీదికి వాలిన తెల్లని కనుబొమలు. కాని, చూపుల్లో మాత్రం మంచి తీక్ష్ణత ఉంది. ఆ కాయశరీరం, ముఖంలో ఆ బిగివి, అతడొక గొప్ప వీరుడనే సంగతి స్ఫురింపజేస్తున్నాయి. కఠోర నియమనిష్ఠలు పాటించడంవల్ల కలిగిన కార్శ్యతకూడ అతని ఆకారంలో లేకపోలేదు. తన ఉన్నత పదవినిబట్టి వచ్చిన ఒక విధమైన గాంభీర్యముద్ర కూడ అతనిలో కనిపిస్తుంది. అది సహజమే. టెంప్లార్ వ్యవస్థలోని వీరాధివీరు లందరూ అతని అదుపాజ్ఞల్లో ఉంటారు. యూరపు ఖండంలోని రాజాధిరాజులమధ్యనే అతని వ్యవహారం. అలాంటప్పుడు, అట్టి గాంభీర్యముద్ర అతనియందు ఉట్టిపడడంలో ఆశ్చర్యంలేదు. ఆజానుబాహువు. నడుము ఏమాత్రమూ వంగలేదు. నడకలో ఒక విధమైన హుందాతన ముంది. వారి మత విధుల ప్రకారం గుత్తంగా కుట్టబడ్డ తెల్లని ఉడుపు ధరించాడు. ఎడమ భుజంపై ఎనిమిది కోణాలు తేల్చిన సిలువచిహ్నం ఎర్రని గుడ్డతో కుట్టబడి ఉంది. చేతిలో, తన హోదాను తెలియజేసే ఒక పొడుగాటి దండం ధరించాడు. దండానికి పై కొసను, వర్తులాకారంలో ఒక రేకు బిగించబడి ఉంది. దానిపైన కూడ టెంప్లార్ సంప్రదాయానుసారమైన సిలువ చిహ్నం చెక్కబడి ఉంది. అతని సహచరుడు కూడా దాదాపు ఈమాదిరి దుస్తులే ధరించాడు గాని, హోదాలో అతడతనికంటె తక్కువవాడన్నది అతని లక్షణం చెప్పక చెప్పుతోంది. సర్వాధికారి ముందుకు నడుస్తూ వెనుకకు తిరగకుండానే ఏదో చెప్పుతున్నాడు. అతడు చెప్పేది వినిపించేటంత దూరంలో వెనుక వెనుకగా నడచివస్తున్నాడతని సహచరుడు.

టెంప్లార్ వ్యవస్థ అవినీతికి ఆలవాలమైపోయినందుకు తన వలవంత వెళ్ళబోసుకొంటున్నాడు సర్వాధికారి. పవిత్రమైన యీ సంస్థ యిలా అధోగతిపాలు కావడమనేది చూడడంకంటె మరణం మేలనుకుంటున్నాడు. ఆదర్శప్రాయులై జీవించి ఆదర్శంగా ప్రాణాలర్పించిన పూర్వవీరుల సమాధులు తప్ప, ఇంగ్లాండులో అతని మనస్సుకు హాయిని కూర్చే విషయ మొక్కటీ కనిపించలేదు. యింగ్లాండులోని టెంప్లార్లు ఫ్రాన్సులోని టెంప్లార్లకంటె యెక్కువ విషయలోలురుగా ఉన్నారు. వారికంటె యెక్కువ ఐశ్వర్యవంతులు కావడమే దానికి కారణం. టెంప్లార్ యోధులు నిరాడంబరులై జీవించాలనీ, ఐహికవాంఛలకు లోనుగాకూడదనీ నియమనిబంధనలున్నాయి. కాని, వాటిని పాటిస్తున్నవాళ్లు మృగ్యమైపోయారు. వేటలు వారికి నిషేధించబడ్డాయి. అయినా అన్నివేటలకూ వీళ్లే ముందు తయారౌతున్నారు. పవిత్రవిషయాలు తప్ప ఇతరము లేవీ చదవకూడదు, వినకూడదు. అయినా చౌకబారు కాలక్షేపాలకే చెవియొగ్గుతూ, శృంగార గ్రంథపఠనానికెక్కువ ఆసక్తి చూపుతున్నారు. తాంత్రిక మాంత్రిక విద్యలను రూపుమాపడం తమ ధర్మమనేమాట విస్మరించి, వాటిని క్రైస్తవేతరుల

వలెనే తామూకూడ అభ్యసింపజాలుతున్నారు. వారానికి మూడుసార్లకంటె మాంసభక్షణ చేయరాదనే నియమంగాని, నీరుతప్ప ఇంకో పానీయం పుచ్చుకో కూడదనే నియమంగాని, యథేచ్ఛగా ఉల్లంఘించబడుతోంది. ఈ టెంపుల్ స్టోవు మఠంలోని ఉద్యానవనంలో, క్రైస్తవ సన్యాసులకు ప్రీతికరమైన మొక్కలకంటె, తురుష్కులకూ యూదీయులకూ ప్రీతికరమైన మొక్కలెక్కువైనాయి. ఈ నియమోల్లంఘనం ఇంతటితో ఆగినా బాగానే ఉండేది. భక్తురాండ్రను అనుగ్రహించడమనే పేరుతో స్త్రీజనాన్ని దరిచేరనివ్వడం పనికిరాదనీ, తోబుట్టువులనైనా సరే తల్లులనైనా సరే ముద్దులతో అనుగ్రహించడం కూడని పనియనీ,— పెద్దలు నిషేధించియుండగా, దానిని పాటించకపోవడం సర్వసామాన్యమైపోయింది. అవినీతి ఒక పెద్ద వెల్లువై కట్టలు త్రెంచుకొని ప్రవహించినట్లుగా ఉంది.

సర్వాధికారి లూకాస్ యీ పరిస్థితులు తనకు కలిగించే వేదనను సహాచరునిదగ్గర వెళ్లబోసుకుంటూ ఇలా అన్నాడు: 'ఏమి చెప్పను కాన్రేడ్! ఈ దుర్భర పరిస్థితులు చూచి ఇంకా యెందుకు బ్రతికి ఉన్నానా అనిపిస్తోంది. ఈ వ్యవస్థకు మూలపురుషులైన హ్యూగ్డీ పేయన్, గాడ్‌ఫ్రీ డీ సెయింట్ ల ఆత్మలు పరలోకంలో చాల క్షోభిల్లుతున్నాయి. వారిని రాత్రివేళ దర్శనాల్లో నేను చూచాను. వారి నేత్రాలు అశ్రుపూరితములై ఉన్నాయి. 'పవిత్రమైన టెంప్లార్ వ్యవస్థ కలుషితమై పోతూఉంటే నీవింకా నిద్రపోతున్నావా? వనితాలోకమును కన్నెత్తిచూడకూడని టెంప్లార్ యోధులు తమ జాతిస్త్రీలతో నేకాక, అన్యజాతిస్త్రీలతోగూడ విచ్చలవిడిగా విహరిస్తూ సంస్థను మలినపరుస్తుంటే నీ కెలా నిద్రపడుతోంది? లే! లేచి ఆ పాపాత్ములెల్లరినీ నిర్మూలించు! సంస్థ పవిత్రతను పునరుద్ధరించు'— అని వారు నన్ను హెచ్చరించి వచ్చిన దారినే వెడలిపోయారు. నాకు మెలకువ వచ్చింది. మెలకువవచ్చినా, వారు వెడలిపోతున్న చప్పుడు దూరాన్నుండి నాకు వినిపిస్తున్నట్లుగానే ఉంది. వారి ఆదేశం నెరవేర్చి తీరాలి. నెరవేర్చడానికే యిలా బయలుదేరి వచ్చాను. ఈ దెబ్బతో, టెంప్లార్ సంస్థ బాగుపడడమో, లేక నామరూపాలు లేకుండా అంతరించి పోవడమో, ఏదో ఒకటి జరిగి తీరాలి!—'

ఈ సమయంలో, అనుచరుడొకడు వారున్నయెడకువచ్చి, వినమ్రుడై అభివాదంచేసి, ఏదో విన్నవించుకొన దలచుకొన్నవానివలె నిలబడ్డాడు. 'ఏమిటి, ఎందుకు వచ్చా' వని అడిగాడు లూకాస్. 'గేటుదగ్గర ఒక యూదీయుడున్నాడు. బ్రయన్ డీబోయి గిల్బర్టుతో మాట్లాడాలిట' అని అతడువిన్నవించాడు.

ఈసంగతి ముందుగా తనకు తెలియజేసినందుకు సర్వాధికారి సంతోషించి, ఆ యూదీయునిలా తన ముందుకు తీసికొని రావలసినదని అనుచరుని కాదేశిం

రాడు. బ్రియన్ వర్తనాన్ని గూర్చి అతనికి అనుమానాలు చాలా ఉన్నాయి. ప్రాపంచిక సుఖాలందు నిజమైన వైరాగ్యముతో కాకుండా, జీవితంలో ఏదో ఆశాభంగం కలిగి, ఆ వైకల్యం కొద్దీ బ్రయన్ టెంప్లార్ సంస్థలో చేరాడని అతడు మొదటినుంచీ అనుమానిస్తూనే ఉన్నాడు. సంస్థలో చేరినప్పటినుంచీ, సంస్థ నియమాల నుల్లంఘించడానికి వెనుదీయక, పైపెచ్చు అలాంటివారందరికీ నాయకుడుగా కూడ అతడు తయారైన సంగతి అతనికి తెలుసు.

కొంచెము సేపట్లో, అనుచరుడు ఇసాక్‌ను వెంట బెట్టుకొని వచ్చి సర్వాధికారి ముందు నిలబెట్టాడు. యిసాక్ గజ గజ వణికి పోతున్నాడు. ప్రాచ్య పద్ధతిని నేలపై మోకరిల్లి, పెదవులతో నేలను స్పృశించిలేచి, విపరీతమైన భయభక్తులతో చేతులు కట్టుకొని, తల ముందుకు వంచి, సర్వాధికారి ఆదేశం కొరకు నిరీక్షిస్తూ నిలబడ్డాడు. 'నీవు వెళ్ళి తోటలోకి ఎవరూ రాకుండా చూస్తూ ఉండ'మని అనుచరునికి ఆజ్ఞయిచ్చి పంపివేసి, సర్వాధికారి యిసాక్‌తో యిలా అన్నాడు: 'యిదిగో, నీవు యూదీయుడవు గనుక, నీతో నేను ఎక్కువసేపు మాట్లాడుతూ కాలక్షేపం చెయ్యడానికి వీలు లేదు. నేనడిగిన ప్రశ్నలకు సూటిగా సమాధానం ముక్తసరిగా చెప్పేసెయ్యాలి. అబద్ధాలు చెప్పావంటే నీ నాలుక తెగ్గోయిస్తాను. జాగ్రత్తగా ఒళ్ళు దగ్గర పెట్టుకొని సమాధానాలు చెప్పు.'

యిసాక్ ఏదో చెప్పబోతూ ఉండగా లూకాస్ వారించి,—'ఆగు!— అధిక ప్రసంగం సహించను. నేను అడిగిన ప్రశ్నలకు మాత్రమే నీవు సమాధానం చెప్పాలి. అంతకు మించి ఒక్కమాట మాట్లాడ్డానికి వీలులేదు. చెప్పు! బ్రయన్ డీబోయ్ గిల్బర్ట్‌తో నీ కేమిటి పని?'

యిసాక్ ఏమి సమాధానం చెప్పడానికీ పాలుపోక దిగాలుపడి చూశాడు. ఉన్న సంగతి చెప్పితే, అది టెంప్లార్ సంస్థకు అపచారంగా ఎంచుతారేమో! చెప్పకపోతే తన కుమార్తె విముక్తిని సాధించే ఉపాయం కనిపించడం లేదు— ఎలాగా అని మథనపడుతూ ఉండగా, 'నీకు వచ్చిన భయములేదు. ఉన్న సంగతి నిస్సంకోచంగా చెప్పేసెయ్!' అని ధైర్యమిచ్చాడు సర్వాధికారి.

యిసాక్ తడబడుతూ,—'సర్ బ్రియన్‌కు నేనొక ఉత్తరమివ్వాలి— కోర్వాలిస్ మఠాధికారి ప్రయర్ ఐమర్ యిచ్చిన ఉత్తరమది'—అని విన్న కున్నాడు.

'నేను చెప్పలేదా కాన్రేడ్, ఇది చెడ్డరోజులని? దానికి నిదర్శనమిదిగో చూడు! సిస్టర్షియన్ సంప్రదాయానికి చెందిన ఒక ప్రయర్, టెంప్లార్ సంస్థ

దాయానికి చెందిన ఒక యోధునికి, క్రైస్తవమత విరోధియైన ఒక యూదీయుని ద్వారా ఉత్తరం పంపిస్తున్నాడు. ఉత్తరం తీసుకువెళ్లడానికి ఇంతకంటె యోగ్యుడెవ్వరూ కనిపించలేదు కాబోలు! ఏది ఆ ఉత్తర మిలా తే!'— అన్నాడు సర్వాధికారి.

ఇసాక్ వణుకుతూ, తన ఆర్మీనియన్ టోపీ మడతల్లోంచి ఆ ఉత్తరం బయటికి తీసి, సర్వాధికారి సన్నిధిలో ఉంచడానికై చేయిసాచి వినమ్రుడై ముందుకు అడుగు వేశాడు. 'ఆగు! అవతలికిపో! నీవంటి క్రైస్తవ మత విరోధులను ఖడ్గంతోతప్ప స్పృశించే ఆచారం నాకు లేదు. కాన్రేడ్! ఆఉత్తరం నీవు తీసుకొని ఇలా తే!'—అన్నాడు సర్వాధికారి.

ఉత్తరం చేతికివ్వగానే, పైన, క్రింద, ముందూ, వెనుక, అంత జాగ్రత్తగా పరిశీలించాడు. తరువాత దాన్ని విప్పి చదవడానికి ప్రయత్నిస్తూ ఉంటే, కాన్రేడ్—'పరుల ఉత్తరం అలా విప్పి చదవవచ్చునా' అని సంశయం వెలిబుచ్చాడు. టెంప్లార్లకు ప్రయివేటు ఉత్తరాలనేవి రావడానికి వీలులేదనీ, తండ్రి వద్దనుంచి వచ్చిన ఉత్తరమైనా సరే తన ముందర చింపి చదవవలసిందేననీ ఏదో కారిక చదివి అతని సంశయ నివారణం చేస్తూ, సర్వాధికారి ఆ ఉత్తరం ముందు తనలో తాను ఒకసారి చకచకా చదువుకున్నాడు. అతని ముఖంలో ఆశ్చర్యం, జుగుప్సా ప్రతిఫలించాయి. మరల నింకొకసారి నెమ్మదిగా చదువుకొని సహచరుని చేతికిస్తూ ఇలా అన్నాడు:

కాన్రేడ్ ఆఉత్తరము చేతికందుకొని లోలోపల చదువుకుంటూండగా, సర్వాధికారి,—'బిగ్గరగా చదువు కాన్రేడ్!' అని ఆదేశించి, ఇసాక్‌తో— 'నీవు కూడా విను, దీనిమీద నిన్ను కొన్ని ప్రశ్నలడగవలసి ఉంది' అన్నాడు.

కాన్రేడ్ ఉత్తరం బిగ్గరగా చదివాడు. అది ఇలా ఉంది—

'జోర్వాలక్స్ సిస్టర్షియన్ మఠాధిపతి ప్రియర్ ఐమర్, టెంప్లార్ సర్ బ్రియన్ డిబోయి గిల్బర్టుకు అనేక శుభపరంపరలు ఆశిస్తూ వ్రాయునది:

'సోదరా, ఇక్కడ మేము ప్రస్తుతం కొంతమంది సంఘ బాహ్యుల చేతిలో ఖైదీలుగా చిక్కుబడి యున్నాము—వీరికి దైవభీతి అనేది ఉన్నట్లులేదు. వీరినుండి విముక్తి పొందాలంటే, వీరడిగినంతా సొమ్ము చెల్లించి తీరవలసిన దుస్థితిలో పడ్డాము.

'ఫ్రాంట్ డిబాఫ్ దుర్మరణవార్త వగైరాలు వీరివలననే తెలిసినవి. నిన్ను మోహపరవశునిగ జేసిన ఆ నీలికన్నుల యూదు మాంత్రికురాలితో నీవు

తప్పించుకొనిపోయిన సంగతికూడ వారే చెప్పారు. నీవు సురక్షితంగా ఉన్నందుకు చాల సంతోషిస్తున్నాము. కాని, ఆ అపర ఎండార్ మాంత్రికురాలి విషయంలో నీవు చాల జాగ్రత్తగా మెలగ వలసి ఉంది. మీ టెంప్లార్ సంస్థ సర్వాధికారి నీదుశ్చేష్టలు విచారించి నీకు తగిన ప్రాయశ్చిత్తం చేసే తలంపుతో నార్మండీ నుండి యీ దేశానికి రాబోతున్నాడని మేము ఇతరత్రా విన్నాము. కనుక నీ జాగ్రత్తమీద నీవుండడం అవసరం.

'ఆ మాంత్రికురాలి తండ్రి, యూదీయ షావుకారు ఇసాక్ మమ్మల్ని ఈ ఉత్తరం వ్రాసి ఇవ్వవలసిందని కోరినందున వ్రాసి ఇవ్వడమైనది. ప్రస్తుత పరిస్థితిలో నీవు మా సలహాను,—కాదు మా ప్రార్థనను,—మన్నించి, ఆ పిల్లను డబ్బు పుచ్చుకొని వదలివేయడం మంచిది. అలాంటి పిల్లలు యాభై మంది ఇతరత్రా సులువుగా లభించే పైకం ఆమె తండ్రియైన ఇసాక్ నీకు చెల్లించగలడు. అందులో నేను కూడా భాగస్వామిని కాగలనని ఆశిస్తున్నాను. ఒకటోరకం ద్రాక్షాసవం కూడా దగ్గర పెట్టుకొని, హాయిగా యిద్దరమూ కాలక్షేపం చేద్దాము.

'త్వరలోనే ఆ శుభసమయం మనకు సంప్రాప్తించుగాక! ఉంటాను.

మకాం: దొంగలకోన. సమయం: ప్రాతఃకాలోపాసన వేళ.

ఇట్లు
ప్రయర్ ఐమర్'

'తా.క.—నీ బంగారు గొలుసు మేము కొద్దికాలం మాత్రమే అనుభవించడానికి వీలయింది. త్వరలో అది ఒక బందిపోటుదొంగ కంఠసీమ నలంకరించ బోతోంది.'

ఉత్తరం చదవడం పూర్తికాగానే సర్వాధికారి,—'ఏమంటావు కాన్రేడ్, ఇలాంటి ప్రియులకు తగిన మకాం దొంగలకోనగాక మరి యేదవుతుంది? ఇలాంటి మతాధికారులతో మనం కాలక్షేపం చేస్తుంటే, దైవం మనపై ఆగ్రహించక ఏంచేస్తాడు? పాలస్తీనాలలో మన స్థావరాలన్నిటినీ ఒక్కొక్కటే కోల్పోక యేంచేస్తాం?'—అని అంటూ—కొంచెం ఏకాంతంగా, 'అపర ఎండార్ మాంత్రికురాలంటున్నా రేమిటి? ఏమిటి దాని అభిప్రాయం?'—అని అడిగాడు.

ఆనాటి యోధవర్గాలలో వాడుకలో ఉన్న పరిభాష సర్వాధికారి కంటె కాన్రేడుకు బాగా తెలుసు. అందుచే,—'ఐహిక వాంఛాపరులైనవారు తమ

ప్రియురాండ్రను గూర్చి ఆ విధంగా చెప్పుకొంటూ ఉండడం కద్దు'—అని వివరించాడు. కాని, ఆ వ్యాఖ్యానం సర్వాధికారికి నచ్చలేదు. 'కాదు కాన్రేడ్! నీవు ఊహించిన అర్థం కాదిక్కడ. యింకా లోతైన అర్థమే ఉంది. అమాయకుడవు నీకు తెలియదు. మిరియం అనే మాంత్రికురాలుండేది నీకు తెలుసుకదూ? ఆ మాంత్రికురాలి శిష్యురాలీ రెబెకా! ఈ యూదీయుని చేతనే చెప్పిస్తాను చూడు నీకా మాట'—అని ఇసాక్ వంక చూచి,—'అయితే ఇప్పుడు నీ కుమార్తె బ్రయన్ డి బోయ్ గిల్బర్టు చేతిలో ఖయిదీ అన్నమాట?' అని అడిగాడు.

'అవును స్వామీ, ఆమె విడుదలకు ఈ పేదవాడు ఎంత సొమ్ము'—

'ఛీ! అట్టే వాగకు! నీ కుమార్తె వైద్యం నేర్చుకున్నది, అవునుకదూ?' అని అడిగాడు సర్వాధికారి.

ఇసాక్‌కు కొంచెం ధైర్యం కలిగి,—'అవును ప్రభూ! భగవంతుడు ప్రసాదించిన ఆ విద్యతో ఆమె ఎందరెందరి ప్రాణాలనో కాపాడింది. యోధులు, జానపదులు, ప్రభువులు, భృత్యులు,—ఎందరెందరో యితర వైద్యులకు సాధ్యంకాక నిరాశ చేసుకున్నవారు కూడ మా అమ్మాయి చేతిలో బ్రతికారు. ఆ సంగతి అనేకమంది మీకు సాక్ష్యం చెప్పగలరు'.

'చూచావా కాన్రేడ్, సైతాను మాయలు! జీవాత్మలను తన వశంచేసుకోడానికి ఎలాంటి ఎరలు వేస్తూ ఉంటాడో చూచావా? మరణానంతరం శాశ్వతంగా పరలోక సౌఖ్యం చూరగొనగలవాళ్ళకు ఇహలోకంలో మరి కొంతకాలం ఆయువిచ్చి, ఎలాగైనా తన వాళ్ళను చేసుకోడమే వాని కుతంత్రం. ఈ సైతాను ఆటలు సాగనివ్వడానికి వీలులేదు'—అంటూ తనచేతిలో వున్న దండం ఒక సవాలుగా పైకెత్తి ఝుళిపించి, యిసాక్‌తో తిరిగి యిలా అన్నాడు: 'అవును, నాకు తెలుసు. నీ కూతురు వైద్యం చేస్తుంది. మంత్రతంత్రాల వైద్యం!'

యిసాక్ కలవరపడి, 'లేదు స్వామీ లేదు! నా కూతురు చేసేది మంత్రతంత్రాల వైద్యంకాదు. అద్భుతమైన ఒక ఓషధి రహస్యం దానికి తెలుసు. అంతా ఆ ఓషధి ప్రభావమే!'—అని గోలపెట్టాడు.

'ఆ రహస్యం దానికి ఎలా తెలిసింది?'—అని అడిగాడు సర్వాధికారి.

'మా జాతిలో మిరియం అనే సన్యాసిని ఉండేది. ఆమె చెప్పింది నా కుమార్తెకా రహస్యం'— అని జవాబిచ్చాడు ఇసాక్. ఆ సంగతి బయటపెట్టడం అతనికిష్టంలేదు. అయినా, తప్పనిసరిగా బయటపెట్టవలసి వచ్చింది.

'ఆఁ, అలా చెప్పు! మిరియమంటే, వెనుక తన మంత్ర తంత్రాలచే క్రైస్తవ లోకాన్నంతనీ గగ్గోలుపరచిన మిరియమేకదూ?' అంటూ సర్వాధికారి, తన శరీరానికి క్రాసు రక్షలు పెట్టుకొని,—'అవును—మా క్రైస్తవ న్యాయపీఠం యెదుట యినప స్తంభానికి కట్టివేసి బ్రతికి ఉండగానే కాల్చివేసినది ఆమిరియమునే! కాల్చి ఆబూడిదను నలుదిక్కులా గాలిలో విరజిమ్మి వేశారప్పుడు. అలాంటిదే సీహూతురకు గూడ నేడు జరపకపోతే, మా టెంప్లార్ సంసకే ప్రమాదం వాటిల్లేటట్లుంది. టెంప్లార్ యోధులపై అ మంత్రతంత్ర ప్రయోగాలేమిటో కనుక్కుంటాను. అరే దామియన్, ఈ కుక్కను వెంటనే ఈ గేటు అవతలకి తరిమేసెయ్! ఎదురు తిరిగినా, మళ్ళీ లోపలికి రాజూచినా, నరికి పారేసెయ్! ఆడ్ది కూతురు సంగతి యిక మేము క్రైస్తవ ధర్మ ప్రకారం తేలుస్తాం,'— అని గర్జించాడు.

యిసాక్‌ను పాపం, ఆవిధంగానే బయటికి తరిమేశారు. అత డేమి మొర పెట్టుకున్నా, ఎట్టి ఆశలు చూపినా, ఎవ్వరూ వినిపించుకోలేదు. చేయునది లేక, అతడు నాథన్ యింటికి తిరిగివచ్చి, అతనితో జరిగిన వృత్తాంతం చెప్పుకొని గోలపెట్టాడు. యింతకు పూర్వం కుమార్తె మానహానిని గూర్చి అతడు భయపడ్డాడు. యిప్పుడు, ఆమె ప్రాణహానిని గూర్చి తల్లడిల్ల వలసి వచ్చింది. యిక అక్కడ, సర్వాధికారి లుకాస్, తమ సమాజానికి వెంటనే హాజరు కావలసిందిగా టెంపుల్ స్టోవ్ ప్రిసెప్టరు ఆల్బర్టు మాల్వాయిసిన్‌కు ఆదేశ మంపించాడు.

# అధ్యాయం ౩౬

నార్మన్ సామంతుడైన ఫిలిప్ మాల్వాయిసిన్‌ను గూర్చి ఈ కథలో ఇది వరకు కొంత ప్రస్తావించి యుండడం పాఠకులకు జ్ఞాపకం ఉండవచ్చును. ఆ ఫిలిప్ మాల్వాయిసిన్ సోదరుడే ఈ టెంపుల్‌స్టౌ ప్రిసెప్టరికి అధిపతియైన ఆల్బర్టు మాల్వాయిసిన్. ఫిలిప్ వలెనే ఆల్బర్టు కూడా బ్రయన్ డీ బోయ్ గిల్బర్టు ముఠాలోనివాడే.

కానైతే, బ్రయన్‌కూ ఆల్బర్టుకూ ఒక ముఖ్యమైన భేదముంది. మిథ్యాచారంతో తన దుర్వృత్తులను కప్పిపుచ్చి, పైకి మతధర్మాభినివేశం కలవానివలె నటించగల నేర్పరి ఆల్బర్టు; బ్రియన్‌కు ఆ నేర్పు లేదు. సర్వాధికారి లూకాస్ రాకనుగూర్చి ముందుగా ఏమాత్రం ఆచూకీ తెలిసియుండినా, ఆల్బర్టు మాల్వాయిసిన్ తగిన జాగ్రత్తపడి, అంతా సవ్యంగానే జరుగుతున్నట్లు టెంపుల్‌స్టౌలోని పరిస్థితులను మార్చేసి ఉంచేవాడే. కాని, సర్వాధికారి అతనికి అవకాశమివ్వక అకస్మికంగా వచ్చిపడి అచటి లోటులు ప్రత్యక్షంగా చూడడం జరిగింది. అయితేమాత్రమేమి? సర్వాధికారి చేసిన ఉద్బోధలన్నీ కడు శ్రద్ధాభక్తులతో విని, ఎంతో పశ్చాత్తాపం చెందినవానివలె నటించి, వెన్వెంటనే సర్వాధికారి ఆశయాల ప్రకారం చేయవలసిన మార్పులన్నీ చేసి, తిరిగి అతని ఆదరాన్ని కొంతవరకు సంపాదించుకోగలిగాడు. ఆల్బర్టు విషయంలో సర్వాధికారికి మొదట్లో ఉన్నంత దురభిప్రాయం ఇప్పుడు లేదు.

కాని, ఎప్పుడైతే, బ్రయన్ చేత బందీగా కొనితేబడిన ఒక యూదు పడుచును ఆల్బర్టు ఆ ప్రిసెప్టరిలో ప్రవేశమిచ్చాడని తెలిసిందో, అతనిని సర్వాధికారి తిరిగి శంకించడం మొదలుపెట్టాడు. తన ఎదుటికి రావడంతోటే చాల తీవ్రంగా అతనివంక చూస్తూ ఇలా అన్నాడు:

'ఓ ఆల్బర్టు మహాశయా! నీవు చెప్పకపోయినా నాకు తెలియకపోలేదు, పవిత్రమైన యీ టెంప్లార్ మందిరంలో ఒకచోట ఏదొక యూదు పడుచు దాచబడి ఉంది. ఆమెను తీసుకువచ్చినవాడు బ్రియన్ డీబోయ్ గిల్బర్టయితే, అందుకు సహకరించి ఆశ్రయమిచ్చినవాడవు నీవు! ఏమంటావ్?'

ఆల్బర్టు మాల్వాయిసిన్ ఈ మాటలకు చాల కళవళపడ్డాడు. తాము రెబెకాను దాచిన సంగతి సర్వాధికారి తెలుసుకోగలుగుతాడని అతడనుకోలేదు. చాల రహస్య ప్రదేశంలో దాచాడామెను. దాని ఆచూకీ ఇతరుల కెవ్వ

రికీ తెలియరాకుండా చేటట్లు తగిన జాగ్రత్తలన్నీ తీసుకున్నాడు. కాని, తుదకదీ తెలియనే తెలిసింది. ఉపాయంగా ఎలాగో తప్పించుకుంటే తప్ప, తనకూ బ్రయన్‌కూ ఈ దెబ్బతో వినాశం తప్పదని సర్వాధికారి చూపులనుబట్టి అతడు గ్రహించాడు.

'ఏం, మాట్లాడవేం?' అని గద్దించాడు సర్వాధికారి.

అతివినయం ఉట్టిపడుతున్న ధోరణిలో ఆల్బర్టు—'తాము అనుమతిస్తే సమాధానం చెప్పుకుంటాను'—అన్నాడు. ఎలా సమాధానం చెప్పుకోవాలో కొంచెం ఆలోచించుకోడం కోసం చెప్పిన జవాబిది.

'అనుమతిచ్చాం, చెప్పు! నీచస్త్రీలతో టెంప్లార్లు ఎలాంటి సంబంధమూ పెట్టుకోకూడదనేది మన సంస్థ ముఖ్యనియమాల్లో ఒకటని నీకు తెలుసునా?' అన్నాడు సర్వాధికారి.

'తెలుసు నాయనగారూ, ఆ ముఖ్య నిబంధన తెలియకుండా నేడీ ఉన్నతపదవికి నేను వచ్చియుండలేదు'—అన్నాడు ఆల్బర్టు.

'అయితే, ఈ పవిత్రమందిరంలోకి నీ సోదరుడొకడు తన ప్రియురాలిని—అందులోనూ ఒక యూదుమాంత్రికురాలిని,—తీసుకురావడానికి నీవెలా అంగీకరించావని తిరిగి ప్రశ్నిస్తున్నాను. చెప్పు! ఎలా అంగీకరించావు?' అని రెట్టించాడు సర్వాధికారి.

'ఆ! మాంత్రికురాలా! ఎంత ప్రమాదం! పాహిమాం, పాహిమాం!' అని ఘోషించాడు ఆల్బర్టు.

'అవును, మాంత్రికురాలే! యార్కు నగరపు యూదీయ షావుకారు ఇసాక్ కూతురు రెబెకా మాంత్రికురాలుకాక మరెవ్వరు? ఇదివరలో క్రైస్తవ లోకాన్ని కల్లోలపరచిన ఆ మాయలమారిముండ మిరియం శిష్యురాలు! దీనినే కదా ఇప్పుడీ ప్రిసెప్టరీలోకి నీవు రానిచ్చినది?'—అన్నాడు సర్వాధికారి.

'తమ జ్ఞానతేజఃప్రసారంవల్ల నా అజ్ఞానాంధకారం పటాపంచలైపోయింది నాయనగారూ! ఇప్పుడు నాకు తెలిసింది. బ్రయన్‌డీబోయి గిల్బర్టు వంటి ఉత్తమయోధునికి అపిల్లదానిమీద ఎందుకింత వ్యామోహం ప్రబలిందో నాకిదివరకు అర్థంకాలేదు. వీరిరువురి సంబంధమూ నానాటికీ హెచ్చుపెరిగిపోతూ ఉండటం చూచి, ఇరువురిమధ్యా అవరోధం కల్పించే ఉద్దేశ్యంతో దాని నిక్కడ ప్రవేశపెట్టించాను. లేనియెడల, మరికొంతకాలానికి మన బ్రయన్ పూర్తిగా భ్రష్టుడైపోయిఉండేవాడనడానికి సందేహంలేదు'—అన్నాడు ఆల్బర్టు.

'అయితే నీవనేది, బ్రియన్ ఇంకా భ్రష్టుడు కాలేదనా? వారిరువురిమధ్యా వ్యవహారం అంతవరకింకా పోలేదా?' అని అడిగాడు సర్వాధికారి.

'ఎంతమాట! [illegible]జమాయిషీ క్రింద ఉన్న ఈ ఆవరణలో అలాంటి పని జరగదమేకి ఎన్నటికీ జరగదు! ఇక్కడికా పిల్లను నేను రానివ్వడం తప్పే! కాని, రానిచ్చినందువల్ల నెమ్మదిగా బ్రియన్ను అతని వ్యామోహమునుండి మరలించగలుగుతానేమో యని పిచ్చి ఊహ పోయాము. దాని యెడల అతనికి కలిగిన ఆ వ్యామోహం నాకు చాల అసహజంగా కనిపించింది. మతి యేమైన చలించిందేమో అనుకున్నాను. దూషించదగిన వాడుగా కంటె జాలిపడవలసినవాడుగా అతడు నాకు కనిపించాడు. ఆ యూదుపడుచు మాంత్రికురాలని మీ విజ్ఞాన నేత్రం కనిపెట్టేసింది గనుక, బ్రియన్ యెందుకలా వ్యామోహపడ్డాడో ఇప్పుడు అర్థమవుతున్నట్లుగా వుంది' అన్నాడు ఆల్బర్ట్.

'ఇంకా సందేహమేమిటి? చూచావా కాన్రేడ్, సైతాను వేసే యెరలకు మొట్టమొదట ఆశపడితే, చివరకది యెంత ప్రమాదం తెచ్చిపెడుతుందో! ఆది దాన్ని చూస్తే తప్పేమిటనుకుంటాము. నయనేంద్రియానికి కొంత తృప్తికలుగుతుంది అంతేకదా అని భావిస్తాము. అందం, అందం, అని మగవాళ్లు పిలిచేదాని కోసం ఒడలు తెలియక లొట్టలు వేస్తాము. అది అవకాశంగా తీసుకొని సైతాను తన మంత్ర తంత్రాలతో మనలను పూర్తిగా వశం చేసుకుంటాడన్నది సుస్థిరం. తీరికూర్చుని చేసిన ఒక చిన్న పొరపాటువల్ల, ఎంతప్రమాదం వాటిల్లుతుందో చూడు! ఇదంతా చూడగా, బ్రయన్ జాలిపడవలసినవాడుగా కనిపిస్తున్నాడుగాని, దండనార్హుడుగ తోచటంలేదు. ఏని నెలాగైనా ఉద్ధరించడం అవసరం,'— అన్నాడు సర్వాధికారి.

'అవును,— బ్రియన్ వంటి యోధవరుణ్ణి కోల్పోవడం మన సంస్థకెంత మాత్రమూ మంచిదికాదు. తన ఒక్క చేతిమీదుగా మూడువందలమంది తురుష్క వీరులను మట్టుపెట్టగలిగిన మహా వీరుడతడు'—అన్నాడు కాన్రేడ్.

'అవును,— బ్రియన్ను ఎలాగైనా ఈ మాయావాగురలోంచి బయట పడేటట్లు చెయ్యాలి. సాంసన్కు డెలీలా సంప్రాప్తించినట్లు ఈ మాయావిని ఇతనికి నేడు సంప్రాప్తించింది. మన పవిత్ర సంస్థలో సభ్యుడైన యితనిపైన తన మాయమంత్రాలు ప్రయోగింప సాహసించిన యీ దుష్టురాలికి మరణమే తగిన దండన,'— అన్నాడు సర్వాధికారి.

'కాని, యింగ్లాండు దేశపు శాసనాలు'— అంటూ ఏదో చెప్పబోయాడు కాన్రేడ్. సర్వాధికారి అర్థోక్తిలోనే అతనిమాట కడ్డంవచ్చి— 'ఆ శాసనాల సంగతి నాకు తెలుసు. ఇచట ఏ ప్రాంతంలోని న్యాయాధిపతి ఆ ప్రాంతంలో తా నిచ్చిన తీర్పును యథేచ్ఛగా అమలుజరిగించుకోవచ్చు. ఎక్కడి మంత్రగత్తెల నక్కడ అరెస్టుచేసి మరణశిక్ష విధించేహక్కు చిన్నచిన్న సామంతులకు గూడా ఉంది. అలాంటి సందర్భంలో, టెంప్లార్ సంస్థకు సర్వాధికారినైన నాక్కు

నా యేలుబడిలోని యీ ప్రిసెప్టరీలో, అలాంటి అధికారాన్ని చలాయించుకునే హక్కు లేదా? ఉన్నది. ఈ మాంత్రికురాలిని నేను విచారించి శిక్షిస్తాను. విచారణ కొరకు వెంటనే దర్బారు ఏర్పాటుచెయ్యి!' — అని ఆదేశించాడు సర్వాధికారి.

ఆల్బర్టు వినమ్రుడై సర్వాధికారికి అభివాదంచేసి అటనుండి వెడలి పోయాడు. ఎందుకు? దర్బారు ఏర్పాట్లు చేయించడానికి కాదు. బ్రయన్ను ముందుగా కలుసుకొని, అతనికి ఈ జరిగిన సంగతి యావత్తూ తెలియజేయడానికి. ఆల్బర్టుకు కనుపించిన సమయానికి బ్రయన్ చాల చిరాకులో ఉన్నాడు. రెబెకాను తనకు అనుకూలం చేసుకోడానికి ఇంతకుముందే అతడు మరల నొక ప్రయత్నం చేసి చూచాడు. కాని రెబెకా అతనిని మరల తృణీకరించింది. అతడా కోపం ఆల్బర్టుముందు ఈ విధంగా వెళ్ళబోసుకున్నాడు: 'కృతఘ్నురాలు! ఆలోచన అనేది లేదు! తన కోసం నేను యెంత త్యాగం చేశాను! నా ప్రాణాలుసైతం తృణప్రాయంగా యెంచి తనను కాపాడానే! చుట్టూ ఎటు వైపు చూచినా మంటలు. బ్రహ్మాండమైన ధ్వనులతో కప్పులు కూలిపోతున్నాయి. ఆ సమయంలోనే నామీద బాణవర్షం. నా కవచాన్ని భేదించడానికి ఎన్ని వచ్చి మీద పడ్డాయో లెక్కలేదు. అలాంటిస్థితిలో, నా చేతిలో వున్న డాలు తన రక్షణకోసం ఉపయోగించానే కాని, నా రక్షణకొరకు ఉపయోగించుకో లేదు. ఆ బాధలన్నీ నేను సహించినది తనకోసం! కాని, అందుకు కృతజ్ఞత వెల్లడించడానికిబదులు, తనను చావనీయకుండ కాపాడానని నన్ను తెగ నిందిస్తోంది. నా యెడల కృతజ్ఞత అనేది ఇప్పటికి లేకపోగా, ఇకముందైనా కలుగుతుందనే ఆశ కనుపించడంలేదు. అబ్బ! వట్టి రణపెంకె! యూదుజాతినంతనీ ఆవహించిన పెనుభూతం నేడు ప్రత్యేకించి యీ రెబెకాలో వ్యక్తమై తన యావచ్ఛక్తినీ ప్రదర్శిస్తున్నట్లుగా ఉంది.'

'రెబెకా కేకాదు, నిన్నుకూడ పట్టింది ఆ పెనుభూతం. తొందరపడబోకుసుమా జాగ్రత్త యని నీ కెన్నిసార్లు హెచ్చరించాను! నీ కేమైన చవి కక్కనదా? కావాలంటే క్రైస్తవ సుందరుల నేకమంది నీకు దొరకుతారు, వారితో తృప్తిపడమని చెప్పాను. నీవు కోరితే నిరాకరించడం పాపంగా ఎంచేవాళ్లు చాలమంది ఉంటారని చెప్పాను. కాని నీవు వినలేదు. ఏమైనాసరే ఈ రణపెంకినే దక్కించుకోవాలని పట్టుపట్టి కూర్చున్నావు. మన సర్వాధికారి లూకాస్ సరిగా ఊహించాడు—అది నీమీద ఏదో మంత్రం ప్రయోగించింది' అన్నాడు ఆల్బర్టు.

'ఏమిటీ! సర్వాధికారి ఊహించాడంటున్నావు—నా జాగ్రత్తకోసం ఊరికే తమాషా కంటున్నావా? లేక, నిజంగానే, రెబెకా యిక్కడున్న సంగతి ఆ ముసలికి తెలిసిందా? చెప్పు మాల్వాయిసిన్?'—అని అడిగాడు బ్రయన్.

‘ఆ తెలిసింది... అందు నా తప్పేమీ లేదు. తెలియకుండా ఉండ డానికే విశ్వప్రయత్నం చేశాను. కాని, ఏ కర్ణపిశాచి చెప్పిందో,— తెలియడం మటుకు తెలిసింది. నేను ఒక మాదిరిగా సర్దుబాటు చేశాను. రెబెకాను వదలుకొన్నట్లయితే, నీకు వచ్చిన భయమేమీ లేదు. రెబెకా మాంత్రికురాలనీ, నీమీద ఏవో మంత్ర తంత్రాలు ప్రయోగించి నిన్ను వశపరచుకొన జూస్తోందనీ భావిస్తున్నారు. అదృష్టవశాత్తు నీమీద కోపానికి బదులు జాలితో ఉన్నాడు సర్వాధికారి. రెబెకా మాంత్రికురాలకే తీవ్ర శిక్షా పాత్రురాలు కావలసి ఉంది’— అన్నాడు మాల్వాయిసిన్.

‘అసంభవం! అలా జరగడానికి ఏమాత్రమూ వీల్లేదు!’— అని ఉద్ఘాటించాడు బ్రయన్.

‘వీల్లేదేమిటి,— వీలు అయితీరుతుంది! నీవు కాని, మరెవ్వరు గాని, ఆమె నిక రక్షించలేరు. రెబెకా బలిసమర్పణ టెంప్లార్ యోధుల పాపాలకు తగిన పరిహారం కాగలదని మన సర్వాధికారి భావిస్తున్నాడు. ఏదైనా ఒకటి అనుకుంటే, అది అమలు జరిపేదాకా ఆయనకు నిద్రపట్టదు నీకు తెలుసు. పైగా, ఇటువంటి ధర్మకార్యం నిర్వర్తించేపట్ల అతడెంతమాత్రం వెనుకాడే వాడు కాదు’— అన్నాడు మాల్వాయిసిన్.

‘ధర్మకార్యమా! కాదు, పరమమూర్ఖమైన ఉన్మాద ప్రవృత్తి! ఇలాంటి ప్రవృత్తి ఒకటి ఉన్నదంటే ముందుయుగాలవారెవ్వరూ విశ్వసిస్తారని అనుకోను’— అన్నాడు బ్రియన్. అతనికేమీ తోచటంలేదు. పిచ్చెత్తినట్లు గదిలో ఇటూ అటూ తిరగడం మొదలుపెట్టాడు.

‘ముందు యుగాలమాట ఏమైనా గాని, ఈ యుగంలో మటుకు,— నూటికి తొంభైతొమ్మిదిమంది,— అంతా మన సర్వాధికారి తీర్పుకు హర్షిస్తారనడాని కెట్టి సందేహమూ లేదు’— అని సమాధాన మిచ్చాడు ఆల్బర్టు.

‘ఆల్బర్ట్! నీవు నాకు మిత్రుడవు. ఏలాగైనా ఆమె యిక్కడినుంచి తప్పించుకు పోవడానికి నీ వంగీకరించాలి. నేను మరొక రహస్యస్థలానికి ఆమెను చేర్చే ప్రయత్నం చేస్తాను’— అన్నాడు బ్రియన్.

‘అయ్యో! అది కావల్లకాదు. చేయాలనివున్నా చేయడానికి వీల్లేని పని అది. మందిరమంతా ఇప్పుడు సర్వాధికారి పరిజనులతో నిండిఉంది. వారంతా ఆయన నమ్మినబంట్లు. కనుక ఈ విషయములో నీతో నేను సహకరించలేను. ఉన్న సంగతి మర్మమువిడిచి చెప్పేస్తున్నాను. ఇదివరకే నీ కోసమై కొంత ఊబిలో దిగాను. ఇకమీదట, నాకు ప్రమాదము తెచ్చి పెట్టుకోలేనని రూఢిగా చెపుతున్నాను. ఒక యూదుపడుచు ప్రాణరక్షణకోసం నా ప్రిసెప్టరీని కోల్పోవడానికి నే నంగీకరించను. నీకైనప్పటికీ

నేనిచ్చే సలహా యిదే. ఈ మృగతృష్ణ వెంట పరుగు విరమించు. దీనివల్ల నీకు నష్టమేకాని లాభంలేదు. బాగా ఆలోచించుకో బ్రయన్! నీకు ఇప్పుడున్న హోదాగాని, ముందు ఇంకా రాగల కీర్తి ప్రతిష్ఠలుగాని, ఈ సంస్థలో నీ సభ్యత్వాన్నిబట్టే వున్నది మరచిపోకు! రెబెకా యెడల వ్యామోహం నీ విప్పటికైనా త్రెంచుకోకపోతే, సర్వాధికారి నిన్ను తప్పకుండా సంస్థనుండి వెడలగొట్టి వేస్తాడు. పైగా, అతనికి నీవంటే స్పర్థ ఉంది. తన అధికారస్థానాన్ని నీవు వాంఛిస్తున్నావనే సంగతి అతనికి తెలుసు. కనుకనే, ఏమాత్రం అవకాశం దొరికినా నిన్ను నాశనం చేసితీర్తాడు. ఒక యూదు మాంత్రికురాలికి నీవు రక్షణ ఇస్తున్నావనేదానికంటె మంచి అవకాశం వేరొకటి ఏమి దొరుకుతుంది నిన్ను అణచివేయటానికి? కనుక, నా మాట విని, ఆ అధికారం చేజిక్కేటంత వరకూ తగ్గిఉండటం నేర్చుకో! అధికారం చేజిక్కినతర్వాత ఇక నీ యిష్టం. ఇలాటి యూదుపడుచులను నీ కౌగిట్లో లాలిస్తావో, లేక ఇనపస్తంభాలకు అంటగట్టించి తగులబెట్టిస్తావో,—యెలా అనిపిస్తే అలా చేయవచ్చు.'—అన్నాడు మాల్వాయిసిన్.

'మాల్వాయిసిన్, నీ దెంత కఠిన హృదయం...' అని ఇంకా ఏమో అనబోయాడు బ్రయన్. మాల్వాయిసిన్ మధ్యలోనే అందుకొని,—'అవును, నాది కఠిన హృదయమే! కనుకనే నీకు సలహా యివ్వగలుగుతున్నాను. ఇదిగో మళ్లీ యింకోసారి చెప్తున్నాను—రెబెకాను నీవు రక్షించలేవు. రక్షించబోతే ఆమెతోపాటు నీకు కూడా వినాశం తప్పదు. ఎందుకు చెడిపోతావు? వెంటనే వెళ్ళి, సర్వాధికారి కాళ్ళమీద పడి'—

'కాళ్లమీద పడడమా! అది యెన్నటికీ జరగబోదు. వెళ్లి వెంగవు ముందరే స్పష్టముగా చెప్పేస్తాను...'

'చెప్పేసెయ్! రెబెకామీది నీ ప్రేమ మరలించుకోడం నీ తరం కాదని చెప్పేసెయ్! నీ ప్రేమ ఎంత తీవ్రంగా నీవు ప్రకటించుకుంటే, అంత ఎక్కువగా తొందరపడతాడు సర్వాధికారి—రెబెకాను తుదముట్టించడానికి. నీవు సంస్థనుండి వెడలగొట్టబడుతావు. టెంప్లారెవ్వరూ నీకు సాయపడలేని స్థితి ఏర్పడుతుంది. నీ భావి సమున్నతినిగూర్చి నీవు కన్న కలలన్నీ భ్రష్టమై, ఏ ఫ్లాండర్సులోనో, ఏబర్గండీలోనో, నీ భుజబలాన్ని అమ్ముకొని క్షుద్రకలహాల్లో పాల్గొంటూ జీవితం వెళ్లబుచ్చుకోవలసిన దుర్గతి పట్టుకుంది. అలాగే చెప్పేసెయ్!'—అన్నాడు మాల్వాయిసిన్.

బ్రియన్ ఇంచుక సేపు ఆలోచనానిమగ్నుడై, పిమ్మట ఇలా అన్నాడు: 'నీవన్నది నిజమే మాల్వాయిసిన్! నన్ను అణగద్రొక్కడానికి అలాంటి అవకాశం సర్వాధికారికి ఇవ్వను. ఇక రెబెకా సంగతంటావా? తనకోసం నా

సర్వస్వం త్యాగం చెయ్యడానికి తగ్గ యోగ్యత ఆమె ఇంతవరకు సంపాదించుకో లేకపోయింది. కనుక ఆమెను వదిలేస్తాను. ఆమె గతి ఇక ఆమెదే! కాని...'

'కానీ గీనీ ఇక వద్దు! ఆ నిశ్చయంమీదనే ఉండిపో! ఆడవాళ్లు మన తీరిక సమయాల్లో మనకు వినోదం కల్పించడానికే! జీవితంలో మనం ముఖ్యంగా సాధించుకోవలసినది అధికారోన్నతి. ఈ యూదుపడుచువంటి ఆట బొమ్మలు వేనకువేలు నీ కళ్లముందు విరిగి ముక్కలై పోనీ!—నీవు లెక్క చెయ్య వలసిన పనిలేదు. మగసిరి కలవాడవై, నీ జీవితాశయమైన అధికారౌన్నత్యం సాధించు. నేనిక వెళ్ళాలి. మనమిద్దరం ఇలా ఏకాంతంగా మాట్లాడుకుంటు న్నట్లు తెలిస్తే ప్రమాదం. న్యాయవిచారణకు దర్బారుహాలులో ఏర్పాట్లు చేయించవలసి ఉంది'—అన్నాడు మాల్వాయిసిన్.

'ఆఁ! అప్పుడే? యింత తొందరగానే విచారణా?'

'అవును, ఇప్పుడే! న్యాయాధిపతి ముందుగానే తీర్పు నిర్ణయించుకొని ఉన్నప్పుడు, విచారణ చిటికెలమీద నడవక ఏం చేస్తుంది?'

మాల్వాయిసిన్ వెడలిపోగానే బ్రయన్ రెబెకాను ఉద్దేశించి తనలో తా నిలా మథనపడ్డాడు: 'మాల్వాయిసిన్ చెప్పినట్లు నిన్ను విడనాడక తప్పదల్లే ఉంది రెబెకా! లేనియెడల నా భావిజీవితమే భగ్నమయ్యేటట్లు కనిపిస్తోంది. అయినా, నిన్ను రక్షించడానికి తుది ప్రయత్న మొకటి చేస్తాను. కృతఘ్నురాలవు మాత్రం కాకు! ఈ సారికూడా నీవు నన్ను తృణీకరించేటట్లయితే, యెంతగా నిన్ను ప్రేమించానో అంతగా నీపై కసితీర్చుకుంటానని తెలుసుకో! తిరస్కారమే నివలన నాకు లభించే పక్షములో, నా జీవితాశయాలను నీకోరకు వదులుకొనేటంత వెంగలికాను!'

న్యాయ విచారణకు దర్బారు హాలులో తగిన యేర్పాట్లు మాల్వాయిసిన్ చేయిస్తూ ఉండగా, కాన్రేడ్ వచ్చి కలుసుకొని, రెబెకాను వెంటనే విచారణకు హాజరుపెట్టవలసిందిగా సర్వాధికారి ఉత్తరువయిందని చెప్పాడు. 'ఇదంతా ఒక కలగా ఉంది కాన్రేడ్! యూదులలో వైద్యులు చాలా మంది ఉంటున్నారు. అత్యద్భుతమైన చికిత్స లెన్నో చేస్తున్నారు. వాళ్ళందర్నీ మాంత్రికుల క్రింద జమకట్టుతున్నామా?'—అన్నాడు మాల్వాయిసిన్.

'నిజమేకాని, మన సర్వాధికారి అభిప్రాయం వేరు విధంగా ఉంది. నా మనసులోని సంగతి దాచక చెప్తున్నాను మాల్వాయిసిన్! మాంత్రికురాలు కానీ, కాక పోనీ,—రెబెకా మరణించడమే శ్రేయస్కరం. లేని యెడల, మన సంస్థ బ్రయన్‌ను కోల్పోవలసి వస్తుంది. సంస్థలో అంతఃకల్లోలాలు ప్రబలుతాయి. అతని పేరు ప్రతిష్ఠ లెలాంటివో, మన టెంప్లార్లకు

అతడంటే ఎంత గౌరవమో, నీకు తెలుసు. కాని, రెబెకా మాయలకత్తెకు లోనై పోయాడని నిరూపణ అయితే తప్ప, ఇకేమీ అతన్ని రక్షించలేవు. కనుక, బ్రయన్ మన సంస్థకు దక్కాలంటే, రెబెకా బలికావడం అవసరం!' అన్నాడు కాన్రెడ్.

'రెబెకాను వదులుకోమని ఇంతకుముందు కూడా బ్రయన్‌కు గట్టిగా నచ్చ చెప్పాను. అయినా, ఆమె మాంత్రికురాలేనని ఎంతవరకు రుజువు చెయ్య గలమా అనే సంశయం నన్ను బాధిస్తోంది. ప్రబలమైన సాక్ష్యాలు లేకపోతే సర్వాధికారి తన అభిప్రాయం మార్చుకోవచ్చు'— అన్నాడు మాల్వాయిసిన్.

'సాక్ష్యాలు లేకపోతే కల్పించాలి. కల్పించినవైనా రుజువు చెయ్యాల సంగతి. తెలిసిందా నేనన్నది?'— అన్నాడు కాన్రెడ్.

'తెలియకేం? సంస్థ అభ్యుదయం కోసం ఏమి చెయ్యడానికైనా నేను సంసిద్ధమే. కాని, అందుకు కావలసిన యంత్రాంగం సమకూర్చుకునే వ్యవధి లేకుండా ఉందే అని ఆలోచిస్తున్నాను'— అన్నాడు మాల్వాయిసిన్.

'ఎలాగైనా సమకూర్చి తీరాలి. అది నీకూ సంస్థకూ కూడ శ్రేయస్కరం! ఈ టెంపుల్‌స్టో ప్రిసెప్టరీ చాలా బీదది. కెంటు మండలములోని మెయిసన్ డ్యూ ప్రిసెప్టరీకి దీనికంటె రెట్టింపు ఆదాయము వస్తుంది. సర్వాధి కారితో చెప్పి, నిన్ను అక్కడికి వేయిస్తాను. ఈ కార్యము తుద నెగ్గే ఉపా యము లాలోచించు'— అన్నాడు కాన్రెడ్.

'బ్రయన్ పరివారంలో నేనెరుగున్నవాళ్ళిద్దరున్నారు. మొదట వాళ్ళి ద్దరూ నా సోదరుడు ఫిలిప్ మాల్వాయిసిన్ నౌకర్లు. తర్వాత ఫ్రాంట్‌డీబాఫ్ నౌకరీలోకి వెళ్ళారు. ఈ యూదుపడుచు మాయలమారితనాన్ని గూర్చి వాళ్ళకు కొంత తెలియవచ్చు'— అన్నాడు ఆల్బర్టు.

'అయితే ఇంకేం? వెంటనే వాళ్ళెక్కడున్నారో పట్టుకో! వాళ్ళ జ్ఞాపకశక్తి ఉద్దీపనకు ఒకటి రెండు బంగారు నాణేలు కావలసివస్తే అవతల పారేయ్!'— అని హెచ్చరించాడు కాన్రెడ్.

'ఏదైనా కాస్త చేతిలో పెడితే, తమ సొంత తల్లి కూడా మాంత్రికురాలని సాక్ష్యము చెప్పగల ఘటికులే— నీకా సందేహం అక్కరలేదు'— అన్నాడు మాల్వాయిసిన్.

'అయితే వెళ్లు త్వరగా! విచారణ సరిగా మధ్యాహ్నం ప్రారంభమవు తుంది. సర్వాధికారి చాల తొందరపడుతున్నాడు విచారణకోసం.'

ప్రిసెప్టరీలో మిట్టమధ్యాహ్నపు గంట కొట్టిన సమయానికి, రెబెకాను బంధించి ఉంచిన గది తలుపు తెరుచుకొని, ఆల్బర్టు మాల్వాయిసిన్ లోపలనుండి

వార్డర్లతో లోనికి ప్రవేశించాడు. 'ఏయ్ పిల్లా! త్వరగా బయలుదేరు! ఇప్పుడు నీవు మా వెంట రావాలి!'—అని ఆమె నాదేశించాడు.

'ఎక్కడికి, ఎందుకు?'—అని అడిగింది రెబెకా.

'ఆ ప్రశ్నలేవీ నీవు అడగటానికి వీల్లేదు. అయినా చెపుతున్నాను,— మా సంఘ సర్వాధికారి యెదుటికి నీవిప్పుడు హాజరు కావలసి ఉంది. నిన్ను విచారణ చేస్తారు'— అన్నాడు మాల్వాయిసిన్.

రెబెకాకు ఇదియొక శుభవార్తగా వినిపించింది. యూదు జాతికి విరోధియైనప్పటికీ, సర్వాధికారి ఒక రక్షకుడుగా ఆమె దృష్టికి అప్పుడు తోచాడు. భక్తి పురస్సరంగా భగవంతుని తలచుకొని చేతులు జోడించి నమస్కరించింది. మేలిముసుగు సవరించుకొని మాల్వాయిసిన్ వెంట బయలుదేరింది. కొలదిసేపటిలో సర్వాధికారి కొలువున్న దర్బారుహాలులోకి ఆమెను ప్రవేశపెట్టారు.

హాలులో ముందుభాగమంతా జనంతో క్రిక్కిరిసి ఉంది. అతికష్టంమీద వారి మధ్యనుంచి త్రోవచేసి రెబెకాను ఆమెకోస మేర్పాటైన స్థానానికి తీసుకు పోతున్నారు. రెబెకా ఆవనత వదనయై చేతులు ముకుళించుకొని వారి ననుగమిస్తోంది. ఈ సమయంలో, ఎవరో ఒక కాగితపు చుట్టను ఆమె చేతిలో పెట్టారు. ఆమె తీసుకొన్నదన్నమాటే గాని, అది యేమిటో చూచుకోవాలనే స్పృహ ఆమెకు లేదు. చేతిలో ఆ చీటీ అలాగే పుచ్చుకొని ముందుకు నడచివెళ్లి తనకు నిర్ణీతమైన స్థానం చేరింది. ఆ జనసమూహంలో తనయెడ సానుభూతిగలవారొకరు ఉన్నారనే భావం ఆమెకు కొంత ధైర్యమిచ్చినట్లయింది. నెమ్మదిగా తలయెత్తి, ఆ హాలునంతనూ ఒక్కసారి కలయజూచింది.

# అధ్యాయం ౩౮

ఆ హాలులో, ఎట్టయెదుటగా ఒక పెద్ద అరుగు. ఆ అరుగుపై ఒక వేదిక అమర్చబడిఉంది. అందొక ఉన్నతాసనంమీద సర్వాధికారి లూకాస్ కూర్చుండి ఉన్నాడు. చేతిలో, అతని హోదాను తెలియజేసే దండం ఉంది. అతని కాళ్లముందరగా ఒక బెంచిమీద ఇద్దరు ముసద్దీలు కూర్చున్నారు. వేటి విచారణ కార్యక్రమమంతా రికార్డు చెయ్యడం వీరిపని యన్నమాట. సర్వాధికారికి వెనుకగా, అతనికంటె కొంచెం తక్కువ యెత్తులో, టెంపుల్ వ్యవస్థను చెందిన నలుగురు ప్రిసెప్టర్లు కూర్చున్నారు. వారికి వెనుక, అంతకంటె తక్కువ రెత్తులో, కొందరు టెంప్లార్ యోధులు కూర్చున్నారు. వారికి వెనుకగా, వారికంటె తక్కువహోదాగల టెంపుల్ ఉద్యోగులు కొందరు నిలబడ్డారు. మొత్తంమీద, ఆ వేదికమీద ఉన్నవారందరి ముఖంలోనూ, తరగతులవారీగా, ఒక విధమైన గంభీర్యం ఉట్టిపడుతోంది. సర్వాధికారి సాన్నిధ్యంలో, ఎవరికి వారు, తమకుండవలసిన ఠీవిని ప్రయత్న పూర్వకంగా తెచ్చిపెట్టుకొని కూర్చున్నారు.

చుట్టూ హాలంతా ఇతరజనంతో నిండుకొనిఉంది. సర్వాధికారి ఒక యూదీయ మాంత్రికురాలిని విచారణ చెయ్యబోతున్నాడని తెలిసిన చుట్టుపట్ల గ్రామీణులు చాలామంది వచ్చారు. సర్వాధికారి అధికారదర్పం ఆంత జనసమూహం మధ్య మరింత ఇనుమడించినట్లుగా ఉంది. మృదుగంభీరమైన కంఠ స్వరంతో, బైబిలులోని ఒక ప్రార్థన గీతం ఎత్తుకొని సభా కార్యక్రమం ఉపక్రమించాడు. హాలులోని టెంపుల్ ఉద్యోగులంతా అతని ననుసరించారు. ఆ యందరి కంఠ ధ్వనులతోనూ హాలు హాలంతా ప్రతిధ్వనించిపోయింది.

కొంత సేపటికి మరల హాలంతా నిశ్శబ్దంగా ఉంది. సర్వాధికారి ఒక పర్యాయం హాలంతా కలయ జూచాడు. టెంప్లార్ బ్రయిన్ ఆసనం ఖాళీగా ఉంది. అతడు వేదికపై ఒకమూలగా, ఉత్తరీయ్యం మొగానికి చాటు చేసుకొని నిలబడి ఉన్నాడు. ఒకవిధమైన అనుకంపా దృష్టితో సర్వాధికారి అతనిని చూచాడు. సైతాను తోడ్పాటుతో రెబెకారే అతనినీ స్థితికి తెచ్చింది గాని స్వతః అతని దోషమేమీ లేదని అతని యభిప్రాయం. అతని నెలాగైనా ఉద్ధరించవలసిన కార్యభార మిప్పుడు తనమీద ఉంది.

సభాసదుల నుద్దేశించి ముందుగా ఒక పెద్ద ఉపన్యాసం చేశాడు. సర్వాధికారియైన తనకు, ఇలాంటి విచారణలు జరిపే అధికార బాధ్యతలు ఏ విధంగా విహితమై ఉన్నవో వివరించాడు. సైతాను సన్నిహితురాలంటే మాయలను గూర్చి

ప్రస్తావించి, వాని ప్రేరణతో ఈ మాంత్రికురాలైన రెబెకా బ్రయన్ వంటి ఉత్తమపురుషునికే గంగవెఱ్ఱులెత్తించిందనీ, ఇది తాను చూస్తూ ఊరుకోడానికి వీలులేదనీ ఉద్ఘాటించాడు. బ్రియన్ సామాన్యవ్యక్తి కాడు. కార్యసాహసాలకే గాక, వివేక విజ్ఞానములకు కూడ ప్రాశస్త్యములందంతటా టెంప్లార్లలో పేరుమోసినవాడు. ఈ యనంతరం సర్వాధికారి కాదగినవాడతడే యని యెల్లరిచేతా కీర్తించబడుతున్నవాడు. అలాంటివాడిప్పుడు, మానమర్యాదలు మంట గలుపుకోడానికి సిద్ధపడి, తన శ్రేయస్సూ తన సంఘ శ్రేయస్సూ మరచి, ఒక యూదు పడుచువెంట తగిలాడు. తనకు అపాయం కూడా లెక్కచెయ్యక, ఆమె రక్షణకై పాటుపడ్డాడు. అన్నిటికంటె మించి, పరమపవిత్రమైన ప్రిసెప్టరీలోనే ఆమెను ప్రవేశపెట్ట సాహసించాడు. ఇదంతా ఏదో మంత్రవిమోహితుడై అతడు చేశాడనడానికి సందేహంలేదు. అలా కాదని రుజువయ్యే పక్షంలో, ఎలాంటి సంకోచమూ లేకుండా అతనికి తగిన శిక్ష విధించవలసిన బాధ్యత తన మీద ఉంది. టెంపుల్ సంఘ నిబంధనల ప్రకారం, ఇదిగో అతడు ఫలాని ఫలాని తప్పులు చేశాడంటూ, ఒక్కొక్కటే ఏకరువుపెట్టాడు సర్వాధికారి. ఇలాంటి తప్పులు చేసినవాణ్ణి ఎంతటివాణ్ణయినాసరే, సంఘనుండి బహిష్కరించడం తప్ప గత్యంతరముండదన్నాడు. అలా కాకుండా, ఇదంతా మంత్రతంత్ర ఫలితమని రుజువయ్యేటట్లయితే మాత్రం, అతనియెడ జాలితలచడమే కర్తవ్యమౌతుంది. కొన్ని ప్రాయశ్చిత్త విధులను మాత్రం అతనికి విధించి, ఈ అపాయానికంతకీ కారణభూతురాలైన మాంత్రికురాలిని తీవ్రదండనకు గురిచేయవలసి ఉంటుంది. కనుక, ఇప్పుడు కావలసినది సముచిత నిర్ణయం చేయడానికి తగ్గ సాక్ష్యవిచారణ. ఈ విషయంలో ఎవరెవరు ఏమేమి చెప్పగలరో చెప్పండని ఆహ్వానించాడు సర్వాధికారి.

మొట్టమొదట, కొందరు సాక్షులు, టార్కిల్‌స్టన్ కోట తగులబడి పోతూఉండే సమయంలో, బ్రియన్ తనకు అపాయంకూడా లెక్కచెయ్యక రెబెకాను ఏ విధంగా రక్షించడానికి ప్రయత్నించినదీ విపరీత కల్పనలతో వర్ణించి, నిజంగా బ్రియన్‌ను ఏదో ఆవేశించబట్టే అలా చేశాడని శ్రోతలకు అభిప్రాయం కలిగేటట్లు చేశారు. పిమ్మట ఆల్బర్ట్ మాల్వాయిసిన్, రెబెకాను తీసుకొని బ్రియన్ ప్రిసెప్టరీకి వచ్చిన విధాన్ని గూర్చి సాక్ష్యంచెప్తూ, ఏదో మతిభ్రమణంలో ఉన్నవానివలె బ్రయన్ అప్పుడు కనుపించాడనీ, రెబెకాపై అతనికి గల వ్యామోహం చాల విపరీతంగా తోచిందనీ ఉటంకించి, ప్రిసెప్టరీలోకి వారిని రానివ్వడం తనది తప్పేయనీ, కాని ఏ కారణంవల్ల తాను అలా చేయవలసి వచ్చిందో సర్వాధికారియెదుట చెప్పుకొని ఉన్నాననీ, చేసినపని సక్రమమైనది కాకపోయినా సదుద్దేశ్యంతోనే చేసినట్లు సర్వాధికారి గుర్తించారనీ, ఆయన ఎట్టి ప్రాయశ్చిత్తం తనకు విధించినా అందుకు తాను బద్ధుడనేననీ చెప్పుకొని కొన్ని కల్లబొల్లి నిట్టూర్పులు విడిచాడు.

'అవును ఆల్బర్ట్! నీ ఉద్దేశ్యం మంచిదే. వడివడిగా పాపకూపం వైపునకు పరుగిడిపోతున్న నీ సోదరుని ఎలాగైనా అరికట్టి రక్షించే ఉద్దేశ్యంతోనే నీవాపని చేశావు. కాని, విపరీత వేగంతో పారిపోయే గుర్రాన్ని కళ్లెం లంకించుకొని ఆపాలిగాని, రికాబులు పట్టుకొని ఆపబోతే అది ఆగకపోగా, ఆ ఆపబోయిన వారికిగూడ దెబ్బలు తగలడం సహజం. ఏసునాధుని ప్రార్థన ఉదయం పదమూడు సార్లూ, సాయంకాలం తొమ్మిదిసార్లూ చెయ్యాలనికదా మన టెంపుల్ సంస్థ నియమం? నీవు చేసిన తప్పునకు ప్రాయశ్చిత్తంగా, ఒక ఆరు వారాల పాటు వీటిని ఇబ్బడిగా చెయ్యి! వారానికి మూడుసార్లే టెంప్లార్లు మాంసం ముట్టాలని సంస్థ నియమం. నీవు వారం పొడుగునా మాంసం ముట్టకుండానే ఉండు. ఇలా ఒక ఆరువారాలు చెయ్యాలి. ఇదే నీకు ప్రాయశ్చిత్తం!'— అన్నాడు సర్వాధికారి.

వినయ విధేయతలు ఉట్టిపడే దొంగనటనతో, మాల్వాయిసిన్ సర్వాధికారికి అభివాదంచేసి, నెమ్మదిగా వెళ్లి తన చోటులో తాను కూర్చున్నాడు.

పిమ్మట సర్వాధికారి, తన వెనుకప్రక్క కూర్చున్న ప్రిసెప్టర్ల నుద్దేశించి, 'సోదరులారా, మనమిప్పుడు ఈ యూదుపడుచు పూర్వచరిత్ర విషయమై కొంత విచారణ చేయడం అవసరమనుకుంటాను! మంత్ర తంత్రాలు ప్రయోగించే మనిషి అవునో కాదో దానినిబట్టి మనం కొంత ఊహించవచ్చు. ఏమంటారు?'— అన్నాడు.

అక్కడఉన్న ప్రిసెప్టరు లసలు మొత్తం నలుగురు,— బ్రియాన్, కాన్రేడ్, మాల్వాయిసిన్, హెర్మన్, అనేవారు. బ్రియాన్ తన స్థానంలో తాను కూర్చోకుండా వేరుగా నిలబడివున్న సంగతి పాఠకులకు తెలిసేఉంది. సర్వాధికారి అడిగినదానికి హెర్మన్ లేచినిలబడి, సర్వాధికారి అనుమతితో ఇలా అన్నాడు: 'పూజ్యులకు నాదొక మనవి. ఈ అభియోగాలకు మన బ్రియన్ ఏమి సమాధానం చెపుతాడో, ఈ వ్యవహారం అతని కంటికిప్పుడు ఎలా కనిపిస్తోందో, తెలుసుకోవాలని ఉంది.'

'విన్నావా బ్రియన్! హెర్మన్ ఏమంటున్నాడో? నీ సమాధానమేమిటో చెప్పు'— అని ఆదేశించాడు సర్వాధికారి.

బ్రియన్ సర్వాధికారివంక చూచాడు. కాని, నోరు మాత్రం మెదప లేదు. ఆ మాట్లాడక పోవడం సైతానుచేత ఆవహించబడ్డవాని లక్షణంగానే సర్వాధికారి భావించి, చేతనున్న దండం ఝుళిపిస్తూ హుంకారంచేసి, మాట్లాడమని తిరిగి బ్రియన్‌ను హెచ్చరించాడు.

ముఖంలోకి తొంగిచూచిన తిరస్కారభావాన్ని అతికష్టంమీద అణచుకొని, బ్రియన్ ఇలా సమాధానమిచ్చాడు: 'ఈ అవకతవక అభియోగా

లకు బ్రియన్ సమాధాన మివ్వడు. తన ఆత్మగౌరవాన్ని తన భుజాల శక్తిచేత,— క్రైస్తవలోకంపట్లాన ప్రతిజ్ఞ మెరసిన తన ఖడ్గధారచేత రక్షించుకోడానికి సర్వసిద్ధంగా ఉన్నాడు. ఇదే ఆతడివ్వగల సమాధానం.'

'ఇది నీయంతట నీవు మాట్లాడినమాటకాదు బ్రియన్! ఎవరు నిన్ను ఆవేశించడంవల్ల ఇలా మాట్లాడుతున్నావో మాకు తెలుసు. అందుకనే నిన్ను మన్నిస్తున్నాము. నిన్ను పట్టిన సైతానును పారద్రోలి తీరుతాంగాని ఊరుకోం!' అన్నాడు సర్వాధికారి.

బ్రియన్ చూపులో తీవ్రమైన తిరస్కారభావం తళుక్కుమంది. అతడింకేమీ మాట్లాడలేదు. ఇక అతనిని ప్రశ్నించి ప్రయోజనంలేదని నిర్ధారణ చేసి, సర్వాధికారి రెబెకా పూర్వచరిత్రనుగూర్చి సాక్ష్యమివ్వగలవారు ముందుకు రండని ఆదేశించాడు. ఈ సమయంలో, హాలులో ఒకమూల ఏదో సంచలనం బయలుదేరింది. అది యేమిటని అడిగాడు సర్వాధికారి. ఇక్కడ ఒక పక్షవాతరోగి ఉన్నాడనీ, రెబెకా వెనుక ఇతనికేదో అద్భుతమైన మందిచ్చి లేచి తిరిగేటట్లు చేసిందనీ అన్నారు. సర్వాధికారి ఆజ్ఞానుసారం అతన్ని లాక్కొని వచ్చి బోనులో నిలబెట్టారు. రెబెకామూలాన తనకు పక్షవాతం కుదరడమనే దోషం ఎట్టి విపరిణామాలకు దారితీస్తుందోనని అతడు భయపడిపోతున్నాడు. నిజానికి అతనికా రోగం ఇంకా పూర్తిగా నయంకాలేదు. ఊతకర్ర లేకుండా నిలవలేడు, నడవలేడు. తప్పనిసరిగా అతడిప్పుడు సాక్ష్యం చెప్పవలసివచ్చింది. ఇష్టం లేకుండానే, కన్నీళ్ళు కారుతూ, సాక్ష్యం చెప్పాడు. రెండేళ్ల క్రిందట యార్కు నగరంలో ఇసాక్ ఇంట్లో ఏవో వడ్రంగం పనులు చేస్తూ ఉండగా అతనికి పక్షవాతం వచ్చి ముద్ద అయిపోయాడట. రెబెకాచేసిన చికిత్సవల్ల—ముఖ్యంగా, ఘుమఘుమలాడే ఒక ప్రత్యేకమైన పాలాత్రివల్ల చెయ్యీ కాలూ కొంతవరకు స్వాధీనమయింది. ఇంటికి పంపేటప్పుడు ఆ పాలాత్రి కొంత ఒక డబ్బిలో పెట్టి యిచ్చి, కొంత డబ్బుకూడా సాయంచేసింది. 'ఆమె నాకు అపకారం తలపెట్టిందని నేననుకోను. ఆమె యిచ్చిన పాలాత్రి వాడుతూ ఉండేరోజుల్లో, యథాప్రకారంగా క్రైస్తవమతానుసారం నేను చేసుకునే ప్రార్థనలు చేసుకుంటూనే వచ్చాను. అందువల్ల నాకేమీ వికటించలేదు.'— అని అతడు తన సాక్ష్యంలో చివరకు విన్నవించుకున్నాడు.

'ఛీ! అధికప్రసంగం చెయ్యకు! పో అవతలికి! సైతానుమందులు వాడే నీవంటి పశువుల సంగతి నాకు బాగా తెలుసు. నీకు తెలియదు కాబోలు,— ఇలాంటి పాడుమందులకు ప్రచారం కల్పించడానికే సైతాను కొన్ని రోగాలను తానే కల్పించి వాటిచేత నయం చేయిస్తూ ఉంటాడు. ఏదీ, ఆ పాలాత్రి ఇప్పుడు నీ దగ్గిర ఉన్నదా?'— అని గద్దించి అడిగాడు సర్వాధికారి.

ఆ గ్రామీణుడు వణుకుతున్న చేతులతో, చొక్కా జేబులోంచి ఒక డబ్బీ బయటికి తీశాడు. దానిమీద హీబ్రూ అక్షరాలతో ఏదో వ్రాసి ఉంది. హీబ్రూ అక్షరాలు కేవలం సైతాను అక్షరాలని అక్కడివారందరి నమ్మకం. అవి చూడగానే సర్వాధికారి, సిలువచిహ్నాలతో శరీరానికి రక్షలు పెట్టుకొని, డబ్బీని జాగ్రత్తగా పరిశీలించి చూశాడు. అతనికి హీబ్రూభాష వచ్చు. 'యూదా సంతతివారి సింహం గెలుపొందింది'— అనే బైబిలు వాక్యమది. సర్వాధికారి తలపంకించి,—'మాయావి సైతాను మాయలు! బైబిలు వాక్యాలను ఎంత దుర్వినియోగమైనా చెయ్యగలడు,— అమృతాన్నంలో విషం కలుపుతాడు సైతాన్! ఈ పాలాస్త్రీ ఏవో వస్తువులతో తయారయిందో ఇక్కడి వైశ్యులెవరైనా పరిశీలించి చెప్పగలరా'—అన్నాడు సర్వాధికారి.

వైద్యంజేసే ఒక సన్యాసి, ఒక మంగలి, ఆ మందు చాలాసేపు పరిశీలించి, ఇదేదో కర్పూరం కలిసిన మందని చెప్పడం మినహా మరేమీ చెప్పలేకపోయాడు. మంచి వైద్యుణ్ణిచూస్తే జడ్డవైద్యుడి కెప్పుడూ గిట్టదుగనక, ఇదేదో భూత వైద్యం తాలూకు వస్తువులతో తయారు చేసిందిగా కనిపిస్తోందన్నారు. పరిశీలనంతా పూర్తి అయినతరవాత, ఆ గ్రామీణుడు తన మందు తనకు తిరిగి ఇప్పించవలసిందిగా కోరాడు. కాని, సర్వాధికారి చురచురా అతనికేసి చూచి, నీ పేరేమిటన్నాడు. 'నా పేరు హిగ్ అంటారు. మా నాయన పేరు స్నెల్' అన్నాడా గ్రామీణుడు. 'అయితే, స్నెల్ కుమారుడవైన ఓ హిగ్! నేను చెప్పేది జాగ్రత్తగా విను. క్రైస్తవమత విరోధులైనవారి మందులు సేవిస్తూ లేచి తిరగగలిగే కంటే, అవి సేవించకుండా మంచంమీదనే పడి ఉండడం మేలు. మతవిరోధుల కొరకు కాయకష్టం పడడంగాని, వారిచ్చే కానుకలు స్వీకరించడంగాని ఎన్నడూ చెయ్యరాదు! అంతకంటె, వాళ్ళ సంపదను దౌర్జన్యంగా కొల్లగొట్టడం మేలు! పో! ఇకనుంచి బుద్ధి కలిగి, నేను చెప్పినట్లు నడుచుకుంటూ ఉండు'— అని ఉరిమాడు సర్వాధికారి.

'స్వాములవారు ఆగ్రహించకుండా ఉంటే, ఒకమాట మనవి చేసుకుంటాను. దురదృష్టవశాత్తూ నేనిప్పుడు కుంటివాణ్ణి. మీ బోధ అమలు జరపగల స్థితిలో లేను. కాని, యూదీయ వైద్యుడు రబ్బీ నాథన్ బేన్ సామ్యూలు వద్ద మా వాళ్ళిద్దరు నౌకరీ చేస్తున్నారు. వాళ్ళకు చెబుతాను,— అతనివద్ద నౌకరీ చెయ్యడంతప్పు, అంతకంటె, అతని ఆస్తి దౌర్జన్యంగా కొల్లగొట్టడం మంచిదని తమరు సెలవిచ్చారని'— అన్నాడు గ్రామీణుడు.

సర్వాధికారి మరింత మండిపడి,—'ఎవడురా అక్కడ! వీడేదో తెగ వాగుతున్నాడు, ఇక్కడినుంచి తరిమెయ్యండి!'—అని ఒక్క కేక పెట్టాడు. హిగ్ తనంతటతానే ఇక అక్కడినుండి కదలి ఆ జనసమూహంలో కలిసిపోయాడు.

సర్వాధికారి సమ్ముఖాన నిలబడి ఉన్నంతసేపూ అతనికి కలిగిన బాధ ఇంతంత కాదు. అక్కడ ఇంకా నిలబడితే తిరిగి అతని ఆగ్రహదృష్టికి తాను గురికావలసి వస్తుందేమోనన్న భయం కూడ అతనికుంది. అయినా, ఆ హాలు వదలి బయటికి పోవడం అతనికి మనస్కరించలేదు. తన ప్రాణాలు కాపాడిన రెబెకా గతి ఏ విధంగా నిర్ణయమౌతుందో తెలుసుకోగోరి అచటనే ఒకమూలగా నక్కి కూర్చున్నాడు.

ఈ విచారణ జరుగుతున్నంతసేపూ రెబెకా సర్వాధికారికెదురుగా మేలిముసుగుతో నిలబడిఉంది. సర్వాధికారి యిప్పుడామెను మేలిముసుగు తొలగించమన్నాడు. 'అపరిచితులముందర మేలిముసుగు లేకుండా నిలబడడం మా జాతి ఆడవాళ్ళకు అలవాటు లేద'ని ఆమె మృదు గంభీరంగా సమాధానం చెప్పింది. ఆ మధురస్వరం పలికిన పలుకులలో ఆమెయెడ సానుభూతిని మేల్కొలిపింది. సర్వాధికారికి గూడా కొంత ఆర్ద్రత కలగకపోలేదు గాని, తాను నిర్వర్తింపదలచుకొన్న ధర్మానికి ఇలాంటి వేవీ అడ్డం రానివ్వకూడదనే దృఢ నిశ్చయంతో ఉన్నవాడు గనుక, మేలి ముసుగు తొలగించి తీరవలసిందేనని తిరిగి ఆదేశించాడు. ప్రక్కన నిలబడ్డ రక్షకభటులా పని తాము చేయడానికి ఉద్యుక్తులు కాగా, రెబెకా వలదు వలదని వారిస్తూ ఇలా అంది: 'అయ్యా, మీ కెవ్వరికీ కూతుళ్ళులేరా? మీ తల్లులనూ, మీ అక్కచెల్లెండ్రనూ ఒక పర్యాయం జ్ఞాపకం చేసుకోండి. దిక్కులేని ఒక అబలపై ఈ దౌర్జన్య ప్రయోగం జరగనివ్వడం మీకు భావ్యం కాదు. మేలిముసుగు తొలగించక తప్పదనే మీరనేటట్లయితే, అలాగే తొలగిస్తాను. ఇక్కడున్నవారంతా పెద్దలు. మీ ఆజ్ఞ శిరసావహించి, ఈ దీనురాలి ముఖం బహిర్గతం చేస్తున్నాను'—అంటూ ఆమె, మేలిముసుగు తొలగించి సభాసదుల కలయజూచింది. సిగ్గు పెనవేసికొన్న గరువతనం తొంగిచూచిందామె ముఖవైఖరిలో. ఆమె సౌందర్యాతిశయం సభికులందరినీ ముగ్ధుల గావించింది. బ్రయన్ ఈ అన్నుమిన్నపై మోహానికి ఇంతగా వశుడైనది ఈమె చక్కదనానికే గాని మంత్రతంత్రాలకు గాదన్నట్లు అచటి టెంప్లార్ యోధులొకరినొకరు చూచుకున్నారు. రెబెకా దురవస్థ చూచేసరికి, అచట నున్నవారిలో ముఖ్యంగా హిగ్ పడిన వేదన యింతంతకాదు. 'నేనిక భరించలేను. నన్ను బయటికి వెళ్ళిపోనివ్వండి. ఆమెవంక మళ్ళీ యింకోసారి చూచానంటే నా ప్రాణం పోతుంది. ఆమె హత్యకు కారణభూతుల్లో నేను గూడ ఒకణ్ణి అయ్యాను. ఇక నేను భరించలేను. నన్ను బయటికి వెళ్ళనివ్వండి' అని గోలపెడుతున్నాడతడు గేటువద్ద.

రెబెకా ఈ మాటలు విన్నది. 'అయ్యా, ఎందుకు బాధపడతావు? నీవు నాకేమీ అపకారం చెయ్యలేదు. నిజం చెప్పావు, అంతే! ఇలా నీవు శోకలు పెట్టితే నాకేమీ ఉపకారం జరగదు. దయచేసి నిశ్శబ్దంగా ఇంటికి పోయి నిన్ను నీవు రక్షించుకో!'— అన్నది.

హిగ్గుకు ఈ మాటలతో కొంత ఉపశాంతి కలిగింది. అచటి కావలి వాండ్రు తనని బయటికి వెళ్ళగొట్టడానికి ప్రయత్నించగా, ఇక గోల చెయ్యనని కాళ్ళావేళ్ళాపడి బ్రతిమాలుకొని తిరిగి అక్కడే ఉండిపోయాడు.

ఇక తరువాతి సాక్ష్యం అల్బర్ట్ మాల్వాయిసిన్ చేత ప్రేరితులైన సైనికు లది. సాక్ష్యంలో ఏమేమి సంగతులు చెప్పాలో మాల్వాయిసిన్ వారిద్దరికీ ఇదివరకే బోధించి ఉంచాడు. ఇద్దరూ స్వతః దయాదాక్షిణ్యాలు లేనివారే. కాని, రెబెకా పరిస్థితి, ఆమె సౌందర్యం చూచేసరికి, వారికిగూడా మనస్సు కరిగింది. మాల్వాయిసిన్ వారి తటపటాయింపు కనిపెట్టి, ఒకసారి తీక్ష్ణంగా వారివంక చూచాడు. అంతే! ఇక వారు, తాము నేర్చుకున్నది నేర్చుకున్నట్లుగా సాక్ష్యం చెప్పేశారు.

అప్రధాన విషయాలతోనూ అభూత కల్పనలతోనూ నిండి ఉన్న ఆ సాక్ష్యం ఇప్పటిరోజుల్లో నైతే ఏ న్యాయాధిపతీ నమ్మడు. కాని, అవి మూఢ విశ్వాసాల కాలవాలమైన రోజులు. అదీగాక, వారు సాక్ష్యం చెప్పిన తీరుకూడా చాలా అనుమానాస్పదంగా ఉంది. కాని, సర్వాధికారి నిష్పాక్షిక బుద్ధితో అక్కడ న్యాయపీఠంపై కూర్చున్నవాడు కాకపోవడం చేత, ఏ అనుమానమూ అతనికి కలుగలేదు.

అర్థంకాని భాషలో రెబెకా పెదవులు కదుపుతూ ఏమేమో ఉచ్చరిస్తూ ఉండడం తాము చూచామనీ, అప్పుడప్పుడు ఆకాశంవంక చూస్తూ ఉండేదనీ, వింత వింత అద్దకాలు గల ఉడుపులు ధరిస్తూ ఉండేదనీ,—ఇలాంటి అప్రధాన విషయాలు కొన్ని చెప్పిన తర్వాత, వారిలో ఒకడు ఈ క్రింది అభూతకల్పన చేశాడు తన సాక్ష్యంలో: టార్క్విల్‌స్టన్ కోటలో రెబెకా ఒక గాయపడ్డ మనిషికి విచిత్రమైన చికిత్స చేయడం తటస్థించింది. గాయం చుట్టూ చేతులు త్రిప్పుతూ ఏవేవో మంత్రాలు చదివేసరికల్లా, మేముచూస్తుండగానే ఆ గాయం లోంచి ఒక ఇనప అలుగుముక్క దానంతటది బయటికి వచ్చేసింది. కారే నెత్తురు ఆగిపోయింది. గాయం మానుకొనిపోయింది. చావడానికి సిద్ధంగా ఉన్న వాడల్లా, ఒక పావుగంట సేపటిలో లేచివచ్చి యుద్ధంలో సాక్షికి బాసటగా నిలిచి పోరాడ గలిగాడు. ఇందుకు సాక్ష్యంగా, ఆ గాయంలోంచి బయటపడ్డ అలుగు ముక్క సర్వాధికారి సమక్షంలో ఉంచబడింది.

ఇక, రెండవవాని సాక్ష్యంలోని అభూత కల్పన ఈ విధంగా ఉంది: టార్క్విల్‌స్టన్ కోట గోపురంమీద బ్రయన్ రెబెకాల నిద్దరినీ ఇతడు దూరాన్నుంచి చూచాడు. రెబెకా ఆగోపురానికి చుట్టూవున్న పిట్టగోడమీద కొంతసేపు కూర్చుని, ఇంతలో ఒక హంసగా మారి కోట చుట్టూ ముమ్మారు ఎగిరి వచ్చి తిరిగి పిట్టగోడపైవాలి, ఎప్పటివలె మరల మానవరూపం దాల్చి బ్రయన్‌తో కలిసి వెళ్ళిపోయింది.

రెబెకా మంత్రగత్తె అని నిర్ధారణ చెయ్యడానికి సర్వాధికారికి ఇంతకంటె ఆధారం ఇంకేమి కావాలి? గంభీరంగా రెబెకా వంక చూచి, 'నీకు శిక్ష విధించబోతున్నాను, ఏమి సమాధానం చెప్పుకొంటావు' అని అడిగాడు.

రెబెకా గద్గద కంఠంతో ఇలా సమాధానం చెప్పింది: 'చెప్పడానికి ఏమున్నది? కరుణించండని మిమ్మల్ని ప్రార్థించడం నిష్ప్రయోజనమే కాక, గౌరవహీనం కూడా. జబ్బుపడినవాళ్ళకు చికిత్స చెయ్యడం భగవంతుని దృష్టిలో అపరాధం కాదని మీముందర వాదిస్తే లాభముండదని నాకు తెలుసు. ఈ చివరి సాక్షులిద్దరూ—భగవంతుడు వీరిని మన్నించుగాక!—నా విషయంలో ఆరోపించినవి అసంభావ్యములంటే మీ రొప్పుకోరు. మీకవి సంభావ్యములుగానే కనిపిస్తాయి. నా దుస్తులు, నా భాష, వర్తనలు మీకు వింతగా కనిపించడాన్ని బట్టి నేనేమి చెప్పినా మీకు నచ్చదని నేనెరుగుదును. అపరాధిని అమాయకుణ్ణిగా మార్చి చిత్రించజాలే యీ అభూతకల్పనలన్నీ నిబ్బరంగా వింటూ కూర్చున్న ఆ బ్రయన్ డీబోయి గిల్బర్టును గూర్చి నేనిప్పుడేమి చెప్పితే మాత్రం మీకు యెక్కుతుంది? మా ఇద్దరిమధ్యా తీర్పు చెప్పగలిగినవాడు భగవంతుడొక్కడే! కాని, ఆ బ్రయన్ డీబోయి గిల్బర్టునే ఒకమాట అడగదలచాను. అతన్ని గుండెలమీద చెయ్యివేసుకొని సమాధానం చెప్పమనండి. ఈ సాక్షులు నాపై చేసిన యీ ఆరోపణలన్నీ అసత్యములు కావా? అభూతకల్పనలు కావా? ఘోరాతిఘోరమైన అపనిందలు కావా?'

హాలంతా నిశ్శబ్దంగా ఉండిపోయింది. అందరికళ్ళూ బ్రయన్ వైపు తిరిగాయి. అతడేమీ మాట్లాడలేదు.

'ఏం, అలా మిన్నకున్నావేం? మాట్లాడు! నీలో నిజంగా మానవత్వం ఉంటే, నీవు నిజమైన క్రైస్తవుడవైతే, వీర సంప్రదాయానికి చెందినవాడవైతే, ఆత్మవంచన చేసుకోకుండా చెప్పు,—నీ తల్లిదండ్రులను హృదయంలో సంస్మరించుకొని మరీ చెప్పు.—ఈ ఆరోపణలు యథార్థములేనా?'—అని రెట్టించి అడిగింది రెబెకా.

'చెప్పు బ్రయన్! నిన్ను ఆవేశించిన సైతాన్ నీనోటి కడ్డం వస్తున్నట్లున్నాడు. మనస్సు చిక్కబట్టుకొని సమాధానం చెప్పు,'—అని హెచ్చరించాడు సర్వాధికారి.

బ్రయన్ హృదయంలో ఒక పెద్ద సంగ్రామం జరుగుతున్నట్లుగా ఉంది. ఆ బాధంతా అతని ముఖాకారరేఖలలో ప్రకటితమౌతోంది. ఎట్టకేలకు, గొంతు బిగబట్టి, రెబెకా వైపు చూస్తూ, 'కాగితం చుట్ట! కాగితంచుట్ట!' అని మాత్రం రెండు మాటలని ఊరుకొన్నాడు.

సర్వాధికారి వెంటనే అందుకొని, 'ఆఁ! చూచారా! యింతకంటే సాక్ష్యమింకేమి కావాలి? ఏలాగో పెకల్చుకొని, 'కాగితంచుట్ట' అని మాత్రము అనగలిగాడు. బహుశః అతని యీ వాగ్బంధనకు కారణభూతమైన కాగితపుచుట్ట అయివుండాలది. దానిమీద యీ మాంత్రికురాలు ఏవో మంత్రాలు వ్రాసివుంటుంది!' అని ఉద్ఘాటించాడు.

కాని, బ్రియన్ అన్న యీ మాటలవల్ల రెబెకాకు ఛప్పున తన చేతిలో వున్న కాగితపుచుట్ట సంగతి స్ఫురణకు వచ్చింది. బ్రయన్ పలికిన పలుకుల అభిప్రాయ మేమిటా అని సభలో ఒక విధమైన సందడి బయలుదేరిన అవకాశముతో, దానిని విప్పిచూచుకొని వెంటనే చించిపారవేసింది. ఇది అక్కడ యెవ్వరూ కనిపెట్టలేదు.

'రెబెకా!'— సర్వాధికారి గొంతు వినిపించేసరికి హాలంతా మరల నిశ్శబ్దమయింది. 'రెబెకా! బ్రయాన్ పలికిన పలుకులవల్ల నీ కేమీ లాభించేది లేదు. అతడిప్పుడు సైతాను వశంలో ఉండిపోయాడని మేము గ్రహించాం. నీ వింకేమైనా చెప్పుకోవలసింది ఉన్నదా?'— అని అతడు ప్రశ్నించాడు.

'ఇక ఒక్కటేదారి నాకు మిగిలింది, ప్రాణం రక్షించుకోడానికి. జీవితం చాలా దుర్భరంగా ఉన్నమాట నిజం. కాని, భగవంతుడే దారి చూపిస్తున్నంతకాలం, ఈ భగవత్ప్రసాదితమైన జీవితాన్ని యెంతమాత్రమూ వదలుకోను. నామీద చేయబడ్డ ఈ ఆరోపణలన్నీ కేవలం అసత్యాలు. నేను నిర్దోషిని. కాదు, దోషినంటున్నారు మీరు. న్యాయాన్యాయాలు యుద్ధంలో జయాపజయాలను బట్టి నిర్ణయించడమనే పద్ధతికూడ ఒకటున్నది. అది మీ సంప్రదాయాలకు అనుగుణమైనదే. నేను దోషినైనదీ నిర్దోషినైనదీ ఆపద్ధతిద్వారా తేల్చాలని కోరుతున్నాను. నా తరఫున ఒక యోధుడువచ్చి పోట్లాడగలడు'—అన్నది రెబెకా.

'ఎవడా యోధుడు, నీ తరఫున పోట్లాడేది? నీ వంటి యూదు పడుచు పక్షాన- మంత్రగత్తె పక్షాన- కత్తిపట్టే అవివేకి యెవ్వడూ ఉండడు. యిది తెలుసుకో!'- అన్నాడు సర్వాధికారి.

'భగవంతుడే పంపిస్తాడు తగిన యోధుణ్ణి. స్వేచ్ఛా స్వాతంత్ర్యాలకూ ఉదార సాహసాలకూ పేరు పడిన యీ ఇంగ్లాండులో, న్యాయంకోసం పోరాడగల యోధుడు ఒక్కడైనా బయటపడకపోతాడా?—ఇదిగో నాసవాలు' అంటూ, రెబెకా తన చేతికి తొడిగివున్న గ్లోవు ఊడదీసి సర్వాధికారి ఎదుటికి విసిరివేసింది. అలా విసిరివేయడంలో ఆ హుందాతనం, అసామాన్యత్వం చూచేసరికి, అక్కడి సభాసదులెల్లరూ అచ్చెరువొంది శెబాస్ అనుకున్నారు.

# అధ్యాయం ౩౯

ఆ రీతిగా సవాలు చేసి నిలిచిన రెబెకా మనోజ్ఞమూర్తిని చూచేసరికి, సర్వాధికారి లూకాస్‌కు సైతం ఒక విధమైన జాలి కలిగింది. వస్తుతః అతడు క్రూరుడు కాదు. అయినప్పటికీ అతనిది రాతిగుండె అయిన దంటే, దానికి అనేక కారణాలున్నాయి. చిన్నటినుంచీ భావోద్రేకాలు లేని స్వభావం, దానికితోడు, ఒక విధమైన విరాగ జీవితం నడుపుతున్నాడు. ఒక పెద్ద హోదా ఉంది. మత విరోధులపై దాడి సాగించవలసిన బాధ్యత ఆ హోదాను బట్టి తనమీద ఉన్నదని అనుకుంటున్నాడు. ఏదైనా ఒకటి తన కర్తవ్యమని అనుకున్నప్పుడు, దానిని నెరవేర్చడానికి వెనుకాడితే ఎలాగు? ఇన్ని సందర్భాలు కలిపి, అతనిని కఠిన హృదయునిగ మార్చివేసాయి. కాని ఇప్పుడా కఠినత్వం, నా అనేవారెవ్వరూ లేని దిక్కుమాలిన స్థితిలో ఉన్నప్పటికీ దిగులు పడిపోక ధైర్య సాహసాలతో ఆత్మరక్షణ చేసుకోడానికై నిలబడిన రెబెకా సుందర రూపాన్ని ఎట్టెదుట చూస్తూ ఉండేసరికి, కరుగ నారంభించింది; ఇలాంటి సమయాల్లో సాధారణంగా ఉక్కుతో సమానంగా ఉండవలసిన తన హృదయం ఇలా మెత్తబడడానికి కారణ మేమిటా అని కంగారుపడ్డాడు. శరీరానికి క్రాసు రక్షలు పెట్టుకొని రెబెకాను చూచి ఇలా అన్నాడు:

'ఇదిగో పిల్లా! నిన్ను చూస్తే నాకిప్పుడు జాలిగా ఉన్నమాట నిజమే. కాని, దానికి కారణం నీ మంత్రతంత్ర ప్రయోగమే అయితే, నిన్ను బొత్తిగా క్షమించడానికి వీల్లేదు. నా జాలికి కారణం అది కాదనే అనుకుంటున్నాను. ఇంత చక్కని రూపం ఇట్టి పాపిష్ఠి గుణాలకు నిలయమయిందేమా అనే మానవసహజమైన చింతయే ఈ జాలికి కారణమని చెప్పాలి. మంచిది! నీవు బాగుపడ దలచుకుంటే, పశ్చాత్తాపపడు! నీ మంత్రతంత్రాలకు స్వస్తి చెప్పు! ఇదిగో ఈ పవిత్రదండాన్ని స్పృశించు. నీకు మేలు కలుగుతుంది. క్రైస్తవ సన్యాసినివై, అయా పవిత్రానుష్ఠానాలద్వారా నీ జీవితాన్ని చక్కదిద్దుకో! బ్రతక దలచుకొంటే అదొకటే మార్గం. నీ 'మోషే' (యూదుల ప్రవక్త) ధర్మం నిన్ను ఉద్ధరించదు.'

'మోషేధర్మమే పరమధర్మమని మా విశ్వాసం. సినాయ్ పర్వతం మీద ఉరుములూ మెరుపులూ పిడుగులమధ్య భగవంతుడు ప్రసాదించిన ధర్మమది. భగవంతునిచే ఆ ధర్మం దరిమిలా ఉపసంహరించుకోబడిందని మీ క్రైస్తవు లంటారు. మా పెద్దలది ఒప్పుకోరు'—అని సమాధానమిచ్చింది రెబెకా.

సర్వాధికారి ఆమెకింకా నచ్చచెప్పి క్రైస్తవధర్మం బోధించడానికి ప్రయత్నించబోగా ఆమె వారించి,—'క్షమించండి! నేను పండితురాలను కాదు. మీ మతాన్ని గూర్చి వాదానికి దిగగలిగే ప్రజ్ఞ నాకు లేదు. కాని, నా మతంకోసం ప్రాణాలర్పించవలసివచ్చినా ఒప్పించగలను. దయచేసి నా సవాలుకు ఏమి సమాధానమిస్తారో ఇవ్వండి'—అన్నది.

సర్వాధికారి ఆమె తనముందుకు విసరిన గ్లోవును పరిశీలించి చూచాడు. అది సిల్కు గ్లోవు. 'ఇదిగో రెబెకా! నీవు చాలా సాహసానికి ఒడిగట్టుతున్నావు. మా టెంపుల్ సంస్థనే సవాలు చేస్తున్నావనే సంగతి గుర్తుంచుకో! ఈ సిల్కు గ్లోవుతోనా, మా టెంపుల్ యోధుల ఉక్కు గ్లోవుపై నీ సవాలు?'—అని అతడు రెబెకాను హెచ్చరించాడు.

'నా సిల్కు గ్లోవును మీరంత తేలిక చేయనక్కరలేదు. దాన్ని నా నిర్దోషిత్వంతో పాటుగా తక్కెడలో పెట్టి తూస్తే, మీ ఉక్కు గ్లోవు కంటే ఎక్కువ బరువే తూగుతుంది'— అని సమాధానమిచ్చింది రెబెకా.

'అయితే నీవు నీ నేరం ఒప్పుకో దలచలేదన్నమాట! సవాలే చేయ నిశ్చయించుకున్నావు. అంతేనా?'—అని అడిగాడు సర్వాధికారి.

'అవును'—అని జవాబిచ్చింది రెబెకా.

'మంచిది. అలాగే జరుగుగాక! భగవంతుడే న్యాయనిర్ణయం చేయగలడు' అన్నాడు సర్వాధికారి. 'ఆమెన్!'—అన్నారు ప్రిసెప్టర్లు. హాలంతా 'ఆమెన్' శబ్దంతో మారుమ్రోగిపోయింది.

రెబెకా సవాలును సర్వాధికారి త్రోసిపుచ్చి ఉండేవాడే. కాని, త్రోసిపుచ్చడం తమ సంస్థ శాస్త్రానికే చిన్నతనంగా తోచిందతనికి. పైగా, ఆమె కోరిక తమ సంస్థ నియమ నిబంధనల కనుగుణమైనదే కాని, వేరు కాదు. నిస్సహాయస్థితిలో ఉండి ఆమె ఆ సదవకాశం వినియోగించుకోదలచినప్పుడు, వద్దనడం భావ్యం కాదు. ఆమె కోరిన ప్రకారం ఆమె నిర్దోషిత్వ మిప్పుడు యుద్ధపద్ధతి ననుసరించి రుజావు కావలసి ఉంది. ఆమె తరఫున ఎవరు పోరాడేది? ఎవరో ఆమె యిప్పుడు చెప్పలేదు. అది యెలా వున్నా, తమ తరఫున పోరాడగల యోధుడెవరో నిర్ణయించి వానికా గ్లోవు అందజేయవలసి ఉంది. ఎవరిని నిర్ణయిద్దామనే ప్రశ్న రాగా, బ్రయన్‌ను నిర్ణయించడమే సముచితంగా ఉంటుందన్నాడు ప్రిసెప్టరు హెర్మన్. బ్రయన్ మంత్రతంత్రాధీనమై ఉన్నాడని సంశయించ పని లేదనీ, భగవన్నిర్ణయానికై జరిగే పోరులో ఏ మంత్రతంత్రాలూ మన యోధునిపై పని చేయజాలవనీ వాదించాడు. అదును నిజమేనని అంగీకరించి, సర్వాధికారి ఆ గ్లోవును బ్రియన్‌కు ఇమ్మని మాల్వాయిసిన్ చేతికిచ్చాడు. మూడోనాటి కల్లా రెబెకా తన యోధుణ్ణి తెచ్చుకోవాలని ప్రకటించాడు.

ఆ వ్యవధి చాలదని చెప్పుకున్నది రెబెకా. కాని, నాలుగో రోజున తాను వేరొక చోటికి పోవలసి యున్నదనీ, ఈ యుద్ధ పరిష్కారం తన సమక్షంలోనే తేలిపోవాలనీ, వ్యవధి పెంచబడదనీ, సర్వాధికారి అన్నాడు. 'అయితే అలాగే కానివ్వండి. భగవంతుడే నాకు దిక్కు. ఆయన రక్షించదలచుకొంటే ఒక్క క్షణం చాలు'—అన్నది రెబెకా.

పోరాటం జరిగే స్థలం ఇక నిర్ణయించవలసి ఉంది. ఈ విషయం మాల్వాయిసిన్‌తో సంప్రదించగోరి సర్వాధికారి అతనికోరకు కలయజూచాడు. మాల్వాయిసిన్ బ్రయన్‌తో నెమ్మదిగా ఏదో మాట్లాడుతున్నాడు. రెబెకా గ్లోవు ఇంకా అతని చేతిలోనే వుంది. 'ఏం, గ్లోవు పుచ్చుకో నంటున్నాడా?' అని అడిగాడు సర్వాధికారి. 'ఆc, ఆc, పుచ్చుకుంటాడు, పుచ్చుకుంటాడు' అంటూ మాల్వాయిసిన్ ఆగ్లోవును తన ఉడుపులోపల చప్పున దాచి వేసి,—'యుద్ధం మన ప్రిసెప్టరీకి చెందిన సెంటు జార్జి తాలింఖానాలో ఏర్పాటు చేస్తే బాగుంటుంది'—అన్నాడు. 'మంచిది అలాగే చేద్దాం. రెబెకా నేరం రుజువైతే మరణశిక్షకూడా అక్కడే వెంటనే అమలు జరగాలి'—అన్నాడు సర్వాధికారి.

ఈ నిర్ణయాలన్నీ లిఖితపూర్వకంగా క్రోడీకరించబడి సభలో చదువబడ్డాయి. 'భగవంతుడు న్యాయం పాలించుగాక!'—అనే వాక్యంతో ఆ తీర్పు ముగించబడింది. 'ఆమెన్!' అన్నాడు సర్వాధికారి. సభ అంతా 'ఆమెన్' అంది. రెబెకా మౌనముద్రతో చేతులు జోడించి, ఊర్ధ్వ దిశగా చూస్తూ ఇంచుక సేపు నిలబడింది. పిమ్మట సర్వాధికారివంక చూచి, తన మిత్ర వర్గానికి తన పరిస్థితి తెలియజేసుకోవలసి ఉన్నది గనుక, వార్తాహరులను యథేచ్ఛగా పంపుకునే అవకాశ మివ్వించాలని కోరింది. సర్వాధికారి సరే నని, 'ఎవరిని వార్తాహరునిగా ఏర్పాటు చేసుకుంటావో చేసుకో, నిరభ్యంతరంగా వాడు నీ వద్దకు వచ్చిపోతూ ఉండవచ్చు'—అన్నాడు.

రెబెకా ఆ హాలంతా ఒకసారి కలయజూచి, 'ఆపత్తులో ఉన్న యూదీనురాలి కబురు తీసుకు వెళ్ళడానికి ముందుకురాగల ధర్మాత్ములు ఈ సభలో ఏ ఒక్కరూ లేరా? ఊరకే చేయనక్కరలేదు, కావలసిన ధన మివ్వబడుతుంది'— అన్నది.

కాని, ఎవ్వరూ అలా ముందుకు రాలేదు. అది యూదీయమతమునందు పక్షపాతంగా సర్వాధికారి యెంచుతాడేమోనన్న భయమే ఎవరినిముట్టుకు వారి కుంది. ధనమునందు ఆశకూడా వారిని కదల్చలేకపోయింది. రెబెకా కొద్ది క్షణాలు ఆదుర్దాగా నలుదెసలు పరికించి, 'ఇంతేనా? ఘోరాతిఘోరమైన నేరాలు చేసినవాళ్ళకుకూడ ఇలాంటి సమయాల్లో సాయపడడం ధర్మకార్యంగా ఎంచబడుతూ ఉంటుంది! నాకు అలా సాయపడగలవారు ఈ ఇంగ్లాండు దేశంలో ఒక్కరుకూడ లేరా?'—అని ప్రశ్నించింది.

పక్షవాతరోగి హిగ్ కొంతసేపటికి ఇలా అన్నాడు: 'నేను కట్టి అవిటి వాణ్ణి, అయితే, ఈమాత్రంగానైనా తిరగ గలుగుతున్నానంటే ఆమె దయవల్లనే' అంటూ, రెబెకా నుద్దేశించి, 'అవిటి వాణ్ణి అయినప్పటికీ నా చేతనైనంతగా నీకు సాయంచెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. ఇదివరలో, నా నాలుక, నీ ఉదారబుద్ధిని ఉగ్గడించి నీకు అపకారం చేసింది. అపకారం జరుగుతుందని తెలుసుకోకుండా నీ మంచితనాన్ని గూర్చి అలా ఉగ్గడించాను. ఇప్పుడు, నాలుక చేసిన ఆ అపకారం సరిదిద్దడానికి కాళ్ళు వేగిర పడుతున్నాయి. సంతోష పూర్వకంగా నీవు చెప్పిన పని చేస్తాను'—అన్నాడు.

'భగవంతుడే సకలానికీ ఏలుగడ. ఆయన సంకల్పిస్తే ఎంత దుర్బలమైన పరికరమైనా శక్తిమంతంగానే పనిచేస్తుంది. డేగవలన సాధించవలసిన పని నత్త ద్వారాకూడా అతడు సాధించగలడు. మా నాన్న ఇసాక్‌ను ఎలాగైనా నీవు కలుసుకొని ఈ చీటీ అందజెయ్యాలి. బాడుగగుర్రంమీద వెళ్ళు. గుర్రానికీ, గుర్రపు రౌతుకూ ఇదిగో బాడుగడబ్బు. త్వరగా వెళ్ళు. నా తరఫున పోరాడగల యోధుడు తప్పక లభించగలడనే అనిపిస్తోంది. ఈ దుర్మరణం పాలయ్యే దుర్యోగం నాకు లేదని నా లోపల యెవరో చెప్పుతున్నట్లుగా ఉంది. పో, వెళ్ళు! నీ కార్యోత్సాహంమీద నా చావుబ్రతుకు లాధారపడి ఉన్నాయి'—అన్నది రెబెకా.

హీబ్రూభాషలో ఏవో కొన్ని పంక్తులు వ్రాయబడ్డ ఆ చీటీ తీసుకుని హిగ్ బయలుదేరాడు. అందులో మంత్రాలుంటాయి, నీవు వెళ్ళవద్దని అక్కడ ఉన్నవాళ్ళు చాలామంది అతన్ని నిరుత్సాహపరిచారు, కాని అతడు వినిపించుకో లేదు. తన ప్రాణాలు రక్షించిన రెబెకాకు ఎలాగైనా ప్రత్యుపకారం చేసితీరాలని అతని నిశ్చయం.

అదృష్టవశాత్తూ, అతనికి ఆట్టే శ్రమలేకుండానే కావలసినపని జరిగిపోయింది. ప్రిసెప్టరీనుంచి ఒకటి రెండు ఫర్లాంగులదూరం వెళ్ళేసరికల్లా, ఇసాక్, నాథన్ బెన్‌లు అతనికి ఎదురైనారు. ప్రిసెప్టరీలో మంత్రగత్తె నెవతెనో విచారణ చేస్తున్నారని తెలిసి వారు బయలుదేరివచ్చారు. తన కుమార్తెనే ఆ మంత్రగత్తెగా ప్రచారంచేసి విచారణ చేస్తున్నారనే గట్టి అనుమానం ఇసాక్‌కు ఉంది. అదే నాథన్ బెన్‌తో చెప్పుకొని గోలపెడుతున్నాడు. నాథన్ బెన్ అనేక విధాలుగా అతని నోదారుస్తున్నాడు. చంకకర్రలు ఊతగాగొని నడుచుకుంటూ వచ్చిన హిగ్, ఇసాక్‌ను గుర్తుపట్టి, రెబెకా యిచ్చిన చీటీ అతనిచేతి కందించాడు. అందు వ్రాసివున్నది చదివీ చదవడంతోటే, అతడు నోట మాటలేక, చావబో తున్నవాడిలాగా కంచరగాడిదమీదనుంచి క్రిందకు పడిపోయాడు.

నాథన్ బెన్ అదరాబాదరాగా క్రిందికి దిగి ఇసాక్‌కు చేయవలసిన ఉపచారాలు చేయ మొదలుపెట్టాడు. ఇంతలో ఇసాక్‌కు తెలివివచ్చింది. నెత్తి

బాదుకొని, ముఖాన దుమ్ము కొట్టుకోడం సాగించాడు. ఇదేమైన పిచ్చితనమేమో అనుకున్నాడు నాథన్ బెన్ మొట్టమొదట. కొంతసేపటికి గాని ఇసాక్ విపరీత చేష్టలకు అసలు కారణం అతనికి తెలియలేదు. ఇసాక్ రెబెకాను తలపోసుకొని బిగ్గరగా ఏడుస్తూ, భగవంతుణ్ణే దూషించడం మొదలుపెట్టాడు. నాథన్ బెన్ అతనిని మందలించి, 'రెబెకాకు ఏమైందేమిటి? బ్రతికిఉన్నదా ?'— అని అడిగాడు.

'బ్రతికే ఉంది. కాని, ఈ క్రైస్తవ పాతకులు చంపెయ్యబోతున్నారు. అయ్యో నాబిడ్డ! ఇక నేనెలా బ్రతకడం? నా బిడ్డను మృత్యుదేవత మింగెయ్యడానికి సిద్ధంగా ఉంది. ఏమిటి గతి!'— అని వాపోవజొచ్చాడు ఇసాక్.

నాథన్ బెన్, ఇక ఇది పని గాదనుకొని, ఇసాక్ చేతిలోని చీటీ తీసుకొని చదువ మొదలుపెట్టాడు. అందులో ఇలా ఉంది:

'నాన్నగారూ, నేనిప్పుడు తప్పనిసరిగా చావవలసి వచ్చేటట్లున్నది. కారణమేమో నాకే తెలియడంలేదు. మంత్రగత్తెననే నేర మొకటి మోపారు. ఈ అపాయం తప్పడానికి ఒకటే మార్గముంది. నాతరపున కత్తి బల్లెమూ పట్టి టెంపుల్‌స్టో తాలింఖానాలో పోరాడగల యోధాగ్రేసరుడు కావాలి. అవ తెల్లుండికల్లా అతడు వచ్చి నిలబడవలసివుంటుంది. అలా జరగకపోతే, నా ఆశ ఇక వదులుకోవలసినదే. కనుక, వెంటనే తగు ప్రయత్నం చెయ్యవలసినది. ఐవాన్‌హో అని పిలవబడే సెడ్రిక్ కుమారుడు విల్ఫ్రెడ్ నా తరపున యోధుడుగా నిలిచి పోరాడితే పోరాడవచ్చు. కాని, కవచం ధరించగల స్థితిలో అతని ఆరోగ్యమిప్పుడు ఉన్నదో లేదో! అయినా, అతనికి కబురు చెయ్యవలసినది. అతడు సరియైన స్థితిలో లేకపోతే, ఇంకెవరినైనా నాతరపున పోరాడగలవారిని చూడగలడు. ఆ విల్ఫ్రెడ్‌తో మరీ మరీ చెప్పు— రెబెకా నిర్దోషురాలని. ఏ నేరం ఆమెపై మోపబడిందో అది ఏమాత్రమూ ఆమెయందు లేదని స్పష్టం చెయ్యి. ఈ నీ కుమార్తెను నీవు కోల్పోవడమే దైవేచ్ఛ అయినట్లయితే, ఈ నిర్ఘృణదేశంలో నీవిక ఉండబోకు. కార్డోవాలో తురుష్క రాజ్యంలో నైనప్పటికీ సుఖంగా కాలక్షేపం చేస్తున్న నీ సోదరుని వద్దకు చేరుకో. ఈ ఇంగ్లీషు క్రైస్తవులకంటె ఆ తురుష్కులే చాలా నయం.'

ఉత్తరమంతా తిరిగి ఒకసారి విని, ఇసాక్ ఏడ్పులూ పెడబొబ్బలూ మరల మొదలుపెట్టాడు. గుడ్డలు చింపుకుంటున్నాడు. దుమ్మెత్తి నెత్తిమీద పోసుకుంటున్నాడు. 'అయ్యో కూతురా, అయ్యో కూతురా' అని అదేపనిగా వాపోతున్నాడు.

నాథన్ అతనికి ధైర్యం చెప్పి, వెంటనే విల్ఫ్రిడ్‌ను అన్వేషించవలసిన అవసరాన్ని గుర్తుకు తెచ్చాడు. సింహవిక్రముడని పేరుగాంచిన రిచర్డురాజు ఇంగ్లాండు తిరిగి వచ్చాడని చెప్పుకుంటున్నారనీ, అదే నిజమైతే, రిచర్డుకు అభిమానపాత్రుడైన ఐవాన్‌హో ఒకవేళ కత్తిపట్టి పోరాడేస్థితిలో లేకపోయినా, రెబెకాను విడుదల చేయవలసిందిగా ఈ టెంపుల్ అధికారులను ఆదేశిస్తూ రిచర్డు రాజువద్దనుంచి ఉత్తరం సంపాదించవచ్చుననీ చెప్పి ఉత్సాహపరిచాడు. ఐవాన్‌హో ఒకవేళ అశక్తస్థితిలో ఉన్నా, నీవు సాయపడగల ఇతర క్రైస్తవు లనేకమంది ఉండవచ్చు, నీ దగ్గిర ధనముండగా దిగులుపడతా వెందుకన్నాడు. నీవు విల్ఫ్రిడ్‌ను కలుసుకోడానికి వెళ్లు, నేను యార్కునగరం వెళ్ళి అక్కడ మంచి యోధులెవరైనా రెబెకా తరపున పోరాడగలరేమో విచారిస్తానన్నాడు. నీ తరపున నేను వారికి చేసే వాగ్దానాలు చెల్లిస్తావుకదా అని అడిగాడు.

'ఓ తప్పకుండా! ఈ ఆపత్సమయంలో, భగవంతుని దయవల్ల నన్ను ఆదుకునేవాడే దొరికితే, అంతకంటె ఏమికావాలి? అయినప్పటికీ, వారడిగిన దంతా ఇస్తానని వెంటనే ఒప్పుకోకు. ఈ జాతి యోధులాంటిదంటే, అడగటం మటుకు పొన్ను అడుగుతారు. పుచ్చుకోడం కొన్నైనా పుచ్చుకుంటారు. అయినప్పటికీ నీ యిష్టంవచ్చినట్లు బేరం చెయ్యి. నేనేమీ అభ్యంతర పెట్టను. నా ప్రాణానికి ప్రాణమైన రెబెకా పోయిన తర్వాత ఈ బంగారమంతా నేనేం చేసుకుంటాను?'—అన్నాడు ఇసాక్.

'సరే, ఇక నే వెళ్ళొస్తాను. నీకు శుభం కల్గుగాక!'— అన్నాడు నాథన్. ఉభయులూ ఆలింగనం చేసుకొని, విడివడి చెరియొక మార్గానా వెడలిపోయారు.

అవిటివాడైన హిగ్, వారిపైపే చూస్తూ కొంతసేపటివరకూ అచటే నిలబడ్డాడు. ఆతనికి కష్టంగా ఉంది, తన సంగతి వాళ్లు పట్టించుకోకుండా ఎవరినో కానివాని చూచినట్లు చూచి వెళ్లిపోయారని. తానింత చేసినందుకు ఒకటో రెండో నాణేలు తనమీద విసిరిపోగూడదా అనుకున్నాడు. రెబెకా కొంత డబ్బు తనకిచ్చినమాట నిజం. కాని అది ఏమూలకు! రేపు ఈస్టరులో తన పాప ప్రాయశ్చిత్తంకొరకు ఫాదరీ దగ్గిరకుపోతే, యూదులకు వార్తాహరుడుగా పనిచేసినందుకు గాను ఇంతకు రెట్టింపు డబ్బు తను సమర్పించుకోవలసివస్తుంది. ఈ పని నీవు పెట్టుకోవద్దనుమా యని చాలామంది అక్కడ తనకు చెప్తూనే వచ్చారు. కాని, రెబెకా సమక్షంలో తాను నిజంగా నే మంత్రముగ్ధునివలె అయిపోయాడు. ఆమెలో నిజంగా ఏదో ప్రభావముంది. ఆమెకు కావలసిన పని చేసిపెట్టకుండా ఎవరూ ఉండలేరు. ఏది ఏలా ఉన్నప్పటికీ ఒకటిమాత్రం స్పష్టం. ఆమె తలపునకు వచ్చినప్పుడల్ల, ఆమె ప్రాణరక్షణకు తన సర్వస్వం త్యాగం చెయ్యాలనే భావం తనకు కలుగుతూ ఉంటుంది.

# అధ్యాయం ౪౦

నాటి సాయంసంధ్యవేళ, రెబెకా బంధించబడి ఉన్న గది తలుపు మెల్లిగా ఎవరో తట్టిన చప్పుడైంది. రెబెకా దైవప్రార్థన చేసుకుంటున్న సమయమది. యూదుల పూర్వౌన్నత్యం తలపునకు తెచ్చుకొని, ప్రస్తుత దైన్యస్థితిని వెళ్లబోసుకుంటూ, దైవానుగ్రహంకోసం ఆరాటం ప్రకటించే ప్రార్థన గీత మొకటి ఆమె భక్తిప్రపత్తులతో పాడుతుంటోంది. అందుచే, తలుపుతట్టిన చప్పుడామెకు మొదట్లో వినిపించలేదు. పాట ముగిసిన పిమ్మట, తిరిగి మెల్లిగా తలుపుదగ్గిర చప్పుడయింది. రెబెకా అది విని,—'ఎవరది? నాకు మిత్రులే అయితే, లోనికి దయచేయండి. కాక శత్రువులైతే, రావద్దని నేను అన్నా ప్రయోజనంలేదు' అన్నది.

టెంప్లార్ బ్రయన్ తలుపు తెరచుకొని లోనికి ప్రవేశిస్తూ—'నీకు నేను మిత్రుణ్ణో శత్రువునో ఈ సమావేశాన్ని బట్టి తేలాలి'— అని పలికాడు.

రెబెకా చకితయై వెనుకడుగు వేసి గదిమూలకు చేరింది. అంతకంటె ఇంకా వెనుకకుపోయే అవకాశం లేదుగనుక అచటనే నిలిచిపోయింది. కాని, ఆమె వైఖరిలో భయ విహ్వలత్వం కానరాలేదు. అవసరమైతే నిలిచి ప్రతిఘటించే మనోనిశ్చయం ప్రకటితమవుతుంది. సాధ్యమైనంతవరకు అతనిని రెచ్చగొట్టకుండా ఉండడానికే ప్రయత్నించి, ఇక తప్పనిసరియైతే, తన యావచ్ఛక్తితోనూ అతని బలాత్కారాన్ని ఎదిర్చడానికి కృతనిశ్చయురాలై ఉన్నట్లు కనుపించిం దామె ధోరణి.

'భయపడ నవసరంలేదు రెబెకా! ముఖ్యంగా ఇప్పటి పరిస్థితిలో, నా వలన నీకు ఎలాటి భయమూ ఉండబోదు'— అన్నాడు బ్రియన్.

'నేనేమీ భయపడడం లేదు నిన్ను చూచి. నా ఆత్మవిశ్వాసమే నాకు అండ'— అన్నది రెబెకా. అన్నదేగాని, పైకి చెప్పినంత ధీరత్వం లోపలలేదని ఆమె ఉచ్చారణవైఖరి స్పష్టం చేస్తూనే ఉంది.

'పూర్వంలాగా నిన్ను నేను బలాత్కరిస్తాననే అనుమానం నీ కుండ నక్కరలేదు. దగ్గరలోనే కావలివారున్నారు. నీవు కేక వేస్తే చాలు, పరుగెత్తుకొనివస్తారు. వారిపై నాకు యెట్టి అధికారమూ లేదు. నిన్ను మృత్యుముఖానికి నడిపించుకుపోయేందు కేర్పాటు చేయబడ్డవారే. అయినా, నా చేత గాని మరెవ్వరిచేత గాని, నీవు అవమానితురాలవు కావడం ఎంతమాత్రమూ సహించరు'—అని పరిస్థితిని మరింతగా స్పష్టపరిచాడు బ్రయన్.

'భగవంతుని దయవల్ల, ఈ నరకకూపంలో నాకు మృత్యుభయమే అంత రించిపోయింది'—అన్నది రెబెకా.

'అవును,—మృత్యువును హఠాత్తుగా నరాసరి ఎదుర్కొనవలసి వచ్చే పరిస్థితిలో, ధీరులకు మృత్యుభయం ఉండదు. ఏ కత్తి దెబ్బో ఏ బల్లెపుపోట్లో తినడమంటే నేనెంతమాత్రమూ భయపడను. అలాగే నీవు కూడా, హఠాత్తుగా ఏ బాకుపోటో అలుగు దెబ్బో తినవలసి వస్తుందంటే జంకవు. కాని, మాన మర్యాదలు కోల్పోయి అవమానం పాలు కావడానికి మాత్రం మన మిద్దరమూ జంకుతాము. మానాభిమానాలు ఒక రకంగా విచిత్రమైనవి నీకుంటే, మరొక రకంగా విచిత్రమైనవి నాకున్నాయి. కాని మొత్తంమీద, వాటి కోసమై ప్రాణాలు అర్పించవలసివస్తే, అందుకు మన ముభయులమూ కూడ వెను తీయము'—అన్నాడు బ్రియన్.

'నిర్భాగ్యుడా, నీకూ నాకూ పోలికలేదు. యుగ యుగాల సుస్థిరమైన పునాదిపై నిర్మించబడిన దృఢసంకల్పసౌధం నాది. నీది అలాంటిది కాదు. ఏ క్షణాన అయినా కూలిపోవచ్చు'—అన్నది రెబెకా.

'ఈ వాగ్వాదంవల్ల ప్రయోజనంలేదు రెబెకా! ఒక సంగతి గుర్తుంచుకో. నీ వనుభవించబోయేది ఆకస్మిక, అనాయాసమరణం కాదు. నెమ్మది నెమ్మదిగా విపరీతమైన యాతన ననుభవిస్తూ మరణించవలసి ఉంటుంది. ఈ మూఢ విశ్వాస పరుల పైశాచిక బుద్ధికి ఏ నేరం చేసినట్లు నీవు కనిపిస్తున్నావో, దానికి అను రూపమైన మరణం అదేనని వీరి విశ్వాసం'— అన్నాడు బ్రయన్.

'అలాంటి ఘోరమరణం నాకు ప్రాప్తిస్తోందంటే, దానికి కారణం ఎవ్వరు? స్వార్థపూరితమైన పశువృత్తితో, నన్నిక్కడికి లాక్కొనివచ్చి ఈ ప్రమాదంలో పడవేయడమే కాక, పైపెచ్చు దానినిగూర్చి వన్నెలు చిన్నెలతో వర్ణింప జూస్తున్న నీవు కాదా'?— అని అడిగింది రెబెకా.

'అలా ఎన్నడూ అనుకోకు రెబెకా! నీ ప్రాణానికి నా ప్రాణం అడ్డం వేసి కాపాడడమే నా కెప్పుడూ అభిమతం. ఇదివరలో, అలా నీమీదికివచ్చి పడే బాణాలనుండి నిన్ను కాపాడినసంగతి నీకు తెలుసు. ఇప్పటి ప్రమాదం నుండికూడా అలాగె నిన్ను కాపాడడమే నా అభీష్టం'—అన్నాడు బ్రియన్.

'కేవలం ఆర్తత్రాణపరాయణబుద్ధితోనే నీవు నన్ను అలా కాపాడి యున్నట్లయితే, నీకు ఎంతో కృతజ్ఞురాలనై యుండేదాన్ని. కాని అలా జరగలేదు. ఏ స్వార్థంకోరి నీవు నన్ను కాపాడావో అది నెరవేర్చడానికి బ్రతికే బ్రతుకుపై నాకెంతమాత్రమూ ఇష్టంలేదు'—అన్నది రెబెకా.

'దయచేసి నన్నిక నిందించబోకు రెబెకా! నా మనసు అసలే దుఃఖంతో కుమిలిపోతోంది. నీ నిందలతో నన్ను మరింత దుఃఖితుణ్ణిగా చెయ్యకు'— అన్నాడు బ్రియన్.

'అయితే ఇప్పుడు నీ ఉద్దేశమేమిటి? త్వరగా తేల్చిచెప్పు. నీమూలాన సంభవించిన ఈ వేదన తప్పేటందుకు నీ వలన అయ్యేది ఏమైనా ఉంటే అదేమిటో తెలియజెయ్యి! నాకు వ్యవధి చాలా తక్కువగా ఉంది. భయంకరమైన యీ స్వల్ప వ్యవధిలోనూ నా దారుణ విధి నెదుర్కోడానికి నేను సిద్ధంకావాలి' అన్నది రెబెకా.

'అదిగో, నన్ను నీవింకా నిందించడం మానలేదు. ఎంతో సంతోష పూర్వకంగా నీ కష్టాలు నేను నివారించి యుండేవాణ్ణి'—అన్నాడు బ్రియన్.

'నిందించనే అనుకో! కాని, నేనిప్పుడు మృత్యువు పాలౌతున్నానంటే, దానికి కారణం నీ కామాంధత కాదా? ఇది నీవు ఎన్నటికైనా కాదనగలవా?' అని అడిగింది రెబెకా.

'పొరపాటు రెబెకా పొరపాటు! ఇది ఇలా పరిణమిస్తుందని నేనూహించలేదు. ఆ ముసలిముచ్చు తలవని తలంపుగా ఇక్కడ ప్రత్యక్షమైనాడు. నేనేమి చెయ్యడానికీ వీలులేకపోయింది'— అన్నాడు బ్రియన్.

'ఏమీ చెయ్యలేకపోయినా, నేను నిర్దోషినని తెలిసి ఉండీకూడ, దోషినని తీర్పు యివ్వడంలో నీవుకూడా భాగస్వామివైనావు. అన్నట్లు, నా దోషం రుజువుచేసి, నా శిక్ష ఖాయపరచడానికి ఇక స్వయంగా యుద్ధ సన్నద్ధుడవౌతావు కాబోలు!'— అన్నది రెబెకా.

'సహనం వహించు రెబెకా! అది మీ జాతికి అలవాటైన విద్యయే కాని క్రొత్తది కాదు. సమయానుకూలంగా సంచరించి, ప్రతికూలపరిస్థితులను అనుకూలంగా మార్చుకోగల నేర్పు మీవాళ్లకున్నది'— అన్నాడు బ్రియన్.

'ఏ దురదృష్టపు ఘడియలో అబ్బినదో ఈ సహనవిద్య మా యూదు జాతికి! విపరీతమైన కష్టాలే ఇందుకు కారణం. అగ్ని ఎలాంటి ఉక్కునయినా వంచేస్తుంది. అలాగే, కష్టాలు ఎంత నిబ్బరపు గుండెనయినా వంచేస్తాయి— స్వతంత్రత విడనాడి పరాయివాళ్ల కాళ్ళముందర మోకరిల్లవలసి వస్తుంది. ఇదీ మా జాతికి పట్టిన దురదృష్టం. కాని, సర్వస్వతంత్రుడనని విర్రవీగే నీవుచేసిన దేమిటి సర్ బ్రియన్! నీకు విశ్వాసము లేకపోయినా, ఇతరుల మూఢవిశ్వాసాలకు తలఒగ్గావు. ఆహా, ఏమి స్వతంత్రత!'—అన్నది రెబెకా!

బ్రియన్ చికాకుతో గదిలో ఇటూ అటూ పచారుచేస్తూ ఇలాఅన్నాడు: 'ఇదుగో రెబెకా! నీతో వాదులాడుతూ కూర్చోడానికి కాలేదు నేనిక్కడికి!

ఈ బ్రియన్ మానవమాత్రుడెవ్వరికీ లొంగేవాడు కాదని తెలుసుకో! పరిస్థితులను బట్టి తన పద్ధతిలో కొంత మార్పు చేసుకుంటే చేసుకోవచ్చు. అతని సంకల్ప మొక కొండవాగువంటిది. అడ్డంవచ్చిన కొండను తప్పించుకోడానికి తాత్కాలికంగా కొంత వెనుకకు మళ్ళినా, సముద్రంవైపు తన ప్రయాణం విరమించదు. యుద్ధపద్ధతి కోరుకోమంటూ నీకు చీటీ అందజేసిన దెవరో తెలుసునా? నీ విషయంలో ఆదుర్దా ఎవరికి పట్టుకుంది, నాకు కాకపోతే?'

'కావచ్చు. కాని, ఏమి లాభం చేకూరింది? మృత్యువు వెంటనే వచ్చి మీద పడకుండా ఇంచుక విరామం కలిగింది—అంతే! నా దుఃఖాని కంతకీ కారకుడవైన నీవు నాకోసం చేయగలిగినదంతా ఇదేనా?' అని అడిగింది రెబెకా.

'కాదు. నేనింకో పనికూడా చెయ్యాలనుకున్నాను. కాని, ఆ పాడు హోర్మన్ నా పథకం చెడగొట్టాడు. శౌర్య సాహస ప్రకటనావకాశంకోసం మారువేషంతో తిరుగాడే ఒక ఆగంతుక యోధునివలె చిట్ట చివరి నిమిషంలో మారువేషంలో వచ్చి నీతరఫున యోధునుగా పోట్లాడుదామనుకున్నాను. ఇక్కడి టెంప్లార్లలో, ఒక్కరిని కాదు, ఇద్దరు ముగ్గురిని సర్వాధికారి నాపై ప్రయోగించినా, ఒకే బల్లెంతో వారినందరినీ పడగొట్టి, తద్వారా నీ నిర్దోషిత్వాన్ని రుజువుచేద్దామనుకున్నాను. అలా చేస్తే, నాయందు కృతజ్ఞతతో, నావిజయానికి తగినట్లు నన్ను నీవు బహూకరిస్తావని నా ఆశ'—అన్నాడు బ్రయన్.

'ఎందుకీ దర్పోక్తి సర్ బ్రియన్! ఏదో జరిగి ఉండకపోతే ఏదో చేసి ఉండేవాణ్ణని, ఈ వృథా ప్రసంగం చేసినందువల్ల ప్రయోజనంలేదు. నా సవాలు నంగీకరించి, నా గ్లోవు స్వీకరించావు. ఈ దురదృష్టవంతురాలితరఫున పోరాడగల యోధుడెవరైనా ఆ సమయానికి దిగితే, అతనితో నీవెలాగూ పోరాడకుండా ఉండవు. అయినా, నాకు ఆప్తునివలెనూ, రక్షకునివలెనూ మాట్లాడడం చూస్తే ఆశ్చర్యంగా ఉంది'—అన్నది రెబెకా.

'అలా కాదు రెబెకా! ఇప్పటికీ నీకు నేను ఆప్తుణ్ణిగా, రక్షకుణ్ణిగా రుజువుచేసుకోవాలనే కోరుతున్నాను. లోకంలో ఎంతటి అగౌరవానికి, ఎంతటి అప్రతిష్ఠకు సిద్ధపడితే నేనాపని చేయగలుగుతానో తెలుసునా? అయినా, నీ కోసం నేను నా సర్వస్వం త్యాగం చెయ్యడానికి సిద్ధంగా ఉన్నాను. కాని ఒక్క షరతు. ఇలా షరతు విధిస్తున్నానని నాపై కోపగించవద్దు'—అన్నాడు బ్రయన్.

'నీవు చెప్పేది నాకేమీ అర్థం కావడంలేదు. ఏమిటో స్పష్టంగా చెప్పు'—అంది రెబెకా.

'ఆఁ, చెప్తాను విను, అవతెల్లుండి జరగవలసిన యుద్ధానికి నేను గనుక హాజరు కాకపోతే, నా పరువు ప్రతిష్ఠలు భ్రష్టమైపోతాయి. టెంప్లార్లలో నాకుగల గౌరవమర్యాదలన్నీ కోల్పోతాను. సర్వాధికారి స్థానం ఆక్రమించాలని నేను పెట్టుకున్న ఆశలన్నీ నేలగూలిపోతాయి. ఇదీ నాకు చేకూరగల ఫలితం. నేను గనుక రేపటియుద్ధంలో నీకు వ్యతిరేకంగాక త్రికట్టని పక్షంలో. ఆ పాడు హెర్మన్ తెచ్చిపెట్టాడీ బెడద! అల్బర్ట్ మాల్వాయిసిన్నొకడు అడ్డంవచ్చి నన్ను నివారించాడు గాని, లేకపోతే, నీ గ్లోవును తిరిగి ఆ సర్వాధికారి ముఖంమీదికే విసరికొట్టుదామనుకున్నాను. న్యాయాధికారిట న్యాయాధికారి! నీ వంటి మనస్వినిమీద — నీవంటి సౌందర్యరాశిమీద — అసంబద్ధపు నేరం మోపి విచారణచేసిన వీడేమి న్యాయాధికారి!'— అన్నాడు బ్రయన్.

'ఈ పొగడ్తవల్ల ఏమీ ప్రయోజనంలేదు సర్ బ్రియన్! నీ నిర్ణయం ఇదివరకే జరిగిపోయింది. ఒక నిర్దోషురాలు చచ్చిపోయినాసరే, నీ పేరు ప్రతిష్ఠలు నీకు దక్కితే చాలుననుకున్నావు. నీ వాశించిన అధికారోన్నత పదవికి భంగం కలుగగూడదనుకున్నావు. ఇప్పుడు నీవు క్రొత్తగా చేయగల నిర్ణయమేమీలేదు, '— అన్నది రెబెకా.

బ్రియన్ ఆమె కింకా కొంచెం దగ్గరగా వస్తూ, మృదుత్వం ఉట్టిపడే కంఠస్వరంతో, — 'అలా కాదు రెబెకా! నా నిర్ణయమింకా కాలేదు. అది నీ నిర్ణయం మీద ఆధారపడి ఉంటుంది. రేపటి యుద్ధానికి నేను హాజరుకావడమంటూ వస్తే, యుద్ధంలో నా పేరుప్రతిష్ఠలను నేను నిలుపుకోక తప్పదు. నీ తరఫున ప్రతియోధుడు రానీ రాకపోనీ, నీకు మృత్యువు అనివార్యం. ఏలనంటే, నాతో సమానంగా పోరాడగల యోధులు యిద్దరుతప్ప ఈ లోకంలో మరియొవ్వరూలేరు. ఒకడు, సింహపరాక్రముడని పేరుగాంచిన రిచర్డు. రెండవవాడు, అతని అనుయాయి ఐవాన్‌హో. ఐవాన్‌హో ఇప్పుడు కవచం ధరించలేని దుర్బలస్థితిలో ఉన్నాడన్న సంగతి నీకు తెలిసినదేకదా. రిచర్డు పరాయిదేశంలో కారాగృహంలో మగ్గుతున్నాడు. కనుక, నేను బల్లెంపట్టి యుద్ధానికి హాజరైనానంటే, నీ తరఫున ఇంకే యువకుడు సాహసించి బరిలోకి దిగినా నీకు మృత్యువు తప్పదు'— అన్నాడు.

'ఈ మాట ఇప్పటికి ఎన్నోసార్లు చెప్పడమయింది. ఎందుకు చెప్తున్నావో అర్థం కావడంలేదు' అన్నది రెబెకా.

'ఎందుకు చెప్తున్నానంటే, నీకు రానున్న ప్రమాదం అన్ని వైపుల నుంచీ కూడ నీవు చూచుకోడం అవసరం. యుద్ధానికి నేను హాజరయ్యేపక్షంలో, నరకయాతన నిప్పులో అనుభవిస్తూ ఘోరమైన చావు నెమ్మదినెమ్మదిగా నీవు చావవలసి ఉంటుంది. హాజరుకాని పక్షంలో, యోధాగ్రేసరుడుగా నాకున్న పేరు

ప్రతిష్ఠలన్నీ నష్టమైపోతాయి. మంత్ర తంత్రాల కధీనుడనైపోయిన భ్రష్టునిగా నన్ను లోకం భావిస్తుంది. చక్రవర్తులు సైతం అసూయపడే అధికార పీఠానికి దూరస్థుడనైపోతాను. సర్వాధికారిని కావాలని నిర్మించుకొన్న నా జీవితాశయ సౌధాలన్నీ నేల కూలిపోతాయి. అయినప్పటికీ'— అంటూ బ్రియన్ కటాలున రెబెకా పాదసన్నిధిని మోకరిల్లి, 'ఇదంతా నేను సంతోష పూర్వకంగా త్యాగం చేసివేస్తాను. ఈ కీర్తితో పనిలేదు. ఈ ప్రతిష్ఠను త్రోసి పుచ్చుతాను. ఈఅధికారం నాకు తృణప్రాయం—నీ ప్రేమ భాగ్యానికి నేను నోచుకోగలిగినట్లయితే! అనుగ్రహించు రెబెకా, నాకు ప్రేమదానంచెయ్యి!' అన్నాడు.

'ఈ వెర్రికోరిక మానుకో సర్ బ్రియన్! నన్ను రక్షించాలని ఉంటే, వెంటనేపోయి రీజెంటునూ, రాజమాతనూ, ప్రిన్సుజాన్‌నూ కలుసుకో! మీ సర్వాధికారి తీర్పు అమలుజరగడానికి వీలులేకుండా వారాదేశించగలరు. ఏ త్యాగమూ నీవు చేయవలసిన పనిలేదు. అందుకోసం ఈ ప్రేమభిక్ష యాచించవలసిన అవసరమూ ఉండదు'— అన్నది రెబెకా.

నేలవరకూ జీరాడుతున్న ఆమె మేలిముసుగు కొంగును చేత్తో పుచ్చుకుంటూ బ్రియన్,— 'నాకు వాళ్లెవరితోనూ ప్రమేయంలేదు. నిన్నుమాత్రమే ప్రాధేయపడి అడుగుతున్నాను. నా కోరిక మన్నించు. నీ కంటికి ఒకవేళ నేను దయ్యంలాగ కనపించినా, మృత్యువు ఇంతకంటె భయంకరమైనది'— అన్నాడు.

తీవ్రప్రకృతిగల బ్రయన్‌ను రెచ్చగొట్టకూడదని సంకోచిస్తూనే, అతని యెడ తన వైముఖ్యాన్ని స్పష్టం చెయ్యతలచి రెబెకా ఇలా సమాధానం చెప్పింది: 'మీ యిద్దరిలో ఎక్కువ తక్కువలు విచారించ బూనుకోడంలేదు నేనిప్పుడు. నా ప్రార్థన ఆలకించి, నీ క్రైస్తవధర్మం నీవు నెరవేర్చు. మీ మతం దయకు ఎక్కువ ప్రాధాన్యమిస్తుంది. దయతో నన్ను ఈ ఘోరమృత్యువునుండి తప్పించు. అందుకు నానుండి ప్రతిఫలం కోరడం న్యాయంకాదు. నీవు కోరుతున్న ప్రతిఫలం నీ ఉదాత్తతను భగ్నం చేస్తుంది.'

టెంప్లార్ బ్రయన్ కటాలున లేచి నిలబడి,— 'అలాకాదు రెబెకా! నన్ను ఈ విధంగా నీవు అనుశాసించవద్దు. ఇప్పటి కీర్తి ప్రతిష్ఠలను గాని, భవిష్యత్తున ఆశించే అధికారోన్నతిని గాని నేను కాలదన్నడానికి సిద్ధంగా ఉన్నానంటే, నీ సాహచర్య భాగ్యం నాకు దక్కడంకోసమే! మన మిద్దరమూ కలిసి ఎక్కడికైనా పోదాం,' అంటూ, మరల మృదుతరమైన కంఠస్వరంతో,—'ప్రపంచమంటే, ఈ ఇంగ్లాండు, ఈ యూరపే కాదు. మనం యథేచ్ఛగా విహరించదగిన సీమలు,—నా అధికార వాంఛలకు రంగ

సలాలు కాదగిన సీమలు—ఇంకా ఎన్నో ఉన్నాయి. పాలస్తీనా పోదాం. అచట మాంట్‌ఫరాట్ అధిపతి కాన్రేడ్ నా మిత్రుడు. నావలెనే అతడు కూడా స్వతంత్ర భావాలు కలవాడు. కీర్తి సీమలకు క్రొత్త బాటలు అచట నేను నిర్మిస్తాను.'—అంటున్న సమయంలో ఒక ఆవేశం అతనికి వచ్చినట్లయింది. పెద్ద పెద్ద అంగలు వేసుకుంటూ గదిలో ఇటూ అటూ తిరుగ నారంభించాడు. 'యూరప్ అంతా నా పదధ్వనులకు దద్దరిల్లి పోయేటట్లు చేస్తాను. ఇటు ఈ క్రైస్తవులకు గాని, అటు ఆ తురుష్కులకు గాని పాలస్తీనాను దక్కనివ్వను. నాకు అనుయాయిబృందం చాలా ఉంది. ఈ ముసలి ల్యూకాస్ ఎంత అడ్డొచ్చినా వారంతా నన్నే అనుసరిస్తారు. పాలస్తీనాలో నా అధికార ప్రాబల్యాలే చలామణి అయ్యేటట్లు చేస్తాను. మౌంటు కార్మెల్ పై సింహాసనం ప్రతిష్ఠించి నిన్ను రాణిని చేస్తాను'—అని ఇంకా ఏమో చెప్పుకుంటూ పోతున్నాడు.

'ఇదంతా వట్టి కల తప్ప మరేమీ కాదు. ఒకవేళ నిజమే అయినప్పటికీ, దానితో నాకు సంబంధం లేదు. నీవు సాధించబోయే అధికారౌన్నత్యాల్లో నేను భాగస్వామినిని కావడానికి సుతరామూ అంగీకరించను. దేశానికీ మతానికీ సంబంధించిన అనుబంధాలను నీవలె చులకన చెయ్యడం నాకు చేతకాదు. అలా చులకనచేసేవానిపట్ల గౌరవభావం ప్రకటించలేను. ఏమేమో గొప్ప గొప్ప ప్రమాణాలు చేసి సభ్యత్వం సంపాదించిన పవిత్ర సంస్థను ఒక అన్యజాతి స్త్రీమీద కామాంధత్వం కొద్దీ కాలదన్నజూచేవానికి నా హృదయంలో పూజ్యస్థానం లేదు. నా విమోచనను ఒక బేరంలోకి దింపకు సర్ బ్రియన్! నీ ఔదార్యాన్ని అమ్మజూపుకోడం తగదు. నిస్స్వార్థంగా నీ ఆర్తత్రాణ పరాయణత్వం ప్రకటించు. వెంటనే నా కొరకై బ్రిటిషు రాజువద్దకు వెళ్లు. నా వీర రిచర్డు తప్పక ఆలించి నన్ను రక్షించగలడు' అన్నది రెబెకా.

బ్రయన్ తీవ్రస్వరంతో ఇలా అన్నాడు: 'అట్లెన్నటికీ జరగదు రెబెకా! నా సంస్థను నేను విడనాడడమనేది ఒక్క నీకోసం మాత్రమే! నా ప్రేమను నీవు నిరాకరించే పక్షంలో నా అధికారవాంఛ నాకు ఉండనే ఉన్నది. రెంటికీ చెడిన రేవడను కావడం నాచేతకాదు. నేనా, రిచర్డు ముందర శిరసు వంచి ఆ గర్విష్ఠిని యాచించేది? నేనా, మా టెంప్లర్ సంస్థను అతని కాళ్ళ ముందు మోకరిల్లజేసేది? అసంభవం! మా సంస్థను నేను విడనాడితే విడనాడవచ్చుగాని, దాన్ని హాస్యాలపాలు చెయ్యడం ఎన్నటికీ జరగదు.'

'అయితే ఇక నాకు ఆ దయామయుడైన భగవంతుడే దిక్కు'—అన్నది రెబెకా!

'తిరిగి ఆలోచించుకో రెబెకా! నేను గనుక యుద్ధరంగంలో ప్రవేశించా నంటే, ఏ మానవమాత్రులూ ఇక నా మనస్సులోకి రారు! నా పరాక్రమం

యావత్తూ యుద్ధంలో ప్రకటితం కావలసిందే! తత్ఫలితంగా, నిట్టనిలువుగా నీ శరీరం నీవు బ్రతికి ఉండగానే అగ్నికి ఆహుతి చెయ్యబడుతుంది. ఏ స్త్రీ కోరుతుంది ఇలాంటి దుర్మరణం? నా మాట మన్నించి, నన్ను స్వీకరించు' అన్నాడు బ్రియన్.

'స్త్రీ హృదయం ఎలాంటిదో నీకు తెలియదు సర్ బ్రియన్! బహుశః, మానాభిమానాలు కోల్పోయిన స్త్రీలతో మాత్రమే నీ కిదివరకు పరిచయముండి ఉంటుంది. తన ప్రేమకోసం గాని, తన విధ్యుక్తధర్మంకోసం గాని, స్త్రీ ఎలాంటి యాతనలైనా అనుభవించగలదు. అలాంటి సందర్భాల్లో ఆమె ప్రదర్శించగల ధీరత్వముందు, రణరంగాల్లో నీవు ప్రదర్శించే శౌర్యసాహసాలు పనికి రావు. కావడానికి నేనొక అబలనే. చిన్నప్పటినుంచీ గారాబంగా పెరిగాను. ఆపదలంటే భయముంది. బాధలకు ఓర్వలేను. అయినప్పటికీ, బరిలోకి దిగినప్పుడు, యుద్ధం చెయ్యడంలో నీవు ప్రదర్శించగల ధీరత్వం కంటె, బాధాసహనంలో నేను ప్రదర్శించగల ధీరత్వం ఎన్నోరెట్లు అధికం కాగలదని నిస్సందేహంగా చెప్పగలను. ఇక వృధాప్రసంగాలు చెయ్యడం నా కిష్టంలేదు. సెలవు. ఈ భూమిమీద నేనుండేది ఇక కొద్దికాలం మాత్రమే. ఈ కాలాన్ని భగవద్ధ్యానంలో నేను వినియోగం చేసుకోవాలి. భగవంతుడే నాకు శరణ్యం. అతడే నా మొర ఆలకించగలవాడు'—అన్నది రెబెకా!

బ్రియన్ ఒక క్షణం మౌనంగా ఉండిపోయి పిమ్మట ఇలా అన్నాడు: 'అయితే ఇక మనం ఇలా విడిపోవలసిందే నన్నమాట! ఏమి నా దురదృష్టం! నిన్ను నేనసలు చూడడం ఎందుకు తటస్థపడాలి? ఏ క్రైస్తవ సామంతుని యింటనో నీ వెందుకు జన్మించి యుండకూడదు? నిన్ను చూస్తున్న కొద్దీ నా కనిపిస్తోంది;—మీ పతితజాతిలో నే నేను కూడ పుట్టియుండకూడదా అని! కత్తి బల్లెమూ పట్టనేర్చి యుండడానికి బదులు, వెండి బంగారాలు మూటకట్టుకోడం నేర్చియుండకూడదా అని! మీ జాతీయులందరివలెనే, ప్రతి చిన్న సామంతుని ముందరా మోకరిల్లడం నేర్చియుండకూడదా అని! అలా గనుక జరిగి ఉంటే, జీవితంలో నీ కెప్పుడూ సన్నిహితంగా ఉండే భాగ్యం నాకు లభించి ఉండేది! ఈ దుర్మరణం నీకు ఘటిల్లడానికి నేను కూడా ఒక కారణమయ్యే దుర్విధి తప్పి ఉండేది!'

'యూదు జాతీయుడు నేడు ఇలాంటి పతితావస్థయందున్నాడంటే, నీ వంటివాళ్లు పెట్టిన హింసలే అందుకు ముఖ్యకారణం. భగవంతుని ఆగ్రహం వానిని స్వదేశంనుండి తరిమివేసింది. కాని, అవిరతమైన స్వయంకృషి వల్ల అతడు నెమ్మదిగా పలుకుబడినీ బలాన్నీ సంపాదించుకోగలుగుతున్నాడు. కాని, యూదుజాతి పూర్వచరిత్రను ఒకసారి పరిశీలించి చూడు. ఎట్టి మహా పురుషులు ఉద్భవించా రందులో! విపరీతమైన వడ్డీ వ్యాపారాలతో మర్యాదన్ను

సాధించిన పరమలోభులా అనాటి యూదులు? కాదు. అనాటి యూదు రాజ వంశీయులతో పోల్చి చూస్తే, ఈనాడు నీవు సగర్వంగా చెప్పుకొనే క్రైస్తవ సామంతు లందరూ మణులముందర గాజుపూసల్లాగా కనిపిస్తారు'.

యూదజాతి పూర్వవైభవాన్ని గూర్చి ఇలా చెపుతూ ఉండగా రెబెకా చెక్కిళ్లు కెంపు తిరిగాయి. కాని, తిరిగి వెంటనే నిట్టూర్చి ఇలా చెప్పనారంభించింది; కెంపుతిరిగిన చెక్కిళ్లు పాలిపోయాయి. 'అనాటి యూదురాజ వంశీయు లీనాడు లేరు. ఆ వైభవమంతా, కాళ్ళక్రింద నలిగిన తొక్కుడు గడ్డివలె అయిపోయింది. అయినప్పటికీ, ఆ పూర్వీకుల గౌరవం నిలబెట్టగలిగిన వారు నేటికీ అక్కడక్కడ లేకపోలేరు. ఇసాక్ కుమార్తె రెబెకా కూడ అట్టివారిలో చేరుగాక! ఇక సెలవు!'

బ్రయన్ గౌరవపురస్సరంగా ఆమెను సమీపిస్తూ ఇలా అన్నాడు: 'నిజంగా నేను మంత్రముగ్ధుడనే అయినట్లున్నాను. నీవు చెప్పినది నిజం లాగానే తోస్తోంది రెబెకా! ఇంత చిన్నదానవు, ఇంత చక్కని దానవు, మృత్యువంటే ఇంత భయం లేనిదానవు,—నీకెట్టి భయంకర మృత్యువు, ఎట్టి హేయపరిస్థితులలో సంప్రాప్తించనున్నదో తలచుకొంటే, హృదయం జలదరిస్తోంది. ఇరవై యేండ్లుగా చెమర్చటం ఎరుగని నా కన్ను, నిన్ను చూస్తూంటే చెమరుస్తోంది. కాని,— అది అంతే! నీవు మరణించక తప్పదు. అనుల్లంఘ్యమైన ఒక దుర్విధికి మనమిద్దరమూ వశులమైపోయినామనిపిస్తోంది. తుఫాను గాలిలో చిక్కుకొని ఒండొంటితో ఢీకొని పగిలిపోయే ఓడలచందంగా ఉన్నది మన జీవితపరిస్థితి ఇప్పుడు. మంచిది,—నన్ను మన్నించు. సెలవిక వెడతాను. మిత్రులంగానే మనమిద్దరం విడిపోదాం. నీ సంకల్పం మార్చాలని విశ్వప్రయత్నం చేసి విఫలుడనయ్యాను. నీ సంకల్పమెంతవ్యర్థమో, నాదీ అంత దృఢంగానే ఉంది. విధినిర్ణయం!'

'పురుషులిలాగే, తమ తీవ్రోద్వేగ ఫలితాలను విధిమీదికి త్రోస్తూ ఉంటారు సర్ బ్రియన్! కాని, నిన్ను నేను మన్నిస్తున్నాను. నా అకాల మృత్యువుకు కారణం నీవే అయినప్పటికీ మన్నిస్తున్నాను. నీ తీవ్ర ప్రకృతిలో కొన్ని ఉదాత్త లక్షణాలు కూడా ఉన్నాయి. కాని, ఏమిలాభం? నీమనస్సు సోమరిపోతు యజమాని తోట మాదిరి అయిపోయింది. పిచ్చిమొక్కలన్నీ యథేచ్ఛగా పెరిగి, మంచి మొక్కలు చక్కగా పుష్పించి ఫలించకుండా చేసివేశాయి'— అన్నదామె.

'అవును రెబెకా,— నీవన్నట్లు, శిక్షణా, సంస్కారం లేనిదైపోయింది నా బ్రతుకు. అనేకమంది అవివేకులమధ్యా అంధవిశ్వాసులమధ్యా, వారికంటె మిన్నగా ఉండగలిగినందుకు మాత్రం గర్విస్తూ వచ్చాను. యౌవనారంభం

నుంచీ యుద్ధాలంటే ఆసక్తిదగిలి, గొప్ప గొప్ప అధికారవాంఛలు పెంచుకొని, వాటిని ఫలింపజేసుకోడానికే అచంచలదీక్షతో కృషిచేస్తూ వచ్చాను. ఇప్పటికీ నా జీవితం అలా వెళ్ళిపోవలసినదే! కాని, రెబెకా! నీవు నన్ను మన్నిస్తావు కదూ ?' అని అడిగాడు బ్రయన్.

'మరణశిక్ష విధించబడ్డవారు తమ శిక్షకు కారకులైనవారిని ఎంతధారాళంగా మన్నించడానికి వీలుందో అంతధారాళంగా నిన్ను నేను మన్నిస్తున్నాను'- అన్నది రెబెకా.

'ఇక సెలవు' — అని బ్రయన్ గది వీడి బయటికి వెళ్ళిపోయాడు.

పక్కగదిలో ఆల్బర్టుమాల్వాయిసిన్ చీకాకుపడుతూ ఆతని రాకకై కనుపెట్టుకొని కూర్చున్నాడు. రాగానే, ఇంత ఆలస్యంచేశావేమని మందలించి, 'ఏమిటి అలా ఉన్నావ్, ఏమైందేమిటి? ఒంట్లో తేలిగ్గా ఉందా బ్రియన్?'—అని అడిగాడు.

'ఆ, ఒక గంటలో చావబోయేవానికి ఎంత తేలిగ్గా ఉంటుందో అంత తేలిగ్గా ఉంది. మాల్వాయిసిన్! ఆపిల్ల నన్ను దాదాపు నిర్వీర్యుని చేసేసింది. సర్వాధికారి కడకు పోయి, నా టెంప్లార్ పదవికి రాజీనామా ఇచ్చి, నాచేత బలాత్కారంగా ఆతడు చేయించదలచుకొన్న క్రూరకృత్యం చేయజాలనని చెప్పివేద్దామనుకొంటున్నాను'— అన్నాడు బ్రయన్.

'నీకేమైనా పిచ్చెత్తిందా బ్రియన్! అలా చేసినందువల్ల నీ భవిష్యత్తును చేజేతులా నాశనం చేసుకోగలవే కాని, ఈ పిల్లదానిని రక్షించలేవు. నీవు పోరాడనంటే, సర్వాధికారి నీకు బదులుగా మరొకర్ని నియోగిస్తాడు. ఎటొచ్చీ ఆమెకు చావు తప్పదు'—అన్నాడు మాల్వాయిసిన్.

బ్రియన్ దర్పితుడై ఇలా జవాబు చెప్పాడు: 'అసంభవం! ఆమె తరఫున నేను పోరాడుతాను. నా బల్లెపు పోటుకు ఎదురై నిలవగలవారు ఇక్కడ టెంప్లార్లలో ఎవ్వరూ లేరన్నది నీకు తెలుసు.'

యుక్తిపరుడైన మాల్వాయిసిన్ నేర్పుగా అతనికిలా బోధించాడు: 'నిజమే బ్రియన్! కాని, ఒక సంగతి మరిచిపోతున్నావు. నీ వూహించినట్లుగా చెయ్యడానికి నీకు సర్వాధికారి అవకాశం ఇవ్వడు. సంస్థకు రాజీనామా ఇస్తున్నానని చెప్పగానే నిన్ను బంధింపజేసి, ఇక్కడి జైలుఖానాలో పడవేయించి, తిరుగుబాటు చేసినందుకు నీ విచారణకూడా జరిపిస్తాడు. లేదా, మంత్ర తంత్రాల ఫలితంగా నీ వింకా సైతానువశంలోనే ఉన్నట్లు భావిస్తే, జైలుఖానాలోనే అట్టేపెట్టి, భూతోచ్చాటన కార్యకలాపాలు యథావిధిగా కొనసాగింపజేస్తాడు. కనుక, నీ బ్రతుకు నాశనమైపోకుండా ఉండాలంటే, రేపు నీవు సర్వాధికారి చెప్పినట్లు పోరాడక తప్పదు.

'పోరాడను. తిరుగుబాటుచేసి దూరదేశాలకు పారిపోతాను. నా నిమిత్తంగా ఈ ఉత్తమురాలి నెత్తురు చిందడానికి వీలులేదు'—అన్నాడు బ్రయన్.

'పారిపోవడం నీకు సాధ్యంకాదు సర్ బ్రయన్ ! సర్వాధికారి నిన్ను అప్పుడే నిఘాలో ఉంచేశాడు. ఆయన అనుమతిలేనిదే నిన్ను ఈ ప్రిసెప్టరీలోంచి బయటికి పోనివ్వరు. గేటుదగ్గిర నిలబడి, అగడ్తమీదికి వంతెన వాల్చమని నీ వాజ్ఞాపిస్తే, నీ ఆజ్ఞ యిప్పుడు ఎంతవరకు చలామణి అవుతుందో పరీక్ష చేసుకుంటే నీకే తెలుస్తుంది. ఇందుకు నీవు కోపపూరితుడవు కానక్కరలేదు. ఇలా కావడం నీకే మంచిది. పారిపోవ యత్నించినందువల్ల నీ జీవితం అధోగతి పాలు కావడం తప్ప ఇంకేమీ జరగదు. ఆలోచించుకో ! నీ అనుయాయులెందరో నీమీద ఆశపెట్టుకొని ఉన్నారు. వాటికిక ఏమిదిక్కు ? నీ అధోగతివార్త వ్యాపించి రాజదర్బారుకు ఎట్టి సంతోషహేతువవుతుందో తెలుసుకో ! పాలస్తీనాలో తనను చిక్కుల పాల్జేర్చిన యోధునికి ఒక యూదు కన్నె మూలంగా కీడు వాటిల్లిన అవమతినిగూర్చి విని రిచర్డు ఎంతగా సంతోషిస్తాడో ఎరుగుదువా ?'

ఈ తుదిహెచ్చరికతో బ్రియన్ మనస్సు మారింది. 'మాల్వాయిసిన్! ఏ తీగమీటితే నాహృదయాని కుత్తేజం కలుగుతుందో అది మీటావు. ఏమైనాసరే, బ్రయన్ అధోగతిపాలైనాడనే పేరు రానివ్వను. రేపటి యుద్ధానికి రిచర్డే నాకు ప్రతిద్వంద్విగా వస్తే మరీ సంతోషిస్తాను. కాని, యెవ్వరూ రారు. దిక్కులేని ఒక అమ్మాయికోసం యుద్ధంలో పరాజయం ఎవరు చూస్తూ చూస్తూ వరిస్తారు ?' అని ఉచ్చైస్స్వరంతో పలికాడు.

'ఎవరూ రాకపోతే మరీ మంచిది ! అప్పుడీ పిల్ల మరణానికి సాక్షాత్తుగా నీవు కారణం కాకుండాపోతావు. ఆ నింద సర్వాధికారిమీదుగా కొట్టుకొనిపోతుంది. కాని, అతని దృష్టికి మాత్రం అది నిందకాదు, ప్రశంస' అన్నాడు మాల్వాయిసిన్.

'నిజమే,—ప్రతియోధుడెవ్వరూ రాకపోతే, తరువాత జరగబోయే దానిలో నాకు భాగంలేదు. అందరివలెనే నేనూ ఒక సాక్షిగా తిలకించేవాణ్ణి అవుతాను'—అన్నాడు బ్రయన్.

'అంతే ! అదిగో ఆ సెంటుజార్జి విగ్రహానికి అప్పటి ఊరేగింపులో యెట్టి భాగముంటుందో నీకూ అంతే ఉంటుంది'—అన్నాడు మాల్వాయిసిన్.

'మంచిది. నా నిశ్చయాన్నిక చలించనివ్వను. నన్నామె తోసిపుచ్చింది—నిరసించింది. అలాంటిదానికోసం లోకంలో నాకున్న గౌరవప్రతిష్ఠలను నే నెందుకు వదులుకోవాలి ? మాల్వాయిసిన్! రేపటియుద్ధంలో పాల్గొనటానికి నేను సంసిద్ధం !'—అంటూ బ్రయన్ తొందరగా అటనుండి కదలిపోయాడు. అతని నిశ్చయాన్నింకా దృఢతరం చెయ్యడంకోసం మాల్వాయిసిన్ అతని ననుసరించాడు.

# అధ్యాయం ౪౧

లాక్స్లీ పరివృతులవద్ద సెలవు గైకొన్న పిమ్మట, నీలకవచధారి సరాసరి, అచటికి చేరువలో ఉన్న ఒక చిన్న క్రైస్తవ మఠానికి తన గుర్రాన్ని పరుగెత్తించాడు. ఆ మఠం పేరు సెంటు బోటాల్ఫ్ మఠం. టార్కీల్‌స్టన్ కోట తగులబడి పోయిన సందర్భంలో నీలకవచధారి గర్త్‌వాంబాలను తోడిచ్చి ఐవాన్‌హోను ఇచ్చటికి చేర్పించాడు. నీలకవచధారికీ ఐవాన్‌హోకూ మధ్య ఏమి ప్రసంగం నడిచిందో ఇప్పుడు చెప్పడం అనవసరం. మఠాధిపతితో కూడ ఏవో మంతనాలు జరిగిన పిమ్మట, నలుదిక్కులకూ అచటినుండి వార్తాహరులు పంపబడ్డారు. మరునాడుదయమే నీలకవచధారి, వాంబాను వెంటతీసికొని తాను గూడ ఇచ్చటినో ప్రయాణమై, ఐవాన్‌హోతో,—'మనం తరువాత కోనింగ్స్‌బర్గ్ కోటలో కలుసుకుందాం. స్వర్గస్థుడైన ఎథెల్‌స్టేను అపరకర్మ అక్కడ మీ తండ్రి జరిపిస్తూ ఉంటాడు గనుక, అక్కడనే మీ సాక్సన్ బంధువర్గాన్నంతనీ బాగా పరిచయం చేసుకుంటాను. మీ తండ్రి కొడుకు లిద్దరికీ పొత్తుకలిపే ప్రయత్నంగూడ చేస్తాను'—అన్నాడు.

నీలకవచధారివెంట తానుకూడ బయలుదేరాలని ఐవాన్‌హో ఉత్సహించాడు. కాని, నీ విప్పుడు ప్రయాణం చెయ్యగల స్థితిలో లేవు. ఈ రోజుకు విశ్రాంతి తీసుకోమని ఒప్పించి, నీలకవచధారి వాంబాతో సహా బయలుదేరాడు. ఐవాన్‌హో అతనిచేయి ముద్దిడుకొని, కనుచూపుమేర దాటిపోయేవరకూ అతనినే చూస్తూ వాకిట్లో నిలబడి పిమ్మట మఠంలోకి తిరిగి వచ్చాడు.

వచ్చాడన్న మాటేగాని, అతని మనస్సులో ఏదో వ్యాకులంగా ఉంది. అక్కడ ఉండా లనిపించడంలేదు. ప్రాతఃకాలోపాసన లైనతర్వాత మఠాధిపతిని కలుసుకొని, తనమనస్సేదో కీడు శంకిస్తున్నదనీ, కనుక తానుగూడా వెంటనే బయలుదేరక తప్పదనీ తెలియజేశాడు. ఈ దుర్బల స్థితిలో నీవు బయలుదేరి మాత్రం ఏమి చెయ్యగలవని అడిగాడు మఠాధికారి. 'అవసరంవస్తే దెబ్బకు దెబ్బతీయగల స్థితిలో నే నిప్పుడున్నాను. ఒక వేళ లేకపోయినా, ఇతర విధాల నైనప్పటికీ అతనిని ఆపదలోంచి తప్పించడానికి యత్నించగలుగుతాను. మా సాక్సనులకు నార్మన్లంటే ద్వేషం. అందులోనూ, ఎథెల్‌స్టేను చావువల్లనా బాగా ఉద్రిక్తులై ఉంటారు. ఏక్షణాన ఏమి జరిగినా జరగవచ్చు. నేనుంటే అలాంటివేమీ జరగనివ్వను. కుదుపులేకుండా పరుగెత్తే ఒక గుర్రం నాకు సంపాదించిపెట్టండి'—అని కోరాడు ఐవాన్‌హో.

మఠాధికారికి మాల్కిన్ అనే గుర్రముంది. కాని అది చాలా సాధువు. మఠాధికారికి దానిమీద అమితమైన మమకారం. సాయుధుడైన యోధుని

బరువు వడి తట్టుకోలేదనీ, యుద్ధాలకు అలవాటుపడినది కాదనీ చెప్పి, దాని నివ్వాణానికి అతడు సందేహించ మొదలుపెట్టాడు. కాని, ఎక్కువ బరువుతో దాని సొంతమాత్రమూ శ్రమపెట్టననీ, ఎలాంటి అపాయమూ దానికి రానివ్వననీ నచ్చచెప్పి ఐవాన్‌హో ఎలాగో అతనిని ఒప్పించాడు.

కాని, ఐవాన్‌హో కాళ్ళకు గర్త్ తొడిగిన ఇనపముక్కలజోడు చూచే సరికల్లా, మఠాధికారికి తిరిగి భయం పుట్టింది. 'అమ్మయ్యో! నా మాల్కిన్ ఆ ఇనపముక్కల జోడుతో డొక్కల్లో పోట్లు సహించలేదు. ఒక గంటసేపాగు. నీకు వేరొక గుర్రం తెప్పించి పెడతా'నని బతిమాలుకొన నారంభించాడు. మాల్కిన్ ఈ సమయానికి గేటువద్దకు కొనిరాబడింది, 'భరవాలేదుస్వామీ, మీ గుర్రానికి వచ్చిన భయంలేదు. నా కవచం బరువుకూడ మీగుర్రానికి తగిలించను. కవచం మోసుకొని గర్త్ నాసొంతగుర్రంమీద వస్తూవుంటాడు. వెళ్ళివస్తా'నని చెప్పి, ఇక ఏమాటా వినిపించుకోకుండా ఐవాన్‌హో తొందరగా నడిచివెళ్ళి మాల్కిన్‌మీద యెగిరి కూర్చున్నాడు. 'ఇదిగో నాయనా, ఎలా తోలావో జాగ్రత్త! దీని వయస్సిప్పుడు ఎంతో నీకు తెలియను కాబోలు! పదిహేనో యేడు మొన్ననే ప్రవేశించింది. ఆడపిల్లలకు గాని, ఆడగుర్రాలకు గాని ఇది చాల ప్రమాదకరమైన వయస్సంటారు'—— అంటూ, తన హాస్యోక్తికి తానే నవ్వుతూ ఐవాన్‌హోను మరల హెచ్చరించాడు మఠాధికారి. ఐవాన్‌హో ఈమాటలేమీ చెవినిబెట్టలేదు. ప్రక్కనే తన సొంతగుర్రానెక్కి గర్త్ వెంటరాగా, నీలకవచధారి వెళ్ళినదారివెంటనే తానునూ గుర్రాన్ని తోలుకుంటూ బయలుదేరి కొంచెముసేపటిలో అదృశ్యుడై పోయాడు. తన మాల్కిన్‌కు ఏమి ప్రమాదం వాటిల్లుతుందోననే భయం ఒక ప్రక్క వేధిస్తున్నా, ఏ పనిమీద ఐవాన్‌హో ఇప్పుడు బయలుదేరాడో అది ఇంగ్లాండుకు శ్రేయస్సు ఘటించేది కనుక, ఆ సత్కార్యంలో తన గుర్రం వినియోగ పడుతున్నందుకు ఒక విధమైన సంతృప్తికూడా మఠాధికారి మనస్సులో లేకపోలేదు.

ఈ కథ ఇక్కడ ఇలా జరుగుతున్న సమయంలో, అక్కడ నీలకవచధారి వాంబాతో కబుర్లాడుతూ [illegible] ఒక అడవిదారివెంట ప్రయాణం సాగిస్తున్నాడు. మధ్య మధ్య ఏవో కూనిరాగాలు తీస్తూ పాటలు పాడుతున్నాడు. ఉండి ఉండి వాంబా విసురుతూవుండే ఛలోక్తులకు నవ్వుతున్నాడు. కవచం, శిరస్త్రాణం యథాపూర్వంగానే ఉన్నాయి. గాలి బాగా పీల్చడానికి మాత్రం ముఖంమీది ఆచ్ఛాదనం స్వల్పంగా, తానెవ్వరో ఎదిరికి గుర్తుపట్టరాని విధంగా, తొలగించాడు. కాని, ఆ కొద్ది వివరంలోంచీ, విశాలమై యెఱ్ఱబారిన అతనిదవడలు కొట్టవచ్చినట్లు కనిపిస్తున్నాయి. విశాలమైన అతని నీలనేత్రద్యుతులుకూడా శిరస్త్రాణపు నీలినీడల్లోంచి మెరుస్తూ కనిపిస్తున్నాయి. ఆ యోధవరుని వైఖరిలో ఎక్కడా భయ

సంశయాలున్నట్టు కనిపించడంలేదు. కాని, ఎక్కడ ఎప్పుడు ఏ ప్రమాదం వచ్చిపడినా ఎదుర్కోడానికి సిద్ధమన్నట్లున్నది అతని లక్షణం.

విదూషకుడు వాంబా, రకరకాల వికృత చేష్టలుచేస్తూ అతని ననుసరిస్తు న్నాడు. వెనుకటివలె అతని చేతిలో ఇప్పుడు కొయ్యకత్తి లేనిమాట నిజం. ఇటీవలి అనుభవాల ఫలితంగా, నిజమైన కత్తీ డాలూ అతడు పట్టవలసిన అవ సరం ఏర్పడింది. టార్క్విల్‌స్టన్ కోట ముట్టడి సందర్భంలో అతడు వాటిని నేర్పుగా ఉపయోగించి ఎల్లరినీ ఆశ్చర్యచకితులను చేశాడుకూడ. కాని, అతని మెదడులోని ఒక ముఖ్య లోపమేమంటే, కుదురుగా కొంచెంసేపు అది అతనిని ఒక తీరున ఉండనివ్వదు; ఒక ధోరణిలో కొంతసేపు మాట్లాడ నివ్వదు. ఏదైనా ఒక అత్యవసర కార్యం మీదపడ్డప్పుడు, కొంత కుదురు గానే అతడా పనిని నెరవేరుస్తాడు; బుద్ధి తిన్నగానే పనిచేస్తుంది. కాని, ఆ కుదిరిక దీర్ఘకాలం నిలబెట్టుకోడం అతని కభ్యాసంలేదు. గుర్రంమీద ప్రయాణం చేస్తూ అతడు నానా విధమైన వికార చేష్టలూ చేయ మొదలుపెట్టాడు. ఒక సారి గుర్రం చెవులదగ్గరదాకా ముందుకు వంగేవాడు. ఇంకొకసారి వెల్ల కిలా వెనుకకు విరగబడేవాడు. రెండు కాళ్ళూ ఒక వైపున పెట్టి ప్రయా ణంచేసేవాడొక కొంతసేపు. గుర్రం తోకవైపు ముఖంపెట్టి కూర్చుని ప్రయా ణం చేసేవాడు మరి కొంతసేపు. ఇలా తన జీనుమీద కూర్చుండి నానా రకాల కోతి చేష్టలూ చేస్తున్న రౌతు సత్తా ఆ గుర్రంకూడ కనుక్కొని, ఒక్క ఎగురెగిరి నేలమీదికి చాపచుట్టుగా అతనిని దొర్లించేసింది. నీలకవచధారికి ఒకటే నవ్వు. ఇలాంటివాడు ప్రక్కన ఉంటూంటే అతనికి ప్రయాణం హుటా హుటిగా ఎక్కడ సాగుతుంది? అందుచేత, పిచ్చిచేష్టలు మాని ఇక తిన్నగా ప్రయాణం చెయ్యమని అతడు వాంబాను గట్టిగా హెచ్చరించవలసి వచ్చింది.

ప్రయాణం సాగుతోంది. కొంతసేపటికి నీలకవచధారి ఒక గీతం ఎత్తుకొని పాడడం మొదలుపెట్టాడు. ఆ గీతం వాంబాకు కూడా వచ్చు. సగం గీతం నీలకవచధారి పాడగా, తక్కినసగం వాంబా పూర్తి చేశాడు. ఇది నీలకవచధారి పాడిన గీతం :

ప్రొద్దుపొడిచె; భానుడు తూర్పుమల నెక్కె;
మంచు తెర విచ్చె; స్వచ్ఛంద మధురగాన
మాలపింపంగ జొచ్చె ద్విజాళి మింట;
మేలుకొనుమింక; ప్రియసఖీ! మేలుకొనవె.

గొల్లపిల్లలు పిల్లనగ్రోవి నూదు
శ్రావ్యగానము మార్మ్రోగ సాగె దెసల;
తామరలబోలు నీదు నేత్రాల విప్పి
మేలుకొనుమింక; ప్రియసఖీ! మేలుకొనవె.

ఈ గీతం వాంబా ఈ రీతిగా పూర్తిచేశాడు:

మేలుకొలుపకు మువ్వాతే; మృదుతల్పమ్మ
పైన పవ్వళించి సుఖనిద్రలోన గాంచు
తియతీయని కలలు ప్రాప్తించునెటుల
మేలుకొనుమిాదటను చెప్పుమిా సఖుండ!

తెల్లవారగనీ; మంచు తెరలు విచ్చు
కొనగనీ; సాగనీ పులుంగుల రొదలంగు;
వనుల కొపరిపాట వర్తిసల మ్రోగ
నీ; నమము గావు నాదు తేనియలకలకు.

కనులు విప్పను; కలలోన మునిగియుందు;
ఈ సుఖమ్ములు జాగ్రతి నెట్లు పొసగు?
కాని, తలపోయబోకు నా కలలయందు
నీవు ప్రత్యక్షమైతివనియు ప్రియుండ!

గీతం పూర్తికాగానే వాంబా ఇలా అన్నాడు: 'ఈ గీతమంటే పూర్వం నాకు ఎంతో ఇష్టంగా ఉండేది. మా గర్తూ నేనూ కలిసి తరుచుగా పాడుతుంటూ ఉండేవాళ్లం. ఒకసారి, ఈ గీతంలో తన్మయులమై నిద్రిస్తూ మెలకువ వస్తూ మధ్య ఊగిసలాడుతూ, రెండుబారల పొద్దెక్కిందాకా పక్కమీది నుంచి లేవనేలేదు. దాని ఫలితంగా, మా వీపులపై బడితె విరగాలిసివచ్చింది. అప్పటినుంచీ ఈ గీతమంటే నాకు పడదు. ఇది జ్ఞాపకానికి వచ్చిందీ అంటే ఆనాటి దెబ్బల తాలూకు నొప్పులింకా ఉన్నట్టే ఉంటాయి. నీకు ఉల్లాసం కలిగించటానికి ఇప్పుడు పాడానుగాని, లేకపోతే పాడేవాణ్ణి కాదు.'

పిమ్మట వాంబా మరొక గీతం ఎత్తుకున్నాడు. అది నీలకవచధారికి నచ్చినదే. తూర్పుమండలంలో పేరుమోగిన ఒక సుందరాంగిని చెట్టపట్టగోరి, ఉత్తరం, దక్షిణం, పడమటి దిక్కులనుండి ఒక యోధుడూ, ఒక జమీందారుడూ, ఒక గ్రామీణుడూ వస్తారు. తమ తమ గొప్పలు చెప్పుకొన్న యోధునీ, జమీందారునీ—ఇద్దరినీ ఆ సుందరాంగి నిరాకరించి, కష్టజీవియైన గ్రామీణుని చెట్టబట్టుతుంది. ఇది ఆ గీతంలోని కథ. విడివిడిగా కొంత, కలిసి కొంత, ఉభయులూ పాట పూర్తిచేసిన పిమ్మట, నీలకవచధారి వాంబాతో,—'ఈ పాట మన లాక్స్లీగాని కోప్మన్‌హార్స్టు ఫాదరీగాని వింటే ఎంతైనా బాగుంటుంది కదా,'—అన్నాడు.

ప్రసంగం అంతట లాక్స్లీ ప్రభృతులమీద నడిచింది— వాంబా కడు చమత్కారంగా లాక్స్లీ ప్రభృతుల వృత్తివిశేషాన్ని వర్ణించ మొదలుపెట్టాడు,

ఎప్పటికప్పుడు జమా ఖర్చులు సరిపుచ్చుతూ, ఒక విచిత్రమైన కొతాను వాళ్లు నడుపుతూ ఉంటారట. ముందొక చెడ్డపని చేసి, వెంటనే దానికి పరటాగా ఒక మంచిపని చేస్తూ కొతా సరిపుచ్చుతూ ఉంటారట! ఒక కోటను తగలబెట్టి, దానికి పరిహారంగా ఒక కుటీరనిర్మాణం చేయిస్తూఉంటారట! ఒకచోట ఒక చర్చిని దోచి, దానికి పరిహారంగా వేరొకచోట ఇంకొక చర్చికి పూరి చేయిస్తూ ఉంటారట. అధికార దర్పితుడైన ఒక ప్రభుత్వోద్యోగిని హత్యచేసి, దానికి పరిహారంగా ఒక పేద ఖయిదీని చెరవిడిపిస్తూఉంటారట! ఈపద్ధతిలోనే, నార్మన్ సామంతుడైన ఫ్రాంట్ డీబాఫ్‌ను ప్రబతికి ఉండగానే తగులబెట్టిన దానికి పరటాగా సాక్సన్ భూస్వామియైన సెడ్రిక్‌ను బంధవిముక్తుని చేసారే కాని అంతకంటె మరేమీ లేదని అతని వాదం. చేసిన చెడ్డపనికి ఒక మంచిపనితో కొతా సరిపుచ్చాలని వారు ఆలోచిస్తున్న సమయంలో గనుక ఎవరైనా వారి యెదుట పడితే, అదృష్టవంతులే! అలా కాకుండా, ఒక పాతకొతా సరిపుచ్చేసి, తిరిగి ఎవరితోనైనా క్రొత్త కొతా ప్రారంభించాలని ఆలోచించేసమయంలో గనుక వారి పాలిటబడితే, అట్టివారికి మూడిందన్నమాటే!

నీలకవచధారి ఈ విచిత్ర వ్యాఖ్యానానికి వినోదిస్తూ ముందుకు సాగుతున్నాడు. వాంబా ప్రసంగం క్రమంగా మరొక విషయంమీదికి మళ్లింది. 'ఈ బందిపోటు దొంగలు ఇక్కడికి కొంత మంచివాళ్లే అని చెప్పాలి. ఆ మాల్వాయిసిన్ అనుచరబృందం గనుక వచ్చి మనమీదపడితే మాత్రం మనం మరింత చిక్కులో పడతాం'— అంటూ వాళ్లనుగూర్చి వర్ణించడం మొదలు పెట్టాడు. వాళ్లొక్క పదిమంది ఒక పెద్ద తోడేళ్ల గుంపంత బీభత్సం చేయగలరన్నాడు. 'ఇప్పుడు హఠాత్తుగా వాళ్లొక ఇద్దరు వచ్చి మనమీద పడతారనుకో, అప్పుడు నీవేమి చేస్తావ్?'— అని ప్రశ్నించాడు నీలకవచధారిని.

'ఏమి చెయ్యడమేమిటి! ఇద్దరినీ ఒక్కొక్క బల్లెపుపోటుతో నేల గూల్చి వేస్తాను,'— అన్నాడు నీలకవచధారి.

'వాళ్లు నలుగురువచ్చి మీద పడితేనో?'— అని వాంబా మరల అడిగాడు.

'వాళ్లనైనా అంతే చేస్తాను'— అన్నాడు నీలకవచధారి.

'మరి వాళ్లు ఆరుగురైతేనో?' అని వాంబా తిరిగి ప్రశ్నిస్తూ, 'నీ దగ్గిర లాక్స్లీ ఇచ్చిన కొమ్ముబూరా ఉన్నదిగదా, లాక్స్లీ అనుయాయుల సాయం కోసం ఆ బూరా ఊదవా?'— అని అడిగాడు.

'ఏమిటీ! నేను ఒకళ్ల సాయంకోసం కొమ్ము ఊదుతానా! అసంభవం! అట్లెన్నటికీ జరగదు. ఇలాంటి వెధవలు పాతికమందివచ్చినా నా ముందర గాలికి ఎండుటాకులు ఎగిరిపోయినట్లు ఎగిరిపోవలసిందే!'— అన్నాడు నీలకవచధారి.

'ఏదీ ఆ బూరా ఒకసారి నేను చూస్తాను, ఇలా తెమ్మన్నాడు వాంబా. నీలకవచధారి ఇచ్చాడు. వాంబా దాన్ని వెంటనే తనమెడలో తగిలించుకొని, 'దీన్ని ఊదవలసిన విధం ఇది కాదా?'—అంటూ నోటితో ఒకరకంగా ఈల వేశాడు.

నీలకవచధారి హుంకరించి, 'అదేమిటి, ఆ బూరా నీమెళ్లో వేసుకున్నావ్? ఇలా తే!' అని అడిగాడు. వాంబా యివ్వలేదు. 'ఈ బూరా నీవంటి వీరునివద్ద ఉండడంకంటె, నావంటి అవివేకివద్దనే ఉండాలి' అన్నాడు. 'అంతకంతకు మరీ హద్దుమీరిపోతోంది నీ వైఖరి! అనవసరంగా నన్ను రెచ్చగొట్టావంటే నీ మర్యాద దక్కదు సుమా'!—అని తిరిగి హుంకరించాడు నీలకవచధారి.

వాంబా అతనికి దూరంగా వైదొలగి,—'ఇదిగో, నీవుగనుక నన్ను బలవంతం చేసేటట్లయితే, ఇక్కడనుంచి ఇలాగే పలాయనం చిత్తగిస్తాను సుమా, ఇక నీదారి నీదీ, నాదారి నాదే!'—అన్నాడు.

'ఏడిశావులే! నీతో తగవు పెట్టుకుంటూ కూర్చోడానికి నాకు వ్యవధి లేదు. బూరా నీ దగ్గిరే ఉండనీలే! ప్రయాణం వృథాగా ఆలస్యమౌతోంది'—అన్నాడు నీలకవచధారి.

'అయితే నన్నేమీ చెయ్యవుగదా? చెయ్యనని మాట ఇవ్వు!' అని అడిగాడు వాంబా. ఏమీ చెయ్యనని మాట యిచ్చిన తర్వాత, తిరిగి నీలకవచధారితో కలిసి వాంబా ప్రయాణం సాగించ మొదలుపెట్టాడు.

ఇది జరిగి ఎంతసేపో కాలేదు. ఒక గుబురుపొదలో ఎవరో మనుష్యులు దాగి ఉన్న జాడ కనుకొట్టి వాంబా నీలకవచధారికి తెలియచేశాడు. నీలకవచధారి పరికించి చూసేటంతలోనే మూడు బాణాలు వచ్చి అతనిమీద పడ్డాయి. తక్షణమే ముఖంమీదికి కూడ శిరస్త్రాణాన్ని దించివేసుకొన్నాడు గాని, లేకపోతే ప్రమాదమే వాటిల్లియుండేది. ఉత్తరక్షణంలోనే నీలకవచధారి తన గుర్రాన్ని ఆ బాణాలు వచ్చిన పొదవైపు దుముకించాడు. పొదచాటునుండి ఆరుగురు ఆయుధపాణులైన అశ్వికులు వచ్చి అతని నెదిరిస్తున్నారు. ముగ్గురి బల్లెలు అతనిమీదికి సరాసరిగా గురిచేయబడినా, అతని కవచానికి తాకుతూ తాకి ఎదురుదెబ్బ తిన్నట్లు క్రిందపడిపోయాయి. ఆ యాశ్వికులంతటితో ఊరుకోలేదు. కత్తులు దూసి ఒక్కుమ్మడిగా నలువైపులనుంచీ అతనిమీదికి లంఘించారు. నీలకవచధారి సింహంవలె విజృంభించి, ఒక్కొక్క దెబ్బతో ఒక్కొక్కరిని నేలకూల్చడం మొదలుపెట్టాడు. ఆ ధోరణితోనే అతని పోరాటమైతే తక్కినవారిని కూడా అతడు ఆ విధంగానే మట్టుపెట్టియుండేవాడు. కాని, ఇంతలో పొదమాటున

దాగియుండిన మరొక యోధుడు అకస్మాత్తుగా వచ్చి అతనిమీద పడ్డాడు. నీల కవచధారి యొక్క అశ్వరాజం అతని బల్లెపుపోటుకు గురి అయింది. దెబ్బ చాలా బలంగా తగలటంచేత, వెంటనే గుర్రంతో పాటు నీలకవచధారి క్రిందపడి పోయాడు. ఈ సమయంలో మోగించాడు వాంబా, తనవద్దనున్న కొమ్ము బూరా. ఈ సంఘటన అంతా చిటికెలమీద జరిగిపోవడంచేత, ఇంతకుముందే బూరా ఊదడానికి అతనికి వీలు కలుగలేదు.

బూరా ధ్వని వినడంతోటే హంతకులు బెదరి చప్పున పారిపోయి దాక్కున్నారు. వాంబా నీలకవచధారివద్దకు పరుగెత్తి అతడు లేచుటకు యథోచితంగా తోడ్పడ్డాడు. అది హాస్యగాడైన వాంబా ఊదిన బూరా చప్పుడని తరువాత గ్రహించిన ఆహంతకుల నాయకుడు, అచిరకాలంలోనే మరల వారినందరనీ నీలకవచధారిమీదికి పురికొల్పాడు. నీలకవచధారి యిప్పుడొక ఓకు వృక్షానికి వెన్నిచ్చినిలిచి వారితో పోరాడుతున్నాడు. హంతకుల నాయకుడంతట అదను కనిపెట్టి, మరొక బల్లెంతో, గుర్రం మీద విసురుగా స్వారీ చేసుకుంటూవచ్చి నీలకవచధారిని ఓకుచెట్టుకు గ్రుచ్చి చేయాలని యత్నించాడు. కాని, ఇంతలో, వాంబా సమయ స్ఫూర్తితో ప్రక్కవాటుగా అడ్డంతగిలి గుర్రం కాళ్ళు విరుగగొట్టినందున ఆప్రమాదం తప్పింది. గుర్రంతో పాటుగా ఆనాయకుడు నేలమీదికి దొర్లి పడ్డాడు.

అయినా నీలకవచధారి ఇంకా చిక్కులోంచి బయటపడలేదు. ఒకే సారి అనేకమంది శత్రుయోధులకు జవాబు చెప్పవలసి రావడంవల్ల, క్రమంగా అతనికి శ్రమ ఎక్కువ కాజొచ్చింది. ఇది కనిపెట్టి, ఆ హంతకులలో ముఖ్యుడొకడు అతనిపైకి మరింతగా విజృంభించబోతున్న సమయంలో, వెనుకనుండి రివ్వున ఒక బాణం ఎగిరివచ్చి వానికి గుచ్చుకున్నదే తడవుగా వాడు అర్చుకుంటూ క్రింద పడిపోయాడు. ఉత్తరక్షణంలో, లాక్స్లీ కొంతమంది అనుచరబృందముతో అక్కడ ప్రత్యక్షమై తక్కిన హంతకులమీద విరుచుకుపడ్డాడు. పోరు ముగియడానికి ఇక యెంతో సేపు పట్టలేదు. హంతకులు చచ్చినవారు చావగా మిగిలినవారు గాయపడి నేలకొరిగారు. నీలకవచధారి ఒక మామూలు యోధునివలె గాక, ఒక గొప్ప అధికారిక పురుషునివలె హుందాగా లాక్స్లీ పరిభృతులకు తన కృతజ్ఞత తెలియజేస్తూ, తనమీద అకారణంగా కత్తికట్టిన ఆ హంతకులెవరో తెలుసుకొనగోరి, వారి నాయకుని శిరస్త్రాణం వాంబాచేత తొలగదీయించాడు. అది నీలకవచధారికి సుపరిచితమైన ముఖమే. 'ఎవరు? వాల్డిమార్ ఫిడ్జర్స్! ఏమిటిది వాల్డిమార్! ఎందుకిలా చేయవలసివచ్చింది? ఈ నీచకార్యం నీవంటివాడు తలపెట్టవలసిందేనా?' అని అడిగాడు ఆశ్చర్య చకితుడై.

'ప్రతీకారం, అధికారవాంఛా ప్రేరేపిస్తున్నప్పుడు, మానవుడు ఎందుకైనా సిద్ధపడగలడు రిచర్డ్! ఈ సంగతి నీకు తెలియకపోతే, మానవలోకం సంగతే తెలియదన్నమాట'— అని సమాధాన మిచ్చాడు వాల్డిమార్.

'ప్రతీకారమా! నే నెన్నడూ నీ కపకారం చెయ్యలేదే! నా మీద నీకు పగ ఉండడం ఎలాసాధ్యం?'— అని అడిగాడు నీలకవచధారి.

'నా కుమార్తెను చేపట్టడానికి నీవు నిరాకరించావు రిచర్డ్! అంతకంటె పగకు ఇంకేమి కారణం కావాలి?'— అన్నాడు వాల్డిమార్.

'బలే కారణం సంపాదించావు!'—అంటూ నీలకవచధారి, ప్రక్కనున్న వారితో,— 'ఇతనితో నేను కొంచెం ఏకాంతంగా మాట్లాడాలి మీరు కొంచెం దూరంగా ఉండం'డని, పిమ్మట వాల్డిమార్‌తో ఇలా అన్నాడు: 'నిజం చెప్పు వాల్డిమార్! నిన్ను ఈ నీచకార్యానికి ప్రేరేపించిన దెవరు?'

'నీ సోదరుడు. ఇందులో వింత యేమీ లేదు, నీవు నీ తండ్రియెడల అవిధేయుడవై ప్రవర్తించినట్లే అతడు నీయెడల అవిధేయుడైనాడు'— అన్నాడు వాల్డిమార్.

రిచర్డు ముఖం జేవురించింది. కన్నులు ఎర్రబారాయి. కాని, ఇంతలోనే ఆ ఉద్రేకం అణచుకొని వాల్డిమార్‌తో ఇలా అన్నాడు: 'వాల్డిమార్! నీకు బ్రతకాలని ఉన్నదా!'

'ఉన్నా ప్రయోజనం లేదని నాకు తెలుసు. సింహానికి చిక్కినతర్వాత ఇక బ్రతకడ మెక్కడ!'—అన్నాడు వాల్డిమార్.

'సింహం మృతప్రాయమైన కళేబరాలను ముట్టదు వాల్డిమార్! నీ ప్రాణాలు నీకు వదిలేస్తాను తీసుకో! కాని, ఒక్క షరతు. మూడు రోజుల్లో నీవు ఇంగ్లాండు విడిచి వెళ్లిపోవాలి. ఈ నీచకార్యంతో జాన్‌కు సంబంధం ఉన్నదని ఎవ్వరితోనూ చెప్పగూడదు. నే నిచ్చిన గడువు తర్వాతకూడా ఇంకా నీవు ఇంగ్లాండులోనే ఉన్నా, లేక జాన్ సంగతి ఇతరులకు వెల్లడిచేసినా, నిన్ను నీ కోటగొమ్మలకు వ్రేలాడగట్టించి రాబందులు తినేటట్టు చేస్తాను'—అంటూ రిచర్డు లాక్స్లీవంక చూచి,—'ఇతని కొక గుర్రం ఇప్పించు లాక్స్లీ! మీ వాళ్లు చెదరి పారిపోతున్న గుర్రాలను కొన్నింటిని పట్టుకున్నట్లున్నారు. నిరపాయంగా ఇతనిని ఈ అడవి దాటి పోనివ్వండి'—అన్నాడు.

'మీ రెవ్వరో నేను ఊహించగలిగాను. మీ ఆజ్ఞ అనుల్లంఘ్యం కాబట్టిగాని, లేకపోతే ఒక్క బాణంతో వీనికి ఈ ప్రయాణశ్రమ లేకుండా చేసిఉండేవాణ్ణి'—అన్నాడు లాక్స్లీ.

'ఇది అత్యుత్తమైన ఆంగ్ల సింహాసనం లాక్స్లీ! నా ఆజ్ఞతో బద్ధుడవు కాగోరడం సహజం. నేను ఆంగ్లదేశాధిపతిని రిచర్డును'— అన్నాడు నీలకవచ ధారి.

ఉదాత్తమైన గంభీర స్వరంలో ఉచ్చరించబడ్డ ఆ వాక్యాలు వినగానే లాక్స్లీ ప్రభృతులంతవరూ అతని ముందు మోకరిల్లి తమ రాజభక్తిని వెల్లడిస్తూ, తామిదివరకేమైన తెలియకుండా అపరాధాలు చేసియుంటే మన్నించమని అర్థించారు.

'మిత్రులారా! మీరేమైన అపరాధాలు చేసియుంటే, వాటికి పరిహారం ఇదివరకే మీరు చేసుకొన్నారు. ఆపదలో ఉన్న నా ప్రజలను కాపాడడం కోసం మీరు టార్క్విల్‌స్టన్ కోట ముట్టడి సందర్భంలో చేసిన సేవా, ఇప్పుడు నన్ను ఈ అపాయస్థితినుండి రక్షించడంలో చేసిన సేవా,—వీటి ముందు ఏ అపరాధాలూ నిలువవు. లేవండి. ఇకనుంచి మీరు రాజభక్తిగల ప్రజలుగా ప్రవర్తించండి. లాక్స్లీ, నీవు'—అని రిచర్డు ఇంకా ఏమో మాట్లాడబోతూ ఉండగా, లాక్స్లీ,—'నన్నిక లాక్స్లీ అని పిలవవద్దు ప్రభూ! నా పేరు ఇదివరకే మీరు వినే ఉంటారు. నేను రాబిన్ హుడ్‌ను!' అన్నాడు.

'ఏమీ! బందిపోటు దొంగల నాయకుడవనీ, సజ్జనుల పాలిటి ఆప్తబంధువనీ పేరుపడిన రాబిన్‌హుడ్‌వా నీవు? నీ పేరు పాలస్తీనాలో ఉన్నప్పుడే విన్నాను. రాబిన్‌హుడ్! నేను ఈ దేశంలో లేనప్పుడు, ఇక్కడ అనేక కల్లోలాలు పుట్టాయి. అలాంటి విషమపరిస్థితిలో నీవు చేసిన ఏ పనికీ నిన్ను అపరాధిగా ఎంచి శిక్షించడం జరగదు'— అన్నాడు రిచర్డు.

'అవునవును, 'పిల్లి లేనంతకాలం ఎలుకలకు యథేచ్ఛ' అనే సామెత ఉన్నదందుకనే!'— అన్నాడు వాంబా, ఈ అవకాశంలో కల్పించుకొని.

'ఓ, వాంబా ఉన్నాడూ ఇక్కడ? ఇంతసేపూ వానిమాట వినిపించక పోయేసరికి పలాయనం చిత్తగించాడేమో అనుకుంటున్నాను,'—అన్నాడు రిచర్డు.

'నేనా పలాయనం చిత్తగించడం? నా పరాక్రమానికి అదిగో, రౌతుతో సహా నేలకొరిగిన ఆ గుర్రమే సాక్షి! అయినా, నాబోటి హాస్యగానికి పోరాటం ఏమి చేతవుతుందిలెండి! అది ఏమైనా ఉన్నప్పటికీ, సమయానికి బూరా ఊదానని మీరైనా తమరు అంగీకరించాలి'— అన్నాడు వాంబా.

'అవును వాంబా, నీవు బూరా ఊదకపోతే ఏమయ్యేదో! నీ సేవ ఎన్నటికీ మరచిపోము'— అన్నాడు రిచర్డు.

'అపరాధిని ప్రభూ అపరాధిని! రాజద్రోహం చేశాను. ఉరికంబం ఎక్కించ టమే నాకు తగినశిక్ష'—అని ఒక కంఠధ్వని ఇంతలో పక్కనుండి వినవచ్చింది. రిచర్డు చుట్టూ కలయజూశాడు. ఫాదరీ మోకాళ్ల మీద కూర్చుండి జపమాల త్రిప్పుతున్నాడు. ప్రక్కన నేలపై అతని బాణాకర్ర పడిఉంది. ముఖం ఏవిధంగా పెట్టితే పశ్చాత్తాపం బాగా ప్రకటమౌతుందని తన అభిప్రాయమో ఆ విధంగా పెట్టాడు. పెదవుల కొసలు క్రిందికి జార్చి, మిడిగ్రుడ్లు వేశాడు. యిది అంతా వొక నటనగా చూపరులకు కనిపిస్తూనే ఉంది.

'ఎందుకు ఫాదరీ, అలా దిగులుపడి ఉన్నావు? నీ వృత్తిధర్మం యెంత చక్కగా నిర్వహిస్తున్నావో నీ పైఅధికారులకి తెలిసిపోతుందని భయపడు తున్నావా? పిచ్చివాడా! అలాంటి భయమేమీ అక్కర్లేదు. మధుసేవనం వేళ నడిచిన రహస్యాలు ఈ రిచర్డు ఎన్నడూ బయటపెట్టడు' అన్నాడు రిచర్డు.

'అదికాదు ప్రభూ! నేను భయపడుతున్నది రాజదండానికి. దైవప్రతి నిధులైన తమమీదనే ముష్టిప్రహారం సల్పిన నీచ అపచారం ఏమని చెప్పాలి?' అన్నాడు ఫాదరీ.

'ఆహాహా! బలేవాడవు! ఆ దెబ్బ ఇంకా జ్ఞాపకమున్నదా ఏమిటి? నిజానికి, ఆ రోజంతా గూబ గుయ్యిమంటూనే ఉంది గాని, తరువాత ఆ సంగతే మరచిపోయాను. ఆ దెబ్బతాలూకు బాకీ నేను పూర్తిగా బదులుతీర్చలేదని నీకేమైన మనసులో ఉన్నదా? ఉంటే చెప్పు, ఇప్పుడు తీర్చేస్తాను' అన్నాడు రిచర్డు.

'వద్దు వద్దు! నా బాకీ నాకిదివరకే ముట్టింది. రెట్టింపు వడ్డీతో సహా ముట్టింది. ప్రభువులు ఇలాగే ఎప్పటికీ ఎవరి బాకీలూ అట్టేవుంచుకోకుండా తీర్చేస్తూ ఉండాలని కోరుతున్నాను, కాని,'—అంటూ ఫాదరీ, తిరిగి విషాదం అభినయిస్తూ 'ప్రభువులమీద చేయి చేసుకొన్న ఈ అపచారానికి నాకు ప్రాయ శ్చిత్తమేమిటో తెలియడంలేదు'—అని వాపోయాడు.

'అలాంటిదేమీ మనసులో పెట్టుకోకు సోదరా! పాలస్తీనాలో అన్య మతస్థుల దెబ్బలకు అనేక పర్యాయములు కాచుకోదలచి వచ్చిన నేను, నీవంటి క్రైస్తవ భక్తునిచేత దెబ్బతింటే తప్పేమీ లేదు. అయినా, నా కొకటి తోస్తోంది. చర్చిసర్వీసునుంచి నీకు విడుదల సంపాదించి, మా అంగరక్షకుల్లో ఒకడిగా నిన్ను నియోగిస్తే అది నీకూ చర్చికీ కూడ మంచిది. మీ సెంటు డన్‌స్టన్‌ను సేవించిన శ్రద్ధాభక్తులతోనే ఇక నన్ను సేవిద్దువుగాని'—అన్నాడు రిచర్డు.

'మన్నించాలి ప్రభూ! ఈ మధ్య నాలో సోమరితనం బాగా బలిసి పోయింది. సెంటు డన్‌స్టన్‌ను సేవించడం గనుక నా బుచ్చి పూస్తోంది. కే

కోటలో పడి ఉత్సాహంగా విధులు మరచినా, చర్చి వదిలిపెట్టి రాత్రిళ్లు బలాదూరు తిరిగినా, ఏమీ అనక, దారువిగ్రహమూర్తియై చర్చిలో ఒకమూల కూర్చుంటాడు. తమ దగ్గిర సేవ అలా ఎందుకవుతుంది? అలాంటి పిచ్చిపనులేమైనచేస్తే చర్మం వొలిపించివేస్తారు. వద్దు ప్రభూ, నన్ను ఇలాగే ఉండనివ్వండి. అనుగ్రహించాలని ఉంటే, ఏదైనా చిన్న బక్షీష్ దయచేయించండి చాలు'- అన్నాడు ఫాదరీ.

'మంచిది. ఇకనుంచి వారన్‌క్లిఫ్ అడవిలో ప్రతిసీజనులోనూ మూడు లేళ్లను చంపడానికి నీకు అనుమతి ఇస్తున్నాను. అయితే, అది అవకాశంగా తీసుకొని, నీవు కూడా ముప్పయి చేస్తావని నాకు తెలుసు'—అన్నాడు రిచర్డు.

'సెంటు డన్‌స్టన్ అనుగ్రహించవల్ల, తమరు ప్రసాదించినదాన్ని అభివృద్ధిచేసుకోగలిగే శక్తి నాకు కలుగుగాక యని కోరుతున్నాను'—అన్నాడు ఫాదరీ.

'లేడిమాంసానికి తోడు, మంచి మధుపానం కూడా ఉండాలి గనుక, ఇకనుంచి ఏటా నీకు ఒక పీపా స్పానిష్ ద్రాక్షాసవం, ఒక పీపా గ్రీషియన్ ద్రాక్షాసవం మా ఆసవాగారంనుండి నీకు సప్లయి అవుతూ ఉంటుంది. అది నీకు చాలకపోతే మా ఆస్థానానికి వచ్చి మా బట్లరును పరిచయం చేసుకో'—అన్నాడు రిచర్డు.

'మరి, సెంటు డన్‌స్టన్‌కో?' అని అడిగాడు ఫాదరీ.

'ఒక నిలువుటంగీ, ఒక శిరోవేష్టనం, బలిపీఠంపైకి ఒక వస్త్రంకూడా మంజూరు చేస్తున్నాను'—అంటూ రిచర్డు, క్రాసురక్షలు పెట్టుకొని, 'ఇక ఇది ఇంతటితో ఆపుదాం. లేనియెడల, భక్తి ప్రపత్తుల మాట మరచి, హాస్యాలనే తలపోసుకొంటున్నందుకు భగవంతుడు మనపై ఆగ్రహించవచ్చు'—అన్నాడు.

'ఆగ్రహించకుండా చేసున్నానుగదా ప్రభూ!'—అన్నాడు ఫాదరీ, ఛలోక్తిగా.

ఈ అవినయానికి రిచర్డు వెంటనే తీవ్రస్వరంతో,—'ముందు నీ సంగతి నీవాలోచించుకో ఫాదరీ!'—అని గర్జించి, వెంటనే అతని వైపు అరచేయి చాచాడు. ఫాదరీ కంగారుపడి మోకరించి అభివాదం చేశాడు. 'పిడికిలికి చూపిన గౌరవం అరచేతికి చూపడంలేదు నీవు ఫాదరీ! దానికి నేలపై సాష్టాంగపడి, దీనికి ఊరక మోకరిల్లుతున్నావు'—అన్నాడు రిచర్డు.

ప్రభువులతో ఇంకా ఏమిమాట్లాడితే ఏమి చిక్కు వస్తుందోనని జడిసి, ఫాదరీ ఇక మారుమాటాడక, మరింతగా వంగి అభివాదంచేసి వెనుకకు తగ్గాడు.

ఈ సమయానికి, మరి యిద్దరు వ్యక్తులు వచ్చి వారిని కలుసుకున్నారు.

# అధ్యాయం ౪౧

ఆ వచ్చిన నూతన వ్యక్తులు ఐవాన్‌హో, అతని అనుచరుడు గర్త్. ఐవాన్‌హో బోటాల్ఫ్ మఠాధికారి గుర్రంమీద వచ్చాడు. ఐవాన్‌హో సొంత అశ్వరాజంమీద వచ్చాడు గర్త్. తన ప్రభువు రక్తసిక్తదేహుడై ఉండడం, చుట్టూ ఆ ప్రదేశంలో ఆరేడుగురు చచ్చిపడిఉండడం చూచేసరికి, ఐవాన్‌హో ఆశ్చర్యచకితుడయ్యాడు. ప్రభువు బందిపోటుదొంగలచే పరివేష్టితుడై ఉండడం అతనికి మరీ ఆశ్చర్యం కలుగజేసింది. ప్రభువును నీలకవచధారిగా సంబోధించాలో, మరే విధంగా సంబోధించాలో తెలియక అతడు తికమక పడుతూండడం చూచి, రిచర్డు—

'సంశయ మక్కరలేదు విల్ఫ్రెడ్! ఇప్పుడు నా పేరుతో లేదా నన్ను నన్నుగానే నీవు సంబోధించవచ్చు. ఈ చుట్టూ ఉన్నవాళ్ళంతా అచ్చమైన ఆంగ్లేయులు. అచ్చమైన ఆంగ్లరక్తం వారి శరీరాల్లో ప్రవహిస్తూ ఉండడం వల్లనే, పరిస్థితులనుబట్టి ప్రక్కతోవలు తొక్కారు'—అన్నాడు.

అంతట రాబిన్‌హుడ్ ముందుకు వచ్చి,—'సర్ విల్‌ఫ్రెడ్, నీకు నమ్మకం కుదరడానికి ప్రభువులు సెలవిచ్చినదానికంటె విశేషించి నేనేమీ చెప్పలేను గాని, ప్రభుభక్తిలో మేమెవ్వరికీ తీసిపోయేవాళ్ళము కాదని విశ్వసించ గోరుతున్నాను'—అన్నాడు.

'నాకా విషయంలో ఎట్టి సందేహమూ లేదు. కాని ప్రభువుల కవచమిలా రక్తసిక్తమై ఉన్నదేమిటి? ఈ చచ్చిపడిఉన్నవాళ్లెవరు?'— అని అడిగాడు ఐవాన్‌హో!

'రాజద్రోహం నా దర్శనానికి వచ్చింది విల్ఫ్రెడ్! ఈ విద్రోహబృందం కారణంగా తగిన సత్కారం పొందింది. అది సరేకాని'— అంటూ రిచర్డు చిరునవ్వుతో—'నీవుకూడా ఒక రాజద్రోహివి లాగానే తోస్తున్నావు. నేను బయలుదేరి వచ్చేటప్పుడు నీకు చెప్పినదేమిటి? గాయం బాగా మానేటంతవరకూ సెంటు బోటాల్ఫ్ మఠంనుంచి కదలవద్దని చెప్పలేదా? ఇదేనా నా ఆజ్ఞ పాలించడం?'— అని అడిగాడు.

'గాయం నయమయింది ప్రభూ! కత్తితో గీరుకొని పోయినట్లుగా మాత్రమున్నదిప్పుడు. మరేం ఫరవాలేదు. కాని, ఈ ఒంటరి ప్రయాణాలతోనూ ఉద్ధత చేష్టలతోనూ ప్రాణాపాయ స్థితులు తెచ్చుకొని, మావంటి భృత్యుల హృదయాలకు ఎందుకు క్లేశం కలిగిస్తారు ప్రభూ! కత్తి బల్లెమూ చేతబట్టి, వాటితో ఆర్జించగల యశస్సే సర్వస్వంగా తిరుగాడే సామాన్య యోధులవంటివారు కారు మీరు'— అన్నాడు ఐవాన్‌హో.

'జింకమాంసపు వంటకాలున్నాయి. అంతేనా? ఆకలితో ఉన్న వ్వాడికి అంతకంటె మంచి ఆహార పదార్థం మరి ఉండదు. ఇంటిపట్టున ఉండి తన ఆహారానికై సొంతంగా జింకలను వేటాడుకోకుండా తిరిగే రాజుకు, ఇతరులు వేటాడి ఆహారం తెచ్చిపెడితే కస్సుబుస్సు లాడవలసినపని యెంతమాత్రమూ లేదు',— అన్నాడు రిచర్డు.

'అయితే తమరిలా నా పెంపు వదులుకోదలుస్తున్నాను. జింకమాంసమే కాదు. మంచి ద్రాక్షాసవంతో తుల్యమైన జేగజాలి మధువుకూడా ఉంది. ప్రభువులు చవి చూద్దురుగాని'— అన్నాడు రాబిన్‌హుడ్డు.

రాబిన్‌హుడ్డు పరివారమూ, రిచర్డు ఆజ్ఞానుసారం అతని ననుసరించాడు. ఆ యాటవికులతో పరిచయం అతనికి, రాజపరివారంలో మంత్రి సామంత పురోహితులతో కూడియున్న దానికంటె ఎక్కువ సంతోషంగా ఉంది. ఎప్పటి కప్పుడు కొత్త కొత్త సాహసకృత్యాలు చేస్తూ ఉండడం, కొత్త కొత్త పరిచయాలు కల్పించుకుంటూ ఉండడం అతనికిష్టం. ముఖ్యంగా, అపాయాన్ని ఎదుర్కొని గడచి బయటపడ్డ సందర్భాల్లో ఈ నూత్న పరిచయాల కుండే రుచి యిక చెప్పనలవికాదు. ప్రాచీనగాథల్లో వినవస్తూవుండే వీరవరుల విచిత్ర లక్షణాలు రిచర్డులో ప్రత్యక్షమైనాయా అనిపిస్తుంది. తన బాహుబల ప్రదర్శనాలతో తాను సంపాదించే కీర్తియం దతనికున్నంత ప్రీతి, రాజ్యచక్రం త్రిప్పడం ద్వారా సంపాదించగల కీర్తియందు లేదు. అందువల్లనే, అతని పరిపాలన, ఆకాశంలో హఠాత్తుగా తోచి ఇంచుక సేపు అనవసరమైన వెలుగులు విరజిమ్మి త్వరలో అంతర్థానమైపోయే తోకచుక్క గమనం వంటిదైపోయింది. అతని శౌర్యసాహసాలు చారణుల పాటల్లో కెక్కాయి. కాని, 'దేశానికి ఈ సుస్థిర ప్రయోజనాలు ఇతనివల్ల కలిగా'యని చరిత్రకారులు వర్ణించడానికి మాత్రం ఏమీ దొరకదు. రాబిన్‌హుడ్ ప్రభృతులమధ్య అతనికిప్పుడు యెంతో ఉల్లాసంగా ఉన్నది. ఏ తరగతులవారిలో నైనాసరే సాహసికులంటే అతని కమితమైన ప్రీతి.

ఒక పెద్ద ఓకు వృక్షం నీడలో, ఆంగ్లదేశప్రభుని ఆతిథ్యం కోసం జరగవలసినవేర్పాట్లు త్వరితంగా జరిగిపోయాయి. బందిపోటుదొంగ లిప్పుడతని యాస్థానీయులు. ఆసవపాత్ర ఒకసారి చుట్టుతిరిగి వచ్చేసరికల్లా, ఆయాటవికులకు ప్రభుని సమక్షంలో ఉన్నామనే భయం తొలగిపోయింది, పాటలు పాడేవాళ్లూ, ఛలోక్తులు విసిరే వాళ్ళూనూ! 'ఆనాడు అలా జరిగింది, ఈనాడు ఇలా చేశాం,'— అంటూ యెవరికి తోచిన కథలు వారు చెప్పడం సాగించారు. ఆ చెప్పడంలో తాము ప్రభు సమక్షంలో మాట్లాడుతున్నామన్న సంగతే మరిచిపోయారు. రిచర్డు వారితోపాటుగా నవ్వుతూ తుళ్ళుతూ ఛలోక్తులు విసురుతూ కాల

విందు వేడుకలాంటి కదనోత్సాహంలోకి ఈ మార్పు రిచర్డుకు మరింత ఆనందం చేకూర్చింది. తిరిగి కవచం, శిరస్త్రాణం గర్తుచేత తొడిగించుకుంటూ, ఐవాన్‌హోతో ఇలా అన్నాడు: 'నీవు మాత్రం ఈ కయ్యంలోకి దిగబోకు. చాలా బలహీనంగా వున్నావు. దీనివల్ల మాత్రం నాకు కోపం వచ్చేమాట నిశ్చయం. ఇదివరలో, రెండుసార్లు నా కళ్ళయెదుట నాకోసం నీవు పోట్లాడావు. ఈ పర్యాయం నీకోరకు నేను పోరాడుతాను, ప్రక్కనవుండి చూస్తూ ఉండు.'

ఈ లోపున రాబిన్‌హుడ్డు శత్రువుల జాడ కనుపెట్టడానికన్నట్లుగా నాలుగు వైపులకూ అనుచరులను పంపాడు. అందరూ ఇలా తలొక వైపునకూ వెళ్ళిపోయిన తర్వాత అతడు రిచర్డును సమీపించి, మోకరిల్లి క్షమాపణ వేడుకొన్నాడు.

'ఏమిటిది రాబిన్! నీ తప్పులన్నీ పూర్తిగా క్షమిస్తానని ఇదివరకే చెప్పివేసితిని కదా? నామాట దాటి పెంజబోగ నాలికెగిరిపోతుం దను కున్నావా? ఇంతలో నీవు క్రొత్తగా చేసిన అపరాధమేమిటి క్షమాపణ వేడుకోడానికి?'— అన్నాడు రిచర్డు.

'చేశాను ప్రభూ! తమ క్షేమం కోసమే తమను వంచన చెయ్యడానికి ప్రయత్నించాను. మీరు విన్న యీల నా లాక్సిలీది కాదు. నా ఆనతి ప్రకారం నా అనుచరుడే అలా ఊదివేశాడు. ఈ విందు ఇంకా యెక్కువ కాలం సాగితే ముఖ్యమైన మీ రాచకార్యాలకు హాని కలిగుతుందని అలా చేశాను,'— అంటూ రాబిన్‌హుడ్ లేచి, చేతులు కట్టుకొని ప్రభువు ఆజ్ఞకోసం ప్రతీక్షిస్తూ నిలబడ్డాడు.

రిచర్డు ముఖం కోపంతో మొదట కందగడ్డ అయింది. కాని, యింతలోనే, అతని న్యాయబుద్ధి యీ తాత్కాలికోద్రేకాన్ని నిగ్రహించి వేసింది. వెంటనే రాబిన్‌హుడ్డుతో ఇలా అన్నాడు: 'నీ జింక మాంసం, నీ మధువు యెక్కడ కర్చయిపోతుందోనని జడిసినట్లున్నావురా! మంచిది! రేపు నీవు లండనుకు నన్ను చూడవచ్చేటట్లయితే, నీయంత పిసినిగొట్టుగా నే నుంటా ననుకున్నావా? అయినా, మంచిపనే చేశావు రాబిన్! మేమిప్పుడు వెంటనే బయలు దేరి పోవాలి. విల్ఫ్రెడ్ ఈ గంటసేపటినుంచీ యెంత ఆతురగా ఉన్నాడో చూడు. తన సలహా ప్రకారం నేను చెయ్యకపోతే ఇలాగే ఖిన్నముఖుడై కూర్చుంటాడు. ఇలాంటి అనుచరుడు నీ పరివారంలో నీకెవరైనా ఉన్నారా రాబిన్‌హుడ్?'

'ఉన్నాడు, నా ముఖ్యానుచరుడు లిటిల్ జాన్ అలాంటివాడే! ఇప్పుడు స్కాట్లెండు ప్రాంతానికి ఒక పనిమీద వెళ్ళాడు. నాకు సలహా ఇచ్చే

విషయంలో అతని చొరవకు అప్పుడప్పుడు నాకు మహా చెడ్డ చిరాకు వేస్తూ ఉంటుంది. కాని, కాస్త తమాయించుకొని ఆలోచిస్తే, అతనిమీద నాకోపం ఎంతసేపో నిలవదు. నా క్షేమం తప్ప ఇతరమేదీ తెలియనివాడిపై నే నెలా ఆగ్రహించగలను ప్రభూ!'— అన్నాడు రాబిన్‌హుడ్డు.

'నిజం చెప్పావు రాబిన్! నా శిష్యులు అలాంటి కలహోద్దాతలే ఏర్పడ్డారు. తాను చెప్పినది నేను చేసేటంతవరకూ విచారవదనంతో కూర్చుంటాడు ఐవాన్‌హో. ఇక నీవో— నా శ్రేయస్సుకోసమని నన్ను తమాషా వంచన చేస్తూ ఉంటావు. ఇలాంటి మీ యిద్దరిమధ్యా నే ననుభవించే స్వేచ్ఛ ఏమని చెప్పను! సరే, ఇక పదండి, త్వరగా కోనింగ్స్‌బర్గ్‌కోటకు చేరుకుందాం'— అన్నాడు రిచర్డు.

మార్గం నిరుపద్రవంగా ఉన్నదీ లేనిదీ కనుక్కోవడంకోసం, ముందుగానే కొంతమంది అనుచరులను పంపించానని రాబిన్‌హుడ్ తెలియజేశాడు. బహుశః ఎట్టి ప్రమాదమూ ఉండదని, ఒకవేళ అట్టిదేదైన వాటిల్లేటట్లుంటే వచ్చి ఆదుకోడానికి వెనుకనుంచి తాను అనుచరులతోసహా బయలుదేరుతున్నాననీ అన్నాడు. రిచర్డుకు చాల సంతోషం కలిగింది. అనుగ్రహసూచకంగా అతనికి తన చేయి అందించి, తప్పులన్నీ మన్నించానని చెప్పి, అటవీశాసనపు కఠిన నిబంధనలను త్వరలో సడలింపజేయగలనని వాగ్దానం చేశాడు. ఈ శాసనకాఠిన్యం మూలంగానే శాక్సన్‌లనేకులు ప్రభుత్వంపై తిరుగుబాటు చేయడం సంభవిస్తూ ఉంది.

రాబిన్‌హుడ్ అంచనవేసినట్లుగానే, ప్రయాణం నిరుపద్రవంగా సాగింది. ఐవాన్‌హోతోనూ, గర్తు వాంబాలతోనూ రిచర్డు కోనింగ్స్‌బర్గు దుర్గం దరిదాపులను చేరుకునేసరికి ఇంకా సూర్యాస్తమయం కాలేదు. డాన్‌నదీతీరాన, చక్కని ప్రకృతి సన్నివేశంలో ఒక పర్వతంపై నిర్మించబడిన వనదుర్గమది. నార్మన్ ఆక్రమణకు పూర్వం ఇంగ్లాండు దేశపు రాజులు ఇక్కడనే నివసిస్తూ ఉండే వారు. బయటి ప్రాకారం దరిమిలా నార్మన్లచే పునర్నిర్మించబడినా, లోపలి కట్టడమంతా పురాతన పద్ధతిలోనే ఉంది. మన కథాకాలానికి నార్మన్లీ బయటి ప్రాకారాన్ని పునర్నిర్మించడం జరగలేదు. శాక్సన్ల వాస్తుశిల్ప విశిష్టత అంతా ఈ దుర్గనిర్మాణంలో చూడవచ్చు.

దుర్గాధిపతి ఎథెల్‌స్టేను మరణానికి విచార సూచకంగా ఒక నల్లజెండా దుర్గ శిఖరంమీద ఎగురుతోంది. బయటి దర్వాజామీద మరొక జెండా ఉంది: దానిపై ఒక తెల్లగుర్రం బొమ్మ చిత్రించబడి ఉంది. అది ఎథెల్‌స్టేన్ పూర్వీకులైన శాక్సన్ రాజుల పతాకచిహ్నం. ఎథెల్‌స్టేను అపరకర్మకు చాల పెద్ద ఎత్తున సన్నాహాలు చేయబడ్డాయి. బంధువర్గానికే కాక త్రోవను పోయే బాటసారులనుకూడా ఆహ్వానించి ఆతిథ్యమివ్వడం అప్పటి ఆచారం. కోటంతా చాలా హడావుడిగా ఉంది. కోనింగ్స్‌బర్గుకొండ ఎక్కే దారూ దిగే దారూనూ.

రిచర్డు తన పరివారంతో బయటిదర్వాజా దాటి లోనికి ప్రవేశించి చూడగా, అక్కడ ఒక వైపున కొందరు వంటవాళ్లు మాంసాహారాలు తయారు చేస్తున్నారు. పక్కన మధువుతో నిండిన బానలున్నాయి. అతిథులు యథేచ్ఛగా ఇచట ఆ మాంసాహారాలు పుచ్చుకొని మధుపానాలు చేస్తున్నారు. వీరెక్కువ, వారు తక్కువ, అని లేకుండా, యెల్లరికీ అవి విరివిగా అందివ్వబడుతున్నాయి. పలుతరగతులవాళ్లు ఆ సమూదాయాల్లో ఉన్నారు. ఆరునెలల నుంచీ అలాంటి ఆహారపానీయాలు చవిచూచి యెరగని వాపిరితనంతో సాక్సన్ దాసులు కొందరు వాటిని సేవించడం ఒక పక్క కనిపిస్తోంది. సాక్సన్‌లలోనే స్వతంత్రులైనవారిలో ఈ వాపిరితనం కనిపించక పోయినా, అప్యాయంగానే వాటిని సేవిస్తూ రుచిపాకాల విమర్శ చేస్తున్నారు. ధనికవర్గానికి చెందని నార్మన్ జాతీయులుకూడా కొంద రిక్కడ కనుపించారు. ఈ సాక్సన్ ఆచార సంప్రదాయాలను యెద్దేవాగా చూస్తూనే వాళ్లు మధుమాంస భక్షణ యథోచితంగా చేస్తున్నారు.

వీరుగాక, పాలస్తీనానుండి తిరిగి వచ్చిన యాత్రికులు, సైనికులు కొంద రచట కనుపించారు. బిచ్చగాళ్ళ సరేసరి. సాక్సన్ చారణులు కొందరు తమ తంబురాలు మీటుతూ ఏవేవో పాటలు పాడుతుంటే వారి చుట్టూ జనం మూగుతున్నారు. గారడీవాళ్ళు గారడీ విద్యలు ప్రదర్శిస్తూ ఉంటే హాస్యగాళ్ళు హాస్యాలు చేస్తున్నారు. అపరకర్మవంటి దుఃఖసమయాల్లో కూడా ఇలాంటి వినోదాలు తప్పుగా యెంచేవారు కారు సాక్సన్‌లు. అయితే, యెథెల్‌స్టేన్ మరణం మధ్యమధ్య గుర్తుకొచ్చి కొందరు పురుషులు డగ్గుత్తికచెంది మాట్లాడుతుంటే, కొందరు స్త్రీలు గొంతెత్తి విలపించడం కూడా కనిపిస్తోంది.

అతిథులను యథేచ్ఛగా తిరగనిస్తూ అచట ఊరక సంచరిస్తున్న వేత్ర హస్తుడొకడు, రిచర్డునూ, ఐవాన్‌హోనూ చూడటంతోటే, యెవరో యోధులని ఊహించి, అలాంటివారిని ప్రత్యేకంగా గౌరవించడం తన విధియని తెలిసినవాడు గనుక, గౌరవపురస్సరంగా సమీపించి జనంలోంచి దారిచేస్తూ మేడమీదికి తోడ్కొనిపోయే మెట్లగేటువద్దకు తీసుకొనివెళ్లాడు. గర్తు, వాంబాలు ఇవతలనే ఆగిపోయారు. వారికి అక్కడ యెవరో పరిచితులు కనిపించారు, అదిన్నీ గాక, ప్రత్యేకంగా పిలువనంపబడితే తప్ప, తాము లోనికి పోకూడదని వారికి తెలుసు.

# అధ్యాయం ౪౩

కోనింగ్స్‌బర్గ్ దుర్గ గోపురానికి నాలుగంతస్తులు. మొదటి రెండంతస్తులూ చీకటి కొట్లాలు. లోపల గుండా గోరంగా ఉన్న సోపాన పంక్తిద్వారాగా ఈ రెండంతస్తులనూ దాటి మూడవ అంతస్తులోనికి పోవాలి. శ్వేతహస్తుడు రిచర్డునూ ఐవాన్‌హోనూ ఆ రీతిగా తోడ్కొనిపోయి మూడవ అంతస్తుకు చేర్చాడు. అచట ఒక పెద్ద ఓక్‌బల్ల చుట్టూ కొంతమంది పెద్దలు సమావేశమై ఉన్నారు. ఎథిల్‌స్టేను అపరకర్మలలో పాల్గొనే నిమిత్తమై ఆ చుట్టుపట్లనుండి వచ్చిన సాక్సన్ ప్రముఖులు వారు. అందరూ వృద్ధులే, యువకులెవరూ లేరు. విజేతలైన నార్మన్లతో కలియనొల్లక, సెడ్రిక్ వలెనే తమచుట్టూ అడ్డుగోడలు నిర్మించుకొని, తమ సాక్సన్ అభిజాత్యాన్ని గూర్చి నిత్యమూ తలపోసుకుంటూ కాలక్షేపం చేస్తూ ఉండిన వృద్ధులు వారు. ఆ తెల్లని జులపాలు, ఆ పొడుగాటి గడ్డాలు, ఆ నల్లని అంగీలు, ఆ విషాదగంభీర వదనాలు,—అది యొక విచిత్ర దృశ్యం.

సెడ్రిక్ ఆ పెద్దలందరిలోకీ పెద్ద. రిచర్డును చూడడంతోనే తటాలున లేచి, తన విముక్తికి తోడ్పడిన నల్లకవచధారి ఇతనే కృతజ్ఞతాభావం ప్రకటిస్తూ, అభివాదపురస్సరంగా స్వాగతం పలికి, తమ ఆచారాన్ననుసరించి మధుపాత్ర చేతితో పైకెత్తాడు. సాక్సన్ ఆచారపద్ధతులు బాగా తెలిసిన రిచర్డు కూడ సముచితంగా ప్రత్యభివాదం చేసి, పరిచారకుడందించిన మధుపాత్రను గైకొని సేవించాడు. ఇలాంటి మర్యాదే ఐవాన్‌హోకు కూడ జరిగింది. సెడ్రిక్ ఐవాన్‌హోను గుర్తుపట్టలేదు. కంఠస్వరాన్ని బట్టి గుర్తుపడతాడేమో అని నోరు మెదపకుండానే తండ్రికి ప్రత్యభివాదం చేశాడు ఐవాన్‌హో.

పిమ్మట సెడ్రిక్ వారి నిద్దరినీ, ఆ యంతస్తునానుకొని ఉన్న ఒక చిన్న ప్రార్థనా మందిరంలోనికి తోడ్కొనిపోయాడు. రెండు దివిటీలక్కడ వెలుగుతున్నాయి. వాటి వెలుతురులో, శిలానిర్మితమైన బలిపీఠం ముందర, యెథెల్‌స్టేన్ శవపేటికగల పాడెవద్ద కొందరు పాదరీలు ప్రార్థనలు చేస్తున్నారు. ఎథెల్‌స్టేను తల్లి సెంటుఎడ్మండు కాన్వెంటునుండి వీరిని ప్రత్యేకంగా పిలిపించింది— ఈ ప్రార్థనలు జరిపించినందుకు సెంటుఎడ్మండు కాన్వెంటుకు చెల్లించే కట్నం చాలా ఉంటుంది. ఈ సందర్భంలో పాదరీలకు ముట్టేది కూడా చాలా ఉంటుంది కనుక, కదలలేని కుంటిపాదరీ యొకడు మినహా తక్కిన పాదరీలంతా కట్టకట్టుకొని ఇందునిమిత్తమై బయలుదేరివచ్చారు. కొందరీ పాడె వద్ద కనిపెట్టుకొని ఉంటే, తక్కినవారు యొలాగో వీలు చేసుకొని అచటి విందువినోదాల్లో పాల్గొంటూనే ఉన్నారు. పాడెను కనిపెట్టుకొని ఉన్న పాదరీలు

ఒక్క క్షణమైనా విరామమివ్వకుండా శ్రద్ధగా ప్రార్థనలు కొనసాగిస్తున్నారు. విరామమిస్తే, క్షుద్రదేవతలు మృతజీవుని చేజిక్కించుకుంటారని అక్కడివారి విశ్వాసం. పాదరీలు ఆ పాడె సమీపానికి కూడా పరాయివారి నెవ్వరినీ రానివ్వడంలేదు. అది సెంటు ఎడ్మండు చనిపోయినప్పుడు ఉపయోగించిన పాడె యట. అంతచే వారు దానిని చాలా పవిత్రంగా చూసుకొంటున్నారు. సామాన్యుల చేతులు తగిలితే, అది అపవిత్రమైపోతుందని వాళ్ల భయం. సెంటు ఎడ్మండున్న కాన్వెంటు పాదరీలు ఇంత శ్రద్ధాభక్తులతో ఈ కర్మకాండ జరిపించడానికి మరొక కారణం కూడా ఉంది. కుమారుని ఆత్మ నిముక్తికోసం ఈ సందర్భంలో చెల్లించే నూరు బంగారు నాణేలూ కాక, కాన్వెంటులో తన కుమారునికోసమూ భర్తకోసమూ శాశ్వతంగా ప్రార్థనలు జరుగుతూ ఉండడానికై ఒక సుక్షేత్రమైన భూమిని కూడా కాన్వెంటుకు వ్రాసి ఇస్తానని యెథెల్‌స్టేను తల్లి వాగ్దానం చేసింది.

కొంతసేపు సెడ్రిక్ ఉచితరీతిగా ప్రార్థన చేస్తుండగా, రిచర్డు ఐవాన్ హోలు కూడ ప్రార్థనలు చేశారు. కొన్నాట సెడ్రిక్ సద్దు చేయకుండా వారిని మరొక చోటికి తీసుకొనిపోయాడు. అది కూడా పెట్టెకుర్చీగా చాపటకు వీలు లేని ఒక చిన్న గది. సన్నని కిటికీలోంచి సాయంసంధ్యారుణ ప్రభ కొంచెముగా లోనికి ప్రసరిస్తోంది. తలయున్నపళ్లైన ఒక స్త్రీ అక్కడ కనిపించింది. ఆమె యెథెల్‌స్టేను తల్లి ఈడిత్. ఒకప్పుడు గొప్ప సౌందర్యవతి యని తోచింపజేసే రూపురేఖ లామెవి. దుఃఖసూచకమైన దుస్తులు ధరించి ఉంది. ఆమె ఎదుట బల్లపై దంతంతో శిల్పించబడిన ఒక శిలువ, దాని పక్కన ఏ నాడు పాడుకునా ఉపయోగించడానికి వీలైన ఒక పెద్ద ప్రార్థనగ్రంథం ఉన్నాయి.

సెడ్రిక్ తన వెంటనున్న ఇద్దరినీ — ముఖ్యంగా సిలువధారిని ఆమెకు ఎరుకపరిచాడు. ఎథెల్‌స్టేను విముక్తికై పోరాడిన యోధాగ్రేసరుడితడే యని చెప్పాడు. ఆమె సిలువధారియెడ కృతజ్ఞత ప్రకటిస్తూ, 'దైవం అన్యథా సంకల్పించినందువల్ల మీ శ్రమ ఫలించలేదు. ఈ అభాగ్యురాలి దుఃఖంలో పాలు పంచుకోడానికి మీ రిక్కడ వచ్చినందుకు మరింతగా నా కృతజ్ఞత తెలియజేసుకుంటున్నాను.'—అని, 'వీరిని అతిథిసత్కారంతో ఏ విధంగా గౌరవిస్తారో అదంతా మీదే భారమంటూ సెడ్రిక్‌ను హెచ్చరించింది.

సెడ్రిక్ నిశ్శబ్దంగా మరల అక్కడనుండి బయలుదేరి, మరొక సోపాన వలయంమీదుగా ఆ పై అంతస్తుకు రిచర్డు ఐవాన్ హోలను తోడ్కొనిపోయాడు. అక్కడ సుమారొక యిరవైమంది యువతీమణులు సమావేశమై ప్రార్థనలు చేస్తున్నారు. రొవీనా ఒక ప్రార్థనగీతం మంద్రవిషాదస్వరంతో పాడుతోంది. మరి నలుగురు యువతులుగూడ ఆమెతో కలిసి పాడుతున్నారు. ఎథెల్‌స్టేను శవపేటికకై కప్పడానికని నిర్దేశించబడ్డ ఒక పట్టువస్త్రముపై పలు

రకాల అల్లికలల్లుతున్నారు కొందరు స్త్రీలు. మరికొందరు, శవపేటిక నలంకరించడానికే, గంపలనిండా పుష్పాలతో పూలమాలలు గ్రుచ్చుతున్నారు. ఒక విధమైన ఆచార నియమానికి కట్టుబడి వారు ఆయా పనులు నిర్వహిస్తున్నారే కాని, వారి వదనాల్లో విచారరేఖ ఎక్కడా కనిపించడంలేదు. ఎడనెడ చిరునవ్వులు నవ్వేవాళ్లు, ప్రక్కవారితో గుసగుసలాడేవాళ్ళూను. అది చూచి, వారి కంటె పెద్దవాళ్లు వాళ్ళను మందలిస్తున్నారు. ఒక్కొక్క యువతి, తాను విచారసూచకంగా ధరించిన నల్లని ముసుగు తనకు బాగా నప్పిందో లేదో చూచుకుంటోంది. ఈ వెకిలిచేష్టలు నూతన వ్యక్తులను చూచినతర్వాతకూడ తగ్గలేదు. ఒక్క రొవెనాలో మాత్రమే ఈ వెకిలిచేష్టలు లేవు. నల్లకవచధారిని చూడగనే ఆమె గౌరవభావంతో సుకుమారంగా అభివాదంచేసింది. ఒక విధమైన విచారం ఆమె వదనంలో కనిపిస్తూఉన్నా, దిగులుపడి కూర్చున్నట్లు మాత్రం ఆమె కనిపించలేదు. ఎథెల్‌స్టేను మరణానికంటె, ఐవాన్‌హో యెక్కడ ఏ పరిస్థితిలో ఉన్నాడో అనేదాన్ని గూర్చిన ఆలోచన ఆమెను యెక్కువగా కలవరపెట్టుతున్నదని చెప్పవచ్చు. కాని, సెడ్రిక్కుకు ఈ సూక్ష్మభావాల పరీక్ష బొత్తుగా తెలియని కారణంచేత, రొవెనా విషాదం ఎథెల్‌స్టేనును గూర్చే అనుకొన్నాడు. ఆ సంగతి నల్లకవచధారికి తెలియజేయడం మర్యాదగా భావించి అతనితో అన్నాడు—'ఎథెల్‌స్టేను కిచ్చి వివాహం చేయ నిశ్చయించబడిన కన్య యీమె' అని.

అపరకర్మను గూర్చిన కలాపం ఎక్కడెక్కడ ఏవిధంగా జరుగుతోందో ఈ రీతిగా అతిథులకు చూపెట్టిన తర్వాత, సెడ్రిక్కు వారి నిద్దరినీ మరొక చిన్న గదికి తీసుకొనిపోయి, 'మీరిక్కడ బసచేసి విశ్రాంతి తీసుకోండి, మీకు కావలసిన వసతులన్నీ ఏర్పాటు చేయిస్తా'నని చెప్పి వెళ్ళిపోబోతుండగా, రిచర్డు అతని చేయిపట్టుకొని, ఒక క్షణం ఆగమని కోరుతూ, 'మీరు నన్ను ఇదివరలో ఒక వరం కోరుకోమన్నారు, అది యిప్పుడు అడగదలిచాను. ఇస్తారుగదా' అని అడిగాడు.

'ఇంకా సందేహమేమిటి? మీరు అడక్కముందే అది మీకు యిచ్చివేశాను. కాని, ఈ విషాదసమయంలో...'—అని యింకా ఏదేమో చెప్పబోతూ ఉండగా, రిచర్డు,—'ఆసంగతి కూడ ఆలోచించాను. కాని, తర్వాత నాకు వ్యవధి ఉండదు. అదిన్నీగాక, ఇదే మంచి సమయమని కూడా నాకనిపిస్తోంది. ఎథెల్‌స్టేను భౌతికశరీరాన్ని సమాధి చేసేటప్పుడే, మనలో మనకుగల కొన్ని అపోహలనూ అనుమానాలనూ గూడ సమాధి చేసివెయ్యడం ఉత్తమం' అన్నాడు.

సెడ్రిక్ ఇంచుక ఉద్రిక్తుడై,—'మీరన్న దేమిటో నాకు సరిగా తెలియలేదు. మీ రడుగబోయే వరం మీకు సంబంధించినదే కాని, ఇతరులకు సంబం

ధించినది అయివుండదని భావిస్తున్నాను. అది మా వంశగౌరవానికి సంబంధించినదైతే, అందులో పరాయివాళ్లు జోక్యం కల్పించుకోడం తగదు'—అని పలికాడు.

'నేను పరాయివాణ్ణి కానని మీరు కూడా అంగీకరిస్తారనే అనుకుంటాను. లేనియెడల ఎలా జోక్యం కల్పించుకోడం నాకూ సమ్మతం కాదు. ఇంత కాలమూ నేనెవరినో మీకు తెలియదు, ఇప్పుడు చెప్తున్నాను—నేనే ఆంగ్లదేశ ప్రభువును రిచర్డును' అన్నాడు రిచర్డు.

'ఆఁ!' అని సెడ్రిక్కు రెండడుగులు వెనకకు వేశాడు.

'అవును సెడ్రిక్! ఈ ఆంగ్ల భూమండలంపైనున్న సాక్సనులూ, నార్మనులూ, ఉభయులూ నా బిడ్డలే. ఉభయులూ ఏకమై కలిసిమెలసి ఉండాలని మనసారా వాంఛిస్తున్నాను. ఏమి సెడ్రిక్, నీ ప్రభువునెదుట మోకరిల్లడం నీ కిష్టంలేదా?' అని అడిగాడు రిచర్డు.

'ఏ నార్మన్‌కూ ఇంతవరకు నేను మోకరిల్లలేదు'—అని సమాధానమిచ్చాడు సెడ్రిక్.

'అయితే అక్కరలేదులే! నార్మన్లూ సాక్సన్లూ నా దృష్టికి సమానులనీ, ఇరువురనూ యెట్టి విభేదమూ లేకుండ పాలిస్తానని నేను రుజువుచేసుకోగలిగిన నాడే నాకు మోకరిల్లుదువు గాని. అంతవరకూ మోకరిల్లనక్కరలేదు'—అన్నాడు రిచర్డు.

అందుకు సెడ్రిక్ ఇలా జవాబిచ్చాడు: 'మీ శౌర్యసాహసాలనూ మీ గుణగణాలనూ నేనెప్పుడూ అభినందిస్తూనే వచ్చాను. సాక్సన్ రాజవంశానికి చెందిన మెటిల్డా రక్తం మీలో ప్రవహిస్తున్న కారణంచేత, ఆంగ్లసింహాసన మధిష్ఠించే హక్కు మీ కేర్పడినట్లు మీరు చెప్పుకొంటున్న సంగతి కూడా నే నెరుగుదును. కాని, మెటిల్డా రాజవంశానికి చెందినదన్నమాట నిజమే కాని, ఆంగ్ల సింహాసనానికి వారసురాలు కాదు.'

'కాకపోవచ్చు. కాని, వారసులు నా దగ్గరవారు మరొకరు ఎవరున్నారు చెప్పండి! చెప్పగలరా?' అని అడిగాడు రిచర్డ్.

'అవును, ఎథెల్‌స్టేను మరణంతో, సాక్సన్ రాజవంశపు తుది అంకురం అంతరించిపోయింది. ఈ విషయం యెత్తిచూపి, నన్ను అవమానించుటకేనా నీవు ఇంతదూరము పనికట్టుకొని ఇక్కడికి పరుగెత్తుకొని వచ్చినది? ఎంత సాహసం!' అన్నాడు సెడ్రిక్.

‘నిన్ను అవహేళించుటకు కాదు సెడ్రిక్,—నీవు ధీరుడవు గనుక, తోటి ధీరునియందు ధీరునికుండే విశ్వాసంతోనే నీ ముందట ఈ విషయం ఉటంకించాను’ అన్నాడు రిచర్డు.

‘మంచిది. నీవు రాజువే,—నీవన్న సంగతి అంగీకరిస్తాను. నా అల్ప ప్రతిఘటన నిన్ను రాజు కాకుండ నివారించలేదు. ఒకటే మార్గముంది, నిన్ను రాజు కానివ్వకుండ చెయ్యడానికి. అది నాకిప్పుడు అందుబాటులోనే ఉన్నా, నేనందుకు పూనుకోనబోవడంలేదు’— అన్నాడు సెడ్రిక్.

‘అయితే నా కిస్తానన్న వరంమాట ఏమిటి? ఇస్తానన్నతర్వాత ఇక తిరిగిపోగూడదు. ఈ నీ కుమారుడైన ఐవాన్‌హోను మన్నించి, తిరిగి యెప్పటి వలె ఆదరించు. ఇదే నిన్ను నేను అడిగే వరం. మీ యిద్దరూ అన్యోన్య ప్రేమతో ఉండడమే నాకు కావలసినది. ఇందువలన నాకు కలిగే ప్రయోజనం, నా మిత్రుడు సంతోషించడమూ, నా ప్రజలలో అసంతృప్తి శాంతించడమూన్నూ’ అన్నాడు రిచర్డు.

‘ఏమీ, యితడు నా కుమారుడు విల్ఫ్రెడా?’ అన్నాడు సెడ్రిక్, ఐవాన్‌హోవంక చూస్తూ.

‘నాన్నా! నాన్నా! నన్ను మన్నించు!’ అంటూ తండ్రి కాళ్లమీద పడ్డాడు ఐవాన్‌హో.

కుమారుని లేవనెత్తుతూ సెడ్రిక్,—‘మన్నించాను నాయనా, మన్నించాను. నార్మన్‌కు చేసిన వాగ్దానమైనా ఏవిధంగా చెల్లించుకోవాలో హెరివార్డు కుమారుడనైన నాకు ఆమాత్రం తెలియదనుకున్నావా? కాని, నీవు ఈ దుస్తుల్లో ఉండడం నాకు బాగుండలేదు. నీ పూర్వీకులు ధరించిన దుస్తులలో నీవు నా కళ్లయెదుట పడితేనే నాకు బాగుంటుంది. నీవేదో మాట్లాడాలనుకుంటున్నావు’-అంటూండగా సెడ్రిక్ కంఠస్వరం తిరిగి తీవ్రత్వం దాల్చింది: ‘నీవు ఎత్తబోయే సంగతేమిటో నాకు తెలుసు. రోవినా రెండేళ్లవరకూ విచారంగా గడపాలి. కాదగిన భర్త గతించినప్పుడు, ఆ మాత్రం దీక్ష పాటించకపోవడం మన పూర్వులయెడ మహాపచారం చెయ్యడమౌతుంది. ఎథెల్‌స్టేను శవాన్ని ఇంకా సమాధి చెయ్యడం కూడా జరగలేదు. అప్పుడే ఆమెకు వేరొక సంబంధాన్ని గూర్చి తలపోయడం మన పితరులకు ఆగ్రహ కారణమవుతుంది— తన పవిత్ర స్మృతిని ఇలా కళంకితం చేస్తున్నందుకు, ఎథెల్‌స్టేనే భూతమై మన ముందరకు పరుగెత్తుకొని రావచ్చు గూడా!’—అంటున్న సమయంలో—

సెడ్రిక్కు పలికిన పలుకులే మంత్రాలై ఒక భూతాన్ని కల్పించాయా అన్నట్లు, తలుపు తెరచుకొని, శవానికుండే వేషంతో, ఎథెల్‌స్టేను అచట

ప్రత్యక్షమయ్యాడు. సెడ్రిక్ చకితుడై వెనకడుగులు వేసుకుంటూ వెళ్ళి గోడకు చేరగిలబడ్డాడు. చూపు స్తంభించిపోయింది. తెరచుకున్న నోరు మూతపడ లేదు. రిచర్డు ఐవాన్‌హోలు దైవప్రార్థన చేయ మొదలుపెట్టారు.

ఇంతలో, క్రిందనుంచి కేకలు వినపడ్డాయి. 'ద్రోహులు! ఆ సన్యాసుల్ని విడిచిపెట్టవద్దు!'—అంటున్నారు కొందరు. 'చీకటి కొట్లలోకి తోసి బంధించండి' అంటున్నారు మరికొందరు. 'బిగికట్టి కోటబురుజులకు వేలాడదీయండి,'—అంటున్నారు వేరొక కొందరు.

ఇప్పటికి సెడ్రిక్, కొంచెం మనస్సు కుదుటబరచుకొని, ఎదుటనున్న ఆ భూతాన్ని ఇలా ప్రశ్నించాడు: 'ఎవరు నీవు? మనిషివా? దయ్యానివా? మనిషివైతే మాట్లాడు. దయ్యానివైతే ఎందుకిలా రావలసివచ్చిందో చెప్పు. నీ ఆత్మశాంతికి నేను చేయదగినదేమైనా ఉంటే చేస్తాను. మాట్లాడు ఎథెల్‌స్టేన్,—నీవు బ్రతికున్నావా లేదా? మాట్లాడు!'

ఆ భూతం నెమ్మదిగా ఊపిరి పీల్చుకుంటూ ఇలా సమాధానం చెప్పింది: 'మాట్లాడుతాను, నన్ను కొంచెం ఊపిరి త్రిప్పుకోనివ్వండి. ఆఁ,—నేను బ్రతికి ఉన్నానా అని కాదూ మీరడుగుతున్నది? బ్రతికే ఉన్నాను. ఇంత రొట్టె, ఇన్ని మంచినీళ్లతో మూడురోజులు మూడు యుగాలుగా గడపవలసివచ్చినవాళ్లు ఎంతగా బ్రతికి ఉండడానికి వీలుంటుందో అంతగా బ్రతికి ఉన్నానిప్పుడు... అవును సెడ్రిక్ బాబాయ్, రొట్టె, మంచినీళ్లు తప్ప ఇంకేమీ ఈ మూడురోజుల్లోనూ గొంతు దిగలేదంటే నమ్ము. ఇప్పటికైనా అదృష్టవంతుణ్ణి—మీతో ఈ మాటలు చెప్పుకోగలుగుతున్నాను.'

'అదేమిటి ఎథెల్‌స్టేన్? టెంప్లార్ చేత దెబ్బతిని నీవు క్రిందపడిపోవడం నేను కళ్లారా చూచాను? నీ తల నోటివరకూ రెండుగా విచ్చిపోయిందని వాంబాకూడ చెప్పాడు?' అని అడిగాడు నీలకవచధారి.

'నీవు చూచినది పొరపాటు. వాంబా అబద్ధమాడాడు. నా తల విచ్చిపో లేదు. నోరు తిన్నగానే పనిచేస్తోంది. ఇప్పుడంటే యిప్పుడు—ఎలాంటి విందు భోజనం ఆరగించడానికైనా సిద్ధం! టెంప్లారు కత్తిదెబ్బను నేను గదతో అడ్డుకోడంలో కత్తి బెసిగి బల్లపరుపుగా నా తలమీద పడింది. శిరస్త్రాణం లేక పోవడంవల్ల ఆ దెబ్బకు తల దిమ్మెక్కిపోయి క్రిందపడిపోయాను. గాయము మాత్రం తగల్లేదు. ఇంతలో ఆ పోరాటపు తీవ్రతలో యితరులు వచ్చి నా మీద పడ్డారు. నాకు స్పృహ తప్పిపోయింది. తెలివి వచ్చి చూద్దునుగదా, ఒక శవపేటికలో వున్నాను. అదృష్టవశాత్తూ దాన్ని పూర్తిగా మూయడం జరుగలేదు. సెంటు ఎడ్మండు చర్చిలో బలిపీఠం ముందర నా పేటిక ఉంచబడివుంది. నేను వరుసగా తుమ్ములు తుమ్మి గోంద్రించాను. నా అలికిడి విని,

మఠాధికారీ, మరొక సన్యాసీ పరుగెత్తుకొని వచ్చి, నేను బ్రతికివుండడం చూసి భయకంపితులయ్యారు. వచ్చినవాళ్ళు వారసులం తామే అని అనుకోడం వాళ్ళకు అభ్యాసం కనుక, నేను బ్రతకడం వారికి సమ్మతం కాలేదు. నేను ప్రాణాపనం కావాలని అడిగితే, ఏదో తెచ్చారు. అందులో ఏమి మందు కలిపారో, నాకు ఆకరాని నిద్రమత్తు వచ్చింది. చాలా సేపటిదాకా మేలుకోలేకపోయి నాను. ఎట్టకేలకు మేల్కొని చూద్దునుగదా, నా చేతులూ కాళ్ళూ గట్టిగా కట్టివేసి వున్నాయి. ఇప్పటికీ నాకా నొప్పులు పోలేదు. చుట్టూ కటికచీకటి, నేనొక భూగృహంలో ఉన్నట్లు స్పష్టమవుతుంది. నాకు పట్టిన దురవస్థకు విచారిస్తూ అలాగే పడుకొనిఉన్న సమయంలో, మఠాధికారి మరొక సన్యాసితో భూగృహం తలుపు తెరుచుకొని లోనికి వచ్చాడు. నేనున్నది ఈ లోకం కాదని నాకు నమ్మకం కలిగించాలని వాళ్ళ ఉద్దేశం. కాని, అది నేనెట్లా నమ్మతాను? ఆ మఠాధికారి వెలివిడి గొంతు నాకు చిరపరిచితం. మా యింటికి విందులకు తరచు వస్తూవుండేవాడు. జింకది తొడమాంసం కావాలని పాత్రేయపడి అడిగి పెట్టించుకొనేవాడు. దుర్మార్గుడు! ఆ చిన్న విశ్వాసమైనా చూపలేదు' అన్నాడు ఎథెల్‌స్టేన్.

'ఊరుకో పడకు ఎథెల్‌స్టేన్! కొంచెం ఊక్క తిప్పుకొని నెమ్మదిగా నీ కథ అంతా చెప్పు. చాలా విచిత్రంగా ఉంది'—అని హెచ్చరించాడు రిచర్డు.

'విచిత్రమేమిటి! ఇక్కడ కడుపుమాడిపోతేను! ఇంత బార్లీరొట్టె, నీళ్ళు—ఇవి తప్ప ఇంకేమీ ఇవ్వలేదీ విశ్వాసఘాతుకులు. మా నాన్నగాని నేనుగాని, వీళ్ళకు ఎంతెంత దోచిపెట్టాము! అదేమైన తలపోశారా! బొన్నరొట్టె, నీళ్ళు, ఇవీ వీళ్ళు తమ పోషకుడనైన నాకిచ్చినవి. నేను తర్వాత వెలివేయబడ్డా సరే, వీళ్ళను బయటికి తోలిందాకా నే నిక నిద్రపోను'—అని ఉద్రేకం ప్రకటించాడు ఎథెల్‌స్టేన్.

సెడ్రిక్ అంతట అతనిని సమీపించి చేయిపట్టుకొని,—'అయితే మరి, ఈ ప్రమాదంనుంచి ఎలా తప్పించుకోగలిగావు ఎథెల్‌స్టేన్! వాళ్ళ మనస్సులేమైనా మారాయా?'—అని అడిగాడు.

'వాళ్ళ మనస్సులా మారేది! అసంభవం! ఎండకు రాళ్ళు కరుగుతాయా? వాళ్ళ చేతుల్లోంచి ఇప్పటికీ నేను బయటపడి ఉండేవాణ్ణి కాదు. అదృష్టవశాత్తూ దాదాపు కాన్వెంటులోని వారంతా, ఇక్కడ జరగబోయే అపరకర్మ కలాపంలో పాల్గొనే నిమిత్తం కాన్వెంటు విడిచి వెళ్ళిపోవడం జరిగింది. ఆ సందడి నాకు వినిపిస్తూనే ఉంది. నాకు కడుపులో ఆకలి మండిపోతోంది. కొంత సేపటికి ఒక సన్యాసి తూలుతూ భూగృహం తలుపు తీసుకొని వచ్చాడు. ఘాటైన మద్యపు వాసన వానివద్ద గుప్పుగుప్పున కొడుతోంది. వాని ఒళ్ళు

వానికి తెలియటంలేదు. మామూలుగా నాదగ్గిర వదలివెళ్ళే బార్లీరొట్టె నీళ్లకు బదులు, ఈసారి రుచికరమైన మాంసాహారం, ఘాటైన మద్యం విడచివెళ్లాడు. నేను నెమ్మదిగా ఆ ఆహారం తిని మద్యం త్రాగాను. శరీరంలో కొంత ఓపిక వచ్చినట్లయింది. వాడు మద్యపు నిషాలో గొళ్లెం తగిలించకుండా భూగృహం తలుపుకు తాళం వేసిపోయాడు. అందుచేత తలుపు దానంతటది తెరచుకొని వెలుతురు లోపలికి వచ్చింది. నన్ను కట్టివేసిన గొలుసుకూడా బాగా తుప్పుపట్టి ఉంది. కొంచెం గట్టిగా లాగేసరికి అది కొంచెంగా సడలింది'—అని ఇంచుక సేపు ఆగాడు ఎథెల్‌స్టేను.

'తొందరలేదు ఎథెల్‌స్టేన్, నెమ్మదిగా చెప్పు. శ్రమగా ఉన్నట్లుంది, కొంచెం ఏదైనా పుచ్చుకో!'—అన్నాడు రిచర్డు. ఎథెల్‌స్టేను అలాగేనని ఉదరాన్ని తిరిగి కొంత ఆహారంతోనూ మద్యంతోనూ నింపి తరువాత కథ చెప్పసాగాడు. ఇప్పటికి గది అంతా జనంతో క్రిక్కిరిసిపోయి వుంది. ముఖ్యంగా, ఎథెల్‌స్టేను తల్లి అక్కడికి వచ్చింది. ఆమె వెన్వెంట ఇతరులు కూడ అనేకులు—స్త్రీలు, పురుషులు గదిలో పట్టటానికి వీలైనంతమంది గదిలో చేరారు. మిగతావారు బయట మెట్లమీద ఉండిపోయారు. పైకి ఎక్కడానికి వీలులేక క్రింది అంతస్తులలో కొందరు నిలిచిపోయారు. ఈ సమాచార మప్పుడే బయటికి ప్రాకినందున, వెలుపలకూడా చాలా జనం మూగి ఉంది. ఎథెల్‌స్టేను చెప్పే కథ గదిలోనుంచి మెట్లమీదికీ, మెట్లమీదినుంచి క్రింది అంతస్తుకూ, అక్కడనుంచి దాని క్రింది అంతస్తుకూ, ఇలా వీధివరకూ ఈనోటా ఆనోటా పడి రావటంలో, దాని స్వరూపమే పూర్తిగా మారిపోతోంది. పైన ఎథెల్‌స్టేన్ చెప్పినదానికీ, క్రింద సింహద్వారం వెలుపల చెప్పబడే దానికీ సంబంధమేలేదు.

ఎథెల్‌స్టేన్ తన కథాశేషం ఈ విధంగా పూర్తిచేశాడు. బంధనం సడలించుకొని ఈడ్చుకుంటూ అతడు ఆ భూగృహపు మెట్లెక్కి ఇవతలపడి తడుములాడుకుంటూ వస్తూవుండగా, ఉండాకటి సన్యాసి మరొక ఫాదరీతో—ఆ ఫాదరీ దొంగలాగా కనుపించాడుగాని ఫాదరీలాగ కనుపించలేదు—కలిసి, తింటూ త్రాగుతూ పాడుతూ కనిపించాడట. ఎథెల్‌స్టేన్ అమాంతం వారిద్దరిపై విరుచుకుపడ్డాడు. ఇదేదో దయ్యమనుకొని హడలిపోయారు వాళ్లు. ఎథెల్‌స్టేన్ ఆ సన్యాసిని ఒక పిడికిలిపోటు పొడిచేసరికి అతడు క్రిందపడిపోయాడు. కాని, పక్కనున్న ఫాదరీ వెంటనే తన దుడ్డుకర్రతో ఎథెల్‌స్టేను నొక దెబ్బకొట్టి పలాయనం చిత్తగించాడు. (ఆ ఫాదరీ రాబిన్‌హుడ్ ముఠాలోని కొప్మన్‌హర్స్టు ఫాదరీయే అయివుంటాడని రిచర్డు నిర్ధారణ చేశాడు) అదృష్టవశాత్తూ ఆ దెబ్బ గురి తప్పింది. ఎథెల్‌స్టేన్ అంతట క్రిందపడివున్న సన్యాసి మొలలోని తాళంచెవితో తన సంకెళ్లు పూర్తిగా వదిలించుకొని,

సన్యాసిని కసికొద్దీ నాలుగు తన్నులు తన్ని, వారు సేవిస్తూ ఉండిన మద్య మాంసాలు పూర్తిగా సంగ్రహించుకొని బయలుదేరి, కాన్వెంటు తాలూకు గుర్రపుశాలకు వెళ్ళి చూశాడు. అక్కడ ఎథెల్‌స్టేను సొంతగుర్రమే కట్టివేసి ఉంది. బహుశః దానిని మఠాధికారి తన సొంత ఉపయోగానికి అట్టేపెట్టుకొని ఉంటాడు. ఎథెల్‌స్టేను వెంటనే ఆ గుర్రమెక్కి తన కోటవైపుకు దానిని ఉరికించాడు. శవవేషంలో, త్రోవలో ప్రతివాడూ ఏదో దయ్యమని జడిసి పారిపోయారు. కోటవద్దకు చేరుకొన్న తర్వాత, లోనికి ప్రవేశించడం ఒక సమస్య అయింది. అదృష్టవశాత్తూ, అక్కడివారు అచట వినోదార్థం ప్రదర్శించబడే వివిధ వేషాల్లో ఇదికూడా ఒకటనుకున్నారు. ఎథెల్‌స్టేన్ ఎలాగైతేనేం కోటలోనికి ప్రవేశించి, మొట్టమొదటగా తన తల్లిని కలుసుకొని ఆమెతో తన సంగతంతా చెప్పుకొన్నాడు. చచ్చిపోయాడనుకొన్న కొడుకు బ్రతికి ఉన్నందుకు ఆమె ఎంతో సంతోషించింది. ప్రీతికొద్దీ ఆమె అప్పుడప్పుడు తెప్పించిపెట్టిన భోజ్య పదార్థాలు గబగబా నోట్లో వేసుకొని, తర్వాత అతను సెడ్రిక్కును వెతుక్కుంటూవచ్చి ఇక్కడ కలుసుకొన్నాడు.

ఎథెల్‌స్టేను బ్రతికిఉండడం సెడ్రిక్‌లో తిరిగి సాక్సన్ జాత్యుద్ధరణను గూర్చిన ఆశాలతను చిగిరింపచేసింది. కాని, ఎథెల్‌స్టేనుకు ఇదేమీ పట్టలేదు. వెంటనే ఎడ్మండు మఠాధికారిపై కసితీర్చుకోవడమనేదే అతని కిప్పుడు ముఖ్య విషయంగా కనుపించింది. ఈ క్షుద్రవిషయాలు విస్మరించి, సాక్సన్ జాత్యుద్ధరణను గూర్చి ఆలోచించమంటాడు సెడ్రిక్. కాని, ఎథెల్‌స్టేనుకు ఆ ధోరణే లేదు.

తన రాజుగా ఉన్నది రిచర్డు అని తెలుసుకొని, తన ప్రభుభక్తిని ప్రకటిస్తూ ఎథెల్‌స్టేన్ అతని ముందర మోకరించాడు. సెడ్రిక్ చెందిన కలవరపాటు ఇంతంతకాదు. కాని, ఈ లేనిపోని ఆశయాలతో తననిక ప్రేరేపించవద్దని ఎథెల్‌స్టేన్ సెడ్రిక్కును అర్థించాడు. ఆదరాబాదరా ప్రయాణాలూ, అకాల భోజనాలూ, అజీర్ణబాధలూ, కయ్యాలూ, కారాగృహవాసాలూ, కడుపులో మాడడాలూ,— ఇవి తప్ప ఈ ఆశయాలవల్ల ఇంతకాలమూ తనకు చేకూరిన ప్రయోజనమేమున్నదని అడిగాడు. ఈ రభస మూలంగా, వేలకొలది అమాయక ప్రజలు చావడం తప్ప ఇంకేమీ జరగదన్నాడు. నా బ్రతుకు నన్నిలా బ్రతకనివ్వండి, నాకిది చాలు, వేరేమీ అక్కరలేదన్నాడు. అతనికి కావలసినదొక్కటే,— మఠాధికారిని ఉరిదీసి కోట బురుజుకు వ్రేలాడగట్టించడం!

'మరి, రొవీనాను ఏమిచేస్తావు? ఆమెనుకూడా విడనాడాలని నీ ఉద్దేశమా?'-అని అడిగాడు సెడ్రిక్. ఎథెల్‌స్టేన్ స్పష్టంగా చెప్పివేశాడు— తాను రొవీనాను చేసుకో దలచలేదని. రొవీనాకు తానంటే ఏ మాత్రమూ ఇష్టంలేదు. ఐవాన్‌హో మీదనే ఆమెకు ప్రీతి ఉంది. కనుక,

ఐవాన్ హోయే ఆమె పాణిగ్రహణం చెయ్యడానికి అధికారి యని చెప్పి, ఆమె చేతిని తానే స్వయంగా ఐవాన్ హో చేతిలో పెట్టడానికని అతడు ఐవాన్ హో కోసం చూచేసరికి, ఐవాన్ హో అచట కనిపించలేదు. 'అరె! ఇంతసేపుండే కదా అతని నిక్కడ చూచాను! ఇంతలో ఏమైనా' డని అడిగాడు. ఐవాన్ హో ఏడి ఏడని అంతా కలయజూచారు. కాని, అతడు అక్కడ లేడు. విచారించగా, ఎవరో యూదీ సేవకుడతని కోసం వచ్చాడనీ, అతనితో ఇంచుక సేపు ఏకాంతంగా మాట్లాడిన తర్వాత, గర్తును పిలువనంపి, తన కవచం తీసుకొని ఎచటికో వెడలిపోయాడనీ తెలిసింది.

ఈ గందరగోళం కొంత తగ్గిన తర్వాత రిచర్డు కోసం చూడగా అతడు కూడ కనిపించలేదు. ఏమైనాడని అతనిని గూర్చి మరల కొంత అన్వేషణ జరిగింది. చివరికి తేలిందేమంటే,— ఐవాన్ హో ఎచటికో గుర్రమెక్కి వెళ్లాడని తెలియగానే రిచర్డు కిందికిదిగి, అంతకుపూర్వం ఐవాన్ హోతో మాట్లాడిన యూదీయుని పిలిపించి ఇంచుక సేపు యేదో మాట్లాడాడు. తక్షణమే తానొక గుర్రాన్ని తెప్పించుకొని యెక్కి, ఆ యూదీయుని కూడా వేరొక గుర్రం ఎక్కుమని ఆదేశించి, ఇరువురూ కలిసి ఎక్కడికో వెళ్లిపోయారు.

ఎథెల్ స్టేనుకు ఇదంతా చాలా అయోమయంగా ఉండిపోయింది. తాను లేని సమయంలో తన కోటను కూడా సైతాను ఆవహించాడేమో ననుకున్నాడు. లేకపోతే, హఠాత్తుగా ఇద్దరిలా మాయమైపోవడమేమిటి? మరి కొంతసేపటికి ఇంకేమైనా మాయం కావచ్చు. తన అపరకర్మ నిమిత్తంగా జరగవలసిన విందుకు ఏర్పాట్లన్నీ సర్వసిద్ధమై ఉన్నాయి. ఆలస్యం చేస్తే ఆ భోజ్య పదార్థాలను కూడ సైతాను మాయం చేస్తాడేమో ఎవరికి తెలుసు! కనుక, 'ఇక పదండి, జాగుచేయకుండా విందారగిద్దా'మని తోటివారిని హెచ్చరించుకొని అందరితో కలిసి భోజనశాలలో ప్రవేశించాడు ఎథెల్ స్టేన్.

# అధ్యాయం ౪౪

టెంపుల్‌స్టోవు ప్రిసెప్టరీ దర్వాజావద్ద జనసమ్మర్దం యెక్కువగా ఉంది. రెబెకా చావుబ్రతుకులు తేలిపోవడానికి ఇంకా ఒక గంట వ్యవధి ఉన్న తరుణమది. చేరువలోనే, ప్రిసెప్టరీకి చెందిన గరిడీస్థలముంది. అక్కడనే ఇప్పుడు టెంప్లార్ బ్రయాన్‌కూ, రెబెకా తరఫున రావలసియున్న యోధునికీ పోరు జరగవలసి ఉంది. అందుచే, దానిచుట్టూ కూడా అప్పటికే జనం తండోపతండాలుగా వచ్చి మూగారు. ఆహ్వానంపై వచ్చినవారు కూర్చోడానికి గ్యాలరీలూ బెంచీలూ ఏర్పాటు చేయబడ్డాయి. తూర్పువైపున మధ్యగా సర్వాధికారి కొరకు యెత్తయిన గద్దె అమర్చబడి ఉంది. దానిచుట్టూ, ఇతర ప్రిసెప్టర్లకూ యోధులకూ ఆసనాలేర్పాటైనాయి. పైన టెంప్లార్ల జెండా ఎగురుతోంది.

పడమటివైపున ఒక స్తంభం నేలలో పాతబడి ఉంది. దానిచుట్టూ ఒక మనిషి ప్రవేశించడానికి వీలుగా ఖాళీ వదిలి కట్టెలు పేర్చబడ్డాయి. ప్రక్కన నలుగురు నల్లని నీగ్రోలలాంటి వికృతదేహులు నిలబడి ఉన్నారు. నేడు జరగవలసిన ఘోరకృత్యం వీళ్ల చేతులమీదుగా జరగవలసి ఉన్నదన్నమాట. అప్పుడప్పుడు పెదవులు విప్పి పండ్లికిలిస్తూ వాళ్లలో వాళ్ళేదో మాట్లాడుకోడమే కాని, చుట్టూ ఉన్న జనంకేసి వాళ్లు చూడడంలేదు. వాళ్ల వైఖరి చూచి, బహుశః వాళ్లు మంత్రగత్తెయైన రెబెకా మంత్రప్రభావానికి లోనైన దయ్యాలై ఉండాలనీ, ఇప్పుడా మంత్రప్రభావం అంతరించిపోయినందువల్ల, ఆమెను తుదముట్టించే పనికే నేడు తోడ్పడ సిద్ధపడినారనీ అక్కడి జనం అనుకోసాగారు. ఆరోజుల్లో, ఈ దయ్యాలకూ భూతాలకూ సంబంధించిన కథలు చాల విరివిగా ప్రచారంలో ఉండేవి. చచ్చిపోయాడనుకున్న ఎథెల్‌స్టేనును గూర్చిన గాథ యిప్పుడలాంటి ఒక విచిత్రగాథగా అక్కడ తయారైంది. ఒక్కొక్కరొక్కొక్క రకంగా దాన్నిగూర్చి వాదిస్తున్నారు. పర్యవసానానికి ఎథెల్‌స్టేన్ బ్రతికున్నాడో చచ్చిపోయాడో ఆ ప్రసంగం వల్ల యెవ్వరికీ తేలడంలేదు. సైతాను పన్నిన మాయల్లో అది ఒకటని మాత్రం అక్కడివారందరి విశ్వాసం.

ఇంతలో, చర్చి గంట ఉండి ఉండి గంభీరంగా మ్రోగనారంభించి యీ వాదప్రతివాదాలకంతరాయం కల్పించింది. ఎల్లరి దృష్టులూ ప్రిసెప్టరీ గేటువైపునకు ప్రసరించాయి. అగడ్తమీదికి వంతెన వాల్చబడి, గేటు తలుపులు తెరువబడ్డాయి. గేటులోంచి ఒక ఊరేగింపు ఇవతలకి రా నారంభించింది. ముందుగా, ఒక యోధుడు టెంప్లార్ జెండా చేతబట్టుకొని గుర్రమెక్కి వచ్చాడు. దాని వెనుక, తూర్యధ్వనులు చేస్తూ ఇద్దరిద్దరుగా ఆరుగురాశ్వికులు వస్తున్నారు. వారి వెనుక, ఇద్దరిద్దరుగానే, ప్రిసెప్టరీకి చెందిన ముఖ్యయోధులు వస్తున్నారు.

వారి తర్వాత వస్తున్నది సర్వాధికారి బూకాన్. అతడెక్కిన అశ్వరాజం, విశిష్టమైన అలంకారాలేవీ లేకపోయినా, ఒక ప్రత్యేకమైన ఠీవితో ఒప్పారుతోంది. సర్వాధికారి వెనుక, టెంప్లార్ బ్రియన్ అశ్వారూఢుడై వస్తున్నాడు. అతడు ధరించిన కవచం ధగ ధగ మెరిసిపోతోంది. చేతిలో కత్తీ, డాలూ, బల్లెం మొదలైన ఆయుధాలేవీ లేవు. ఇద్దరు అనుచరులు వాటిని పుచ్చుకొని అతని వెనకగా వస్తున్నారు. బ్రియన్ ముఖవైఖరినిబట్టి, అతడు చాలా ఉద్రిక్తస్థితిలో ఉన్నట్లు స్పష్టమౌతోంది. ఎన్ని రాత్రులనుంచియో నిద్రలేనివానివలె ఉన్నదతని లక్షణం. అయినా, ఒక విధమైన గాంభీర్యం అతని మూర్తి విశేషంలో ఉట్టిపడుతోంది. గుర్రాన్ని నడిపే ఆ చాకచక్యంలోనే స్పష్టపడుతోంది అతడొక గొప్ప యోధాగ్రేసరుడని.

బ్రియన్‌కు ఇరుప్రక్కలా, అతని ఆధ్యాత్మిక సంరక్షకులుగా నియోగించబడిన కాన్రేడ్, మాల్వాయిసిన్‌లు అశ్వారూఢులై వస్తున్నారు. వారి వెనుక, టెంప్లార్ వ్యవస్థకు చెందిన ఇతర యోధులూ, వారి వెనుక, ఇప్పటికైనా టెంప్లార్ యోధులుగా పరిగణించబడాలని ఆశిస్తున్న తపముచరబృందమూ వస్తున్నారు. వారి తర్వాత వస్తున్న కొంతమంది పదాతులమధ్య కనిపించింది రెబెకా. మేన అలంకారాలేమీ లేవు. సైతాను తాలూకు తాయెత్తులేమైన ఆమె ధరించిన ఆభరణాల్లో వున్నవేమోనన్న అనుమానంతో, వాటన్నింటినీ తీసివేయించారు. తెల్లని నూతకబట్టలు కట్టించారు. కాని, ఆ నూతకబట్టల్లోనే ఆమె రూపు లావణ్యాల కాంతితో మనోజ్ఞంగా వుంది. ఆమెను చూసి కంట తడిపెట్టనివారు లేరు. ఇంతటి మనోజ్ఞమూర్తిని సైతానుకు దాసినిగా మార్చివేసిన ఆ దుర్వ్యాధినిగూర్చి అంతా విచారించినవారే. దైవేచ్ఛ యెట్లున్నదో అట్లే కానిమ్మని ఒక విధమైన నిబ్బరంపూని ఆమె ఆ ఊరేగింపువెంట నడచివస్తున్నది. ఆమె తర్వాత, ప్రిసెప్టరీ తాలూకు పల్లెజనమంతా ఉన్నారు. వారు కూడా ఒక విధమైన కట్టుబాటుతోనే, చేతులుకట్టుకొని, తల యొత్తకుండా నేలవైపే చూస్తూ వస్తున్నారు ఆ ఊరేగింపుతో.

లోనికి ప్రవేశించి, చుట్టూ ఒక ప్రదక్షిణం చేసి ఆగింది. బ్రియన్, కాన్రేడ్, మాల్వాయిసిన్‌లు తప్ప తక్కినవారంతా గుర్రాలు దిగారు. వెంటనే వారి వారి నౌకర్లు వచ్చి వాటిని అవతలకు తీసుకొనిపోయారు.

కట్టెలు పేర్చబడిన స్తంభానికి చేరువగా, ఒక నల్లని కుర్చీ వేయబడిఉంది. రెబెకాను ఆ కుర్చీవద్దకు తీసుకొనిపోయారు. కట్టెలు పేర్చిన ఆ స్తంభాన్ని చూడగానే ఆమె మేను కంపించిపోయింది. కనులు మూసుకొని, పెదవులు కదుపుతూ ఏమేమో ప్రార్థించింది, పిమ్మట కనులు తెరచి, ఆ మృత్యుస్థానం

తో తన మనస్సుకు బాగా పరిచయం కల్పించుకోడంకోసం దానిపైపు నిదానించి కొంచెము సేపు చూచి, పిమ్మట నెమ్మదిగా చూపు మరల్చుకొంది.

ఈ లోపుగా, సర్వాధికారి తన గద్దెపై నధివసించాడు. టెంపుల్ వ్యవస్థకు చెందిన తక్కిన యోధవర్గంకూడా వారి వారి హోదాలవారీగా అతని చుట్టూ పరివేష్టించి కూర్చున్నారు. బాకాలవారు బాకా లూదడంతో కోర్టు ప్రారంభమైంది. సర్ బ్రయన్‌కు ఆధ్యాత్మిక సంరక్షకుడుగా నియోగించబడిన మాల్వాయిసిన్ ముందుకువచ్చి, రెబెకా సవాలుచేసి పంపెవేసిన గ్లోవును సర్వాధికారి సన్నిధిలో ఉంచి ఇలా అన్నాడు :

‘స్వామీ, అవధరించండి. రెబెకా అనే పేరుగల ఈ యూదుపడుచు చేసిన సవాలు నంగీకరించి, సర్ బ్రయన్ డీ బోయి గిల్బర్టు ఈనాడు యుద్ధరంగంలో తన విధిని తాను నిర్వర్తించడానికి సిద్ధమై వచ్చిఉన్నాడు. తేవరవారు న్యాయపీఠంనుండి ఇదివరలో ఏ శిక్ష ఈ యూదు పడుచుకు విధించియున్నారో, దానికీమె సర్వవిధాలా పాత్రమై ఉన్నదని ఈనాడు రుజువు కావలసిఉంది. రుజువు చేయడానికి సర్ బ్రియన్ సిద్ధంగా ఉన్నాడు. ఆదేశించ ప్రార్థన.’

సర్వాధికారి గంభీర స్వరంతో ఇలా పలికాడు: ‘మంచిది. అయితే అతడు ప్రమాణస్వీకారం చేశాడా? తన ఫిర్యాదు యథార్థమైనదనీ, తాను నిర్దోషిననీ అతడు ప్రమాణం చేయవలసిఉంది. శిలువ చేతపట్టించి ప్రమాణం చేయించు.’

మాల్వాయిసిన్ వెంటనే తడుముకోకుండా ఇలా సమాధానం చెప్పాడు: ‘సర్ బ్రియన్ మన కౌన్సిల్ సమక్షంలో ఇదివరకే ప్రమాణస్వీకారం చేసేనాడు. ఇప్పుడు మళ్ళీ చేయవలసిన అవసరంలేదు, చేయగూడదు కూడా, ఏలనంటే, యూదులు క్రైస్తవులు కాదుగనుక, ఆమెపుండని ప్రమాణస్వీకారం సర్ బ్రయన్‌కు ఇప్పుడనవసరం.’

అదృష్టవశాత్తూ సర్వాధికారికి ఈ సంజాయిషీ నచ్చింది. లేకపోతే ఇప్పుడొక గొప్ప చిక్కు వచ్చిపడేది. అంత జనసమూహం మధ్య అలా ప్రమాణస్వీకారం చెయ్యడానికి బ్రయన్ ఒప్పుకొని ఉండేవాడుకాదు. ససేమిరా చెయ్యననేవాడు, ఆ సంగతి మాల్వాయిసిన్‌కు తెలుసు. అందుచేతనే, సద్యస్స్ఫూర్తితో అప్పటికప్పుడు ఈ సంజాయిషీ చెప్పి ప్రమాదం తప్పించాడు.

సర్వాధికారి అనతి ప్రకారం అంతట తూర్యనాదాలు చేయబడి, వేత్రహస్తుడొకడు ముందుకువచ్చి ఈవిధంగా ఉచ్చైస్స్వరంతో ఒక ప్రకటనచేశాడు: ‘మహాజనులారా! సద్దుచేయక వినండి. ఈ యూదుపడుచు రెబెకా సవాలు ప్రకారం ఆమె తరఫునవచ్చి యుద్ధంచేయగల ఏ యోధునితోనైనాసరే, పోరా

దుటకు సర్ బ్రియన్ డిబోయి గిల్బర్టు యిాకే సిద్ధంగా ఉన్నాడు. ఎవరు వస్తారో రండి. యోద్ధనియమా లుభయులకూ సమానంగా వర్తింపచేయబడు తాయి. గాలీ, ఎండా ఉభయులకూ సమానంగా పంపిణీ చేయబడుతుంది. వచ్చేవారెవరో వెంటనే రండి'.

ప్రకటన ముగియగానే మరల తూర్యధ్వనులు చేయబడ్డాయి. తర్వాత కొంతసేపటి వరకూ అంతా నిశ్శబ్దం.

ప్రతియోధు డెవ్వరూ ముందుకు రాకపోయేసరికి, సర్వాధికారి క్షేత్ర పాలునితో, 'ఆమె తరఫున ప్రతియోధు డెవ్వరూ ఇంతవరకు రాలేదు. ఎవరి కోసమైనా ఆమె నిరీక్షిస్తున్నదేమో వెళ్ళి కనుక్కో—' మన్నాడు. క్షేత్ర పాలుడు అలాగే వెళ్లాడు. ఇంతలో, హఠాత్తుగా బ్రయన్ కూడా ఆమెకడకు తన గుర్రాన్ని తోలడాని కుద్యుక్తుడు కావడం గమనించి, మాల్వాయిసిన్,— 'అదేమిటి? నీ వామెవద్దకు వెళ్లడం క్రమబద్ధం కాదనుకుంటాను'—అంటూ సర్వాధికారివంక చూచాడు. 'క్రమబద్ధమే మాల్వాయిసిన్! ఇందులో న్యాయాన్యాయాలు తేల్చేది భగవంతుడు గనుక, ఉభయపక్షాలవారూ ఒక రితో నొకరు మాట్లాడుకోడానికి అభ్యంతర ముండగూడదు. అలా మాట్లాడు కున్నందువల్ల నిజం తేలడానికి ఇంకా యెక్కువ అవకాశముంటుంది'— అంటూ సర్ బ్రయన్, ఆగకుండానే ఆమెవైపుకు తన గుర్రం పోనిచ్చాడు.

ఈ లోపున క్షేత్రపాలుడు ఆమె వద్దకుపోయి, 'సర్వాధికారి అడుగు తున్నారు. నీ తరఫున ప్రతియోధు నెవరినైనా ఇప్పుడు తెచ్చుకుంటావా? లేక, మొన్నటి న్యాయసమ్మతమైన తీర్పు ప్రకారం, మరణానికి సిద్ధమౌతావా? చెప్పు' మని అడిగాడు. రెబెకా అతనికిలా సమాధానం చెప్పింది: 'నా నిర్దోషిత్వం రుజువు కావడానికింకా వ్యవధి ఉన్నదని మీ సర్వాధికారితో చెప్పు. ఇప్పటికీ నేను నిర్దోషిననే ఉద్ఘాటిస్తున్నాను. చిట్టచివరి నిమిషంలోగాని భగవంతుడువచ్చి సాయపడడు. యెంతసేపటిలోగా నా విమోచకుడు ఇక్కడ హాజరుకావాలో సర్వాధికారినే నిర్ణయించమను. అంతసేపటిలోగా ఎవరూ రాకపోతే, అటుపిమ్మట భగవదిచ్ఛ ఎలావుంటే అలాగే జరుగుతుంది!'

రెబెకా ఇలా అన్నదని క్షేత్రపాలుడు సర్వాధికారికి పోయి చెప్పాడు. 'మనం అన్యాయం చేశామని యీ మతవిరోధులచేత ఎందుకు అనిపించుకోవాలి? ఇదిగో వ్యవధి నిర్ణయిస్తున్నాను. పడమటనీడలు తూర్పుకు తిరిగే సమయం వరకూ మేము నిరీక్షిస్తాం. ఆలోపుగా గనుక ఆమె తరఫున ప్రతియోధుడెవ్వ డూ రాకపోతే, ఇక ఆమె చావుకు సిద్ధపడవలసినదే'—అన్నాడు సర్వాధికారి.

క్షేత్రపాలుడీ మాటలు తిరిగి రెబెకాకు పోయి చెప్పాడు. ఆమె విన మ్రురాలై చేతులు జోడించి, 'మానవమాత్రు డెవ్వడూ ఇక నన్ను రక్షించలేరు,—

ఈశ్వరా నీవే దిక్కన్నట్లు ఆకాశంవైపు దృష్టి నిగిడ్చి చూస్తూ అలా కొంత సేపు ఉండిపోయింది. ఇంతలో, బ్రయన్ కంఠధ్వని ఆమె చెవిదగ్గర వినిపించి ఆమెను ఉలిక్కిపడజేసింది. 'రెబెకా! ఒక్క మాట! వింటున్నావా?' అన్నాడు బ్రియన్,— రహస్యంగా.

'కఠినాత్ముడా! నీతో నాకేమీ పనిలేదు' అని సమాధానమిచ్చింది రెబెకా.

'అది సరే రెబెకా! నా మాటలు నీకసలు వినిపిస్తున్నాయా అని అడుగుతున్నాను. ఎందుకంటే, నా కంఠధ్వని నా చెవులకే చాలా భయంకరంగా వినిపిస్తోంది. మనమిప్పుడు ఏ స్థితిలో ఉన్నామో, ఎందుకోసం మనల నిద్దరినీ ఇక్కడికి తెచ్చారో, నాకేమీ తెలియటంలేదు. ఈ యుద్ధరంగం, ఈ నల్ల కుర్చీ, ఈ కట్టెలు, ఈ స్తంభం,— ఇవి యెందుకొరకో నాకు తెలుస్తూనే ఉన్నా, ఇదంతా ఏదో వాస్తవికత లేని కల్పనవలె నా కనిపిస్తోంది. ఇంద్రియాలకు శీఘ్రంగా కనుపించే భయంకర దృశ్యం కొట్టకొనుట ఆడుతున్నా, బుద్ధిమాత్రం ఇది నిజమని విశ్వసించలేకపోతోంది?— అన్నాడు.

'నీ బుద్ధి విశ్వసించలేకపోవచ్చునేమో కాని, నా బుద్ధి విశ్వసిస్తూనే ఉంది. ఈ పేర్చబడిన కట్టెలు నా భౌతిక శరీరాన్ని బ్రతికి ఉండగానే కాల్చివేసి, ఇంచుక సేపు విపరీతమైన బాధకలిగించినా, ఈ పాపిష్ఠిలోకంకంటె మంచిలోకానికి నన్ను త్వరలో చేర్చేమాట ఖాయం. ఆ విషయంలో నా కెట్టి సందేహమూ లేదు'— అని సమాధానమిచ్చింది రెబెకా.

బ్రయన్ ఉద్రిక్తుడై అతి వేగంగా ఉద్బోధించాడు: 'నా మాట విను రెబెకా! ఇప్పటికైనా నీవు ఈ దుర్మరణం తప్పించుకునే అవకాశముంది. వెంటనే నా వెనుక ఈ గుర్రంమీద యెక్కు. నేను యెలాకోరితే అలా పరుగెత్తగల గుర్రమిది. జిబిజాంగు సుల్తానుతో ద్వంద్వయుద్ధంలో దీన్ని సంపాదించాను. ఇంక జాగుచేయవద్దు. వెంటనే యెక్కు. వీళ్లు మనల్ని వెంబడించే లోపుగానే, మనమెక్కడికో వెళ్ళిపోతాం. దివ్యసుఖాలతో కూడిన ఒక నూతన ప్రపంచంలోకి నీకు ప్రవేశం కల్పిస్తాను. మహత్తరమైన కీర్తి శిఖరాలకు దారి తీసే నవజీవనపంథా నేను త్రొక్కుతాను. టెంప్లర్ వ్యవస్థలోంచి వాళ్ళు నన్ను బహిష్కరిస్తే బహిష్కరించవచ్చుగాక. నాకు యెలాంటి కళంకాన్ని వాళ్లు ఆపాదించినా ఆపాదించవచ్చుగాక. సకల కళంకాలనూ నా ఖడ్గధారలతో కడిగివేయ నిశ్చయించుకొన్నాను, ఆలస్యం చెయ్యక యెక్కు.'

రెబెకా నిశ్చలభావంతో ఇలా సమాధాన మిచ్చింది: 'నీ శోధనలిక చాలు! ఇక్కడనుంచి వెళ్ళిపో! ఈ తుదిఘడియలో నైనాసరే, నా నిశ్చయం నీవు రవంతకూడ చలింపజేయలేవు. నే నిక్కడ శత్రుమధ్యంలో ఉన్నమాట నిజమే. కాని, నా దృష్టికి, ఈ యందరిలోకీ భయంకరమైన

శత్రువవు నీవు: భగవంతుడు నన్ను నీ బారినుండి కాపాడు గాక! వెళ్లిపో ఇక్కడినుంచి!'

ఉభయులకూ మధ్య ప్రసంగం ఇలా తీవ్రమౌతున్న కొద్దీ ఆల్బర్ట్ మాల్వాయిసిన్‌కు కంగారు హెచ్చింది. అందుచే, దానికి విఘాతం కల్పించదలచి వారిని సమీపిస్తూ ఇలా అన్నాడు: 'ఏమి సర్ బ్రియన్? ఏమంటోంది? తన తప్పిదం ఒప్పుకుంటోందా? లేక, తాను తప్పిదమూ చేయలేదని, మొండితనంగా ఇంకా ఆమాటే పట్టుకొని వేళ్లాడుతోందా?'

'ఇంత మొండిదాన్ని నేనెక్కడా చూడలేదు'—అన్నాడు సర్ బ్రయన్.

'అయితే ఇక నీవు వెళ్లి నీ స్థానంలో నిలబడి ఉండటం మంచిది. నీడలు మారుతున్నాయి. నా సోదరా, మన టెంపుల్ వ్యవస్థ నీ మీదనే ఆశ పెట్టుకొని ఉంది. అచిరకాలంలో నీవే దానికి అధిపతివి కాగలవాడవు—' అంటూ మాల్వాయిసిన్, అతన్ని స్వస్థానానికి తీసుకొనిపోవడాని కన్నట్లు అతని చేతిలోని కళ్లెం పట్టుకున్నాడు.

'దుర్మార్గుడా! కళ్లెంమీద చెయ్యివేస్తున్నావు, ఏమిటి నీ ఉద్దేశ్యం? వదులు!'—అని చిక్కు విడిలింపు విదిలించి, బ్రయన్ తిరిగి స్వస్థానానికి తన గుర్రం తోలుకొనిపోయాడు.

'సరియైన మార్గంలో నడిపించాలే గాని, మనిషిలో యింకా యెంత జోరున్నదో చూచావా? ఏది దగ్గరకొస్తే దాన్నల్లా కాల్చివేసే జోరు!'—అన్నాడు మాల్వాయిసిన్, కాన్రేడ్‌తో జనాంతికంగా.

ప్రతియోధుని రాకకై న్యాయాధిపతులిప్పటికి రెండుగంటలనుంచీ కనిపెట్టుకొని ఉన్నట్లయింది. వచ్చేజాడ యెక్కడా కనుపించడంలేదు. ఆ జనసమూహంలో మన గోవ్సన్‌హార్ట్స్ ఫావరి కూడ ఉన్నాడు. రెబెకా పరిస్థితి చూచేసరికి అతనికి జాలి కలిగింది. ఆమె తరపున యెవరినీ కనీసం ఒక్క దెబ్బ అయినా కొట్టగలవాడు లేకుండా ఆమె అలా దుర్మరణం పాలు కావలసిందేనా అని అతడు చింతపడ్డాడు. యెవరిదాకానో యెందుకు, తానే ఆమె తరపున నిలబడి బ్రయన్ బుర్ర మంటెక్కేటట్టు తన బాణాకర్రతో ఒక దెబ్బ కొట్టాలని అతని కనిపించింది. కాని, యెలాగా? ఆమె యూదురాలైపోయింది! మంత్రగత్తె అయితే అయింది, యూదుకన్య కాకుండా ఉంటే యెంతో బాగుండేదికదా అనుకున్నాడు. యూదులకు తోడ్పడడమంటే ఆ రోజుల్లో ప్రతి వారికీ అంతభయం!

మాల్వాయిసిన్ ప్రేరేపణవల్ల, అక్కడ ఉన్న యోధవర్గంలో నెమ్మదిగా గుసగుసలు బయలుదేరాయి. రెబెకా ఒడ్డిన పందెం యిక పోయినట్లు ప్రక

టించవచ్చునని ఒకరితో నొకరు అనుకోడం మొదలుపెట్టారు. ఈ సమయంలో, ఎవళ్ళో యోధుడు దూరాన్నుంచి అతివేగంగా స్వారీచేసుకుంటూ రావడం కనుపించింది. అల్లంత దూరాన అతన్ని చూడడంతోటే, 'అదిగో ప్రతి యోధుడు వచ్చాడు వచ్చా'డన్న కేకలు జనంలోంచి మిన్నుముట్టాయి. ఆ జన సమూహానికి యూదురాలంటే సానుభూతిలేనిమాట నిజం. కాని, ఆ క్రొత్త యోధుడు సమయానికి అలా వచ్చిపడడం వారికెంతో ఉత్సాహం కల్పించింది. ఎక్కడలేని సంరంభంతోనూ హర్ష నినాదాలు చేశారు. కాని, ఇంతలోనే ఆ అశ్వాన్ని, ఆ అశ్వికుణ్ని కొంచెం నిదానంగా పరికించి చూచే సరికల్లా, వారి ఉత్సాహం అణగారిపోయింది. పెక్కు మైళ్లు అత్యంత వేగంతో అవిరామంగా పరుగెత్తుకు రావడంవల్ల కాబోలు, ఆ అశ్వరాజం విపరీతంగా రొప్పుతోంది. రంగస్థలంమీదికి ఎలాగో వచ్చి పడ్డాడన్న మాటేగాని, ఆ అశ్వికుడుకూడా, అలసటవల్లనో బలహీనతవల్లనో మరియేమో, జీనుమీదనుంచి పడిపోయేస్థితిలో ఉన్నట్లు కనిపిస్తున్నాడు.

కాని, 'నీవెవ్వరవు? నీ హోదా ఏమిటి,' అని వేత్రహస్తుడడుగగా, ఆ నూతన వ్యక్తి వెంటనే ఇలా సమాధానం చెప్పాడు: 'యోధవర్గంలో ఉన్నత స్థానం కలవాడనే నేను. అభిజాత్యానికి కూడా లోపంలేదు. ఈ రెబెకాపై అన్యాయంగా, అక్రమంగా తేబడిన అభియోగంలో, ఆమె నిర్దోషిత్వాన్ని నా కత్తీ బల్లెమూ ద్వారా రుజువు చెయ్యడానికి వచ్చాను. సర్ బ్రయన్ డిబోయ్ గిల్బర్టుతో ఢీకొని, అతడు ద్రోహియనీ, హంతకుడనీ, అసత్యవాదియనీ నిరూపించడానికి వచ్చాను. భగవంతుని కృపవల్ల, మేరీమాత దయవల్ల, సెంటుజార్జి అనుగ్రహంవల్ల, నా ప్రయత్నం ఫలిస్తుందనే నా విశ్వాసం!'

'అలా అస్పష్టంగా చెపితే ప్రయోజనంలేదు. నూతన వ్యక్తి స్పష్టంగా తన అభిజాత్యం వగైరాలు విశదీకరించాలి. అనామకులతో మా టెంపుల్ యోధులు పోరాడరు'—అని ఒక పేచీ పెట్టసంకించాడు మాల్వాయిసిన్.

నూతన వ్యక్తి తన ముఖం కనపడేటట్లుగా శిరస్త్రాణం పైకెత్తుతూ, 'నా పేరు, నీ పేరు కంటె ఎక్కువగా లోకానికి తెలిసినదే మాల్వాయిసిన్! అభిజాత్యంకూడ నీ దానికంటె గొప్పదే. నేను ఐవాన్‌హోను'—అన్నాడు.

'నీతో నేనిప్పుడు పోట్లాడను. నీ గాయాలు పూర్తిగా మాన్పుకొని, మరొక మంచి గుర్రం సమకూర్చుకొని రా. నీ బలుపు అపుడు వదలిస్తాను,'—అన్నాడు బ్రయన్.

'వహ్వా! ఏమి దర్పం! ఈ బల్లెంపోటుకే ఇదివరలో నీవు రెండు పర్యాయములు నేలకూలిన సంగతి మరచిపోయావా బ్రయన్? వెనుక ఏకర్ పోటీల్లో ఏమయింది! నిన్నగాక మొన్న, అష్బీ పోటీల్లో ఏం జరిగిందో జ్ఞాపకం

చేసుకో! ఐవాన్‌హోతో యుద్ధంచేసి ఓడిస్తానని క్రోధరుద్ధుల్లో నిన్న దర్పాలు కొట్టి తంటాలు చేసిన సంగతి గుర్తు తెచ్చుకో! ఇక ఒట్టి ఆలస్యం చెయ్యకుండా వెంటనే నాతో యుద్ధానికి దిగుతావా దిగు,—లేకపోతే, నీవు పట్టి పిరికిపందవని, యూరపులోని ప్రతి రాజాస్థానంలోనూ, మా టెంపుల్ వ్యవస్థకు చెందిన ప్రతి ప్రిసెప్టరీలోనూ చాటుతాను'—అన్నాడు ఐవాన్‌హో.

బ్రియన్ అస్థిర చిత్తంతో ఒక పర్యాయం రెబెకావంక చూచి, పిమ్మట ఐవాన్‌హోపై తీవ్ర దృష్టులు బరపుతూ, 'ఏమిరా నీ పొగరు? నీకు చావు కోసం చాల ఉబలాటంగా ఉన్నట్లుంది. అయితే తీసుకో బల్లెం'—అని గర్జించాడు.

ఐవాన్‌హో సర్వాధికారివంక చూచి,— 'అయితే, నేనిక పోట్లాడవచ్చునా?'—అని అడిగాడు.

'ఆ పిల్ల నిన్ను తన తరఫు యోధునిగా అంగీకరించేటట్లయితే, మా కభ్యంతరం లేదు. కాని, నీవు చాల దుర్బలస్థితిలో ఉన్నట్లున్నావు. మా సంస్థకు నీవు శత్రువువని సంగతి నాకు తెలుసు. అయినా, నీయెడలకూడా మేము న్యాయంగా ప్రవర్తించడం అవసరంకదా?'—అన్నాడు సర్వాధికారి.

'భగవంతుడు నన్ను ఈ స్థితిలోనే పోరాడమని ఆదేశించాడు. ఆయనయే నాకు రక్ష'—అంటూ ఐవాన్‌హో వెంటనే రెబెకావద్దకు గుర్రాన్ని తోలి, 'ఏమి రెబెకా! నన్ను నీ తరఫు యోధునిగా ఆమోదిస్తున్నావా?'—అని అడిగాడు.

రెబెకా భావోద్రేకంతో తడబడుతూ ఇలా సమాధానం చెప్పింది: 'ఆమోదిస్తున్నాను, ఆమోదిస్తున్నాను! నా కొరకు భగవంతుడే నిన్నిక్కడికి పంపాడు. కాని,— వద్దు,—వద్దు,— నీ గాయాలింకా మానలేదు. ఆ దర్పితునితో నీ విపుడు పోట్లాడవద్దు. నా కోసం నీవుకూడా అసువులు బాయడ మెందుకు?'

కాని, ఐవాన్‌హో అప్పుడే రంగస్థలంలో తన స్థానానికి చేరుకొని సర్వసన్నద్ధుడై బల్లెం చేతబట్టుకొని నిలిచాడు. బ్రియన్‌కూడా అలాగే తన స్థానంలో నిలబడ్డాడు. అతని ముఖానికి శిరస్త్రాణం సరిచేస్తూ అతని నౌకరు,— 'ఇదేమిటి, మీ ముఖం ఇలా నెత్తురుగడ్డ అయిపోయిం'దని అడిగాడు. అంతకు పూర్వం అతని ముఖం అలా లేదు. హృదయంలో భావోద్రేక మెంతఉన్నా, ముఖంమటుకు పాలిపోయి కనిపిస్తూ వచ్చింది.

వేత్రహస్తుడు యోధులిద్దరనూ హెచ్చరికచేసి రంగస్థలం మధ్యనుంచి ప్రక్కకు తప్పుకొన్నాడు. పోరాటంలో ఇతరు లెవ్వరూ ఏవిధంగానూ క

# అధ్యాయం ౪౩

టెంప్లార్ బ్రయన్ హఠాన్మరణం అచటివారి నెల్లరినీ ఆశ్చర్యచకితులను చెయ్యడం సహజం. ఆ ఉద్రిక్తత కొంత అణగారిన తర్వాత, ఐవాన్‌హో సర్వాధికారిని చూచి,—'పోరు న్యాయంగా జరిగిందని,—నా విధిని నేను యథోచితంగా నిర్వర్తించానని,—మీరంగీకరిస్తున్నారా?'—అని అడిగాడు.

'ఓ, నిస్సందేహంగా అంగీకరిస్తున్నాను. ఈ పిల్లను నిర్దోషురాలుగా ప్రకటిస్తూ విడిచిపుచ్చుతున్నాను. మృతయోధుని శరీరమూ, ఆయుధాలూ విజేతకు స్వాధీనం చేయడం రివాజుకనుక, వాటిని నీ ఇష్టం—ఏమి చేసుకున్నా చేసుకోవచ్చు'—అన్నాడు సర్వాధికారి.

'అతని ఆయుధాలు తీసుకోవడం నా అభిమతం కాదు. అతని కళేబరాన్ని అవమానం పాలు చెయ్యడానికి కూడా నేను ఇచ్చగించను. అతడు క్రైస్తవలోకం కొరకు పోరాడిన వీరుడు. అతని నిప్పుడు నేలకూల్చినది ఈశ్వర హస్తం గాని మానవ హస్తం కాదు. కాని ఒక అక్రమమైన తగాయిదాలో చిక్కుకొని చనిపోయినాడు గనుక, అతని అంత్యక్రియలు ఎట్టి ఘనతలూ లేకుండా ఒక సామాన్య వ్యక్తికి జరిగినట్లు జరగాలని నిర్దేశిస్తున్నాను. ఇక ఈ పిల్ల విషయం...'—

అని ఐవాన్‌హో ఇంకేమో చెప్పబోతుండగా, భూమి అదిరేటట్లు పెక్కు గుర్రాలు తీవ్రజవంతో పరుగిడివస్తున్న డెక్కల చప్పుడు వినిపించింది. ఉత్తర క్షణంలో, నీలకవచధారి రంగస్థలంలోకి వచ్చిపడ్డాడు. వెంట అనేకమంది సాయుధులైన అశ్వికులున్నారు.

వచ్చినవెంటనే నీలకవచధారి చుట్టూ కలయజూచి ఇలా అన్నాడు: 'నేను రావడం ఆలస్యమే అయింది. బ్రయన్ డీ బోయిల్బర్టు పని నేను పట్టదామనుకున్నాను. ఏమిటిది ఐవాన్‌హో! నీవున్న బలహీనస్థితికి ఈ సాహసం చెయ్యతగినదేనా?'

'భగవంతుడే ఈ దర్పితుని తుదముట్టించివేశాడు ప్రభూ! మీ రాశించినట్లుగా చనిపోయే గౌరవాని కితడు నోచుకోలేదు'—అన్నాడు ఐవాన్‌హో.

చివర్కు ఆ కళేబరం వంక నిశ్చలంగా కొంచెంసేపు చూచి,—'ఏమైనా గొప్పవీరుడు. కవచధారియై సాయుధుడుగా ఉండి వీరుని చావే చచ్చాడు—అతని ఆత్మకు శాంతి కలుగుగాక! ఆఁ, ఇక మనం కాలం వ్యర్థపుచ్చడానికి వీలులేదు. బోహాన్, నీ పని ఇక నీవు చేసెయ్!'—అన్నాడు.

వెంటనే రిచర్డు పరివారంలోంచి యోధుడొకడు ముందుకువచ్చి, అల్బర్టు డీ మాల్వాయిసిన్ భుజంమీద చెయ్యివేస్తూ,—'రాజద్రోహ నేరానికి నిన్ను నేను అరెస్టు చేస్తున్నాను'— అన్నాడు.

అంతమందియోధులు ఒక్కసారిగా అచటికి రావడంవల్ల ఇంత నిస్పృహుడై నిలబడిపోయిన సర్వాధికారికి ఇప్పుడు నోరు పెగిలింది. 'ఎవరుమీరు? టెంపుల్ వ్యవస్థకు చెందిన ఈ ప్రిసెప్టరీ అధికారిని, ఈ ప్రిసెప్టరీ ఆవరణలోనే,—అందులోనూ సర్వాధికారి సన్నిధిలో,—అరెస్టుచేసే సాహసం మీ కెలా వచ్చింది? ఎవరి అధికారంతో ఈ విపరీతకృత్యం చేస్తున్నారు?'— అని అతను ప్రశ్నించాడు.

'ఇంగ్లాండు దేశపు ప్రధమరక్షకభటుని హోదాలో ఈ అరెస్టు నేను చేస్తున్నాను. నన్ను ఎసెక్సు ప్రభువు హెన్రీ బోహన్‌గా తెలుసుకోండి,'— అని సమాధానమిచ్చాడా యోధుడు.

రిచర్డు తనముఖం కనుపించేటట్టుగా శిరస్త్రాణం పైకెత్తుతూ, 'మాల్వాయిసిన్ను అరెస్టుచేయుమని బోహన్‌ను ఆదేశించిన ఆంగ్లదేశప్రభువు రిచర్డు ప్లాంటాజెనెట్ ఇక్కడనే ఉన్నాడు. నివ్వుకూడా మాల్వాయిసిన్‌తోపాటు అరెస్టు కావలసినవాడవే కాన్రేడ్! నా ప్రజలలోనివాడవు కానందువల్ల తప్పించుకొన్నావు. అల్బర్టు మాల్వాయిసిన్ అతని సోదరుడు ఫిలిప్‌తోపాటుగా ఇక వారంరోజుల్లో ఈ ప్రపంచంనుండి సెలవు పుచ్చుకోగలడు,'— అన్నాడు.

'అది అలా జరగడానికి వీల్లేదు, నేను ప్రతిఘటించి తీరుతాను,'— అన్నాడు సర్వాధికారి.

'నీ ప్రతిఘటన నిష్ప్రయోజనం. అదిగో చూడు! ఈ ప్రిసెప్టరీపై ఇప్పుడు ఎగురుతున్నది ఇంగ్లాండు దేశపు జెండా,— మీ టెంపుల్ జెండా కాదు. వివేకం కలిగి, వ్యర్థ ప్రతిఘటన ఏమీ చెయ్యబోకు. నీ తల సింహం నోట్లో ఉన్నదని తెలుసుకో!'— అన్నాడు రిచర్డు.

'మా సంస్థ అధికారప్రాభవాలను అక్రమంగా అతిక్రమించడమిది! నీపై నేను పోప్ సన్నిధిలో అభియోగం తెస్తాను'— అన్నాడు సర్వాధికారి.

'మంచిది. అలాగే చేసుకోవచ్చు. ఇప్పుడుమాత్రం నన్నాక్షేపించి చికాకు పెట్టకు. వెంటనే యిక్కడినుంచి మకాం ఎత్తివేసి, దీనివలెనే రాజద్రోహానికి ఆలవాలం కాకుండా ఉన్న మరొక ప్రిసెప్టరీ ఏదైనా ఉంటే అక్కడికి పో! లేదా, నివ్వుకూడా మా ఆతిథ్యం స్వీకరించి మా తీర్పుకు ఎదురు చూడవలసి —అన్నాడు రిచర్డు.

'ఏమిటీ! నా అధికారం చెల్లకుండా చేసిన చోటనే నీ అధికారానికి తలవొగ్గుతానుగా! అసంభవం! టెంపుల్ యోధులారా, లేవండి! టెంపుల్ జెండా క్రింద ఆయత్తులై, దాని గౌరవం నిలబెట్టండి'— అని హెచ్చరించాడు సర్వాధికారి.

ఆ హెచ్చరికలో, రిచర్డు రాజఠీవిని సైతం ధిక్కరించే శక్తి ఒప్పారింది— ఇంతసేపూ ఒకవిధమైన కలవరపాటుతో నిలబడిపోయిన టెంపుల్ యోధవర్గానికి ధైర్యోత్సాహాలు పూరించినట్లయి, అంతా సర్వాధికారి చుట్టూ చేరారు— బల్లెములు చేతబట్టి ప్రతిఘటనకు సిద్ధమై నిలిచారు. అచట ఉన్న జనసమూహం వారిని గేలిచేస్తూ కేకలు వేసింది. కాని, ఏమైనప్పటికీ వారంటే భయమే గనుక, దూరంగా ప్రక్కకు తొలగి నిలిచి ఇక సద్దుచేయకుండా ఈ దృశ్యం చూడనారంభించింది.

టెంప్లార్ యోధుల ఈ సన్నాహం చూడగానే ఎసెక్స్ ప్రభువు తన గుర్రాన్ని వేగంగా అటూ యిటూ పరుగెత్తించి, తన అనుచరబృందాన్ని తగిన పద్ధతిలో కయ్యానికి ఆయత్తపరచజొచ్చాడు. అంతట రిచర్డు, నిర్భయంగా ఒంటిపాటున టెంప్లార్ శ్రేణి ఎదుటకు పోయి నిలబడి, వారిలో ఎవరైనా సరే తనతో యుద్ధానికి రావచ్చునని ఆహ్వానించాడు.

సర్వాధికారి అంతట తన యోధవర్గం ముందర అశ్వారూఢుడై నిలిచి వారిని ఇలా హెచ్చరిక చేశాడు: 'సోదరులారా! ఈ చిలిపికయ్యానికి మీరెవ్వరూ కాలు దువ్వవద్దు. రిచర్డు రాజును దీకొనడానికి మీరెవ్వరూ ప్రయత్నించవద్దు. మన తగాయిదా పోప్ విచారించి తీర్చగలడు. యూరపులోని రాజులంతా దీనికి తగిన పరిహారం చేయగలరు. పోదాం పదండి. ఇదిగో రాజా! మామీద ఎవ్వరూ చెయ్యి వెయ్యకుండా ఉంటే, మేమూ ఎవ్వరిమీదా చెయ్యి వెయ్యకుండా వెళ్ళిపోతాం. ఈ ప్రిసెప్టరీలోని మా తాలూకు ఆయుధసంచయంలోని యావత్తు సామగ్రి నీకు అప్పజెప్పి పోతున్నాము. క్రైస్తవలోకానికి నేడు నీవు ఒక మహాపచారం చేస్తున్నావు. బాగా ఆలోచించుకో!'

ఈ మాటలు నాలుగూ అని, దీనికి జవాబుకోసం కూడా వేచియుండకుండానే, సర్వాధికారి యిక బయలుదేరండని తన అనుయాయులకు సంజ్ఞ చేశాడు. వెంటనే తూర్యనాదాలు చేయబడ్డాయి. మాటవెంట ప్రయాణాని కనువుగా యోధవర్గమంతా ఒకబారుగా మారి, నెమ్మదిగా ముందుకు సాగిపోనారంభించింది. సర్వాధికారి ఆజ్ఞ పాలించవలసి వచ్చి మేము ఈ రీతిగా వెడలిపోతున్నామే కాని, మీతో పోట్లాడడానికి వెరచి కాదన్న వైఖరి వారి గంభీర మందగమనంలో వ్యక్తమవుతోంది.

'సుశిక్షితులూ, ధైర్యసాహసోపేతులూనైన టెంప్లార్లు విశ్వాసయోగ్యులు కాకపోవడం ఒక దురదృష్టం' — అన్నాడు రిచర్డ్, — ఆ పరుగుతున్నవారివంక తదేకదృష్టితో చూస్తూ.

తన ప్రత్యర్థి ఎదుటనిలబడి ఉన్నంతసేపూ తోకముడుచుకొని మిన్నకుండి, అది అవలి ఒడ్డుకై వెళ్ళిపోతూ ఉండడంతోటే మొరగ నారంభించే వీధికుక్కలాగా, జనసమూహం ఆ టెంప్లార్ ఆశ్వికదళం కొంతదూరం సాగిపోయినపిమ్మట వారిని గేలిచేస్తూ సన్నసన్నగా కేకలు వేసింది.

ఈ నడిచిన వృత్తాంతమేమీ రెబెకాకు తెలియదు. వృద్ధుడైన తండ్రి చేతులలో, ఆమె ఒక విధమైన మూర్ఛావస్థలో మునిగిఉంది. కాని, తండ్రి నోటినుండి వచ్చిన ఒక్కమాట, ఆమెను తిరిగి తెలివిలోకి తెచ్చింది. 'అమ్మా! నా బంగారుతల్లీ! ఇలా చూడమ్మా! లే! నీ ప్రాణాలు రక్షించిన ఆ యోధవర వీరుని పాదాలమీద వెళ్ళి పడదాం పద!' — అన్నాడు ఇసాక్.

'వద్దు నాన్నా, — వద్దు వద్దు! ఈ క్షణంలో అతనితో నేనేమీ మాట్లాడలేను. అతనితో నేను చెప్పకోవలసినది... వద్దు నాన్నా, వద్దు! ఈ పాపిష్ఠి స్థలంనుంచి మనం వెంటనే వెళ్ళిపోదాం పద,' — అన్నది రెబెకా.

'అదేమిటమ్మా! అలా అంటావు? నిన్ను ఈ ఆపదనుండి రక్షించడం కోసం, దేవుడులాగా పరుగెత్తుకొనివచ్చి, తన ప్రాణాలను సైతం ఒడ్డి నిన్ను బ్రతికించిన ఆ పుణ్యాత్మునికి, మన కృతజ్ఞత తెల్పకోకుండానే వెళ్ళిపోవడమా? అతని జాతివాళ్ళమూ, మతమువాళ్ళమూ కాదు మనం. అందుచే మన కృతజ్ఞత తెలుపుకోవలసిన అవశ్యకత మరింతముఖ్యంగా ఉంది' — అన్నాడు ఇసాక్.

'కృతజ్ఞత తెలుపుకోవలసిందే. భక్తి విశ్వాసాలతో హృదయం తన కృతజ్ఞత తెలుపుతుంటూనే ఉన్నది. అతని యెదుటకూడా తెలుపుకోవలసి వస్తే, తెలుపుకుందాం, — కాని ఇప్పుడు కాదు నాన్నా! దయచేసి నా కోర్కె చెల్లించు, - ఇప్పుడు కాదు,' — అన్నది రెబెకా.

'అలాగే చెల్లిస్తానులే, కాని, వాళ్ళేమనుకుంటారు? కృతజ్ఞత లేని నీచులక్రింద మనల్ని జమకట్టరూ?' — అన్నాడు ఇసాక్, ఇంకా ఆ ధోరణిలోనే వాదిస్తూ.

'కాని, - నాన్నా, అక్కడ ఉన్న దళాన్ని చూశావా? రిచర్డురాజు! అతడు నిన్ను ...' — అని ఇంకా ఏదో చెప్పబోతుండగానే అర్ధోక్తిలో ఇసాక్ —

'అప్రయత్నంగా అబ్బుతు,—ఎంత చక్కని బుద్ధి నీది తల్లీ! వెడదాం పద,— ఇప్పుడే వెళ్ళిపోదాం. అతనికి డబ్బు కావలసి వచ్చేమాట నిశ్చయం. పాల స్తీనానుంచి యిప్పుడే కదా తిరిగి వచ్చాడు? అందులోనూ ఖయిదునుంచి! చేతిలో పైసా ఉండదు. నా దగ్గరనుంచి లాగడానికి చూడవచ్చు. లాగే ఉపాయం ఉండనే ఉంది. నేను తన సోదరుడు జాన్‌కు అప్పుపెట్టడం అవకాశంగా తీసుకొని, నన్ను పీల్చి పిప్పిచేయడానికి చూస్తాడు సందేహం లేదు. పోదాం పద, త్వరగా!'

అంటూ యిసాక్, వెంటనే ఆమెను తీసుకొని ఆ చోటునుంచి బయట పడి, తానంతకు పూర్వమే ఏర్పాటు చేసిఉంచిన వాహనం మీద డాక్టరు నాథన్ యింటికి భద్రంగా చేర్పించాడు.

నీలకవచధారి రిచర్డు రాజే యని తెలియడం చేత, తత్సంబంధమైన కౌతూహలంలో అచటివారంతా మునిగి ఉన్నందున, రెబెకా యిసాకులు వెడలిపోయిన సంగతి ఎవరూ గమనించలేదు. 'రిచర్డు మహారాజుకూ జై! టెంప్లార్ కూటానికి జా!'—అనే కేకలతో దశదిశలూ మారుమ్రోగి పోతున్నాయి.

'ఈ పైపై రాజభక్తి ప్రకటనల కేమిగాని—మన ప్రభువు తాను వచ్చేటప్పుడు విన్నా, నీ అనుచరబృందాన్ని వెంటగొని వచ్చి చాలా మంచి పని చేశావు'—అన్నాడు ఐవాన్‌హో ఎసెక్స్ ప్రభువుతో, ఎసెక్స్ ప్రభువు చిరునవ్వు నవ్వి తల పంకించాడు.

'ప్రభువు తత్వం బాగా తెలిసినవాడవై, యిది ఆయన బుద్ధిపూర్వకంగా చేసిన పని యని ఎలా తలపోశావు ఐవాన్‌హో! ఇది ఆయన కావాలని కోరి చేసిన పనిగాదు. ప్రిన్సుజాన్ యార్కులో సైనిక సన్నాహాలు చేస్తున్నాడని తెలిసి నేను యార్కుకై త్వరిత బయలుదేరి వస్తుండగా, త్రోవలో ప్రభువు నాకు తారసిల్లడం జరిగింది. టెంప్లార్ బ్రయన్‌ను తాను స్వయంగా ఓడించి యీ యూదుపడుచు ప్రాణాలు కాపాడాలనే కోర్కెతో ఆయన తీవ్రవేగంతో స్వారీ చేసుకుంటూ వస్తున్నాడు. ఆయన ఆమోద మంతగా లేకపోయినా ఆయన వెంటబడి ఇలా వచ్చాను'—అని జరిగిన సంగతి సంక్షేపంగా చెప్పాడు ఎసెక్స్ ప్రభువు.

'అయితే యార్కునగర విశేషాలేమిటి? తిరుగుబాటుదార్లు మనల్ని అచట ఎదుర్కొంటారా?' అని ప్రశ్నించాడు ఐవాన్‌హో.

'వేసవి సూర్యునిముందు మంచుతెర లెక్కడ నిలువగలవు ఐవాన్‌హో? అందరూ చెల్లాచెదరై పారిపోతున్నారు. ఈ వార్త మాకు అందరికంటె

ముందుగా తెలియజెయ్యడానికి వచ్చినది ఎందుకని నీ అభిప్రాయం? ఎందుకో కాదు ప్రిన్సుజాన్!'

'ద్రోహి! విశ్వాసఘాతకుడు! ప్రభువు అతన్ని నిర్బంధంలో ఉంచమని ఆజ్ఞాపించలేదా?'—అని అడిగాడు ఐవాన్‌హో.

'అలా చేస్తే ఇంకా ఏం? వేటకు వెళ్ళివచ్చి కలుసుకొన్న సోదరుని వలె ప్రీతితో ఆదరించి, 'ఇదిగో తమ్ముడూ, వీళ్ళంతా నీమీద ఎంత కోపంగా ఉండాలో అంత కోపంగా ఉన్నారు. నా మాట విని, అమ్మ దగ్గరకి చప్పున వెళ్ళిపో! అక్కడ ఉండడం నీకు క్షేమం. అమ్మకు నా అభివాదము అందజెయ్యి. ఈ క్రుద్ధుల మనస్సులు శాంతించేవరకూ నీ వక్కడినుంచి కదల బోకు'—అని హితబోధ చేసాడు.'

'ఇదా అంతకీ ఆయన చేసినది? ఇలా దయ చూపడం రాజద్రోహాన్ని ప్రోత్సహించడమే కాక మరేమిటి?'—అన్నాడు ఐవాన్‌హో.

'నిజమే ఐవాన్‌హో! ప్రమాదకరమైన గాయం ఇంకా సరిగా మాన కుండానే యుద్ధానికి పరుగెత్తి మృత్యువు నాహ్వానించడం ఎలాంటిదో ఇదీ అంతే',—అన్నాడు నర్మగర్భితంగా ఎసెక్స్ ప్రభువు.

'నీ ఎత్తిపొడుపు గ్రహించానులే! కాని,—నేను మృత్యువుకు తెగించానంటే, అది నా ఒక్కడికే సంబంధించిన విషయం. రిచర్డు ఇలాంటి సాహసాలు చెయ్యడం అలా కాదే? ఈ రాజ్యక్షేమం ఆయన జీవితంపై ఆధారపడి ఉంది'—అన్నాడు ఐవాన్‌హో.

'నిజమే,—కాని, తమ క్షేమాన్ని గూర్చి నిర్లక్ష్యం చేసేవాళ్లు సామాన్యంగా ఇతరుల క్షేమాన్ని కూడా నిర్లక్ష్యం చేస్తూ ఉంటారు. సరే,—మనమిక త్వరగా వెళ్ళాలి. రిచర్డు ప్రధానమైన కుట్రదారును మన్నించి వదలి వేసినా, చిల్లర కుట్రదారులను శిక్షించబూనుకున్నాడు'—అన్నాడు ఎసెక్స్ ప్రభువు.

తర్వాత జరిగిన న్యాయవిచారణఫలితాలనుగూర్చి విస్తరించి చెప్పడం అనవసరం. మారిస్ డీబ్రేసీ దేశం విడిచి పారిపోయి, సముద్రం దాటి ఫ్రాంసు చేరుకొని, అచట ఫిలిప్ రాజు నౌకరీలో చేరాడు. ఫిలిప్ డీ మాల్వాయిసిన్, అతని సోదరుడు ఆల్బర్టు డీ మాల్వాయిసిన్,—వీరిరువురూ ఉరితీయబడ్డారు. ఈ కుట్రకు ముఖ్య ప్రేరకుడు వాల్డిమార్ ఫిడ్జర్సు దేశ బహిష్కృతుని చెయ్యడంమాత్రం జరిగింది. ఎవరి నిమిత్తంగా ఈ కుట్రంతా జరిగిందో, ఆ ప్రిన్సుజాన్ తన ఉదార హృదయుడైన సోదరునివలన అభిశంసనమైనా పొందలేదు. అయితే, మాల్వాయిసిన్ సోదరుల దుర్గతికి చింతించినవారు మాత్రం ఎవ్వరూ లేరు—

పెళ్ళి అబద్ధాలాడి అనేక కుట్రకృత్యాలు చేసి అమాయిక ప్రజను హింసిం చిన ప్రబుద్ధులు గనుక, వారికి తగిన శిక్ష జరిగినదని యొల్లరూ సంతోషించారు.

దేశంలో జాన్ మూలంగా యేర్పడ్డ కల్లోల పరిస్థితిని సర్దుబాటు చేయడా నికి గాను రిచర్డ్ యార్క్ నగరంలో ఒక సమావేశం ఏర్పాటు చేసి అచటికి హెడ్రి క్కును పిలిపించాడు. ఆహ్వానం చూసి హెడ్రిక్ మొట్టమొదట చాలా కన్ను బుస్సలాడాడు. కాని, వెళ్ళడం మాత్రం మానలేదు. నిజానికి, రిచర్డ్ ఇంగ్లాండుకు తిరిగి వచ్చాడన్న సంగతి తెలియడంతోటే, సాక్సన్ రాజవంశాన్ని తిరిగి అధికార స్థానంలో ప్రతిష్ఠింపజేయాలనే అతని కోర్కెకు వ్యాఘాతం కలిగినట్లయింది. పరిపాలన ఎంత నిర్లక్ష్యంగా చేసినా, తన శౌర్య సాహ సాదులవల్లనూ, ఇతరమైన ఉదారగుణములవల్లనూ రిచర్డ్ ప్రజలకు చాల ప్రీతి పాత్రుడుగా ఉంటున్నాడు. అట్టి వానిని త్రోసిరాజు చేసి తన ఆశయం నెరవేర్చుకోడ మనేది చాల కష్టసాధ్యమైన విషయమే.

అది అలా ఉండగా, రొవీనా ఎథెల్‌స్టేనుల వివాహబంధం ద్వారా సాక్సన్లలో కలయికను సాధించాలనుకున్న హెడ్రిక్ ఆశయం ఫలించే అవకాశం లేదని తేలిపోయింది. వివాహానికి రొవీనాయే కాక ఎథెల్‌స్టేనుకూడ అంగీక రించలేదు. వ్యక్తిగతాభిప్రాయం ఎలా ఉన్నా, ఈ యిద్దరూ సాక్సన్ జాత్యభ్యుదయ మాలోచించి తమ వివాహానికి ఒడంబడాలని అతని ఉద్దేశం. కాని, అందుకు రొవీనాయేగాక ఎథెల్‌స్టేనుగూడ ఇప్పుడు అంగీకరించడం లేదు. అయినప్పటికీ, హెడ్రిక్ అంతటితో వదలిపెట్టి ఊరుకోక, ఎథెల్‌స్టేనును ఎలాగైనా ఒప్పించడానికి మరొక గట్టి ప్రయత్నం చేసి చూడాలనుకున్నాడు. కాని, ఎథెల్‌స్టేనుకు సెంటు ఎడ్మండు కాన్వెంటు సన్యాసులపై క్రోధం తీర్చు కోడమెలాగనేదే తప్ప, మరొక ధోరణే లేదు.

అయితే, మొదట్లో, వాళ్ళను ఉరి తీయిస్తేతప్ప తనకు తృప్తి లేదనుకున్న వాడు, తరువాత, తనకు సహజంగా ఉన్న మెత్తదనంవల్లనైతేనేమి, తల్లి బ్రతి మాలి మరీ మరీ చెప్పినందువల్లనైతేనేమి, కొంచెం తగ్గాడు. కోనింగ్స్‌బర్గ్ భూ గృహంలో మూడురోజులపాటు వాళ్ళను అర్ధాకలితో మాడేటట్లు చెయ్యడంతో తృప్తి చెందాడు. కాని, యీ తగాయిదా అంతటితో సమసిపోలేదు. సెంటు ఎడ్మండు మఠాధికారి ఎథెల్‌స్టేనును వెలివేసి బాధించాలని చూశాడు. తాను ఖయిదులో ఉన్నప్పుడు ఎథెల్‌స్టేను పెట్టిన బాధల ఫలితంగా తనకు కడుపులో ఏవేవో చెప్పనలవికాని బాధలు బయలుదేరినవంటూ పెద్ద హంగామా చెయ్య మొదలుపెట్టాడు. దీనికి ప్రతిక్రియ ఏమి చెయ్యడమా అనే ఆలోచనలో మునిగిఉన్న ఎథెల్‌స్టేను బుర్రలోకి హెడ్రిక్ ఇప్పుడు ఇంకొక క్రొత్త ఆలోచన ఎక్కించగలిగాడు. రొవీనా పేరు ఎత్తేసరికల్లా అతడు, ఆమె విల్ఫ్రెడుకే భార్య కావలసి ఉన్నదని ఉద్ఘాటించి, ఆమె సౌభాగ్యం కాంక్షిస్తూ

అతను పేరు చెప్పి మరొక్క మధుపాత్ర ఖాళీ చేసాడు. ఇక సెడ్రిక్ చెయ్య గలిగినదేమున్నది! ఎథిల్‌స్టేను ఆశ వదలుకోక తప్పింది కాదు. వాంబా అన్నట్లు, అతను పోట్లాటకు పనేమిగా దిగనొల్లని కోడిపుంజు లాంటివాడై పోయాడు.

ఇట్టి పరిస్థితుల్లో, సెడ్రిక్ తప్పనిసరిగా, రొవీనా ఐవాన్‌హోల వివాహానికి ఒప్పుకోవలసి వచ్చింది. ఏమైనా, రొవీనాను చిన్నప్పటినుంచీ పెంచినవాడు గనుక, ఆ వాత్సల్యభావమే తుదకు అతని పూర్వ కోపాన్ని పారద్రోలింది. తన కుమారుడు గొప్ప కీర్తి ప్రతిష్ఠలను సంపాదించ గలిగినందుకు కూడ అతనికి మనస్సులో కొంత గర్వం లేకపోలేదు. రొవీనా ద్వారా ఆల్ఫ్రెడ్ రాజవంశంతో తన వంశం ఐక్యమొందే భాగ్యం కలుగుతున్నందుకు అతడు లోలోపల సంతోషిస్తూనే ఉన్నాడు కూడ. అది అలా ఉండగా, నార్మన్ రాజవంశంపట్ల వైమనస్యం కూడా అతనిలో క్రమంగా క్షీణించింది. ఆ రాజవంశానికి పదభ్రష్టత కలిగించడం ఇక దుస్సాధ్యమని అతనికి బాగా స్పష్టపడిపోయింది. పైగా, రిచర్డు అతనిపట్ల చూపిన ప్రత్యేకాదరాభిమానాలు అతని మనస్సును చాలా మార్చివేసాయి. రిచర్డు ఆతిథ్యం స్వీకరించ మొదలిడిన ఒక వారం రోజుల్లోపలే, అతను రొవీనా ఐవాన్‌హోల వివాహానికి తన సమ్మతి తెలియజేసాడు.

వివాహం సుప్రసిద్ధమైన యార్క్-చర్చిలో జరిగింది. రిచర్డు స్వయంగా వివాహానికి విచ్చేసాడు. ఈ సందర్భంలోనూ, ఇలాంటి మరికొన్ని సందర్భాల్లోనూ రిచర్డు వ్యవహరించిన వైఖరి సాక్సన్లలో గల సంకోచాలన్నింటినీ పారద్రోలింది. అంతర్యుద్ధం ద్వారా తాము సాధించగలిగేవాటికంటె ఎక్కువైన అధికారస్వత్వాలే రిచర్డు పాలనలో తాము పొందగలమనే ధైర్యం వారికి చిక్కింది. గొప్ప వైభవంతో జరిగింది వివాహం.

పెండ్లికుమారుని ముఖ్యానుచరుడుగా, గర్త్ మంచి వీర వేషంలో ముస్తాబై పెండ్లిలో ప్రత్యేక గౌరవమందుకొన్నాడు. విదూషకుడు వాంబా ఒక కొ టోపీతోనూ, కొత్తగా చేయించిన గంటమువ్వలతోనూ తయారై తన హాస్య ప్రసంగాలతో పెళ్లికి వచ్చినవారి కెల్లరికీ వినోదం కల్పించాడు.

సాక్సన్లతోపాటు నార్మన్ ప్రముఖులు కూడా చాలామంది వివాహానికి విచ్చేసి, సాక్సన్లతో కలిసి మెలిసి విందు వినోదాల్లో పాల్గొన్నారు. ఈ ఇద్దరి వివాహమూ సాక్సన్ నార్మన్ జాతుల భావిసఖ్యానికి శుభసూచకంగా ఎల్లరూ భావించారు. నిజంగా అప్పటినుంచే క్రమంగా, ఇచ్చిపుచ్చుకోడాల ద్వారా, సాక్సన్, నార్మన్ జాతులు కలిసి ఏకమై పోసారంభించాయి. సాక్సనంటే విడగింపు నార్మనులో అంతరించి, నార్మనంటే

క్షేమభాగం సాగ్జన్లలో సమసిపోయింది. సాగ్జన్లు క్రమేణా మోటుతనం విడిచి నాజూకు తేలారు. నార్మన్, సాగ్జన్ విభేదాలు పూర్తిగా అంతరించి, ఇప్పుడు 'ఇంగ్లీషు' అనబడే మిశ్రమభాష వ్యవహారంలోకి వచ్చినది, తరువాత మూడవ ఎడ్వర్డురాజు కాలానికి.

వివాహమైన మరుసటి రోజు ఉదయం, రొవీనా ఆనంద తరంగాల్లో తేలియాడుతూ సఖీజన పరివృతురాలై తన గదిలో కూర్చుండి యుండగా, పరిచారిక ఎల్గితా ఆమెను సమీపించి, 'ఒకతె కన్నెపడుచు మీ దర్శనం కోరి ఏకాంత మభిలషిస్తోం'దని చెప్పింది. రొవీనా ఆశ్చర్యచకితయై, ఎవరా అని సందేహించి, సరే ప్రవేశపెట్టుమని అనతిచ్చి, అచట ఉన్నవారందరినీ బయటికి వెళ్ళిపొమ్మంది.

కొలది సేపటికి, తన పొడుగు వస్త్రం తెల్లని ముసుగుతో, ఒక స్త్రీవ్యక్తి లోనికి ప్రవేశించింది. ఆమె మహోన్నత దేహంలోని ఠీవిని ఆ ధరించిన ముసుగు ఇనుమడింప చేస్తున్నదే కాని కప్పిపుచ్చడం లేదు. ఆమె వైఖరిలో ఒక విధమైన గాంభీర్యం తొణికిసలాడుతున్నదే కాని, భయం, దైన్యం ఇత్యాదులు లేశమూ లేవు. ఎదుటివారికి సానుభూతి చూపడంలో నేమి, మర్యాద చెయ్యడంలో నేమి, వెనుకాడే ప్రకృతి కాదు రొవీనాది. అందుచే, ఆమెను చూడగానే లేచి, ఆమె కూర్చుండడానికి ఒక ఆసనం నిర్దేశించింది. అందరూ వెళ్ళిపోయినా ఎల్గితా ఇంకా అక్కడ ఉండడం చూచి, ఆగంతకవ్యక్తి తాను ఏకాంత మభిలషిస్తున్నట్లు తిరిగి తన అభిప్రాయం వ్యక్తం చేసింది. ఎల్గితా గొణుగుతూ వెడలిపోయిన తర్వాత, ఆమె రొవీనాను సమీపించి, ఆమె యెదుట మోకరించి, ఆమె చేతులను తన నుదుటి కద్దుకొని, పిమ్మట నేలవరకూ వంగి, నేల జీరాడే రొవీనా అంసోత్తరీయపు టంచును, ఆమె వలదని వారిస్తున్నప్పటికీ వినక ముద్దిడుకొంది.

రొవీనా ఆశ్చర్యచకితయై, 'ఏమిటమ్మా ఇది? ఇంతటి విధేయత నాకు కనబరచడానికి, నీకు నేను ఏమి చేశానని?'— అని అడిగింది.

రిబెకా లేచి నిలుచుబడి, తన పూర్వపు శాంత గంభీర ప్రవృత్తితో ఇలా సమాధానం చెప్పింది: 'నీ భర్తయైన ఐవాన్‌హోకు నేను కృతజ్ఞతా ఋణం చెల్లించుకోవలసి ఉంది. అతని అర్ధాంగివి గనుక, ఆ ఋణం నీకు చెల్లించడంలో తప్పేమీ లేదు. కనుక, నీ దగ్గరకు వచ్చి యీ నా కృతజ్ఞత వెల్లడించుకొంటున్నాను. నా సాహసం మన్నించు. ఆనాడు టెంపుల్‌స్టోవులో, నీ భర్త ఏ యూదుపడుచు ప్రాణరక్షణకోసం తన ప్రాణాలు సైతం బలిపెట్టడానికి సిద్ధమైనాడో, ఆ నిర్భాగ్యురాలిని నేనే!'

'పొరపాటు రెబెకా! నిజానికి ఆనాడు ఐవాన్‌హో నీకు చేసిన ఉపకార మేపాటిది? ఆపత్సమయంలో ఆదుకొని, అతని గాయాలు మాన్పి రక్షించావు నీవు. ఆ ఉపకారంలో నీకు అతడు చేసిన ప్రత్యుపకారం శతాంశం లేదు. ప్రస్తుతం, అతనివలనగాని, నావలనగాని, నీకు కావలసిన దేదైన ఉంటే చెప్పు, చేస్తాం'—అన్నది రోవెనా.

'ఏమీ అక్కరలేదు. నా కృతజ్ఞత వారికి అందచేయండి. నేనిక సెలవు తీసుకుంటున్నా నని చెప్పండి. ఇదొక్కటే నేను కోరేది'—అని శాంతంగా జవాబిచ్చింది రెబెకా.

'అదేమిటి? అయితే, నీవు ఇంగ్లాండు విడిచి వెళ్ళిపోతున్నావా?'—అని అడిగింది రోవెనా, ఇంచుక ఆశ్చర్యంతో.

'అవును, రేపటి రోజున ఈ దేశంలో ఉండను. గ్రెనడాలో మా నాన్న గారి కొక సోదరుడున్నాడు. గ్రెనడా సుల్తానుకు ఆయనంటే చాలా ఇష్టం. అక్కడికి మేము వెళ్ళిపోతాం. ఆ సుల్తానుకు మేము కొంత నజరానా చెల్లిస్తూ ఉంటే, అతడు మాకు సర్వవిధాలా రక్షణ కల్పించగలడు'—అన్నది రెబెకా.

'ఆ రక్షణ నీకు ఈ ఇంగ్లాండులో మాత్రం ఎందుకుండదు? రాజుగారికి నా భర్తంటే ఎంతో అభిమానం. పైగా, ఆయనకూడా చాల ధర్మపరుడూ ఉదార హృదయుడూనూ'—అన్నది రోవెనా.

'నిజమే. కాని, యీ ఇంగ్లాండు ప్రజలు కడు భయంకర స్వభావులు. ఇరుగు పొరుగుతోనూ, లేనియెడల తమలో తామునూ, ఎప్పుడూ కలహిస్తూ, చీటికీ మాటికీ కత్తి దూస్తూ ఉంటారు. ఇలాంటివారి మధ్య మా జాతియు ఉండడం మంచిదికాదు'—అన్నది రెబెకా.

'నీ వలా భయపడవలసిన పని రవంతమాత్రమూ లేదు. ఐవాన్‌హోను ఆపదలో కాచి రక్షించిన యువతికి ఈ దేశంలో ఎలాంటి భయమూ ఉండదని నేను ఘంటాపథంగా చెపుతున్నాను. నిన్ను గౌరవించడానికి సాగ్జన్లూ, నార్మన్లూ—ఉభయులూ కూడ సమానంగా ఉత్కంఠత చూపగలరు,'— అన్నది రోవెనా, తాను కూర్చున్న గద్దెపైనుండి లేస్తూ.

'నా యెడల మీకు ఆప్యాయత అంతగా ఉన్నందుకు సంతోషం. కాని, నాకూ మీకూ మధ్య ఒక పెద్ద అఖాతమున్నది. మన పుట్టుక, మన పెంపకం, మన నమ్మకలూ మనలను ఈ అఖాతం దాటి దరి చేరనివ్వవు. సెలవు! కాని, వెళ్ళిపోయేముందు, నా కోర్కె ఒకటి ఉన్నది. అది తీర్చండి. ఈ మంజూ

మీది మేలిముసుగు పూర్తిగా తొలగించి, లోకంచేత యింతగానో మెచ్చు కోబడే మీ వదనసౌభాగ్యం ఒకసారి చూడనివ్వండి,'—అని అడిగింది రెబెకా.

'చూడదగిన విశేషం ఏమున్నది నా ముఖంలో? ఏమీ లేదని నీకే తెలుసు కోగలవు,'- అంటూ రొవీనా మేలిముసుగు పూర్తిగా తొలగించింది. తన సౌంద ర్యాతిశయమును గూర్చిన యెరుకచేతనైతేనేమి, లజ్జచేతనైతేనేమి, ఆ సమయ ములో ఆమె చెక్కిళ్లు, నుదురు, మెడ, వక్షోపరిభాగమూ—అంతా కెంపుతిరిగి ఆమె సౌందర్యానికి ఒక వింత శోభ తెచ్చినట్లయింది. ఆ క్షణంలో రెబెకా చెక్కిళ్లుకూడ కెంపుతిరిగాయి. కాని, ఆ కెంపుదనమూ బుగ్గలమీద విశేషకాలం నిలువలేదు. సాయంకాలపు తొగరుమబ్బు ప్రొద్దుగ్రుంకిన పిమ్మట రంగుమారి నట్లుగా, ఆ కెంపుదనం అచిరకాలంలోనే అంతర్ధానమయింది.

'నా హృదయ ఫలకంపై ఈ నీ వదనశోభ శాశ్వతంగా ముద్రితమై పోయినదమ్మా! సాధుత్వం, సౌశీల్యం నీ వదనశోభలో కాపుర మేర్పరచు కొన్నాయి. ఇంతటి అందమైన ముఖంలో ఇంచుక గర్వరేఖ తలకెత్తినా నిందించవలసిన పనిలేదు. నా స్మృతిపేటికలో చిరకాలం ఈ సౌందర్య ముద్రను భద్రపరచుకొంటాను. నా ప్రాణరక్షకునికి భార్యగా, ఇలాంటి అందాల......'

రెబెకా ఆపైన మాట్లాడలేకపోయింది. కనులు అశ్రుపూరితములు కాగా, వెంటనే తుడిచివేసుకొంది. 'ఏమిటి రెబెకా, అలా ఉన్నావు, ఏమైనా సుస్తీగా ఉందా?'—అని అడుగుతున్న రొవీనాకు సమాధానంగా,—'లేదమ్మా లేదు. కులాసాగానే ఉన్నాను. టార్క్విల్‌స్టన్, టెంపుల్‌స్టోవు ఉదంతాలను తలచుకొంటే నా హృదయం ఇప్పటికీ జలదరిస్తూ ఉంటుంది. ఇక సెలవు. మరొక చిన్న పని మిగిలిపోయింది. ఇదిగో, ఈ పేటికను నా కానుకగా దయ చేసి స్వీకరించండి' అంటూ రెబెకా, ఒక ఆభరణపేటికను ఆమెచేతి కందిం చింది. అది తెరచిచూడగా, అందులో ఒక రత్నాలహారం, రత్నాల కమ్మలు, మొదలైనవి కొన్ని ఉన్నాయి. అవి చాల విలువైనవని వాటి స్వరూ పమే చెపుతోంది.

'వద్దు! ఇంత విలువగల బహుమానం నేను పుచ్చుకోలేను,'—అంటూ రొవీనా ఆ పేటికను తిరిగి రెబెకాకు ఇచ్చివేయబోయింది.

'అలా కాదమ్మా, మీవద్దనే ఉంచండి. గొప్ప అధికారం, హోదా, పలుకుబడీ కలవాళ్ళు మీరు. మేమో, వట్టి ధనవంతులం మాత్రమే. ఇలాంటి ఆభరణాలు ఇంతకు వదిరెట్లు విలువగలవి అయినా మీవంటివారి ఒక్కమాట విలువ చెయ్యవు. కనుక, నేనిచ్చే ఈ కానుక మీ దృష్టిలో ఏమంత విలువ గలదికాదు. నాదృష్టిలోకూడా ఇది ఏమంత గొప్పది కాదు. మా జాతిని

నుంచీ పెరుగుతూ వచ్చిన అవ్యాజ్యానురాగం. యెదుర్కొన్న కష్టాలు ప్రధాన మొలిగి ఆ అనురాగాన్ని మరింత గాఢతరం చేశాయి. అయినా, సంగతి మాత్రం ఒప్పుకోని తీరవలసినదే కదా! రెబెకా సౌందర్యాన్ని ఆమె గుణాధిక్యతను గూర్చి ఆలోచనలు ఐవాన్ హో మనస్సులో గా ముసురుకుంటూ ఉండేవనుటకు సందేహము లేదు. అంత తరచుగా అలా ముసురుకోడం రొవేనాకు తెలిస్తే హర్షించి ఉండదు.

రిచర్డు రాజు సేవలో ఐవాన్ హో ఇంకా అనేక ఘనకార్యాలు చేసి స్థానంలో ఉన్నతోధికమైన సమ్మానా అందుతూ వచ్చాడు. ఆ కొద్ది కాలానికే రిచర్డు రాజు ఒకానొక యుద్ధంలో అకాలమరణం చెంద ని, లేనియెడల, ఐవాన్ హో ఇంకా గొప్పస్థితిలోకి వెళ్ళియుండేవాడే. గొప్ప ఉదారపురుషుడు. కాని, తొందరపాటుతనం కలిగిన సాహసి. అదే అకాలమరణానికి కారణమయింది. అతని అకాలమరణంతో, అతను కట్టు ఆశాసౌధాలన్నీ కూలిపోయాయి. వింతగా చెప్పుకొని, గుణపాఠం నేర్చు నికి వీలైనదిగా మాత్రమే నిలిచిపోయింది, చరిత్రలో అతని జీవిత గాథ.

